# అరుణాచలం

## సౌరిస్ జీవితము
### రెండవ భాగము



కావ్యభాసా భాస మాన
హార్ద సంతమ సావృతిమ్
అపాకరోతు సతతం
సౌరిశాంబా సరస్వతీ.

రచయిత:
ఆ. సూర్యనారాయణ
(స్వామీ రామానంద)

ముద్రణ : 30 డిశంబరు 1984

ప్రచురణ నెం. 2

మూల్యం :
నలభై రూపాయలు

ప్రచురణ :
సాగరసంగమ ప్రచురణలు
సాగరసంగమం
భీమునిపట్నం
విశాఖజిల్లా

ప్రతులకు :
అరుణా పబ్లిషింగ్ హౌస్
ఏలూరు రోడ్
విజయవాడ - 2

ముద్రణ :
శ్రీపతిప్రెస్
కాకినాడ.

# అంకితం

అరుణాచలేశ్వర మూర్తిమత్వంగా నిలిచి
నా గురుమూర్తి సౌరిస్ నించి
శ్రీ రమణస్థానాన్ని చేతనా చేతన
సృష్టి సమస్తాన్ని నడుపుతున్న
"వారి" కి ఈకృతి -
భక్తిపూర్వక నమస్కృతి.

ఉన్నావా? కరుణానిధీ! ఇచట
ఓహో సౌరిసేశ ప్రభో
కన్నీటం బడి దోగు ఈ జగతిలో
కల్పద్రుమం బీవె! శాం
త్యౌన్నత్యమ్ములు ఆశలున్ విరియగా
ఆనంద మందార సం
పన్నత్వంబులు నిల్పి నన్ పలుకరిం
పన్ శోణశైలంబునన్
వెలుగునీడ లాడు వింతనాటక మందు
నీవులేని నీవు నిలిచినావు
సాక్షి వగుచు శోణశైలంబు రీతిగా
ఎన్న తరమె నిన్ను కన్నతల్లి!



# ముందుమాట

ప్రతిరోజు ఎవరో ఒకరు షాకి రాస్తూ వుంటారు, "రెండవభాగం అచ్చయిందా?" అని.

"రెండభాగం పూర్తి అవడం ఎక్కడ? అచ్చు అవడంఎక్కడ" అని నవ్వుతాను నేను.

ఓ నెల రోజులు అయేప్పటికి ఈ రెండవభాగం నిజంగా వుందని, దీనికోరూపం ఏర్పడబోతోందని- తెలుస్తోంది.

పూర్తయిన ఆరెండోభాగం ప్రతిరోజు కొంత కొంత ప్రతివారు చదువుతున్నారు. రెండవభాగం పూర్తి అయేప్పటికి మొదటి భాగంలో చాలా యింటరెస్ట్ తీసుకుని పూర్తి చేసిన సూర్యనారాయణగారి యింటరెస్ట్ మాత్రం పూర్తి కాలేదు.

—చలం



# పరిచయం

అది దీపదీపాల వేళ. ఆవులమంద లిళ్ళకు మళ్లుతున్నాయి. కెంపురంగు సూర్యకాంతి ఆకాశంలో వింతసోయగాల్ని వెదజల్లు తోంది. అది జిల్లెళ్ళమూడి. అప్పటికి హైమాలయం ఇంకా పునాదుల్లో వుంది. అక్కడేవున్న చిన్నపెంకుటింట్లో ముందుగదిలో పట్టెమంచం మీద 'అమ్మ' కూచునివుంది, శ్రీనాథుడు రాసినట్లు— "వేదపురాణ శాస్త్ర పదవీనదవీయసియైన పెద్దముత్తైదువ" లాగ. ముక్కున బులాకీ. నుదుట రూపాయకాసంత బొట్టు, ఆమెవొంటి పసిమి వెలుగులో సువ ర్ణాలంకారాలు వెలవెలబోతున్నాయి, అమ్మచుట్టూరా ఎందరో కూచుని వున్నారు, సంధ్యారాగం అమ్మముందు వెలిగించిన కర్పూరహారతిలా వుంది. అమ్మ ప్రేమగా అందరివైపు చూస్తున్నారు. కొందరి ప్రశ్న లకు జవాబులు చెబుతున్నారు. అప్పటిదాకా నేను ఎన్నోసార్లు అమ్మ దగ్గరకి వొచ్చాను. ఎన్నిరోజులో ఆమె సన్నిధిలో గడిపాను. నా చిన్న తనంలో చాలా తీపిజ్ఞాపకాలకి జిల్లెళ్ళమూడి కేంద్ర మయ్యింది కూడాను. కానీ ఈమాటు అమ్మసన్నిధిని కూచున్నవేళ అకారణంగా దుఃఖం కట్టలుతెంచుకుని వొచ్చింది నాకు. డగ్గుత్తికపడ్డ గొంతుతో అడిగాను.

"అమ్మా నా కేమన్నా వుపదేశం ఇవ్వండమ్మా! నన్ను మీ సన్నిధినే నిలుపుకోండి. నాకీ జీవితమంటేనే రోత పుడుతోందమ్మా!" అన్నాను.

"ఈశ్వరవిశ్వాసంతో వుండు నాన్నా! గురువుని చేరుకునేదాకా నీకీ ఆరాటం తప్పదు. అంతదాకా వోపికపట్టమ్మా" అంటూ అమ్మ నావైపు విస్ఫారితనేత్రాలతో దయగా చూశారు. ఆ కన్నులలోని వెలుగు నా కీనాటికి మరపురానిది.

"అమ్మా, మీరే నా గురువమ్మా! నన్ను వొదిలిపెట్టకండి" అని అన్నాను ఏడుస్తూనే.

"చూడు నీ గురుమూర్తి నీ జీవితంలోకి వొస్తోందిరా, దిగులు పడకు నేను నీకమ్మని"— అంటూ ప్రేమమయి అమ్మ నాకు శాంతి నిచ్చేలా సమాధానం చెబుతూ నా తల నిమరడం ఇవాళ్టికీ నా కన్నులముందు కదలాడుతూనే వుంది. ప్రేమను చిందించే ఆ కంటి చూపూ, కాంతి వెల్లువలుగా వర్షించే ఆ దృష్టిప్రసారం, ఆ కారుణ్యపూర్ణవాక్పరిసారం— ఆత్మహత్యాప్రయత్నంలో వున్న నా దృష్టి భవిష్యత్తుమీదకి మళ్ళించాయి.

ఆ తరువాత ఏడేళ్ళ అష్టకష్టాలు పడ్డాను. జాతకరీత్యా ఏలినాటి శని వొచ్చింది. "నాకు విముక్తి లేదా? ఈ జీవిత తిమిరంనించి ఎలా బైటికి పోవాలి?" అని చలంగార్ని ఆశ్రయంకోరుతూ చాలాసార్లు ఆయనకి లేఖలు రాసాను. వారు "— తప్పకుండా వొచ్చెయ్యి. ముందుగా వొచ్చి నీకీ ఆశ్రమం సరిపడుతుందో లేదో చూసుకో" అని రాసారు. కానీ పులినోటబడ్డ మేకయినా తప్పించుకోవచ్చునేమో గానీ జీవితపు అక్టోపస్ గ్రిప్‌నించి ఎవరూ తప్పించుకోలేరు. అక్కడకీ చలంగారు నాకు ధైర్యాన్నిస్తూ రాసినలేఖలు అనేకం. "ఏదో కావాలని ఆరాటపడతావు బాబూ! నీవాళ్ళనా ఎదిరించలేవు. నీకు రెక్కలా రావు. ఇది కఠోరమైన సాధన. నువ్వు ఏమీతెలీక వుబలాట పడుతున్నావు. నీ రెక్కలకి కొంచం బలం రానీ మరి. ఒక శలవలకి ఇక్కడికిరా. రాలేనివాడివి నువ్వేం తెలుసుకుంటావు? ఎన్నిసార్లు నేను రమణ మహర్షి దగ్గరికి వొచ్చాను. ఎన్నేళ్ళకి నాకో తోవ కనపడ్డది?" అని ఒక్కసారి రాసారు. ఇంకోసారి "సూర్యనారాయణా, అవును గురువు అవసరం. 'మిమ్మల్ని గురువుగా భావిస్తే' అని కాదు, భావిం

చాలి. గురువుఆజ్ఞల్ని శిరసావహించి ఎంతకష్టమైనా చేతకాదనకుండా చెయ్యాలి. అంతా ఆయనకి సమర్పించుకోవాలి. సరేనా? "సమయ మొచ్చేటప్పటికి చలం లేకపోతేనేం నీకు గురువు దొరకక మానడు. దిగులు పడకు" అని రాశారు.

బాగా దుఃఖంలో వొళ్ళు తెలియకుండా రాసిన ఒక వుత్తరానికి ఆయన "బాబూ సూర్యనారాయణా ఇంతగా మార్గంకోసం వెతికే నిన్ను ఈశ్వరుడు మరువరు. సమయ మొచ్చాక నీ చెయ్యి గట్టిగా పట్టుకుంటారు. వూపిరాడక నువ్వు కొట్టుకున్నా విడిచిపెట్టరు. నేనేదో నీకు చెప్పకండా దాచుకుంటున్నా ననుకోకు. నీకు వుపయోగిస్తుందను కుంటే ఏమైనా చెప్తానమ్మా. మాటలవల్ల, రాతలవల్ల ప్రయోజన మేమిటి?" అని రాశారు. ఆ తరువాత వారికి ఎన్నో వుత్తరాలు రాశాను. వారి నించి జవాబులు వొచ్చాయి, ఏ వుత్తరంలోనైనా ఈశ్వరుడు నిన్ను వొదిలిపెట్టరు అని అభయం ఇచ్చే వారాయన. ఇంతకీ ఆ ఈశ్వరుడు నా జీవితంలోకి వొస్తారో రారో తెలియని, ఊహించుకోలేని నేను జీవనసంఘర్షణలో మునిగిపోయాను.

కాలేజీ లేజీ జీవితం నించి వుద్యోగపు బిజీ జీవితంలో అడుగు పెట్టేముందు ఒకటి రెండు సంవత్సరాల కాలం ప్రవాస జీవితంలో సిద్ధమూర్తులైన అనేకమంది మహాత్ములని సంసేవించుకునే భాగ్యం కలిగింది. కానీ నన్నుద్ధరించే గురువుమాత్రం నాకు దొరకలేదు. నాలో చిచ్చు నానాటికీ పెరగసాగింది. కారణం లేకండా దిగుళ్లూ, గుబుళ్లూ పుట్టుకొచ్చేసేవి. బావురుమని ఏడ్చేసేవాడిని. పుటకతో వున్న తలనెప్పుల పీడ మరింత తీవ్ర మయింది. రోజూ తీవ్రంగా గుండెల్లో పోటు వొచ్చేది. ఏం జరుగుతుందో నన్న భయంతో గుండెని పట్టుకునే నడిచేవాడిని. అంత భయంగా వుండేది. రమణస్థాన్‌కి వొచ్చాక

కూడా కొన్నాళ్ళు అలాగే నడిచేవాడిని. ఎక్కడా శాంతి దొరికేది కాదు. చలంగారు **suggest** చేసినట్లుగా భగవాన్ ఫోటోని చూస్తూ వుంటే కొంత శాంతి అనిపించేది. కాని అంతట్లోకే చిచ్చు.

చివరకి వుద్యోగంలో చేరి జీవితాంధకారం నన్ను దిక్కు తోచకుండా చేసి తరిమికొట్టిన రోజుల్లో గోదావరి ఒడ్డున పాపికొండల్లో పాదయాత్ర చేశాను. వెళ్ళి పేరంటంపల్లి స్వాములవారి దగ్గర వుండి పోదామని ప్రయత్నం చేశాను. ఆయన నన్ను చూడగానే "తొందరగా వెళ్ళిపొండి" అంటూ మండిపడ్డారు.

కట్టు బట్టల్తో నిరాధారంగా గంపెడాశతో వొచ్చిన నేను నిరాశతో గోదావట్లోకి దూకి చచ్చిపోయేందుకు ప్రయత్నం చేశాను. మూడు మునకలు వేసేసరికి — "చావడంతో బాధ తీరిపోతుందా? బాధలు బాధించని స్థితిని చేర్చే గురువును చేరి సాధన చేసుకో" అని ఎవరో బిగ్గరగా చెప్పినట్లయింది. ప్రయత్నం మీద ఒడ్డున పడి నెమ్మదిగా టిక్కెట్టుకొనకండా రైలెక్కి మధుర చేరుకున్నాను. అక్కడి నించి దక్షిణాదిన వున్న పుణ్యక్షేత్రా లన్నీ కాలినడకన, బిచ్చం ఎత్తుకుని కడుపు నింపుకుంటూ తిరిగాను. తిరిగిన చోట తిరక్కుండా తిరిగాను. చివరికి మద్రాసు వొచ్చాను. అప్పటిదాకా చలంగారి దగ్గరికి వెడదామన్న యోచనే రాలేదు.

మద్రాసు మహానగరంలో ఒకరి దగ్గర **Script assistant** గా కొన్ని రోజులు నవుకరి వుద్ధరించాను. విస్కీ సీసాలు జీవితంలో అశాంతికి వుపశమనాలుగా విహరించాయి. జీవితం చేదుని దిగమింగ లేని నేను మాదకద్రవ్యాల మత్తులో బాధని మర్చిపోవడానికి ప్రయత్నించాను. అది సముద్రం నీళ్ళని ఎండించడంవంటి వృథా పరిశ్రమే అయింది. విసుగెత్తి చివరికి ఒక రాత్రి విపరీతంగా స్మృతి తప్పి

పోయేలా తాగాను. ఆ రోజు మెలకువో కలోగాని నా కళ్ళ ముందొక దృశ్యం కనిపించింది.

ఏవో ఘంటారావాలు .... .... నా చెవుల్లో మార్మోగిపోతున్నాయి. నా ముందు వువ్వెత్తున గంతులు వేస్తున్న పంచతరణీ ప్రవాహం. దూరంగా అమర్‌నాథ్ గుహ. ఎవరో ఎవరో నావైపు తదేకంగా చూస్తున్నారు. ఎవరో ఆ దయామయి. "అగ్నిహోత్రం సిద్ధంచెయ్యి నాయనా" అంటున్నారు. పంచ తరణి ఒడ్డునే చితుకులు ఏరుతున్న నేను ఆలోచనలో పడ్డాను. ఇవాళనే దీక్ష నిస్తానన్నారు గురుమూర్తి. ఈ కల్మషభూయిష్టమైన శరీరంతో నేను నా గురువుని చేరుకోలేను. దీక్షాపరంగా వొచ్చే వాక్ శరీరంతో గురుదేవుని చేరుకుంటాను, గురుచరిత్రాన్ని అక్షరజగత్తులో నిలుపుకుంటాను, ఇత్యాదిగా ఏవో ఆలోచనలు. వున్నట్లుండి కాళ్ళుజారి పట్టు తప్పి ప్రవాహంలో పడిపోయాను, మునకలు వేస్తున్నాను — ఇంతట్లో స్మృతి దూరమైపోతోంది. నా వొళ్ళు నాకు తెలియకండా అయిపోతోంది. ఇంక ఈ జీవిత మింతే .... అమ్మా, అమ్మా, అమ్మా అని ముమ్మార్లు పిలిచాను. నా గురుమూర్తి నా దైవం కన్నీళ్ళతో నన్ను కావిలించుకుంది. "చూడు నాయనా! కర్మ ప్రవాహంలో పడిపోయావు. కానీ నిన్ను నేను వొదిలిపెట్టను. మళ్ళీ మనం కలుసుకుంటామమ్మా దిగులు పడకు" అంటూ నా తల నిమిరింది. నా ప్రాణ చైతన్యం దూరమై పోయింది. ఎక్కడ పుట్టానో, ఎక్కడ పెరిగానో ఎంతకాలం జరిగిందో .... ఏవో స్మృతుల సుడిగుండాలు కదిలాయి. మెలకువ తెలిసేసరికి గడియారం మధ్యాహ్నం రెండు గంటలు చూపిస్తోంది. చుట్టూరా కాళీచేసిన సీసాల మధ్య ఒళ్ళు తెలియని స్థితిలో రాత్రి డోకిన డోకుల్లో పొరలాడుతూ వున్న నన్ను చూసి, నేనే విస్తుపోయాను. లేచి

వెళ్ళి తలారా స్నానం చేశాను. అయినా తల దిమ్ము వొదల లేదు. తిరుపతి వెళ్ళా లనిపించింది. మరుసటిరోజు తిరుపతి చేరాను. ఆరాత్రి కలలో నాకు భగవాన్ కనిపించి—"వెళ్లు చలంగారి దర్శనం చేసుకో" అని చెప్పారు,

ఆ తెల్లవారుజామునే వెంకటరమణమూర్తి దర్శనం చేసుకో కండానే ప్రసాదం కొనుక్కొని అరుణాచలం వొచ్చేశాను. ఏ శ్రమా లేకండా పుదయం పది గంటల వేళకి రమణస్థాన్ చేరుకున్నాను. నేను వొచ్చేసరికి ఒకామె వాకిట్లో కూచుని వున్నారు. ఆమె నన్నెంతో దయగా చూస్తూ "చలంగారు భోజనం చేస్తున్నారు. మీరూ భోజనానికి లేవండి" అన్నారు. బహుశా ఆమే నర్తకి ఏమోనని — "మీరేనా నర్తకి?" అని అడిగాను. "కాదు. చిత్రని నేను" అన్నా రామె. నర్తకి గురించీ నర్తకి సేవాపరాయణత్వం గురించి అప్పటికే ఎంతో విని వున్నాను గనుక ఆ ప్రశ్న నేను అడగాలని అనుకోకండా అడిగే శాను. చిత్ర నే నెవరో, ఏ వూరో అడగకండానే సాదరంగా లోపలికి దోవ చూపించారు. నాకు భలే ఆకలిగా వుంది. జంకుతూ జంకుతూ భోజనాల సావిట్లోకి నడిచాను. ఒక తల్లి వెలిగిపోయే కళ్ళతో నా వైపు విస్ఫారితంగా చూశారు. ఆమె నుదుట కుంకుమ రేఖ ప్రచండాదిత్య విలాసాన్ని సంతరించుకున్నది. శంపాలతకి రూపం వొచ్చినట్లుగ సాక్షాత్తూ ఆది మాతృమూర్తియైన పరాశక్తిలా వున్నా రామె. ఆమె తేజోప్రసారం ముందు ఆమె ధరించిన తెలివలిపాలు వెలవెల బోతున్నాయి. నిరలంకృతంగా వున్న ఆమె మహనీయ తేజోవిభూషి తగా, విభూతి కుంకుమాలంకృతగా కనిపించారు. అతఃపూర్వం నా కలల్లో, మెలకువలో అనేకమార్లు దర్శన మిచ్చిన అమరనాథ శివలింగం నా కళ్ళముందు మెదిలింది. అది హిమలింగం. ఆ లింగో

పరి భాగం ఈమె ఫాలభాగం అచ్చూ మచ్చూ ఒకలాగే వున్నాయి. అది ఆనాడు నాకు తోచడమే కాదు. తరువాత నేను నా యాత్రలో అమరనాథగుహలో శివలింగాన్ని చూసినప్పుడు అది నా భ్రమ కాదనీ వాస్తవమనీ తెలిసింది.

హఠాత్తుగా కళ్ళ ముందునించి ఏదో ఆచ్ఛాదన తీసేసినట్టూ, ప్రపంచమంతా నా లోపలినించి వుబికి వొస్తున్న మహదానందంతో జ్వలిస్తున్నట్టు కనిపించింది. ఇన్నాళ్ళకి ప్రపంచాన్ని వున్న దున్నట్లు చూస్తున్నా ననిపించింది. ప్రతి జీవినించి ప్రతి వొస్తువునించి అనంత మైన జీవమూ, ఆనందమూ తొంగి చూస్తున్నా యనిపించింది. ఏదో అనంతమైన మాధుర్య పారవశ్యం నన్ను ఆవరించింది. ఆ క్షణం ఆమెని చూస్తోంటే.

నతముఖుడినై నిలిచిన నన్ను నవ్వుముఖంతో చూశా రామె, ఆ నవ్వులో ఎంత దాక్షిణ్యమో, ఆ చూపులో ఎంత కారుణ్యమో! "కూచుని భోజనం చెయ్యండి. తరువాత మాట్లాడవొచ్చు" అని చెప్పా రామె. ఆమె పలుకులలో సప్తస్వరాలు నర్తించే నాద మధురిమ నన్ను కట్టుకొని ఏ లోకాలలోకో తీసుకు వెళ్ళింది. సరిగ్గా మూడు రోజుల నాడు కల మెలకువకాని స్థితిలో— గురుమూర్తిగా మాట్లాడిన వా రీమే నని నాకు నా లోపల్లోపలనించి ఎరుకకి వొచ్చింది. ఆమె మాట విన గానే ఆకలి, నాలో ఆవేదన చల్లారిపోయాయి. చలంగారికి నమస్క రించి రెప్ప లార్పకండా ఆమెని చూస్తూనే భోజనం ముగించాను. ఇంతట్లో నర్తకి నెయ్యివేస్తూ నా చూపు నిలిచిన దిశ గమనించి— "ఆమె సౌరిస్" అని చెప్పారు, భోజనం నాకు అమృతంలా తోచింది. యుగాల నా ఆకలిని ఆ వొక్కపూట భోజనము తీర్చేసింది. అది అన్నమో, సౌరిస్ అనుగ్రహామృతమో నా కీనాటికి తెలియదు.

"ప్రథమ సందర్శనంలో గురువు కారుణ్యం
జన్మ జన్మల నిరీక్షణా మధుర ఫలం
అది హృదయాన్ని కడుపుని ఒక్కసారిగా నించి
దివ్య ప్రేమలో జీవితాన్ని వెలిగించే దీక్షా ప్రదానం"
అంటుంది నర్తకి.

భోజనం ముగించి ముందు వాకిట్లోకి వొచ్చి దర్జాగా అక్కడే వున్న పడక కుర్చీలో కూచున్నాను. చలంగారు భోజనం ముగించి అక్కడికి వొచ్చారు. నేను పడక కుర్చీలోంచి లేవబోతుంటే నివారించి, ఆయన అక్కడే వున్న వేరొక కుర్చీలో కూచున్నారు. ఆయన అరమోడ్పు కన్నులలోంచి అపార కృపా, తాను ఏమీ కాకండా 'నాది' అనేది లేకండా సర్వాన్ని దీనులకి, దుఃఖితులకి, బాధితులకి అర్పించుకుని, సాధించుకున్న నిర్మలత్వం, నిరామయత్వం ఆయన ముఖాన్ని వెలిగిస్తోంది. నమ్రత, దైవత్వం ఆయనలో నర్తిస్తున్నట్లుగా తోచింది. ఆయన బంధుత్వం మలినమైన మానవ ప్రపంచంతో కాదనీ— అరుణాచలంతో, ఆకాశంతో, మలయ పవనంతో, పుణ్యధాత్రితోనూ అయి వుంటుందని తోచింది. ఆకాశంనించి ఓ నక్షత్రం జారిపడి సూర్యకాంతిలో కరిగి ఆయన రూప మెత్తింది గాబోలు. అట్లా వారిని చూస్తూ వుంటే నాకు అంతరాంతరాల్లోంచి దుఃఖం పొంగుకుని వొచ్చింది. ఆయన ఎంతో దయగా "లోకం నిన్నంతగా బాధ పెట్టిం దన్నమాట" అని ఓదారుస్తున్నారు. నేను చిన్నతనంనించి వారికి వుత్తరాలు రాసేవాడినని చెప్పినా వారికి జ్ఞాపకం రాలేదు.

ఇంతట్లో సౌరిస్ లోపలినించి ఒక కాంతిరేఖ లాగ కదిలి వొచ్చారు. ఆ కళ్లు సూటిగా నా ఆంతర్యంలోకి చూస్తున్నట్లనిపించింది. ఆమె కిందనున్న ఎండలోకి నడిచి అభ్యంగనం చేసిన కేశ

పాశాల్ని ఆరబెట్టుకుంటూ నాతో మాట్లాడడం ఆరంభించారు. నేను నా దుఃఖాన్నీ, అక్కడే కూర్చుని వున్న చలంగారినీ మర్చిపోయాను.

"మీ పేరు సూర్యనారాయణ కదూ! మీరు చిన్న పిల్లవాడిగా వున్నప్పటినించి వుత్తరాలు రాయడం నాకు తెలుసు" అన్నారు సౌరిస్. అప్పటిదాకా నా పేరు నేను ఎవరికీ చెప్పనేలేదు. ఆమెకి ఎలా తెలిసిందా? అని ఆశ్చర్యం. ఆమె ప్రేమతో, దయతో మాట్లాడుతున్నారు. ఎంత హాయిగా, ఆనందంగా అనిపించిందో!

"నా పేరు చెప్పకండా పేరుపెట్టి ఎలా పిలిచారు- మీరు. నేను మీకు గుర్తా?" అన్నాను.

"నేను మిమ్మల్ని ఎప్పుడన్నా మర్చిపోతేకదా? గుర్తున్నానా? అని అడగడానికి" అన్నారు— సూటిగా నా కళ్ళల్లోకి చూస్తూ. ఆ చూపులో తీక్ష్ణతకి తట్టుకోలేకపోయాను. అప్రయత్నంగా కళ్ళు మూతలు పడ్డాయి. సూర్యుడివైపు కొన్ని సెకనులు రెప్ప లార్పకండా చూడగలిగే నేను ఆమె కళ్ళల్లోకి ఒక్క సెకను కూడా చూడలేకపోయాను. ఆ చూపులో కాంతి మెరుపు మెరిసినట్లనిపించింది. నిజమే ఆమె నన్నెందుకు మర్చిపోతారు. యుగయుగాలుగా ఈ కిలం పట్టిన గిన్నెని ఆమె తోముతున్నారు. ఎందుకంటే ఇంత కిలం పట్టిన గిన్నెని ఆమె తప్ప ఇంకెవరూ తోమలేరు. తోమి తోమి పుళ్ళు పడ్డ చేతుల నించి నెత్తురు వరద లయినా తోముతూనే వున్నారు కాబోలు. అంచాతనే" మిమ్మల్ని నే నెప్పుడన్నా మర్చిపోతేకదా" అన్నా రనిపించింది.

నా మీద అంత ప్రేమామృతం వర్షిస్తూ వున్న ఆమె ఎవరన్న ప్రశ్న రాలేదు నాకు. ఆమెతో ఎన్నో విషయాలు మాట్లాడాను. ఎంతో వోపికగా జవాబులు చెప్పా రామె. మీకు జ్ఞాపకం వుందా నర్తకీ? ఆమెని నే నడిగిన మొదటి ప్రశ్న. మీరు చలంగారి పక్కనే కూచుని

అత్యంతాసక్తితో వింటున్నారు. "జ్ఞానం పొందడం అంటే ఏమిటమ్మా?" అని అడిగాను.

ఆ ప్రశ్నకి బదులుగా ఆమె నా కళ్ళలోకి చూసిన చూపులో మహత్తర కాంతి ఇంకా నా కళ్ళ ముందు వెలుగుతోంది. ఆ చూపుకి నేను ఏమయి పోయానో? ఎక్కడో దేవలోకం నించి ప్రవహించే గంగా తరంగ శీకరాల వంటి ఆమె పలుకులు నా చెవిలో పడ్డాయి— "జ్ఞానం పొందడం అంటే ఈ పరిమిత వ్యక్తిత్వం నించి ఆనందం లోకి ఎదగడం. **Little self magnified by breaking all physical limitations."** అప్రయత్నంగా నోట్ బుక్ తీసుకుని ఆమె మాటల్ని రాసుకోవడం మొదలుపెట్టాను. ఆ రోజంతా ఆమె విశ్రాంతి సమయాన్ని మినహాయించి ఆమెతో మాట్లాడుతూ కూచున్నాను. ఆమె పాట విన్నాను. ఏవో స్మృతి లోకాలకి తీసుకునిపోయిం దామె పాట.

రాత్రి **guest house**కి వొచ్చి పడుకున్నాను. ఎప్పుడు తెల్లవారుతుందా, మళ్ళీ ఆమెని ఎప్పుడు చూస్తానా? అన్న బెంగతో ఆ రాత్రి గడిపాను. రమారమి బహుశా మూడు గంటల ప్రాంతంలో స్నానం చేసి రమణస్థాన్ ఎదురుగుండా వున్న రాతిబండ మీద నడుం వాల్చి సూర్యోదయంకోసం ఎదురు చూస్తూ గడిపాను. తెల్లవారినాక ఆమెని చూశాను. ఇంకా చాలా విషయాలను అడిగి తెలుసుకున్నాను. అన్నిటికన్నా ముఖ్యం అరుణాచలం వొచ్చాక నిత్యమూ నన్ను బాధించే తల నెప్పి, గుండెపోటు రాలేదు. చివరికి మళ్ళీ మద్రాసు వెళ్ళి తాగుడు మానేసి ఆమె దగ్గరకి అడపా తడపా వొస్తూ పోతూ శాంతివి పొందవచ్చునని తోచింది. భోజనంచేసి ప్రయాణ మయ్యాను. వర్తకి గేటుదాకా వొచ్చింది. నాకు కలిగిన అనుభవాన్ని ఆమెకి చెప్పాను. "ధైర్యంగా వుండండి. కిలం పట్టిన గిన్నెల్ని ఆమె

వొదలరు. అసలు కిలం పట్టిన గిన్నెలనే ఆమె తీసుకుంటారు. కిలం వొదలగొట్టి కరిగించి మళ్ళీ పోత పోస్తారు. గొడవ పడకండి. అదంతా జరిగేదాకా మీలో చిచ్చు తప్పదు" అని చెప్పారు నర్తకి. విచిత్రంగా బస్సులో వెడుతున్నా సౌరిస్ నాతో నా వెంటనే వొస్తున్నట్లనిపించింది.

ఏప్రిల్ ఎనిమిదవ తేదీ సాయంత్రం అరుణాచలం రెండవ పర్యాయం చేరుకున్నాను. ఈమారు నేను వొచ్చేసరికి భోజనం చేసి భజనకి వొచ్చి కూచున్నారు సౌరిస్. తంబురా శ్రుతి పెట్టుకుంటు న్నారు. నేను వెళ్ళి నమస్కరించాను. తలెత్తి నావైపు తదేక దృష్టితో చూశా రామె. ఆ చూపుతో నాలో ఏదో అనిర్వాచ్యమైన ఆనందం పొంగు కొచ్చింది. "ముందు వెళ్ళి భోజనం చేసి రండి" అని చెప్పి నర్తకిని పిలిచి నాకు భోజనం పెట్టమన్నారు. నాకు భలే ఆకలిగా వుంది. నర్తకి ఎంతో దయగా భోజనం పెట్టడమేకాక చివాట్లుకూడా పెట్టింది. "నిన్న వెళ్ళి ఇవాళ రావడ మేమిటి? వుండా లనిపించిన వాళ్ళు నాలుగు రోజు లుండి వెళ్ళక పోయారా? మనసులో మాట చెప్పడానికి ఎందుకు సంశయ పడ్డారు?" అని. భోజనం ముగించి వొచ్చి భజనలో కూచున్నాను. సౌరిస్ దర్బారీకానడలో 'రస గగన గుఫామే' అన్న కబీర్ పాట పాడారు. ఆ పాట నాలో ఏవో బరువైన స్మృతుల్ని రేపి కన్నీళ్ళు తెప్పించింది. ఏదో అవ్యక్త మాధుర్యం నా శుష్క జీవన స్రవంతిలో వురకలు వెయ్యబోతున్నట్లుగా తోచింది. ఆమె దయ గల చల్లని చూపు నా జన్మ దారిద్ర్యాన్ని దూరం చేసింది. యుగ యుగాలుగా, ఆకలితో అలమటించిన నా ఆత్మకి శాంతి దొరుకుతుం దనిపించింది. ఆమె పలుకులో, పాటలో నా కెంతో ఓదార్పు దొరికింది.

ఒక పది రోజులు ఆమెను ఎన్నో ప్రశ్న లడిగి తెలియని సంగతు లెన్నింటినో తెలుసుకుని రాసుకుంటూ గడిపాను. ఎలాగో

ఒకలాగ తిరువన్నామలైలో నిలిచిపోయి ఆమె సాన్నిధ్యంలో నిత్యమూ కొంత కాలం గడపాలనే కోరిక గుండెల్లో దృఢంగా కలిగింది. ఏ కాఫీహోటల్లో సర్వర్‌గానో, క్లీనర్‌గానో పని చేసో ఐస్ ఫ్రూట్స్ అమ్ముకునో నా ఖర్చుకి నేను డబ్బు సంపాదించుకుంటే రమణస్థాన్‌కి భారం కాకండా వుండొచ్చని నాకు తోచింది. అందు నిమిత్తంగా తీవ్రంగా కృషి చేశాను. కానీ ఏ ప్రయత్నమూ ఫలించ లేదు.

ఏ లక్ష్యమూ లేని నా జీవితంలో రమణస్థాన్‌కి వొచ్చాక చలం గారికి సేవ చేయాలనీ, వారి ద్వారా అనేక అమూల్యాంశాల్ని వినాలనీ ఆశ్రమ పదంలో చలం అన్న పేరిట వారి జీవితాన్ని అమూల్య సందేశాల్ని రికార్డు చేయాలనీ ఆకాంక్ష కలిగింది. కాని నా బ్రతుకులో తీరకుండా నా గుండెల్ని కోత పెడుతూ నిలిచిపోయిన తీయని కోరికల్లో అదీ ఒకటి అయిపోయింది.

నాకు భగవాన్, ఈశ్వరుడూ ఎవరూ తెలియరు. తెలిసిందల్లా అక్షర మూర్తి చలం. వారి జీవితంలో నేనూ సమీపవర్తిగా నిలవాలనీ ఆశపడ్డాను. కానీ విధి వేరుగా తలిచింది. చలంగారు నా ప్రెజన్స్‌నే భరించ లేకపోయేవారు. ఈనా డనిపిస్తుంది నాలో భరించలేనంతటి కల్మషం, పాపం వున్నాయి గనకే నన్ను భరించలేకపోయే వారని. వారు నా యడల విముఖులు గావడం నా కెంతో దుఃఖాన్ని కలిగించింది. వారికి అసౌకర్యాన్ని, బాధని కలిగించడం నా కిష్టము లేదు. వాస్తవానికి నేను వెళ్ళిపోవాల్సిందే కానీ సౌరిస్‌గారి మాట, పాట, ప్రేమ, దయ నన్ను నిలబెట్టాయి. నర్తకిమాత్రం అప్పటినించి ఈ నిమిషందాకా నా జీవితంలో ప్రతీ క్షణం నేను చేసిన తప్పుల్ని వివరిస్తూ నేను నిలబడేందుకు, గురు కటాక్షానికి పాత్రుడ నయ్యేందుకు కారణ మైంది.

కానీ చలంగారికి నా మీద నిజంగా ద్వేషమే, అసహ్యమే వుండి వుంటే ఈ మారు నన్నెందుకు భరించగలుగుతున్నారు? ఎందుకు నా మీద ప్రేమగా వుంటూ, సౌరిస్ జీవితం రెండవభాగంలో తాము శ్రద్ధ తీసుకుని ఎందుకు వివరాలు చెబుతారు? ఇట్లాంటి యోచన రాగానే చలంగారికి నాపట్ల ద్వేషం వుందనుకోవడం నా భ్రమే నని తెలుస్తోంది. ఈమారు ప్రయాణానికి **date fix** చేసుకుని — ఈశ్వరుడికి చెప్పి చలంగారి చెవిని వెయ్యడానికి వెళ్ళాను. అప్పుడు వారు "నాకు తారీకు లెందుకు చెబుతారు. మీరు ఇక్కడే వుండా లను కున్నా నాకు సంతోషమే. మీ వల్ల నాకు ఏ ఇబ్బందీ లేదు. కాదు అక్కడ మిమ్మల్ని ప్రేమించే వా ళ్లున్నారు గనక వెడతామంటే నా అభ్యంతరం లేదు. ఇక్కడే వుండదల్చుకుంటే వుండండి" అని చెప్పారు. అక్కడితో నా మనస్సులో ఆనాటి సంశయం మంచులా కరిగిపోయింది. కానీ

"ఇక్కడ వుండి ప్రపంచాన్ని తలుచుకోవడం ఘోరాతి ఘోరం. ప్రపంచంలో వుండి ఈశ్వరుణ్ని తలుచుకోవడం శ్రేయ స్కరం. చెరువులో కమలం చుట్టూ చేపలూ కప్పలూగా నిలిచే కన్నా దూరంగా వున్న భ్రమరంగా నిలవడం ఎంతో మిన్న" అంటుంది నర్తకి.

అసలుకి వద్దాం.

చివరికి సౌరిస్‌గారినే చలంగారి గురించి అడిగి ఏదన్నా మంచి పుస్తకం రాయాలని అనుకున్నాను. అది సాహస కార్యమే కానీ ఆ ఆశ నన్ను వొదల లేదు. సౌరిస్‌గార్ని చాలా ప్రశ్నలు అడిగి వాటన్ని టికీ సమాధానాలు రాసుకోవడం మొదలుపెట్టాను. ఆవిడ నా యందు ప్రత్యేక దయతో నేను అడిగిన వాటికి సమాధానాలు ఇచ్చారు. అవన్నీ

ఒక క్రమంలో ఏర్పరిచాను, వాటిల్లో సౌరిస్ జీవితానికి చెందిన సమాచారం కూడా చాలా వుంది. ఒక సాయంత్రం అవన్నీ చదివి సౌరిస్ గారికి వినిపిస్తూ వుంటే వింటున్న నర్తకి అంది — 'ఇది సౌరిస్ జీవితం లాగుంది? ఇవన్నీ రాసి ఏం చేస్తారు? అని ప్రశ్నించింది. ఏదో పుస్తకంగా చేస్తానని కొన్ని అబద్ధాలు మేళవించి చెప్పాను. ఆనాటికి నాలో హిపోక్రసీ, ఫాల్స్‌ప్రిస్టేజీ, దొంగ విలువలూ, మర్యాదలూ వుండేవి. ఈనాడు లేవని చెప్పలేను గాని అంత భయంకరంగా మాత్రం లేవు. ఈ పరిణామం సౌరిస్‌గారి దయవల్లనే జరిగింది.

చలంగారు నా ప్రయత్నాన్ని చూసి "ఒకాయన ఇక్కడే కూచుని సౌరిస్ జీవిత విశేషాల్ని సేకరిస్తున్నాడు. అయితే అవన్నీ ఇదివరకు పుస్తకాలలో అచ్చయినవే చాలా వరకు" అని నాగేశ్వరరావ్‌గారికి 2-5-74వ తేదీన రాసిన ఒక లేఖలో రాశారు.

నర్తకి మాటలతో చలం జీవిత రచనకి విఫల యత్నాలు చేస్తూ వున్న నేను నా దృష్టిని పూర్తిగా సౌరిస్ వైపుకి మళ్ళించుకున్నాను. అది బలవంతాన చేసిన పని కాదు. అప్పటికే నా లోలోపల నా అంతరాంతరాల్లో సౌరిస్‌గారి ప్రభావం తీవ్రంగా పని చేస్తోంది. ఏమి చేసి ఈమె నన్నిలా చేశా రనుకుంటే ఏమీ చెయ్యలేదు. మరి ఆమె సమక్షంలో పని చేస్తున్నది ఎవరు? అనుకుంటే నా బుద్ధికి అంతు చిక్కలేదు. ఎందరో రోజూ రమణస్థాన్‌కి రావడం చూస్తున్నాను. కొందరు ఆమెదాకా రారు. కొందరు భక్తితో వుంటారు. కొందరు విభూతి వేయించుకోవడానికి సంశయించి ముందుకు రారు. నాకు మాత్రం ఆమె యడల ఏ సందేహం లేదు. ఆమెతో మాట్లాడితే చాలు నా వొళ్ళు మరిచిపోయి ఏదో తెలియని పారవశ్యంలో కొట్టుకు పోయేవాడిని ఆమె సన్నిధిలో. అలాంటి ఆనందం, ప్రేమ నా బతుకులో ఎన్నడూ

చవిచూసి నట్టివి గావు. ఆ ప్రేమ నిర్వచించడానికి అలవికాని ప్రేమ, వూహాతీతమైన ప్రేమ, అది ఆమెనించే పొంద గలిగాను.

నాకు బాగా తెలిసేది అప్పట్లో. ఆమె వొస్తున్నారు నా లోపలికి ప్రతి నిమిషం నా కేసి నడిచి వొస్తున్నారు— యుగాలుగా బూజు పట్టిన ఇంట్లోకి- నా హృదయంలోకి. ప్రతి గాలి వూపుతో, ప్రతి నీడ కదలికతో— ప్రతి వుదయం, సాయంత్రం, రాత్రి నా కింకా చేరు వవుతున్నారు. ఒక్కొక్కసారి రాత్రిళ్ళు నిద్ర పట్టేది కాదు. లోప ల్నించి చిచ్చు పెడుతున్నట్లుగా అనిపించేది. ఒక రోజు బద్ధకంగా పక్కమీద నిద్ర పట్టక కళ్ళు విప్పానో లేదో "సూర్యనారాయణ"అని కాదు "చూడు నాయనా" అని పిలిచి నట్లయ్యింది, నా హృదయ నాళాల్ని కంపింపజేసే కంఠం. ఆ తరువాత నిద్ర పట్టింది. నిద్దట్లో ఎంత ఆనందంతో వూగానో. ఎంత సేపటికీ నా లోపల ఆ పిలుపు. తలుపు తియ్యమన్నట్లుగా తియ్యని పిలుపు. ఆ లోకాల దేవతా గానం విన్నట్లు అనుభవం. లేవబుద్ధి కాలేదు. అట్లా ఆ పిలుపుని వింటూ ఇంక ఎన్నడూ ఈ లోకాన్ని చూడకండా శాశ్వత సుషుప్తిలో నిలిచి పోతే బావుండు ననుకున్నాను.

ఆ వేళనే చొరవ చేసుకుని "మీ జీవితచరిత్రని ఒక క్రమంలో చెప్పండి" అని భయం భయంగా సౌరిస్‌ని అడిగాను. నా అనుభవాలు అక్షరాల్లోకి రావడం కష్టం, అయినా చూద్దాం" అంటూ చెప్పడం మొదలు పెట్టారు. నాకు చాత నయినట్లుగా నేను రాసుకోవడం, తిరగ రాత రాసి సౌరిస్‌గారి సవరణలకి పెట్టడం ఆరంభించాను. తాము చెప్పినది కొంతవరకూ అక్షరాల్లోకి తేగలిగా నని చెప్పి సౌరిస్‌గారు చరిత్రతో బాటు, నేను అడిగే అనేక ఆధ్యాత్మికపరమైన ప్రశ్నలకి సమాధానం చెబుతూ, నాకు కొన్ని అనుభవాలను కలిగిస్తూ, నా రచనని

సవరిస్తూ, అవసరమయితే కోప్పడుతూ వొచ్చారు, చలంగా రిదంతా ఏమీ పట్టనట్లుగా వుండేవారు. కానీ రాను రాను సౌరిస్‌గారికి, అందరికీ నేను చరిత్ర చదువుతూ వుంటే కొన్ని సవరణలు చేసేవారు. మిత్రులకి లేఖలలో రాసేవారు. వారి ప్రోత్సాహంతో ఆ రచనే నా తిండి, నిద్రా, సర్వస్వం అయిపోయింది.

తెల్లవారితే ఏవో పనులు చెప్పేది నర్తకి. గోడలు కట్టడమో, రాళ్ళు మొయ్యడమో, నీళ్ళు తోడడమో, అంట్లు తోమడమో.... ఇట్లా ఎన్నో. చాలాసార్లు కోపం వొచ్చేది. ఎంతపనో మాయపని. ఏకాగ్రంగా సౌరిస్‌గార్ని ధ్యానంచేస్తూ వుండేందుకు ఒక్క క్షణంకూడా తీరుబడి వుండ నివ్వరు. అని, ఏపని చేస్తూవున్నా ఆ రచనని గురించి సౌరిస్‌గార్ని గురించి అదే పనిగా స్మరించుకుంటూ చేసేవాడిని. రాను రాను ఆ పనులు చేస్తూ సౌరిస్‌గారి ప్రెజెన్స్‌ని ఫీలవడం తెలిసి వొచ్చింది. ఒక్కసారి మాత్రం కొంచెం బాధగా అనిపించి "నర్తకి పనులు పనులు అదేపనిగా చెప్తారు కదా. ఒకరోజు వ్యవధానం ఇవ్వండి నాకు. నా రాతపని సరిచేసుకుంటాను" అన్నాను విసుగ్గా.

"మన ప్రభువే సృష్టిక్రియ అనే పనిలో నిమగ్నులై వుండగా మనం పనికి విసుక్కోవడ మెంత తెలివి తక్కువ. మనస్సుని ప్రేమలో నిమగ్నంచేసి పనిచేయ్యడమే సాధన. సాధనలో బద్ధకస్తుల కెలా ఫలిస్తుంది ఈశ్వరాన్వేషణ" అంది నర్తకి నా కళ్ళల్లోకి చూస్తూ. ఎంతో సిగ్గు పడ్డాను. అప్పటినించి తీరుబడి సమయాల్లో రాసుకుంటూ మిగిలిన కాలాన్ని ఏదో పనిచేస్తూ వుండేవాడిని.

అప్పట్లోనే బసవరాజుగారు ధాన్యాన్ని బియ్యంచేసే—రాజస్థాన్ తిరగలి నొకదాన్ని తెచ్చారు. ఇక నర్తకి సూచన ప్రకారం ఆ తిరగల్ని తిప్పుతూ కూచునే వాడిని వుదయాలు.

సాయంత్రాలు సౌరిస్‌గారి చరిత్ర చెబుతుంటే రాసుకునేవాడిని. నాకు రాసుకునేందుకు కాగితాలుకూడా వుండేవి కాదు. అంత నిర్ధనుడ్ని. పాపం అని నామీది జాలి పుట్టిన నర్తకి కిట్టూ పుస్తకాల్లో ఒకవైపు రాసిన కాగితాలు ఇచ్చారు. వాటిమీదనే రాసుకుని మళ్ళీ తిరగరాత వాటిల్లో కాస్త మంచిగావున్న కాగితలమీద రాసి సౌరిస్‌గారి సవరణలకి పెట్టే వాడిని. మొత్తం మీద ఆ మొదటిభాగం రచనకి ప్రత్యక్షంగా నర్తకి, పరోక్షంగా చలంగారు ప్రోత్సాహకులు. అంతకాలమూ చిత్ర నన్ను తల్లిలా కనిపెట్టుకొని వుంది. మిగిలినవారు ప్రేమతో సహకరించారు.

సౌరిస్ భక్తులూ, అనుయాయులూ కొందరు నాకు లేఖల ద్వారా ప్రోత్సాహాన్ని ఇచ్చారు. చివరికి చరిత్ర ముగింపుకి వొచ్చేనాటికి నాలోని దుర్బలత్వం వల్లనో, నా కర్మ వల్లో, నా దౌర్భాగ్యం వల్లో చేసిన కోటానుకోట్ల జన్మల పాపాలవల్లో— కొందరు రమణ స్థానీయులు నన్ను భరించలేకపోయేవారని క్రమంగా నాకు తెలుస్తూ వొచ్చింది. అందుకని ఎవరికీ నావల్ల బాధ లేకండా నన్ను ఎప్పుడూ పనిలో **engage** చేసేది కాబోలు నర్తకి. నాలో చేదుతనాన్ని ఆ విధంగా ఎన్నో రీతుల వొదలగొట్టారు నా ప్రభువు. ఇంకా వొదల గొడుతూనే వున్నారు. నాలో అంధకారం ఇంకా చెలరేగుతూనే వుంది. అయినా నా ప్రభువు నన్ను కరుణించి నడుపుతూనే వున్నారు.

అప్పట్లోనే వొచ్చిన జనార్దనం నాకు చరిత్ర రచనలో ఎన్నో విధాలుగా సహకరించాడు. ఆ విధంగా సౌరిస్ జీవితం తొలి భాగం రచన ముగింపుకి వొచ్చింది. ఆ విషయాన్ని చలంగారు నాగేశ్వరరావ్ గారికి రాసిన లేఖలో "సౌరిస్ చరిత్ర చురుగ్గా సాగుతోంది. తెలుగు దేశం నించి వొచ్చాడు సూర్యనారాయణ. అదే పనిగా కూచుని తన శ్రద్ధనంతా పెట్టి రాసేస్తున్నాడు. ఆ పుస్తకం త్వరలో పూర్తవుతుం

దని అనుకుంటున్నాం. అది పూర్తి అయినపుడు అది జీవిత చరిత్రే కాక ఒక గొప్ప లిటరరీ పీస్‌గా రాణించ బోతోంది" అని రాశారు.

చరిత్ర చెబుతూ వున్న ఆ రోజులలో నా ప్రభువు లీలా విలాసాన్ని నేను ఎన్నటికి మరిచిపోలేను. ఆ సాయంత్రాలు నా జీవితంలో ఎన్నటికీ మరచిపో లేనివి. ప్రతి సాయంత్రమూ గొప్పగా రాసుకో తగినదే. ఆ సాయంత్రాలు నా బతుకుని ఈశ్వర విలాసంతో ఉద్దీపింప జేశాయి. సాహిత్య మంటే ఆసక్తి వున్నా సృజనశక్తి ఏమీ తెలియని, ఆధ్యాత్మిక పథ మంటే ఎరుక లేని నేను ఆ గ్రంథాన్ని రాశానంటే అన్నిటికీ ప్రభువే కారణం. అది ఈశ్వ రానుమతి, అనుగ్రహం. ఈశ్వర హస్తం నా శీర్షం పైన, ఈశ్వర కాంతి నా కలంలోనూ నిలవడం వల్లనే నేను కలం పట్టుకోగానే అప్రయత్నంగా నా పని నా నిమిత్తం లేకండా సాగిపోయేది, ఇంతకీ ఇవాళ తెలుసుకున్న దేమంటే 'ప్రభువు' ఎవరిచేత నయినా, వా రెంత చాత కాని వారైనా, ఏ పనైనా చేయించగలరు. ఎటొచ్చీ వారి కరుణ కలగాలి. అంత మాత్రమే జరగవలసినది అని.

ఒక రోజు సాయంత్రం 'ప్రభువు' ముందు వాకిట్లో వొచ్చి కూచున్నారు. నిదానించి కన్ను లెత్తి మా అందరినీ తన చూపులతో ఎంతో దయగా చూస్తూ, ప్రేమగా మాట్లాడారు. శిరీషం నీడల్లో, నిరామయమైన అరుణాచలం ఎదట, పలచబడిపోతువ్న పగటి వెలుగులో ఆ వాతావరణ మంతా మాకు మునుపెన్నడూ ఎరుకలో లేని విద్యుత్ స్పందనలతో పులకించిపోయింది. ఆ వేళ సౌరిస్ ఈశ్వర సాక్షాత్కార ఘట్టం వివరిస్తున్నారు. 'ఆయన' మావైపు చూపు నిలిపి మాట్లాడుతో వుంటే మమ్మల్ని తన లోపలికి తీసుకున్నట్టు, తనలో ఐక్యం చేసుకున్నట్టు అనిపించింది. 'ఆయన' రక్షణ హస్తాలలో ఒళ్లు తెలియని

సుషుప్తిలోకి దిగజారిపోయా మందరం. అంతటా నిశ్చల నిశ్శబ్దం అలుముకు పోయింది. నేను 'ఆయన' పాదాల ముందు కలం పట్టుకుని రాత మరిచిపోయి పరవశంలో కూచుండిపోయాను. లోకంలోని మాతృత్వ మంతా మానవజాతిలోని ఔన్నత్య మంతా మూర్తీభవించి నా ముందు కూచున్న ట్టనిపించింది. నన్ను తల్లకిందులు చేసి వూపి పారేస్తున్న ఆ తేజస్సుని చూసి ఈశ్వరుడే మానవరూపంలో వొస్తే ఇంతకన్నా వేరే రూపంలో వుండడానికి వీలు లేదనిపించింది.

సాక్షాత్కార ఘట్టాన్ని వివరించి 'ప్రభువు' కొద్దిసేపు నిశ్శబ్దంగా ఎక్కడో దిగంతాల్లోకి చూస్తూ వుండి పోయారు. 'ఆయన' కళ్ళలోంచి సంధ్యకి మెరుగు పెడుతో ప్రేమ మా అందర్నీ ఏకం చేస్తో వెలుగుతోంది. ఏ లోకం నించో దిగి వొచ్చి మా అందరి మధ్య కూచున్నారు ఆ పవిత్ర కాంతిమూర్తి. ముఖంలో గొప్ప తేజస్సు, అరుణాచలం మీద నక్షత్రాలు గుంపులుగా చేరుతున్నాయి. నాగుండెల్లో ఎందుకో దుఃఖం అంతు తెలియ నంతగా పొంగి వొచ్చింది. ఏదో ఒళ్లు తెలియని ఆవేశంతో వూగీసలాడి పోయాను. "మా మీద మీకు ప్రేమా, దయా లేదమ్మా!" అన్నాను డగ్గుత్తికపడ్డ గొంతుతో. ఆమెలో చలనం లేదు. ఆ చూపు ఎక్కడో నిలిచింది. అస లామె ఇక్కడ లేరు. నే నెక్కడ జ్ఞాపకం ఆమెకి? తల్లీ! నువ్వింత నిర్దాక్షిణ్యంగా ఎందుకు మారిపోయావు? నీ నించి ఒక్క చిర్నవ్వు, ఒక్క జాలి కన్నీటి చుక్క, నోరార ఓదార్పు నిచ్చే ఒక్క మాట, అంత మాత్రానికి కూడా నేను నోచుకో లేదా? అని నాలో పరిపరి విధాల యోచనలు వొచ్చాయి. ఒక్క పెట్టున దుఃఖం కట్టలు తెంచుకుని వొచ్చి పడింది. బావురు మని ఏడ్చేశాను. ఏదీ తెలియని అయోమయావస్థలో పడ్డాను.

'ప్రభువు' నా కళ్ళల్లోకే సూటిగా చూస్తున్నారు. కన్నీటి తెర ప్రభువు ముఖాన్ని కనపడనియ్యకండా మనక వేసింది. ఆకాశంలోంచి వొస్తున్నట్లుగా ఈ మాటలు నా చెవిన బడ్డాయి.

"మీ అందరి మీద ప్రేమ లేకపోతే ఇట్లా రూపం ధరించి వొస్తానా ? నేను వుండగా అది మీకు తెలుస్తుందా సూర్యనారాయణా! సరిగ్గా మీరు అడిగినలాంటి ప్రశ్నే అపోస్తలులు జీసస్‌ని అడిగారు. "మీ రంచరూ సూర్యుడి చుట్టూ కిరణాలవంటి వారు. మీ రంతా నాతో కలిస్తేనే కానీ నేను పూర్తిగా ప్రకాశించను" అన్నారు జీసస్ వాళ్ళతో— తెలిసిందా ?" అని అన్నారు. మళ్ళీ ఒక్కపెట్టున దుఃఖం పొంగుకుని వొచ్చింది.

నా లోపల ఏదో సుడిగుండాలు తిరిగినట్లయ్యింది. ఎంత అల్ప మానవుడ్ని, అవిశ్వాసిని. ఆమెకి నేనొక్కడినేనా? నా ప్రశ్నకి బదులు పలకకపోతే నన్ను మరిచినట్టేనా ? నాపై కోపం వొచ్చినట్టేనా ? హృదయంలో పలకాల్సిన దైవం అందరి ముందు నాతో పలకలేదని ఎందుకీ వ్యర్థ దుఃఖం అనిపించింది.

'ప్రభువు' అట్లాగే నా కన్నులలోకి రెప్ప వెయ్యకండా చూస్తున్నారు. ఆ కన్నులలోంచి నా లోపలికి విద్యుచ్ఛక్తులు, నిత్యానంద వాహినులు ప్రవహిస్తున్న ట్లయ్యింది. నా కన్నులలో అశ్రు ప్రవాహాలు ఆగకుండా సాగాయి, ఈలోగా (రమణస్థాన్ పెంపుడు కుక్క) జ్యోతి నా దుఃఖాన్ని చూడలేక నా చెక్కిలిమీద కన్నీళ్ళని ఓదార్పుగా నాలుకతో నాకడం మొదలు పెట్టింది. నా దుఃఖాన్ని చూసి అది తల్లడిలి పోయింది. నాకు మాత్రం ఒళ్ళు తెలియదు. లోపలినించి శాంతి, ఏదో చల్లదనం పొంగు కొస్తున్నట్లుగా తోచింది. నే నా నూతన శాంతి అనుభవం నించి కదలలేదు. ఎప్పటికో చుట్టూరా వారి కంఠాలు విన

బడ్డాయి, కానీ ఆ శబ్దాలు నా చెవులు దాటి లోపలికి పోలేదు. ఎవరు రానీ, ఎవరు పోనీ, ఎవరు చూడనీ నాకేం ప్రమేయం లేదు. అట్లాగే కూచున్నాను. చివరికి భోజనాల వేళయిందని, నర్సు కి చెప్పింది, నేను తల వొంచుకుని నించున్నాను. ప్రభువు నా తల మీద ప్రేమగా నిమిరి వెళ్ళిపోయారు. ఆ స్పర్శతో నాలో ఏదో విశాల మయిపో యింది. తేలికై పోయింది. హృదయంలో పెద్ద భారం వొదిలిపెట్టి నట్లయింది. ఆ రాత్రంతా **guest house** డాబా మీద కూచుని ఒకటే ఏడ్చాను. నన్ను ఆనందంతో కంపింపజేసే ప్రభువు కంఠం "సూర్య నారాయణా, నేను వుండగా అది నీకు తెలుస్తుందా ?" అని— రాత్రి నీరవంలో నక్షత్ర కాంతిలో నా చెవుల్లో మళ్ళీ మళ్ళీ వినిపించింది. నా 'ప్రభువు' 'సూర్యనారాయణా'. అని నన్ను పిలిచారా ? ఊగే నా విశ్వాసానికి బలా న్నిచ్చారా ? ఏం జరిగింది ? నాకేం తెలియట ల్లేదు.

ఎదురుగుండా నిరామయంగా, నిశ్చలంగా నిశీధంలో కెంపుల కొండకి మల్లే వెన్నెట్లో మెరుస్తోంది అరుణాచలం. కొండ కళ్ళకి కని పిస్తోంది. 'ప్రభువు' గొంతు వినిపిస్తోంది. కొంచెం సేపటికి కొండే గొంతెత్తి మాట్లాడుతోందని తోచింది, గంభీరమైన గళంతో. కరు ణార్ద్రమైన స్వరంతో అరుణాచలం నన్ను ప్రశ్నిస్తోంది .... .... "సూర్యనారాయణా! అది నీకు నేను వుండగా తెలుస్తుందా ? అని. ఏం చెప్పగలను సమాధానం ? వెక్కి వెక్కి ఏడ్చాను. నా అవిశ్వా సానికి ఇది తగిన ప్రశ్నే తండ్రీ ! నీ కృపని సంశయించాను ప్రభూ ! ప్రపంచ మనేదే లేక ముందు అనంత చైతన్య కళ్యాణశ్రీవై మంగళ దీప్తివై విలసిల్లిన నీవు దిక్కు తెలియకండా అజ్ఞాన తిమి రంలో కొట్టుకునే మమ్మల్ని వుద్ధరించడానికి ప్రతీ యుగంలోనూ

అవతరిస్తున్నావు. ఏ బంధాలు లేని నీవు మా కోసం దేహ బంధంతో నిలుస్తున్నావు. కానీ నిన్ను గుర్తించ లేకపోతున్నాము. నీ కారుణ్యాన్ని సంశయిస్తూ నిత్యమూ- ప్రతి క్షణమూ ప్రేమతో, అనుగ్రహంతో మమ్మల్ని కావిలించుకుంటున్న నీ కౌగిట్లోంచి తప్పించుకు పారి పోయేందుకు ప్రయత్నిస్తున్నాం. అయినా మమ్మల్ని క్షమించి నీవు మళ్ళీ నీ లోపలికి తీసుకుంటున్నావు. మాలో కృతఘ్నత తీవ్రమై, తిమిరమై నీ విచ్చిన మధుర ఫలాల్ని ఆరగిస్తూ, జీవిస్తూ— మేం పళ్ళ నెప్పుడూ ఎరగమనీ, చెట్టునే ఎప్పుడూ చూడలేదనీ బుకా యిస్తున్నాము. అయినా నువ్వు మమ్మల్ని క్షమిస్తున్నావు. నీ క్షమా శక్తి అనన్యం విశ్వ ప్రభో— అంటూ పరి పరి విధాల ఆలోచనలతో దుఃఖ పడుతో ఆ రాత్రంతా గడిపాను. శుక్రతార వుదయంతో బాటు మంచు లాంటి తెల్లని బట్టలతో మెరుపు లాగ మెరిసే ముఖంతో నా 'ప్రభువు' సూటిగా నా కన్నులలోకి చూస్తున్న ట్లనిపించింది. ఎక్కడ లేని మాయ నిద్ర కమ్ముకుని వొచ్చింది. ఎంత ఆపు కుందామన్నా ఆపుకోలేక పోయాను. 'ప్రభువు' నా ఎదట వుండగా వొచ్చింది పాడు నిద్ర. ఎప్పుడూ ఏక నిద్ర. దిక్కుమాలిన నిద్ర. ఆ రాత్రి అంతే. తెల్ల వారింది. మళ్ళీ ప్రపంచం మామూలుగా కనిపించింది.

చెప్పాలంటే ఎంతైనా వుంది. ఆ విధంగా ఒక ఆరు నెలల కాలం 'ప్రభువు' కారుణ్యంలో గడిపాను. ప్రపంచంలోకి నడిచి హిమాలయాలు చేరుకున్నాను. 'ప్రభువు' కారుణ్యంలో సంవత్సరాల నిరీక్షణానంతరం సన్నిధికి రాగలిగాను. చరిత్ర రెండో భాగం రాయ గలిగాను.

ఈ మారు సౌరిస్ రెండవ భాగం నిమిత్తంగా అందరి అనుభవాలను సేకరిస్తూ నర్తకిని అనుభవాలు చెప్పమని అడిగాను.

"చూడు సూర్యనారాయణా! నీలాంటి వాళ్ళే ఒకరు పోయి రాధని అడిగారట ప్రేమ అంటే అర్థం చెప్పమని. అహరహం ప్రేమలో, విరహంలో జ్వలించిపోయే రాధ, ఆరాధనా పరత్వానికి మారు పే రయిన రాధ యామన్నదో తెలుసునా?

"దీన్ని ప్రేమంటారో ఏమంటారో నాకు తెలియదు.
అది వుండే దెక్కడో అంతకన్నా తెలియదు.
తలుపు లెప్పుడూ తెరిచే వుంచాను,
కలో, మెలకువో తెలియకుండా వుంది.
ఇంతకీ ప్రేమ వొచ్చిందో రాలేదో ఎరుకపడకండా వుంది.
అదే వొచ్చిన రోజు రాధ మిగుల్తుందా పలకడానికి".

"అనుభవం వొచ్చిన రోజున ఈ నర్తకి మాత్రం మిగులు తుందా సూర్యనారాయణా?" అంది నర్తకి. ఒక్క పెట్టున దుఃఖం వొచ్చింది. మూడు దశాబ్దాలు తనని మరిచి అంకితం చేసుకుని, తానే నా 'ప్రభువు' యాక్టివిటీగా నర్తించే నర్తకియే తనకి అనుభవం రాలే దంటే—— నిన్న మొన్న కన్ను తెరిచినవాణ్ని తగుదునమ్మా అని అనుభవాలు చెప్పుకోవడమా అనిపించుతోంది కానీ చెప్పాను.

నర్తకీ! నీ వన్నది నిజం. అన్నిటినీ వాపసు చెయ్యగలను గానీ సౌరిస్‌గా నిలిచిన 'ప్రభు' విచ్చిన ప్రేమని మాత్రం వాపసు చెయ్య లేను. సాగే మహాయాత్రలో అదే నాకు దారిబత్తెం. నిజమే నాప్రయా ణానికి అనుమతి దొరికింది. ఇక వెళ్ళిపోవాలి. ధూళి నిండిన జోలెలో కలల బరువుల్ని నింపుకుని మరీ కదలి వెళ్ళాలి. దిగంతాల్లో అస్త మయ సూర్యకాంతి మంచు కమ్మిన హిమాలయ శిఖరాలు వింత కాంతుల్ని వెలారుస్తూ, ముఖం తిప్పుకుని కూచున్న 'ప్రభువు'లా కని పించి నప్పుడు, నా కుటీరం పక్కనున్న కొండమీదనించి నాలాగే

అగమ్యంగా గుండె ముక్కలై దూకే కొండవాగు వెక్కి వెక్కి ఏడుస్తున్నప్పుడు, శిశిర దుశ్శాసనుడి చేతుల్లో పత్రవసనాలు వొలి చెయ్యబడి దిగంబరంగా చేతులు జాచి విశ్వేశ్వరుడ్ని వేడుకొంటున్న ట్లుగా వున్న చీనార్ చెట్లమీద 'ప్రభువు' అభయ వస్త్ర ప్రదానంలా ఆకాశం నించి కర్పూరపు పొడిలా కురుస్తున్న మంచు ధవళ వస్త్రంలా నిలిచినప్పుడు రమణస్థాన్‌కి ఎట్లా దూర మయ్యానా అన్న దుఃఖం పొంగుకు వొస్తుంది. కానీ హృదయంలో కాంతిగా, బతుకులో చైత న్యంగా నిలిచిన 'ప్రభువు'ని వొదులుకుంటే ఎలా బతకడం— అన్న సంకల్పం నన్నింకా బతికిస్తుంది. కానీ 'ప్రభువు'కి దూరంగా బతక డంలో అర్థ మేముంది అన్న శూన్యం ఇవాళే కనబడుతోంది నా ముందు. కానీ నా బతుకులో ప్రతి నిమిషం 'ప్రభువు' పాదాలని అల్లుకునే వుంది.

నా మాటలు వింటూ దిగంతాల్లోకి చూస్తున్న నర్తకి ఏమీ మాట్లాడ లేదు. నర్తకి నా 'ప్రభువు' గురించి మాట్లాడుతూ వుంటే— కన్నుల్లో నీళ్ళు సుడులు తిరుగుతో వుంటాయి, చెవు లెంతగా కోర తాయో నర్తకి కంఠంలో 'ప్రభువు' విలాసాల్ని వింటూ వుండాలని అసలు నర్తకి పలుకులో తెలుగుభాష గౌరవాన్ని పొంది ప్రతీ పదం పులకరిస్తున్నట్లుగా తోస్తుంది. అరుణాచలాకాశం ప్రతిఫలించే ఆమె కళ్ళల్లో 'ప్రభువు' నామాన్ని వుచ్చరిస్తే చాలు అద్భుతమైన మెరుపులు వెలిగిపోతాయి.

"నర్తకీ నువ్వెంత కాంతితో వెలిగి పోతున్నావో ఎంత విశ్వాస బలమో మీది" అన్నాను అప్రయత్నంగా.

"నర్తకి అనే ప్రతిమని మలిచింది సౌరిన్.
శిల్పిని మరచి శిల్పాన్ని కీర్తించే పిచ్చివాడా!
కిరణం స్వయం ప్రకాశం కాదు. అది
ఆదిత్యుడిలో అంతర్భాగం కాంత్యాభరణం"

అన్నది నర్తకి నాతో. నిజమే మరి ప్రతి ప్రతిమని మహత్తరంగా మలిచిన నా గురుమూర్తిని కీర్తించడానికి నే నెంతటి వాడిని. ఈ తెలుగు వాఙ్మయంలో పదాలు సరిపోతాయా? వరిచేలకి నీళ్ళు మళ్ళే దోవలో వున్న ముళ్ళ తుప్పకి కూడా ప్రవాహ జలాలు లభ్యపడినట్లు సజ్జను లందరి కోసం ప్రసరించే ఈశ్వర కాంతి నా గురుమూర్తి కారుణ్యం వలన నా వంటి కంటక స్వభావుడి మీద కూడా ప్రసరించిం దని తోస్తోంది.

ప్రయాణం దగ్గర పడుతోంది. వాకిట్లో బండి నిలుస్తుంది. గుండె బరువుతో 'ప్రభువు'కి నమస్కరిస్తాను. నా వైపు నిశ్చలంగా చూస్తారు 'ప్రభువు'. వీథి గుమ్మంలో నిలబడుతుంది నర్తకి. బండిలో కూచుంటాను.

"బండి కదల బోతోంది బాట మీద ధూళి రేగుతోంది
కాల ధూళి దూరంతో కలిసి 'ప్రభువు'కి నాకు మధ్య
నిలవబోతోంది
కరుణార్ద్రమైన 'ప్రభువు' గళం
మళ్ళీ నా చెవులకి వినిపిస్తుందా తల్లీ!"

అంటాను ఆమెతో.

"దగ్గర దగ్గర కాదు దూరం దూరం కాదు
అంతర్యంలోంచి 'ప్రభువు' సాన్నిధ్యాన్ని పొందగలగడమే
అదే ఎవరైనా చేరుకోవాల్సిన స్వర్గం
అది తెలిసిన రోజు బ్రతుకే సాధన ఆరాధన"

దిగు లెందుకు అంటుంది కాబోలు ఆమె. బండి మెల్లిగా ముందుకి నడుస్తుంది. అరుణాచల శిఖరాలు మరుగున పడతాయి. మహా యాత్రని ఎటు మలుపు తిప్పుతారో నా దైవం.

# శ్రీ రమణస్థాన్

## ఉపోద్ఘాతం

ఈశ్వరుని కనుసన్నలలో కొనసాగించబడుతున్న ఆశ్రమమే శ్రీ రమణ స్థాన్. ఒక భక్తుడు అప్రయత్నంగా చలం మహర్షికి రాసిన వుత్తరం పైన ఎడ్రస్‌లో రాసిన పేరే ఆశ్రమానికి పేరుగా అనుగ్రహించారు ఈశ్వరుడు. ఇది భగవాన్ రమణుల పేరిటనే విలసిల్లడ మొక విశేషమైన అంశం. ఇది పూర్వకాలంలో ఋష్యాశ్రమాల లాంటిది. ఇక్కడ 'కులం, మతం, ధనం, అధికారం' అన్న మాటలకు తావు లేదు. మహర్షి నించి పరితప్తుడి దాకా ప్రతి వారికి ఇక్కడ చోటు వుంది. అశాంతితో, విచారంతో అల్లాడే వాళ్ళకి శాంతి నిస్తుంది ఈ ఆశ్రమం.

ఎవరికి ఆధ్యాత్మిక సంబంధమైన ప్రాప్తి వుందో, ఎవరికి ఆత్మాభివృద్ధి ముఖ్యమో, వారి ప్రారబ్ధాన్ని ఎవరు తపస్సు ద్వారా తీర్చుకోవడానికి ఈశ్వరుడు ఉద్దేశించారో .... అటువంటి కొద్దిమందే నిలుస్తారిక్కడ. ఏమీ శ్రమ పెట్టకుండా కబుర్లు చెబుతో, ఆటలాడుతో, బుజ్జగిస్తూ, ప్రేమ చూపుతూ, కోప్పడుతో ఈశ్వరుడు తన ఆశ్రమంలో నిలిచేవాళ్ళ అజ్ఞానాన్ని నాశనం చేస్తో ప్రారబ్ధాన్ని తీరుస్తో— తనని నమ్ముకొన్నవాళ్ళని తన వెంట తీసుకు పోతున్నారు సౌరిస్ రూపంలో.

ఇదేమిటో నని తొంగిచూచి పోయేవాళ్ళున్నారు. "ఇది ప్రపంచ క్షోభల నించి ప్రత్యేకంగా వుంది. శాంతిగా వుంది. కొన్నాళ్ళిక్కడ నిలుద్దాం. విశ్రాంతి తీసుకుందాం" అని వొచ్చి పోయేవాళ్ళున్నారు. 'ఇంక వేరే ఏమీ లేదు— ఇది తప్ప. వీరిలో ఒకరిమై నిలిచిపోదా"

మని నిశ్చయించుకుని వొచ్చే వాళ్ళున్నారు. వాళ్ళలో చాలా మంది వాళ్ళకి తెలియకుండానే ఇక్కడ వేడిని తట్టుకోలేక ఏదో ఒక మిషతో, వాంఛతో వెళ్ళిపోయేవాళ్ళు అనేకులు.

ఈశ్వరు డన్నట్లుగా "ఇది శాంతంగా గడపాలనే చోటు కాదు. ఇది అగ్ని. రుద్ర భూమి అంటారే అదే ఇది."

(ఈశ్వరోక్తాలు - 204)

చలంమహర్షి మాటల్లో చెప్పాలంటే "ఎక్కడ పిల్లల్ని కొట్టరో, ఎక్కడ పిట్టల్ని ఆదరిస్తారో, ఎక్కడ గొప్పతనానికి తలలు వొంచరో, ఎక్కడ పెళ్ళి మేళాలు వినబడవో, ఎక్కడ డబ్బు పలకదో, ఎక్కడ పరుడూ, హితుడూ సమమో, ఎక్కడ ప్రేమ మౌనంలో రాజ్యం చేస్తూ వుంటుందో, ఎక్కడ ప్రపంచపు రొద పొరబాటున కూడా వినరాదో"—అదే ఈశ్వర సమక్షం— శ్రీ రమణ స్థానం. (కురంగేశ్వర్ లేఖల నించి)

ఇక్కడ ఏం జరుగుతోందనీ, ఏం చేస్తూ వుంటారనీ ఎందరికో జిజ్ఞాస. ఇక్కడ జరిగేది, జరిపేది, జరిపించేది, చేసేది, చేయించేది అంతా ఈశ్వర విలాసమే.

ఇక్కడ ఎన్నడో కాలం నిలిచి పోయింది. వాంఛలూ, ప్రలోభాలు శక్తి విహీనాలుగా మారిపోయాయి. మనస్సుల పొంగులు చల్లారిన కొద్దీ, లోక వాసనలూ, వాంఛలూ దూరమైనకొద్దీ— ఇక్కడ నిలిచి పోయిన వాళ్ళందరిలో, ఇక్కడ నించి నడుపబడుతున్న వారందరిలో — శాశ్వతం నిర్మల కాంతి చోటు చేసుకుంటోంది.

"ఇక్కడి వాళ్ళకి ఏ మొచ్చింది?" అని అమాయకంగా నా మిత్రులు అడుగుతారు. నా ప్రభువు అన్నట్లు "వొచ్చే దేమీ లేదీ తోవలో. అంతా పోవాల్సిందే. ఏదో వుం దనుకుంటే అక్కడే

ఆగిపోతారు. జ్ఞాన మంటే వొచ్చేందుకు ఏదీ లేదు. అంతా పోవడమే. అసలు వెలుగుని తెలుసుకోవడమే.'' (సౌరిస్-1)

మహర్షి చలం జిజ్ఞాసువు లొకరికి రాసినట్లుగా "ఉనికి కలిగి వుండటం" తప్ప ఇక్కడ చేసేందు కేమీ లేదు. చిరకాలంగా ఈశ్వరో పాసకు లైనవారు దైవీ తత్త్వం అడు గడుగునా, అణు వణువునా గోచరించే చోట జీవించుతున్నట్లు స్పష్టంగా తెలుస్తుందనీ, ఆనందంగా వుంటుందనీ చెప్తారు.

రాలేక పోయామనీ, చూడలేక పోయామనీ ఎందరో ఆదుర్దా పడతారు. "విశ్వాసం బలమైనకొద్దీ ఇక్కడికి రావడం సులభ మవుతుంది. పక్క వూరి కన్నా అరుణాచలం దగ్గ రవుతుంది. ఇక్కడ ఈశ్వరాశ్రయంలో వుండ గలగడం సులభమైన పని కాదు — ముఖ్యం ఇంకా జీవితంలో గట్టి సాధన, శోధన జరగని వారికి.''

ఇక్కడికి ఒకసారి వొచ్చి ఈశ్వర చరణాలకి తమని అర్పితం చేసుకుని జీవించే వాళ్ళని ఈశ్వరుడు ఎప్పుడూ రక్షిస్తోనే వుంటారు. ఇక్కడికి వొచ్చి చూడగలగడమే అదృష్టం. భౌతిక జీవితాల్ని వొదిలి రాలేక- ఇక్కడ వుండిపోలేక పోయామని బాధపడే వాళ్ళకి ఈశ్వరుడు అభయం ఇచ్చే వున్నారు— "ఉండి తారుమారు అవడంకన్నా దూరాన్నించి ఇట్లాంటిది ఒకటి వుందన్న ఆశతో బతకడం చాలా నయం- ఎందుకంటే ఇక్కడ నిలవాలంటే మనిషి 'తనని' ఒదులుకోవాలి. కోల్పోవడమే కానీ పొందడం ప్రశ్నే లేదు. ప్రతి క్షణం పరిత్యాగం. అందుకని వొస్తూ పోతూ విశ్వాసం నిలుపుకుంటే చాలు. తప్పకుండా మీ వేపు నేను వున్నా నన్న ధైర్యంతో బతక వచ్చు— ఇక్కడ నించి కొందరిని పంపించడంవల్ల అనుగ్రహం తక్కువనీ, వుంచడం వల్ల అనుగ్రహం ఎక్కు వనేది లేదు" అని

(ఈశ్వరోక్తాలు 141- పుట 52)

ఈ ఆశ్రమంలో కట్టుబాట్లు అంటూ ఏవీ లేవు- ఈశ్వ రార్పి తంగా వాస్తే, బాధాతప్తులకి లోకంలో ఎక్కడా ఇమడ లేకపోయిన వాళ్ళకి అందరికి ఎప్పటికీ ఇక్కడ చోటు వుంది.

'మీ కెక్కడా చోటు లేకపోతే ఇక్కడ (రమణస్థాన్) తలుపు తీసే వుంటుంది'. (ఈశ్వరోక్తాలు - 191, పుట 65)

ఇప్పటి దాకా ఈశ్వర విశ్వాసంతో, ఈశ్వర దర్శనంతో, ఈశ్వర అభయ ప్రదానంతో, ఈశ్వర ఆదేశంతో, జీవితాలను ఎందరో నిశ్చలానందానికి సన్నిహితం చేసుకున్నారు. హాయిగా తమ తమ స్వస్థానాలలోనో, ఈశ్వర పాదాల దగ్గరనో జీవిస్తున్నారు.

ఈశ్వరుడికి తమని సమర్పణం చేసుకుంటూ విశ్వాసంతో ఏ హిమాలయాల్లో కూచున్నా అనంత మహిమాలయం అయిన ఈశ్వర స్వరూపం కటాక్షిస్తూనే వుంటుంది. లోకంలో వాళ్ళ వాళ్ళ అవసరాలకి ఏ లోపమూ లేకండా జరుగుతుంది. లోకంలో గొప్ప అందాలకి ఆనందాలకి కళ్ళు తెరిపించే గొప్ప శాంతి లోపల్నించి లభిస్తుంది— ఈశ్వర విశ్వాసులకు.

అందువల్లనే ఈశ్వరుడు భక్తుల నుద్దేశించి "దేనిగురించో భయ పడ్డం ఎందుకు? నా దగ్గరగా వుండడం కంటే మీ కర్తవ్యం మీరు నెర వేర్చుకోండి. నా దగ్గరగా వున్నవాళ్ళు నా కెంత దూరమో చూశారు కదా. అందుకని నా దగ్గరగా వుండటం వల్ల నాకు దగ్గరవుతా రనుకు నేది పిచ్చిభ్రమ. ఎక్కడ వున్నా నన్ను హృదయంలో నిలుపుకోవడమే ముఖ్యమైన సంగతి." అని అంటారు.

(ఆ. సూర్యనారాయణకి సౌరిస్ లేఖ)

ఈ వూరే ఈశ్వర నిలయం. ఈ వాతావరణమే ఆధ్యాత్మిక శక్తితో జ్వలిస్తో వుంటుంది. ఈశ్వర రూపమే అరుణాచలం. కాని

సౌరిస్ సమక్షంలోనూ భగవాన్ సమాధి దగ్గర అన్నిటికన్నా ఎక్కువగా ఈశ్వరానుగ్రహం మనని కావలించుకుంటుంది. అరుణాచలం నించి సౌరిస్ ద్వారా ఆనంద మందాకిని నిరంతరం ప్రవహిస్తునే వుంది. కాని దాన్ని పానం చేయగలవారు అరుదు.

"నా బతుకెట్లా అని ఆలోచించేవారికి అరుణాచల వాసం అసాధ్యం. తల్లి దగ్గరికి పరిగెత్తుకొచ్చే పిల్ల నా బతుకెట్లా అని **condition** పెట్టి అడగదు కదా!"

'తక్కిన స్థలాలకి ఇక్కడికి భేద మేమంటే ఇక్కడ ఈశ్వరుడు పలుకుతారు. **Direct** చేస్తారు! ఇక్కడ వున్న వారిచేత ఆయన చిత్ర విచిత్ర నాటాలు చేయిస్తో ఆనందిస్తారు. ఈశ్వరుడు వొచ్చింది అందర్నీ కూచోబెట్టడానికి కాదు. అందర్నీ సరైన ఆచరణలో పెట్టడానికి. అందువల్ల ఆయన సౌరిస్ ద్వారా తనను విశ్వసించిన వారినందరినీ నడుపుతున్నారు." ప్రస్తుతం (రచనాకాలానికి) ఈ ఆశ్రమంలో చలం మహర్షి, బసవరాజుగారు, కృష్ణారావుగారు, రమణ ప్రసాద్, చిత్ర, నర్తకి, కృష్ణా, మిశ్రీ, జూలీ; జ్యోతి, మోతి, నీరా అనే శునకత్రయం, మణి అనే చిలక, వనజ అనే ధేనువు వుంటున్నారు.

ఈశ్వరుడు వొచ్చిన రోజుల నించి చలం, చిత్ర, నర్తకి, డాలీ, పకపక....ఈశ్వరాదేశంలో ఈశ్వర విశ్వాసంతో నడిచారు. తరువాత, తరువాత తమ తమ స్థలాల్లో వుండి జలసూత్రం రుక్మిణీనాధశాస్త్రి, ఎన్ వీరేశలింగం, కనకమ్మ.... ప్రభృతి భక్తులు ఈశ్వర దార్శనికత్వంలో నడువ సాగారు. తరువాత బసవరాజుగారు సాధకులుగా వొచ్చారు. ఈశ్వరుడి గురించి ఎవరికీ తెలియని రోజుల్లో వారంతా ఈశ్వరాదేశంలో నడిచిన ధన్యులు. తరువాత రానురాను ఎందరో

ఈశ్వర కరుణలో నడుస్తున్నారు. కానీ ఆనాటి నడకే ప్రత్యేకం. ఆనాడు ఈశ్వరుడు చేసిన విలాసాలు విశిష్టమైనవి. అప్పట్లో చలంతో ఈశ్వరుడు "ఇంక ముందు అంతా ఎగబడతారు ఈశ్వరుడు కోసం. అది fashion అవుతుంది. ఈనాడు గుర్తించిన వారే ధన్యులు" — అని.

ఆనాడు చలం మహర్షి కుటుంబీకులను ఈశ్వరుడు నడిపించిన తీరే విచిత్రం. ఈనాడు సౌరిస్ లోంచి పలికే ఈశ్వరుడుచేత నడిపించ బడ్డ వాళ్ళ జీవనగతిని చూస్తే ఎందుకో తెలియని సంతోషం నాకు కలుగుతుంది. అస లిదంతా నడిచిన రీతి ఎంతో విచిత్రమైనది.

సంప్రదాయంలో పుట్టని సౌరిస్, సంప్రదాయం వాసనలు సోకకండా పెరిగిన సౌరిస్— భగవాన్‌ని జీవితంలోకి తీసుకుని ప్రేమించిన తీరు, ఆమెను భగవాన్ స్వప్నాలద్వారా నడిపిన తీరూ — ఆమెకి తెలియకుండానే ఆమెని సాంప్రదాయిక మార్గంలో నడిపింది, ఈశ్వరసాక్షాత్కారాన్ని పొందేలా చేసింది. ఆమెలో అర్పించుకోవడం అన్నది అప్రయత్నంగా, అతిసహజంగా జరిగింది. ముందేం జరుగుతుందో నన్న చింత జీవితాన్ని భయంకరంగా గోచరింపజేసే తరుణంలో అది జరిగింది. సాధన అని తెలియకుండానే షా సాధన నడిచింది. చిచ్చులోంచి నడిచి చివరికి చిదానందాన్ని అందుకున్నారు సౌరిస్. సౌరిస్‌కి సాక్షాత్కరించిన ఈశ్వరుడు ఒళ్ళు తెలియని స్థితిలో వున్న ఆమె చేత సాధన చేయిస్తోనే— ఆమె చుట్టూ వున్న కుటుంబ సభ్యులను నడిపారు. ఆమెలో పరిపూర్ణ ఈశ్వర చైతన్యం నిండినప్పుడూ నడుపుతూనే వొస్తున్నారు. జ్ఞాని వంశంలో ఇ టేడు తరాల వారినీ, అ టేడు తరాల వారినీ తరింపజేస్తా రంటారు మన హైందవ సాంప్రదాయకులు. కానీ జ్ఞాని తనతో

బాటు తన కుటుంబ సభ్యులను ఆధ్యాత్మిక పథంలో నడపడం ప్రపంచంలో ఎక్కడా జరగ లేదు. ఎవరి వల్లా అట్లా జరిగినట్లు ఆ యా మత గ్రంథాలు చెప్పినట్లూ లేదు. అందువల్ల సౌరిస్ ద్వారా ఈశ్వర విలాసం ప్రసరించిన తీరు అపూర్వం, అనన్యం, అసాధారణం, అవాఙ్మనస గోచరం.

సౌరిస్ కుటుంబ సభ్యు లెవరూ సంప్రదాయంలో పెరగ లేదు. తండ్రి వెంకటచలం తాను నమ్మిన ఆదర్శాన్ని, సత్యాన్ని అనుష్ఠిస్తూ, సంఘాన్ని ఎదిరించి వెలిపడ్డారు. ఆయన తిరుగుబాటు సంప్రదాయం పేరిట జాతి జీవన శక్తిని పీల్చివేసే మౌఢ్యాచారపరత్వం మీద సాగింది. దాంతో చలంగారు ఆయన కుటుంబం సాగించిన యాత్ర పూర్తిగా మౌఢ్యాచార పరాయణత్వానికి భిన్నమూ, దూరమూ అయిన స్వచ్ఛ శుభ్ర సత్యపథంలో సాగింది. అసలైన సంప్రదాయం అదే. చలంగారి పిల్లలు పట్టణ జీవితంలో ఏ కష్టమూ తెలియకుండా అల్లారు ముద్దుగా పెరిగినవాళ్లు— వాళ్ళని దేశంకాని దేశంలో తమ వారంటూ ఎవరూ లేనిచోట— తమ దేశంనించి దూరంగా తీసుకు వొచ్చి పడేశారు భగవాన్.

వా రెవరికీ భక్తి అంటే తెలియదు. తండ్రిదగ్గ రున్న స్వల్ప ధనం, రేపేమవుతుందో నన్న బెంగతో వున్న పది పదహారేండ్ల పసి వయసులో వున్న కన్నెపిల్లలు— ఏ నిమషాన చచ్చిపోతాడో అన్నట్లు అస్వస్థతలో వున్న తండ్రి .... కానీ వాళ్ళంతా ఈశ్వరుడు వొచ్చారనే సరికి భక్తి అన్నది వారికి లేశమైన లేకపోయినా, ఏ ఆలోచనా, ఏ ప్రశ్నా లేకండా, వారి హృదయాల్లోకి తీసుకోవడం జరిగింది.

"మీ స్థితి చూస్తే ఈ వూరు వొచ్చినప్పటి మా స్థితి గుర్తుకి వొస్తోంది. బెజవాడనించి ఏడుగురం మనుషులం పోకుక్కా బయలు

దేరాం. డాక్టరుగారి ఆస్పత్రిసామానులు అవీ అమ్మకుంటే 5 వేల రూపాయలు వొచ్చాయి. అంతా అంతే మాకు. ఆస్తి ఏమీ లేదు. వో రేండేళ్ళన్నా రాదు ఆ డబ్బు. భగవాన్ చంపేస్తే తిండిలేక చచ్చిపోదా మనుకున్నాం. ఇక్కడికి వొచ్చి 8 ఏళ్ళు కావొస్తోంది. ఎట్లా బతుకు తున్నావంటే బతుకు తున్నాం. ఆ ఐదువేలని మించిన డబ్బు కూడుకో లేదు. ఎట్లాగో చాలా సుఖంగా ఏ కొరవా లేకండా బతుకుతున్నాం.

ఈశ్వరుడిలో విశ్వాసంవల్ల జరగనిది ఏముంది ? ఏ డబ్బూ నిలవ వుండదు. కొరవా వుండదు మాకు".

(24-9-57 కామేశ్వరికి చలం లేఖ)

"మేము ఆ తెలుగుదేశం వొదిలి ఇక్కడికి వొచ్చేప్పుడు, ఏ డెనిమిది మందిమి. సుఖాలకి, డబ్బుకీ అలవాటు పడ్డవాళ్ళం— ఏం చూసుకుని వొచ్చాం. పొలం లేదు. ఇల్లు లేదు. ఆశా లేదు. నా **pension** 60 రూ. తప్ప :

విశ్వాస మనేది లేకండా జీవితం ఒక్క అంగుళం కదలదు"

(రాయిడి నాగేశ్వరరావుగారికి చలంగారి లేఖ - 23-10-63)

ఈశ్వరుడు వేసిన గాలం సూటిగా వాళ్ళ గుండెల్లో గుచ్చు కుంది. వాళ్ళకి తెలియకుండానే వాళ్ళ ముందొక గొప్ప సంగతి జరుగు తోంది. ఏమిటీ విపరీతం అని ప్రశ్నించకుండా దాన్ని వాళ్లు తీసుకో గలిగారు.

గురుపీఠం మీద కూచున్న వా రెవరికైనా సేవ చెయ్యడం చాలా సులువు. ఆధ్యాత్మిక ఫలం లభించాలనే ఆశ ఆ సాధనని అత్యంత సులభం చేస్తుంది. అదీ గాక సాధకుని ముందు ఒక నిర్దిష్ట మైన గమ్యం వుంటుంది. కనక నడక, దోవ అంతా స్పష్టంగా తెలుస్తో వుంటాయి. కానీ ఇక్కడ వాళ్ళ (చలం పరివారం) జీవితాల్ని

నిప్పుల్లోంచి, నీళ్ళల్లోంచి, ముళ్ళల్లోంచి నడిపించారు ఈశ్వరుడు. వాళ్లు నడిచారు. వాళ్ళకి ఓ కోరిక ఇదమిత్థమని జీవితానికి నిర్దేశించుకున్న గమ్యమూ లేదు, అలా ఆ విధంగా ఆలోచించడానికి కేమాత్రం అవకాశం లేని చిన్నవాళ్లు. ఈశ్వరుడు నడిపిస్తున్నది ఏది (దేన్ని) పొందడానికో వాళ్ళకి ఆనాటికి తెలియదు. ఇట్లా నడిస్తే ఇది ఫలితం అన్న **preconceptions** వాళ్ళకి అంతకన్నా లేవు. మరి ఈశ్వరుడు చెప్పినట్లల్లా ఎందుకు చేశారు? వాళ్ళ హృదయాలు అట్లా విచ్చుకున్నాయి. అంతే, ఆ సంగతి **reason** కి అందేది కాదు. పోనీ ప్రేమకొద్దీ చేశారా అంటే వాళ్ళకి ఎవరిమీద ప్రేమ? ప్రేమించేదెవరినో తెలిస్తే అది ప్రేమ అని తెలుస్తుంది. అసలు ప్రేమ తెలిసేది కాదు. ప్రేమ కనపడదు. ఏది ఎవరు ఈ ప్రపంచంలో చేసినా అది బాధ్యతో, కర్తవ్యం కావడం వల్లనో, మమకారం పెనవేసుకోవడం వల్లనో జరుగుతుంది. పిల్లలకి సేవ చేసుకోవడమో, మొగుడికి సేవ చేసుకోవడమో, గురువుకి సేవ చెయ్యడమో .... ఇదంతా అర్థం అయ్యే **process.**

షా ఎట్లా నడిపారో తనకూడా వున్నవాళ్ళని అట్లాగే వెంటబెట్టుకొని నడిపించారు. ఆమె ఎటు నడుస్తుందో వాళ్ళకి తెలియదు. ఆమె తమని ఎటు నడిపిస్తున్నారో వాళ్ళ వూహకి అందదు. అది సులభమైన మార్గమేమీకాదు. ముళ్ళలోంచి, చిచ్చులోంచి. అగాధాలలోంచి — అడుగడుగునా రుధిర తర్పణాలతో, ఆత్మార్పణాలలో, ఇచ్ఛానైవేద్యాలతో (తమని అర్పించుకుంటూ) సాగించిన ఒక మహాయాత్ర. అట్లా ఎందుకు నడుస్తున్నాం? అన్న పశ్న లేకుండా గురువుతో శిష్యులు నడిచింది, ఒక జీసస్‌తోనే. ఇక్కడ వీళ్ళకి (చలం కుటుంబీకులకి) తమను నడిపేది తమ గురువని కూడా తెలియదు.

గురువంటేనే అర్థం తెలియని చిన్నపిల్లలు. తండ్రి దగ్గరవున్న డబ్బు ఖర్చయిపోతే రేపెలా? ఈశ్వరుడు నడిపిస్తున్నా మంటున్నారు గానీ ఏం నమ్మకం? చివరి పైసా ఖర్చయిపోయాక ఆకలిచావు చావాలేమో? లేక ఈశ్వరుడు కారుణ్యంతో రక్షిస్తారేమో?.... ఏదీ తెలియకుండా నడిచిన పరీక్షా సమయ మది.

ఈనాడు ఈశ్వర నిర్దేశంలో నడిచేవారికి అట్లాంటి సమస్య లేదు. 'ఇట్లా చేయ్యండి' అని అంటే ఏ విషయంలోనైనా తిరగబాటు రావొచ్చు. దాన్ని అణుచు కుంటారు. ఆ పని చేస్తారు. ఈశ్వరుడు తమని వెలుగులోకి నడుపుతా రనే అశా, విశ్వాసం ఈనాటి ఈశ్వర భక్తులకి వున్నాయి గనక, అందువల్లనే ఆ రోజులలో ఎవ్వ రికీ ఈశ్వరుడు అంటే తెలియని రోజులలో, ఏవరూ ఈశ్వరుడిలో విశ్వాసం వుంచని రోజులలో.... విశ్వసించి నడిచిన వారిదే ప్రత్యేకత కృతార్థత.

దోవంటూ లేని ఆ రోజులలో దోవలేని దోవలోంచి షో తాము నడుస్తూ తమవెంట వున్న వారిని నడిపించారు. ప్రశ్నా, సమాధానం అన్నీ ఈశ్వరుడే. తమని మరిచిపోయి నడిచారు వాళ్ళు. అట్లా ఈశ్వర కారుణ్యం వాళ్ళని నడిపింది.

ప్రపంచ మంతా అడు గడుగునా వారి నడకని ప్రశ్నించేది. వున్నచోటా విదేశం. ఆప్తులా లేరు, చుట్టూ విరోధులు. ప్రపంచంతో సంబంధం పూర్తిగా తెగిపోయి వూరి చివర శ్మశానం మధ్య వున్న ఇంట్లో కాపరం. పలకరించే పొరుగువాళ్ళా లేరు. అందరూ పీ రేంచే స్తున్నారో తెలియక నెత్తిన అభాండాలు అపనిందలు వేసేవారే. పే మిది చేస్తున్నామని వాళ్ళకి తెలియదు. జీసస్ శిష్యులుకూడా ఈ విధం గానే అవమానాల పా లయ్యారట.

ఎక్కడన్నా ఏ గురువు దగ్గరన్నా అయితే ఆ గురువుతో పడక పోతే పారిపోవొచ్చు. గురువుకదా అని అది భరించవొచ్చు. కానీ ఇక్కడ ఈశ్వరుడెవరో వీళ్ళకి తెలియదు. వారిని నడిపేది వారి మధ్య పెరిగిన సౌరిస్. ఆమెచేత ఎన్నో చివాట్లూ, చిచ్చు, ఎన్నో భరించలేని పరీక్షలు.... ఇక్కడనించి పారిపోదామంటే ప్రపంచంలో ఎక్కడికి పోతారు? పోనీ అనీ గట్టిగా పట్టిచూస్తే ఆ ముసలి తండ్రి ఏ నిముషాన్నయినా కళ్ళు మూయవొచ్చు. అందరూ యౌవనంలో అడుగు పెట్టిన ఆడపిల్లలు. వేరే మగదిక్కు లేదు. చుట్టూరా పురుష ప్రపంచం ఏ నిముషాన వీళ్ళు తమచేత చిక్కుతారా అని పొంచి చూస్తున్నారు. ఫరవాలేదులే అని నిబ్బరంగాబతకాలన్నా పటిష్ఠమైన ఆర్థికస్తోమత లేదు. ఆదుకునే వారు ఎవరూ లేరు.

ఏ అర్ధరాత్రో అపరాత్రో ఎవరన్నా వొచ్చి నాలుగు తన్నినా, పొడిచి పారేసినా పలికే దిక్కు లేదు. ఒక్క చిన్న అగ్గిపెట్టె కోసం ఓపికగా వూళ్ళోకి రెండుమైళ్ళు నడవాలి. ఎవరికైనా జబ్బుచేస్తే వైద్య సౌకర్యం కూడా లేదు. చేయూతకి పిలిచినా ఇరుగూ పొరుగూ కూడా లేరు. వాళ్ళకి భగవాన్ వున్నారనే ఓదార్పు కొన్నాళ్ళు వుంది. కానీ ఆయన దేహం చాలించారు. పోనీ భగవాన్ ప్రభావం వుందంటే, అది వుందో లేదో అదీ వాళ్ళకి సందేహమే.

చుట్టూ సమస్యలూ చీకట్లూ. చుట్టూరా భయంకరంగా నోరు తెరుచుకున్న తిమింగలాలతో, గింగిరాలు తిరిగే సుడిగుండాలలో తుఫాను మధ్య సముద్రంలో పడవ ప్రయాణం. కరుణామయుడైన కర్ణధారి వున్నా తెలియని ప్రయాణం— ఎవరు వూహించ గలరు?

అలాంటి ప్రయాణంలో వారికి ఏనాడు "ఈ వూళ్ళో మన

మెందు కుండాలి? వెళ్ళి పోదాం" అనే మాటవారి నోటినించి రాలేదు. శే పేమవుతుం దన్న చింత వారికి ఏనాడూఅంకురించ లేదు. ఈశ్వ రుడు చెప్పినట్లుగా నడుస్తా మన్నారువాళ్లు.

పొయ్యి వెలిగించడం దగ్గరనించి అన్ని పనులు వాళ్ళకి ఈశ్వరుడే నేర్పించారు. వాళ్ళకి జీవితమే ఒక పెద్ద సాధనై పోయింది. వాళ్ళని ఆయన శిష్యులుగా తీసుకో లేదు. వాళ్ళు తమంత తాముగా ఈశ్వరుడికి తమని అప్పజెప్పు కున్నారు. ఆయన వాళ్ళకి ఏ వేదాం తమూ నేర్పలేదు. ఆయ నెలా చెబితే వా ళ్ళలా చెయ్యాల్సిందే. చెయ్యకపోవడమనే ప్రశ్న లేదు. ఏ గురువుకో సులభంగా పాదాలు చొత్తుతో స్తోత్రాలు చదవ వొచ్చు. వింజామరలు వీయవొచ్చు. కానీ క్షణ క్షణం తమ అహంకారాన్ని పూర్తిగా తీసేసుకు నడవడం చాలా కష్టం. పోనీ ఒక కార్యక్రమమూ, కాల నిర్ణయము వుంటే దానికి అలవాటు పడవొచ్చు.

మరు నిముషం ఏం జరుగుతుందో వాళ్ళకి తెలియదు. ఆహా! ఇది సంతోషం అనుకోవడానికి వీల్లేదు. ప్రక్కనే విరుచుకుపడే విషాదం .... ప్రమాదం. హమ్మయ్యా గండం గడిచి గట్టెక్కాం ఇంక భయం లేదనుకోవడానికి వీల్లేదు. ప్రక్కనే పొంచి వున్న ఏ కాలసర్పమో పడగ విప్పి మీదికి వురుకుతుంది. ఏదన్నా ఇది స్థిరం అనుకునేసరికి ఆ క్షణమే కాళ్ళ కింద నేల దొలుచుకుపోయి వున్న పళాన తలకిందు లయ్యే పరిస్థితి అది. అలాంటి రోజుల్లో వాళ్ళంతా ఈశ్వరాదేశ ప్రకారం నడిచారంటే అది వారిపై ఈశ్వరుడు చూపిన అనుగ్రహమే, ప్రత్యేకతే అనాలి. ఈశ్వరుడు మొగ్గల్ని విచ్చుకోక

ముందే తమ అనురాగపూరిత హస్తాలలోకి తీసుకుని, కరుణాపూర్ణ దృక్కులను ప్రసరించి పూర్ణ వికాసాన్నిచ్చి ధూళిలో రాలకండా నిలిపి కాపాడారు- అదే '**ఈశ్వర విలాసం**' వెలిగిన "**సౌరిస్ జీవితం**"

**ఆ. సూర్య నారాయణ**

రామానంద]



# సౌరిస్ జీవితం

## రెండవ భాగం

1951 వ సంవత్సరం ఆగష్టు పదిహేనవ తేదీన సౌరిస్‌కి ఈశ్వర సాక్షాత్కారం జరిగింది. అసహాయత్వంలో, అనారోగ్యంలో, ఆర్థిక దుర్బలత్వంలో దిక్కు తోచని- చలంగారిని తనలో విశ్వసించి తన ఆదేశం ప్రకారం నడుచుకుంటే అన్నింటి నించి రక్షించి అసలు దోవలో నడుపుతా మన్నారు ఈశ్వరుడు. చలం పరిపూర్ణ విశ్వాసంతో సౌరిస్ లోనించి పలికే ఈశ్వరశక్తికి తమని సమర్పణం చేసుకున్నారు. చలంగారితో బాటు చలంగారి కుమార్తె పకపక, పెంపుడు కూతుళ్ళు చిత్ర, నర్తకి, మనుమరాలు డాలీ ఈశ్వరుడ్ని విశ్వసించి నడువ సాగారు.

ప్రపంచంలో ఈశ్వరుడు వొచ్చి నడపడం ఎక్కడా జరుగలేదు. ఆయన వొచ్చిన మరు క్షణం నించి ప్రతి క్షణం ఒక మాహాత్మ్యం చేసి చూపించారు. నిజాలు అక్షరాలలో నిలిచినా విశ్వాసం నిలవడం కష్టం. కానీ అది చలంలో అచంచలంగా నిలిచింది. సాక్షాత్కారంతో సౌరిస్ వ్యక్తిత్వం నశించిపోయింది. అవ్యక్తమైన ఈశ్వర విలాసం సౌరిస్‌ని, చలంని నడిపింది,

### 1

ఆ సంవత్సరకాలం ఏం చేసినా (భోజనం చేస్తున్నా) ఈశ్వరుడు సౌరిస్‌లో నించి వెలుగుతూ వుండేవారు. పూర్తిగా ఆ ఏడాది పాటు చలం కుటుంబాన్ని నడిపారు ఆయన, నిర్వికల్పసమాధిలో వున్న షౌని స్పృహకి తెచ్చి సాధన చేయిస్తూ, అప్పట్లో షౌ నిరంతరం

నిర్వికల్ప సమాధిలో వుండేవారు. ఏ కదలికా లేకండా వుండేవారు. అది చూచీ చూడని స్థితి,వినీ వినబడని స్థితి, చూచినా సంబంధం లేని, మాటలు చెవిని బడినా సంబంధం లేని స్థితి అది. మాటల్లో చెప్పలేని మహత్తరావస్థ అది. అలాంటి స్థితిలో వున్న ఆమెని మేల్కొలిపి అందర్నీ నడిపింపజేసేవారు ఈశ్వరుడు. ఈశ్వరుడి మాటప్రకారం వాళ్ళంతా నడుచుకుంటామని చెప్పి ఆ విధంగా నడుచుకుంటున్నారు.

ఏడాది గడిచిపోయాక సౌరిన్‌నించి ఈశ్వరుడు సెలవు తీసుకుని వెళ్ళిన తరువాత మళ్ళీ భగవాన్ తప్ప ఆయన కనబడేవారు కాదు ఆమెకి. కానీ షౌ లోనించి మాట్లాడుతూనే వుండేవారు. ఎప్పుడో వ్యక్తిగా షౌ మాట్లాడేవారు, కానీ సాధారణంగా ఆయనే మాట్లాడే వారు. చలంగారికి, వారి కుటుంబీకులకీ మాట్లాడేది వ్యక్తిగా సౌరిసా ? సౌరిన్‌లో వెలిగే ఈశ్వరుడా ? అని సందేహం వొచ్చేది. అప్పుడు ఈశ్వరుడిని అడిగేవారు మీరేనా మాట్లాడింది : అని.

ఈశ్వరుడు తాను వొచ్చినట్లుగా ఎవరికీ చెప్పవద్దు అన్నారు, ముఖ్యంగా చలం కుటుంబానికి మిత్రుడు సూర్యనారాయణకి చెప్ప వద్దు అన్నారు. ఆ రోజుల్లో చలంగారి యింటి చుట్టుపక్కల ఎవరూ వుండేవారు కారు. భగవాన్ మహా నిర్యాణం పొందాక రమణనగర్ మొత్తం నిర్జన మయిపోయింది. అంతటి ఏకాంతంలో చలంగారు వాళ్ళకి ఈశ్వరుడు ఒక ప్రియ మిత్రుడై పోయినారు. సృష్ట్యాది నించి వంట వరకూ ఆ రోజుల్లో ఈశ్వరుడు తమకి బోధించిన పద్ధతిని సౌరిన్ తల్లి మాటల్లోనే విందాం.

"ఈశ్వరుడు వుంటున్న రోజుల్లో ముందరగానే నీకీ వేళ కల వొస్తుందని చెప్పేవారు దాన్ని గుర్తు పెట్టుకో అని.

ఒక రోజు కల: ఒక సన్యాసిని హిమాలయాలనించి చాలా ఏళ్ళకి తన వూరికి వొచ్చింది. వొచ్చి ఎవరి అరుగుమీదో కూచుంది. ఆ వూరి వారంతా ఆమె నెంతో గౌరవిస్తున్నారు.

ఆవిడ తన పూర్వపు సొంత ఇంటిని చూద్దామని బయల్దేరింది. ఆవిడ చాలా ఆస్తిపరులు. ఇళ్లూ వాకిళ్ళూ ఆస్తీ అంతా వొదిలేసి హిమాలయాలకి వెళ్ళి తపస్సు చేసి వొచ్చింది.

ఆమె ఇంటికి వెడుతుండగా దోవలో ఒక ఎద్దుబండి వొస్తోంది. ఆ ఎద్దుబండి నిండా పెద్ద పెద్ద బరువైన రాళ్ళు. తెల్లటి రథాల్లాంటి ఎడ్లు. అవి కూడా ఆ బరువుని లాగలేకపోతున్నాయి. ఆ బండివాడు వాటిని చావ బాదుతున్నాడు చెర్నాకోలతో. ఆవిడ అక్కడ నుంచుని బాధపడింది. అవి తన సొంత ఎడ్లు. దూడ లప్పటినించి వాటిని చాలా గారాబంగా పెంచింది. వాటిని ఆ దీనస్థితిలో చూసేసరికి ఆమె కదిలి పోయింది. మొట్టమొదటి మమత అంకురించింది ఆమెలో.

తన ఇంటి దగ్గరకి వెళ్ళింది. సరిగ్గా తన ఎదురుగా పోలీసుల గుంపు. ఆ గుంపు మధ్య సంకెళ్ళు పడ్డ తన ప్రియుడు. ఇంక సగం వరకు కదిలింది. ఇది రెండో మమత. కొంత సేపటికి ఆవిడకి చీటీ ప్రియుడి నించి, నువ్వు విడిపించకపోతే వాళ్ళు నన్ను ఉరి తీస్తారని. పూర్తిగా బంధంలో పడిపోయింది ఆమె. అదీ కల. మేలుకున్న తరు వాత ఈశ్వరుడు! చూశావా మమతా బంధాలు అట్టా వుంటాయి. 'నా' అనే ఆలోచనే ఒక బంధం, ఎప్పటి కప్పుడు జాగ్రత్తగా చూసుకుంటూ వుండాలి. 'నా' అని గట్టిగా నాటుకుపోయిందా ఏ సాధనలవల్లా ఏం లాభం లేదు, అని హెచ్చరించారు నన్ను. పైగా నేను కుటుంబంమధ్య సాధన చేయడం. అందులో నా కత్యంత ప్రియమైన నాన్నని శిక్ష

ణలో నడిపించాలి. అందుకని ఈశ్వరుడు ఎప్పటి కప్పుడు దెబ్బలు వేయకపోతే అవి సాధ్యం కాదు.

ఇంకొక కల : మేం డివోషన్‌లో వున్నాం. ఎక్కడినించో వొచ్చారు ఒక సన్యాసి. ముప్ఫైఅయిదేళ్లు వుంటాయి. చిన్నవారు. మంచి ఎరుపు, మాంచి విగ్రహ పుష్టి. గెడ్డమూ, గిరజాలు .... మంచి పెర్సనాలిటీ. నేను వొచ్చే ముందే నేను కూచోడానికి ఆసనాలు అవీ సిద్ధపరిచి భజనకి ముందు మంచినీళ్లూ అవీ పెట్టేవారు. నేను కాలు కదిపితే చాలు ఆయన సేవ చేసేవారు. ఆయన్ని సాధువుకింద చూస్తున్నాం. మాతోనే వుంటున్నా రాయన. నాన్న పడక్కుర్చీలో కూచున్నప్పుడు వెళ్ళి కూచుని "బాబూ బాబూ నా కేమన్నా చెప్పండి" అనేవారు. అంటే నాన్న ఏవో మాట్లాడేవాడు. ఆయన చేతులు కట్టుకు మట్టిలోనే కూచుని చాలా వినమ్రంగా శ్రద్ధగా వినేవారు, అప్పుడు ఆయన నాన్నకి కూడా ఈ కబుర్లూ, ఆ కబుర్లూ చెప్పేవారు. ఆయన మాట్లాడేది తెలుగు. పైగా శూద్రయాస.

అప్పట్లో 'సేవా' (ఇల్లు) లో లక్ష్మణయోగి, ఆయన తల్లి వున్నారు. ఆ తల్లి వాళ్లు మమ్మల్ని చూడ్డానికి వొచ్చారు. అప్పుడీ యోగి "నా ఆశ్రమాన్ని చూపిస్తాను రండి" అన్నారు. ఆ ఆశ్రమం పెద్ద అడివి మధ్య వుంది. ఆ ఆశ్రమం అంతా శిధిలావస్తలో వుంది. మేం వెళ్ళినప్పుడు ఎవ రెవరో సాధువులు తిరుగుతున్నారు. కానీ ఎవరూ దగ్గరకి రాలేదు. అప్పుడు లక్ష్మణయోగి తల్లిగారు "జ్ఞానం గురించి మా కొంచెం తెలపండి" అని అడిగా రాయన్ని. ఆయన మాతో వున్నా ఆయన్ని స్వామీ వగైరా అనడంలేదు మేం. ఆయన జ్ఞానం వొచ్చినరోజు చెయ్యి పైకెత్తితే ఎటు తిప్పినా ఆకాశ మవుతుంది. ఇంక ఆయన చెప్పుకుంటూ వొచ్చారు తన సంగతి.

నేనీ ఆశ్రమానికి వొచ్చినప్పుడు చాలా చిన్న కుర్రవాడ్ని. పదేళ్ళు వుంటాయేమో! అని స్వచ్ఛమైన బ్రాహ్మణోచ్చారణతో ఆరంభించారు.

అక్కడ అంతా వైదిక వాతావరణం. వటువు లంతా విద్యాభ్యాసం చేసే గురుకులం అది.

ఆయన చెపుతున్నారు "నేను ఒక్క అక్షరంముక్క నేర్చుకోకండా, శ్రద్ధ పట్టకండా అడివిలో చెట్లమీద కెక్కి కాయలుకోసి తినే వాడ్ని. తక్కిన పిల్లలనీ ఎక్కించే వాడ్ని. ఎంత గురువులు చెప్పినా శ్రద్ధపెట్టి వినేవాడ్ని కాదు.

ఒక రోజు సాయంత్రం నా అధ్యాపకులు నన్ను పిలిచి "ఒరేయ్ తిప్పకాయలా తిరుగుతున్నావు నువ్వు మరీ. ఇక్కడ భొత్తిగా భయభక్తులు లేకండా. వొచ్చినప్పటినించి ఒక్క అక్షరం ముక్క రాలేదు నీకు" అని ఒక పుస్తకం తీసుకొచ్చి ఇదుగో ఈ వాక్యం రేప్పొద్దునకల్లా అప్పజెప్పకపోతే నిన్ను చంపేస్తానని బెదిరించారు. అదేమిటి ఆ వాక్యం ప్రథమంగా నేర్పించే "ఓం నమః శివాయః సిద్ధం నమః", అది ఒకసారి చదివి చెప్పి వెళ్ళిపోయారు. ఒక దీపం దగ్గర వొణుక్కుంటూ వొంటరిగా కూచున్నాను, బిక్కు బిక్కు మంటూ. అందరూ నిద్రపోతున్నారు, అడివంతా నిశ్శబ్దం. లోపల్నించి భయం. తెల్లవారితే అధ్యాపకులు నన్ను చంపేస్తారని. వల్లెన వేసుకుంటున్నాను. వేయగా వేయగా తటుక్కు మని ఆ వాక్యమేమిటో స్ఫురించింది. అది శివ పంచాక్షరి. ఇంక ఆ జపం నాలో అది ఆగకండా పెద్ద జపంగా అయిపోయింది. ఇంక కళ్ళు మూతలు పడిపోయినాయి. ఇంక ఆ జపం నాలో నిర్విఘ్నంగా సాగిపోతోంది. ఆ తరవాత జపం ఆగిపోయి నిశ్శబ్దం. కళ్ళు మూతలు పడిపోయాయి.

తెల్లారి సూర్యు డుదయిస్తున్నప్పుడు కళ్ళు తెరిచాను. భయం మాయమై పోయింది. అన్నీ మాయమై పోయాయి. ఏమీ లేదు. అట్లాగే కూచున్నాను. ఇంతలోకి తెల్లవారిం దని నా గురువు కర్ర తెచ్చుకు వొచ్చారు, చదివారా ? లేదా ? అంటూ,

నాలో చలనం లేదు. దగ్గరకి సమీపించి నా ముఖం చూసి అమాంతం నా పాదాల మీద పడిపోయారు- అని చెప్పారు. అట్లా భయంవొల్ల కూడా జ్ఞానం సంభవిస్తుంది. రేపు తెల్లారి ఇంక నేను వుండను అన్న యోచన పుట్టినప్పుడు తప్పకండా జ్ఞానం పుట్టుకొస్తుంది - అని ఆయన చెప్పారు.

సాయంత్రం వరకూ మే మక్కడే వున్నాం. ఆ ఆశ్రమానికి ఆయనే అసలైన ఆధ్యాత్మ గురువు. కానీ ఆశ్రమానికి వొచ్చినప్పుడు ఎవరు గురువుగా వున్నారో ఆయన వృద్ధులు, రోజు సాయంత్రం గురుపూజ జరుగుతుంది. ఆశ్రమ గురువు పాదాలకి పూజ జరుగుతుంది. చాలా వృద్ధు లాయన, కానీ ఆధ్యాత్మిక గురువు ఈయనే. ఆశ్రమ గురువు జ్ఞాని కాదు. అందరూ ఆయన పాదాలకి నమస్కారం చేస్తున్నారు. ఈయన వెళ్ళి నమస్కారం చేశారు తాను జ్ఞానిఐనా. వారు శిష్యుడికి ప్రతి నమస్కారం చేశారు.

ఆ తరవాత మేం భగవాన్ ఆశ్రమానికి వెళ్ళాం. ప్రస్తుతం హాలు ఆనాటి కలలో కనపడింది, అందరూ మా ఇద్దరివేపూ తిరిగి భగవాన్ (సమాధి) కి వీపులు తిప్పేసి మాకు నమస్కారాలు చేశారు. అప్పు డాయన "వొద్దు మాకు చేయకండి. సమాధికి చెయ్యాలి" అన్నారు. ఆయన అట్లా మాట్లాడుతోండగా ఆయన ఈశ్వరు డని తెలిసింది.

కల వుద్దేశ్యమే నమ్రత. అంత మహాశివు డైనవాడు వొచ్చి ఒక మామూలు మనిషిలా నాకు శుశ్రూష చేయడం. రెండోది భయం వల్ల జ్ఞానం కలగడం. మూడోది ఎంతటి మహాజ్ఞానైనా గురువుముందు వినమ్రు డనేది. నాలగవది దేహధారైనా, జ్ఞానైనా, అశరీరులైన జ్ఞానిముందు నమ్రు లనేది. అయిదోది భగవాన్ బాలసుబ్రహ్మణ్య అవతారం. తండ్రికి ఆయన గురు వైనారు, కనక అక్కడ కూడా ఆ న్యాయం అంటే నమ్రతని ప్రదర్శించారు.

ఎన్ని విషయాల మీదనో మాట్లాడేవారు ఈశ్వరుడు. పిల్లలంతా ఆయన ఎట్లా చెబితే అట్లా నడుచుకునేవారు- వాళ్లా వాళ్ళ ప్రశ్నలు మరీ విడ్డూరంగా వుండేవి. "షా ఇవాళ ఎండ వొస్తుందో లేదో ఈశ్వరుడి నడుగు, మేం బట్టలు ఆరవేసుకోవాలి, అని కూడా అడిగే వారు. షాకి మాత్రం విసు గనిపించేది. ఈ దశలో షాలో వ్యక్తిత్వం తాలూకు ఆభాస (నీడ) మాత్రం అయిన స్పృహ కనిపిస్తుంది, ఏ గొప్ప విషయ మన్నా ఈశ్వరుడ్ని అడగవచ్చును గానీ ఇంత తేలిక విషయాలు అడగడమా ? అని ఆమెకి అనిపించేది. ఆమీద ఈశ్వరుడు కల్పించుకుని షాతో చెప్పేవారు "నాకు గొప్ప విషయమూ, తేలిక విషయమూ అంటూ తేడా లేదు, అన్నీ నా దృష్టిలో ఒకటే. వాళ్ళకి చెప్పు, ఎండ వొస్తుంది. బట్టలు ఆరవేసుకోవచ్చునని. వాళ్ళకి ఆ పట్టు వుండడం ఎంతో గొప్ప సంగతి. అటువంటి విశ్వాసం చాలాముఖ్యం" అని. ఇక వ్యక్తిత్వ స్పృహ, ఛాయామాత్రంగా నిలిచిన సౌరిస్, సంకల్పం అన్నది పూర్తిగా చెరిగిపోతున్న సౌరిస్— ఎదుట మాటా డక ఈశ్వరాజ్ఞానువరులై సంచరించేవారు.

ఇంక ఇంట్లో ప్రతీ విషయం ఆడా, మొగా తేడా లేకుండా సాధారణ సమస్యలనించి సంకీర్ణ (complicated) సమస్యలదాకా అన్నీ ఈశ్వరుడే తీసుకుని నడిపేవారు.

"నేనీ నాడు చెప్పేదీ రాసేదీ ఈశ్వరుడి సంగతి. ఎన్నడూ మానవుడి చరిత్రలో ఏ యుగంలోనూ అవతారంలోనూ ఏ పురుషులకీ ప్రవక్తలకీ, యోగులకీ జరగని సంగతి మా కుటుంబములో జరుగుతోంది. ఈనాడు మా కుటుంబముతో పాటు మాతో ఈశ్వరుడు నివసిస్తో మమ్మల్ని ఆధ్యాత్మికాను భవం వైపు సాధన చేయించడమే కాక, మాతో అన్ని కష్టసుఖాలూ ప్రతినిమిషం పంచుకోవడము, ఇవి ఆయన్ని అంటుతూన్నాయని కాదు. మరి ఈశ్వరుడు అంటే అంతేకదా. ప్రతి చిన్న పురుగుతో, రాయితో కలసి అనుభవించే వాడే కదా!" (చిన్నారావుగారికి చలం లేఖ 1-4-52)

ఇక అసలు కథకి వద్దాం. అరుణాచలం వచ్చే నాటికి చిత్ర. నర్తకి, పకపక, డాలీ అంతా చిన్న పిల్లలు. అనుభవం లేనివాళ్ళు. ఏ పనులూ చేత కానివాళ్ళు. సౌరిస్ మొదటనుంచి ఎదో నిరాసక్త భావనతో, ప్రపంచాన్ని అంటకండా సాక్షి మాత్రంగా సంచరించేవారు. భగవాన్ దయవలన ఆత్మపథానికి నడిచారు. మిగిలిన వాళ్ళో అభమూ శుభమూ తెలియని ఆడపిల్లలు. అమ్మకి మతి స్థిమితం లేదు. దాంతో వంటపని, బజారుపని అంతా ఆడపిల్లల మీదే పడింది. పాపం వంట మాటటుంచి, వంటిల్లు సర్దుకోవడం కూడా వాళ్ళకి బొత్తిగా రాదు, ఇంక ఈశ్వరుడు ఎంతోదయగా వాళ్ళని నడిపి శిక్షణ ఇచ్చారు.

ముందుగా వంటిల్లు శుభ్రంగా వుంచుకోవడం, సర్దుకోవడం అంతా దగ్గరుండి డిమాన్‌స్ట్రేట్ చేసి చూపించారు. వాళ్ళని **Inspire** చేయడానికని, వంట కూడా సాధారణ విషయం కాదని తెలియ చెప్పడానికి "ఈశ్వరుడు చూడండి వంట గొప్పకళ **(art)**. ఏ కళ అర్థం కాకపోయినా ఇది అందరికీ అర్థం అవుతుంది. అందరికీ అవసరం అయిన గొప్ప కళ. ప్రపంచమంతా ఈశ్వరుడు ఎవరికీ కనిపించక

పోయినా ఇక్కడ భోజనంలో రుచివల్ల ఈశ్వరుడున్నాడని తెలుస్తుంది" అని చెప్పి వాళ్ళలో ఉత్సాహాన్ని కల్పించారు. చలం కుటుంబీకులకి పూర్వం అంటే అరుణచలానికి రాకముందు ఏం తింటున్నా మనే ధ్యాస ఉండేది కాదు. ఏ వంటవాళ్ళు వండిపెట్టినదో, ఏ హోటలు నించి వచ్చిన భోజనమో, ఏ ప్రశ్నా లేకండా తినే వారు. వాళ్ళ దృష్టల్లా ఆ తిండి వాళ్ళ ఒంటికి పడుతుందా, లేదా అన్నది చూచు కోవడం మాత్రమే.

అపార కరుణా సాగరుడైన ఈశ్వరుడు ఇప్పుడు వాళ్ళకి తిరగ మోతల దగ్గరనించి ప్రతిదీ నేర్పించసాగారు. తను చెప్పినట్లు కాక ఏ మాత్రం తప్పు చేసినా సహించేవారు కాదు. భగవాన్ దగ్గర ఆశ్ర మంలో వుండి సేవించుకున్న స్త్రీలనించి జ్ఞాపకాలు సేకరించి వంటింట్లో భగవాన్' రాస్తున్న రోజుల్లో చలంగారికి తెలిసింది. భగవాన్ కూడా వంటింట్లో ఈశ్వరుడి లాగానే దగ్గరుండి ఏ పని ఎలా చేయాలో శిక్షణ ఇచ్చేవారని. సమయాసమయాలని బట్టి మృదువుగా, కఠినంగా మాటాడి వాళ్ళని వెలుగులోకి నడిపించేవా రని.

లోగడ చలంగా రింట్లో భోజనానికి చాలా ఎక్కువ పదార్థాలూ, వంటకాలూ చేసుకునే వారు. ప్రస్తుతం ఈశ్వరుడి ఆజ్ఞప్రకారం తయా రవుతున్నవి రెండే పదార్థాలు. ఉదయానికి కిచిడి. సాయంత్రా నికి ఇడ్లీలు. నిత్యమూ అవే. కానీ అవి ఎంత రుచిగా వుండేవో, దాంతో వాళ్ళు **monotonous** గా **feel** అయ్యేవాళ్ళు కాదు. నిత్యమూ తిన్నా మొగం మొత్తని గొప్పరుచి కుదిరేది. ఎప్పుడన్నా అన్నం పెట్టినట్టయితే ఇడ్లీ యే కావాలని గోలచేసేది డాలీ. తరువాత తరువాత ఇంకెన్నో వంటలు చేయించేవారు. ఈశ్వరుడు చేయించే వంట అంతా పత్యపు వంట. కొన్ని తెలుగు బ్రాహ్మణ వంట లిక్కడ లేవు. ఈశ్వ

రుడు చలంగార్ని పులుపు, కారాలు లేకండా పత్యపు భోజనం చేయ మన్నారు. అంచాత అవి లేకండా రుచిగా ఎలా వండటమో ఈశ్వరుడే చెప్పారు. కొబ్బరినూనెతో వంట చేయించే వారు. ఆ కొబ్బరి నూనె వాసన తెలియకుండా కొంచెం నిమ్మరసం వెయ్య మన్నారు. అట్లాగే భగవాన్ కూడా అనేవారు. నిమ్మరసం వేస్తే అది ఏ నూనెతో చేసిన వంటకమో తెలియ దని,

పులుసు వేసే కూరలలో చింతపండు బదులు నిమ్మరసం వేయించేవారు. పచ్చళ్ళలో అనార్‌దానా (దానిమ్మ గింజలు) మామిడి వరుగు, కోక్కుము వేయించేవారు. కొండగడ్డి తెప్పించి, ఆ గడ్డిలో చాలా విశేషగుణం వుందని చెప్పి దాంతో 'టీ' చేయించేవారు. అప్పట్లో గోధుమ, ధనియం వేయించి పొడిచేసి కాఫీ చేసేవారు నర్తకి వాళ్లు. శనగపిండి నిషిద్ధం కనక పెసరతోనే బజ్జీలు, పకోడీలు చేయించే వారు.

ఆ వంటకి మును పెన్నడూ రాని గొప్ప రుచీ, ప్రత్యేకతా వచ్చేవి. అది ఇక్కడే కాదు. ప్రతి ఆశ్రమంలోనూ కనిపిస్తుంది ఆ ప్రత్యేకత. ఎందుకంటే పావనమైన ఈశ్వరీయ చైతన్యం భోజనానికి పట్టి ఆ భోజనాన్ని అత్యంత రుచికరం గావిస్తుంది. భగవాన్ ఆశ్రమంలో భోజనం చేశాకనే తెలిసింది చలంగారూ వాళ్ళకి, కాయగూరల్తో కూడా భోజనం రుచికరంగా తయారు కాగల దని. భగవాన్ ఆశ్రమంలో వంటకాల్లో మసాలాలతోబాటు బాదం, పిస్తా ఇత్యాదికాలు నూరి మరీ వేసేవారు. కానీ ఈశ్వరనిర్దేశంలో నడిచే చలంగారి వంటింటిలో బాదం, పిస్తా, మసాలాలూ ఏవీ లేకండానే గొప్ప రుచి వచ్చేది. అదీగాక ఆ తిండి వాళ్ళకి వొంటబట్టి ఒక ఆహ్లాదాన్నీ, సంతృప్తినీ ఇచ్చేది.

అప్పట్లో నర్తకి వంట చేసేది. ఆమెకి తోడుపడేది పకపక. చిత్ర బజారు వెళ్ళి అవసరమైన సరుకులూ, కూరలూ తెచ్చేది. ఏది ఎట్లా చేయాలో తనలోంచి ఈశ్వరుడు చెబితే ఆ ప్రకారం వాళ్ళందరికీ **direction** ఇచ్చేవారు షౌ. అప్పట్లో చలంగారి కుటుంబీకులంతా ఒకేసారి చుట్టూరా కూచుని ఎనామిల్ పళ్ళాల్లో భోజనం చేసేవాళ్ళు.

ఆ రోజుల్లో చెబుతూ ఉండే వారు ఈశ్వరుడు "ఎంతో మంది మిమ్మల్ని వెతుక్కుంటూ వస్తారు. షౌ చుట్టూ ఎంతో మంది ఉంటారు" అని. చలంగారు అనే వారు "వొద్దు ఈశ్వరా! మీరు మా వంటింటి భగవాన్‌గానే వుండాలి" అని.

ఆ తరువాత దీపోత్సవం నాడు షౌలో ఓ వెలుగు వెలిగి అందులో ఐక్యం అయి పోతుంది అని ఈశ్వరుడు చెప్పారు. (ఐక్యం ఆయ్యేది మనస్సు. వెలుగుగా వెలిగే ఆత్మలో, మనస్సుని హృదయంలో నిలపటమే మహాయోగం అంటుంది భగవద్గీత.)

దీపోత్సవం రానే వచ్చింది. పాపం పకపక అదేదో పెద్ద వెలుగు కనబడు తుందని ఆశించి నట్లుంది. ఇది షౌ లోని వెలుగు. లోకాని కెలా కనబడు తుంది. తనలోని వెలుగులో 'తాను'గా నిలిచిన వ్యక్తిత్వపు చివరి చిన్నె కలిసిపోయి సౌరిస్ వ్యక్తిత్వం లేని అవ్యక్త పరమాత్మగా సంచరించు తుందన్న మాట. ఆ రోజుల్లో షౌ ఇంటి నంతటినీ ఈశ్వరశక్తితో నడుపుతూ వున్నాగానీ అధికభాగం తన గదిలో ఒళ్ళు తెలీని సమాధిలో వుండేవారు.

"సౌరిస్ భోజనానికి తప్ప గదిలోంచి బైటికి రావడం లేదు. నన్ను విడిచి పెట్టలేదు ఈశ్వరుడు; ఈ లోపల సులభమైన ఇంకో యోగంచేస్తో వుండమన్నారు. సౌరిస్ వుత్త మజ్జిగఅన్నం తింటోంది."

(దీక్షితులుగారికి చలం లేఖ 20-5-52)

సాయంత్రాలు మాత్రం కొద్దిసేపు బైటికి వచ్చి తిరిగే వారు. ఆ రోజుల్లో ఈశ్వర సాక్షాత్కారం అయినాగానీ షాలో కొంత తన దయిన **personality** వుండేది. ఇది తాను అనుభవిస్తున్నాను, చేస్తున్నాను అని తెలిసీ తెలియని స్పృహలో వుండేవారు. అదెంత ఆనందమో. అసలు **personality** అనే సరికే ఇరుకు. కానీ విరాట్పురుషత్వం ఆవహించిన వ్యక్తిత్వం వ్యక్తిత్వ స్పృహ ఛాయామాత్రంగా నిలిచిన వ్యక్తిత్వం- ఈ వ్యక్తిత్వం అత్యంత విస్తీర్ణం అయింది. లోపలంతా దేహానికి పరిమితి లేకండా విస్తీర్ణం అయిపోయి, ఎంత తేలిక పడిపోయి, ఎంత హాయో! ఏ బాధ వచ్చినా అది పై సంగతి గానే కనిపించే స్థితి అది. అన్ని ఇంద్రియాలూ ఎంతో పూర్ణంగా అనుభవించ గలిగేవి ఆ స్థితిలో. ఆమెకి సృష్టిలో ప్రత్యణువూ నృత్యం చేస్తూ ఆనందంలో స్పందిస్తున్నట్లు కనపడేది. ఏ దివ్య సంగీతాలో ఆమె చెవికి వినపడేవి, ఏ లోకాల మహత్సౌందర్యాలో ఆమె కళ్ళకి (చర్మ నేత్రాలు కావు) కనిపించేవి. ఒక్కోసారి వేణు గానం వినబడేది. ఎన్ని రంగులో ఎదురుగుండా. అదంతా గొప్ప అనుభవం ఆమెకి, ఎక్కడికో ఆత్మ ఎగిరి వెళ్ళిపోయి తిరిగి వచ్చేది. అది **intensified bliss** తో వెలిగిపోయే స్థితి. వర్ణనాతీతం. ఎంత ఆనందమో. కాని "ఈ స్థితినించి ఏమీ తెలియని స్థితికి పోతావు" అన్నారు ఈశ్వరుడు. ఈ స్థితిలోని దివ్యానందాన్ని వదులుకొని ఎందుకు ఏమీ తెలియని స్థితికి పోవడం అనిపించేది షాకి. అప్పటికి ఆమె నలభై దినాల వుపవాసం పూర్తయింది.

"విజయదశమి నించి సారిన్ ఆహారం మానేసి తన గదిలోనే కూచుంటోంది. రోజుకి ఓసారి బైటికి పొస్తుంది. ఇప్పుడు మంచినీళ్ళే తాగుతోంది. అదికూడా త్వరలో మానేస్తుందిట."

(దీక్షితులుగారికి చలం లేఖ 13-10-52)

అంతకు ముందే ఆమె హృదయంలో వెలుగుని చూస్తున్నారు. అదే ఆత్మ సాక్షాత్కారం. అప్పుడు ఈశ్వరుడు, భగవాన్ ఆమెకి చెప్పినట్లుగానే ఆమె తనలోని ఆ వెలుగులో లయమై పోయారు. పక పక ఒకటే గోల ఈశ్వరుడు చెప్పినట్లుగా జరగలే దని. కానీ షౌలో జరగవలసిన దంతా జరిగింది.

ఒక్క 'చే'కి వుత్తరాలు రాసేవారు షౌ అప్పట్లో. ఈశ్వరుడు అందుకు అనుమతించారు. తరువాత చలం కుటుంబీకుల్ని షౌ లోనించి నడిపించే వారు ఈశ్వరుడు. ఒక్కొక్కప్పుడు వాళ్లు తమ చెడుకర్మని అనుభవించబోతున్నారని షౌకి స్పష్టంగా తెలిసేది. అలాంటప్పుడు ఈశ్వరుడు వాళ్ళమీద నిష్కారణంగా కోపపడ మనేవారు. కానీ అంతవరకూ తండ్రిని తండ్రిగా చూచుకొన్న షౌ చిన్నవాడిని కేకలు వేసినట్టు ఆయనని ఎట్లా కేకలు వెయ్యగలరు? తన వ్యక్తిత్వం, సంకల్పం వున్నప్పుడు షౌ ఈశ్వరుడితో పోట్లాడే వారు. కానీ ప్రస్తుతానికి ఆ వ్యక్తిత్వం రమారమి అదృశ్యం అయిపోయింది. సంకల్పం అన్నది పూర్తిగా పోయింది, అందువల్ల షౌ ప్రమేయం లేకండానే వాళ్ళకి చివాట్లు తగిలేవి, ముఖ్యంగా చలంగారికి. ఆయన తలవంచి అన్నీ భరించేవారు. ఒక్క చలంగారిలో, డాలీలో తప్ప తక్కిన వారిలో తిరుగుబాటు లేచేది. ఈశ్వరుడు వాళ్ళ నేమీ నిర్బంధించలేదు. వాళ్ళు ఆయన చెప్పినట్లు వింటా మంటేనే వాళ్ళని తీసుకున్నారు. కొంతసేపటికి వాళ్ళంతట వాళ్ళే వాళ్ళ తిరుగుబాటుకు దూరమైపోయి తమని మళ్ళీ ఆయనకి వొప్పచెప్పుకునే వారు. "మేం మీ మాట వింటాం. మమ్మల్ని అట్లాగే నడపండి" అంటూ. ఎందుకంటే ఈశ్వరుడికి వాళ్ళంతట వాళ్ళే అప్పజెప్పు కున్నారు. వాళ్లు ఈశ్వరుడు చెప్పినట్లుగా వినే వాళ్లు.

సౌరిస్‌కి ఈశ్వరుడి చెప్పుచేతలలో నడవటం మొట్టమొదట కొంత కష్టంగా వుండేది. షా భగవాన్‌ని తన గురువుగా స్వీకరించారు. ఎవరూ, ఎన్నడూ జీవితంలో ఆమెని ఇది చెయ్యి, అది చెయ్యి అనే వారు కాదు. ఈశ్వరుడు చెప్పినట్లు ప్రతి నిమిషమూ obey చేయాల్సి వచ్చేది. ఆమెకి ఒకరు చెప్పినట్టు ప్రతి దాన్ని obey చెయ్యడ మనేది ఇదే మొదలు. ఏ మాత్రం తేడా వచ్చినా దాన్ని సవరించు కునేది. ఒక వేళ షా వినకపోతే ఈశ్వరుడు నిర్బంధించేది లేదు. కానీ తనంతట తానే షా ఆయన చెప్పినట్లుగానే వినేవారు. ఇంట్లో వాళ్ళంతా ఆయన చెప్పినట్లుగా వినేవారు. సౌరిస్‌కి ఈశ్వరాజ్ఞ ఏమంటే "వాళ్ళు విసుక్కున్నా, కోపం చేసినా, ఏం చేసినా నేను చెబితే నువ్వు వాళ్ళని నడుప వలసిందే.

నా ఆజ్ఞ ప్రకారం నడిపించాల్సిందే. నేను వచ్చిన సంగతి ఎవరికీ తెలుప వద్దు. కానీ వాళ్ళు నమ్మక పోయినా, నీ మొహాన వుమ్మి వేసినా, తెలుపవలసిన వాళ్ళకి తెలుపవలసిందే. తెలుప వద్దు అంటే తెలుపకుండా వుండాల్సిందే" అని ఈశ్వరుడు షాతో అన్నారు.

ఒక్కొక్కసారి సౌరిస్‌కి అనిపించేది. ఆ సాధ నేదో తనని చేసుకోనీక ఈశ్వరుడు వీళ్ళ నెందుకు తనకి అర్పించాలనీ, వాళ్ళ నెందుకు బాధ పెట్టడమనీ. ఎందుకు వాళ్ళని ఆజ్ఞాపించాలి అని అని పించి ఈశ్వరుడ్ని వేడుకునే వారు. మోజెస్ కూడా అట్లానే వేడుకునే వాడు. కానీ అతనికి వేలాది మందిని నడిపించ మని అప్ప చెప్పారు ప్రభువు. అత డెలా భరించాడో గానీ సౌరిస్‌కి తనకి అప్పజెప్పిన అయిదారుగుర్ని నడిపించటం కష్ట మనిపించేది.

అసలు వస్తుతః షో ఎన్నడూగూడా తాను పెద్దదాన్నని చిన్న వాళ్ళమీద ఇది చెయ్యి, అది చెయ్యి అని అధికారం చెయ్యలేదు. తన తల్లితండ్రులని కూడా ఎన్నడూ ఆంక్ష పెట్టలేదు. ఎప్పుడూ ఏదీ అంటకుండా తన దోవని తానుగా వుండడం ఆమెకి సంతోషం. అంటే అది స్వార్థంవల్ల కాదు. ఎవరికి ఎవరూ ఏమీ చేయ లేరని ఆమె ఉద్దేశ్యం. అదీగాక ఇంకొకరి విషయాలలో జోక్యం చేసుకోవడమంత మూర్ఖత్వం వేరే లేదని ఆమె అభిప్రాయం. అంతేకాక ఏది మంచో, చెడో తన వరకూ తనకే తెలియదు. ఇతరుల కెలా చెప్ప గలరు? ఎవరన్నా వచ్చి నా కిట్లా తోస్తోంది. నువ్వేమంటావు అని అడిగితే ఆ విషయంలో మంచీ, చెడూ వివరించేవారు. అట్లానే ఎవరయినా బాధపడుతుంటే, కష్టాల్లో వుంటే భగవాన్ తన జీవితంలో అడుగు పెట్టాక వారి కర్మం అనుకునే వారు. కర్మ అనుభవించవలసిందే ననీ, అది తప్పదనీ, జరగాల్సింది జరిగి తీరవలసిందే అన్న **conception** (దృష్టి) తో ఉండేవారు ఆమె. కానీ ఈశ్వరుడు వచ్చాక కర్మ ఈశ్వరుడి కన్నా ఘనం కాదనీ, ఈశ్వరుడు కర్మని తప్పించగలరనీ, ఎవరంతట వారు కర్మ చేసినప్పుడు కర్మ అనుభవించాలనీ, కానీ ఈశ్వరుడు నడిపినప్పుడు ఆ కర్మ అంటదనీ ఆమెకి స్పష్టం అయింది. ఎప్పుడన్నా చలంగారు ఈ బాధ లన్నిటికీ కారణం ఏమిటి?'' అని అడిగితే —''అది వాళ్ళు చేసిన కర్మ. అది అనుభవించక తప్పదు. నా ప్రకారం నడిచారా బాధలు లేకండా చేస్తాను. మీరు నేను చెప్పినట్లు నడవండి. నేను చూస్తాను'' అనేవారు ఈశ్వరుడు. దాంతో ప్రతీ విషయం సౌరిస్‌కి, సౌరిస్ ద్వారా ఈశ్వరుడికి చలంగారు చెప్పేవారు. ఇం కేముంది, జ్వరం వచ్చినా, ఏం వచ్చినా అంతా ఈశ్వరుడే చూచుకునేవారు.

ఒకసారి డాలీకి జ్వరం వచ్చినప్పుడు అర్ధరాత్రి లేచి విభూతి వేయమన్నారు షౌని ఈశ్వరుడు, అంత గొప్ప సమాధిలోని ఆనందం నించి కదలడం ఎంతో ఇబ్బంది అనిపించిం దామెకి. అప్పుడు ఆయన "చూడూ! సన్యాసం అంటే అన్నింటినీ విడిచిపెట్టే వైరాగ్యం కాదు. ప్రపంచాన్ని అంటకుండా ప్రేమగా కావిలించుకోవడమే సన్యాసం" అన్నారు. సరిగ్గా ఆ మాటలనే తరువాత భగవాన్ సూక్తుల్లో చదివారు షౌ.

నలభై రోజుల ఉపవాసం అయిన తరువాత షౌని ఈ ప్రపంచాన్ని త్యజించమన్నారు ఈశ్వరుడు. మొట్టమొదట షౌకి ఏదయినా ఒళ్ళు బాగా లేకపోతే విభూతి వేసుకో మనేవారు. చిన్నప్పుడు చలి, చెమటలనించి రక్షణగా పౌడరు వేసుకునే వారు. పౌడరు మానెయ్యమన్నారు, పౌడరు వేసుకోవడం మానేసి షౌ చెమటతో ఇబ్బంది పడుతుంటే దాని బదులు విభూతిని పూసుకో మన్నారు. విభూతి, బొట్టు ఎలా పెట్టుకోవాలో instructions ఇచ్చారు. ఒక్కొక్కరికి ఒక్కొక్క చిహ్నం ఇస్తారు- గురువులు. షౌని ఈశ్వరుడే గురువుగా నడిపారు కదా!

బెజవాడలో వున్న రోజుల్లో భగవాన్ ఆశ్రమం కుంకుమ ఎఱ్ఱగా చాలా బాగా వుండేది. అంచాత ఎప్పుడన్నా ఓసారి ఆ కుంకాన్ని పెట్టుకునేవారు షౌ. కుంకాన్ని షౌ పెట్టుకున్నప్పుడు చూసిన మంత్రవాది లక్ష్మిగారు "ఎంతో బాగుందమ్మా షౌగారు మీ కా బొట్టు" అన్నారు. "ఇది ఆశ్రమం కుంకం. ఆ ఎరుపు నాకు ఇష్టం" అన్నారు షౌ. ఆవిడ "నేను కుంకుమ చేసి పంపితే పెట్టుకుంటారా" అని అడిగి కుంకుమచేసి ఒక పాండ్స్ జార్ నిండా పంపించారు. లక్ష్మిగారే ఆనాటి నించి ఇప్పటిదాకా కుంకుమ పంపు తున్నారు. ఇది

వరకు బైటికి వెడుతుంటే బొట్టు పెట్టుకునేవారు షా. ఇంక ఈశ్వరుడు రోజూ బొట్టు పెట్టుకోవాల్సిందే అని ఆజ్ఞాపించారు. ఇదివరలో ఇంత పెద్దబొట్టు పెట్టుకునేవారు కాదు షా. ఈశ్వరుడు బొటనవ్రేలితో పెట్టి చూపించారు. షా కల్లా చిత్ర, నర్తకి నవ్వుతా రని. కానీ వాళ్ళు ఆ బొట్టు చాలా బాగా వుందని అన్నారు. ఇంట్లో ఎవరికి ఒంట్లో బాగా లేకపోయినా విభూతి వేయించేవారు. ఆయన ఆజ్ఞ ఏమంటే ఎవరడిగినా విభూతి ఇవ్వనని షా నించి రాకూడదని క్రిష్టియన్స్‌లో యూకెరిస్ట్ (బ్రెడ్ అండ్ వైన్) లాంటిది ఈశ్వర విభూతి. మొదట్లో విభూతి ఇస్తూ "ఓం నమో జగదీశాయ" అన్న నామం అన మన్నారు ఈశ్వరుడు. కొన్నాళ్ళు అలాగే వుచ్ఛరించే వారు షా. తరువాత "ఓం నమో భగవతే శ్రీ రమణాయ" అన మన్నారు. అసలు వున్న వస్తువు లోంచి Project అయ్యేవి విభూతులు. సూర్యుడని ఎట్లా తెలుస్తోంది.? కిరణాల వల్లనే కదా! అట్లానే ఈశ్వర సంకేతాలు విభూతులు. అందుకే ఈశ్వరుడు షాని విభూతి విషయంలో పట్టుపట్టింది. ఆ మీద జుట్టు పెంచుకో మన్నారు. దానిని బంధించ వద్దు అన్నారు. ఆ రోజుల్లో మూడుసార్లు చన్నీళ్ళతో శిరస్నానం చేసేవారు వేడి భరించలేక షా. తెల్ల బట్టలే కట్టుకో మన్నారు. 'ఇది సన్యాసమా?' అని ప్రశ్నించారు షా. అదేమీ కా దన్నారు ఈశ్వరుడు. భగవాన్ తెల్లని కౌపీనం వుపయోగించేవారు. అందువల్లనే షాని తెల్లబట్టలు కట్టుకో మన్నారేమో ఈశ్వరుడు- "ఇది సన్యాసం కాదు. సర్వాన్నీ త్యజించటం" అన్నారు ఈశ్వరుడు. "మరి వీటన్నిటినీ నేనెందుకు చెయ్యాలి?" అని అడిగారు షా. విభూతి, జుట్టు పెంపుదల, తెల్లబట్టలు, ఆశీర్వాదాలు, నమస్కారాలు మొదలైన మత విషయిక బాహ్యాడంబరం షాకి చాలా అయిష్టం. ఈశ్వరుడు చెప్పారు: "ఇవన్నీ ప్రజలకి తెలియ

డానికి. నీ స్థితి తెలిసికూడా వాళ్ళు నిన్ను దుష్టంగా తలుచుకుంటే వాళ్ళదే పాపం, తెలియకుండా తలుచుకున్నా పాపమే. కానీ అందుకని వారికి తెలిసేందుకు, వారా పాపంలో పడకుండా వుండడానికే ఇవన్నీ." అని వివరించేవారు.

యోగం సాగించే రోజుల్లో షౌ చీర కట్టుకునే వారు కాదు. ఒక పావడా, దాని మీద ఒకషర్టు వేసుకునేవారు. మీద ఏదయినా కప్పుకునే వారు. చాలా ఏళ్ళు అదే డ్రస్ వేసుకునేవారు. 1960 ఆగస్టు 15కి కృష్ణారావుగారు తెల్లని జరీచీర తెచ్చి సౌరిస్‌కి **present** చేశారు. సాధన తరువాత ఆ చీరనే మొదటిసారిగా కట్టు కున్నారు షౌ. అప్పటి నించి షౌ చీరలే కట్టుకోవడం మొదలు పెట్టారు.

అప్పట్లో ఈశ్వరుడు చిన్న కీటకం దృష్టిలో ఈ లోకం ఎట్లా కనిపిస్తుందో, అది ఎలా ఆనందాన్ని అనుభవిస్తుందో, అన్నీ దాని దృష్టిలోంచి ఎలా చూస్తుందో చెప్పేవారు .చెట్టులో ప్రాణచైతన్యం ఎలా పనిచేస్తుందో, దాని ఆహారం ఎలా తయారు అవుతుందో. కొమ్మ కొమ్మా ఆకు ఆకూ ఎలా ఆహారాన్ని తీసుకుంటాయో, ఇవన్నీ ఆయన ఎంతో గొప్పగా **explain** చేసేవారు. ఆయన చెబుతుంటే షౌకి అదంతా తాను అనుభవించినట్టే అనిపించేది, సృష్టిలో జరిగే కలయిక, విరహం, ఆనందం, వియోగం అనే రాగాలను, అనుభూతులను షౌకి చెప్పేవారు. సముద్రంలో కలిసే చిన్న వర్షబిందువులో చిందులు వేసే ఆనంద స్పందనం, మళ్ళీ బిందువు ఎండకి ఆవిరై కడలికి దూరమై మేఘమై జల్లుగా మళ్ళీ బిందు స్వరూపాన కడలిని చేరుకోవడాన్నీ, పువ్వు చెట్టుపై విచ్చి, ఫలదీకరణంలో పరిపూర్ణత్వాన్ని సంతరించు కోవడాన్నీ— అలాగే సృష్టిలో కలిగే ఆ యా వియోగ, సంయోగ విరహాదిక గుణ నాట్యాలనూ ఎంతో గొప్పగా వివరించి షౌకి అనుభ వానికి తెచ్చేవారు.

భగవాన్ చివరి రోజుల్లో ఆశ్రమంలో భగవాన్‌కి నమస్కారం చేసి సౌరిస్‌కి నమస్కరించే వారు ఆ వచ్చిన జనం అంతా. అది ఇష్టం లేక వెళ్ళి పాలితీర్థం మెట్ల అడుగున కూచునే వారు షౌ ఎవరికీ కనబడకుండా వుండే టందుకు. ఎట్లాగో వెతుక్కుంటూ అక్కడికి వచ్చి నమస్కారం చేసేవారు కొందరు. కానీ ఈశ్వరుడు వచ్చిన తరువాత "నీ కెందుకు అభ్యంతరం. వాళ్ళు నాకు నమస్కారం పెడుతున్నారు. అభ్యంతర పెట్టకు" అన్నారు.

ఆ రోజుల్లో షౌ గదిలో నించి గొప్ప పువ్వుల పరిమళం వచ్చేది. అలాంటి perfume వాళ్ళకి తెలిసిన ఏ పువ్వులకీ చెందనిది. గదిలో గోడలకి, వస్త్రాలకీ ఆ పరిమళం ఉండేది. కొన్ని రోజుల తరువాత అప్పట్లో తిరువన్నామలైలో ఉన్న నిర్మలకి షౌ గదిలో లేక పోయినా కర్టెన్‌లోంచి ధూపం వస్తున్నట్లుగా కనబడ్డది ఒక రోజు. గదిలోకి ఎవరయినా తొంగి చూస్తే ఇద్ద రున్నా రనేవారు, చూచిన వాళ్ళు "ఆ గదిలో షౌ తో బాటు ఇంకెవరమ్మా వున్నారు?" అని అడిగేవారు.

ఈశ్వరుడు రూపంతో తనతో వున్న రోజుల్లో సౌరిస్‌కి ఈశ్వరుడి కంఠం ఆయనలోంచి తన చెవికి కాక ఎక్కడో వినబడేది. ఆయన తనని తాకినా లోపల ఎక్కడో ఆ స్పర్శ తెలిసేది. 1952లో ఈశ్వరుడు శలవు తీసుకు వెళ్ళిన తరువాత ఆయన చెప్పినట్లుగానే ఆయన వాక్కు కొన్ని vibrations తో వచ్చేది ఆమె లోంచి. ఆ రోజుల్లో వ్యక్తిత్వం ఆమెలో నామకః వుండడం వలన ఈశ్వరవాక్కు అనే విచక్షణ వుండేది.

కొన్ని రోజు లయిన తరువాత ఈశ్వరుడు రాత్రిళ్ళు భజన చేయమన్నారు. రాత్రి ఏవేవో మాట్లాడి పడుకోవడంవల్ల మనసు

కలత పడుతుంది. సంగీతం వినపడుతుంటే నిద్ర ప్రశాంతంగా పడుతుంది. అందు వల్లనే ఈశ్వరుడు "నీ కవసరంలేదు. కాని వాళ్ళందరి కోసం భజన చేయ" మన్నారు. షౌకి మాత్రం నిద్ర గొడవేముంది. నిత్య సమాధే. చలంగారు ఇష్టపడతారో లేదో ఏం అభ్యంతరం పెడతారో అని షౌకి సందిగ్ధం. కాని చలంగారు సరే నన్నారు. అమ్మ మరీ మరీ సంతోషించింది, చలంగారిని "నీ రోగం బాగా కుదురుస్తున్నారు ఈశ్వరుడు. మాంసం మానిపించారు. భజనలు చేయిస్తున్నారు" అంటూ హేళన చేసేది అమ్మ. ఈశ్వర సాక్షాత్కారం అయిన రోజు నించి సౌరిస్‌ని సౌరిస్‌గా చూచేవారు కారు చలంగారు. ఆమెని ఈశ్వరుడి గానూ, ఆమె ఆదేశాన్ని ఈశ్వరాదేశంగానూ స్వీకరించారు. తరువాత ఏవో కొన్ని నామావళులు చెప్పి భజన చేయమన్నారు ఈశ్వరుడు. ఆయన చెప్పినవి "శ్రీ మహేశ్వర జయ మహేశ్వర మహా మహేశ్వర నమోస్తుతే. చంద్రశేఖర చంద్రశేఖర చంద్రశేఖర పాహిమాం. తరువాత భజనలకి వచ్చేవాళ్ళు పాడిన నామావళులతో కొన్ని కలిపి పది నామావళు లయ్యాయి.

ఇక బ్రహ్మసమాజం పాటలు చలంగారు అందరికీ నేర్పారు. ఇవే కాక కూచిభొట్ల సూర్యనారాయణగారివి, కృష్ణశాస్త్రిగారివి కొన్ని పాటలు పాడేవారు, చలంగారు వాళ్ళు ఆశ్రమానికి వెళ్తుంటే భజన సంగతి ఎవరికీ తెలియదు గనుక వుత్సాహ పడేవాళ్ళకి రమ్మన మని చెప్పమని చెప్పేవారు ఈశ్వరుడు. చలంగారూ పిల్లలూ కేవలం భజన చేస్తూ వుంటే **monotonous** గా వుండి, విసిగి పోతారని అందర్నీ పిలిపించే వారు. అప్పట్లో తాళాలూ, హార్మోనియాలు ఏవీ లేవు. చేతులతో తాళంవేసి పాడేవారు వాళ్ళు. నలుగురిలో పాడటం చిత్రకి సిగ్గు. ఏ విధంగానో తప్పించుకోవా లనుకునేది. కానీ పాడటం తప్పేది కాదు. అట్లా ప్రారంభం అయ్యాయి భజనలు.

"అవును గొప్పగా వున్నాము. శాంతీ, ఆనందం, నృత్యం చేస్తున్నాయి మా చుట్టూ. అవి ఎప్పుడు ముడుచుకున్న హృదయాల్ని ఛేదించుకుని లోపల ప్రవేశించి నింపేస్తాయా అని ఎదురు చూస్తో.

ఒక్కొక్క రోజు అనేక రకాలవారు వొస్తారు భజనలకి. మొన్న కన్నడం, ఇంగ్లీషు, సంస్కృతం, అరవం, తెలుగు, హిందీ, అస్సామీస్ భాషల్లో భగవాన్ నామకీర్తన" జరిగింది ఇక్కడ. రాజయ్యర్‌గారు విఠల్ భజనతో నృత్యం చేశారు.

(దీక్షితులుగారికి చలం లేఖ — 1953)

అమ్మ వీటన్నిటినీ చూచి సంతోషించేది. భజనచేస్తే ప్రసాదం ఇవ్వాల్సిందే నని ఈశ్వరుడు చెప్పారు. అప్పుడు ప్రతిరోజూ ప్రసాదం వండి నివేదన చేసి అందరికీ పంచిపెట్టించేవారు, అభ్యంతరం అయినవాళ్లు తీసుకునేవారు కాదు. కానీ అభ్యంతరం అయిన వాళ్లు అసలు వొచ్చేవారు కాదు.

అప్పట్లోనే సన్నాలు వచ్చారు. 1942 లో చలంగారు వుద్యోగ రీత్యా ఏలూరులో వుండేవారు. చలంగారు బెజవాడ వొచ్చినప్పు డల్లా ఒకతను చలంగార్ని చూడడానికి వొచ్చేవాడు. అతను కాలేజీస్టూడెంటు. అతను బాగా సన్నగా వుండడంవల్ల అతనికి సన్నాలు అని పేరు పెట్టింది చే. చలంగారి దగ్గరే కూచుని వుండేవాడు. ఇంకతని చూపు ఎటూ వుండేది కాదు. "మిమ్మల్ని చూస్తుంటే నా కెంతో శాంతిగా వుంటుంది" అనేవాడు చలంగారితో. చలంగారు నవ్వేవారు- "నే నింత అశాంతిలో కొట్టు కొంటూంటే నా దగ్గర శాంతిగా వుంటుం దంటా డేమిటి ఇతను ?" అని.

సన్నాలు వాళ్ళ ఇల్లు కృష్ణానదికీ, బందరు కాలువకీ మధ్య వుండేది. షౌ వాళ్ళు కృష్ణవైపు షికారు వెళ్ళినప్పుడల్లా అతను వాళ్ళ

నాన్నగారూ దోవలో నిలబడి షా వాళ్ళకి నిమ్మరసం, అల్లం, పచ్చి మిరప, కొత్తిమీర వేసిన చల్లని మజ్జిగ దాహానికి ఇచ్చేవారు. వాళ్ళ నాన్నగారి ముఖంలో ఎంత సౌమ్యతో!

లీలగారు వొచ్చినప్పుడు ఒకసారి చలంగారు వాళ్ళని భోజనానికి పిలిచారు సన్నాలు వాళ్లు. వెన్నెట్లో డాబా మీద భోజనాలు పెట్టారు. టొమేటో మాంసం వేసి కూర చేశారు. కూర ఎట్లా వుందని వాళ్లు అడిగితే "ఏమీ బాగా లేదు. దాన్నిండా బొమికలు తప్ప ఏవీ లేవు" అన్నారు చలంగారు. ఆ తరవాత లీలగారికి, చలంగారికి వాదన పడింది.

"అంత ఆప్యాయతగా అతను పిలిచి భోజనం పెడితే అతని మొహం మీద అట్లా అనవొచ్చా? బావుంది అనాలి కాని" అన్నారు లీలగారు.

"బాగా లేకపోతే బాగా వుందని ఎట్లా చెప్పగలము" అన్నారు చలంగారు.

"కానీ పాపం! అత నెంత బాధ పడతాడో చూడండి. అతని కళ్ళల్లో ఎంత ప్రేమో, ఆప్యాయతో మీ మీద. మీ రట్లా అనడం న్యాయం కాదు" అన్నారు లీలగారు. *

ఆ తరువాత సన్నాలు వుద్యోగరీత్యా ఎక్కడికో వెళ్ళిపోయారు. కొన్నేళ్ళ తరువాత చలంగారు వాళ్లూ అరుణాచలం వొచ్చేశారు.

* ఆ మధ్య ఢిల్లీ వొచ్చిన సన్నాలు చెప్పారు సౌరిస్ తల్లితో "మేం మాంసాలు తినమండి. అవెట్టా వుంటాయో కూడా మాకు తెలీదు. ఆయన కోసం అని తెచ్చి చాతయినట్టు చేశాము. అవి వండడం ఎట్టాగో మాకు తెలియదు" అని. అప్పుడు తెలిసింది ఆయనకి చలం మీదెంత అభిమానమో! ప్రేమో!

ఆయన పని చేసేది **electric dept.** లో. ఆయన జైపూర్ అడవులలో ఏదో **project** లో పని చేస్తున్నారు. వొయ్యి పోయిందని, చలం కుటుంబీకులు ఏ దిక్కూ లేకండా అరుణాచలం వొచ్చేశారని విని అరుణాచలం పరిగెత్తుకుంటూ వొచ్చారు. అప్పటికే సౌరిస్‌కి ఈశ్వర సాక్షాత్కారం జరిగింది. చలం కుటుంబీకుల కోసం బట్టలు కుట్టించి, ఇంత మూటలో తీసుకుని వొచ్చారు. ఆయన ఆదుర్దాఅల్లా చలంగారు వాళ్ళకి ఏ విధంగా సహాయ పడగలనా అని. తా మున్న చోటంతా వర్ణించి— "అది ఎంతో అందమైన అడివి. ఇక్కడ మీ రెలా వుంటారు? ఇక్కడి వారంతా మూఢుల్లా వున్నారు. మీ లాంటి వారు వీళ్ళ మధ్య ఎలా వుండగలరు? నాతో వొచ్చే సెయ్యండి. మా కుటుంబంలో ఒకరుగా వుండండి. మనం ఎట్లాగో అట్లాగు గడుపుదాం. అంతా నేను చూసుకుంటాను" అన్నారు. అప్పటికే ఈశ్వరుడు వొచ్చారు- లేకపోతే ఆ అందాల గురించి విని చలంగారు అక్కడికి వెళ్ళిపోయే వారేమో! కానీ ఈశ్వరుడు వారిని అరుణాచలం దాటి వెళ్ళ నివ్వరు.

ఈ భజనలు అవీ చూసి సన్నాలు కేమీ అర్థం కాలేదు. ఆయనలో పెద్ద తిరుగుబాటు వొచ్చేసింది. "ఏమిటీ భజనలు. ఇవి చేస్తేనే కానీ ఈశ్వరుడికి సంతృప్తి వుండదా?" అని అడిగారు. తరువాత నాలుగు రోజులు వుండి వెళ్ళి పోయారు. కానీ చలంగారు వాళ్ళని వొదల లేదు. ఉత్తరాలు రాస్తూనే వున్నారు. ఆయన చలంగారి కే స్తాయం కావాల్సినా సహాయం చేయడానికి ఎప్పుడూ సంసిద్ధమే. కానీ చలంగారికి ఏం సహాయం కావాలి? నర్తకి మాత్రం ఎక్కడా దిక్కులేని వాళ్ళకి, ఆర్తులకి వుద్యోగాలు కల్పించడం కోసం ఆయనకి వుత్తరాలు రాసి సహాయం చేయించేది. ఆయన తమకు అవకాశం

వున్నంత వరకూ నర్తకి పంపిన ఆర్తులకు సహాయం చేసేవారు. ఆయన వుండే వన్నీ అందమైన ప్రదేశాలే. ఆయన జైపూర్ నించి శ్రీశైలం వెళ్ళారు. రిశైరయ్యే ముందు సన్నాలు భార్య చచ్చిపోయింది. చాలా డీలా పడిపోయి మరీ సన్నగిల్లి పోయారు. తరువాత హైదరాబాదు వెళ్ళి— "నేను అరుణాచలంలో వుండిపోవడానికి వొస్తున్నాను" అని రాశారు. ఆయన చెట్టంత కొడుకు చచ్చిపోయిన దిగులులో అరుణాచలం వొచ్చారు. ఆ అబ్బాయికి వసంతకుమార్ అని పేరు పెట్టుకున్నారు. ఒక అమ్మాయి పుడితే చిత్ర అని పేరు పెట్టుకున్నారు. తిరువన్నామలై కూతురు చిత్రతో కలిసి వొచ్చారు. కానీ ఇప్పుడు సన్నాలు ఈశ్వరుడి వైపు మళ్ళారు. వారిలో మునుపటి తిరుగుబాటు పోయింది. సన్నాలు కనే కల ఏమంటే తాము అరుణాచలంలో స్థిరపడా లన్నదే.

## 2

అప్పట్లో అమ్మకి ఏవేవో వొంటిమీద బాధలు వచ్చేవి. ఏంతో బాధ పడేది. ఈశ్వరుడు బజార్నించి పార్వతీ పరమేశ్వరులు సకుటుంబంగా వున్న చిన్నపటం తెప్పించి దానికి రోజూ పూజ చేయమన్నారు. అమ్మ అలా కొన్నాళ్ళు చేసింది. చేసినన్నాళ్ళూ తన కేబాధలూ లేవు. చాలా హాయిగా వుంది. కాని ఎప్పుడయితే పూజల్ని మానేసిందో అప్పుడు మళ్ళీ మొద లయినాయి బాధలన్నీ. ఈశ్వరావతరణ తరవాత చలంగారికి ఈశ్వరుడుతో నడిచిన చర్చోపచర్చల గురించి ఇలా వివరించారు సౌరిస్ తల్లి.

"ఈశ్వరు డొచ్చాక వారంరోజుల తరువాత వోసారి నాన్న అంటున్నాడు నర్తకితో—" మనమీద కరుణించి ఏ మహానుభావులో ఇప్పుడు వొచ్చారు కానీ ఆయన్ని మాత్రం ఈశ్వరుడిగా నేను తీసుకో

లేను. లోకేశ్వరుడే అయితే ఆయిన్తో పోట్లాడ వలసినవి అడగ వలసినవి చాలా వున్నాయి. అందుకని ఆయన్ని ఈశ్వరుడిగా వొప్పుకోను" అని. అప్పుడాయన "మీ నాన్నతో ఇట్టా చెప్పు ఒకచోట మాడుస్తాడు. ఒకచోట అసలు మండించడు. సూర్యుడు తన క్రియని తాను చేసు కుంటున్నాడు. కనక సూర్యుడు కాకండా పోతాడా? అందుకని నేను ఈశ్వరుడ్ని కాదంటే నేను కాకండా పోతానా?" అని అప్పుడు నాన్న "ఈశ్వరు డయితే నన్ను కన్విన్స్ చెయ్యాలి. నాకు ఆ ఈశ్వరుడితో ఎప్పటినించో తగాదా. ఆయన సృష్టికర్త యితే లోకం ఎందుకిట్టా వుందిబాధల్తో కష్టల్తో. ఎప్పుడు కనబడతాడా పోట్లాడదామని కాచుకున్నాను," అన్నాడు.

"నిన్ను కన్విన్స్ చేయడానికి నాకేం అభ్యతరం లేదు. నువ్వు నన్నేమి అనుకున్నా నాకేం ఫరవాలేదు. సరే నాతో నీపోట్లాట ఏమిటో చెప్పు" అన్నారు.

"చాలావుంది చెప్పడానికి" అన్నాడు నాన్న.

"సరే" నన్నారు ఈశ్వరుడు.

ఇక వారం రోజులు అదే పనిగా పొద్దుటనించి రాత్రి 10, 11 గంటల దాకా సంవాదం జరిగేది. ఈశ్వరుడు నాలోంచి నాన్న ప్రశ్నలకి జవాబు ఇవ్వడం మొదలు పెట్టారు. వారం రోజుల తరువాత కన్విన్స్ అయినాడు నాన్న. "మీరు చెప్పిన వన్నీ వొప్పుకుంటున్నాను అయితే నన్ను నమ్మినవాళ్ళు నమ్మి నడిచే వాళ్ళు అడిగేతే మీ ఆర్గ్యుమెంట్స్ అన్నీ చెబితే ఎట్లా అర్థం చేసుకుంటారు. వాళ్ళు కూడా కన్విన్స్ కావొద్దా?" అని అడిగాడు నాన్న. "నే నిప్పుడు చెప్పిన వన్నీ అర్థం చేసుకునే మేధస్సు అందరికీ వుంటుం దనుకోకు. వాళ్ళు

నిన్ను అడుగుతే నాదగ్గరికి పంపించు. నేను వాళ్ళకి సమాధానం చెపుతాను" అన్నారు ఈశ్వరుడు.

"ఇదంతా నేను సృష్టించలేదు. ఇదంతా నా నాట్యవిలాసం. అది గతితప్పదు ఆగతిలో ఇవన్నీ వుంటాయి.

ఈ అనంతకాలంలో మనిషి బతుకెంత మనిషి వునికెంత? ఒక నీటితుంపర ఎగిరి నీటిలో పడ్డంత మనిషి బతుకు. సూర్యుడి లోంచి సూర్యరశ్మి వొచ్చి సూర్యరశ్మి నించి ఇంద్రధనుస్సు అవుతోంది. ఆరంగు లెంతదాకా వాస్తవం, అట్టానే సృష్టంతా."

"ఇది నాకు క్లియర్ అయినా గానీ రికన్సయిల్ కాలేక పోతున్నాను, ఇదంతా తెలిసినా బాధ లేదనుకో లేను." అన్నాడు నాన్న.

"అది అజ్ఞానం నించి మేల్కొన్నప్పుడే సత్యం తెలిసి నప్పుడే నీకు గోచరం అవుతుంది. ఇప్పుడు అంతా నీకు క్లియర్ చేస్తున్నాను. కానీ ముళ్ళు వేసుకోవడం మనసు స్వభావం, ఆ ముళ్ళు విడదీసు కోవడమే కావాలి. అదే సాధన. అసలు సంగతి తెలిసినప్పుడే ఇదంతా పూర్తిగా గ్రాహ్యం అవుతుంది అన్నారు ఈశ్వరుడు.

ఇంక చలంగారికి ఈశ్వరుడు వచ్చినప్పటి నించీ షా లేదు. ఈశ్వరుడు ఎంత కఠినమైన సాధన చెప్పినా ఆ సాధనంతా చేసేవారు చలంగారు.

"నేనా? నా కిప్పుడే అసలు జీవితం ప్రారంభం లాగు అనిపి.. ంది. నా ఆరోగ్యం పూర్తిగా బాగుపడ్డది. లోపల్నించి రిప్పింగ్ ఎన వొస్తోంది. తల నెప్పులు లేవు. సాధన తీవ్రత వల్ల అప్పుడ´ డు బద్దకాలు వొస్తాయి- మధ్యాహ్నాలు అంతే, అసలు నా జీవితం ఇంక ముందే వుందనిపిస్తోంది."

(దీక్షితులుగారికి చలం లేఖ తే 13-10-52)

తల్నొప్పి

మైగ్రేన్ హెరిడిటరీ కావడం చాలా సార్లు జరుగుతుందని తెలుసును కదా నీకు! నేను తల్లి కడుపులోంచి migrain తో బాధ పడుతో పుట్టాను. ఆ జబ్బేమిటో తెలీక మావాళ్ళు 20 ఏళ్ళు తంటాలు పడ్డారు. తక్కిన కాల మంతా నేను చేయని చికిత్స లేదు. కొన్నేళ్ళ తరవాత అమెరికన్ మెడికల్ లిటరేచర్‌లో వో పాంప్లెట్ దొరికింది. నా స్థితిని explain చేస్తో. దాంట్లో మిడిల్ ఏజ్‌లో మైగ్రేన్ దానంతట అదే పోతుం దని వుంది. పోలేదు. ఇక్కడికి వొచ్చాక ఈశ్వరుడు వో శరీరసాధన చేయించి నయం చేశారు. అదో miracle.

నా నించి సౌరిస్ కూడా మైగ్రేన్ వారసత్వాన్ని పొందింది. ఈశ్వరుడు సౌరిస్ మైగ్రేన్ కూడా నయం చేశారు.

(24-9-57 కామేశ్వరికి లేఖ)

"లోకంలో ఇంత దుఃఖం ఎందుకు వుంది? తప్పించరేం?" అని అడిగేవారు చలం ఈశ్వరుడ్ని. "నీ స్నేహితుల్ని వాళ్ళ బాధల్నించి తప్పుకొని వస్తారేమో కనుక్కో- వాళ్ళని నేను ఆనందంలో నడిపిస్తాను" అనే వారు ఈశ్వరుడు. కానీ చలంగారికి త్వరలోనే తెలిసింది- ఎవరికి వారి బాధల్లోనే ఆనందమనీ, వాటినించి తప్పించుకు ఆనందించ లేరని అయినా అంత స్పష్టం అయిపోయినా గానీ చలంగారు ఎవరు బాధపడుతున్నా చూడలేక "ఏమిటీ విపరీతం?" అని ఈశ్వరుడ్ని ప్రశ్నించేవారు. కానీ ఆ బాధల్లోంచి ఎవరి నయినా ఈశ్వరుడు తప్పిస్తే వాళ్ళు దయాధర్మం అనేది బొత్తిగా లేకండా స్వార్థంతో ప్రవర్తించేవారు. అప్పుడు ఈశ్వరుడు జ్ఞాపకం చేసేవారు చలంగారికి "చూశావా! వాళ్ళ బాధల్ని తగ్గిస్తే ఏ మవుతారో" అని. చివరికి మార్రా సే రోజులకి చలంగారికి పూర్తిగా స్పష్టం అయింది. జీసస్ వలన

కనులకు చూపు పొందినవారే, చెవుడు పోగొట్టు కున్నవారే- జీసస్‌ని శిలువ వేయడం. కానీ ఎవరివల్ల తాను ఎంత బాధ పడినా, ఎవరి బాధా భరించలేదు చలంగారి జాలిగుండె. ఈ కన్నీళ్ళ నించి, ఈ దుఃఖం నించీ, ఈ అంధకారం నించీ లోకం అంతా రక్షితం కావా లన్నదే ఆయన ఆకాంక్ష. ఆర్తిని చూస్తే చాలు ఆయన హృదయం కరిగి పోతూనే వుంటుంది. చలంగారి జీవితంలో ప్రతీ క్షణమూ దయా వర్షంలో ఆర్ద్రిత మైనది గనుకే ఈశ్వరుడే ఆయనని వెదుక్కుంటూ వచ్చారు. ఎంతసేపూ చలంగారికి ఎవరైనా ఈశ్వరుడి గురించి విన్నా, ఈశ్వరుడికి దగ్గరగా వున్నా వాళ్ళ జీవితాలు హాయి పడిపోతా యని విశ్వాసం.

ఈశ్వరుడి మాటల్ని పట్టిచూస్తే ఇంకెంతో లేదు. నేను ఉత్తరాలు రాసే కాలం. అటు తరువాత 'మౌనం'. నేను చెప్పేదీ లేదు. ఎవరూ వినేదీ లేదు. ఈ లోకం అనే పటమే ఒక కల. నీటిమీద తుంపర కాబోతుంది. సౌరిస్‌కి, తరువాత నాకు. వొచ్చే రోజున మీరు వస్తారు.

మా దగ్గరికి వొచ్చింది ఎవరు? ప్రపంచ పాలకుడు, సృష్టికర్త. అసలు కారణం ఈశ్వరుడు. ఆయన వొచ్చి వూరికే లేరు. జ్ఞానం వుపదేశించి, వరా లిచ్చి మాయం కాలేదు. దిన దినమూ మా కళ్ళు విప్పుతున్నారు. పూర్వపు భక్తులకి ఆయనలో, ఆయన పద్ధతుల్లో వున్న సంపూర్ణ విశ్వాసం మాకు లేదు, ఆయన చెప్పిన మాటలూ, మాకు సమంజసంగా కనబడితేనే గాని నమ్మం. "శిష్యా! ఇది నా పద్ధతి" అని ఈశ్వరుడు అంటే— "అట్లాగే దేవా! అటులే నమ్మెదము" అనం. కనక ఆయన సృష్టి ఎట్లా నడుస్తోందో, ఆయన ఎందుకు ఈ బాధ నంతా తీసెయ్యరో, ఆయనలోని అనంతమైన

ప్రేమా, అంతులేని ఈ కాఠిన్యతా, రెంటికీ మైత్రి ఎట్లా కుదిరిందో, ప్రతి విషయంలో, ప్రతి అణువులో, ఈశ్వరు డెట్లా బద్ధుడో 'కర్మ' అనే దాంట్లో న్యాయ మెట్లా వుందో- ఇవన్నీ మాకు అర్థ మయేట్టు మా దినచర్యలో కలిసి మాకు చూపుతో, నిష్కామ కర్మని, మహా యోగాన్ని మాచేత సాధన చేయిస్తో, మా అడుగుల్ని నడుపుతో, మా తప్పుల్ని దిద్దుతో, ఖండిస్తో, లాలిస్తో క్రమంగా మా కళ్ళమీద కాంతిని పడేస్తో .... ఇంత గొప్ప సంగతి నిశ్శబ్దంగా జరుగుతో వుంటే .... ఎట్లా వూరుకోను? మనకే కదా ఇంత పెన్నిధానం దొరికిందని దాచుకో లేను.

కాని చెపుదా మంటే —— పది వరా లిచ్చి ఎగిరిపోయే ఈశ్వరుడే కాని, ఈ ఈశ్వరుడు ఎవరికి అక్కర్లేకుండా వున్నాడు. 'మా కెందుకు నువ్వూ, నీ ఈశ్వరుడూ అన్నా కూడా వూరుకో లేకండా వున్నాను. అది నా ప్రారబ్ధం.

ఏళ్ళకి ఏళ్లు హిరణ్యకశిపుడు మల్లే!! ఏడీ ఆ హరి! ఏడీ! వుంటే ఈ లోకం ఇంత అర్థం లేకండా ఘోరంగా ఎట్లా వుంది? ఏదీ ఆ కరుణ!!! అని రాత్రింబవళ్ళు వెతికిన నాకు ఈశ్వరుడు జవా బిచ్చారని. రెండు రోజులు దిగిన మిత్రులు మాకు మాత్రం కనపడ కూడదా? అని అలిగి పోతే ఎవరికి నష్టం? ఈశ్వరుడికా? నాకా?

వాళ్ళకి వరాలిస్తే చాలు పూర్వపు భక్తులు సంతోషించేవారు. నే నట్లా కాదు. "నా సంగతి సరే, వీళ్ళందరి సంగ తేమిటి?" అంటాను. ఈశ్వరుడు అంటున్నారు—— "సరే! పిలు, ఎవ రెవరు యోగ్యులున్నారో పిలు. నేను చెప్పినట్టు చెయ్యమను. నేను జ్ఞానమో, మోక్షమో, ఆనందమో ఏది కావాలో అది ఇస్తాను, రమ్మను." అని

నా మిత్రులకి రాయించి వాళ్ళు ఏ విధంగా తప్పించు కుంటున్నారో కాదు పొమ్మంటున్నారో, విరోధిస్తున్నారో చూపి నవ్వు తున్నారు. "వీళ్ళ మాటలు చూసి మోసపోయి నన్ను తిట్టావు. వీళ్ళకి నేను జ్ఞానమూ, ఆనందమూ parcels కింద కట్టి ఇళ్ళకు మోసుకుపోయి బతిమాలి ఇవ్వాలి మాటలు, ఈ ఆన్వేషకులకి జ్ఞానమూ అక్కర్లేదు, ఆర్టిస్టకి సౌందర్యమూ అక్కర్లేదు. భక్తులకి నేనూ అక్కర్లేదు. వాళ్ళనుకునే రూపాన ఆ dose లో ఆ కొద్దిలో వాళ్ళ కడుపులో నీళ్ళు కదలకుండా నేను వాళ్ళు కోరే కుళ్ళుని, అబద్ధాల్ని ఇస్తే సంతోషం, ముక్తి, ముక్తి. చావు తరువాత- ముక్తి. అదేమిటో తెలీకుండానే" అని చూపు తున్నారు.

పోతున్నారు. వొదిలి పోతున్నారు. నాతో ప్రయాణం చేసిన కొద్దిమంది మిత్రులూ- ఈ నిజాన్ని భరించలేక : కానీండి ఆ తప్పించుకోడా లన్నీ ఎన్ని విధాలైన వంకర కారణాలు, సాకులు, వాదనలు- చిత్రం, నమ్మిన వారిలో; ఈశ్వరు డని, జ్ఞాన మనీ, సౌందర్య మని, ఆనంద మనీ, కులికిన వారిలో."

(చిన్నారావుగారికి చలంగారి లేఖ 10-4-52)

తన మిత్రులు ప్రవర్తించే రీతి చూచాక కూడా చలంగారు ఎందరెందర్నో పిలిచేవారు., "రండి, విశ్వాసం నిలుపుకోండి. మీ జీవితాలు కూడా ఆనంద భరితాలు అవుతాయి" అని వుత్తరాలు రాసేవారు. తరువాత ఆ విశ్వాసం వాళ్ళలో నిలపాలని బ్రహ్మప్రయత్నం చేసేవారు. వాళ్లు ఇక్కడి శక్తిని భరించలేక వెళ్ళిపోతే ఎంత బాధో ఆయనకి ఆ మీదట ఈశ్వరుడు "చలం అన్నదానికి ముందు అరుణ అని పెడు తున్నాను. షౌని కాదు, నిన్ను చూడటానికే ఎంద రెందరో వస్తారు. నీలోనే నన్ను చూస్తారు" అన్నారు. అట్లానే అక్షరాలా జరి

ఆమెకి అత్యంత ప్రేమ. అందువల్లనే ఎవరైనా "ఆశ్రమానికి పోరేం? పెద్దగుడికి పోరేం?" అని ఆమెని అడిగితే "నే నందుకు రాలేదు. వాటిమీద నాకేం భక్తి లేదు. నాకు తోచినన్ని రోజులు వీళ్ళతో గడిపి వెడతాను" అనేవారు.

ఆఖరుసారి వచ్చినపుడు షా ఆమెతో చెప్పారు. "వొయ్యి ఒక సారి మీతో అన్నమాటలు నాకు గుర్తు. మిమ్మల్ని, లక్ష్మని కూచో పెట్టుకుని— 'ఎక్కడ మీరు వున్నా సరే మీ కే అవసరమన్నా కావాల్సి నప్పుడు నే నున్నానని మరిచి పోకండి మీరు' అని చెప్పా రామె. ఆ మాట ఆవిడితోనే అంతమై పోయిం దనుకోకండి" అని. అప్పుడు శకుంతల "అవును నాకు తెలుసు మా అమ్మాయి, అల్లుడు ఏమయినా అంటే నేను తిరువన్నామలై వెళ్ళిపోతాను అని అంటూ వుంటాను" అన్నారు.

చివరిసారి షా ఆమె గురించి విన్న దేమంటే ఆమె తల్లిదండ్రు లకు Heart attack వొచ్చి ఆమె దగ్గర చేరితే వారికి సేవచేసి శకుం తలకి Heart attack వొచ్చిందనీ— ఇప్పుడా ముగ్గురికి రాజ్యం అనే నర్సు సేవ చేస్తోందని తెలిసింది.

ఆ రోజుల్లో శ్రీకాకుళంజిల్లా నించి ఎన్. విరేశలింగంగారనే టీచర్ ఉత్తరం రాశారు చలంగారికి. ఆ వుత్తరం చూసి జవాబురాయిస్తూ ఈశ్వరుడు "ఈయన రెండేళ్ళలో ఇక్కడకి వచ్చేస్తారు." అన్నారు. ఆయన సరిగ్గా రెండేళ్ళకి ఇక్కడికి వచ్చారు భార్యతో సహా. వచ్చి చూసి ఎంతో సంతోషించారు. ఆయన మర్నాడు గిరిప్రదక్షిణం వెళ్ళా లని అనుకున్నారు. వెంటవెళ్ళడానికి తోడు ఎవరు లేరాయనికి. "ఎట్లా వెళ్ళాలి, ఏమిటి దారి?" అని చలంగారిని అడిగారు. తరువాత నాభార్య నడవలేదు. నడిస్తే ఆయాసం వస్తుంది ఆమెకి అనికూడా చెప్పారు.

చివరికి కొంత సేపటికి బజార్నించి చిత్ర వొచ్చింది. నిమ్మ రసమూ, గ్లూకోజ్ కలిపి చలంగారికి ఇచ్చారు. డాక్టర్ని పిలవడానికి కూడా ఎవరూ లేరు. కాలికి దెబ్బ తగిలిన మంగారాం రోజూ తను వైద్యం చేయించుకునే డాక్టరు దగ్గరికి వెళ్ళి రమ్మని పిలిచాడు. "ఆ రమణాశ్రమ ప్రాంతం వాళ్ళంతా బైరాగులు. డబ్బివ్వరు. నేను రాను" అని అన్నారట ఆ డాక్టర్. అప్పుడు మంగారాం "చలంగారు వాళ్ళు అటువంటివారు కారు. ఒకవేళ మీ ఫీజు వాళ్ళు ఇవ్వకపోతే నేను ఇస్తాను" అని చెప్పి డాక్టర్ని పిలుచుకుని వొచ్చాడు. డాక్టర్ వొచ్చేసరికి చలంగారికి డోకులు, విరేచనాలవల్ల శరీరం dehydrate అయిపోయింది. డాక్టరు వొచ్చి గ్లూకోజ్ ఇంజక్షన్ ఇచ్చారు. నెమ్మదిగా చలంగారు కోలు కున్నారు అనేకంటే చచ్చి బతికా రనడం సమంజసం. ఈశ్వరుడు చలంగార్ని— వారి విశ్వాసబలం వల్లనే బతికించారు.

డాలీ ప్రత్యేకం అయిన పిల్ల. చలంగారు వాళ్లూ బెజవాడలో వుండే రోజుల్లో అమ్మ తన గదిలో భగవాన్‌కి పూజ చేసేటప్పుడు డాలీ వెళ్ళి భగవాన్ పటానికి నమస్కారం చేసేది. అమ్మ భగవాన్‌కి హారతిచ్చి- అరటిపండో, ఖర్జూరం పండో డాలీకి ప్రసాదంగా ఇచ్చేది. ఆ తరువాత చలంగారి కుటుంబంవారు అరుణాచలం వొచ్చే శాక భగవాన్ దగ్గరకు వెళ్ళినప్పుడు- డాలీ భగవాన్‌కి నమస్కరించి 'కాయియ్యి' (కాయ ఇయ్యి) అని అడిగేది.

అప్పుడు భగవాన్ నవ్వుతూ వెంకటరత్నం గారితో "కాయ అడుగుతోంది. ఇయవయ్యా" అనేవారు. భగవాన్ ఏదన్నా కాయ ఇవ్వగానే తీసుకొని గంతులు వేస్తో వొచ్చేసేది డాలీ. అమ్మ పూజ పటంలో వున్నవారూ భగవాన్ ఒకరేనని గుర్తించి, నమస్కరించి, ప్రసాదం అడిగి మరీ తీసుకునేది అంత చిన్న వయసులోనూ డాలీ.

భగవాన్ దేహం చాలించాక, వారి సమాధికి నమస్కరిస్తో అట్లా ఎంతసేపో ఒళ్ళు తెలియకుండా వుండి పోయేది డాలీ. నిద్ర పోతోందనుకునేది నర్తకి. డాలీ ఆ పారవశ్యం నించి ఎప్పటికో తేరుకుని లేచేది.

ఎంత వివేకమో ఆపిల్లలో. ఈశ్వరుడు అనేటప్పటికి ఎంతో విశ్వాసంతో తీసుకుంది. అప్పటికి ఆ అమ్మాయి మూడేళ్ళ పసిపిల్ల.

పకపక కూడా చిన్నపిల్ల. ఆ అమ్మాయి చిన్నతనంలో చలం గారికి బదిలీలు అయి అసలు ఇంట్లో వుండేవారు కారు. పకపకకి పదేళ్ళు దాటేసరికి అమ్మ మతిస్థిమితం లేక తిరువన్నామలై వచ్చేసింది. పకపక చలంగారింట్లోనే పెరిగింది గానీ ఆయనికి దగ్గరవ లేదు. ప్రేమా ఎరగదు. ఈశ్వరుడు వచ్చిన తరువాత (ఈశ్వరుడికి) ముద్దుబిడ్డ అయి పోయింది. ఆమె విశ్వాసం demandచేసే విశ్వాసం. అదెంతటి గట్టిపట్టు అంటే ఈశ్వరుడ్ని అడిగేది. "నాకోసం సురయ్యా బేగం సినిమా ఎందుకు తెప్పించవు?" — అని. ఆ అమ్మాయి demand చేసినట్లే ఆ ఏడు సురయ్యా సినిమాలు వచ్చినట్లు ఎప్పుడూ రాలేదు. మంచి సినిమా వస్తే" మంచిసినిమా వచ్చింది. మీరు వెళ్ళండి" అని పంపించేవారు ఈశ్వరుడు వాళ్ళని. ఒకవేళ అది వెళ్ళిపోతే "ఎందుకు వెళ్ళిపోయాక పంపించావ్. నీకు తెలుసుకదా! ఆమాత్రం చూడలేవు. వెళ్ళిందా, లేదా" అని అడిగేది. ఒక్కోసారి ఆయినమీద అలిగేది అన్నం తినకుండ. అసలు పూర్వం అయితే ఒకపనిగానీ, ఒకసంగతిగానీ బాధ్యతగానీ పెట్టుకోవడం పకపకకి తెలియదు.ఎక్కడ కూచుంటే అక్కడే, ఎట్లాకూచుంటే అట్లాగే వుండిపోయేది. అస్తమానమూ రేడియో వినడంతప్ప వేరేపని చేసేదికాదు. ఈశ్వరుడు వొచ్చాక ప్రతిపనీ నేర్పారు." చూడు, పెళ్ళయితే నువ్వు ఇంత చిన్న ఇంట్లో

ఒకే గదిలో వుండ బోతున్నావు. అన్ని పనులూ నువే చేసుకోవలసి వస్తుంది. పిల్లల్ని పెంచడం నేర్చుకో. పిల్లల్ని కంటే ఎట్లా పెంచు తావు? అని చెప్పి పకపక వాదాన్ని enjoy చేస్తూ ఆమెకి పనీ పాట అంతా నేర్పించారు. పకపకలో మొదట్లో ఎక్కడా సహనం అనేది లేదు. ఈశ్వరుడు సహనాన్ని, ఓర్పునీ నేర్పించారు.

ఇక నర్తకికి ఎంత విశ్వాసమో! అంత తిరుగుబాటు. ఎందు కంటే 'చే' కింద మంచి వ్యవహార కర్తగా train అయింది. చే మంచి worker - అంటే active గా work చేసే మనిషి. ఆ విధంగానే తరి ఫీదు అయింది ఆవిడ కింద నర్తకి. తరువాత చాలా స్వతంత్ర దృక్పథం (independent). అందుకనే ఆమెకి ఈశ్వరుడికి అప్ప జెప్పుకోవడం కష్టం అయింది. ఈశ్వరుడ్ని తన హృదయం అంతటి తోనూ ప్రేమించింది విశ్వసించింది. కానీ ఆ విశ్వాశం వున్నా తన will ఇచ్చేసుకుని ఆయన మాటని విని నడుచుకోవడం ఆమెకి చాలా కష్టం అనిపించేది. అందుకని ఎంతో ప్రయత్నం మీద ఆ విధంగా నడుచుకునేందుకు శతవిధాల ప్రయత్నించేది. అందుకనే అందరి కన్నా పెద్ద struggle నర్తకిది. కానీ సాధ్యమైనంతవరకూ వినాలనే నర్తకి పట్టుదల. ఒక్కొక్కప్పుడు ఆమె మనస్సు ఎదురు తిరిగేది. కానీ మళ్ళీ తమాయించు కునేది. ఆమెకి బలాన్ని ఇచ్చి విశ్వాసాన్ని బలపరుస్తూ నడిపించింది చలంగారే. ఎప్పటి కప్పుడు నర్తకికి explain చేస్తూ ఈశ్వరాజ్ఞలలో నడిపించారు చలంగా రామెని. నిజంగా చూస్తే చలంగారే నర్తకి గురువు. ఈశ్వరుడు ఆదేశకర్త మాత్రమే.

చిత్రకి మాత్రం అదేమీ లేదు. ఈశ్వరుడు చెప్పినట్లు వినదమ్మే, మొండికేస్తే మొండి కేయడమే. అందువల్ల అందరిలోకి ఎక్కువ చివాట్లు తిన్నది చిత్ర తన మొండితనం వల్ల. ఆమెకి

మొండితనమే కాదు కోపమూ జాస్తి. చేస్తే అంతులేని విశ్వాసంతో చేయడం, లేకపోతే మొండికెత్తడం. విరోధించడం. ఈ విభిన్న ప్రవృత్తుల వాళ్ళందర్నీ ఈశ్వరుడు నడిపించ సాగారు.

3

ఈశ్వరుడు రాక ముందే ఒకామెని ఇంటికి తీసుకు వచ్చింది అమ్మ. ఆవిడే 'అక్క'.

"ఇక్కడికి ఓ అక్కగారు వొచ్చారని రాశాను కాదూ? రామేశ్వరం పోతో, తొంగి చూసి పోదామని దిగారు. భగవాన్ ఆమెని ఏదో వంకతో కదలనీ లేదు. ఆమె వుండడాని కని ఎన్ని సౌకర్యాలు చేస్తున్నారో !"

(దీక్షితులుగారికి చలంగారి లేఖ 29-3-51)

"నర్తకీ, అక్కగారూ సమాధికి పూలదండలు సప్లై, రంగనాయకమ్మగారు దీపాలకి వొతులు అవీ."

(దీక్షితులుగారికి చలంగారి లేఖ 1-2-51)

ఆవిడ్ని చలంగారు వాళ్ళు భీమ్లిలో వుండగా ఒక ఆశ్రమంలో చూశారు. ఆవిడ అక్కడ ఎవరితోనూ మాటాడకుండా ఒక మూల కూచుని వుండేది. ఆ ఆశ్రమంలో యోగి చలంగారితో ఆమెలో దుర్గాంశ వుందనీ ఆమె తనతోనే వుంటోందని చెప్పారు.

ఇప్పుడు ఆవిడ రమణాశ్రమం వచ్చింది. ఆవిడ తన భర్తని వెతుక్కుంటూ ఇక్కడికి వచ్చానని చెప్పింది. ఇంక ఆవిడ మాటలు అమ్మ మాటలు అందరికీ వినోదాన్ని కలిగించేవి. ఇక ఈ పిల్లలకందరికీ ఇంకేం పని లేదు- వాళ్ళ మాటలు వింటో వుండటం, నవ్వడం. ఆ మాటలన్నీ షౌ దగ్గిరకి వచ్చి చెప్పేవాళ్ళు. అక్క భర్త ఎప్పుడో చచ్చి పోయాడు. ఇంకో (మరో) జన్మ ఎత్తి ఇక్కడే

వున్నాడని ఆమె నమ్మకం. ఇక్కడ అన్ని గుహలకూ వెళ్ళి చూసి వచ్చేది ఆ గుహల్లో ఎక్కడన్నా వున్నాడేమో నని. అదంతా చాలా సరదాగా వుండేది పిల్లలకి. నర్తకీ, చిత్ర, పకపక అడిగేవారు అక్కని "ఏమిటి, దొరికాడా ?" అని, అవీ ఇవి యోగక్షేమాలున్నూ. చివరికి ఆశ్రమంలో ఒకర్ని చూచి "ఈయనే నా భర్త" అందామె. ఇదంతా చూచేవాళ్ళకి వింతగా వుండేది.

ఇంతకు మునుపే వీళ్ళని వాళ్ళని చూచి వీడు ఫలాని జన్మలో ఫలాని వాడు అని ఏవేవో విషయాలు చెప్పేది అమ్మ. అది చలం గారికీ తత్తిమా కుటుంబ సభ్యులకీ నవ్వులుగా వుండేవి. ఇంక ఆమె ఎవరన్నా మనిషి వస్తూంటే వాళ్ళవల్ల తనకి బాధ కలుగుతోంది అనేది. దాంతో చలంగారు "ఎవరో బొబ్బట్లు తింటున్నారు. నా కొచ్చింది కడుపు నొప్పి" అంటూ అమ్మ చెప్పే జన్మల్నీ అన్నిటినీ అల్లరి పట్టించేవారు. చివరికి ఇదంతా ఒక నవ్వులాట అయింది.

ఇప్పుడు అక్కగారు తన భర్త దొరికా డన్నారు. ఈమెగారికి 60 ఏళ్ళు. ఆమె తన భర్త అని చూపించిన కుఱ్ఱవాడికి 25 ఏళ్ళు. అదీ కాకండా 1942, 45 లలో తాను రాసుకున్న అనుభవాల్ని అందరికీ చదివి వినిపించేది ఆమె. ఒక అనుభవంలో ఆమె భర్త "నేను అరుణా చలంలో తపస్సు చేస్తున్నా" నని తనకి కనపడి చెప్పినట్లు అక్కగారు చదివి వినిపించారు. ఆమె తన పూర్వపు భర్తవీ, చచ్చిపోయిన తన కొడుకువీ ఫొటోలు చూపించేవారు వాళ్ళకి. ఇవన్నీ విపరీతంగా కన బడేవి. ఇదంతా ఏమిటి ? అని అనిపించేది వారందరికీ. పిల్ల లంతా ఆమెని ఆటలు పట్టించి నవ్వుకుంటూ వుండే వారు. విధవరాలైన ఆవిడ ఎప్పుడైతే తన భర్త ఫలానా అని తెలుసుకుందో అప్పటినించి తల్లో పూలు, నుదుట కుంకుమ, మెడలో మంగళసూత్రం పుణ్యస్త్రీ

అలంకారం అంతా చేసుకుని తయారైంది. కాషాయాన్ని తీసి పారే సింది. ఇంక సీమంతిని అయిన అమ్మ బొట్టూ, మంగళసూత్రాలు, గాజులు తీసేసి, విభూతి అలదుకొని కాషాయం కట్టుకునేది ఆ రోజుల్లో. ఈ వేషాల్ని చూసి ఆశ్రమం అంతా గగ్గోలు పడింది. ఇవన్నీ చూసి ఆటలుగా తీసుకుని ఆనందించి నవ్వేవాళ్ళు చలంగారూ, పిల్లలు.

ఇట్లా వుండగా షౌకి ఒక కల వచ్చింది. ఈ అక్కగారూ, ఆవిడ భర్త అని అంటున్న ఆ కుఱ్ఱవాడూ ఇద్దరూ కనబడ్డారు, పెద్ద ఆకాశంలో నక్షత్రమండలాల మధ్య వాళ్ళిద్దరూ అన్యోన్యంగా ఒకరి వేపు ఒకరు చూసుకుంటూ ఎంతో విచార పడుతూ ఏమిటి మన బాంధవ్యం ఎందు కిలా అయిపోయింది ఈ జన్మలో?" అని ఎంతో వ్యసన పడుతూ. షౌ తన కలని అందరికీ చెప్పారు. అంతా ఎంతో impress అయ్యారు ఆ కల విని.

ఇక ఆశ్రమంలో ఆ కుఱ్ఱవాడ్ని అందరూ ఆటలు పట్టించు తున్నా కూడా- "పెద్దది, ఎందుకు పాపం, పోనీండి, ఏమన్నా అనుకో నీండి" అని వూరుకునేవా డతను. అంతా ఆమె తన భర్త అని చెపు తున్న ఆయన్ని వెక్కిరిస్తున్నాకూడా ఆయన దాన్నంతా శాంతంగానే తీసుకునే వారు, అంతేకాక ఏ పండో, ప్రసాదమో మిగిలితే ఆమెకి పెట్టేవాడు. ఆయన ఇంటికి వెళ్ళిపోయేదాకా అక్కడే వుండేది ఆమె. భగవాన్ సమాధికి నమస్కరించి ఆయన పాదాలకీ నమస్కరించేది. ఇదంతా చూచినవాళ్ళు పడీ పడీ నవ్వేవారు.

ఇదిలా వుండగా చనిపోయిన తన కొడుకుని కూడా గుర్తించింది అక్కగారు. ఆ కొడుకు ఆమె మీద ఎంతో ప్రేమగా వుండే వాడు. చనిపోయిన ఆమె కొడుకుకీ ఈ కొడుకు అనే అబ్బాయికీ చాలా

పోలిక లుండేవి. ఆ కొడుకు అనుకునే అతను అప్రయత్నంగానే "అమ్మా" అని పిలవడం మొదలు పెట్టాడు ఆమెని.

ఆవిడ ఇక్కడ స్థిర పడడానికి సిద్ధం అయింది. అప్పట్లో బోస్ కాంపౌండ్‌లోని 'సేవా అనాసక్తి' అనే ఇళ్ళు చలంగారి స్వాధీనంలో వుండేవి. 'సేవా' లో ఒక చిన్న గదిలో నర్తకి ఆమెని వుంచింది. ఆమెకి వండుకోవడానికి బియ్యం ఇచ్చేవారు చలంగారు వాళ్ళు. పిల్లలకి ఆమెతో కావాల్సినంత కాలక్షేపం అయ్యేది.

ఈశ్వరు డింకా నాలుగు రోజులకి వస్తారనగా- ఆమె చలంగారు వాళ్ళతో దైవం సంగతి వాదిస్తోంటే- చలంగారు షౌ, "దైవం ఎక్కడున్నారు? వున్నది ఒకటే దైవం అనండి ఏ దనండి. దైవం అన్నది ప్రత్యేకంగా లేదు" అన్నారు. "దైవం లేడన్న ఇంట్లో నే నొక్క క్షణం కూడా వుండన"ని వెళ్ళిపోయింది ఆమె. నాలుగు రోజుల తరువాతే ఈశ్వరుడు షౌకి దర్శనం ఇచ్చింది. కాలు పెట్టనని మాటయితే అందిగానీ వుండలేక మళ్ళీ వచ్చింది. ఆమెకి తన తపశ్శక్తితోనే షౌకి ఈశ్వర దర్శనం చేయించా నన్న భావం ప్రబలిపోయింది. అక్కడినించి పెద్ద న్యూసెన్స్ అయిపోయింది. ఆవిడకి ఎంతసేపూ తన సంగతి ఈశ్వరు డేమన్నారనే ఆరాటం. షౌ ఏమీ చెప్పకపోతే కోపం "ఈశ్వరుడు కనిపించితే నలుగురికి మంచి చేస్తారా? స్వార్థం కోసం దాచుకుంటారా? అని కోపగించేది. ఎక్కడ తెలుగువాళ్ళు కనబడ్డా తన తపోశక్తి ధారపోయడం వల్లనే సౌరిస్‌కి ఈశ్వర సాక్షాత్కారం జరిగిం దని చెప్పేది. ఇంటికి ఎవరన్నా భజనకి వస్తే తన సంగతి ముందుగా చెప్పాలని ఆమె ఆరాటం, అంతా మీ సంగతే చెప్పుకుంటున్నారు, నా సంగతి ఏమీ చెప్పటల్లేదు" అని ఒకటే గోల.

చలంగారిని తన కొడుకుకి వుత్తరం రాయమనేది. "మీ తండ్రిగారిని మీ అమ్మగారు కనుక్కున్నారు. వెంటనే నగలతో, పెద్ద మేళాలతో వచ్చి, పెళ్ళి చేయించాల్సింద"ని. అలా వుత్తరం రాయడానికి ఎవరూ ఒప్పుకోలేదు. చివరికి ఆవిడే అతనికి రాసుకుంది. కానీ జవాబు రాలేదు. అతనే అక్కకి కొంచెం డబ్బు పంపించేవాడు. చలంగారు వాళ్ళు చెయ్యగలిగిన సాయం చేసేవాళ్ళు. ఆవిడ ఏదో తపస్సు చేయాలనీ, దానికి కావలసిన వస్తువులు చలంగారు వాళ్ళని సరఫరా చేయమనీ, ఆ తపస్సు చేసేటప్పుడు వాళ్ళంతా తనకి హారతులు ఇవ్వాలనీ, ఇంకా ఏవేవో కావాలనీ లేనిపోని తలనొప్పులు వాళ్ళమీదికి తెచ్చేది. చాలామటుకు అమ్మ ఆమెని అణిచేసేది.

అప్పట్లో అరుణాచలంలో కన్యకాపరమేశ్వరి స్కూలు అనే ఒక తెలుగుస్కూలు వుండేది. అక్కడ ఆమెకి ఉద్యోగం యిప్పించింది అమ్మ. ఆవిడ "నన్ను ప్రపంచంలోకి దించేస్తున్నారో వీళ్ళు" అని ఒకటే గోల. చివరికి ఎట్లా అయితేనేం ఆ వుద్యోగంలో చేరింది. మళ్ళీ complaints (ఫిర్యాదులు) ఆమె. వాళ్ళు తనకి సరిగా జీతం యివ్వడం లేదని. అక్కడితో చలంగారు కల్పించుకొని ఆ అధికారులకి ఉత్తరం రాశారు. దాంతో ఆ అధికారులు ఆవిడిని, చలంగారిని బాగా తిట్టి ఆవిడ ఉద్యోగం పీకేశారు. "హాయిగా ఉద్యోగం చేస్తోంటే, నా వుద్యోగం పోగొట్టారో" అని మళ్ళీగోల. ఎవరు ఈశ్వరుడిని దర్శించి ఈశ్వరవాక్కు వినాలని వచ్చినా తన గ్రంథాలు, అనుభవాలు వాళ్ళ ముందు పెట్టి వినమని కూచునేది, వాళ్ళు ఆవిడ్ని snub చేసినా వినుక్కున్నా వదిలేది కాదు. ఎవరికైనా ఆవిడను తప్పించుకోవడం చాలా కష్టం.

ఇంతలో ఆవిడ భర్త అనుకునే కుఱ్ఱాడికి పెళ్ళి నిశ్చయమైంది. అది ఎక్కడో తమిళనాడులో ఒక పల్లెటూళ్లో. ఆవిడకూడా పెళ్ళివారితో వెళ్ళింది. ఆ కుటుంబాన్ని అంతా స్నేహం చేసుకుంది. పెళ్ళయ్యాక మళ్ళీ పెళ్ళివారితో తిరిగి వచ్చింది. ఇంక యీ బోస్ కాంపౌండ్‌లో ఆవిడకి చోటు చిక్కక పక్కన ఏదో చిన్నకుటీరం వుంటే అందులో పెట్టింది ఆమెని నర్తకి. చలంగారి యింటికి వచ్చే వాళ్ళు, చలంగారి కుటుంబం అప్పుడప్పుడూ ఆమెకి కొంచెంగా డబ్బు యిస్తుండేవారు. ఆ డబ్బుపెట్టి ఆ ఒకానొక మొగుడికి ఏ పండో ఫలమో కొని తీసుకెళ్ళి యిచ్చేది. తను తిండి మానుకొని కొన్ని రోజులు ఉపవాసాలే పడుకుంది.

కొన్నాళ్ళు అట్లా జరిగాక ఆవిడకి వాళ్ళ వాళ్ళు డబ్బు పంపించడం మానేశారు. తిండికి కూడా మొగం వాచి పోయింది. అక్కడనించి తిరిగి ఏదో ఆశ్రమానికి వెళ్ళింది. అక్కడకి వెళ్ళి జబ్బు పడింది. పాపం ఆ ఆశ్రమం వాళ్ళే సేవచేసి ఆవిడను రైలు ఎక్కించి వాళ్ళవూరు పంపేశారు.

అప్పుడప్పుడు కొన్నేళ్ళకి అరుణాచలం వచ్చి చలంగారు వాళ్ళని చూస్తూ వుండేది. ఆ ఒకనొక మొగుడి కుటుంబ యోగక్షేమాలు కనుక్కొని వాళ్ళతో ఒకటి రెండు రోజులు గడిపి వెళ్ళేది.

అప్పట్లోనే (1952) బసవరాజుగారు వచ్చారు. "మాకో శిష్యుడు వొచ్చారు. ఆయనకి ఈశ్వరుడు కొద్దిపత్యంతో ఆసనాలు చేయిస్తున్నారు. నయమయింది. ఆయన మనోస్థితి అదివరకు చాలా హీన స్థితిలో వుంది. ఇంక ఆయన తిరిగి ఉద్యోగంలోకి సంసారంలోకి వెళ్ళరట. ముందు ఎట్లా బతక గలుగుతారో కూడా తెలీదు. ఏమైనా సరే వెళ్ళ నంటున్నారు. భగవాన్ చూస్తా నన్నారు. ఇట్లాంటివి జరుగు

తున్నాయి. ఆరువారాలలో అయనలో ఎంత మార్పో! తన వొళ్ళూ మనసూ చూసి పొంగి పోతున్నాడు."

(దీక్షితులుగారికి చలంగారి లేఖ 20-5-52)

అయన వుద్యోగంలో వుండగానే ఆయనకి టైఫాయిడ్ జ్వరం వచ్చింది. మానసికంగా దెబ్బ తిన్నారు. చలంగారు అరుణాచలంలో వున్నారని తెలిసి చలంగారి కోసం వచ్చారు. ఆయన్ని ఈశ్వరుడికి అప్పజెప్పేశారు. వచ్చేటప్పుడు ఆయన కొంచెం డబ్బు తెచ్చుకున్నారు. అది గాకుండా ఎన్నో లక్షల పొటెన్సీగల హోమియోపతి మందులు తనతో తెచ్చుకున్నారు. ఏవో ఒంట్లో జబ్బులున్నాయని వాటితో బాధ పడుతున్నానని ఆయన అభిప్రాయం. ఆమందులన్నీ తీసుకెళ్ళి ఒక గోతిలో పడవేయ మన్నారు ఈశ్వరుడు. "నేను చెప్పినట్లు చేస్తే, నీ జబ్బు అంతా కుదిరిపోతుంది" అన్నారు. సరే చేస్తా నన్నారు ఆయన. అప్పట్లో పల్లాకుత్తులో కుటీరాలు యోగులకి అద్దెల కిస్తూ వుండేవారు. అందులో ఒక కుటీరం అద్దెకి తీసుకున్నా రాయన. ఆ కుటీరానికి అద్దె నెలకి పావలా,

"మా 'చేలా' అంటున్నారే మీరు ఆయనని ఆరేళ్ళ కిందట నేను భగవాన్ దగ్గరకి పంపాను శాంతి నిమ్మని నన్ను పట్టుకుంటే. ఆనాటి నించి భగవాన్‌కి అతుక్కు పోయినారు. ఇప్పుడు ప్రశ్న లేకండా ఈశ్వరుడికి అర్పించుకున్నారు. ఆయన మా ఇంట్లో లేరు. వేరే ఏర్పాట్లు చేయించారు ఈశ్వరుడు. డబ్బూ కొంచెంగా వుంది. కాని ఆ డబ్బు వ్యవహారంకూడా మా ఖర్చు వ్యవహారాలు నడిపే ఈశ్వరుడే నడుపుతున్నారు."

(దీక్షితులుగారికి చలంగారి లేఖ 2-8-52)

ఆయన చేత రోజూ తలారా స్నానం చేయించి యోగాసనాలు వేయించేవారు ఈశ్వరుడు. తన వంట తననే వండుకో మన్నారు. నాకు "పొయ్యి వెలిగించడం రాదు. వంట రాదు" అన్నా రాయన. నర్సుకి దగ్గర నేర్చుకో మన్నారు. ఆయనకి గట్టి పట్టు కుదిరింది- గానీ ఆ బలహీనతలవల్ల ఏదో జబ్బు వుందని depression వచ్చి అలవి మాలిన బాధలు పడు తుండేవారు. బిగ్గరగా ఏడుస్తూ అర్ధరాత్రి పరు గెత్తుకు వచ్చేవారు. అప్పుడు చలంగారు వాళ్ళు ఆయనకు ధైర్యంచెప్పి పంపించేవారు. మెల్లిగా ఆయన తన కుటీరం ముందు ఒక చిన్న తోట పెంచుకున్నారు. ఆయనకి వంట చేయడం అది చేత నయింది. చలంగా రింట్లో ఏదైనా ఒక ఆదరువు ఇచ్చేవారు అన్నంలోకి. తరు వాత ఆయన్ని సోమరిగా వుండకండా వీలున్నంత వరకూ పనిలో వుండ మనేవారు ఈశ్వరుడు. రాట్నం తెప్పించి నూలు వడకమని ఆ నూలు ఖాదీస్టోర్సులో అమ్మించే వారు. ఆ డబ్బు ఆయనకి అక్కరకి వచ్చేది.

ఇంతలో ఈశ్వరుడు శుక్రవారం మానవతిగారు వస్తున్నారు అన్నారు. ఆవిడ వెనుక ఒకసారి వచ్చింది కానీ ఈశ్వరుడ్ని విశ్వ సించలేక వెళ్ళిపోయింది. మళ్ళీ ఎలా వస్తుందని అందరికీ సందేహం. ఆమె ఆ శుక్రవారం రాలేదు. అందరూ ఈశ్వరుడు చెప్పినట్లు జరగ లేదే అని గొడవ పడ్డారు. అప్పు డాయన "చూడూ నేను శుక్రవారం అన్నాను గాని ఈ శుక్రవారం అనలేదు. "అది నువ్వు స్పష్టం చేసి మరీ చెప్పాలి" అన్నారు షా తో. అలాగే అవతలి శుక్రవారం వచ్చారు మానవతిగారు. కొన్నాళ్ళుగా ఆవిడ మద్రాసులో వుంటు న్నారు. ఇప్పుడు అక్కడి నించి వచ్చారు ఆమె. అప్పట్లో చలంగారికి సాధన తీవ్రత వల్ల జ్వరం వస్తుండేది. సరిగ్గా ఆ రోజువ చలంగారికి

జ్వరం వచ్చింది. "ఈశ్వరుడు మిమ్మల్ని ఈ విధంగా చేశారా?" అని దిగులు పడ్డారు మానవతిగారు. కానీ చిత్రం ఏమంటే ఆవిడ మరునాటి నించి ఈశ్వరుడ్ని విశ్వసించడం మొదలు పెట్టారు. మద్రాసులోనే వున్నారు గనుక తరచు వచ్చేవారు. ఆవిడతో బాటు చిన్నారావుగారు కూడా వచ్చేవారు. ఈశ్వరుడు ముందుగా చలంగారి చేత బైబిలు చదివించారు. ముఖ్యంగా ఏది చెప్పినా బైబిల్లో సంగతులే చెప్పేవా రాయన. ఆ రోజుల్లో ఎవ రెవరు ఎవరుగా పుట్టారో, జన్మలు విశేషాలు చెబుతూ వుండేవారు.

## 4

చలంగారు వాళ్ళు తిరువన్నామలై ఒచ్చిన కొత్తలో ఒక జటాధారి వాళ్ళ ఇంటికి వొచ్చేది, అమ్మ ఆవిడకి ఏమన్నా ఫలహారం పెట్టేది. ఆవిడ తన రొంటినించి ఒక కృష్ణుడి బొమ్మని బైటికి తీసేది. ఆ బొమ్మతో కొంచెంసేపు మాట్లాడి, దాన్ని నాలుగు ముద్దులు పెట్టుకుని, తనకి పెట్టిన ఫలహారాల్ని ఆ కృష్ణుడికి పెట్టి తరువాత తాను తినేది. ఆ తరువాత ఆ బొమ్మని భద్రంగా మళ్ళీ రొంటిలో పెట్టేసుకునేది. ఆమెని వూళ్ళో అందరూ 'శబరి' అని పిలిచేవారు.

శబరి ఎండిపోయిన మోడు చెట్టులా వుండేది. కానీ ఆమె కళ్ళు మాత్రం ధగ ధగ లాడుతూ వుండేవి. ఆవిడ కాషాయం కట్టుకునేది. ప్రత్యేకం ఆవుల దర్శనం కోసం ప్రతీ మంగళవారం షా వాళ్ళ ఇంటి వెనక జరిగే సంతకి వొచ్చేది.

శబరి వుండేది అరుణాచలేశ్వరాలయంలో. ఎక్కడ బడితే అక్కడ రోడ్లమీద తిరిగేది. కానీ తలమీద గానీ, ఒంటిమీదగానీ లవలేశమంత దుమ్ము కనబడేది కాదు. అంత శుభ్రంగా వుండేది.

శబరి తనని గురించి చలం కుటుంబీకులకి చెప్పుకునేది. ఆవిడ మళయాళీ. చిన్నప్పుడే దైవభక్తితో అరుణాచలం వొచ్చేసింది. పెళ్ళి చేసుకోలేదు. ఆమె మాటలు వింటూంటే ఎక్కడో మెదడు కొంచం loose ఐందనిపించేది. ఎప్పుడూ ఎంత పారవశ్యంలో వుండేదో! డాలీని చూస్తే ఎంత సంతోషమో ఆమెకి! ఆమె చెల్లెలు అలా వుండే దట. "పారో, పారో, నాతో మాట్లాడవా! పారూ! ఎన్నాళ్ళకి చూశాను నిన్ను. నాతో మాట్లాడవా?" అని డాలీని చూసి అనేసరికి డాలీ భయంతో లోపలికి వెళ్ళిపోయేది. ఆవిడ రోడ్డుమీద వెళ్తో దారినపోయే వాళ్ళని తనకి ఏం కావాల్సినా అడిగేది. ఆమె ఎవర్ని ఏది అడిగినా సరే వాళ్ళు లేదనకుండా ఇప్పించేవా రామెకి. ఆవిడ జోలికి పోవడం హడలు అందరికీ, శాపం పెడుతుం దని.

"మా ఇంటికి వారానికి రెండుసార్లు ఒక యోగిని వొస్తో వుంటుంది. ఆమె మీరు రాసిన శబరిలాగు వుంటుం దనుకునే వాళ్ళం. ఇంతలో ఆమె అసలు పేరే శబరి అని తెలిసింది. ఆమెని ఈ రెండు మూడు ఏళ్ళూ మేము 'అవ్వయార్' అని పిలుస్తున్నాం.

మొన్న ఆమె నాతో అంది "వుసిరికాయలు అడివిలో దొరికితే నీకు తెచ్చి పెడతానులే" అని. ఆమె అడవులవెంట తిరుగుతోనూ వుంటుంది. నాకు ఉసిరిక పచ్చడి పంపమని మీకు రాశానని మరిచి పోయినాను ఎప్పుడో. నేను. "ఉసిరికాయ లేమిటి?" అన్నాను. "నాకు భగవాన్ కలలో కనబడి అడివిలో వెతికి నీకు ఉసిరికాయలు తెచ్చిపెట్టమన్నారు" అంది.

మళ్ళీ ఇవాళ వొచ్చింది. ఆ సంగతి ఎత్తలేదు. ఈ విధంగా తెలుపుతో వుంటారు భగవాన్. ఎంత దగ్గిరిగా ప్రతి నిమిషం మనని కనిపెట్టి చూస్తో వుంటారు తాను! నేనే అడిగాను. ఇప్పుడే ఆమెని

'నెల్లికాయలు ఏవీ?' అని అంటే వెళ్ళిపోతో ఆమె "ఎంత వెతికినా కనపళ్ళేదు. నువ్వూ భగవాన్ ఇద్దరూ పిచ్చివాళ్ళ మల్లే వున్నారు. ఈ కాలంలో ఉసిరికాయలు ఎక్కడ దొరుకుతాయి?" అని నవ్వింది.

నేను ఉసిరికాయ పచ్చడి కోరడం గమనించి, నా కోసం ఆయన 'అవ్వయారు'తో చెప్పి ఉసిరికాయల కోసం వెతికించడం, నేను వొద్దంటున్నా మీచేత ఉసిరికాయ పచ్చడి నాకు పంపించడం. అట్లాంటి కరుణ భగవాన్నించి ఎవరికి దొరుకుతుంది, భక్తులకి కాక. లోకంలోని ఐశ్వర్యమంతా మన చొళ్ళో ఆయన పోసినా, ఆయన కరుణని ఇంత గొప్పగా చూడగలమా?"

(దీక్షితులుగారికి చలంగారి లేఖ 1-10-53)

'సేవా' గృహానికి వొచ్చాక కూడా శబరి వొచ్చి వెళ్ళేది. నర్తకి వాళ్ళు ఆమెకి కడుపునిండా భోజనం పెట్టి పంపించే వాళ్ళు. ఒకసారామెకి ఏం తిక్క వొచ్చిందో గాని "నాకు అన్నం సరిగ్గా పెట్టటల్లేదు. ఈ ఇంటి గలాయన కింక అన్నం సయించదు చూడండి" అనేసి వెళ్ళిపోయింది నిష్కారణంగా. ఆ రోజునించి చలంగారికి అన్నం నోట్లో పెట్టుకుంటే చేదు అనిపించడం మొదలైంది. జరిగిన సంగతిని ఆయన షాకి చెప్పారు.

"ఇలాంటి వాటిని నువ్వెందుకు లెక్కపెడతావ్?" అన్నారు షా. అక్కడితో ఆ శాపం పోయింది, అప్పటినించి శబరి న్యూసెన్స్‌గా పరిణమించింది. దాంతో ఆమెని ఇంటికి రానివ్వడం మానిపించేశారు నర్తకి వాళ్ళు.

అప్పటి నించి ఎప్పుడన్నా షా రోడ్డుమీద కనబడితే ఆమెని పలకరించేది శబరి. ఓసారి గిరి ప్రదక్షిణంలో అడియన్నామలై గుడి

దగ్గర షా కూచుని వున్నారు. అక్కడికి వొచ్చి గట్టిగా, ఆప్యాయంగా షాని పలకరించింది శబరి.

"స్వామిని చూడడానికి వెళ్ళలేదా?" అని షాని అడిగింది.

"లేదు" అన్నారు షా.

"నువ్వే స్వామివి. నువ్వు గుడిలోకి వెళ్ళడం ఎందుకు?" అంది శబరి.

ఇంకొకసారి షా గిరి ప్రదక్షిణం చేసి తిరిగి వొస్తోంటే శబరి రోడ్డుమీద కనబడి షాని కావలించుకుని బుగ్గలు తడివి సంతోషం కనబరిచింది. అదే షా శబరిని ఆఖరిసారి చూడడం. తరువాత శబరి ఎక్కడకో వెళ్ళిపోయింది. కొద్ది రోజులకే మహాబలిపురం నించి శేషాద్రిమఠానికి టెలిగ్రామ్ వొచ్చింది, శబరి చనిపోయిందని- ఈ సంగతిని తెలుగువారికీ, జగదీష్‌కీ చెప్పమని, ఆమె చెప్పిందట.

తెలుగు సాహిత్యానికి ఒక దశలో గొప్ప చైతన్యం వెలిగిపోతున్న సమయంలో రచయితల్ని, కవుల్ని admire చేస్తో వారిని parody చేస్తో ఆ దారి వెంట తిరిగిన జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి గారు చలంగారికి ఉత్తరం రాశారు. ఆయన 1936 వ సంవత్సరంలో చలంగారింటికి ఓం ప్రథమంగా వొచ్చారు. అప్పటినించీ ఆయన చలంగారి స్నేహం వదల్లేదు. కాని భగవాన్ దగ్గిరికి చలంగారు వచ్చినప్పటి నించీ ఒక మహారచయితని భగవాన్ రాయకండా చేశారని భగవాన్‌మీద చాలా కోపంగా వుండేది ఆయనకి. ఇప్పుడు వుత్తరంలో ఇట్లా రాశారు.

"ఉమాసహస్రం" చదివే టప్పుడు- మీరు, సౌరిస్ విభూతి, కుంకుమ పెట్టుకుని కనబడుతున్నారు నాకు. మీరు నిజంగా ఇట్లా మారేరా? నా కేదన్నా భ్రమ కలుగు తోందా?" అని.

అప్పుడు చలంగారు ఈశ్వరుడి గురించి రాస్తూ "నేను కాక పోయినా సౌరిస్ ఇట్లాంటి వేషంలోనే వుంది. మీరొక సారి రండి ఇక్కడికి. మీకే అర్థం అవుతుంది" అని రాశారు.

"నేను వీలు చూసుకుని వస్తా" నని ఆయన తిరిగి ఉత్తరం రాశారు.

అన్నీ వొదిలి ఇక్కడికి ఈ అడివిలోకి వచ్చేసినా 'చలంగా రెక్కడ వున్నారా?' అని వెతుక్కుంటూ ఒక రిద్దరు అప్పుడే కళ్ళు తెరుస్తున్న కుఱ్ఱవాళ్ళు వస్తూనే వున్నారు. కొంత మంది కుఱ్ఱవాళ్ళు హృదయం తెరుచుకుని లేఖలు రాస్తూనే వున్నారు.

ఎవరయినా కష్టాలలో వుండి 'చలంగారూ! మేము కష్టాల్లో వున్నాం" అని రాసిన లేఖలు చలంగారు షౌకి చదివితే "ఈశ్వరుడు వున్నారు. విశ్వాసం వుంచు కోండి. ధైర్యంగా వుండండి" అని రాయించేవారు ఈశ్వరుడు. మొట్టమొదటలో చలంగారు, "భగవాన్ వున్నారు" అని రాశారు. ఈశ్వరుడు 'ఈశ్వరుడు' అని correct చేశారు. "ఎట్లా రాయను? వాళ్ళకి ఏ మర్థ మవుతుంది. ఇన్నాళ్లూ వున్నాడా, లేడా అని సందేహిస్తూనే వున్నాను. ఈశ్వరుడు లేడు అన్నాను. ఎందరో నా మాటల్ని లోపలికి తీసుకున్నారు. ఇప్పుడు వున్నాడని రాస్తే— వాళ్ళు ప్రశ్నిస్తే ఏం చెప్పగలను?" అని అడిగారు చలంగారు.

"అప్పుడు ఈశ్వరుడు లేడనడం ఎట్లాంటి వాడికత్తి అయిందో, ఇప్పుడు వున్నా డనడం అట్లాంటి వాడికత్తే అవబోతోంది" అన్నారు ఈశ్వరుడు. ఆ తరువాత ఎవరన్నా ప్రశ్నిస్తే చలంగారు "ఈశ్వరుడు మా ఇంటికి వచ్చారు. మమ్మల్ని నడిపిస్తున్నారు" అని తెలిపేవారు

పుత్రాల్లో. అప్పట్లో చలంగారికి దృఢవిశ్వాసం. అంతే కాదు. తనకి దొరికిన వెలుగు ఆర్తులకి అందచేయాలని ఆయన ఆరాటం.

"పోయినసారి మద్రాసునించి వచ్చాక నాజీవితంలో గొప్ప మార్పు జరిగింది. ఆనాటి వరకూ నాకు ఈశ్వరుడిలో నమ్మకం లేదు. ఇప్పుడు ఈశ్వరుణ్ణి తెలుసుకున్నాను. ఆ పైవాక్యం మీద ప్రశ్నలు వేస్తే తట్టుకోగల అర్హత ఇంకా రాలేదు నాకు.

చిత్ర మేమిటంటే— ఇదివరకు ఈశ్వరుడు ఉన్నట్టు లేడు అంటే నామాట ఎవరూ నమ్మలేదు. ఈనాడు ఈశ్వరుడు నిశ్చయంగా ఉన్నాడు అంటే. ఎవరూ నమ్మటం లేదు. "నీ మొహం నీకెట్లా తెలుస్తాడు ఈశ్వరుడు ?" అంటున్నారు పరమ భాగవతోత్తములైన చింతా దీక్షిత ప్రభృతులు. నా పుటకతో పుట్టిన తల నెప్పుల్ని కుదిర్చారు భగవాన్. నా కింకా శక్తి రాలేదు. ఇంకోరికి దారి చూపేందుకు. కానీ ఈశ్వరుడి నించి తెచ్చి వారి దారిమీద వెలుగు పడెయ్యగలను.

విచిత్రం ఏమిటంటే— సావధానంగా చదవండి. ఇక్కడ నేను గట్టి సాధన చేస్తున్నాను. సాధనలో ముఖ్యభాగం ఆలోచించక పోవడం.— మనో నాశానానికి ప్రారంభ పాఠం— ఆలోచనల్ని ఎక్కడి కక్కడ తెగకొట్టటం. ఇప్పుడు నాకేం మిగిలాయి? ముఖ్యం జ్ఞాపకాలు. వాటిల్నించి మేలుకొని ఈ ప్రపంచాన్ని ఒక కల లాగు చూడడానికి ప్రయత్నించడం. మేలు కున్నామా మేలుకో గలిగామా ఆ మెలుకువ స్వర్గాన్ని మించిన ఆనందంలోని— కాంతిలోకి. ఆలోచనలు అణిగినకొద్దీ (పుత్త అణగడం కాదు— నాశనం కావడం) ఆ ద్వారాలు కొద్దిగా తెరుచుకొని అమృతం వర్షిస్తుంది.

ఆ జ్ఞానవిద్యుచ్ఛక్తి, ఆధ్యాత్మికానుభవం జరిగిన రోజున తట్టుకునే అంతః శక్తి కోసం నా చేత తీవ్రమైన శరీర మనోసాధనలు

చేయిస్తున్నారు. కఠిన పత్యం. ఒక చేపగాని, ఆవకాయిగాని (మిరప కాయ, చింతపండు) ఇవన్నీ చూసి ఏడాదయింది. నేలమీద నిద్ర. ఇట్లా అన్నీ.

ఇంతకీ మీకెందు కిట్లా తిరిగింది. ఆధ్యాత్మికం మీదికి. తప్పకండా రండి.

సౌరిస్ చాలా గొప్పస్థితిలో వుంది. మీ రిక్కడికి రావడానికైనా ఈశ్వరానుజ్ఞ కావాలి. ఆయన్ని అడగండి"

(జ. రుక్మిణీనాథశాస్త్రిగారికి చలంగారి లేఖ 30-5-52)

ఈ లేఖని సుదీర్ఘంగా ఉదహరించడానికి కారణం ఆనాటి చలంగారి మానసికస్థితి సులభంగా అవగాహనకి వస్తుంది గనుకనే.

అప్పట్లోనే శకుంతల వొచ్చారు. శకుంతల బెజవాడలో నర్సుగా పనిచేస్తున్నారు. చలంగారు తిరువన్నామలై వొచ్చాక వాళ్ళని చూడడానికి వొచ్చా రామె. ఆమె చలంగారూ వాళ్ళని చూడగానే "జనక మహారాజు ఈ సంసారమూ. రాజ్యమూ ఇవన్నీ నా కెందుకు! హాయిగా అడవుల్లోకి పోయి తపస్సు చేసుకోక— అని ఎవరికీ తెలియకండా అడవుల్లోకి వెళ్ళారట— కొంతకాలం అయ్యాక చుట్టూ చూసేసరికి తన భార్య. తన పిల్లలు. తన సభికులు, ప్రజలు— అంతా అక్కడికే వొచ్చి ఆయన చుట్టూ చేరారట. ఇంక అడవిలో, ఎందుకు వుండటం. నా రాజ్యం నేను చేసుకోక అని జనకమహారాజు మిథిలకి తరలి వెళ్ళారట. అట్లానే బెజవాడలో అంత పెద్ద సత్రంలా వున్న ఇల్లు మీరు వొదులుకొని వొస్తే ఇక్కడా మీ చుట్టూ జనం పోగయారు" అని నవ్వారు.

శకుంతలకి ఈశ్వరుడు మీదగాని, ఏ దేవుడు మీదగాని భక్తి లేదు. ఆశ్రమానికి కూడా వెళ్ళేది కాదు. చలం కుటుంబం మీదనే

గింది. చలంగారిలో ఎంత విశ్వాసం అంటే ఈశ్వరుడు చెప్పినదానికి ఒక పొల్లు కూడా వ్యతిరేకంగా చేసేవారు కా దాయన.

ఒకసారి చలం మహర్షి, నర్తకి, సౌరిస్ స్కంధాశ్రమానికి బయల్దేరారు. వాళ్ళు స్కంధాశ్రమం దోవలో వెడుతున్నారు. తన దోవని తాను వెడుతున్న కొండజెర్రి ఒకటి వెనక్కి తిరిగి వొచ్చి చలంగార్ని కాలిమీద కుట్టింది. అది ఆయన జాతక లక్షణం కాబోలు! ఆయన పెదిమల దగ్గర నించి కమిలిపోయి నీలంగా అయి పోయారు. వొళ్ళంతా చెమటలు కారి పోతున్నాయి. వొళ్ళు చల్లబడి పోయింది. ఆ కొండజెర్రి కుడితే అయిదు నిమిషాలకన్నా మనిషి బతకడు. కొండ మధ్య దోవలో ఎక్కడికి పోతారు?

చలంగారి లుంగీ చించి విషం ఎక్కకుండా కాలికి కట్టు వేశారు షా. నర్తకి చేత స్కంధాశ్రమం నించి విభూతి తెప్పించి వేయించారు ఈశ్వరుడు. విషంవల్ల నీరసించి చతికిలబడి వున్న చలం గార్ని 'లేచి నడు' అని ఆజ్ఞాపించారు ఈశ్వరుడు. వెంటనే లేచి చలం షా భుజం పట్టుకుని నడిచారు. ఆ కొండరాళ్ళ లోంచి అతివేగంగా చలంగార్ని కిందికి దింపుకుని వొచ్చారు షా. ఆశ్రమం వాళ్ళ విరోధం వలన ఆశ్రమం డాక్టరు పిలిచినా రాలేదు. చలంగార్ని ఇంటికి తీసుకుని వొచ్చారు. పాముల మంత్రం వేసే అతనికి కబురు పెట్టారు.

చలంగారికి ఒకటే డోకులు, విరేచనాలు పట్టుకున్నాయి. పల్సు క్షీణించి పోయింది. గ్లూకోజ్ ఇద్దా మంటే చిత్ర అలమారు తాళం వేసుకుని బజారు వెళ్ళింది. విషానికి విరుగుడు నిమ్మరసం గనక ఇద్దామని చూస్తే ఇంట్లో నిమ్మకాయ లేదు.

చలంగారు "అవేవీ చూసుకోకండి. భగవాన్‌కి నమస్కారం చేసి మీరు 'మమ్మల్ని ప్రదక్షిణం తీసుకు వెళ్ళండి' అని ప్రార్థించండి" అని చెప్పి ఎట్లా వెళ్ళాలో దారి తెలిపారు, వాళ్ళు అట్లాగే గిరి ప్రదక్షిణం వెళ్ళి తిరిగి వచ్చారు. తిరిగి వచ్చి 'మాకు' ఏమీ కష్టం అనిపించ లేదండి. మేము సరిగ్గా సరాసరి ఈ దారి నించి వెళ్ళి ఎటు పోవాలా అని చూస్తోంటే ఆ మలుపు దగ్గిర ఒకాయన కనబడ్డారు? ఆయన మమ్మల్ని తెలుగులో పలకరించి ఎక్కడికి వెడు తున్నారు. అని అడిగారు. మేము మా సంగతి చెప్పి ఇట్లా గిరిప్రదక్షిణం వెళ్ళ డానికని బయల్దేరాం అని చెప్పాము.

"అయితే నేనూ గిరిప్రదక్షిణానికే బయల్దేరాను. "నాతో రండి" అన్నా రాయన. తన పేరు శివప్రకాశం పిళ్ళే అని, భగవాన్ పూర్వం గిరిప్రదక్షిణం తిరిగేటప్పుడు తాను వెంట వుండి తిరిగే వాడినని చెప్పా రాయన. తరువాత భగవాన్ ఎక్కడెక్కడ ఆగేవారో, ఏ ఏ చోట ఏం చేశారో మాకు తెలుపుతూ గిరి అంతా మాతో పాటు చుట్టారు. ఊళ్ళోకి వచ్చిన తరువాత "నేను ఇక్కడే వుంటాను. మా ఇల్లు ఇక్కడే వూళ్ళోకి వచ్చారుగా మీకు దారి సులభంగా తెలుస్తుంది కదా" అని వెళ్ళిపోయారు. మేం వొచ్చేశాం" అన్నారు వాళ్ళు. ఆ శివప్రకాశం పిళ్ళే ఎన్నడో చచ్చిపోయారు. షా వాళ్ళకి ఆశ్చర్యం వేసింది. పైగా ఎంత అదృష్టమో వీరేశలింగంగారికి. శివప్రకాశం భగవాన్ అనుభవాలు కబుర్లూ చెబుతూ, ప్రతీ చోటూ చూపుతూ తీసుకు వొచ్చా రాయన్ని. ఆ తరువాత వీరేశలింగంగారు వాళ్ళ వూరు వెళ్ళారు. కానీ చలంగారికి వుత్తరాలు రాస్తూనే వున్నారు.

ఈశ్వరుడి మాటల్ని (ఆయన ఏం వుద్దేశించేవారోకానీ) చలంగారు వాళ్ళు ఇంకో విధంగా అర్థం చేసుకునేవారు. దాంతో చాలా

పార్లు ఈశ్వర వాక్కులు తారుమారు అయినట్లు కనిపించేవి. వీరేశ లింగంగారు రెండేళ్ళలో వొచ్చేస్తున్నారంటే ఎప్పటికీ వుండిపోవడానికి వొచ్చేస్తున్నారన్న భావన కలిగించింది చలంగారు వాళ్ళకి. ఈశ్వరుడు చెప్పేవి కొన్ని జరిగేవి కావు. అవి ఇంకే plane లోనో జరిగేవేమో, కారణం ఏమంటే అవి అబద్ధం కావు. కొన్ని ఇవి జరగడం అసాధ్యం అని చలంగారూ వాళ్ళు అనుకునేవి జరిగేవి. ఈ విష యాన్నే చలంగారు వీరేశలింగంగారికి ఒక లేఖలో ఇలా రాస్తారు.

"మనం ప్రశ్నలతో సమీపించేది ఈశ్వరుడి నని మరిచి పోకూడదు. ఆయన జ్యోతిష్కులు కారు. మన కోర్కెలవల్లా చెల్లిం పుల వల్లా ఆయనని ఏమీ తిప్పుకో లేం. ఆయన నించి ఒక మాటని కూడ తప్పించుకోలేం. ఆయన ఏమయినా జరుగుతాయి అంటారు గాని ఎప్పుడు జరుగుతాయో సాధారణంగా ఆయన ఎవరి విషయంలోనూ చెప్పటంలేదు. ఆయ నన్నవి కొన్ని జరగనట్లుగా, అసాధ్యాలుగా కని పిస్తాయి. కానీ జరుగుతాయి. ఎట్లా జరుగుతాయో వూహించలేము. ఒక వేళ జరిగినా ఏ plane లో జరిగాయో మనస్సుతో conceive చేయలేం" అని.

ఈశ్వరుడు తాను చెప్పింది ఏదయినా జరక్కపోతే "జరక్క పోతే మీకేం నష్టం ?" అని అడిగేవారు. వాళ్ళకి ఈశ్వరు డెందు కిలా చెప్పాలి అనిపించేది. "ఔను, అట్లా చెప్పాను. దీంట్లో నిజం చెబితే హాని చేస్తుంది కానీ ఫలితం లేదు. అట్లాం టప్పుడు కాదు అని చెబు తాను"— అనేవారు. ఇన్నిట్లోనూ ఏదో అగ్రాహ్యమైన సత్యం వుంది. మాటలోనే వుంది అసత్యం. అసలు మాట అన్నదే అసత్యం. కనీ వినీ ఎరగనివి, ఊహించనివి, ఊహించుకోలేనివి, ఆయన జరుగు తాయంటే జరిగాయి. ఏవయినా ప్యాసు, ఫెయిల్, రాక, పోక ఇత్యాది

స్వల్ప విషయాలే తప్పాయి. అంటే ఇలాంటి చిల్లర మల్లర విషయాల మీద ఈశ్వరుడిపై విశ్వాసం ఆధారపడి వుండకూడ దనిపిస్తుంది. అసలు దొంగ వేదాంతుల కుహనా వైఖరులవల్ల ఈ కలికాలంలో ఈశ్వరుడన్న భావన తేలి కయిపోయింది. ఈనాడు లోకంలో ఈశ్వరుడు అంటే వున్న భావన ఏమిటో శాస్త్రిగారికి చలంగారు రాసిన ఉత్తరంలో చూడొచ్చు.

"ఈ యుగంలో తన మతాన్ని ప్రచారం చేసేందుకు మన బోటి బక్క పీనిగలు దొరకారు ఈశ్వరుడికి. మనం ఆయనలో విశ్వాసం వుంచుకోవాలంటే మనకి తను ఈశ్వరుడు అని చెప్పుకోవాలి. ఈశ్వరుడే నని రుజువు చేసుకోవాలి. సందేహాలు తీర్చాలి. అలకలూ, తిట్లూ భరించాలి. నిరంతరం వుపకారాలు చేస్తూనే వుండాలి. ఆ ఉపకారాలూ ఆలశ్యం కాకూడదు. ఆ ఉపకారాలు మనని బాధిస్తే తీసేసుకోవాలి. ప్రతి రోజూ మనకి కొత్తగా విశ్వాసం చెప్పుకుంటోవుండాలి. బాధ లన్నీ తీసెయ్యాలి. తను బాధించకూడదు. ఉండి ఉండీ మనని పొగడాలి. మనతో ప్రత్యేకం మాట్లాడాలి. అన్నీ చెప్పాలి. పూర్వ జన్మలూ, భవిష్యత్తులూ ఉన్నాయని ధైర్య మివ్వాలి. ఇంకా ఎన్నో. ఇవన్నీ ఆయన చేస్తేనే మనం ఈశ్వరు డని అంటాం. ప్రేమిస్తాం. ఏడుస్తూ కొంచెంసేపు భజనలు చేస్తాం."

ఇన్నిటివెనకాల కనిపించేదేమంటే పైపై విషయంమీద Rely కాకండి. "మీ ఆచరణలో అచంచలమైన విశ్వాసంతో నన్ను పట్టుకోండి" అని ఈశ్వరుడు వుద్దేశించారని. మాటల్లో చెప్పడం అంటూ వస్తే ఎవరు చెప్పినవైనా తప్పక తప్పవు. ఆరోజుల్లో షా అనేదిలేదు ఈశ్వరుడే. ఒకమాటతో విశ్వాసం తలకిందులయిపోయే బలహీనులు ఈశ్వర రాజ్య ప్రవేశానికి ఎలా అర్హులవుతారు? నలిగి నలిగి జీవిత

రధచక్రాలకింద నెత్తురు లోడ్చాలి. పరితపించి పరితపించి అర్పణతో అపార కృపానిధియైన ప్రభువుని చేరాలి. ఆయన రూపంలో వచ్చి నంత మాత్రంలో సాధన లేకండా ఎవరికీ లభ్యపడదు. అందుకే ఇలా చిన్నచిన్న వచోవ్యాఘాతాలతో (మాట తప్పింపులతో) గుంపుల్ని జల్లెడ పట్టేవా రనిపిస్తుంది. నాకు అవయినా తప్పిపోయినట్లుగా కనిపించేవి పైకి. ఏ కోణంలోనో జరిగిపోయేవి. ఇక సత్యపుటస్తిత్వాని శంకించటం ఎలా? ఈ ప్రపంచ స్వప్నంలో ఈశ్వరు డొకడే అక్షర సత్యం. ఆ ఈశ్వరుడే ప్రత్యక్షంగా నడుపడం అరుదైన విషయం. అదే చలంగారి కుటుంబీకులకీ, విశ్వాసులకీ, ఆర్తులకీ పట్టిన మహద్భాగ్యం.

జీసస్ ప్రేమతో విశ్వాసాన్ని బలాన్ని ఇచ్చి నడిపారు అపోస్తలుల్ని. అప్పట్లో ఛాయామాత్ర వ్యక్తిత్వం వున్న షౌకి ఎవరన్నా వస్తే వాళ్ళని ఈ వెలుగు మార్గంలో వాళ్ళకి బలం ఇచ్చి నడిపించాలనీ, వాళ్ళు నడుస్తారని ఆశ వుండేది. వారి నేవిధంగా కళ్ళు తెరిపించి నడిపిద్దామా అనే వుద్దేశం వుండేది అప్పుడు ఆమెలో.

ఈశ్వరు డున్నారా అని ఎవరన్నా వుత్తరాలు రాసినా బాధల్తో వచ్చినా వాళ్ళకి ఉత్తరాల వల్లో ఇక్కడికి రావడం వల్లో సహాయం జరిగేది. ఇంక చలంగారూ వాళ్ళకి వాళ్ళ ఉత్సాహం, విశ్వాసం చూస్తే ఇంక వాళ్ళు ముందుకి నడుస్తారు, ఈ వెలుగులోంచి తప్పుకోరు అనిపించేది. కానీ ఇక్కడి వేడిని భరించలేక కొద్దిరోజుల్లోనే జారుకునేవారు. కానీ కొంతమంది చివరి వరకూ నిలిచారు.

ఈశ్వరుడు వున్నారు. ఆయనని నమ్మినవారికి ఓదార్పు వుంది అన్న గొప్ప **assurance** (అభయం) చలంగారూ వాళ్ళందరికీ వుండేది. ఏ సమస్యలు వున్నా, ఏ ప్రశ్నలు వున్నా వాళ్ళ జీవితాలలో

గానీ, బాధలతో పరితపిస్తూ వారికి ఉత్తరాలు రాసే వారికి గానీ ఈశ్వరుడే గొప్ప పరిష్కారమూ, ఓదార్పు అయి పోయారు. కానీ ఈశ్వరుడ్ని తీసుకో లేనివారు ఎంత వుత్తములైనా, ఎంత మంచి వారైనా, స్నేహంలో ఏ లోపం చూపించక పోయినా— ఇక్కడ ఈశ్వరుడి వేడికి తట్టుకో లేక ఈశ్వరుడితోనే కాదు, చలంగారితో కూడా విరోధించి వెళ్ళిపోయే వారు. చలంగారు "ఈశ్వరుడితో విరోధిస్తే నాతో కూడా విరోధించాలా?" అనేవారు నవ్వుతూ. ఆ విధంగా ఎంతమంది స్నేహితులు వాళ్ళకి దూర మైపోయారో! ఎందుకంటే ఆరోజుల్లో ఈశ్వరుడ్ని విశ్వసించకపోతే ఇంకో విధంగా నిలవడానికి వీలు లేనంతగా ఈశ్వర మయమయి పోయింది, చలం గారింటి వాతావరణం. ఇదంతా విస్తీర్ణం కాబోతోందనీ పెద్ద ఆశ్రమంగా రూపొంద బోతోందనీ ఈశ్వరుడు చెప్పేవారు ఆ రోజుల్లో. దానితో చలంగారు వాళ్ళకి ఎలాంటి **idea** వచ్చిందంటే ఇది ఏ అరవిందాశ్రమం లాగో పెద్ద **institution**లా అయి పోతుందనీ. అక్కడికి మల్లే ఒక క్రమపద్ధతిలో ఇది నడవ బోతుందనీ అనుకునే వారు. కానీ అట్లా **institution** కావడం వాళ్ళెవరికీ ఇష్టంలేదు. అట్లా అవబోతున్నప్పుడల్లా ఈ నాటి దాకా ఏదో అడ్డు వచ్చి అది కాకండా పోతుంది. తరువాత కొందరు జ్ఞానులు కలిసి వుండ బోతున్నారు. ఎక్కడాలేని గొప్ప ఆశ్రమం అవుతుంది అనే వారు ఈశ్వరుడు. కానీ అట్లా కూడా జరగలేదు. అది ఎప్పుడు జరగ బోతుందో తెలీదు. జరిగిందేమో కూడా మనం గుర్తించ లేం. జ్ఞానిని కొలిచే తూకాలు మన మనోలోకంలో లేవుకదా.

తరువాత అప్పుడప్పుడు ఒక్కొక్క **grade**లో తమ లోపల ఏదో **passage** తెరచుకుని కొంత కొంత లోపలికి వెడుతున్నట్లు అనిపించేది షౌకి.

## 5

ఆశ్రమంవాళ్ళు చలంగా రింటికి పోకూడదని అప్పటి కింకా ఎవరికీ ఆంక్ష పెట్టలేదు. ఇంతలోకి జగదీష్ అనే గుజరాతీ అబ్బాయి ఆశ్రమం నించి భజనకి రావడం ఆరంభించాడు. అతను చిన్నతనంలో భగవాన్ దగ్గరకి తల్లిదండ్రులతో వచ్చాడు. లోగడ ఆశ్రమం గేట్లు మూసేవారు కాదు, ఇప్పుడు మూయడం మొదలు పెట్టారు. ఆ కాలం నించీ రాత్రి 7-30 గంటలకే ఆశ్రమంలో భోజన సమయం. చలంగా రింట్లో భోజనాలు కాంగానే భజన చేయడం ఆనాటి నించి కూడా పరి పాటి. జగదీష్ వచ్చే సరికి చలంగా రింట్లో భజన అయి పోయేది. అతను రోజూ ఆలస్యంగానే వచ్చేవాడు. ఓ రోజు అతన్ని చలంగారు "ఎందు కాలస్యంగా వస్తున్నా" వని అడిగారు. ఆశ్రమంలో భోజనం చేసి బయలుదేరే సరికి గేట్లు వేసి వుంటున్నా యని, అందువలన చీకట్లో పాలితీర్థం వైపునించి వస్తూవున్నా నని చెప్పా డాతను. అతని మనస్సు చంచలం అయి పోతున్న సమయంలో భగవాన్ అతనికి "నువ్వు వాళ్ళ భజనకి వెడుతూండ" మని ఆదేశించా రట. చూడ టానికి కూడ కొంత వెఱ్ఱివాడి లాగ వుండే వాడతను. అతను అంత శ్రద్ధగా రావడం చూసి చలంగారు వాళ్ళు తమ భజన అయిపో యినా గూడా అతను రాగానే మళ్ళీ భజన ఆరంభించేవారు. గుజరాతీ భజనలు, నామావళులు చేశేవా డతను. అతనితో భజన ఎంతో వుత్సాహకరంగా వుండేది చలంగారూ వాళ్ళకి. ఆ తరువాత ఈశ్వ రుడు అతను పూర్తిగా అన్నిటినీ త్యజించి బ్రహ్మచారి కాబోతున్నా డని చెప్పారు.

ఈశ్వరుడు వచ్చిన కొత్తలోనే జానకికీ, పిన్నీ ఇక్కడికి రావాలని చెప్పారు. పిన్ని వచ్చి ఈశ్వరుడ్ని నమ్మకుండా వెళ్ళిపోయింది. ఆ

తరువాత రంగ వచ్చాడు. రంగకి ఎంత సంతోషమో, మళ్ళీ తను మామయ్యా వాళ్ళందరినీ చూసినందుకు. "షా మళ్ళీ ఇది వరకు మల్లేనే మనమంతా ఇలా కలుసుకుంటూ వుంటామా?" అని అడిగే వారు. ఇంక చలంగారు అతను గోలలు, కథలు చెప్పుకోవడాలు, నవ్వుకోవడాలు. ఎంత హడావిడో. ఇంటి కంతా ఎంత సందడో చెప్పలేం.

అప్పట్లో రంగ తండ్రి 'పంతులు' కలకత్తాలో వుండేవారు. త్వరలోనే ఆయనకి బెంగుళూర్ బదిలీ అయింది. రంగ వెళ్ళి షా చాలా గొప్పస్థితిలో వుందని వాళ్ళతో చెప్పేసరికి పంతూలూ, రంగ చెల్లెలు నిర్మలా ముందుగా షాని చూచేందుకు వచ్చారు.

అంతకు ముందే నిర్మల చలంగారికి గోల పెడుతూ పుత్తరం రాసింది— తన దేహబాధల గురించి. అక్కడ ఎవరయినా యోగులు కుదిర్చేవా రున్నారా?— అంటూ. అది ఈశ్వరుడు రాకమునుపు రాసింది. ఈశ్వరుణి గురించి షా, చలంగారు వాళ్ళకి చెప్పారు. నిర్మల ఆరోగ్యస్థితిని చూచి చలంగారు చాలా జాలిపడ్డారు "ఈశ్వరా! ఆమెకి నయం చెయ్యరా?"— అని అడిగారు "ఆవిడ నాలో విశ్వసిస్తే తప్పకండా నయం చేస్తాను" అన్నారు ఈశ్వరుడు. ఆవిడ తప్పకండా విశ్వసిస్తానంది. వాళ్ళు వెళ్ళి పోయారు.

ఇంతట్లోకి జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రిగారు వచ్చారు. ఆయన వెంటనే ఈశ్వరాగమనాన్ని పూర్తిగా విశ్వసించారు. ఇప్పుడు ఆయనలో ఎంతో మార్పు కనపడు తోంది. పూర్వం కొంచెం వెఱ్ఱి వాడి లాగ వుండే వారాయన. ఆయన వేషం ఓ చిన్న పిల్లకవి వేషంలా వుండేది పూర్వం. ఇప్పుడు పదహారణాల శ్రోత్రియబ్రాహ్మణుడి లాగ తయా రయ్యారు ఆయన. ఫాలాన విభూతి రేఖలతో

కుంకుమ బొట్టుతో. ఆయన తాను శ్రీవిద్యోపాసన చేస్తున్నట్లు చెప్పారు. శ్రీవిద్యోపాసన గురించి ఈశ్వరుడ్ని అడిగారు. "అది మహా మంత్రం. చాలా జాగ్రత్తగా ఎంతో నిష్ఠతో చెయ్యాలి. మీ గురు వెట్లా వుపదేశించారో, ఏ ఆదేశాలు ఇచ్చారో ఆ ప్రకారం చెయ్యండి. ఏ మహామంత్ర మయినా కోరికతో చేసే టట్లయితే చాలా నిష్ఠ అవసరం. కానీ ఏ కోరికా లేకండా చేసే టట్లయితే ఏ నిష్ఠా అవసరం లేదు" అని చెప్పారు ఈశ్వరుడు.

"నే నే కోర్కెతోటి చెయ్యటల్లేదు మా గురువుగారు వుపదేశించారు. ఆయన ఆదేశించినట్లు చేస్తున్నాను" అన్నారు శాస్త్రిగారు. "ఐతే ఫరవాలేదు. మీరు ఆయన చెప్పినట్లు చెయ్యండి" అన్నారు ఈశ్వరుడు.

ఇంక శాస్త్రిగారు మద్రాసు వెళ్ళిన తరువాత ప్రతీ వాళ్ళకీ ఈశ్వరుడి గురించి చెప్పేవారు. "మీరోసారి తిరువన్నామలై వెళ్ళి ఈశ్వర దర్శనం చేసుకు రండి. జన్మ ధన్య మవుతుంది" అన్నట్లుగా చెప్పేవారు. అట్లాగే ఆయననించి విని చాలామంది ఉత్తరాలు రాసేవారు. చాలామంది వచ్చి దర్శించుకుని వెళ్ళేవారు. మద్రాసు ప్రాంతంలో ఈశ్వరుడి గురించి ఎక్కువగా తెలియడానికి శాస్త్రిగారే కారణం. ఆ ప్రచారానికి ఇంక తిరుగు లేదు. ఆయన ఆ పనిని గొప్ప zeal తో చేసేవారు. "ఈశ్వరుడి పతాకాన్ని ధరించి మూర్ఖాన్ని, మోహాన్ని జయించడానికి మృదువైన యుద్ధాలు చేసే యోధులం కావాలి మనం" అని చలంగారి ఆకాంక్ష అయితే "మనని అర్థం చేసుకున్నా, చేసుకోకపోయినా మన గొంతు వినే వాళ్ళకి ఈశ్వరవాణిని వినిపించడం మనకి వుత్తమమైన ధర్మం' అన్నది శాస్త్రిగారి వుద్యమం. పనిపెట్టుకు వెళ్ళి "పదిహేను రూపాయలకి

చూచుకోకండి. మీరు వెళ్ళి ఈశ్వర దర్శనం చేసుకోండి" అంటూ ఎంద రెందరో్న ఈశ్వర దర్శనానికి inspire చేసేవారు.

శాస్త్రిగారు అరుణాచలం వచ్చినప్పుడల్లా ఈశ్వరుణ్ని ఎన్నెన్నో విషయాల గురించి అడిగి తెలుసుకునే వారు. ముఖ్యంగా కవులూ, వారి పూర్వజన్మలూ, కవితామూల్యాలు, సాహిత్యాన్ని గురించిన అంశాలు అనేకం శాస్త్రిగారితో సాగిన ఈశ్వరవాణిలో చోటు చేసుకునేవి. ముఖ్యంగా జీసస్ చుట్టూ ఎవ రెవరు వుండేవారో అపోస్తలులు ఏ ఏ జన్మలు ఎత్తారో ఆ రోజుల్లో రాయించి పెట్టారు ఈశ్వరుడు. భారతం, భాగవతం- ఇంకా ఎన్నెన్నో పుస్తకాలు చదివించారు ఈశ్వరుడు చలంగారు వాళ్ళచేత. భారతం చదివిస్తూ దానిలోని ఒక్కొక్క character మీద ఈశ్వరుడు మాట్లాడేవారు. శాస్త్రిగారు చాలా కుతూహలంతో ఆయన్ని ప్రశ్నలు వేసేవారు. అప్పుడు చలంగారింటి వాతావరణం చాలా హడావిడిగా, సరదాగా వుండేది.

"నర్తకి అన్నం వొడ్డిస్తూ శాస్త్రిగారి వద్దకు వొచ్చి "అన్నం వడ్డించమంటారా?" అని అడిగేది. "అన్నం పరబ్రహ్మ స్వరూపం ఇట్లా పెట్టమ్మా" అనేవా రాయన. "పప్పు వొడ్డించనా శాస్త్రిగారూ?" అంటే "నేను బ్రాహ్మడి నని మర్చిపోయా వేమిటి?" అనేవారు! "నెయ్యి వేసు కుంటారా?" అని అడిగితే "ఆ, తీసుకురా అమ్మా. చూస్తా వేమిటి 'ఆజ్యధారయా' అని భగవాన్ ఎందుకు చెప్పారు? ఇంతకీ భగవాన్ చెప్పింది ఏమిటంటే- అన్నంలో పప్పు వేసుకుని ధారగా నెయ్యి వేసుకుని సరళమైన చింతకాయ పచ్చడి వేసుకుని తినమని" అనేవారు. "సాంబారు వేసుకుంటారా?" అంటే "సాంబ శబ్దం నా కెంతో ప్రియమైంది అమ్మా" అని జోక్ చేసే వారు.

"ఇప్పుడు భోజనానికి పోయేప్పుడు పిలవడానికి ఎవరూ లేరు. శాస్త్రిగారు మా కన్నా ముందే కూచుంటారు పీట మీద — జంధ్యం సవరించుకుంటో, 'నర్తకీ' తీసుకురా వొడ్డించు". అంటో.

(కురంగేశ్వర్‌కి చలంగారి లేఖ 27-1-57)

శాస్త్రిగారు ఈశ్వరుడ్ని "నన్ను హైదరాబాదు promotion మీద మార్పించంతి. ఎప్పుడూ ఈ ఉద్యోగమేనా ?" అంటూ వుండే వారు. తరువాత ఒక లాంబ్రెట్టా కొనాలని ఈశ్వరుడ్ని అడిగారు. ఆ మాటకి ఈశ్వరుడు ఒప్పుకో లేదు. — మాంచి రుద్రాక్షమాల తెప్పించు కుంటామండీ అన్నారు. దానికీ వొప్పుకో లేదు ఈశ్వరుడు. "ఏమిటీ, మాకు ట్రాన్స్‌ఫర్లు ఇవ్వరు, లాంబ్రెట్టాలు కొననివ్వరు. చివరికి రుద్రాక్షమాల అడిగితే అదికూడా ఇవ్వరూ" అనేవారు తమాషాకి.

శాస్త్రిగారికి షౌ అన్నదే లేదు. ఉన్న దల్లా షౌ రూపంలో ఒక ఈశ్వరుడో, ఈశ్వరియో. ఆయన 'అమ్మా' అని పిలిచేవారు ఆమెని.

షౌ సాధన (ఆ రోజుల్లో నిరంతర సమాధిలో వుండేవారు. సాధన ప్రత్యేకంగా ఏమీ జరుగలేదు.) disturb కాకండా "కొన్నాళ్ళు గేటు మూసేస్తున్నాను" అనేవారు ఈశ్వరుడు. అంటే ఇంక ఎవరూ రావడానికి వీల్లేదు. చలంగారు వాళ్ళు, వాళ్ళని రావద్దు అనకండానే రావాలని అనుకునేవాళ్ళుకూడా వాళ్ళే మానేసేవారు. ఉత్తరాలు అవంతటవే నిలిచిపోయేవి. ఆఖరికి వద్దా మనుకున్న వాళ్ళు compound ప్రాంతాలలోకి కూడా రాలేక పోయేవారు. చివరికి చుట్టు పక్కల వాళ్ళుకూడా వచ్చేవాళ్ళు కాదు. అంతా నిరామయం. అప్పట్లో షౌ సాధనే కాకండా చలంగారి సాధనకూడా వుండేది కదా! వాటిల్లో ఆటంకాలు రాకండా వుండడానికే ఈశ్వరు డలాగ చేసేవా రేమో!

శాస్త్రిగారి రాకతో ఈశ్వరుడి చుట్టూ బ్రాహ్మణ వాతావరణం పట్టి పోయింది. ఆ రోజుల్లో ఉల్లి, వెల్లుల్లి, ఇతర మసాలాలు షా తినే వారు కాదు. అందువల్ల మిగిలినవాళ్ళకి ఇష్టం అయినా భోజనంలో అసాత్త్విక పదార్థాలు వండేవారు కాదు. ఈశ్వరుడు అనుమతించినా వాళ్ళు తినేవారు కాదు. ఆ ఇంటి పద్ధతులు బ్రాహ్మణాభిరుచులకి అనుగుణ్యంగా వుండేవి అప్పుడు.

శాస్త్రిగారు ఈశ్వరుడ్ని అనేక విషయా లడిగి తెలుసుకుని 'తనలో తాను' అనే శీర్షికను ఆకాశవాణి ముఖతా ఈశ్వరవాణిని తొలిగా లోకానికి పరిచయం చేశారు. అందువలన 'ఈశ్వరోక్తాల' సేకరణకి శ్రీకారం చుట్టింది చలంమహర్షి కాగా శాస్త్రిగారు ద్వితీయులు. ఇంకెవరైనా తరువాతివారే.

## 6

ఒక రోజు భజనకి ఒకరు వచ్చారు. ఆయన సింధీ. ఏ అంగీరస మహర్షిలాగో, భగీరథ మహర్షిలాగో వుం దాయన రూపం. ఒక తువాలు పైన కప్పుకున్నారు. తెల్లని గెడ్డం, గిరజాల జుత్తూ. ఆయన వాళ్ళందరితోబాటు కూచుని భజన చెయ్యడం మొదలు పెట్టారు. ఆయన తన్మయత్వంతో కళ్ళు పెద్దవి చేసి వూగిపోవడం చూసి అంతా ఆయన కేదో పిచ్చి అనుకున్నారు. నవ్వాపు కోలేక చలంగారితో సహా అందరూ పారిపోయారు. ఇక మిగిలింది ఆయన, ఎటూ పోలేక షా. ఇంక షా మాత్రం ఏ ప్రళయా లొచ్చినా భజనల్లోంచి కదిలే వారు కాదు. ఏం చేస్తారు? ఈశ్వరాజ్ఞ పాపం! నవ్వంతా అణిగిపోయిం తరువాత అందరూ తిరిగి వొచ్చి కూచున్నారు.

ముందుగా నామావళి చేసి తరువాత అంతా తలొక పాట పాడతారు భజనలో. ఆ రోజు షా "హే విశ్వనాథ" పాడారు. పాట

ముగియగానే సింధీ ఆయన ఒక్క నమస్కారం చేసి "హే ఈశ్వరా" అన్నారు. చలంగారితో "నీ కూతురు సాక్షాత్తూ ఈశ్వరుడే. ఎందుకంటే విష్ణుదిగంబర్ పలూస్కర్ నించి ఎంతమంది గాయకుల సంగీతమో విన్నాను. ఇలాంటి నాదం ఎవరి కంఠంలోనూ నేను వినలేదు. నాభి నించి నాదం పలకాలి అని సంగీతశాస్త్రంలో రాసుంది. ఈమెకి ఆ నాదం జన్మజాతంగానే వున్నట్లుంది" అన్నా రాయన.

ఈశ్వరుడు షౌకి సంగీతాన్ని గురించి చెబుతూ షౌ సంగీతంలో గొప్ప నాదం వుందని వివరించి చెప్పారు. సంగీతానికి ధ్యేయం ఆ నాదాన్ని చేరుకోవడమే నని- అది షౌలో సహజంగా వుందనీ గాయకులలో ఎవ రెవరికి ఆ నాదం వుందో చెప్పి, షౌకి నాదోపాసనా వైశిష్ట్యాన్ని వివరించేవారు. షౌ రచయిత్రి కాదనీ, గాయకురాలనీ అనేవారు ఈశ్వరుడు.

చలంగారిది చాలా మంచి కంఠం. ఎంత మాధుర్యమో ఆ కంఠంలో! హృదయాన్ని కరిగించేలా పాడేవా రాయన. కానీ చలంగారిని "ఇతను మహారచయిత, గాయకుడు కాదు" అన్నారు ఈశ్వరుడు. ఈశ్వరుడు చెప్పేవరకూ ఆ సంగతి షౌకీ చలంగారికీ తెలియదు. కానీ ఆయన చెప్పింది నిజమే నని తోచింది షౌకి.

ఆ సింధీ ఆయన్ని అమ్మ 'దాదాజీ' అని పిలిచేది ఆయన అసలు పేరు జెఠాలాల్. అందరూ అమ్మ పిలిచినట్లే ఆయన్ని దాదాజీ అని పిలిచేవారు. ఇంక దాదాజీ రోజూ భజనకి వచ్చేవారు. ముందర ఆశ్రమంలో వుండేవారు. అక్కడనించి వొచ్చేసి దక్షిణామూర్తి ఆలయంలో నివాసం ఏర్పరుచుకున్నారు. ఇంక చలంగారు వాళ్ళందరి మీద అమితమైన ప్రేమ ఆయనకి. ముఖ్యంగా చలంగారి మీద.

చలంగారు వాళ్ళందర్నీ ఆయన తనువున్న దక్షిణామూర్తి ఆల యానికి తనని చూడటానికి రమ్మని పిలిచారు. వాళ్ళు వెళ్ళారు. ఎంతో మర్యాద చేశా రాయన వాళ్ళని. ఆ తరువాత చలంగారు వాళ్ళంతా ఇంటికి వచ్చేశారు.

అప్పటి నించీ చలంగార్ని తనని చూడటానికి రమ్మని అడేగే వారు దాదాజీ. అలాగే చలంగారు వెళ్ళేవారు. ఒక్కరోజు చలంగారు రాకపోతే అలిగేవారు దాదాజీ.

ఆయ నుండే దక్షిణామూర్తి ఆలయానికి చలంగారు వాళ్ళు వాళ్ళింటి నించే పువ్వులు కట్టి మరీ పంపించాలి. వాచ్‌మేన్ పరశురాం కూతురు 'చిన్నకణ్ణు'కి సాధువులంటే ఎంతోభక్తి. ఆ అమ్మాయి రోజూ కాంపౌండ్‌లో వున్న పువ్వులు కోసి మాలలు కట్టి, రోజూ ఆయనకి తీసుకెళ్ళి ఇచ్చేది. ఒక్కరోజు ఆలశ్యం అయినా ఆయనకి కోపం వచ్చేది. ఇంతట్లోకి ఆయన తెచ్చుకున్న డబ్బు ఖర్చయి పోయింది. ఇంక చలంగారు వాళ్ళింటి నించే దాదాజీకి భోజనం పంపించేవారు.

షౌ ఆయన పిలిచినప్పుడు సోమవారం ఆలయానికి వెళ్ళారు గనుక ప్రతీ సోమవారం రమ్మనే వారు దాదాజీ ఆమెని. "నేను ఎక్కడికీ కదలను, నేను రాను" అనేవారు షౌ. "మరి నేను మీ ఇంటికి భజనకి వస్తున్నాను కదా. నువ్వు ఆలయాని కెందుకు రావు?" అని అడేగేవారు. "నే నెక్కడికి రాను. మీరు భజనకి వాస్తేంటే అది మీ యిష్టం" అనే వారు షౌ. కానీ ఆయన తప్పని సరిగా భజనకి వచ్చే వారు. భజనలో ఒకపాట పాడుతుండే వారు. వాన కురుస్తున్నా కూడా ఆ వానలో తడుసుకుంటూ వచ్చేవారు. భజన అంతా అయ్యాక షౌ

అక్కడికి రావడంలేదని షౌని నాలుగు తిట్లో, బావురుమని ఏడ్చో వెళ్ళిపోయే వారు.

ఒక్కొక్కప్పుడు ఎప్పుడో ఓ సోమవారం షౌని దాదాజీని చూడటానికని వెళ్ళమనేవారు ఈశ్వరుడు. షౌ అక్కడికి వెడితే భజన చెయ్యమని దాదాజీ బలవంత పెట్టేవారు. తప్పనిసరిగా షౌ భజన చెయ్యాల్సి వచ్చేది. ఇక వీధిన పోయే జనమంతా దక్షిణామూర్తి ఆలయంలో గుంపు కూడే వారు. దాంతో పకపక "రోడ్డుమీద పోయే వాళ్ళంతా షౌ చుట్టూ గుమికూడారో, వీళ్ళు వీథుల్లో భజన చేస్తున్నారో" అని గోల పెట్టేది. అసలు గడ్డం వాళ్ళని చూస్తేనే పకపకకి ఒళ్ళు మంట. ఎవరన్నా గెడ్డంతో భజనకి వస్తే చాలా కోపం. ఇక పకపక అలిగితే అన్నం కూడా తినేది కాదు. దాంతో షౌ ఆమెని సముదాయించి భోజనానికి తీసుకువొచ్చి బతిమాలి తినిపించవలసి వచ్చేది.

మొట్టమొదట ఈశ్వరావతరణోత్సవానికి జగదీష్, దాదాజీ, చలంగారు వారికి అతిధులు. ఆ రోజున అంతా కలసి గిరిప్రదక్షిణం వేళ్ళారు. అది మొదలుకొని ఆగస్టు పదిహేనికి గిరిప్రదక్షిణం చేయడం పరిపాటి అయింది చలంగారు వాళ్ళకి.

భజనల్లో దాదాజీ పాటలు కట్టి కోపంగా షౌ మీద విసిరి పాడే వారు. అలాగే చలంగారిమీద కోపంతో పాటల్ని కసితో చలంగారి మీద విసిరే వారు. అప్పట్లో భజనలు విచిత్రంగా ఉండేవి, ఆయన ప్రవర్తనికి అమ్మకి కోపం వచ్చి హిందీలో ఆయన మీద పాటలు కట్టి ఆయన మీద విసిరేది. కొన్నాళ్ళకి దాదాజీ షౌ తనని చూడడానికి రావడం లేదని కోపం వచ్చి భజనలకి రావడంమాను కొన్నారు. ఇంక జగదీష్ ఒకరోజు ఆయనని బతిమాలి, సముదాయించి భజనంతా అయిపోయి అందరూ పడుకునే ముందు రాత్రి పదిగంటలకి

తీసు కొచ్చాడు భజనకి. జగదీష్, దాదాజీ వచ్చాక మళ్ళీభజన ప్రారంభం చెయ్యాల్సిందే, ఇంక పిల్లలు ఎవరూ భజనకిరాలేదు. షౌ, అమ్మ చలంగారు కలిసి భజన చేశారు. భజనంతా పూర్తయినాక షౌని పడా పడా తిట్టి వెళ్ళి పోయారు దాదాజీ. ఇంక రోజూ రాత్రిపదిగంటలకి భజన ముగించాక వచ్చేవారు. దాంతో షౌ వాళ్ళు ఆయన కోసం మళ్ళీ కూచుని భజన చేయవలసి వచ్చేది.

దాదాజీ తనకి పరివ్రాజక జీవితం మీద ఆసక్తి అనీ, కొడుకులూ, కూతుళ్ళూ వెళ్ళనివ్వరు గనుక వాళ్ళతో చెప్పకండా పారిపోయి వచ్చానని, చలంగారికి చెప్పారు. తరువాత మెల్లిగా తనవాళ్ళు ఎంతో ఆదుర్దా పడుతో ఏడుస్తో వుంటారని చెప్పి— "నే నెక్కడున్నానో తెలియకుండా వాళ్ళకి నా లేఖ చేరాలి. నువ్వు దానికి సాయపడాలి" అన్నారు చలంగారితో. చలంగారికి ఏది కావాలన్నా, ఏం చేయాలన్నా ఒక స్నేహితు డున్నారు. ఆయనే పట్టాభి రామయ్యగారు. ఆయనకి చలంగారు ఉత్తరం రాశారు. దాదాజీ ఇక్కడనించి పట్టాభిరామయ్యగారి ఎడ్రస్‌కి ఉత్తరం రాస్తే అక్కడి నించి ఆ వుత్తరాన్ని తన చిరునామాతో దాదాజీ వాళ్ళు వాళ్ళకి పోస్టు చేశేవారు పట్టాభిరామయ్యగారు. మళ్ళీ వాళ్ళు పట్టాభిరామయ్యగారి చిరునామాకు జవాబు రాసేవారు. పట్టాభిరామయ్యగారు ఆ జవాబుల్ని తిరువన్నామలై పంపేవారు. ఆ విధంగా దాదాజీ వుత్తర ప్రత్యుత్తరాలు జరిగేవి. ఇలా జరుగుతూ వుండగా వాళ్ళ అల్లుడికి ఆయన అజా దొరికి పోయింది. ఆయన వచ్చి దాదాజీ కాళ్ళు పట్టుకొని వెక్కి వెక్కి ఏడ్చాడు. ఇంటికి వచ్చేయమని మరీ మరీ ప్రార్థించాడు, దాంతో దాదాజీ నీరయి పోయారు.

చలంగారు వాళ్ళందరి దగ్గిరా శలవు తీసుకోవడానికి వచ్చారు దాదాజీ. ఒక్కొక్కరికి తాను వెళ్ళి పోతున్నానని చెప్పి వెక్కి వెక్కి

ఏడ్చారు. పకపక అంటే ఆయనకి చాలా ప్రాణం 'బేటా' 'బేటా' అని పిలిచేవారు. పకపక దగ్గరికి వెళ్ళి తలవంచి "బేటా! నేను త్వరగా రావాలని నన్ను ఆశీర్వదించు" అని అడిగారు. పకపక పైకి ఏమి అనకపోయినా తన లోపల మళ్ళీ నువ్వు ఎన్నడూ ఇక్కడకి రాకూడ దని ఆశీర్వ దించింది. తరువాత దాదాజీ వెళ్ళిపోయారు-

దాదాజీ స్వస్థలం బరోడా. అక్కడి నించి చలంగారికి వుత్త రాలు రాస్తుండే వారు. చలంగారి పక్కింటి మంగారాం పనిమీద బరోడా వెళ్ళినప్పుడు దాదాజీని చూడటానికి వెళ్ళారు. గొప్ప Model carలో నించి డాబైన సూటు బూటూతో దిగారట. ఆయన్ని చూచి మంగారాం నివ్వెర పోయారట. దాదాజీ వుండేది ఒక పెద్ద భవనం. ఆయనది అప్పడాలు, సేమ్యాలు వ్యాపారం. చలంగారు వాళ్ళ గురించి అడిగి మంగారాం చేత ఇన్ని సేమ్యాపొట్లాలు, అప్పడాలు వాళ్ళకోసం పంపిచారు.

ఆ తరువాత చలంగారు వాక్యా సేవా (భవంతి) లో వుంటు న్నప్పుడు దాదాజీ వచ్చారు. ఈ మాటు కాషాయ వస్త్రాలలో వచ్చారు. తనవారి నందర్ని తప్పించుకుని సన్యసించా నని చెప్పా రాయన. తను ఎక్కడ వున్నారో తమ వారికి తెలియదని, తను తపస్సు చేస్తున్నా నని చెప్పారు.

తరువాత చలంగారిని "మీరు ఎంతో మందిని ఆదరించడం నేను చూశాను. మీ పరిస్థితి ఇప్పుడు ఎట్లావుంది? మీకు సరి గడు స్తోందా?" అని అడిగారు. నిజానికి అప్పట్లో చలంగారి ఆ కస్థితి ఏమంత చెప్పుకో దగ్గట్లు లేదు. "ఏదో అంత బాగా గడవటం దు" అని చలంగారు చెప్పారు.

"అట్లానా, నేను మీకు తప్పకండా డబ్బు పంపిస్తాను" అన్నా రాయన. "మీరే అన్నీ వొదులుకుని సన్యాసం తీసుకున్నారు. మీరు మాకేం ఇవ్వగలరు ?" అన్నారు చలంగారు.

"నేను వొదులుకున్నా మా వాళ్ళకి రాసి మీ కిప్పించ గలను" అన్నారు. చలంగారు నవ్వి "మీరు గొడవ పడకండి. మా కేది కావాలో అది ఇస్తూ మా కేలోటు లేకండా చూసుకుంటున్నారు ఈశ్వ రుడు" అన్నారు,

"అది నిజమే! ఒకటి మాత్రం గుర్తుంచుకోండి. ఎప్పుడు మీకు డబ్బు అవసరం అయినా మీరు జంకకండి. వెంటనే నాకు రాస్తే మీకు సాయం చేస్తాను" అని తన ఎడ్రస్ ఇచ్చి వెళ్ళిపోయారు దాదాజీ. అంతే ఆయన్ని మళ్ళీ చూడలేదు చలంగారు వాళ్ళు. చలంగారికి డబ్బు లేకపోయినా డబ్బు అవసరం ఎప్పుడూ రాలేదు. ఎప్పుడూ దాదాజీకి రాయనూ లేదు.

## 7

భగవాన్ విరూపాక్షి గుహలో వున్న రోజులనించి రామస్వామి అయ్యర్ భగవాన్‌కి **violent** భక్తుడు. ఆయన చాలా కాలం తెలుగు దేశంలో ఓవర్‌సీర్‌గా పని చేశారు. అంచాత ధారాళంగా తెలుగు వచ్చు. భగవాన్ అనుగ్రహం వలన తెలుగులో, తమిళంలో, సంస్కృ తంలో గొప్ప పాటలు అల్లేరు.

భగవాన్ దగ్గరికి అప్పు డప్పుడు వచ్చే రోజుల్లో కూడా ఆయ నని ఆశ్రమంలో చూచేవారు చలంగారు వాళ్ళు. కానీ పెద్దగా పరి చయం లేదు. ఆయన కూతురు ప్రసిద్ధ గాయకురాలు లలితా వెంకట రామన్. ఆయన శరణాగతి అనే పాట రాశారు తమిళంలోను, తెలుగు

లోనూ కూడా. ఆయనే కూచిభొట్ల సూర్యనారాయణగారికి తన పాటని నేర్పించారు. సూర్యనారాయణగారు ఆ పాటని షౌకి నేర్పించారు. ఆ పాట షౌ నేర్చు కున్నారని రామస్వామి అయ్యర్‌కి తెలిసింది. షౌ భగవాన్ సమాధి దగ్గర ధ్యానంలో వుంటున్నప్పుడు ఆ పాట పాడించుకు వినాలని ఆయన కెంతో కోరిక. కానీ సమాధిదగ్గర ఎప్పుడూ సమాధిస్థితిలోనే వుండేవారు షౌ. ఆయన తన కర్రని చప్పుడు చేసుకుంటూ షౌ చుట్టూ తిరిగే వారు. ఎప్పుడన్నా కళ్ళు తెరిస్తే పాడించుకోవాలని. కాని ఆ స్థితిలోంచి తేరుకోవడం షౌకి సాధ్యం అయ్యేది కాదు.

ఇట్లా కొన్ని రోజులు గడిచిం తరువాత మా తలియార్‌ఖాన్ తన ఇంట్లో భజన పెట్టించి షౌని రమ్మని పిలిచింది. అక్కడికి భజనకి వచ్చిన వారిలో రామస్వామి అయ్యర్ కూడా వున్నారు. షౌ శరణాగతి పాట మొదలు పెట్టగానే 'ఓం' అని ఒక నమస్కారం చేసి కళ్ళు మూసుకున్నారు ఆయన. ఆ తరువాత పాట అయిపోగానే, 'నువ్వూ, సూర్యనారాయణ నా పాట నంతా హిందూస్తానీ చేసి పెట్టారు' అని గోల పెట్టారు.

తరువాత జగదీష్ కోసం ఆ పాటని అమ్మ, చలంగారు, షౌ కలిసి హిందీ చేశారు. తన పాటని హిందీ చేసినట్లు రామస్వామి అయ్యర్‌కి తెలిసింది. ఆ పాటని వినాలని పాపం ఆయనకి వుబలాటం. ఆశ్రమానికి షౌ వచ్చినప్పుడు పాడించుకుని విందా మనుకున్నారాయన. కానీ షౌ ఏమో ఆశ్రమానికీ రావడం లేదు. ఆయనకి అమితమైన ఆచారం, చాదస్తం. చలంగారింటికొస్తే మైల పడతానని భయం. ఆ పాటని ఎట్లాగయినా వినాలని ఆయనకి ఎంతో కోరిక. కానీ ఏం చేయగలరు?

ఒక రోజు చలంగారు వాళ్ళు భజనచేస్తూ వుంటే భార్యా సమేతంగా చలంగారింటికి వచ్చారు. ఆ భజన రామస్వామి అయ్యర్ విని, వాళ్ళు శ్రీరాం జయరాం జై జై రాం ఓం పాడుతోంటే ఆయన 'రాముడిక్కడ నృత్యం చేస్తున్నాడు' అని పారవశ్యంలోకి వెళ్ళిపోయినారు. ఆయనకి హిందీ శరణాగతి వినిపించారు షౌ. భజన అంతా అయిం తరువాత చలంగారితో ఆయన "భగవాన్‌ని మీ రిక్కడ కట్టేసుకున్నారండి" అని అన్నారు. భజనలు పూర్తయినాక ప్రసాదం పంచేవారు చలంగారు వాళ్ళు. నైవేద్యం నిత్యమూ పొంగలి ప్రసాదంగా పంచేవారు వాళ్ళు. చలంగారింట్లో కాలుపెట్టడానికి జంకిన ఆయన ప్రసాదం తీసుకుంటారో, లేదో అని అనుమానం వేసింది చలంగారికి. నర్తకి ప్రసాదం పంచిపెట్టడానికి వస్తే "వెంకటాచలంగార్రూ, మీరు మాంసాన్ని ప్రసాదంగా ఇచ్చినా నేను తినడానికి సిద్ధం" అన్నారాయన.

ఆ రోజు నించి ఆయన, ఆయనభార్య ఇద్దరూ నిత్యమూ భజనలకి వచ్చేవారు. ఆయన గొప్ప సంగీత శాస్త్రవేత్త. చాలా మట్టుకు తన కూతుళ్ళందరికీ సంగీతం నేర్పింది ఆయనే. ఆయనది ఎంతో చక్కని కంఠం. ఆ ఎనభై ఏళ్ళ ఆయనకూడ భజనల్లో చాలా శ్రావ్యంగా పాడేవారు. ఆయన తమిళంలో భగవాన్ మీద ఎంతో భక్తితో భావంతో చాలా పాటలు కట్టారు. షౌకి నేర్చుకోవాలని వుండేది. కానీ ఆ అరవం వుచ్చరించడం చాలా కష్టం. ఏ కాస్త స్వరంలో గానీ, తాళంలో గానీ, వుచ్చారణలో గానీ తేడా వస్తే ఎంత సంగీత జ్ఞానం వున్నవారి మీదయినా సరే కర్ర ఎత్తే వారాయన. అందుకు భయపడి కాదు కానీ ఉచ్చారణ కష్టమని షౌ నేర్చుకోలేదు.

రామస్వామి అయ్యర్‌కి బ్రహ్మసమాజం అంటే ఒళ్ళు మంట బ్రహ్మసమాజం పాటలు పాడుతుంటే ఆయనకి చాలా కంటకంగా

వుండేది. తరువాత తాళమూ, ఓ తీరూ లేకుండా పాటలు పాడుతున్నా ఆయన భరించ లేక పోయేవారు. కానీ ఆయనలో గొప్ప **emotion** వుండేది. అందుకని పారవశ్యంలోకి వెళ్ళకండా వుండలేక పోయేవారు. చలంగారు పాడుతున్న పాటలో 'రాజేశ్వరు'డని వచ్చినప్పుడు "రాజేశ్వరుడు ఎవరండీ" అని అడిగారు ఆయన చలంగారిని. "మీ రాజేశ్వరి మొగుడండి" అని జవా బిచ్చారు చలంగారు. రామస్వామి అయ్యర్ అది రాజా రామ్మోహన్ రాయ్ మీద పాట గావచ్చు అని అనుకున్నారు. "ఇదేం షణ్ముఖ ప్రియ అండి" అని అడిగేవారు చలంగారు షణ్ముఖప్రియ రాగంలో పాడు తున్నప్పుడు. "ఇది నా షణ్ముఖప్రియ" అనేవారు చలంగారు.

ఇక్కడి పద్ధతులు, ఈ పిల్లల తీరూ ఇవేమీ గిట్టేవి కావాయనకి. చిత్ర భర్తని ఒదిలి ఇక్కడే వుండడం ఇవన్నీ చాలా ఒళ్ళు మండించేవి, ఆయన లోపల ఒకటి పైకి ఒకటి అయిన మనిషికాదు. ఏదన్నా వుంటే పైకి అనేదాకా ఆయనకి నిద్దర పట్టేది కాదు. పైపైన తీయగా మాట్లాడి వెనకాల అసహ్యంగా మాటలాడడం అన్న గుణం ఆయనలో లేదు. గిట్టక పోతే గిట్టక పోవడమే. నలుగురూ అనుకునే మాటలవలన ఆయనకి చలంగారు వాళ్ళ తిండిని గురించికూడా అనుమానమే— అందుకని చలంగారూ వాళ్ళు భోజనాలు చేస్తున్నప్పుడు వచ్చి ఏంతింటున్నారో పట్టి పట్టి జాగ్రత్తగా పరీక్షించేవారు. ఇటువంటివన్నీ చలంగారు సహించలేక పోయేవారు. కానీ ఈశ్వరుడు "పాపం ఆయనకి ఇవి 80 ఏళ్ళుగా వున్న అలవాట్లు. హఠాత్తుగా ఇప్పుడు మారమంటే ఎట్లామార గలరు?" అని చలంగారిని సమాధాన పరిచే వారు.

కొంత కాలానికి "ఇన్నాళ్ళూ నే నీ చాదస్తపు ఆచారాల్ని పట్టుకుని వేళ్ళాడాను. భగవాన్ని నమ్ముకున్నాను. ఇవన్నీకూడా సత్యమైన

వని నమ్మాను. వాటివల్ల నాకేం వచ్చింది? వీళ్ళకి ఏ ఆచారాలు లేవు. భక్తి లేదు. ఒక తీరూ లేదు. ఒక తెన్నూ లేదు. కానీ వీళ్ళింట్లో భగవాన్‌ని కట్టేసు కున్నారు. ఇక్కడ రాముడు నృత్యం చేస్తున్నాడు. అందరి ఇళ్ళలాగ చీదర వాతావరణం ఇక్కడ లేదు. ఎంత ప్రశాంతంగా జరిగి పోతోందో వీళ్ళ జీవితం" అనే యోచన పట్టుకుంది ఆయనకి.

తరువాత సంగీతంలో తన కూతురి సంగీతం ముందు ఎవరి సంగీతమూ పనికిరాదని ఆయన అభిప్రాయం. ఆమె సంగీతం ముందు ఎవరిదీ ఒప్పుకునే వారు కాదు. ఇప్పుడు ఆశ్రమంలో ఎవరన్నా పాడితే వారిపాటల్లోని అందాన్ని చూడగలుగు తున్నారు. ఆయన చుట్టూ కట్టుకున్న గోడలు ఈశ్వర కరుణ వలన పగిలి పోయినా యనిపిస్తుంది. లోగడ భగవాన్ దేహం చాలించారనే నిస్పృహతో నిర్జీవంగా నీరసించి పోయిన రామస్వామి అయ్యర్ ఈశ్వర కాంతి వలన ఆయనలో ఒక గొప్ప చైతన్యం కలిగి ఎంతో పుత్సాహ వంతులు అయిపోయారు.

ఆయనకి నర్తకి అంటే చాలా ఇష్టం! 'మీరా' అని పిలిచే వారు ఆమెని. తరువాత నిర్మల వచ్చినప్పటి నించీ నిర్మలని చూస్తే చాలా ముద్దు. జగదీష్ ఆ రోజుల్లోనే బ్రహ్మచర్యం తీసుకుని అరుణాచలం వచ్చేశారు. ఆయనే బ్రాహ్మణు లైనట్లైతే రామస్వామి అయ్యర్ నెత్తిమీద పెట్టుకునే వారే కానీ జగదీష్ వైశ్యు లైపోయారు. అందువల్లనే తాను జగదీష్‌ని ఇంకా దగ్గరగా తీసుకోలేక పోతున్నానే అని ఆయన బాధ. తరువాత మురళి వచ్చారు. ఆయన బ్రాహ్మలు కాదు. ఆయనకి మురళి మీద ఎంతో ప్రేమ వుండేది. "అప్పా వచ్చావా?" అని కావలించుకునే వారు. అంత ప్రేమ వున్నా తన

ఇంటికి తీసుకు వెళ్ళ గలిగేవారు కారు. కానీ చివరికి తనలో కట్టలు తెంచుకునే ప్రేమని భరించలేక మురళిని తీసుకు వెళ్ళి భోజనం పెట్టారు. ఆయనలో ఎన్ని లోపాలు వున్నా ఆయన ప్రేమ ఆయన ప్రిజుడీసెస్ (ఇష్టాని లు) అన్నింటినీ జయించేసేది.

ఆయన భజ కి నిత్యం వచ్చేవారు. కింద కూచోలే రాయన. ఆయనకి ఇక్కడున్న పడకకుర్చీ లేపీ పనికిరాక తమ ఇంటినించి తన పడక కుర్చీ తెచ్చుకుని ఇక్కడే అట్టే పెట్టుకున్నారు. రోజూ చలంగారు ఆయన రాకముందే ఆ కుర్చీని వేసి వుంచాలి. ఏ రోజయినా ఆ కుర్చీ వెయ్యడం మరిచిపోతే "ఏమండీ వెంకట చలంగారూ! నా కుర్చీ వేయలేదేమండీ?" అని అడిగేవారు. ఆ కుర్చీ చలంగారు తప్ప ఇంకెవరు వేసినా పనికిరాదు. ఆయన వచ్చాక చలంగారే లేచి వెళ్ళి ఆ కుర్చీ వెయ్యాల్సి వచ్చేది. చలంగారు 'రోజూ ఏమిటిది!' అనుకునేవారు కానీ ఆయన ప్రేమకి శిరసు వంచేవారు.

ఒక్కొక్కప్పుడు ఆయన పెద్ద న్యూసెన్స్ అయి పోయేవారు భజన చేస్తున్నప్పుడు బిగ్గరగా 'ఓం' అని అరిచేవారు. అప్పట్లో మథానీ అనే భక్తుడు భజనలకు వచ్చేవారు. ఆయన రామస్వామి అయ్యర్‌ని "ఎందుకు మధ్య మధ్య అట్లా అరుస్తావు?" అని అడిగారు. "భగవాన్ నాచేత అట్లా అనిపిస్తున్నారు" అన్నారు అయ్యర్.

"అట్లా అరిచేటప్పుడు కొంచెం ముందుగా నాకు చెప్పు. ఎందుకంటే నాకు హార్టు వీక్‌నెస్, నువ్వరిచి నప్పుడు నా గుండె దడ దడ లాడి పోతుంది" అన్నారు.

"నాకు ముందుగా ఎలా తెలుస్తుంధి. అదంత టదే వస్తుంది" అన్నారు అయ్యర్. దాంతో మథానీ దూరంగా పోయి కూచునేవారు భజనలో.

భగవాన్‌కి హారతి ఇచ్చేటప్పుడు నర్తకి చెయ్యి పట్టుకుని ఎనభై ఏళ్ళ అయ్యర్‌గారు మూడుసార్లు 'ఓం, ఓం, ఓం' అంటో ఎగిరి గంతులు వేసేవారు. ప్రతిరోజూ హారతికి ఆయన పాటే పాడాలి. లేక పోతే కోపం తెచ్చుకునేవా రాయన. అవే కాక ఆయన కట్టిన చాంతాళ్ళ లాంటి రమణ నామావళులు వారంలో ఒకరోజు చదవాలి. తమకి విసుగు పుట్టిస్తున్నా ఆయనపట్ల తమకి వున్న ప్రేమవలన ఏదన్నా చేసేవారు చలంగారు వాళ్ళు. తరువాత చలంగారు వాళ్ళందరికీ సదా శివ బ్రహ్మేంద్ర సరస్వతి కృతులు నేర్పించారు రామస్వామి అయ్యర్.

ఆ రోజుల్లోనే హిరేన్, భరత్‌భాయి అనే ఆనందమయిమా శిష్యులు వచ్చారు. హిరేన్‌ది చాలా గొప్ప కంఠం. అతను హార్మోని యంతో పాడేవాడు. అతనికి సొంత హార్మోనియం లేదు. ఇక్కడ బాలకృష్ణస్వామిగారి దగ్గర నించి హార్మోనియం తీసుకు వచ్చింది నర్తకి. హిరేన్ ఆ హార్మోనియం మీద తాను పాడడం కాకుండా చలంగారు వాళ్ళ భజనలకి కూడా హార్మోనియం వాయించే వాడు. ఆ హార్మోనియాన్ని చూస్తే రామస్వామి అయ్యర్‌కి తగని ఒళ్ళు మంట. "ఈ భజన్లో ఈ హార్మోనియం ఎమిటండీ" అని ఒక గంతు వేసేవారు. తీరుబడి సమయాల్లో అయ్యర్‌ని అనుకరించి అందర్నీ నవ్వించేవాడు హిరేన్.

రంగ వచ్చినప్పుడు భజన అవంగానే పాటల సమయమంతా అతనికి ఇచ్చేసేవాళ్ళు చలంగారు వాళ్ళు. అతను తంబూరా శ్రుతి వేసుకుంటూ హిందూస్థానీ ఖయాల్స్ పాడేవాడు. రంగ తంబూరా పట్టుకోగానే "నాకి హిందూస్థానీ సంగీతం గిట్టదండీ" అని చివాలున లేచి ఇంటికి వెళ్ళి పోయేవారు రామస్వామి అయ్యర్. అందరికీ చాలా

ఇబ్బంది వేసేది ఆయన ప్రవర్తన. అలా కొన్నాళ్ళు జరిగిన తరువాత ఓ రోజు రాత్రి ఆయ నెందుకో వెళ్ళలేక కూచుండిపోయి భజనలో రంగ పాట తప్పనిసరిగా వినాల్సి వచ్చింది. అంతకి మునుపు రంగ తంబూరాలో ఒక తీగ వొదులుగా వుండేది. అందువల్లనే శ్రుతి కుదరక తంబూరా చెవులకి చాలా ఇబ్బంది పెట్టేది. ఈశ్వరుడు దాన్ని సవరించి, రంగకి అసలు సంగీత మంటే ఏమిటో బోధించి పాడమన్నారు. ఆ రోజునించి రంగ అద్భుతంగా పాడటం మొదలు పెట్టాడు. రామస్వామి అయ్యర్ రంగ పాడు తున్నంతసేపు కదలకండా కుర్చీలో కూచున్నారు. అందరూ ఆయన ఎక్కడ లేచి రంగ మీద చిందులు వేస్తాడో నని చూస్తున్నారు. కానీ ఏమీ మాట్లాడ లేదాయన. రంగపాట అవంగానే కుర్చీలోంచి అమాంతం లేచి రంగని గట్టిగా కావలించు కున్నారు.

"ఏం గొప్పగా పాడేవోయ్ రంగ! హిందూస్థానీ సంగీతం ఇంత గొప్పగా వుంటుందని నాకు తెలియదు సుమా!" అన్నారు. ఆ రోజునించి రంగని పాడమని ప్రోత్సహించేది ఆయనే. పాట ఆపితే ఇంకా పాడమని మరీ మరీ అడిగేవారు రంగని.

ఇంతలో ఆయన కూతురు వచ్చారు బొంబాయి నించి. ఆవిడ రాగానే ఆయనలో మార్పుని గమనించి ఆశ్చర్యపోయారు. భగవాన్ మహాప్రస్థానానికి వెళ్ళిపోయాక గొప్ప నిస్పృహలో కుంగిపోయిన ఆ మనిషిలో మళ్ళీ గొప్ప చైతన్యాన్ని చూచి ఆమెకి ఏం జరిగిందో అర్థం కాలేదు. ఆమెని భజనకి చలంగారింటికి తీసుకు వచ్చారు రామస్వామి అయ్యర్. ఆమె ఎంతో సంతోషించింది ఈ భజనలు విని. ఆమె వీణ తీసుకుని వొచ్చి భజనలో అరవ శరణాగతి పాడింది. ఆమె శరణాగతి లయ, తాళం, సంగతులు అన్నింటితో కూడిన

శరణాగతి. చలంగారు వాళ్ళని శరణాగతి పాడమం దామె. చలంగారు వాళ్ళ శరణాగతికి ఏ మెట్లూ లేవు. అంతా ఏక ప్రవాహమే. ఆవిడ ఈ శరణాగతి విని ముగ్ధురా లయిపోయి ఎంత గొప్పగా వుందో" నని మెచ్చుకుంది. ఆవిడ ఎవరి ఇళ్ళకీ వచ్చి పాడదు. అట్లాంటిది వీణ మీద చలంగా రింట్లో భజనల్లో పాడడం మొదలు పెట్టింది రోజూ. రామస్వామి అయ్యర్ ఆమె పాడుతున్నంత సేపూ తప్పులు సవరిస్తూనే వుండేవారు. అంత పెద్దగాయకురాలికీ తండ్రిని చూస్తే బెరుకు.

ఇంక రామస్వామి అయ్యర్ తన కూతుళ్ళనీ, మనమల్నీ అందర్నీ భజనలకి తీసుకువచ్చేవారు. వాళ్ళంతా ఆయన పాటలు భజనలలో పాడేవారు. అప్పట్లో రమణసుందరి అని ఒక అమ్మాయి భజనలకి వచ్చేది. ఆ అమ్మాయి తాత, అమ్మమ్మా ఎప్పుడో భగవాన్ దగ్గరకి చేరుకుని ఇక్కడే స్థిరపడి పోయారు. ఆవిడ అమ్మమ్మని 'ఉమా' అని పిలిచే వారట భగవాన్. ఆ అమ్మమ్మ భగవాన్ మీద చాలా పాటలు కట్టింది. ఆవిడ ఎప్పుడో చచ్చిపోయింది. ఆ అమ్మాయి వచ్చి భజన్లలో వాళ్ళ అమ్మమ్మ పాటలు పాడు తుండేది. రామస్వామి అయ్యర్ పాటలుకూడా పాడు తుండేది. రామస్వామి అయ్యర్ "నా పాట పాడటం అట్లా కాదు" అని గదమాయించే వారు ఆ ఆమ్మాయిని. ఆ అమ్మాయిది మంచి కంఠం, బాగా పాడేది. "ఊరుకో తాతా! ఎట్లా పాడితే నేం? దీంట్లో తప్పేముంది?" అని ఆ పిల్ల రామస్వామి అయ్యర్‌తో పోట్లాడేది. ఇంతమందిని కొట్టడానికి సిద్ధం అయ్యే రామస్వామి అయ్యర్ ఆ అమ్మాయి అట్లా అనగానే పిల్లిలాగ వూరుకునేవారు.

నిర్మలకి అప్పుడప్పుడు తలనెప్పులు వస్తూ వుండేవి. నిర్మల తల పట్టుకుని కూచున్నప్పుడు "ఎందు కట్లా కూచున్నావ్?" అని

అడిగేవా రాయన. "తల నెప్పిగా ఉంది" అనగానే కత్తి తీసుకుని ఏదో మంత్రం వుచ్చరించి ఆమె తలమీద ఒకటి కొట్టి "తగ్గిందా" అని అడిగేవారు. "ఇంకా తగ్గలేదు" అంటే మళ్ళీ ఇంకో దెబ్బ వేసేవారు. ఇంక నాలుగు దెబ్బలు తిన్నాక "తలనెప్పి పోయింది" అనేది నిర్మల. రామస్వామి అయ్యర్ వెళ్ళిపోగానే మళ్ళీ తల పట్టుకు కూచునేది. "ఇందాక తగ్గిపోయిం దన్నావు కదా? ఇప్పుడు మళ్ళీ తల పట్టుకు కూచున్నావేం ?"- అని నర్తకి అడిగితే "ఏమనను మరి, తల మీద అట్లా కొడుతుంటే, తగ్గింది అనక" అనేది నిర్మల.

ఒకరోజు కళ్ళు కనబడక సైకిల్ కింద పడ్డారు రామస్వామి అయ్యర్. బాగా గట్టిదెబ్బలు తగిలాయి. ఆశ్రమం ఆసుపత్రిలో చేర్చారు. కాళ్ళు బాగా చీరుకుపోయి రక్తం కారుతోంది. "వెంటనే వెంకటచలంగారిని పిలుచుకు రండి" అని కబురు పంపించారు ఆయన.

రామస్వామి అయ్యారుగారికి సాయంత్రాలు కొంచెం జ్వరం తగలడం వల్ల రావడం లేదు భజనకి నాలుగు రోజుల్నించి. నిన్న సాయంత్రం అన్నారు "నా wife వూరుకోవటం లేదు. నన్ను ఈ రాత్రి భజనకి ఈడ్చుకు వొస్తానంటోంది" అని. ఇంతలో ఇంటికి భోజనానికి బైలుదేరి, రోడ్డుమీద సైకిలు కింద బోర్లా పడ్డారు. కాళ్ళకి బలమైన గాయాలు తగిలాయి. చాలా రక్తం పోయింది. కుట్లువేయాల్సి వచ్చింది. ఆ వయస్సులో డాక్టరు మంటలెత్తిస్తో వుంటే ఒకటే జోక్సు, ప్రాణం పోయేట్టు అరుస్తోనే "నన్ను నవ్వించండిరా, బాధ తెలీదు" అని అరుపు. ఆయన మమ్మల్ని నవ్వించాల్సిందేగాని మేము నవ్వించడం కాదు. నవ్వగల స్థితిలో లేము. ఆశ్రమం ఆస్పత్రిలో పడుకునివున్నారు గొప్పగా." (శాస్త్రిగారికి చలంగారి లేఖ 9-3-54)

చలంగారు వెళ్ళి ఆయన తలని కావిలించుకుని కూచున్నారు. డాక్టర్లు కుట్లు కుడుతున్నంత సేపూ చలంగారు ఆయన్ని ఓదారుస్తూ కూచున్నారు. ఆయనని ఆసుపత్రిలో ఇన్ పేషంట్‌గా వుంచేశారు. "రోజూ నువ్వు వచ్చి నన్ను చూడాలి" అని చలంగారి మీద పట్టు పట్టారు ఆయన. చలంగారు అట్లానే రోజూ వెళ్ళి ఆయనని చూసి వస్తూ వుండే వారు. ఒక రోజున రామస్వామి అయ్యర్ "నాకేమీ తోచడం లేదు. నా కేమైనా చదివి పెట్టు" అని చలంగారిని అడిగారు. చలంగారు (తను రాసిన) 'భగవాన్ పాదాల ముందు' అనే పుస్తకం తీసుకువెళ్ళి ఆయనకి చదవడం మొదలు పెట్టారు. అది చివరిదాకా విని "టాగూర్ని మా తమిళులకి ఇచ్చేశారా మీ తెలుగువాళ్ళు ?" అన్నారు రామస్వామి అయ్యర్.

తరువాత ఆయనకి నయం అయిపోయింది. కొన్నాళ్ళయిన తరువాత రామస్వామి అయ్యర్ భార్యకి సరిగా కళ్ళు కనబడక రాత్రిళ్ళు- ఆమె భజనలకి రావడం మానేసింది. రామస్వామి అయ్యర్ ఆవిడ సహాయంతోనే ఇన్నాళ్ళూ భజనలకి వస్తున్నారు. ఆయన ఇల్లొక చిన్న ఇరుకు సందులో వుంది. భజనల నించి రాత్రిపూట కటికచీకట్లో అంత పెద్దవారు ఇంటికి ఒంటరిగా పోవటం చాలా కష్టం. ఆయన భార్య ఇక్కడ వొంటరిగా వుండలేక కూతురి దగ్గరికి వెళ్ళిపోయింది. అయినా గానీ రామస్వామి అయ్యర్ ఏ మనవడినో దగ్గర పెట్టుకుని అరుణాచలంలోనే వుంటున్నారు. తరువాత మనవడు కూడ వుండలేక వెళ్ళిపోయాడు. రామస్వామి అయ్యర్ ఒంటరిగానే తిరువన్నామలై లో వుండేవారు. అట్లాగే తడుముకుంటూ భజనలకి వొచ్చేవారు. ఒకరోజు ఆయన ఒంటరిగా భజనకి వచ్చారు. భజనలో కూచుని ఎంతో నిస్సహాయంగా "నన్ను ఇంటికి ఎవరు తీసుకు పోతారు" అన్నారు.

అప్పట్లోనే హుస్సేన్ అనే తురకతను చలంగారింటికి వచ్చే వాడు. అతనిది ఈ వూరే, అతని తండ్రి చనిపోయారు. ఆయన తండ్రి చలంగారి లాగే వుండే వారట. హుస్సేన్ వచ్చి వాకిట్లో బల్ల మీద ఓమూల కూచునే వాడు. కానీ ఎవరితోనూ ఒక్కమాట మాట్లాడే వాడు కాదు. చలంగారు ఇంట్లో లేకపోతే తన చుట్టూ కాంపౌండులో వున్న నవుకరు పిల్లలందర్నీ చేర్చుకుని ఆడుకునే వాడు. వాళ్ళు లేక పోతే తల వంచుకుని బల్లమీద కదలకండా కూచునే వాడు. రోజూ రమారమి పగటి పూటంతా రాత్రి అయే వరకూ ఇక్కడే గడిపే వాడు. అతను ఎందు కొస్తున్నాడో ఎవరికీ తెలియదు. ఈశ్వరుడితో గానీ, ఇక్కడ జరిగే భజనతోగానీ అతని కేమీ ప్రమేయం లేదు. ఆ బల్ల మీద అతనలా కూచుని వుండేవాడు. అమ్మ అతనిమీద ఏవో అను మానాలు పడి పడా పడా తమిళంలో తిట్టేది. అతను తలవంచుకు తనలో తాను నవ్వుకుంటూ వుండేవాడు. నర్తకి వాళ్ళకి అమ్మ అట్లా అతన్ని తిట్టడం చాలా కష్టం అనిపించి ఓ రోజు అతనితో అన్నారు. "ఆవిడ వూరికే నిన్ను అట్లా తిడుతోంది. నీ మనస్సు కష్ట పడొచ్చు ఇక్కడికి ఎందు కొస్తావు?" అని.

"నాకేం కష్టం లేదు. ఆమె ఎన్ని తిట్టినా పరవాలేదు. కానీ మీరు రావద్దంటే మాత్రం మానేస్తాను. అంతేగాని ఆమె తిడుతోం దని మానుకోను" అన్నాడు.

ఇక నర్తకీ వాళ్ళంతా అతన్ని భజనలో నువ్వుకూడా పాల్గొన రాదా? పాడ రాదా? అని అడిగేవారు. "నేను వేరుగా పాడనక్కరలేదు. నా మనస్సులో పాడు కొంటూనే వుంటాను" అన్నా డతను.

అతని భాష చలంగారికి రాదు. చలంగారి భాష అతనికి రాదు. ఎప్పుడన్నా కొంచెం ఇంగ్లీషు ముక్కలు మాట్లాడుకునేవా రంతే.

చలంగారు అతని కోసమని భజనలో 'అల్లాహో అక్బర్' అని ఒక నామావళి చేసేవారు. కానీ మొత్తానికి అందరికి విడ్డూరంగా వుండేది-ఎందు కతను ప్రొద్దుటే వచ్చి రాత్రి భజన అయ్యేదాకా కూచుంటాడని.

ఒక రోజు ఇంట్లో అందరికీ జలుబులూ, జ్వరాలూ వచ్చాయి. దానికి తోడు పెద్దవాన, కాని చలంగారు వాళ్ళు భజన చేస్తూనే వున్నారు. షా తలెత్తి చూచేసరికీ హుస్సేన్ లేడు. ఈ వానలో ఏమయినాడో ఎవరికీ అర్ధంకాలేదు. కొంచెం సేపటికి హుస్సేన్, వేరొకరిని వెంట పెట్టుకుని వచ్చాడు. వచ్చి నాయన పేరు సుబ్రహ్మణ్యం. సుబ్రహ్మణ్యం అప్పు డప్పుడు భజనలో వచ్చి పాడేవారు. ఆశ్రమం గుడిలో ప్రతీ రాత్రీ పాడేవారు. ఆయనని తీసుకు వచ్చాడు హుస్సేన్, ఆయన వచ్చి భగవాన్‌మీద పాడి చలంగారు వాళ్ళకి శ్రమలేకండా చేశారు. అప్పుడు సుబ్రహ్మణ్యం చెప్పారు. హుస్సేన్ వచ్చి "వాళ్ళందరికీ జ్వరాలుగా వున్నాయి. మీరు వచ్చి పాడండి. వాళ్ళు పాడలేకండా వున్నా" రని తనని తీసుకు వచ్చాడట.

మొట్ట మొదట దాదాజీకి, మంగారాంకీ, రామస్వామి అయ్యర్‌కి రంగస్వామికి హుస్సేన్ రావడం ఏమాత్రం గిట్టేది కాదు. దాదాజీ "ఏమిటీ ఆ కరకు తురక వాడ్ని నమ్ముతున్నారా? ఎన్నడూ తురక అనే వాడ్ని నమ్మకూడదు. ఏ అర్ధరాత్రో వచ్చి మీఅందరి తలలు నరికి పోతాడు"— అనేవారు. మంగారాం ప్రత్యేకం ఏమీ అనక పోయినా హుస్సేన్ రాకూడదని ఆయనకి కూడా పట్టు. దాదాజీ మంగారాం హిందూ ముస్లిం సంఘర్షణలలో చాలా బాధలు పడ్డవారు. ఇద్దరూ సింధీలే.

రామస్వామి అయ్యర్ గట్టి పట్టు పట్టారు- హుస్సేన్‌ని భజన లకి రానివ్వ గూడదని. "ఎందుకు వస్తా డీ మనిషి? ఎందుకు రానిస్తు న్నారు?" అని చాలా గట్టిగా వాదించారు. "ఎవరైనా భజనకి రావచ్చు. ఇక్కడికి రావచ్చు" అన్నారు షా వాళ్ళు. "అతనుకూడా భజనకనే వస్తే ఏమీ అభ్యంతర పెట్టనండి. భజనకి రాకండా ఎందుకు ఆ మూల కూచుంటాడు?" అని ఆయన వాదన. దాని కెవరు జవాబు చెప్పగలరు? "మా కభ్యంతరం లేదండి. ఎట్లా కూచున్నా ఏం చేసినా- అతని ఇష్టం" అని చెప్పారు చలంగారు. అత నిక్కడ వుండేటట్టయితే నేను భజనకి రాను" అన్నారు రామస్వామి అయ్యర్. "సరే మీ ఇష్టం" అన్నారు చలంగారు. ఆయన భజనలకి రాకండా వుండలేరు. ఆయన ప్రాణం, జీవం— అంతా భజనే. అందుకని ఎంతో కష్టం మీద వచ్చేవారు.

ఆయన ఎంతో నిస్సహాయంగా "నన్ను ఇంటికి ఎవరు తీసుకు పోతారు" అనంగానే ఆ మూల బల్లమీద కూచున్న హుస్సేన్ మెల్లిగా లేచి- ఆయన చేతిని పట్టుకుని ఆయన్ని ఇంట్లో దిగబెట్టాడు. ఆ రోజు నించి ఆయనని ఇంటిదగ్గర దిగబెట్టడం హుస్సేన్ వంతు అయి పోయింది.

అప్పటినించి భజనకి రాంగానే "హుస్సేన్ వచ్చాడా?" అని అడిగే వారు ఆయన. ఎప్పు డయినా ఓరోజు హుస్సేన్ వచ్చేవాడు కాదు. రాలేదని చలంగారు చెప్పగానే రామస్వామి అయ్యర్ కుర్చీలో కూలబడి పోయేవారు— "హుస్సేన్ రాలేదు, నే నెట్లా ఇంటికి పోగలనూ?" అంటూ. చలంగారు బసవరాజుగార్నో, ఎవరినో ఒకరిని తోడిచ్చి ఆయనని ఇంటికి పంపించేవారు. మళ్ళీ మరుసటిరోజు హుస్సేన్ కనబడగానే "అప్పా, హుస్సేన్! వచ్చావా! నువ్వు రాక

పోతే నే నేమయి పోతా ననుకున్నావు? అని గోలపెట్టేవారు. హుస్సేన్ మౌనం ఒదిలేవాడు కాదు-ఎవ రేమన్నా.

ఇదంతా ఈశ్వర విలాసం అని పిస్తుంది నాకు. ఏ మనిషిని తీవ్రంగా ద్వేషించారో ఆ మనిషే తనకి అక్కరకి వచ్చిన చుట్టమయ్యాడు రామస్వామి అయ్యర్‌కి. ఎవరు ద్వేషవిషం తనమీద కురిపించారో వారికి సేవచెయ్యడానికి ఎంతో ఔన్నత్యంతో ముందుకు వచ్చాడు హుస్సేన్. ఈ పరిణామం ఒక ఈశ్వర వీక్షణం వల్లనే సాధ్యం. ఈ ప్రసరించే ఈశ్వరకాంతి ఆ రోజుల్లో చేసిన అద్భుతం ఇదే ననిపిస్తుంది. ద్వేషం ప్రేమగా మార్చటం ఈశ్వర శక్తికి వినా ఇంకెవరికి సాధ్యం? అయినా జీసస్ చెప్పినట్లు 'మనసు మార్చటం కన్నా పెద్ద మిరకిల్ వుందా?' అనిపిస్తుంది.

ఒకొక్క రోజున హుస్సేన్ రాకపోతే చలంగారు వాళ్ళు అతన్ని అడిగే వారు "నువ్వెందుకు రావటంలేదు? నువు రాకపోతే పాపం ఆ ముసలాయన ఏమయిపోతారు" అని.

పూర్వం భజనలో ఎప్పుడో అప్పుడు లేచి వెళ్ళి పోయేవాడు హుస్సేన్. ఇప్పు డీయనకోసం భజనంతా పూర్తి అయ్యేదాకా కాచుకుని కూచోవాలి. మా అమ్మ ఒంటరిగావుంటుంది. మా అమ్మ గోల పెడుతుంది తను ఒంటరిగా కూచున్నానని. అందుకనే అప్పు డప్పుడు ఆమెకి తోడుగా వుండడానికి వెడతాను" అన్నాడు హుస్సేన్. ఇప్పుడు రామస్వామి అయ్యర్, "నా కెవరు తోడు?" అని అడిగే సరికి, హుస్సేన్ తల్లినికూడా మరచిపోయి ఆయన కోసం రాత్రి పది గంటల దాకా కూచునే వాడు.

ఒక రోజు "మీ అమ్మకి తోడెవరు?" అని అడిగారు షౌ. "మా అమ్మకి ఇట్లా సంగతి అని చెప్పాను. నేను ఒక్కదాన్ని

ఉండగలను. అన్నది" అని చెప్పాడు హుస్సేన్. ఆ బిడ్డలో ఔన్న త్యం వుండడంలో ఆశ్చర్యం లేదు. ఆ బిడ్డని మించి పోయింది ఔన్నత్యంలో తల్లి, ఎంత మానవత్వమో ఆమెలో. కులాలకి హారతు లెత్తే మూర్ఖత్వం నించి ఈ విధంగా తనచుట్టూ పరివేష్టించిన భక్త మండలి కళ్ళని తెరిపించారేమో ఈశ్వరుడు.

తరువాత హుస్సేన్ తల్లి అతనితో "కొంచెం పెందరాళే వస్తూ వుండు. మరీ ఇంత ఆలస్యం చెయ్యోద్దు" అన్నది. అందుకని తొమ్మిది దాటగానే హుస్సేన్ రామస్వామి అయ్యర్‌ని ఇంటికి తీసుకు వెళ్ళి పోయేవాడు.

ఇంక చలంగారు వాళ్ళు భక్తి (Devotion) నించి సేవా (Seva) కి వచ్చేసిన తరువాత కొన్నాళ్ళు అలాగే భజనలకి వచ్చే వారు రామస్వామి అయ్యర్. ఇక ఒంట్లో ఓపిక తగ్గి రాలేక తగ్గించు కోవడం మొదలు పెట్టారు. ఇక పకపక పెళ్ళితో దూరమై పోయారు. అంతేకాదు, అప్పటికే ఆయన నించి ఓపిక కూడా దూరమై పోయింది.

ఒకసారి మాత్రం ఓపిక చేసుకుని వొచ్చి "వెంకటచలంగారూ! మాకు దూరం అయిపోయారండీ మీరు" అన్నారు. త్వరలోనే ఆయ నకి తిరువన్నామలైలో వుండటం అసాధ్యమై పోయింది. కొడుకు వచ్చి ఆయనని మద్రాసు తీసుకుని వెళ్ళి పోయాడు. శాస్త్రిగారు వాళ్ళు అరుణాచలం నించి వెళ్ళినప్పుడల్లా మద్రాసులో రామస్వామి అయ్యర్‌ని కలుసుకునే వారు. వెంకటచలంగారు క్షేమంగా వున్నారా?" అని అడిగేవారట ఆయన. ఆ తరువాత త్వరలోనే చచ్చిపోయారు రామస్వామి అయ్యర్.

## 8

ఇంతలో పంతులు, జానకీ (చలంగారి చెల్లెలు, బావమరిది) వాళ్ళ కుటుంబం అంతా చలంగారు వాళ్ళని చూడడానికి వచ్చారు.

ఆ లావాదేవీలలో ఆయన పేరుండకూడదు. జగదీష్ "నా షేర్ నివొదులు కుంటున్నాను" అనే డాక్యుమెంట్‌లో సంతకం చెయ్యాలి. జగదీష్ వాళ్ళ అన్నగారు చలంగారింట్లోనే దిగారు. ఆయన ఇక్కడి రమణ భక్తులందర్నీ వెళ్ళి చూచారు. జగదీష్‌ని అసలిలా బ్రహ్మచర్యం తీసుకున్నందుకు నిష్కారణంగా తిట్టిపోసిన వాళ్ళు జగదీష్ అన్నగారు రాంగానే వాళ్ళు జగదీష్‌ని అమితంగా పొగిడేసి— "జగదీష్‌ని మేమిట్లా చూసుకున్నాం. అట్లా అతనికి సాయపడ్డాం" అని ఆయనకి ఏకరువు పెట్టారు.

జగదీష్ వాళ్ళ అన్నగారు చలంగారిని తనవెంట తీసుకువెళ్ళి —జగదీష్‌కి తాను వచ్చిన పనినంతా **explain** చేసి చెప్పారు. ఈ విధంగా సంతకం కావాలని అడిగారు. జగదీష్ "సౌరి అమ్మని అడిగితేనేగాని నేనేమీ చేయను"— అన్నారు. జగదీష్ వచ్చి "ఏం చేయమంటార"ని షౌని అడిగారు. షౌ "భగవాన్ విల్లుమీద సంతకం చేశారా? చెయ్యలేదా?" అని జగదీష్‌ని అడిగారు. "భగవాన్ ఒకగీటు పెట్టారు. అంతే" అన్నారు జగదీష్. "నువ్వూ అలాగే గీటుపెట్టు" అన్నారు షౌ జగదీష్‌తో. వాళ్ళ అన్నగారు గీటు చెల్లదన్నారు. చివరికి షౌ "నీకు సంతకం చెయ్యాలని మనస్ఫూర్తిగా వుందా?" అని అడిగారు జగదీష్‌ని. "నా కేమాత్రమూ చెయ్యాలని లేదు. మీరేమంటారు?" అన్నారు జగదీష్. "నీ కేమాత్రమూ చెయ్యాలని లేకపోతే చెయ్యొద్దు" అన్నారు షౌ. దాంతో ఆ అన్నగారు జగదీష్‌ని ఎంతో బతిమాలి బతిమాలి చివరికి ఏమీ చేయలేక వెళ్ళిపోయారు.

ఒక గుజరాతీ కుటుంబం భగవాన్‌కి చాలా పాత భక్తులు. ఇక్కడే స్థిర పడ్డారు. వాళ్ళు జగదీష్‌ని తమతో వుంచు కున్నారు. జగదీష్ వాళ్ళ సాంసారిక వ్యవహారాలు, మాటలు భరించలేక కొండ

ల్లోకి పారిపోతూ వుండేవారు. ఆ గుజరాతీ గృహస్థు 70 ఏళ్ళ వారు. ఆయన జగదీష్ కోసం కొండలన్నీ తిరిగి, జగదీష్ కనపడగానే కాళ్ళ మీద పడి వేడుకొని, తిరిగి తమ యింటికి తీసుకు వెళ్ళేవారు. ఆయన తిరిగి బొంబే వెళ్ళిపోతూ, జగదీష్ దగ్గర ముసలమ్మలు ఇద్దర్ని ఆతని సేవకోసం వొదిలిపెట్టి వెళ్ళిపోయారు. చివరికి ఆ ముసలమ్మలు కూడా బొంబే వెళ్ళి పోవాల్సి వచ్చింది. వెళ్ళే ముందు వాళ్ళు రమణస్థాన్‌కి వచ్చి చలంగారు వాళ్ళతో "మేం వెళ్ళి పోతున్నాం. జగదీష్‌ని ఇంక మీరే చూచుకోవాలి" అని చెప్పారు. మళ్ళీ జగదీష్ తన సాధనకోసం కొండలలో తిరుగుతూ, భోజనానికి చలంగా రింటికే వచ్చేవారు. ఆ గుజరాతీ కుటుంబం తిరువన్నామలై తిరిగి వచ్చినప్పుడు జగదీష్‌ని తమతో తీసుకునే వారు, వెళ్ళిపోతూ చలంగారికి అప్పగించి వెళ్ళిపోయే వారు. ఇంక ఆ కుటుంబం శాశ్వతంగా అరుణాచలం నించి వెళ్ళి పోతూ జగదీష్‌ని చలంగారు వాళ్ళకి అప్పగింతలు పెట్టి వెళ్ళిపోయారు, కొన్నాళ్ళకి జగదీష్ మళ్ళీ ఆశ్రమంలో చేరిపోయారు.

అమ్మ అరుణాచలంలో ఏడాదిపాటు జబ్బుతో వున్నప్పుడు అమ్మకి ఓదార్పునీ, కాలక్షేపాన్ని కలిగిస్తో చూసుకున్నారు జగదీష్. భజనలు అవీ పాడుతూ ఆమెని రోజూ వచ్చి entertain చేసేవారు. ఆయనకి ఇప్పటికీ చలంగారు వాళ్ళంటే ఎంతో గౌరవమూ, ప్రేమ వున్నాయి. ఈశ్వరవిలాస రచయితకు ఈ సమాచారం చెబుతూ ఆయన "వచ్చిన రోజుల్లో ఇక్కడొక పరదేశిని. నన్ను తమలో ఒకనిగా తీసుకుని అన్నం పెట్టి తండ్రిలా ఆదరించారు చలం. నాకు ఎదురైన అనేక క్లిష్టసమయాల్లో, అనారోగ్యంతో బాధపడే రోజుల్లో తమ హృదయాల్లోకి తీసుకుని సేవ చేశారు ఆ ఇంట్లో ప్రతీ ఒకరు. ముఖ్యంగా నా బ్రహ్మచర్య స్వీకరణకి సంతోషించి, ఆశీర్వదించి,

ప్రోత్సహించారు సౌరి అమ్మ. ఆమె ప్రోత్సాహం వల్లనే భగవాన్ చరణాల నీడల్లో అంతులేని శాంతిని పొందాను" అంటూ, తుదిగా "రంగనాయకమ్మగారు నన్ను కన్నతల్లి కంటే అధికంగా ఆదరించారు. ఆమె నాపై చూపిన పుత్ర వాత్సల్యానికీ. ప్రేమకీ ఆమె కోసం ఏమీ చేయలేక పోయాను. కానీ ఈ పరదేశిని తమలో ఒకరిగా తీసుకున్న వాళ్ళ హృదయ వైశాల్యం— నా మీద భగవాన్ ఆశీర్వాదంగా కనిపిస్తుంది" అన్నారు ఆర్ద్రమైన గొంతుతో జగదీష్‌భాయ్.

చాడ్విక్ చిన్న ఇల్లు కట్టుకుని రమణాశ్రమంలో వుండే వారు. చలంగారు తొలిసారిగా అరుణాచలం వెళ్ళి వచ్చినప్పుడు అక్కడ చాడ్విక్ అనే ఇంగ్లీషు ఆయన వున్నారని చెప్పగానే షౌకి ఆయన రూపం కనపడింది.

ఆయనతో ముఖ పరిచయం లేకపోయినా ఆయన చలంగారు వాళ్ళు భగవాన్‌ని చూడడానికి వచ్చినప్పుడు వాళ్ళని నోటీస్ చేస్తో వుండేవారు. చలంగారు వాళ్ళు ఆయనని నోటీస్ చేసేవారు.

షౌ 'అరుణాచలం నుంచి లేఖ'ని భగవాన్ ఇంగ్లీషులోకి అనువాదం చేయించినప్పుడు చాడ్విక్ గురించి రాసిన వాక్యాలని చాడ్విక్‌కి ఇచ్చారు. అప్పటినించి చలంగారు వాళ్ళని ఇంకా అధికంగా నోటీస్ చేసేవా రాయన.

ఇక్కడ స్థిర పడేందుకు చలంగారు వాళ్ళు వచ్చేసినప్పుడు చాడ్విక్ కనిపించ లేదు. ఆయన వెళ్ళిపోయారో, ఏమయినారో వాళ్ళకి తెలియలేదు.

ఆ రోజుల్లో భగవాన్‌కి క్యాన్సర్ అనంగానే చాడ్విక్ భగవాన్ దగ్గరికి వెళ్ళి ఏడ్చారు. "మీరు నయం చేసుకోండి" అని; భగవాన్ తన మామూలు వేదాంత ధోరణిలో "ఎందుకీ శరీరాన్ని గురువు అను

కుంటావ్!" అని ఓదార్చారు. చాడ్వీక్కి అప్పట్నించి ఆయన భగవాన్ సమక్షానికి వచ్చేవారు. కాదు ఆయన భగవాన్ నించి దూరం కావడం మొదలు పెట్టారు (భౌతికంగా).

అరుణాచలం వస్తున్నప్పుడు ముందుగా అరుణాచలం కొండ కనబడగానే "ఆ అరుణాచలం వచ్చింది" అనిపించేది. ఆ తరువాత భగవాన్ దర్శనం చేసుకున్నాక "ఆ భగవాన్ వున్నారు" "చాడ్విక్ కూడా వున్నారు" అనిపించేది షౌ వాళ్ళకి. ఇవన్నీ చూచి ఎంతో సంతుష్టి పడేవారు షౌ. ఆమెకి ఒకనాడు భగవాన్ కనబడరనీ, చాడ్విక్ కనబడరనే- యోచన వచ్చేది కాదు, వాళ్ళు అలాంటి మాన్యుమెంట్స్ అరుణాచలంలో.

భగవాన్ మహాప్రస్థానానికి వెళ్ళిపోయాక రమణనగర్‌లో జనమందరూ వెళ్ళి పోయారు. అంతా వెళ్ళిపోయిన తరువాత రమణ నగర్‌లో చాడ్విక్, చలంగారు వాళ్ళు మాత్రం మిగిలారు. కాని పది నెలల తరువాత చాడ్విక్ యాత్రలకని బయలుదేరి- మళ్ళీ ఆశ్రమానికి తిరిగి రాకూడదని నిశ్చయించుకుని వెళ్ళిపోయారు. ఈశ్వరుడు వచ్చాక చాడ్వీక్ తిరిగి వస్తారని చెప్పారు. తరువాత ఆయన జన్మల గురించి చెప్పారు. షౌ ఆశ్చర్యపోయారు చాడ్విక్ తిరిగి వస్తారంటే. కానీ చాడ్విక్ ఈశ్వరుడు చెప్పినట్లే మళ్ళీ తిరిగి వచ్చారు. కాని ఆశ్రమంలో వుండకండా నారాయణయ్యర్ కాంపౌండ్‌లో ఓ చిన్న ఇల్లు కట్టుకుని అక్కడే నివసించ సాగారు. నిత్యమూ ఆశ్రమానికి వచ్చేవారు. ఆ తరువాత తిరిగి ఆశ్రమంలో వున్న తన ఇంట్లోకి మారారు.

చలంగారు ఆయనతో స్నేహం చేసుకుని ఆయనని గురించి ఈశ్వరుడు చెప్పిన విషయాలన్నీ ఆయనకి చెప్పడం మొదలుపెట్టారు.

జానకి షౌని చూచి ఎంతో సంతోషంతో కావలించు కుంది. నిర్మల జబ్బుగురించి "ఈశ్వరుడు నయం చేస్తారా?" అని చలంగారు ఈశ్వరుడ్ని అడిగారు. ఆమె నాలో విశ్వసిస్తే తప్పకండా నయం చేస్తామ"న్నారు. ఆమె దృఢంగా "విశ్వసిస్తానంది". "అయితే ఇక్కడే వుండు, నేను నయం చేస్తాన"న్నారు ఈశ్వరుడు. అట్లాగే వుండిపోయింది నిర్మల.

పంతులు వాళ్ళు పకపకని తమతో తీసుకు వెళ్తా మన్నారు. పకపకకి ఎట్లానూ ఇక్కడ తోచడంలేదు గనుక 'సరే' అన్నారు ఈశ్వరుడు.

ఇంక నిర్మలకి రోజూ 99, 100 డిగ్రీల జ్వరం వచ్చేది ఆ రోజుల్లో. "వెళ్ళి చన్నీళ్ళ స్నానం చెయ్య" మన్నారు ఈశ్వరుడు ఆమెని. ఏమీ సంశయించకండా వెళ్ళి తలారా స్నానం చేసి వచ్చింది నిర్మల. ఈశ్వరుడు ఆమెచేత యోగాసనాలు వేయించడం ప్రారంభించారు. నిర్మల చిత్రలాగే లావు. ఇక యోగాసనాలు వేశాక ఆ జ్వరం అదీ తగ్గిపోయి చలాకీగా గంతులువేస్తూ వుండేది నిర్మల.

ఆ ఏడాది జయంతికి ఎంతమందో అతిథులు వొచ్చారు. జగదీష్ షౌ పాదాలకి నమస్కరించి "నువ్వు నాలా బ్రహ్మచర్యం స్వీకరించి నా అడుగుజాడల్లో నడు" అని భగవాన్ చెప్పారని, తనకి అదే పనిగా * 'అయ్యంకులం అయ్యంకులం' అని వినబడుతోందనీ— తనకి బ్రహ్మచర్యం స్వీకరించాలని వుందని చెప్పి తనని ఆశీర్వదించమ"న్నారు. అంతకి మునుపే ఎప్పుడో "జగదీష్ సన్యసించబోతున్నాడనీ, గొప్ప స్థితికి వెళ్ళబోతున్నా డని చెప్పారు ఈశ్వరుడు.

* భగవాన్ రమణమహర్షి అయ్యంకులం అనే కోనేటి దగ్గర ముండనం చేయించుకుని బ్రహ్మచర్యం స్వీకరించారు.

షా అలాగే ఆశీర్వదించారు. ఆ తరువాత జగదీష్ బొంబాయి వెళ్ళి పోయారు. వెళ్ళిన తరువాత షాకి అక్కడి నించి అప్పు డప్పుడు వుత్తరాలు రాస్తూ వుండేవారు. కొన్నాళ్ళ తరువాత జగదీష్ తండ్రి నించి చలంగారికి ఒక వుత్తరం వచ్చింది. — "జగదీష్ ఇంట్లోంచి వెళ్ళి పోయాడు. బహుశా ! అరుణాచలం చేరుకుని వుండవచ్చు. మీ కుమార్తె మీద అతనికి చాలా గురి. తరువాత మేం మీకు డబ్బు పంపిస్తాం. అత నెక్కడ వున్నా కొంచెం అన్నం పెడుతూ వుండండి" అని రాశా రాయన. చలంగారు ఆయనకి "మీరేం గొడవ పడవద్దు. జగదీష్ ఇక్కడికే వస్తే అతన్ని నా సొంత కొడుకులాగ చూసుకుంటాను" అని రాశారు.

జగదీష్ అరుణాచలం వచ్చారు. కానీ చలంగా రింటికి రాలేదు. సరాసరి పెద్దగుళ్ళో దిగారు. ఆయన అక్కడ దిగారని తెలియగానే చలంగారూ, నర్తకీ ఆయన్ని చూడడాని కని వెళ్ళారు. జగదీష్ ఒంటి మీద బట్టల్ని చింపేసుకుని కౌపీనం పెట్టుకున్నారు. తన జేబులోని డబ్బంతా అక్కడి బీదవాళ్ళకి పంచి పెట్టేశారు. చలంగారు వాళ్ళ కుటుంబంలో, ఒక సభ్యుడిగా వాళ్ళమధ్య తిరిగిన జగదీష్ చలంగారు వాళ్ళని చూచి నిర్లిప్తంగా నవ్వారు. ఇంక చలంగారు వాళ్ళు అతని స్థితినీ, వైరాగ్యాన్నీ చూచి ఎంత సంతోషించారో! చలంగారు ఆయనకి భోజనం పంపిస్తా మన్నారు.

"మిత్రుడు జగదీష్ బొంబాయినించి ఈవూరు వొచ్చి గుళ్ళో వున్నారు. అన్నీ పంచివేసి కౌపీనం ఒకటే తన ఆస్తిగా మౌనం, వుపవాసం, ఎప్పు డెక్కడికి పోతాడో నని watch చేయడం అతని తండ్రికి ఒప్పందం చేసుకున్నాను, ఎప్పటి కప్పుడు తెలియజేస్తోంటా నని. రేపు మౌనం వొదులుతాడు. మళ్ళీ వెళ్ళాలి.

(శాస్త్రిగారికి చలంగారి లేఖ 11-1-54)

ఆ మరునటి రోజునించీ ఎవరో ఒకరు వెళ్ళి భోజనం ఇచ్చి వొస్తూ వుండే వారు అతనికి. అతని తండ్రి నెల నెలా చలంగారికి డబ్బు పంపించే వారు. తరువాత జగదీష్ అక్కడ వొదిలి పెట్టిన వస్తువుల్ని పెద్ద పార్శిల్ కట్టి పంపించేశారు చలంగారు వాళ్ళకి. ఎన్నో వస్తువులు అవి. కొన్ని బసవరాజుగారికి, తక్కినవి పేదలకి పంచిపెట్టే శారు చలంగారు వాళ్ళు. జగదీష్‌కి భగవాన్ ఆదేశాలు వచ్చేవి.

భగవాన్ తాము ఏ ఏ చోట్లలో కూచున్నారో అక్కడ తనని కూచో మన్నారని జగదీష్ చెప్పారు. ఆయన గుడితో ప్రారంభించి భగవాన్ తపస్సు చేసిన ప్రతీ చోటుకి మారుతుండే వారు ధ్యానానికి. ఆయన గురుమూర్తం పక్కకి వెళ్ళేదాకా చలంగారు వాళ్ళే భోజనం పంపించేవారు. గురుమూర్తం పక్కకి వెళ్ళాక తనకి భోజనం పంప వద్దని, తను భిక్షం అడుక్కుంటానని అన్నారు జగదీష్. ఆయన గుజరాతీవారు. ఇక్కడి అరవల కారాల భోజనాలు ఆయన ఒంటికి పడలేదు. విరోచనాలు పట్టుకున్నాయి. అప్పుడు చలంగా రింటికి వచ్చా రాయన. ఆయనకి మందులు ఇచ్చి విరోచనాలు తగ్గించారు చలంగారు వాళ్ళు. షౌ గట్టిగా చెప్పారు ఆయనకి "ఈ దేశపు భోజనం నీ ఒంటికి పడదు. మేం భోజనం పంపిస్తాం. నువ్వు తినవలసింది"— అని. ఆయన అలాగేనని ఒప్పుకున్నారు.

పరశురాం కూతురు 'చిన్నకణ్ణు' జగదీష్ భాయికి భోజనం తీసుకు వెళ్ళి ఇచ్చి వచ్చేది. ఆ అమ్మాయికి సాధువు లంటే చాలా భక్తి. ఒక్కొక్క గుహ నించీ మారేవా రాయన. ఏ గుహలో వున్నారో తెలిసేది కాదు. కాని చిన్నకణ్ణు కొండంతా వెదికి ఆయన ఎక్క డున్నారో కనిపెట్టి మరీ భోజనం ఇచ్చి వచ్చేది. చిన్నకణ్ణుకి వీలు పడకపోతే చిత్ర, డాలీ వెళ్ళి ఇచ్చి వచ్చేవారు. కొన్నాళ్ళకి

చిన్నకణ్ణుకి పెళ్ళయి అత్తవారింటికి వెళ్ళిపోయింది. మరికొ
లకి చిత్రకూడ అత్తవారింటికి వెళ్ళిపోయింది. ఇంక భోజన
పెళ్ళి ఇచ్చేవారు ఎవరూ లేరు. దాంతో జగదీష్ ఇక్క
భోజనం చేసి వెళ్ళే వారు.

భగవాన్ కూచున్న అన్ని చోట్లలోనూ కూచున్నాక
ఏం చేస్తారా? అని తిరువన్నామలైలో చాలా మంది చూశారు
ఆయన అంతా తిరగడం అయాక ఆశ్రమంలో నివసించడం
పెట్టారు. అప్పుడప్పుడు అనారోగ్యంతో బాధ పడుతుంటే
రింటికి వచ్చేవారు. ఒకసారి వల్లమాలిన అనారోగ్యంతో బా
వచ్చి ఇక్కడ చలం గెస్ట్‌హౌస్‌లో నెలరోజులు వున్నానని
చెప్పారు చరిత్ర రచయితతో.

ఒక జయంతికి జగదీష్ తండ్రి చనిపోయినట్లు :
టెలిగ్రాం వొచ్చింది. ఆ టెలిగ్రాం తీసుకుని వెళ్ళి ఆయనకి
చాటు చలంగారు. అట్లా ఓసారి చూసి ఏమీ పట్టనట్టు ఆ టె
కింద పారేశారు జగదీష్. ఆయనలో చలనం లేదు. చ
మామూలుగా మాట్లాడారు ఏమీ జరగనట్లే. ఇంక ఆయనలో
గ్యాన్ని చూచి చలంగారు ఎంత ముగ్ధులయి పోయారో.

ఆశ్రమంలో వుంటున్నాగానీ, జగదీష్ చలంగారింటి
లకి, పండుగలకి రావడం మానలేదు.

కొద్ది రోజుల తరువాత వాళ్ళ అన్నగారు వచ్చారు.
గొప్ప **Electrical goods company.** వాళ్ళు విదేశాల్తో
చేస్తూ వుంటారు. జగదీష్‌కి ముగ్గురు అన్నదమ్ములు. ఇద్దః
గార్లు వున్నారు. వాళ్ళ **export & import** వ్యాపారంలో
దమ్ములు నలుగురికీ నాలుగు షేర్లున్నాయి. జగదీష్ సన్యసించ

"చాడ్విక్‌కి ఈశ్వరుడ్ని పరిచయం చేశాను. ఇంకా గాలం గుచ్చుకోలేదు.

(శాస్త్రిగారికి చలంగారిలేఖ 6-6-54)

చాడ్విక్ షాని చూడటానికి వచ్చారు. ఈశ్వరుడ్ని గురించి అడిగారు. ఆయనకి ఈశ్వరుడూ అదీ నమ్మకం లేదు. "ఈశ్వరుడు అనుకోవడం ఎందుకు? సౌరిస్‌లో, పలికేది devil అనుకో కూడదా? ఆ పలికేది ఈశ్వరు డని మీకెట్లా తెలుసు?" అని చలంగారితో అనేవారు చాడ్విక్. ఈ మాట చలంగారు శాస్త్రిగారికి చెబితే "ఆమెలో పలికేది ఈశ్వరుడో, పిశాచమో (devil) నాకు అక్కర్లేదు. ఆ పలికేవారు నాకు కావాలి. ఆయన devil అయినా సరే ఫరవా లేదు" అన్నారు శాస్త్రిగారు.

ఈశ్వరుడి విషయాన్ని నమ్మకపోయినా. చలంగారు వాళ్ళని వదిలి పెట్టలేదు చాడ్విక్. ఇంటెల్లపాదికీ ఎంతో దగ్గరయిపోయారు. ఇంక చలంగారూ ఆయన చేసే అల్లరి ఇంతా అంతా కాదు. అదే పనిగా నవ్వులూ, గోల.

ఆ రోజుల్లో షా తమ విశ్రాంతినించి మధ్యాహ్నం మూడు గంటలకే లేచే వారు. వాళ్ళ company లో తామూ వచ్చి కూచునే వారు. షా వచ్చినప్పటినించీ ఇంకా అల్లరి చేసేవారు వాళ్ళిద్దరూ. తమకు తెలిసినవారిని వెక్కిరించే వారు. ఎవరన్నా ఆశ్రమానికివస్తే గేటుదగ్గర నించే వాళ్ళ నడకనీ, వాళ్ళ తీరునీ అభినయిస్తూ నడుస్తూ వచ్చేవారు చాడ్విక్. కొన్ని సందేహాలు షాని అడిగే వారు. ఈశ్వరుడంటే నమ్మిక లేకపోయినా షా మాటల్లో ఎంతో గురి ఆయనకి. షా ఏమి చెయ్య వద్దన్నా చేసేవారు కాదు. తరువాత భగవాన్ వల్ల తన క్షేమి దాలేదని అనేవారు.

చాడ్విక్ షా, నర్తకీ, పకపకలని తమ ఇంటికి పిలిచారు, అది ఒక చిన్న గది. దాంటో గోడకి భగవాన్ ఫొటో, డ్రెస్సర్ మీద చిన్న దక్షిణామూర్తి విగ్రహం, బంగారంతో చేసిన శ్రీచక్రం వుండేవి.

ఆయన తెల్లారి నాలుగు గంటలకు లేచి విధిగా స్నానంచేసి, దక్షిణామూర్తి స్తోత్రం చదువుకునే వారు. ఆశ్రమ వేదపారాయణం అంతా ఆయనకి క్షుణ్ణంగా కంఠతా వచ్చును. కాని భగవాన్ మాటంటే ఆయనకి వేదాక్షరం. బ్రాహ్మలు తప్ప వేదం చదవకూడదని భగవాన్ అన్నారు గనక ఎప్పుడూ పైకి చదివేవారు కాదు. ఇంక ఇండియాకి రాక పూర్వం నించే ఆయన శాకాహారులు. బ్రహ్మచారి. ఆయన నిష్ఠా నియమాలు చూసి బ్రాహ్మలే సిగ్గుపడే వారు. భగవాన్ జీవిత కాలంలోనే శాస్త్రోక్తంగా జందెం వడికి, బ్రాహ్మలు (ఆశ్రమం) ఆయన దగ్గరకి వెళ్ళి "మాకన్నా మీరే నిజమైన బ్రాహ్మలు. ఇది మీ కోసం వొడికాం, వేసు కోండి" అంటే ఆయన చిరునవ్వుతో నిరాకరించారు.

"చాడ్విక్‌గారు కొత్త time theory పైన కృషి చేస్తున్నారు. ఆశ్రమంలో భజనలు ఏర్పాటు చెయ్యాలని చూస్తున్నారు. మరీ తక్కువ అవుతున్నారు మనుషులు ఆశ్రమంలో."

(శాస్త్రిగారికి చలంగారి లేఖ 17-6-54)

ఆశ్రమానికి వచ్చే జనం తక్కువై పోయారు. ఆశ్రమం అంతా గొడవల్లో పడి పోయింది. ఇంక ఏ నిమిషాన మూసి వేస్తారా? అన్నట్లుగా వుంది ఆశ్రమ పరిస్థితి. రాబడి తక్కువై పోయింది. చాడ్విక్ ఎక్కడెక్కడికో వుత్తరాలు రాసి ఫండ్స్ తెప్పించి ఆశ్రమాన్ని నిలిపారు. పూర్వం భగవాన్ వుండే రోజుల్లో దగ్గర దగ్గర డజనుమంది వటువులు ఇటూ అటూ కూచుని వేదపారాయణం చేసేవారు.

స్వాతంత్ర్యం వొచ్చాక బ్రాహ్మలకి ఆధిక్యత పోయింది. వాళ్ళు బతకాలంటే మామూలు పనులు చేసుకోవాల్సి వచ్చింది. అందు వల్ల తమ పిల్లల్ని బ్రాహ్మ లెవరూ వేదాభ్యాసానికి పంపించేవారు కాదు. చాడ్విక్ ఆశ్రమానికి వచ్చే బ్రాహ్మల్ని తమ పిల్లల్ని వేదం నేర్చుకోవడానికి పంపించమని అడిగారు. ఆ బ్రాహ్మణులు అభ్యంతరం చెప్పారు చాడ్విక్ అభ్యర్థనకి. "వేదపారాయణం చేస్తూ వుంటే మా పిల్లల భవిష్యత్ ఏ మవుతుంది?" అని అడిగారు ఆయనని. "వాళ్ళ భవిష్యత్తు నేను చూసుకుంటాను, మీరు పంపండి వాళ్ళని" అన్నారు చాడ్విక్ వాళ్ళతో. మొత్తానికి ఎనిమిదిమంది పిల్లలు ఆయన ఆధీనంలోకి వొచ్చారు. ఆ పిల్లలకి వేదం నేర్పించడమే కాక వారికి తమిళం, ఇంగ్లీషు మిగిలిన subjects చెప్పడానికని ఒక స్కూలు పెట్టారు. ఆ స్కూలులో ఇంగ్లీషు చెప్పడానికని బసవరాజుగార్ని నియమించారు. ఆయన బసవరాజుగారికి ఇంగ్లీషు ఎలా చెప్పాలో తరిఫీదు ఇచ్చారు. ఆ training బసవరాజుగారికి రమణస్థాన్‌లో పిల్లలకి పాఠాలు చెప్పడానికి ఎంతో వుపయోగ పడింది.

భగవాన్ స్వయంగా మాతృ భూతేశ్వరిఆలయంలో శ్రీచక్రాన్ని ప్రతిష్ఠించారని చాడ్విక్ నమ్మకం. భగవాన్ దేహం చాలించి నప్పటి నించీ అన్నిరోజులూ ఏ పూజా లేకండా వుంది ఆ శ్రీచక్రం! శ్రీచక్రం పూజ లేకండా వుండకూడదు గనక శుక్రవారం శుక్రవారం యథావిధిగా శ్రీచక్ర పూజ ఆరంభం చేయించారు చాడ్విక్. అది మొదలు పెట్టే ముందు పెద్ద హోమం చేయించారు.

"ఇవాళ ఆశ్రమంలో బ్రహ్మాండమైన హోమం శ్రీచక్రానికి. ఆ హోమం సంగతి, ఎందుకు చేస్తారో అది ఎవరూ సరిగా చెప్పరు. వాళ్ళకే తెలియదేమో. శ్రీచక్ర పూజలకి వార్షికోత్సవం అనుకుంటాను."

(శాస్త్రిగారికి చలంగారి లేఖ 19-3-54)

ఆ హోమం ప్రతి ఏడాది ఆశ్రమంలో జరుగుతూనే వుంది. చాడ్విక్ నిలువునా ఆంగ్లేయుడు కాని ఆయనకి బ్రాహ్మలమీద అంతు లేని ప్రేమ. ఇండియన్స్ అందరితో కలిసి పోయేవారు. ఇక బ్రాహ్మల్ని చూస్తే "వాళ్ళలో ఇంత విద్వత్తు వుండీ. నిష్ఠ వుండీ ఎందు కిట్లా అణగారి పోయారా?" అని ఆయన బాధ పడేవారు. ఆశ్రమంలో పూజార్ల మీద ఎంత జాలో ఆయనకి. ఎవ రెవరికో రాసి డబ్బు తెప్పించి ఆశ్రమంలో పూజారు లందరికీ పెళ్ళిళ్ళు చేయించారు. తలా ఒక ఇల్లు కట్టించి ఇచ్చారు. నవరాత్రి ఉత్సవాలని దగ్గర వుండి చేయించేవారు అమ్మవారికి. ఆశ్రమానికి వచ్చే యూరోపియన్స్ అంద రికీ చాడ్విక్ పద్ధతి ఆశ్చర్యకరంగా వుండేది. కొందరికి నవ్వులాటగా వుండేది. మనుప భగవాన్ విచారణామార్గంలోనే నడుస్తో, దేన్లోనూ కల్పించుకోని చాడ్విక్ ఇలా పూజల్లో పడడంతో— ఆయనని ఎలా అర్థం చేసుకోవాలో వాళ్ళకి తెలియలేదు. ఏమిటి చాడ్విక్ కూడా మూఢభక్తిలో పడి పోయారు? అనుకునేవారు. మెర్స్టన్‌కి మాత్రం ఇదంతా వింతగా కనపడేది కాదు.

"ఈ లక్షణం అతని రక్తంలోనే వుంది. వాళ్ళ తండ్రి ఇంగ్లాండులో priest. విగ్రహారాధన చేసే చర్చికి చెందినవారు. కొడుక్కి కూడా అదే వచ్చింది, అంతే" అనేది ఆమె.

ఇక చాడ్విక్ ఆధ్వర్యంలో ఆశ్రమానికి గొప్ప శోభ పట్టింది. చాడ్విక్ కీర్తి వ్యాపించింది. ఎవ రెవరో ఆయనని రమ్మనమని పిలిచే వారు. ఈ ఎనిమిది మంది వేదాభ్యాసం చేసే వటువులతో ఆయన బయలుదేరే వారు. ఆ పిల్లలకి ఎంత వుత్సాహమో! ఆయన మీద వాళ్ళకి ఎంత ప్రేమో!

ఇక ఆ పిల్లల్ని ఓ చిన్న చీమ కుట్టినా సహించలేక పోయేవా రాయన. ఆశ్రమంలో చాడ్విక్ ఒక **figure** అయిపోయారు. ఇదివరకు దేనిలోనూ కల్పించుకోని ఆయన ఎవరైనా వచ్చినప్పుడు వారిని **receive** చేసుకుని శ్రీచక్ర పూజలూ, ఆశ్రమం అంతా చూపించే వారు. ఈ పను లన్నిటినీ గొప్ప వుత్సాహంతో చేసేవారు. ఎందరో మహారాజులూ, గొప్ప గొప్ప ఐశ్వర్యవంతులూ రావడం మొదలు పెట్టారు ఆశ్రమానికి. భగవాన్ నిర్యాణం తరువాత వెళ్ళిపోయిన భక్తు లంతా మెల్లమెల్లగా అరుణాచలం చేరుకోవడం మొదలు పెట్టారు. ఖాళీ అయిపోయిన ఇళ్ళు మళ్ళీ నిండు కోవడం మొదలు పెట్టాయి. చాడ్విక్ కి ఈ ఆశ్రమాన్ని ఎట్లాగైనా వృద్ధి చేయాలనీ, పైకి తీసుకు రావాలనీ యోచన.

"ఇది నా గురువు ఆశ్రమం. దీనికి నేను లాయల్. ఇది కుక్కల పాలు అయితే నేను సహించలేను" అనేవారు.

"ఎందుకీ బెడద అంతా పెట్టుకుంటున్నావ్" అని అడిగేవారు చలంగారు.

"ఎవరయినా చూసుకునే వాళ్ళుంటే సంతోషంగా దీన్ని ఇచ్చే స్తాను" అని నవ్వేవారు చాడ్విక్. చాడ్విక్ చలంగా రింటికి రోజూ వొస్తూ వుండేవారు.

## 9

అప్పట్లో అందరికీ తరచు జలుబులు చేస్తూ వుండేవి. అరుణా చలం వాతావరణంలోనే జలుబులు చేసే గుణం వుంది. షౌకి మామూలుగానే జలుబులు చేసేది. తక్కిన వాళ్ళకి జలుబులు అసలు ఎన్నడూ తెలియవు. అలాంటిది చీటికి మాటికి అందరికీ చేసేవి. ఒక రోజు రాత్రి అందరికీ జలుబులు రావడంతో భజన చేయడం

మానుకొన్నారు. అందరూ కూచుని ఘాటయిన మిరియం పొగ పీలుస్తున్నారు. ఇంతలో ఇంట్లోకి ఇద్దరు వ్యక్తులు ప్రవేశించి ఇంగ్లీషులో "ఇదేనా అరవిందాశ్రమం?" అని అడిగారు.

"అరవిందాశ్రమం ఇక్కడ కాదు, పాండిచ్చేరి" అన్నారు అక్కడున్న వాళ్ళందరూ. వచ్చినవాళ్ళు "అరవింద ఘోష్ ఆశ్రమం కాదు. అరవింద-B ఆశ్రమం" అన్నారు.

"అలాంటి ఆశ్రమం ఇక్కడ ఏదీ లేదే?"- అని అంతా ఆశ్చర్య పోయారు.

అప్పుడు వాళ్ళు "మేము 'ఆనందమయీ మా' శిష్యులం. ఫలాని పేరు గలాయన మా ఆశ్రమానికి వొచ్చి ఇద్దరు సాధువుల్ని పంపించమన్నారు, మా Mother తో. ఆమె మా ఇద్దర్నీ పంపించారు" అని అన్నారు. అప్పుడు అర్ధం అయింది అందరికీ ఆ పిలిచిన వా రెవరో. ఆ పిలిచిన వారా ఇక్కడ లేరు. ఇద్దరూ ఆ అర్ధరాత్రి ఏమైపోయేటట్లు అన్న యోచన వచ్చి ఆ రోజుకి వాళ్ళని తను ఇంట్లో వుండి పొమ్మన్నారు షా వాళ్ళు. వారిద్దరిలో ఒకరు బంగాళీయులు. ఒకరు గుజరాతీయులు. మర్నాడు వాళ్ళు తమను పిలిచినవారి ఎడ్రస్ అడిగి- ఇట్లా తాము వొచ్చామని ఆయనకి వుత్తరం రాసుకున్నారు.

ఆశ్రమానికి, కాంపౌండ్ నౌకర్లకి రాసి రమణాశ్రమంలో భోజనం ఏర్పాటుచేసి చలంగారింటి పక్కింట్లో వాళ్ళకి బస ఏర్పాటు చేశారు ఆ పిలిచినవారు. వాళ్ళని వాళ్ళ రాష్ట్రాలబట్టి బెంగాలీ సాధువు, గుజరాతీ సాధువు అని పిలిచేవారు షా వాళ్ళు. వాళ్ళు రోజూ భజనకి వచ్చేవారు. ఆ బెంగాలీ అతనిది చాలా గొప్ప కంఠం. అతని కోసం ఎక్కడినించో ఒక హార్మోనియం

తెప్పించారు చలంగారు వాళ్ళు. అప్పటినించి భజన్లలో అతను పాడేవాడు.

హిరేన్ (బెంగాలీ సాధువు) రెండో అష్టపదిని పాడేవారు. షౌ రెండో అష్టపది తప్ప మిగిలిన అష్టపదులన్నీ పాడతారు. కొన్ని ఆమెకి కంఠతా వచ్చు, కొన్నిటిని చూసి పాడతారు. హిరేన్, రెండవ అష్టపది నెందుకు పాడవు? అని అడిగేవారు షౌని. షౌ కి రెండవ అష్టపది అంటే అన్ని అష్టపదులకన్నా చాలా ఇష్టం. చిత్రకి ఆ పాటంటే మరీ ఇష్టం. షౌని ఏ పాట పాడమని అడగని చిత్రకూడా ఆపాట పాడమని అడిగి పదే పదే పాడించుకునేది ఆ పాటని. ఆ పాట పాడినప్పుడల్లా ఆస్పత్రిలో అకారణంగా ఎవరో ఒకరు చచ్చిపోవడం జరిగేది. ఛీ వూరికే అనుకుంటున్నాను. అదీ ఇదీ కోయిన్‌సైడ్ అయింది అంతే అనుకుని చాలారోజులు లక్ష్య పెట్టలేదు షౌ. ఒక రోజు ప్రొద్దున షౌ అప్రయత్నంగా తమ గదిలో ఆ పాటనే కూనిరాగం తీస్తున్నారు ఆ రోజు రాత్రే *వొయ్యి చచ్చి పోయింది. "దీని కేదో వుండి వుంటుంది" అని షౌ మళ్ళీ ఆపాట ఎన్నడూ పాడలేదు.

ఈ అష్టపదికి ఒక jinx వుంది. అది ఏమంటే షౌ ఆ పాట నేర్చుకునే టప్పుడు ఇంట్లో ఒక పిల్లి చచ్చి పోతోంది. ఆ సంగతి షౌ వాళ్ళ మాష్టారికి తెలిసి తమాషాకి ఓ కథ అల్లేరు. ఈ పిల్లి జయదేవుడి అష్టపది విన్నది గనుక సరాసరి వైకుంఠానికి వెళ్ళిపోతుంది అన్నారు. అక్కడికి వెళ్ళగానే వైకుంఠ ద్వారాల దగ్గర జయ విజయులు అడ్డు పెట్టి "ఇదేమిటి, పిల్లివి, నీ లోకానికి పో, నీ కిక్కడ వుండటానికి అర్హత లేదు" అంటా రట. ఆ పిల్లి నాకు పూర్తి అర్హత వుంది.

* వొయ్యి షౌ పెత్తల్లి

నేను జయదేవ అష్టపది విన్నాను గనుక నన్ను విష్ణులోకానికి రానివ్వాల్సిందే" నని పోట్లాడు తుంది. ఈ సంగతి విన్న విష్ణుదేవుడు "ఆ పిల్లికి తప్పకండా అర్హత వుంది రానివ్వండి" అన్నారట. మాష్టారా కథ ఓపికగా చెప్పారు. మర్నాడు ఆ పిల్లి చచ్చి పోయింది.

ఇప్పుడు ఆ పాట పాడ మని హిరేన్ అడుగు తున్నారు. షా ఈ జింక్స్ గురించి అంతా వివరించా రతనికి. అప్పుడు హిరేన్ "ఆ అష్టపది నువ్వు పాడితే వినాలని నా కెంతో కోరికగా వుంది. ఇంతకీ ఎవరో ఒకరు చచ్చిపోవడమే కదా జరిగేది? మనిద్దరం దూరంగా వెళ్ళిపోదాం. అక్కడ నువ్వా పాట పాడు. నేనా పాటని విని హాయిగా చచ్చిపోతాను" అనేవాడు.

"సరే నువ్వు చచ్చిపోక ఆ పాట పాడి నేనే చచ్చిపోతే, వీళ్ళంతా గోల పెట్టరా? తీసుకు వెళ్ళి నువ్వే చంపేశావని నిన్ను పట్టుకోరా" అనేవారు షా నవ్వుతూ.

హిరేన్‌ది చాలా దుడుకు స్వభావం. కానీ ఎంతో sense of humour అతనిలో. గ్లాస్కోలాల్చీ, ధోవతితో నిగనిగలాడే గడ్డంతో - అత్తరువులు పూసుకుని తిరిగేవాడు.

రెండో అతను గుజరాతీ. చాలా సౌమ్యశీలి. శాంత స్వభావం కలవాడు. మనిషిలో ఎంతో మంచితనం వుండేది. అతని పేరు భరత్‌ఖామ్.

"ఆనందమయి ఆశ్రమం నించి ఇద్దరు సాధువులు వొచ్చి మా పక్కనే దిగారు. వాళ్ళలో బెంగాలీ అతను రోజూ భలే భజనలు చేస్తున్నాడు. చాలా సరదా ఐన వాళ్ళు భక్తులు. మాది జ్ఞానమార్గం అంటూ బిగుసుకుని కూచోరు."

(శాస్త్రిగారికి చలంగారి లేఖ 17-6-54)

హిరేన్ ప్రవర్తనా అతని చూపులూ షోకి గిట్టేవి కావు. ఈశ్వ రాదేశం వలన అందరినీ స్త్రీ, పురుష విచక్షణ లేకండా తన పిల్లలుగా దగ్గరకి తీసుకునేవారు షో. కానీ తనని స్త్రీ అనే దృష్టితో పురుషులు చూస్తే సహించలేక పోయేవారు. అందుకని ఆమెకి నిరసన భావం వుండేది అతని యెడల, 'ఏమిటీ మనిషి' అని. తన చిన్నప్పుడైతే అలాంటి వాళ్ళనించి తప్పించుకుని ఎక్కడో తిరుగుతూ వుండేవారు. అలాంటి వారినించి తన బలమే కాక దైవబలం కూడా ఆమెని రక్షించింది. కానీ ఆమెకి ఇప్పు డెటూ పోవడానికి వీలు లేదు. భజనకి ఎటు వంటి వారు వచ్చినా భరించ వలసిందే.

తన **visions** లో హిరేన్ జీసస్ కాలంలో ఎవరో ఆ వ్యక్తిగా అతన్ని చూశారు షో. ఆ కాలంలో అతని కళ్ళల్లో ఎంత గొప్ప తేజస్సో! ముఖంలో ఎంత గ్రేసో! జీసస్ అంటే అవధులు లేని ప్రేమ, భక్తి వెలిగి పోతోంది ఆ జన్మ వ్యక్తిలో. ఒక్కొక్కప్పుడు ఈశ్వరుడు ఎవరినయినా వారి పూర్వజన్మల రూపాల్ని చూసినప్పుడు, అలాంటి వుత్తమమైన జన్మ లెత్తినవాళ్ళు ఎందు కిలాంటి హీనమైన వ్యక్తిత్వంతో, అవగుణాలతో వుంటున్నారా ఈ జన్మలో అని ఆశ్చర్యం వేసేది షోకి.

ఒక రోజు ఈశ్వరుడు షోని గట్టిగా కోప్పడ్డారు. ఆ విధంగా ఎన్నడూ కోప్పడలేదు ఆయన ఆమెని. "ఎందుకట్లా నిరసిస్తున్నా వతన్ని?" అని అడిగారు. "అతని చూపుల్ని నేను భరించలేను" అన్నారు షో. ఈశ్వరు డన్నారు "నీకు ప్రేమ నివ్వడమే కాని తీసు కోవడం చేత కాదు. అతని కెంత ప్రేమో. ప్రేమ నిచ్చేవాళ్ళు ప్రేమని తీసుకోలేక పోవడం ఎంత కఠినమో!" అని.

"భక్తితో ప్రేమగా వచ్చిన వారి ప్రేమని తీసుకుంటున్నాను. కాని నన్ను ఒక స్త్రీగా చూసేవారి ప్రేమని ఏ విధంగా తీసుకుంటాను? అట్లాంటి మురికిని ఎట్లా భరించగలను ?" అన్నారు షౌ.

"ప్రేమ నిచ్చేది నేను. తీసుకునేది నేను. నేనే ప్రేమని. అది మురికి అవనీ, స్వచ్ఛ మవనీ నన్నంటదు. నిన్నూ అంటదు" అన్నారు ఈశ్వరుడు.

"కానీ వారి ప్రేమని నా ద్వారా గదా మీరు తీసుకునేది. అది నన్నంటదా ?" అన్నారు షౌ.

"ప్రేమని ఇచ్చేది నేను. తీసుకునేది నేను. నిన్నెందు కంటుతుంది ?" అన్నా రాయన.

"నాద్వారా మీరు ప్రేమని చూపిస్తే వారు నేనే అనుకుంటారు. మీ రనుకోరు కదా" అన్నారు షౌ.

"వారికి తెలియక పోయినా నేను చూసుకుంటా నంతా" అన్నా రాయన.

ఈశ్వరుడు చెప్పిన ఈ మాటని తీసుకోవడం చాలా విపరీతం అయిన సంగతి షౌకి. కించిన్మాత్ర వ్యక్తిత్వం ఇంకా వుంది తనకి. అందుకని భరించలేక పోయారు.

"నీ అభిమానాన్ని అడ్డం రానీకు. అభిమానం చస్తే తప్ప ఈ మార్గంలో ఎవరూ నిలవ లేరు" అన్నారు ఈశ్వరుడు.

ఇంక ఆ రోజు భజనలో షౌలో నించి ఆ నిరసన అదంతటదే తొలగి పోయింది. హిరేన్‌లో ఆ చూపులు మాయ మయ్యాయి. ఆ రోజు నించి అతను గొప్పతేజంతో వెలగడం మొదలు పెట్టాడు. తాను స్త్రీని అనే అభిమానం ఆ రోజే నశించి పోయింది ఆమెలో. స్త్రీ అనే భావమే కాదు, తా నేదో పవిత్రురాలు తక్కిన వారు అపవిత్రులు

అన్నభావం కూడా షౌలో పూర్తిగా నశించింది. చిన్నప్పటి నించి షౌకి ఆడా, మొగా భేదం కాన్షస్‌గా వుండేది కాదు. తన రక్షణ కోసం మొగవారి నించి దూరంగా వుండేవా రామె. పెద్ద మీసాలతో, గెడ్డాలతో వచ్చిన వారిని ఎవరినైనా తన బిడ్డగా తీసుకుని తల నిమిరేవారు షౌ. కాని హిరేన్ తనవేపు చూసినట్లు ఎవరయినా తనవేపు చూస్తే వారికి తను దగ్గర అవలేక పోయేవారు. అలాగే ఇతరుల్లో ఏది వున్నా దానిని ఒక తప్పుగా భావించక దగ్గరగా తీసుకునే శక్తి కలిగింది షౌకి ఇప్పుడు. పరిపూర్ణత లభించిన వారు సర్వాన్నీ 'హోమగుండం' లో అర్పించు కోవలసిందే. ఆ పరిపూర్ణతకి స్త్రీత్వం అనేది నీడగా వున్నా అది అభ్యంతరమే. అందువల్లనే తీవ్రపరీక్షలతో షౌని పరిపూర్ణతలో నిలిపారు ఈశ్వరుడు.

శాస్త్రిగారి ద్వారా తెలుసుకుని కొన్నాళ్ళు ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపిం తరువాత 1955 భగవాన్ జయంతికి యామిజాల పద్మనాభ స్వామి గారు వచ్చారు. ఆ రోజుల్లోనే మురళి అనేవాయ వచ్చారు.

రాగానే శాస్త్రిగారు వాళ్ళంతా షౌకి సాష్టాంగపడితే పద్మనాభ స్వామిగారు కూడా సాష్టాంగ పడ్డారు. అప్పుడు చెప్పా రాయన "నేనెవరికీ ఇంతవరకూ చెయ్యెత్తి నమస్కరించ లేదు. ఒక జమీందారు గారి దర్శనం కోసం ఎవరో నన్ను తీసుకు పోతానంటే నేను ఆయనకి నమస్కరించవలసి వస్తుందని ఆయన ఛాయలకు పోలేదు. అలాంటిది అప్రయత్నంగా మీకు నమస్కరించాను" అన్నారు.

మురళికి రేడియో స్టేషన్‌లోనే వుద్యోగం. ఆయన తమిళులు. ఆయనని చూడగానే ఈశ్వరుడు "ఉద్యోగరీత్యా నువ్వు గొప్ప **position** లో వుండ బోతున్నావు" అన్నారు. అలాగే ప్రస్తుతం ఆయన గొప్ప పదవిలో వున్నారు.

అప్పట్లో ఈశ్వరుడి చుట్టూ సరస్వతీదేవి నర్తించేది. సాహిత్య చర్చలు, కవితా గానాలు -- చలంగారి రిల్లే సాహితీ స్రవంతిగా మారి పోయింది.

పద్మనాభ స్వామిగారి రాకతో ఈశ్వరునితో జిజ్ఞాసువులు సాగించే చర్చలలో పూజ్యులు కీ. శే. కావ్యకంఠ గణపతి శాస్త్రులు గారి సాహిత్య సృజన, ఆధ్యాత్మిక జీవనం, మంత్ర శాస్త్ర పాండిత్యం చోటు చేసుకున్నాయి. గణపతి అవతారుడైన వాసిష్ఠగణపతి ముని కావ్యకంఠ బిరుదాంకితులు, మహాచార్యులు, తపశ్శాలురు, నైష్ఠికులు.

అరుణాచలంలో తమ జ్ఞానగురువైన రమణుల చరణాల చెంతకు చేరుకునే నాటికి నాయన శతలక్ష సంఖ్యాకమైన జపంలో పంచాక్షరి పునశ్చర్య చేశారట. శ్రీవిద్యాదికాలైన మహా మంత్రాలు జపించారట. ఇక పద్మనాభస్వామి, శాస్త్రిగార్ల ప్రశ్నలు నాయన చేసిన మంత్రోపాసనల వైపు మళ్ళాయి. అంతే కాదు. ఆ రోజుల్లో మంత్ర శాస్త్ర చర్చలు, యోగ చర్చలు, సాహిత్య చర్చలు పెరిగి పోయాయి. ఇక ఈశ్వరుడి చుట్టూ సంస్కృతీ భరితమైన వాతావరణం ప్రబలి పోయింది.

అప్పట్లో చలంగారు వాళ్ళకి వారం వారం స్కంధాశ్రమం వెళ్ళడం అలవాటు. అట్లాగే ఆ రోజు మురళీ, చలంగారు, శాస్త్రిగారు, షౌ స్కంధాశ్రమానికి వెళ్ళారు. షౌ అక్కడ మామిడి చెట్టుక్రింద కూచుని సమాధి స్థితిలోకి వెళ్ళిపోయారు. హఠాత్తుగా మురళి వచ్చి ఆమె పాదాల దగ్గర పడిపోయి "నేను పాపిని, నన్ను రక్షించండి" అని బిగ్గరగా అరిచేశారు. తరువాత, ఇక్కడినించి తిరిగి తమ ఇంటికి పోనని, అరుణాచలంలోనే మీ అందరితోనే వుంటాను అని పట్టు పట్టారు. అప్పటికే ఆయనకి పెళ్ళయింది. ఇద్దరు పిల్లలు. "వొద్దు, మీ

రుండకండి. మీకు గొప్ప promotions రాబోతున్నాయి" అని చెప్పారు ఈశ్వరుడు, ఆయన వెళ్ళి పోయారు. కాని తనభార్యతో కుటుంబంతో అప్పు డప్పుడు ఒంటరిగాను తరచు వొస్తుండే వారు. అప్పటికి ఆయనకి ఏ ప్రమోషను లేదు. చలంగారికి మాత్రం ఉత్త రాలు రాస్తువుండే వారు. ఒకసారి ఆయన వుత్తరం రాశారు, తిరుపతి వెంకటేశ్వర్లు నా కలలో కనబడి- "ఆ సౌరిస్ ఈశ్వరుడు కాదు- భగవాన్ వంటి గొప్ప జ్ఞాని. ఆమెని నమ్ముకుంటే సన్యాసమే కానీ నువ్వు పైకి రావు" అని చెప్పినట్లు. అదే కల ఆయన భార్యకి కూడా వచ్చిందట. షౌ అన్నారు "నేను ఈశ్వరుడి నని నే నెప్పుడూ చెప్పలేద"ని. నేను ఈశ్వరుడ్ని అని ఈశ్వరు డన్నారు. తను ఈశ్వరుడని షౌ చెప్పలేదు. "నేను చెప్పాను కదా గొప్ప ప్రమోషన్సు వస్తాయని. అట్లాగే నన్ను వొదులుకో మను" అన్నారు ఈశ్వరుడు. కానీ ఆయన ఇక్కడికి వస్తూనే వుండేవారు. వీలు పడినప్పుడల్లా తిరుపతికి వెళ్ళే వారు.

మురళి, శాస్త్రిగారు పసిపిల్లల్లా గంతులు వేసేవారు. శ్లోకాలు వేసుకునే వారు. పాటలు పాడే వాడు. పాడు కుంటూ వుయ్యాల లూగే వారు.

చిన్నపిల్ల డాలీని భుజాన వేసుకుని శాస్త్రిగారు ఒకటే గంతులు వేసేవారు. ఆయనకి డాలీ అంటే ఎంతో ముద్దు. డాలీ మహాత్మా! అని పిలిచే వారు.

అలాగే చాడ్విక్‌కి కూడా డాలీ అంటే ఎంతో ముద్దు. ఆ అమ్మాయిని ఆయన 'డాలియా' అని పిలిచేవారు. చాడ్విక్‌ని 'big boy' అని పిలిచేది డాలీ. అసలు గేటు దగ్గరనించే డాలీమీద పాటలు పాడుకుంటూ వొచ్చేవారు చాడ్విక్.

చలంగారు వాళ్ళింట్లో 1952లో ఓం ప్రథమంగా భగవాన్ జయంతి జరిగింది. జయంతికి ఆశ్రమంలో పూజలు జరిపే వారు. సాయంత్రం ఇంకేం కార్యక్రమాలూ వుండేవి కావు ఆశ్రమంలో. భజనలకి రోజూ అందర్నీ పిలిచేవారు గనుక చలంగారు వాళ్లూ "ఇవాళ భగవాన్ జయంతి. మా ఇంటికి భజనకి రండి" అని ఆశ్రమానికి వచ్చిన వారిని పిలిచే వారు. 1952 జయంతికి కూచిభొట్ల సూర్యనారాయణగారు కూడా ఇక్కడే వున్నారు. ఇంకా నలుగు రైదుగు రున్నారు. చలంగారు, షౌ, సూర్యనారాయణగార్ల పాటలతో జయంతి జరిగి పోయింది.

ఈ జయంతులు ఎట్లా ఆరంభమైనాయంటే శాస్త్రి (జరుక్) గారి బృందం 'జయంతి ఎప్పుడు ?' అని చలం గారికి ఉత్తరాలు రాసే వారు. ఈశ్వరావతరణోత్సవాల కంటే భగవాన్ జయంతులే ముందుగా ఆరంభ మయ్యాయి చలంగా రింట్లో. చలంగారు ఆశ్రమంలో కనుక్కొని జయంతి ఫలానా తేదీన అని రాయంగానే చాలామంది జయంతి కని వొచ్చి చలంగా రింట్లోనే దిగేవారు. ఇక్కడ ప్రత్యేకంగా **celebration** ఏమీ లేదు. ఆ సాయంత్రం భజన చేయడం, మంచి ప్రసాదం తయారు చేయించి పంచడం వినా. జయంతి కని వచ్చిన వాళ్ళు ఇంట్లో వాళ్ళతో బాటు ఆశ్రమంలో భోజనానికి వెళ్ళే వారు. చలంగారికి, షౌకి చప్పిడి భోజనం కనుక, ఏ వుప్మాయో చేసేసి వెళ్ళేది నర్తకి. శాస్త్రిగారు మరి కొందరూ అక్కడ భోజనానికి వెళ్ళ కుండా చలంగారు వాళ్ళతో బాటు ఆ వుప్మాషే పంచుకు తినేవారు.

కొన్నాళ్ళయిన తరువాత- "ఇదేమిటి మీ ఇంటికి జయంతి కని వస్తే మమ్మల్ని ఆశ్రమానికి పొమ్మంటారా ?' అనే ప్రశ్న బయలు దేరింది వచ్చే వాళ్ళలో. అందుకనే జయంతి **celebrate** చేయవలసి

వచ్చింది చలంగారు వాళ్ళకి. దాంతో ప్రత్యేకంగా ఒక ఉత్సవంగా ఆహ్వానాలు పంపి, వంటలు చేయించి అలంకరణలు, లైట్లు పెట్టటం మొదలయినవి జరపడం మొదలయింది చలంగారింట్లో.

ఆ దీపాలంకరణ చేసేవారు పురుషోత్తం. పురుషోత్తం మాట కారి కాదు. అతని మనసులో ఏముందో తెలియదు. పోనీ మనిషైనా కనిపించడు. ప్రతి వుత్సవానికి రమణస్థాన్‌కి లైట్లు వుచితంగా సప్లై చేస్తాడు. తొలిసారిగా చలంగారు ఈశ్వరావతరణోత్సవాలు ప్రారంభించినప్పటి నించి ఇప్పటిదాకా లైట్లు సప్లై చేస్తూనే వున్నాడు. ఎప్పుడో ఓసారి కనిపించినా మాట్లాడడు. తలెత్తి చూడడు. తల వొంచుకుని త్వర త్వరగా వెళ్ళి పోతాడు, ఈ పట్టణంలోని అరుణాచలేశ్వరాలయంలోని లైటింగ్ అంతా ఆయన చేతుల మీదుగానే జరుగు తుంది. పెద్దగుడిలోనూ, పట్టణం లోనూ ఆయన చేసిన లైటింగ్ ఎరేంజిమెంటు చూస్తే తెలుస్తుంది, ఆయన ఎటువంటి ఆర్టిష్టో!

మొదట్లో జయంతికి ఆశ్రమంలో అందర్నీ పిలిచేవారు చలంగారు వాళ్ళు. ఆశ్రమాధికారి కుటుంబంనించి కూడా వాళ్ళపిల్లలూ వాళ్ళు వచ్చేవారు. కానీ వాళ్ళ విరోధులు కూడా ఇక్కడి జయంతిలో పాల్గోవడం వలన వాళ్ళు మెల్లిగా రావడం మానుకున్నారు.

ఇంతలో శివరాత్రి వచ్చింది. శాస్త్రిగారి బృందం శివరాత్రికి తరలి వచ్చారు. మా తల్యార్‌ఖాన్ ఈ శివరాత్రికి ఒక భజనతో గిరి ప్రదక్షిణం ఏర్పాటు చేసింది. వూరిలోంచి జగదీష్ శాస్త్రి భజనపార్టీని ఆహ్వానించింది. చలంగారు వాళ్ళందర్నీ అహ్వానించిం దామె. రమారమి 30, 40 మంది సౌరిస్‌తోపాటు భజన చేసుకుంటూ బయలు దేరారు. శివరాత్రి కిలా గిరిప్రదక్షిణం వెడుతున్నారని తెలిసి, తిరిగి వచ్చేటప్పుడు తమ ఇంటికి రమ్మని షా వాళ్ళని పిలిచారు రామస్వామి

అయ్యర్. ఎందుకయినా మంచిదని చిన్నపిల్లలు నడవలేకపోతే ఎక్కించుకునేందు కని బసవరాజుగారు సైకిల్ తెచ్చుకున్నారు. మధ్య దారిలో శాస్త్రిగారికి వల్లమాలిన పంటిపోటు వచ్చింది. బసవరాజుగారి సైకిల్ మీద శాస్త్రిగార్ని ఎక్కించి రామస్వామి అయ్యర్ ఇంటికి పంపించేశారు షా. అందరూ గిరి చుట్టేసరికి మా తల్యార్‌ఖాన్‌కి కాళ్ళు నెప్పులు వచ్చి మధ్యదారిలో జట్కా ఎక్కి తమ ఇంటికి వెళ్ళిపోయారు. ఇక మిగిలిన వారంతా రామస్వామి అయ్యర్ ఇంటికి వెళ్ళారు ప్రదక్షిణం చేసి. షా వాళ్ళు గిరి ప్రదక్షిణం వెడతారంటే వాళ్లూ వారింటికి వచ్చిన అతిథులూ మాత్రం అని అనుకున్నారు రామస్వామి అయ్యర్. వారి కోసం పొంగల్, మురుకులు ఇట్లాంటి ఫలహారాలు సిద్ధంచేసి పెట్టు కున్నారు. షా వాళ్ళతో కలిసి వొచ్చిన ముప్పయి మందిని చూసి నివ్వెర పోయారు. ఆ ఫలహారాలు అందరికీ పంచి పెట్టంది షా వాళ్ళేం తినరని గ్రహించి నట్లున్నారు రామస్వామి అయ్యర్. చేసినవన్నీ అందరికీ పంచిపెట్టా రాయన. ప్రతి గిరిప్రదక్షిణానికి తమ ఇంటికి రమ్మని పిలిచేవారు రామస్వామి అయ్యర్. కానీ ఇంతమందితో వెళ్ళడం షాకి న్యాయంగా కనిపించేది కాదు. తమఇంటికి వాళ్ళు వెళ్ళకండా వొచ్చేసి నప్పుడు ఆయన "మా ఇంటికి రాలేదు మీరు" అని గోలచేసి తాము తయారు చేసిన ఫలహారాలన్నీ తినమని వాళ్ళింటి నించి తెచ్చి షా వాళ్ళని బలవంతం చేసేవారు. ఆయన ప్రేమ అలాంటిది.

జానకీ వాళ్ళు ఇంగ్లాండు వెడుతూ వాళ్ళ పిల్లల్ని చలంగారు వాళ్ళకిఅప్ప జెప్పారు. దాదాపు 25 ఏళ్ళపైని వయస్సు వాళ్ళనించి 5ఏళ్ళ వయస్సు వాళ్ళ దాకా పంతులుకి పిల్ల లుండేవారు. వాళ్ళకి చలంగారు వాళ్ళస్వాధీనంలో వున్న అనాసక్తి (డిటాచ్‌మెంట్) అనే బిల్డింగు

ఇచ్చారు. ఇంతలోకి చలంగారి చిన్నచెల్లెలు పాప తన పిల్లలతో ఒక వంటామెతో సహా వచ్చింది. జానకి పిల్లలు, పాప పిల్లలు, అతిథులు అందరూ కలిసి చలంగారింట్లో ఒక పెద్ద సమూహం అయ్యారు.

అప్పటికే అమ్మ ఆంధ్రదేశ పర్యటన చేసి మౌనంతో తిరిగి వచ్చింది. అసలు ఎవరితోను మాట్లాడేది కాదు. కేవలం పాలతో 20 రోజులు వుపవాసం చేసింది అమ్మ.

ఇల్లంతా పెద్దసందడి. ఇంటి ముందు అంతకి ముందే పెద్ద పాక వేశారు. ఇల్లు చిన్నదయినా ఆ పాకలో చాలామంది జనం పట్టే వారు. ఇంక భజనల్లో రంగపాటలు ,పాప కూతుళ్ళ డ్యాన్సులు, పాటలు, ఇంటి వాతావరణమంతా ఎన్నడూలేని హడావిడితో నిండి పోయింది. ఇంతలో (తురగా) జానకీరాణి వచ్చారు. ఆవిడ షౌ వాళ్ళ మేనత్తకి మనుమరాలు. ఆ అమ్మాయి కూడా డ్యాన్సు చేసేది. పాటలు పాడేది.

ఈ లోగా పంతులి చెల్లెలు, పిల్లలు అరుణాచలం వచ్చారు. బెజవాడలో వుండే రోజుల్లో షౌ చిన్నతనంలో ఆమె ఒకసారి వచ్చారు. అప్పుడు షౌ ఆమెనించి కళ్ళు తిప్పుకోలేక పోయేవారు. ఆమె అంత అందంగా వుండేది. ఇప్పుడు షౌలో ఈశ్వరాకర్షణ నించి ఆమె కళ్ళు తిప్పుకోలేక పోతోంది. ఆవిడ ఈశ్వరుడ్ని ఎంతో ఇష్టపడింది. ఆవిడ వాళ్ళ వూరు వెళ్ళాక ఆమెకి కలలో షౌ, ఈశ్వరుడు, పక్క పక్కన నుంచుని కనపడ్డారు. దాంతో ఆమెకి ఈశ్వరుడి మీద దృఢ విశ్వాసం ఏర్పడింది.

ఎండాకాలం గడిచి పోయింది. జానకీ వాళ్ళు ఇంగ్లాండు నించి తిరిగి వచ్చారు. వాళ్ళంతా పకపకతో సహా బెంగుళూరు వెళ్ళి పోయారు. నిర్మల చలంగారు వాళ్ళతో ఇక్కడే వుండి పోయింది.

ఆగష్టు 15వ తేదీ ఈశ్వరావతరణకి జానకీ వాళ్ళు పకపకతో సహా వచ్చారు. మళ్ళీ ఒక పెద్దబృందం తయారైంది. పంతులుకి

ఈశ్వరుడంటే తిరుగులేని భక్తి. పంతులుకి అలాంటి భక్తి కుదరటం ఒక ప్రత్యేకత. చిన్నప్పుడంతా తన ఒళ్ళో కూచో బెట్టుకుని ముద్దు చేసిన షౌని ఈశ్వరుడని తలవంచి మోకరించేవాడు పంతులు. అంతే కాదు షౌ ముందు నమ్రతతో నీరయి పోయేవాడు. పకపకని ఇక్కడే వదిలిపెట్టి వెళ్ళిపోయారు పంతులూ వాళ్ళు.

కొద్దిరోజులు గడిచాక నిర్మల "నేను మా ఇంటికి వెళ్తున్నాను. నాకు ఒళ్ళు నయమై పోయింది కదా: నే నిక వెడతాను" అంది. "నీ ఆరోగ్యం కొంతవరకే నయం అయింది. నీ ఒంటి పరిస్థితి ఇక్కడ వుండటంవలన నీకు తెలియటం లేదు. ఇంకా నీ వొంట్లో జబ్బు వుంది" అని ఈశ్వరు డన్నారు. "అయినా వెడతాను" అంది నిర్మల. బెంగుళూరు వెళ్ళిన వెంటనే నిర్మల ప్రాణంమీదకి వచ్చేటంత పెద్ద జబ్బు పడింది. పంతులు ఆదుర్దాగా వుత్తరం రాశాడు షౌకి. షౌ విభూతి పంపించారు. నిర్మలకి జబ్బు నయమై పోయింది. ఆ తరువాత వాళ్ళ రాకపోకలు తగ్గిపోయాయి. రంగ మాత్రం లక్నోనించి బెంగుళూరు వచ్చినపుడల్లా తిరువన్నామలై వచ్చి చలంగారు వాళ్ళ దగ్గర కొంతకాలం గడిపేవాడు.

ఈ లోపుగా బసవరాజుగారి భార్య వచ్చారు.

"నిన్నరాత్రి 11గంటలకి బసవరాజుగారి భార్య, కొడుకు దిగారు. ఘరానా కుటుంబీకుడి కింద తిరుగుతున్నారు. ఆ పెళ్ళాం బసవరాజుగారిని ఏం చేస్తుందో నని చాడ్విక్ గోల పడుతున్నారు"

(శాస్త్రిగారికి చలంగారి లేఖ 17-6-54)

(బసవరాజుగారు చాడ్విక్ వేదపాఠశాల విద్యార్థులకి ఇంగ్లీషు నేర్పించే వారు)

లోగడ బసవరాజుగారి అక్క, బావ వచ్చి, ఆయన్ని రమ్మని బతిమాలారు. కాని బసవరాజుగారు వెళ్ళలేదు. ప్రస్తుతం ఆయన భార్య, కొడుకు వచ్చారు. వాళ్ళిద్దరూ ఆయనతో వుంటున్నారు.

"పాపం బసవరాజుగారికి ఎంతటి అవస్త వొచ్చింది. భార్యతో నివసించవలసిన దుర్గతి కలిగిందా ? ఎవరూ ఆ భార్యని వారి వూరికి తరిమేవారు లేరా ? అని మధనపడుతున్నారు చాడ్విక్."

(శాస్త్రిగారికి చలంగారి లేఖ 23-6-54)

ఆవిడ తనతో రమ్మని తనని బలవంతం చేస్తున్నట్లు బసవరాజుగారు చెప్పారు. "మీకు వెళ్ళాలని వుందా ?" అని అడిగారు ఈశ్వరుడు. "నా కేమాత్రం లేదు" అన్నారు బసవరాజుగారు. "సరే మీతో ఆవిడకి వుండాలని వుంటే కొడుకుని పెట్టుకునివుండమన్నారు" ఈశ్వరుడు. ఆవిడ బసవరాజుగారితో వుంటోంది, కానీ ఆమె ప్రయత్నం ఆయనని తన వెంట తీసుకుని వెళ్ళాలని.

"బసవరాజుగారిని చిత్ర విచిత్రాలుగా ఆడిస్తున్నారు ఈశ్వరుడు. బసవరాజుగారి దారా, పుత్రాదులు ఆయన భుజాల మీదనే అధిష్ఠించి వున్నారు."

(శాస్త్రిగారికి చలంగారి లేఖ 10-10-54)

బసవరాజుగారు తనకు శాంతి లేదని గోల పెడుతున్నారు. ఒక రోజు భార్యని పంపించేయ మని ఈశ్వరుడ్ని అడిగారు. పగలంతా చలంగారు వాళ్ళింటో వుండే వారు బసవరాజుగారు పనులు చేసుకుంటూ. భోజనానికి, పడకకి ఇంటికి వెళ్ళేవారు. భోజనం దగ్గర ఆమె తనని సాధిస్తున్నారని ఈశ్వరుడితో **complain** చేశారు బసవరాజుగారు.

"సరే భోజనానికి వెళ్ళకండి. బిచ్చం ఎత్తుకోండి" అన్నారు ఈశ్వరుడు. అయన ఈ ప్రాంతాలలో వున్న కొందరి ఇళ్ళకు వెళ్ళి

భిక్షం ఎత్తుకునేవారు. వాళ్ళు "ఇదేం కర్మ నీకు! లక్షణం అయిన భార్య, పిల్లి పెట్టుకు ఈ గతికి ఎందుకు వచ్చావ్?" అని ఆయనని నానా తిట్లు తిట్టేవారు. చలంగారింటిముందు బిచ్చగాళ్ళకి రాగికూళ్ళు పోస్తాం చిప్ప పట్టుకుని కూర్చునేవారాయన. ఆయన కొడుకు కూడా వచ్చి ఆయన పక్కనే కూచున్నాడు. ఇదంతా చూసి ఆయన భార్య ఆశ వొదులుకుంది. చివరికి కుఱ్ఱవాడ్ని తీసుకు వెళ్ళిపోవడానికి నిశ్చయం చేసుకుంది. అప్పట్లోనే బసవరాజుగారు ఎటో వెళ్ళిపోయారు ఎవరికీ చెప్పకండా.

"ఇప్పుడు ఈశ్వరుడు రెండో బసవరాజీయం తయారు చేస్తున్నారు.

పదిరోజుల కిందట ఎవరితోనూ చెప్పకండా బసవరాజుగారు పాండిచేరి పారి పోయినారు.

అక్కడి నించి దిగి ఈ వూళ్ళో అక్కడక్కడ మెరిశారు ఎవళ్ళకో!

ఓ రోజు పొద్దున్న సమాధి దగ్గరకి వొచ్చి, ఒక్కొక్క ప్రదక్షిణానికి ఒక్కొక్క బట్ట తీసేసి నా మీద పడేసి గోచీతో కూచున్నారు.

మర్నాడు ఏ మెరగనట్టు భార్యా, పుత్ర సమేతంగా రమణ భక్తులకి దర్శన మిచ్చారు.

ఇవాళ పొద్దున్న భార్యని దిగబెట్టడానికి గూడూరు వెళ్ళారు."

(శాస్త్రిగారికి చలంగారి లేఖ 10-11-54)

అప్పట్లో ఈశ్వరావతరణకి, జయంతికి పండుగలు చేసేవారు ఇంట్లో. ఈశ్వరుడు వొచ్చిన కొత్తలో సంవత్సరాది చేయాలను కున్నారు ఇంట్లో వాళ్ళు. ఇంట్లో తెలుగు కేలండర్లు లేవు గనుక అరవ వాళ్ళకి ఎప్పుడు సంవత్సరాది వొస్తే అప్పుడే చేసుకోమన్నారు ఈశ్వ

రుడు. కానీ ఇంట్లో వాళ్ళు ఎలాగో తంటాలుపడి కనుక్కొని తెలుగు సంవత్సరాదే చేయాలని నిశ్చయించు కున్నారు. ఆ రోజున ఇంట్లో బూజులు దులుపుతున్న నౌకరు ఆర్ముగం రేడియోతో సహా కింద పడ్డాడు. దెబ్బలు తగిలాయి. ఇలాంటివే కొన్ని యాక్సిడెంట్లు జరిగాయి. అందువల్ల వాళ్ళు ఆ రోజున పండుగ చేయడం మానుకోవాల్సి వచ్చింది. అందుకనే ఏప్రిల్ 13 వ తేదీన చేసేవారు. ఆ రోజు షౌ పుట్టిన రోజు. చివరికి తమిళ సంవత్సరాదే వాళ్ళకి సంవత్సరాదిగా నిలిచిపోయింది. తమిళ దీపావళి పండుగ చేద్దాం అంటే సారంగపాణి వాళ్ళు "మా కారోజు పండుగ. మే మారోజు రావడానికి వీలుండదు గనుక మీరు తెలుగుదే చేయండి" అన్నారు. దాంతో తెలుగు దీపావళే చేసుకుంటున్నారు ఇంట్లో వాళ్ళు. ఇంట్లో వాళ్ళు ఏ పండుగలన్నా చేసుకుంటామంటే అభ్యంతరం చెప్పేవారు కాదు ఈశ్వరుడు.

షౌ చిన్నతనంలో పండుగ అంటే ముఖ్యం దీపావళి, సంవత్సరాది ఎంత చీదర పుట్టించేవో! "మాకు వొద్దు మొర్రో" అని పిల్లలు గోలపెట్టినా సరే తలంట్లు పోసేది అమ్మ, అక్కడ్నించి పిల్లల ఏడుపులూ, వేళ్టికి భోజనం సిద్ధం కాకపోవడం- అక్కడితో చలంగారి అరుపులూ, పిల్లలు ఆకలివేసి గోల చేయటం .... ఇంక అమ్మకి నెర్వస్‌నెస్ వొచ్చేది. అమ్మ ఎన్ని రకాల పిండివంటలో చేసేది కాని పొద్దుటి నించి పడిన హైరాణతో ఏ సంతోషం, ఏ సరదా వుండేవి కావు. షౌ వాళ్ళంతా పెద్దయినాక తమకి ఇష్టం అయితే ఏ విఘ్నేశ్వర చవితో. కృష్ణాష్టమో హాయిగా చేసుకునే వారు. ఈశ్వరుడు వొచ్చాక పండుగ రోజున ఏదో ఒక పిండివంట రుచిగా, శుచిగా చేసుకోవడం ఇష్టం వుంటేనే తలంట్లు పోసుకోవడం ఇంక ఎంత హాయి అయిపోయిందో, ఎంత అందంగా తయారయ్యాయో పండుగలు.

చిత్రకి, చలంగారికి టపాకాయ లంటే ఎంతో సరదా. ఈ దీపావళికి ఈశ్వరుడి నడిగి టపాకాయలు కొనుక్కున్నారు. ఇక సారంగపాణి, రామస్వామి అయ్యర్ అందరూ డాలీకి టపాకాయలు తెచ్చి ఇచ్చారు. రామస్వామి అయ్యర్‌ని, చాడ్విక్‌ని ఆహ్వానించారు. దీపావళికి సారంగపాణి, గంగాధరం, చిత్ర, చాడ్విక్, పకపక, డాలీ, నర్తకి, హిరేన్, భరత్‌భాయ్, బసవరాజుగారు, చలంగారు అందరూ కలిసి గుంపుగా టపాకాయలు కాల్చారు. కానీ సరయిన మేనేజ్‌మెంట్ లేక చేతులు కాల్చుకున్న వాళ్ళు, చీరలు కాల్చుకున్న వాళ్ళు లుంగీలు చొక్కాలు కాల్చుకున్న వాళ్ళు అయినా రండరూ. హిరేన్ ఒక కాకరపువ్వొత్తి కాల్చి చాడ్విక్ ముఖంమీద పెట్టాడు. దాంతో చాడ్విక్ కోపగించి, చలంగా రింటికి రావడం మానుకున్నారు. హిరేన్ ఎంతటి దుడుకు పనులు చేసినా షా వద్దంటే మానేస్తాడు. చాడ్విక్ ఎంత అలిగినా షా ఆయనని చూడటానికి వెడితే సరి వచ్చేస్తారు. షా ఆయన వైపు చూస్తే చాలు ఆయన కోపం చల్లారి పోయేది. అప్పటి నించి చాడ్విక్ ఎవరు కనిపించినా, తెలుగువాళ్ళేలా దీపావళి చేసుకుంటారో తెలుసా? అంటూ ఇళ్ళూ వళ్ళూ కాల్చుకుని చేస్తేకాని వాళ్ళకి పండు గనిపించదు అని చెప్పేవారు. ఇంతకీ ఆయనకి కోపం తెప్పించింది తెలుగువాడు కాదు, బెంగాలి. తరువాత ఆయన కోపం చల్లారి వస్తూనే వున్నారు.

అప్పట్లో చినస్వామి వుండే రోజుల్లో గుళ్ళో సేవలు చేసేది అమ్మ. ఒక రోజు అమ్మ నుదుటిమీద పెద్ద గాయంతో, చేతి ఫ్రాక్చర్‌తో, గూడలోంచివిడివడి పోయి వేలాడు తున్న బొటన వేలుతో ఇంటికి వచ్చింది. అమ్మ చెప్పడం, తను ఆశ్రమంలో కూచుని వుండగా కళ్ళ కంతా చీకట్లు కమ్మేశా యనీ, మళ్ళీ తెలివి

వొచ్చేసరికి తను పడిపోయి వున్నాననీ, లేచి చూచేసరికి ఈ గాయా లున్నాయనీ. అది ఎలా జరిగిందో! అస లేం జరిగిందో ఎవరికి తెలియలేదు. అది పట్టపగలు. అమ్మని ఎవరు పడేస్తారు? అమ్మ అంటే ఆశ్రమంలో అందరికీ ప్రాణం. ఆమెకి ఎవరితోనూ విరోధం కంచు కాగడా పెట్టి వెదికినా కనిపించదు.

అమ్మ కట్టు కట్టించుకునేందుకు గవర్నమెంట్ ఆసుపత్రికి వెళ్ళింది. ఆవిడ చక్కగా నవ్వుతూ 'అరుణాచలా' అంటూ కట్టు కట్టించు కుంది. ఈ వయస్సులో ఆ ఫ్రాక్చర్ నయం కావడం కష్ట మని చెప్పారు డాక్టర్. ఆ బొటనవేలిని గూడలో సర్ది కట్టు కట్టేరు. చెయ్యి ఫ్రాక్చర్‌కి కూడా కట్టు కట్టేరు. ఈ దెబ్బలకి ఈమెకి నొప్పి తెలియటల్లేదేమిటి? అని ఆ డా ం ఆశ్చర్యపోయారు. ఆ ఫ్రాక్చర్ అతికినా గానీ ఆ చేతికి బలం త . పోయింది.

## 10

హిరేన్, భరత్‌భాయి మద్రాసుకి బయలు దేరారు. ఈశ్వరుడు వారి యెడల చూపే ప్రేమా, ఆదరం చూసి శాస్త్రిగారు, పద్మనాభ స్వామిగారు, మురళి వారిని జాగ్రత్తగా తమతోనే తీసుకు వెళ్ళారు. మురళి వారిని తమ ఇంట్లోనే పెట్టుకున్నారు. అక్కడ హిరేన్ చాలా అసహ్యంగా ప్రవర్తించాడట. ఆ సంగతి మురళి చలంగారికి రాశారు. ఇంక షాకి కూడ కొంత కోపం వొచ్చింది. ఇంటెల్లపాదికి అతనంటే అసహ్యం కలిగింది.

హిరేన్, భరత్‌భాయి తొలిగా తిరువన్నామలై వచ్చినప్పటి నించి వారి గురువైన ఆనందమయి షాకి ఎప్పుడూ కనబడుతూనే వుండేది. ఇక హిరేన్ రాగానే చివాట్లు పెడదాం అనుకున్నారు షా.

"హిరేన్‌స్వామి చేసినపని చాలా ఆశ్చర్యం కలిగించ లేదు; ఎందు కంటే మమ్మల్ని సిద్ధంచేసి వుంచాడు ఇక్కడి చర్యల వల్ల. కాకపోతే "ఛా, ఏదో పొరబాటు" అని గట్టిగా అనేవాళ్ళం. కాని ఇది మరీ ఘోరం- నా ఉద్దేశ్యంలో. పైగా బూకరింపు- పోసింది- ఈశ్వరుడు విన్నారు- ఆయన కల్లా ఈ విషయంలో పట్టింది మురళి. మురళి క్షమని చాలా అభినందించానని చెప్పారు. నిన్న రెండు మూడుసార్లు "మురళికి ఇట్లా రాయి, అట్లా రాయి" అని చెబుతూనే వున్నారు. "క్షమ చాలా గొప్ప సంగతి. ఇంకా గొప్పగా అలవరుచుకో" అన్నారు మురళిని. "చాలా శోచనీయమైన పని జరిగింది. కాని నేను మురళిని వాళ్ళని తన ఇంటో పెట్టుకోమని చెప్పలేదు. పెట్టుకోవడమూ, అతని పనిని మౌనంగా సహించడమూ ఎక్కువగా మెచ్చుకో తగినవి" అన్నారు.

హిరేణ్బుడు ఈ విధంగా జరిపించాడు అని వుత్తరం ద్వారా తెలుసుకున్న తర్వాత ఈశ్వరుడికి అతనిపైన ప్రేమా, బాధ్యతా ఎక్కువైనాయి- "ఇటువంటి మనిషిని నేను కాకపోతే ఇంకెవరు అతన్ని దగ్గర చేరనిస్తారు? గతీ దిక్కూ ఎక్కడ నేనుగాక!" అన్నారు. మా మనసులు మాత్రం ఎంత తిరగబడు తున్నాయో! నాకా? నాకు మురళి వీళ్ళని ఇంటో దింపు కుంటారని తెలిస్తే కొంచెం warning సూచించకుండా వుండలేక పోయే వాణ్ణేమో! ఈశ్వరప్రేమా విధానంలో మనకి ఇది కొత్త పాఠం.

కాని భరత్‌భాయిని తలుచుకోండి. అతని క్షమ, సహనం, ఔదార్యం ఒక అతనివల్లే ఎవరికి ఏ మాత్రం గాయమైనా వెంటనే రెండో అతను తన కన్నీళ్ళతో ఆ బాధని కడుగు తున్నాడు. అందు వల్లనే గాపును ఆ తల్లి ఆనందమయి ఆ ఇద్దర్ని జంట చేసింది.

హిరేణ్యుడి వ్యవహారాలు అన్నీ తెలుసునట ఆమెకి. తెలిసి ఆమె ఇతన్ని 14 ఏళ్ళు భరించిందంటే .... 'పోరా' అంటే ఒక నిమిషంలో దిక్కు లేకండా పోతాడు. గెంటేస్తారు. భరించింది. ఇతనిలో ఏం గొప్పతనం చూడకపోతే భరిస్తుంది. ఇట్లాంటి వాళ్ళు లక్షలు వాళ్ళం దర్నీ భరిస్తోందా? ఇతనైనా ఆమెని విడవక ఆమెచేత చివాట్లు తింటో శిక్షలు పడుతో ఎందుకు పడి వుంటున్నాడు?

ఈశ్వరుడు ఎంతదయని **express** చేశారో "సన్యాస ఆశ్రమంలో వుండి, ఆ నియమాలు నిలుపుకోలేక, లొంగి పోయేవాడి మనోక్షోభ, దైన్యం మీ కెట్లా అర్ధమవు తుంది?"

ఆ దైన్యం ఆయనకి కనపడు తోంది. మాకు కనపడదు, మేకపోతు గాంభీర్యం తప్ప.

నిన్న సాయంత్రం ఆనందమయిమా షాకి దర్శన మిచ్చిందట. ముందు తన శిష్యుణ్ణి కోప్పడ్డదట. "నిన్ను మహాత్ముల దగ్గరకి పంపితే నువ్వు చేసేపని ఇదా?" అని. తరువాత షాతో "నా శిష్యుడు చేసిన అపచారానికి నేను నిన్ను క్షమార్పణ అడుగు తున్నాను" అని నమస్కరించిం దట. షా చాలా **move** అయింది.

ఈశ్వరుడు అన్నారు "మన మెవ్వరమూ కాదు. అతన్ని క్షమించాల్సింది. అది మురళి. అతన్ని క్షమించమను నా పుత్రుణ్ణి" అన్నారు.

ఇంకో చోటనైతే హిరేన్‌కి ఏం జరిగి వుండేది! ఎంత గొప్ప పూర్వ సుకృతమో! ఈశ్వరుడికి మనందరి కన్నా ఎంత అర్పణ చేసుకున్నాడో కొన్ని జన్మల్ని. ఇన్నేళ్ళ ముందు ఆనందమయిమా తరువాత ఈశ్వరుడు అరిచేతుల్లో కాపాడు కుంటో తీసుకుని వస్తున్నారు. ఇట్లాటి ప్రలోభాల మనిషిని."

(శాస్త్రిగారికి చలంగారి లేఖ 14-11-54)

అందరికీ హిరేన్ అంటే చాలా కోపముగా ఉంది. అతనిని ఏమి అనక పోవడంతో షామీద కూడా కొంత కోపం వుండేది. అప్పుడు ఈశ్వరుడు అన్నారు. "మీరు సజ్జనులు. మీ సంగతి మీరు చూసుకో గలరు. ఎవరైనా మిమ్మల్ని హర్షిస్తారు కాని ఇతను దుర్మార్గుడే కనుక ఇతన్ని ద్వేషించే వారేకాని ప్రేమించేవారు లేరు. మరి ఇతనికి ఎవరు దిక్కు నేను ప్రేమించక పోతే" అని. అయినా అతన్ని ఎవరూ భరించలేక పోయేవారు,

తరువాత మద్రాసు నించి భరత్‌భాయి, హిరేన్ తిరిగి వచ్చారు. భరత్‌భాయి అక్కడి వాళ్ళతో చెప్పి, ఏడ్చాదుట "మీరు ఏమీ అనుకోకండి. ఇతను ఎప్పుడూ ఇంతే. కానీ ఎన్నేళ్ళ నించో వున్నాడు గనుక దయామయి ఆనందమయీమా సహిస్తోం దితన్ని" అని చెప్పాడని శాస్త్రిగారు మురళి వచ్చినప్పుడు భరత్‌భాయి అన్న మాటలు చలంగారు వాళ్ళతో చెప్పారు.

అప్పుడు అందరికీ అర్థ మయింది. ఇలాంటి దుడుకు మనిషితో అంత శాంత స్వభావం కలవాడ్ని ఎందుకు పంపించారో! ఆనందమయీమా.

హిరేన్ ఆనందమయీమా గురించి షాతో చెప్పేవారు. హిరేన్‌ని భిక్షాటనం చేసుకోమని ఒకసారి ఆదేశించారట ఆమె. ఇంకొకసారి ఏమారు మూలనో నిర్జన ప్రదేశంలో వున్న తమ ఆశ్రమానికి పంపివేశా రట. ఇంక అతని వల్ల ఏదయినా తప్పు జరిగిందని తెలిస్తే - ఒంటరిగా తన గదిలో, కూచోబెట్టి రాత్రింబవళ్ళు చివాట్లు వేస్తూ, తను ఏడుస్తూ ఇతనికి నచ్చచెబుతూ వుండేవా రట. ఆమె పెట్టేశిక్షణ భరించలేక అతను ఒక్కొక్కప్పుడు పారిపోయే వాడు. ఆ ప్రదేశానికి తానూ వచ్చి అతనిని లాక్కొని పోయేవా రట ఆమె.

తిరువన్నామలై పంపించే టప్పుడు "నేను దక్షిణాదికి పోనని" మొండికేశా రట హిరేన్. ఆమె వొచ్చి హిరేన్ చెయ్యి పట్టుకుంది. అతని మొండి పట్టంతా మరుక్షణం మాయమైంది. ఇదంతా చూస్తే థామస్ ఇండియాకి పోనంటే జీసస్ అతన్ని బానిస కింద అమ్మి వేయడం గుర్తుకి వస్తుంది,

ఇక్కడికి వచ్చిన తరువాత తిరువన్నామలై వొదల నన్నాడు హిరేన్.

ఆనందమయిమా వుత్తరాలు రాయిస్తే జవాబు రాసేవాడు కాదు. షా అతనిని కోప్పడి ఆమెకి బదులు రాయించే వారు. ఎంత మొండి తనం, పొగరూ వున్నా షా చెప్పగానే తలవంచి ఏ పనైనా చేసేవాడు హిరేన్. షా చెప్పారు గనుక ఆమెకి జవాబులు రాయడం మొదలు పెట్టాడు. కొన్నాళ్ళకి ఆనందమయిమా "నువ్వు భజనలకి పోవద్దు" అని రాయించారు. అతను షాకి వచ్చి చెప్పారు. "భజన అన్నది వుత్తమ, పుణ్యకార్యం కదా? ఆవి డెందుకు వెళ్ళవద్దు అంటుంది?" అని షాని ప్రశ్నించేవాడు. "ఏమో? నా కెట్లా తెలుస్తుంది?" అన్నారు షా. కాని గురువు తనకి పదే పదే వార్నింగులు ఇస్తూ వున్నా హిరేన్ భజనలకి వస్తూనే వున్నాడు.

ఇంతలో గుడివాడ నించి డి. పి. రామారావు అనే యువకుడు చలంగారికి వుత్తరం రాశారు. "నేను చాలా దుర్మార్గుడ్ని. అందుచేతనే ఈశ్వరుణ్ణి దగ్గరకి రావడానికి నాకు జంకుగా వుంది. నాకు అర్హత వుందనీ, నన్ను బాగుచేయ గలననీ ఈశ్వరు డంటే ఈశ్వర దర్శనానికి వస్తాను" అని రాశారాయన. "అర్హత అనర్హత అన్నది ఈశ్వరుడి కేమీలేదు - - - ఈశ్వరుడు మిమ్మల్ని బాగు చేయగలరని మీకు నమ్మకం వుంటే తప్పకండా రండి" అని చలంగారు ఆయనకి

రాశారు. ఆ అబ్బాయి తండ్రి కూడా సంతోషిస్తూ వుత్తరం రాశారు.... "మీరు మా అబ్బాయిని తీసుకో గలిగితే సంతోషమే" నని. రామా రావు ఏవో పెద్ద పరీక్షలు ప్యాసయ్యారు. అలాగే అతను వొచ్చాడు. చలంగారు వాళ్ళమీద తను భారం కావడం అతనికి ఏమాత్రం ఇష్టం లేదు. తన వెంట కొంత డబ్బు తెచ్చు కున్నారు. అతన్ని 'అనాసక్తి'లో పెట్టారు చలంగారు వాళ్ళు. అతను తన వంట తను చేసుకుని ఇండిపెండెంట్‌గా వున్నారు.

రామారావు తన గురించి చలంగారికి చెప్పారు. ఇంతకీ అతను చేసిన దుర్మార్గం ఏమిటంటే చిన్నతనంలో తండ్రికి తెలియకుండా డబ్బులు దొంగిలించే వాడట. ఇట్లాంటివి చేశాను. ఇంక నా కెట్లా గతి దొరుకు తుంది" అని అతను వ్యసన పడుతుంటే ఈశ్వరుడు "ఇలాంటివి చాలామంది పిల్లలు చేస్తారు. దానికి మీరింతగా బాధ పడ నక్కర లేదు అన్నారు. అతను "నన్ను పవిత్రుణ్ణి చెయ్యండి" అని ఈశ్వరుడ్ని పదే పదే వేడుకునే వారు. "పవిత్రత ఎందుకు?" అని ఈశ్వరుడు ప్రశ్నిస్తే, సమాధానం అతనికే తెలియదు.

భజనలో హిరేన్ ప్రవర్తనని భరించలేక పోయేవారు రామా రావు. హిరేన్ భజన అయినాక కూడా ఆనందమయిమా గురించి, ఆమెపై తన తిరుగుబాటు, ఆమె తనని అదుపు ఆజ్ఞలలో పెట్టడం, ఆ శిక్షణ షాతో చెబుతూ వుండేవాడు.

కొంత కాలానికి చాలా వరకూ బయటికి రాకుండా తన గది లోనే వుండి పోయేవారు షా. అట్లా షా గదిలోనే వుండిపోతున్నందుకు హిరేన్ గోల పెట్టేవాడు. "నువ్వు కనపడకపోతే ఎట్లా షా" అని అడిగేవాడు. హిరేన్ షా పట్ల తీసుకున్న చనువు, చొరవ రామారావుని బాధ పెట్టాయి. షా ముందు హిరేన్‌ని ఏమయినా అనడం రామారావుకి

భయం, కాని ఎట్లాగో ధైర్యం తెచ్చుకుని "ఇత నెందుకు వస్తాడండి భజనకి ?" అని షాని అడిగారు.

"భజనకి ఎవరయినా రావొచ్చు. అందులో తప్పేమీ లేదు. భజనకి వొచ్చేవారి నెవర్ని మేం అభ్యంతర పెట్టం" అని చెప్పారు షా.

ఒక రోజు రామారావు, హిరేన్ కలిసి గిరి ప్రదక్షిణానికి వెళ్ళారు. అక్కడ వాళ్ళిద్దరి మధ్యా ఏం జరిగిందో ఎవరికీ తెలియదు. ఆ వేళ రాత్రి భజన అయిన తరువాత రామారావు హిరేన్ దగ్గరకి వెళ్ళి "నువ్వు చాలా అసభ్యంగా ప్రవర్తిస్తున్నావ్. ఆమెని నువ్వు షా అని ఎందుకు పిలుస్తావు ?" అన్నారు.

"అందరూ పిలుస్తున్నారు. నేనూ పిలుస్తున్నాను" అన్నాడు హిరేన్.

"మీ ఆనందమయిమాని ఆనందా అని పిలుస్తున్నావా ?" అలాగే సౌరిస్‌ని మదర్ అని పిలు. అలా పిలవకపోతే నువ్వు భజనలకి రావడానికి వీల్లేదు" అన్నారు రామారావు.

"నాకు చెప్పడానికి నువ్వెవరు ? షా చెబితే భజనలకి రావడం మానేస్తాను" అన్నాడు హిరేన్.

"మళ్ళీ షా అంటావ్" అంటూ పైకి లేచాడు రామారావు. ఇద్దరూ తగవు లాడుకున్నారు. అందరూ సౌరిస్‌ని షా అని పిలిచేవారు. రామారావు సౌరిస్‌ని 'షాతల్లీ' అని పిలిచే వారు. కాని అందరికీ హిరేన్ షా అని సౌరిస్‌ని పిలవడం ఇష్టం లేదు.

ఉదయం ఈ సంగతు లన్నీ రామారావు షాకి చెప్పారు.

"ఎవరినైనా మేము భజనకి రావద్దని అనం. మీ రెందుకు గొడవ పడతారు. అతను నన్ను షా అని పిలిస్తే ఏమయింది ? నన్ను ఎవరేమని పిలిచినా నాకేం అభ్యంతరం లేదు" అన్నారు షా.

"తన గురువు ఆనందమయిని అట్టానే పిలుస్తాడా ?'' అని అడిగారు రామారావు.

"తమ గురువుని ఎవరైనా అమ్మ అని తప్ప ఇంకోలాగ పిలవరు. ఇక్కడ అందరూ నన్ను షౌ అని పిలుస్తున్నారు. అతను ఒకడే కాదుకదా అట్లా పిలుస్తున్నది, ఎవరెట్లా వుంటే మీకు ఎందుకు!" అని సర్దారు షౌ. అప్పట్లో షౌ గార్డెన్‌లోని చెట్లను చూడటానికి వెడుతూ వుండే వారు. అలాగే ఆ రోజూ వెళ్ళారు, రామారావు ఆమెని అనుసరించారు. 'ఏమిటండీ ఆ మనిషి' అని చెబుతూ హిరేన్ గురించి గొడవ పడుతున్నారు రామారావు. పరిస్థితిని రామారావుకి వివరిస్తూ సర్దుతున్నారు షౌ.

"నెలన్నర నించి రామారావు వచ్చినప్పటి నించి హిరేణ్యుడు మామీద వాగు తున్నాడుట. ఇన్నాళ్ళూ వూరుకుని హిరేణ్యుడు మొన్న భజనకి వచ్చి షౌతో మాట్లాడాడు. ఆ మాట్లాడే విధం మా కెవరికీ సహించగలగనిది అయింది. రామారావు అతనితో తగాదా వేసుకుని హిరేన్‌ని మా ఇంటికి రావద్దన్నారు. హిరేణ్యుడు పొగరు మోతుగా జవాబు చెప్పే టప్పటికి, హిరేణ్యుణ్ణి మన ఆంధ్రుడు చెప్పు తీసుకుని కొట్టాడు. హిరేణ్యుడు ఈ కుర్రాడి మీద ఒక్క దూకు దూకి పీక నులుము తున్నాడు. మాకు (నౌకర్లతో సహా) పదినిమిషాలు పట్టింది విడదియ్య డానికి. అంతటితో వదిలా డను కుంటే నిన్న రాత్రి మళ్ళీ భజనకి వచ్చాడు. ఈశ్వరుడు తప్ప ఎవరమూ అతనితో మాట్లాట్టం లేదు. ఆ ఉదయం అతని వాలకం, అతని బూతులు, బెదిరింపులూ, అబద్ధాలు మనసుని ఛండాలం చేసి వదిలి పెట్టాయి."

(శాస్త్రిగారికి చలంగారి లేఖ 28-5-55)

"మీరు ఆ హిరేన్ సంగతి రాసింది సహజంగా వినపడ లేదు నాకు చెవులకి. నాలో మీలోని వుదారత్వం, క్షమ లేనట్టున్నాయి. అతన్ని పదిగజాల దూరాన భరించ లేకండా వున్నాను. అతన్ని చెప్పు తీసుకు కొడితే నా హృదయ మేమీ పరితపించ లేదు. ఆ నిమిషాన పోట్లాటా, గోలా అవుతుందనే ఆదుర్దా తప్ప. తప్పే, కానీ ఈనాటికీ నాకేమీ జాలి లేదు, ఆ విషయమై, జరగవలసింది జరిగింది. కాని ఈశ్వర భక్తులం గనక మనం కాదు దాన్ని జరిపించవలంసిది. ఇంక ఈశ్వరుడి సమీపవర్తియై కూడా నే నిట్లానే వున్నాను. నా దురదృష్టం మమ్మల్ని తనవాళ్ళుగా చూసుకుని, మామీద అపకీర్తిని భరించలేక ఉగ్రుడైన రామారావుని చూస్తే నాకెంత ఇష్టం వొచ్చిందో!"

(శాస్త్రిగారికి చలంగారిలేఖ 1-6-55)

షా రామారావు గది దగ్గరకి వెళ్ళారు. అతను కిటికీ దగ్గరకు వచ్చి వెక్కి వెక్కి ఏడవటం మొదలు పెట్టాడు.

"మీరు నాకోసం ఇట్లా పోట్లాడి నందుకు నాకెంతో గర్వంగా వుంది." అని ఆ కిటికీ లోంచి అతని తల నిమిరి "ఇక్కడ వుంటే మీ కిట్లాంటి పోట్లాటలు తప్పవు. మీవూరు వెళ్ళిపోండి. అతను చంపేస్తా నంటున్నాడు. మీవూరు వెడితేనే నయం" అని అతనికి చెప్పారు షా.

"నేను ఏ మాత్రం మా వూరు వెళ్ళను, చంపేస్తే చంపేస్తాడు" అన్నారు రామారావు. అందరికీ రామారావు మీద ఎంత అభిమానం వచ్చేసిందో! ఈశ్వరుడు అతనిని వూరు వెళ్ళి పొమ్మని ఎంతో నచ్చ చెప్పారు. "చంపేస్తే చంపేస్తాడు. నేను వెళ్ళనే వెళ్ళను" అన్నా డతను. 'సరే వుండు' అన్నారు ఈశ్వరుడు.

ఆ రోజు రాత్రి రామారావు ఒంటరిగా వుంటే హిరేన్ చంపే స్తాడని, రామారావుని చలంగారు వాళ్ళింట్లో అందరి మధ్య పడుకో

పెట్టు కున్నారు. ఇక హిరేన్ ఆచాయలకి రాలేదు. భజనలకి కూడా రావడం మానేసు కున్నాడు, రామారావు విశ్వాస బలం వల్ల, కాని రామారావు కనపడి నప్పుడల్లా గుడ్లురిమి చూసే వాడు.

ఆ మధ్యాహ్నమే హిరేన్ చలంగారు వాళ్ళింటికి వచ్చాడు. "ఏమిటి నీ Guest నా మీద కిలా వచ్చి, నన్ను చెప్పుతో కొడితే, నువ్వు చూస్తూ వూరు కున్నావా?" అని షాతో పోట్లాడాడు.

"Guests వస్తూ వుంటారు. పోతూ వుంటారు. ఈ విషయాల్లో నాకు జోక్యం లేదు. ఇవన్నీ చూడడమేనా నాకు పని?" అన్నారు షా. ఆ మాటకి హిరేన్ కోపగించి వెళ్ళిపోయాడు.

అప్పట్లో అల్లరివాళ్ళో, దొంగలో భజన అయిపోయిన తరు వాత పెద్ద రాళ్ళు పెట్టుకుని కూచుని గోడలమీది నించి దొర్లించారు. పెద్దగా చప్పుళ్ళు చేసేవారు. వెనక సమాధుల దొడ్లో మాటలాడుకుంటూ వుండే వారు. కాంపౌండ్‌లోకూడ చిన్న చిన్న దొంగతనాలు జరిగాయి. అలజడి కాగానే రామారావు డాబామీదకి ఎక్కి ఇంటివెనక సమాధుల దొడ్లోకి దూకేవారు. నర్తకి కూడా పరుగెడు తుంటే ఈశ్వరుడు వొద్దన్నారు.

చివరికి పోలీసు కంప్లయెంట్ ఇచ్చారు. ఈశ్వరుడు పోలీసు కంప్లయెంట్ ఇవ్వడానికి సాధారణంగా ఒప్పుకోరు కానీ దీనికి ఒప్పు కున్నారు. పోలీసులకి కూడా ఈ విషయం అంతు చిక్కలేదు. "మీ దగ్గర ఏదయినా విలువయిన సామాను వుందా? లేక ఎవరయినా మిమ్మల్ని అల్లరి పట్టిస్తున్నారా? మా కేమి తెలియటల్లేదు" అన్నారు వాళ్ళు. చివరికి పోలీసు లుండగానే అలజడి జరిగింది. రామారావు, బసవరాజుగారు, నర్తకి, పోలీసులు అంతా పరిగెత్తారు. దొంగ గోడ దూకి పారిపోయాడు. వాళ్ళు రోడ్డుమీది నించి వాడు పారిపోయిన

direction లో పరుగు పెట్టారు. చివరికి పాలీమండపంలో దొరికాడు. ఎంత బండారాయిలాంటి మనిషో- ఇంత లావు, అంత ఎత్తు. నర్తకికి అప్పుడు అర్ధమైంది ఈశ్వరుడు తన నెందుకు ఒంటరిగా పరిగెత్త వద్దన్నారో. అప్పటి నించి దొంగతనాలు, అలజడులు ఆగి పోయాయి. ఆ తరువాత రామారావు వెళ్ళి పోయారు.

ఈశ్వరుడు రాకముందు చలంగారు వాళ్ళు కొన్ని తీవ్రమైన పరిస్థితుల్ని ఎదుర్కోవలసి వచ్చింది. చలంగారు వయస్సు మళ్ళిన మొగవాడు. అతని చుట్టూ ఆడపిల్లలు. దాంతో వూళ్ళో వాళ్ళకి కూడా బుద్ధిచెడి - - - ఎట్లాగయినా వాళ్ళు దక్కుతారేమో నని - - - చలంగారు వాళ్ళుండే కాంపౌండ్‌లోనే ఇళ్ళు అద్దెకు తీసుకుని వుండే వారు.

ఈశ్వరుడు రాంగానే "ఈ కాంపౌండ్‌లో వున్న పాము లన్నింటినీ వెళ్ళగొడు తున్నాను" అన్నారు. అలాగే కాంపౌండ్ అధికారి కూడా 'అతనిని ఇంక రానిస్తాను' అని ఈశ్వరుడు షా వాళ్ళతో అన్నప్పుడే రాగలిగే వాడు. ఈశ్వరుడు రానివ్వనంటే ఏ కారణం చేతనో ఆగిపోయేవాడు. బైటనించి కొందరు కాంపౌండ్ లోపలికి కాపలావాళ్ళని మంచి చేసుకుని వచ్చేవారు. వాళ్ళు లోపలికి వస్తూ వుండగానే—"వాడు దుర్మార్గుడు, వాడిని వెళ్ళగొట్ట బోతున్నాను." అని చెప్పేవారు ఈశ్వరుడు. ఆ వస్తున్నవాళ్ళు అకారణంగా ఏదోపని వున్నట్లుగా వెనక్కి తిరిగి వెళ్ళిపోయేవారు

ఆశ్రమాధికారులు చలంగారు వాళ్ళమీదికి పోలీసుల్ని వుసిగొలిపారు - - - - దాంతో చలంగారు బాధపడిపోయి - - "ఎందుకీ వూళ్ళో వుండడం ఎక్కడి కన్నా పోదాం మనం" అని కూచున్నారు. ఈశ్వరుడు ఓదార్చి "సమస్యలు ఎక్కడికి పోయినా తప్పవు. ఎక్కడికి పోతే తప్పుతాయి? ఈగొడవలన్నీ నీ కెందుకు? అంతా నేను చూసుకుంటాను కదా?" అని చెప్పారు.ఆ పోలీసు

అధికారి చలంగారి దగ్గరకి చాలాసన్నిహితుడిలాగ వచ్చి కూచుని మాట్లాడి పోతూ వుండేవాడు. ఒకసారి చలంగారిని "నీకు పిల్ల లెంత మంది?" అని అడిగాడు ఆ అధికారి. చలంగారు తనకి పిల్ల లెంత మందో ఎవరెవరో చెప్పి ఒక అమ్మాయి ఇట్లా తపస్సులో వుంటోం దని చెప్పారు. "ఏదీ ఆ అమ్మాయిని నే నెప్పుడూ చూడలేదే" అన్నా రాయన. "ఆమె ఎప్పుడూ లోపల సమాధిస్థితిలోనే వుంటుంది" అని చెప్పారు చలంగారు.

ఒకసారి ఆ పోలీసు అధికారి వచ్చినప్పుడు బైటనే కూచుని వున్నారు షౌ. ఆయన షౌ ఎదురు గుండానే కూచుని చలంగారితో మాట్లాడేరు. బైటకి వెళ్ళిన తరువాత చలంగారిని "నీకు ఇంకో కూతురు వుందన్నావ్? ఏదీ నాకు కనిపించలేదే?" అని అడిగారు.

"ఇంతసేపు మీ ఎదటే కుర్చీలో కూచుంది కదా" అన్నారు చలంగారు. "నాఎదురు గుండా ఎవరూలేరు. ఖాళీ కుర్చీయే వుందే" అన్నారాయన. ఈశ్వరు డిలాంటి విచిత్రా లెన్నో జరిపేవారు ఆ రోజుల్లో.

కాలి పోతున్నాం అని వేదన పడేవారు. షౌ ఎదురు గుండా భజ నల్లో కూర్చున్న కొందరు, ఈశ్వర ప్రభావానికి తట్టుకోలేక. మొట్ట మొదట వాళ్ళు ఏమయినా తమ లోపల ఆశపడే వారేమో గాని తమలో చిచ్చుకి మండిపోయి ఆమెని తిట్టేవారు. కారణం వాళ్ళు ఆమెని స్త్రీగానే తప్ప మరో దృష్టితో చూడలేక, ఎందుకు వాళ్ళట్లా ఆకర్షణలో పడి బాధ పడాల్సి వస్తోందని, షౌ చాలా బాధ పడేవారు. ఈ స్త్రీ జన్మ ఎందు కెత్తానా, నేను?" అనుకునేవారు. అదీగాక ఆమె చిన్నతనం నించి తన వయస్సు కంటే చాలా చిన్నగా కనపడే వారు. ఈశ్వరు డొచ్చినప్పుడు గూడా చాలా చిన్నపిల్లగా కనపడే వారు. తనకి వృద్ధా

ప్యం ఇచ్చేయ మనీ. ఏవిధంగానైనా తనని వికృత పరుచుకో నివ్వమనీ, షా ఆయన్ని వేడుకునే వారు. ఆయన ఒప్పుకునే వారు కాదు. "నీ కెందుకు. అంతా నేను చూసుకుంటున్నాను కదా" అనేవారు. "వాళ్ళు పడే వేదనని భరించలేక పోతున్నాను. అది నన్ను బాధిస్తోంది అని వేడుకునే వారు షా. "అదే వారికి మార్గం" అనేవారు ఈశ్వరుడు. ఇట్లా కాలిపోవడమా మార్గం? ఇదేం మార్గం" అని షాకి ఆశ్చర్యం వేసేది.

## II

చిత్ర అత్తగారు చచ్చిపోయారు. ఆమె గురించి చలంగారేమంటా రంటే "ఆ రోజుల్లో లీలగారు చలంతో వుండడంవల్ల time లేకపోయింది కాని, లేకపోతే ఆమెకి చలానికి మంచి నేస్తం కలిసేది. ఆమె కున్న బలహీనమల్లా డబ్బు, దాచు కోవడానికి కాదు, పంచిపెటడానికి. వీరూ వారూ అనకుండా ఇచ్చేస్తుంది. వీరూ వారూ అనకుండా లాగేస్తుంది. ఈ రూపాయి విలువ కాలంలో అట్లాంటి రకం మనుషులు అరుదవు తున్నారు. దేహి అంటే చీరన్నా విప్పి ఇచ్చే స్తుంది"- అని.

'శ్రీ' చలంగారు వాళ్ళని వొదిలి వెళ్ళాక, అత్తగారు బెజవాడకి, అరుణాచలానికి చాలాసార్లు వొచ్చారు చలంగారింటికి. బండిలోంచి దిగుతూనే ఏడుస్తూ లోపలికి వొచ్చేవారు.

"ఏమిటండీ అన్నయ్యగారు ఇట్లా చేశారు. ఏమంటా రండీ, చిత్రని ఎప్పుడు పంపిస్తారు. మా వాడి గతి ఇక అంతేనా?" అంటూ.

ఇంక అమ్మ అందు కునేది (చిత్ర పెళ్ళికి అమ్మా లేదు, చలంగారు లేరు, చిత్ర పెళ్ళి వొయ్యి దగ్గరుండి జరిపించింది) "ఏమమ్మా! మమ్మల్ని వొచ్చి అడుగుతావు? మేం చేశామా పెళ్ళి? మాకేం తెలుసునని మమ్మ ల్నడుగుతావు? నేనే వుంటే మీలాంటి

వాళ్ళ కిచ్చి పిల్లగొంతు కోసేదాన్నా ?" అని లేచేది. చిత్ర అత్తగారు ఏ మాయ చేసేదో గానీ మరు నిముషానికి అమ్మ ఆవిడవైపే మాటాడేది. చిత్రని పంపమని చలంగారిని రెట్టించేది అత్తగారు.

"ఏమో నండి: అమ్మాయిని అడిగి చూడండి. చిత్ర వస్తానంటే తప్పకండా తీసు కెళ్ళండి. రాకపోతే నే నెవర్నీ నిర్బంధ పెట్టను" అనేవారు చలంగారు. చిత్ర నడిగితే, చిత్ర ఏమీ మాట్లాడేది కాదు. వాళ్ళందరికీ భయం డాలీని తండ్రివైపు వాళ్ళు ఎత్తుకు పోతారని. చివరికి "పిల్లని తీసుకు వెడతారా" అని అడిగితే "పిల్లని తీసుకువెళ్ళి మేమేం చేసుకుంటాం. అమ్మాయి రావాలి గానీ" అని అన్నది అత్తగారు. ఆమె మరీ గట్టిగా అడిగే సరికి చిత్ర రాననేది. "ఏమే నిన్నుమే మేం చేశామే. ఏ విధంగా అయినా నిన్ను కష్టపెట్టా మటే" అని ఏడ్చేది అత్తగారు. "ఎందుకు రావో చెప్పవే" అని అడిగితే చిత్ర మాట్లాడేది కాదు. ఇంక ఏడుస్తూ కూచునేది ఆవిడ.

చలంగారుకూడా షౌ వాళ్ళందరితో బాటు ఆమెని అత్తగారూ అనే పిలిచేవారు. "అత్తగారూ! మీరు అప్పుడు చేసిన చారు లాంటి చారు మళ్ళీ తాగలేదు. చేసి పెడతారా ?" అని అడిగే వారు ఆమెని **divert** చేయడానికి. ఆవిడ చేతిలో ఏముండేదో గాని ఆమె చేతివంట అద్భుతంగా వుండేది. చలంగారు ఆ మాట అనంగానే కళ్ళు తుడిచేసుకుని "దాని కేముంది అన్నగారూ" అంటూ "రావే నర్తకీ, రావే చిత్రా" అంటూ వంటింట్లోకి వెళ్ళిపోయేది. ఆ చారుని చేసేసి "అన్నగారూ! తయారయి పోయింది" అని చెప్పి, "అయితే రావన్నమాట" అని చిత్రని ఇంకోసారి అడిగి సరాసరి ఆశ్రమానికి వెళ్ళి- వాళ్ళు ఇట్లాంటి వాళ్ళు అట్లాంటి వాళ్ళని- చలం కుటుంబీకుల్ని ఆశ్రమం వాళ్ళ ముందు తిట్టి వెళ్ళిపోయేది.

ఇప్పుడు శ్రీ వొచ్చాడు. చలంగా రాయన గురించి ఏమంటా రంటే "సరిగ్గా ఆ తల్లికొడుకు. అతనికి వున్న ఒకటి, రెండు లోపాలు, అతని వుత్తమ స్వభావాన్ని పూర్తిగా నుసి చేసేశాయి. చలంమీద వున్న ప్రేమ తనకి అతను వుపయోగ పడలేదు అనే కోపంతో మాయమైంది" అని.

తల్లి కర్మచేసి, బోడిగుండు చేసుకుని వొచ్చాడు శ్రీ. డాలీకి తండ్రి తెలియడు. డాలీ పుట్టిన రెండు నెలలకే చిత్ర, శ్రీ విడిపడి పోయారు. రాంగానే శ్రీ డాలీని ఎత్తుకో బోయాడు, డాలీ భయపడి మంచం వెనకాల నక్కింది.

శ్రీ చలంగారిని, షౌని అడిగాడు. "నేను వుద్యోగం చేస్తున్నాను. చిత్రని నాతో తీసుకు పోతాను"- అని. చిత్ర వస్తే తీసుకు పొమ్మన్నారు చలంగారు, షౌ. ఏమయినాగానీ చిత్రని తనతో తీసుకు పోతానని గట్టిపట్టు పట్టాడు శ్రీ. చిత్ర రానంది స్పష్టంగా. దాంతో శ్రీ "నా కూతుర్ని నేను తీసుకు పోతున్నాను" అన్నాడు. డాలీ వెళ్ళి అమాంతం చలంగారి మెడని పెనవేసుకుని "ఒరే నాన్నా నిన్ను వొదిలి వెళ్ళలేనురా" అని ఒకటే ఏడ్చింది.

"డాలీ నీ పిల్లెంతో చిత్ర పిల్ల కూడాను. నిన్ను పిల్ల ఎరగదు. నువ్వు బలవంతంగా తీసుకుపోతే చిన్నపిల్ల ఏడవదా?" అన్నారు షౌ.

"4 రోజులు ఏడుస్తుంది. మర్చి పోతుంది" అన్నారు శ్రీ.

"తల్లి నెట్లా మరుస్తుంది? డాలీని ఏమాత్రం మేం పంపించం" అన్నారు షౌ, నిజానికి డాలీని తనతో తీసుకు వెళ్ళడానికి శ్రీకి హక్కు వుంది. కానీ షౌ మాటలకి ఏమనలేక అతను తిరిగి గోల పడ్డాడు.

"నువ్వు ఈశ్వరుడంటావు కదూ! ఆ ఈశ్వరుడు నా ప్రార్థన వినరా? నేను ఎంతో బాధ పడుతున్నాను. నా ప్రార్ధన కూడా వినమని ఆయనని ప్రార్థిస్తున్నాను" అన్నాడు శ్రీ.

ఈశ్వరుడు "చిత్ర వస్తుంది బెంగపడకు" అన్నారు శ్రీ తో. శ్రీ వెళ్ళిపోయాడు.

అప్పటి నించి చలంగారికి వుత్తరాలు రాసేవాడు శ్రీ. "ఎందుకు మా చిత్రని పంపరు?" అని. ఆ వుత్తరాలలోనే షౌకి appeal చేసేవారు - - - "ఈశ్వరుడు చిత్ర వస్తుంది అన్నా రన్నావు, ఎప్పుడు వస్తుంది?" అంటూ.

కొద్దిరోజుల తరువాత చిత్ర షౌ దగ్గరకి వచ్చి, తాను భర్త దగ్గరకి వెడతానని చెప్పింది. ఆమెకి ఈశ్వరాధ్వర్యంలో నడిచే జీవితంలో తాను ఒదగలేనని తెలిసి పోయింది. ఇంట్లో అందరిమీదా ఎంత ప్రేమ వున్నా చిత్రమీద డాలీకి పట్టు, ప్రేమ. డాలీ చిత్రతో వెళ్ళదని షౌకి తెలుసు. చిత్రతో "డాలీ ఇంకా చిన్నపిల్ల, దానికి నువ్వెందుకు వెడుతున్నావో అర్థంకాని వయస్సు. డాలీకి ఏడేళ్ళు వచ్చేవరకు ఆగు" అన్నారు షౌ. అట్లానే చిత్ర ఆగుతా నంది.

డాలీకి అయిదేళ్ళు నిండగానే డాలీచేత ఆసనాలు వేయించే వారు ఈశ్వరుడు. తను ఎన్నేళ్ళనించో చేస్తూ వున్నట్లు సునాయాసంగా చేసేది డాలీ. డాలీని స్కూలుకి పంపించం డన్నారు ఈశ్వరుడు. కాని డాలీ స్కూలుకి పోనని రోజూ ఏడ్చేది. "నన్ను బడికీ పంపకండో" అని కిందపడి దొర్లేది. చలంగారికి గుండె కరిగి పోయేది. చలంగారికి చదువుల మీద విశ్వాసం లేదు. అయినా ఈశ్వరుడు చెప్పాక చెయ్యక తప్పలేదు. చిన్నప్పటినించి ఈశ్వరుడు డాలీని చిన్నపిల్లని చూసినట్లు చూడకండా అందరికీ ఇచ్చినట్లే డాలీకి శిక్షణ ఇచ్చేవారు. అది డాలీ

భరించ లేనప్పుడు 'వద్దులే' అని ఆయన అన్నాగూడా పట్టుదలతో భరించి చేసేది డాలీ. ఈశ్వరుడు డాలీ పెళ్ళిచేసుకోదనీ గొప్పయోగిని అవుతుందనీ చెప్పేవారు. అంతేకాదు "యోగిని అవుతుందని అంటు న్నాను గాని ఒకర్ని ప్రేమిస్తుంది. అది ఇటూ అవచ్చు, అటూ అవచ్చు" అని కూడా చెప్పారు. ఋష్యాశ్రమాల్లో మునిబాలకునిలా పెరిగింది డాలీ. ఇంక డాలీ స్కూలుకి బలవంతాన పోవాల్సి వొస్తోం దని చలంగారు బాధ పడుతోంటే ఈశ్వరుడు చలంగారితో—

"చూడు ఎవరూ పని లేకండా వుండరాదు. సోమరితనం పనికి రాదు. ఆ అమ్మాయి బ్రెయిన్‌కి కొంత పని అవసరం. ఆమెని స్కూలుకి పంపడం ఇష్టం లేకపోతే ఏదో ఒక శిక్షణలో పెట్టండి ఆమెని. నువ్వు చదువు చెప్పు. నర్తకి పనులు చెబుతుంది" అని అన్నారు.

షౌ వాళ్ళని గట్టి డిసిప్లిన్‌లో పెట్టిన చలంగారు డాలీ విసుగు చూపెడితే మెత్తబడే వారు. అట్లానే పనులు చేయకండా నర్తకిని బెల్లించేది డాలీ. ఈశ్వరుడు డాలీ తత్వం గురించి మొదటే చెప్పారు. డాలీ తానేది తలుచుకుంటే అది చేస్తుందని, ఎవరేం చెప్పినా ఏం చేసినా తా ననుకున్నదే చేసి తీరుతుందనీ, అట్లానే రిషీవేలీ లాంటి స్కూలుకి పోయి తన కిష్టం అయినంత వరకూ చదువు తుందని చెప్పారు. సరిగ్గా అట్లాగే జరిగింది.

ఆ రోజుల్లోనే చలంగారికి సాధన వల్లనో, దేని వల్లనో **varicose - veins** వొచ్చాయి కాళ్ళకి. దాంతో ఎక్కువ దూరం నడవ లేక పోయేవారు. చలంగారికి గిరిప్రదక్షిణా లంటే ఇష్టం వుండేది కాదు. షౌకి గిరి ప్రదక్షిణా లంటే చాలా ఇష్టం. గిరిని చుడుతూన్న ప్పుడు కొండమీద గుహలు కనిపించి నప్పుడు ఈ ప్రపంచాన్ని

వొదిలి పెట్టి ఆ కొండలోకి వెళ్ళిపోవా లనిపించేది షౌకి. షౌకి బాల్యంలో ఏ కొండని చూసినా ఆ కొండలోకి వెళ్ళిపోయి మళ్ళీ రావా లనిపించేది కాదు. ఇప్పుడు అది మరీ తీవ్ర మైపోయింది షౌలో. అసలు ఈ ప్రపంచంలోకి మళ్ళీ రావడం ఎందుకూ? ఆ గుహల్లోనే వుండి పోకూడదా? అనిపించేది ఆమెకి. ఆ ప్రోద్బలాన్ని చాలా గట్టిగా ఆపుకునే వారు షౌ. ఎంతగా గుహలలోకి వెళ్ళిపోయి తిరిగి రాకూడదని ఆమెకి అనిపించినా షౌ ఎప్పుడూ ఏ గుహలో కూచోనే లేదు.

ఈశ్వరుడు తను వొచ్చిన కొత్తలో ఇంట్లో ఒక్క కీటకం కూడా లేకండా పంపించేస్తున్నా మన్నారు. అప్పటినించి నల్లులు, దోమలు, చీమలు. విషకీటకాలు ఇంట్లో వుండేవి కావు. విషకీటకాలు compound walls లో వున్నా అవి లోపలికి వొచ్చేవి కావు. ఇంక నర్తకి వాళ్ళు పనిపెట్టుకు వెళ్ళి గోడచిల్లుల్లో దాక్కున్న తేళ్ళనీ, జెర్రుల్నీ పొడిచి బైటికి రప్పించి చంపేసే వారు. "వాటి జోలి మీ కెందుకు? అవి ఇంట్లోకి వొస్తే చంపండి. వాటిని చూస్తే మీకు భయ మేస్తుంది గనక" అన్నారు ఈశ్వరుడు వాళ్ళతో. నర్తకి, ఈ కాంపౌం డ్‌లో నౌకర్లు తరచు ఒక తెల్లని నాగుపాముని చూస్తూ వుండే వాళ్ళు, సాధారణంగా గొప్ప సిద్ధులు తెల్లని నాగుపాము రూపంలో తిరుగుతూ వుంటారని ఈశ్వరుడు చెప్పారు. కాంపౌండ్ నౌకర్లు ఆ పాము కని పించినప్పుడల్లా దాన్ని చంపాలని ప్రయత్నాలు చేస్తున్నారు. కానీ అది చిక్కకుండా తప్పించుకు పోయేది. ఒక రోజు ఆ తెల్లతాచు చలంగారి వాళ్ళ ఇంటి పక్కనే వున్న ప్యూరిటీ అన్న ఇంట్లోకి వెళ్ళిందని తెలుసుకున్నారు కాంపౌండ్ నౌకర్లు. షౌ తన గదిలో వుండగానే ఈశ్వరుడు ఆ తాచుపాముని చంపవద్దని నర్తకి వాళ్ళతో చెప్పమని

షా లోంచే "నువ్వు వెళ్ళిపో తొందరగా, వీళ్ళు నిన్ను చంపాలని అనుకుంటున్నారు" అన్నారు ఆ పాము నుద్దేశించి. ఆ పాముని చంపా లనుకుంటున్న వాళ్ళు షా మాటని విని కర్రలు అవీ పెట్టేసి ఆ పాముని చంపాలన్న ప్రయత్నం మానుకున్నారు. ఆ రోజునించి ఆ పాము ఏమయి పోయిందో ఎవరికీ తెలియదు. తరువాత కాంపౌండ్‌లో ఎక్కడన్నా పాము అని అరవంగానే తన గదిలోంచి షా "వెళ్ళమ్మా" అని అనేసరికి ఆ పాము వెళ్ళిపోయేది. కాని ఒక్కొక్క పాము షా చెప్పినమాట వినేది కాదు.

ఆ రోజుల్లో మానవతిగా రొక బృందంతో వచ్చేవారు. శాస్త్రి గారు మరొక బృందంతో వచ్చేవారు. దీపానికివచ్చిన ప్రజలో ఓ వంద మంది పైగా షాని వెదుక్కుంటూ ఆమె దర్శనం కోసం వచ్చేవారు.

ఇట్లా ఉండగా జెకోస్లోవేకియన్ ఒకరు అరుణాచలం వచ్చారు. సాధారణంగా ఆశ్రమానికి ఎవరయినా కొత్తవారు వస్తే వారిని రాజయ్యర్ చలంగా రింటికి తీసుకు వచ్చేవారు. ఈ జెకోస్లోవేకియన్ Volks wagon లో వచ్చారు. దానిలోనే ఆయన వూళ్ళూళ్ళూ తిరుగుతూ వుంటారట. ఆ వేగన్‌లోనే పడకకి పక్క, ఓ చిన్న వంటగది, బాత్ రూం అన్ని సౌకర్యాలు వుంటాయి. ఆయనకి తోడుగా ఒక పావురం కూడా వుంది.

చిన్నతనంలో షా అటువంటి వేగన్ గురించి కలలు కనేవారు. తాము గొప్ప ధనికురాలు అయితే తండ్రితో కలిసి అలాంటి వేగన్‌లో దేశదేశాలు తిరగాలనీ, పేదరాలు అయితే ఒంటెద్దు బండిలో తిరగాలనీ కలలు కనేవారు. తా మెక్కడకీ కదలమని తెలిసి కూడా కలలు కనేవారు షా. సరిగ్గా షా ఏ వేగన్ గురించి కలలు కన్నారో అటువంటి వేగన్‌లోనే దేశదేశాలు తిరుగుతూ ఇక్కడికి వొచ్చా రాయన.

ఆయన తల్లిదండ్రులు కూడా ఇలాంటి వేగన్ల లోనే తిరుగుతుండగా ఆ వేగన్లోనే పుట్టారట ఆయన.

ఆయన చలంగారు వాళ్ళ భజన వినా లనుకున్నారు, అలాగే సాయంత్రం భజనకి వచ్చారు. ఆ భజన విని, ఆ భజనని తాను రికార్డు చేసుకుంటా మన్నారు. అంతకు ముందు తమ ఇంట్లో ఫోనోగ్రాఫ్ వుండేదని చలంగారు చెప్పేవారు కాని Tape recorder అనేపేరు వినడం వాళ్ళకి ఇదే ప్రథమం. మరుసటి రోజు భజన రికార్డు చేసుకోవడానికి ఆయన రికార్డరుతో వచ్చారు. అది ఇప్పటి Tape recorder లాగా లేదు. చెక్క రేడియోలా వుంది. చాలా పెద్దది. అప్పటికి చలంగారు వాళ్ళ దగ్గర హార్మోనియాలు ఏ భజన తాళాలు లేవు. భజనలో చేతులతో తాళం వేస్తూ నామావళి పాడేవారు అంతే. ఎవరెవరి కంఠాలు ఎట్లా Harmonise కావాలో ఆ ప్రకారం అందర్నీ కూచోమన్నారాయన. షౌ వాళ్ళ భజన్లని Record చేయడం అదే ప్రథమం. షౌకి తమ కంఠం రికార్డులో వినడం అదే మొదలు. భజనలో ముఖ్యంగా ఆ కంఠాలన్నీ కలిసి పాడిన 'అరుణాచల శివ' భజన ఎంత గంభీరంగా వుందో! ఆ స్వరాలన్నీ కలిసి (ఒక oblivion) నిరామయంలో కలిసి పోతున్నట్లు అనిపించింది షౌకి ఆ రికార్డు వింటూవుంటే. ఆయన తను తీసిన photographs ని slides చేసి వాటిని చూపుతూ, ఈ రికార్డులని పెడుతూ ఒక్కొక్క దేశం మీద, ఆ దేశ సంస్కృతి మీద వుపన్యాసా లిస్తారట, దేశ దేశాలూ తిరుగుతూ- అందుకోసమే ఆయన చలంగారు వాళ్ళ భజనలని రికార్డు చేసుకున్నారు. ఆ తరువాత కాలంలో స్విట్జర్లాండ్ నించి, స్వీడన్ నించి చాలామంది తదితర దేశాలవాళ్ళు ఈ విధంగానే వొచ్చారు, వాళ్ళ భజన్లని రికార్డు చేసుకున్నారు.

అప్పటికే చలంగారు వాళ్ళ దగ్గర డబ్బు అయిపోతోంది. చలంగారు వచ్చి ఆ సంగతి షౌకి చెప్పారు. ఆ దరిమిలానే కొంతమంది పబ్లిషర్లు చలంగారి పుస్తకాలు వేస్తామని వస్తే ఈశ్వరుడేం మాట్లాడలేదు. ఒక పబ్లిషర్ తాను చలంగారి పుస్తకాల్ని పబ్లిష్ చేస్తామని వచ్చారు. ఈశ్వరుడు ఆయనకి పుస్తకాలు అచ్చుకి ఇస్తామన్నారు. చలంగారు "నాకేమి తెలియదు. నా పుస్తకాలన్నీ పట్టాభిరామయ్య ఇంట్లో పెట్టి అస్త్రసన్యాసం చేసి, కలాన్ని కిందపెట్టి వచ్చేశాను." అని అన్నారు. "ఆ పుస్తకా లన్నింటినీ మీ పట్టాభిరామయ్యకి రాసి తెప్పించు" అన్నారు ఈశ్వరుడు. చలంగారు ఈశ్వరుడు చెప్పినట్లుగానే పట్టాభిరామయ్యగారికి వుత్తరం రాశారు. పుస్తకాలు వచ్చాయి. ఆ విధంగా పుస్తకప్రచురణ వలన కొంత డబ్బు వచ్చింది.

ఒక రోజున అమ్మ, చలంగారు ఎవరితోనో మాట్లాడుతున్నారు. షౌ అప్పుడే బయటికి రావడం తటస్థించింది. ఆ వచ్చిన ఆయన చెప్పుకుంటున్నారు- "నేను కమర్షియల్ మ్యూజీషియన్ని. జర్మనీ వెళ్ళి కమర్షియల్ మ్యూజిక్ నేర్చుకున్నాను. ఆ తరువాత అరవిందాశ్రమంలో చేరాను. అక్కడ చేరిన తరువాత నేను పాట పాడ కూడదని చీటీరాసి పంపించారు అరవిందులు. నేను ఆశ్రమం నించి బయటికి వచ్చేశాను. కానీ నాకులేని వ్యసనాలు లేవు. ఇవీ అవీ అని చెప్పటానికి వీల్లేదు. అట్లా నా దేహాన్ని నాశనం చేసుకున్నాను. నేనుగనుక నా సంగీతాన్ని నిలుపు కుంటే ఎవరూ నాతో సాటిగా నిలిచేవారు లేరు" అని. ఆయన బెంగాలీ బ్రాహ్మడు. అమ్మ "మా అమ్మాయితో సాటిగా నువ్వు బెంగాలీ పాటలు పాడగలవా?" అని అడిగింది. ఆయన నిర్ఘాంత పోయి చూశారు. "ఏమిటి మీ అమ్మాయితోనా?" అన్నారు ఆశ్చర్యంగా.

"ఔను, మా అమ్మాయితో సమానంగా నువ్వు బెంగాలీ పాటలు పాడలేవు" అంది అమ్మ.

"మీ అమ్మాయితో సమానంగా నేను పాడ లేకపోతే జీవిత మంతా ఆమెకి నేను దాసుడి నయిపోతాను. ఆమె నాతో సమానంగా పాడలేకపోతే ఆమె జీవితమంతా నాకు దాస్యం చెయ్యాలి" అని సవాలు చేశా రాయన.

"సరే, అలాగే" అంది అమ్మ.

చలంగారు, షౌ మాటా మంతీ లేకుండా చూస్తున్నారు. అమ్మ ఆయనని సాయంత్రం భజనకి రమ్మని పిలిచింది. అలాగే ఆయన భజనకి వచ్చి నిశ్శబ్దంగా కూచున్నారు.

భజన మొదలు పెట్టారు. నామసంకీర్తన అయ్యాక "అమి చంచల్ హే" అన్న రవీంద్ర గీతం "జపోరే రామ్ నామ్ సుఖదాయి" అన్న భజనపాట పాడారు షౌ. షౌ పాడడం ఆపగానే ఆయన తల వంచేసుకుని ఒక్క నమస్కారం చేసి "నేను ఓడిపోయాను" అన్నారు.

అమ్మ వైపు తిరిగి "నే నేదో పొట్టకూటికి నేర్చుకున్న విద్య ఇది. ఆవిడ సంగీతం సహజంగా ఒక వెల్లువలా ఆమెలోంచి ప్రవహిస్తోంది. దాంతో ఎలా పోటీ పడగలను?" అన్నారు. తరువాత ఆయన "మా బెంగాల్‌లో ఎన్నో భజనలు విన్నాను. అక్కడ భజనలలో మృదంగాలు, తాళాలు, వాయిద్యాలు ఎంతో అట్టహాసం వుంటుంది. ఇక్కడ ఏ వాయిద్యం లేకండా ఈ భజన ఎంతో శాంతితో నిండి హాయిగా వుంది" అన్నారు.

చలంగారు ఆయనని పాడమని అడిగారు. ఆయన ఒక స్వరాన్ని అట్లా ఆలాపించగానే ఆ కంఠస్వరం లోంచి గొప్ప Vibrations

వచ్చాయి. కొంచెంసేపు ఆలాపించి "ఇంత కన్నా నేను పాడలేను. నా దేహం ఎన్నడో శిథిలమైపోయింది" అన్నా రాయన.

మద్రాసు నించి చలంగారికి ఒకరు వుత్తరం రాశారు. "నేను డాక్టరు శర్మని. నాకు మిమ్మల్ని చూడాలని వుంద"ని. ఆయన **Children's Garden School** కి ప్రిన్సిపాల్. ఉత్తరం రాసిన తరువాత ఆయన ముప్పైమంది ఆడపిల్లలతో కలిసి రమణాశ్రమానికి వొచ్చారు. ఆశ్రమంలో వాళ్ళందరూ వుండే టందుకు చోటు లేదని చెప్పారు. ఆయన చలంగారికి కబు రంపించారు. "మాకు ఆశ్రమంలో చోటు దొరకలేదు. మీ దగ్గర చోటిస్తారా ?" అని

"తప్పకండా రండి" అని చలంగారు చెప్పారు.

వాళ్ళంతా వొచ్చే సమయానికి షా తమ గదిలో వున్నారు. ఆయన తమని తామే పరిచయం చేసుకున్నారు చలంగారికి- తానే వి. ఎన్. శర్మనని, చాలాకాలం జర్మనీలో వున్నాననీ, ఆ దేశీయు రాలినే పెళ్ళి చేసుకున్నానని- తామిద్దరూ కలిసి మద్రాసులో ఒక స్కూలు పెట్టామని చెప్పా రాయన. శర్మగారు అరవై ఏళ్ళు దాటిన వారు. ఆ ముప్పైమంది అమ్మాయిల మధ్య ఆ అరవై ఏళ్ళ వయసు వారూ వొక చిన్న పిల్లవాడిలాగ గంతులు వేసేవారు. ఆయనని చూస్తే ఒక స్కూలుకి ప్రిన్సిపాల్ లాగే లేరు. ఆ ముప్పైమంది అమ్మా యిలు చలంగా రింట్లో భజనగదిలో పట్టేరు. వాళ్ళు భజన్లలో పాల్గొనే వారు. ఆ పిల్లల కోలాహలంతో ఇల్లంతా ఎంత హడావిడిగా వుందో.

శర్మగారు డాలీని "నాతో మా స్కూలుకి వొస్తావమ్మా ?" అని అడిగారు. "ఒకసారి వొచ్చి చూస్తాను. బాగా వుందని నా కనిపిస్తే వుంటాను" అంది డాలీ. "అట్లాగే, ఒకసారి వొచ్చి చూడు" అన్నా రాయన. రెండు రోజులు సరదాగా గడిపి శర్మగారు వాళ్ళు వెళ్ళి

పోయారు. కొన్నాళ్ళ తరువాత నర్తకి తనవెంట డాలీని మద్రాసు తీసుకెళ్ళింది. అక్కడ డాలీకి శర్మగారి స్కూలు చూపించింది. "ఇక్కడ బావుంది కానీ నేను వుండన"ని నర్తకి వెంట ఇంటికి వచ్చేసింది డాలీ.

"అక్కడ వుండకండా ఎందుకు వొచ్చేశావు? నీ కక్కడ బాగాలేదా?" అని అందరూ డాలీని అడిగారు. డాలీ జవాబు చెప్పలేదు. "నేను వెళ్ళిపోతే నాన్న దిగులు పడతాడు" అని నర్తకితో మాత్రం చెప్పిందట. నిజమే, తాను ఏడిస్తే నాన్న కెక్కడ నిద్రా భంగం అవుతుందోనని డాలీ తనకి ఎంతబాధ వొచ్చినా రాత్రులు మాత్రం ఏడ్చేది కాదు. పొద్దున్న లేవగానే ఏడ్చేది. ఒకసారి ఆ విధంగా జరిగినప్పుడు "ఇంత బాధగా వుంటే రాత్రి నువ్వేడవలేదేం? నిద్ర పట్టిందా? డాలీ!" అని అడిగింది నర్తకి ఆశ్చర్యంగా ....

"రాత్రంతా చాలా నెప్పిగా వుంది కానీ నాన్న లేస్తాడని ఏడవలేదు" అంది. ఆ పిల్లలో అంతటి పసితనంలో ఎంత వివేకమో. అది ఆమెలో జన్మతః వచ్చిన ప్రత్యేకత.

భరత్‌భాయి హిరేన్‌ని బతిమాలి భజనలకి తీసుకు వొచ్చేవారు. కానీ పకపక సహించేది కాదు. అతను అడుగు పెట్టంగానే అతని మొహంమీద తలుపులు వేసేది. దాంతో అతను బాధపడి పూర్తిగా రావడం మానుకున్నాడు. ఎప్పుడయితే అతను భజనలకి రావడం మానుకున్నాడో అతనిలో తేజం మాయమై పోయింది. ఎప్పుడయితే అతనిలో తేజం పోయిందో షాకి అత నెవరో? తనెవరో? అంత దూరమై పోయాడు.

హిరేన్ తిరువన్నామలైలో వుండడానికి చాలా ప్రయత్నాలు చేశాడు కానీ ఏ ఒకటి ఫలించ లేదు. చివరికి ఆనందమయీమా వాళ్ళి

ద్దన్నీ పిలిపించి వేసింది తన దగ్గరకి. అక్కడికి వెళ్ళిన తరువాత "ఆనందమయి తాలూకు చిన్న ఆశ్రమంలో వున్నానని అరుణాచలంలో గడిపిన రోజుల్ని తలుచుకుంటూనే వున్నానని" చలం కుటుంబానికి భరత్‌భాయి వుత్తరం రాశారు, హిరేన్ మాత్రం వుత్తరం రాయలేదు.

కొన్నేళ్ళ తరువాత కొందరు రమణభక్తులు ఆనందమయి ఆశ్రమానికి వెళ్ళి కొన్నాళ్ళు వున్నారు. వాళ్ళు ఒక రోజు వంటింటి వైపు వెడుతూ వుంటే, చిన్న గావంచా కట్టుకున్న ఒకబోడి గుండాయన వాళ్ళలో ఒకామెని గుర్తుపట్టి "మీరు బాగున్నారా? నేను గుర్తున్నానా?" అని అడిగారట. ఆవిడ ఆయన్ని గుర్తు పట్టలేదు. ఈ వంటతను తన నెందుకు పలకరిస్తున్నాడా అనుకుంది. ఆవిడ తెల్లబోయి చూస్తుంటే తాను హిరేన్ అని చెప్పాడాయన. అరుణాచలంలో వున్నప్పటికీ ఇప్పటికీ అతనిలో ఎంత తేడాయో?

ఆ తరువాత చలంగారు వాళ్ళకి ఎవరో చెప్పారు ఇక్కడి నించి వెళ్ళగానే ఆనందమయిమా హిరేన్‌ని మొహం వాచేలా చివాట్లువేసి, జుట్టు గొరిగించి, కొల్లాయి కట్టించి వంటింటి పనిలో పెట్టించిందని.

ఇటీవల ఆనందమయి శిష్యులు ఒకరు రమణస్థాన్ భజనకి వొచ్చారు. వారు మునుపుకూడా భరత్‌భాయి, హిరేన్ వెళ్ళిపోయిన కొద్ది కాలానికి అరుణాచలం వొచ్చి వున్నారు. అప్పట్లో చాలా చిన్నవారు ఆయన. ఆ రోజుల్లో భజనలకి వచ్చేవారు చలంగారు వాళ్ళింటికి. అప్పట్లో ఆయనలో ఏదో భరించలేని తనం వుండేది. ప్రస్తుతం ఎంత దర్జాగా వున్నారో తెల్లటి గిరజాలు, గడ్డం- ఎంతో గాంభీర్యం వుట్టిపడుతోంది- ఆయన తీరులో తెన్నులో.

ఫలాని అప్పుడు వచ్చానని ఆయనే గుర్తు చేశారు. ఆయన తనకి చలంగారు వాళ్ళంతా గుర్తేనని అన్నారు. అప్పుడు షా భరత్

భాయి, హిరేన్‌ల సంగతి అడిగారు ఆయనని. భరత్‌భాయి ఇంకా ఒక నిర్జనమైన ఆశ్రమంలో వున్నారని చెప్పారు. హిరేన్ ఎంతో ఎదిగాడనీ, ఏదో మంచి స్థితిలోకి వొచ్చాడనీ చెప్పారు. ఎంత సంతోషమయిందో షౌకి ఆ మాట వినేసరికి.

## 12

ఒకరోజు మెక్కే అనే అమెని భజనకి తన వెంట తీసుకు వొచ్చింది అమ్మ. భజన మొదలు పెట్టగానే చెవుల్లో వేళ్ళు పెట్టుకుని మెక్కే బైటికి పరిగెత్తింది. ఇన్ని దేశాలవారు వచ్చారు భజనలు వింటున్నారు కానీ ఇలా భజన చెవులకి గిట్టకుండా పోయింది ఒక మెక్కేకే. ఈవిడ చలంగారింటి ఎదురుగుండా 'విశ్వాసం' (Faith) లో చేరింది. భగవాన్ సమాధి దగ్గరకి వెళ్ళేవాళ్ళని పని పెట్టుకుని తిట్టేది. మీ కేమన్నా పిచ్చా? చచ్చిపోయిన వాడి grave దగ్గర కూచుంటున్నారేమిటి? మీ కేమయింది?" అని అడిగేది. మెక్కేకి world war అప్పుడు బ్రెయిన్ దెబ్బతింది. ఇంక ఆవిడ చీట్లు రాసి చలంగారు వాళ్ళకి పంపించేది. మీ కేమి పనిలేదా? రాత్రంతా అట్లా గోల పెడుతూ అరుస్తారు. అ జుట్టు విరబోసుకున్న leader వుండే ఆమెని ఎప్పుడో అప్పుడు shoot చేస్తా నని" చీట్లు రాసేది. "ఆ హార్మోనియం వాయించేవాడిని చావ బాదుతాను, వాడు మరీ గోల" అని రాసేది. ఆమెకి నర్తకి, అమ్మ అంటే చాలా ఇష్టం. సారంగపాణి ఆమె ఇంటికి వెళ్ళేవాడు. ఆమె ఇంటికి సారంగపాణి వెళ్ళినప్పుడు చలంగారు వాళ్ళు " Self advertising people ఇదీ అదీ" అని complain చేసేది. భజనంతసేపూ ఆమె తన బాత్‌రూంలో దూరి తలుపులు మూసుకునేది. "భజన చివర శ్రీరమణ సద్గురు మహరాజ్‌కీ జై అనంగానే నా ప్రాణం లేచి వస్తుంది భజన ఐపోయింది కదా అని" అని చెప్పేది

ఒకసారి సారంగపాణి ఆమె దగ్గరకి వెళ్ళినప్పుడు ఇంట్లో అటూ ఇటూ పచార్లు చేస్తూ "హరే రాం, హరే రాం" అని పాడుతోం దట. అప్పుడు సారంగపాణి "ఏమిటమ్మా భజన్లు, గిజన్లు అని గోలపెట్టి నువ్వే పాడు తున్నావ్ ?" అని అన్నా రామెతో.

"ఏమి చెయ్యను 24 గంటలు ఆ భజన్లే నా చెవుల్లో మారు మోగు తోంటే ఏం చెయ్యను ?" అన్నదట.

బసవరాజుగారు 'సేవా' లో వుండేవారు ఆ రోజుల్లో. ఒక రోజు ఆయన తన ఇంట్లో భజన చెయ్యమని షా వాళ్ళని అడిగారు. ఆ ఇంటి వరండాలో షా వాళ్ళంతా కూచుని భజనలు చేస్తున్నారు. 'సేవా'కి 'విశ్వాసాని'కి మధ్య రాతిగోడ విరగగొట్టి ఏర్పరచిన దారి వుండేది. సేవాలో భజన ఆరంభం కాగానే మెక్కే తన ఇంటిలో నించి పరిగెత్తుకొని వచ్చింది. చేతిలో పిస్టల్ పట్టుకుని భజన చేసేచోట ఎదురుగుండా వొచ్చి నించుంది. మంచి వాళ్ళయితే ఏ గొడవా లేదు కానీ ఆమె పిచ్చిది. ఆ పిస్టల్‌తో ఏం చేస్తుందో ఎవరికీ తెలియదు. షా వాళ్ళు ఏమీ మాటలాడకుండా భజన చేస్తూనే వున్నారు. ఆమె పిస్టల్ పట్టుకుని షా వైపు చూస్తూ చాలాసేపు నిలబడే వుంది. కాసేపటికి గిర్రున వెనక్కి తిరిగి ఇంట్లోకి పరిగెత్తింది.

నర్తకికి, ఆమెకి స్నేహం. ఆమె వూరికి వెళ్ళిపోతోంది. మనుషు లంటే ఆమెకి తగని ద్వేషం. కాని ఎక్కడన్నా కుక్కలు కనబడితే చాలు "వీటి క్షేమం మనం చూడాలి" అని టీస్టాల్స్‌లో ఫల హారాలు కొని కుక్కలకి తినిపించేది. ఆమె శునకప్రేమికురాలు. కనకే ఆమె మీద నర్తకికి ఇష్టం. ఆవిడ వూరికి వెడుతూ "మీరిన్ని దానాలు, ధర్మాలు చేస్తారు కదా- ఒక దిక్కులేని కుక్క దాని పిల్లలు వున్నాయి. ఆ కుక్క పెద్ద పుండుతో బాధ పడుతోంది. దాని కింత

అన్నం వెయ్యండి చాలు" అని చెప్పి వెళ్ళింది. కుక్కకి అన్నం పె డమేం భాగ్యం ? నర్సు కి అలాగే దానికి తిండి పెట్టడం మొదలు పె ంది. ఇంక ఆ కుక్క పిల్లలతో సహా వొచ్చి ఇంట్లోనే తిష్ఠ వే ంది. ఇంటిని ఎంతో చీదరచేసి పెట్టేవి, ఆ కుక్క దాని పిల్లలు. అవన్నీ నర్సు కి శుభ్రం చేస్తూనే వుండేది. కుక్కపుండు వాసన భరించ లేనంత అసహ్యంగా వుండేది. ఇది కాక ఆ కుక్క బైట నానా ఛండాలం తిని వొచ్చి నట్టింట్లో కక్కేది. చివరికి ఆ కుక్కని భరించ లేక వెళ్ళగొట్టెయ్యాల్సి వొచ్చింది.

మెక్కే వెడుతూ వెడుతూ తన సామానంతా 'సేవా' లో పెట్టు కుంది. ఆవిడ వెళ్ళిపోతూ రోజ్ అనే ఆయనకి వుత్తరం రాసింది — "నా సామానంతా భద్రంగా వుందో, లేదో చూడండి. వెంకటచలం దొంగిలించకండా జాగ్రత్తగా చూసుకోండి" అని, అందరికీ ఆవిడ ఉత్తరం చూసి ఒకటే నవ్వు వొచ్చింది,

మెర్‌స్టన్ మెక్కేని తన wing కింద తీసుకుంది. "ఈవిడ సంగతి మీకు తెలియదు, పోయిన war లో కష్టాలుపడి ఆవిడ మనసు పాడయి పోయింది. సరైన ప్రేమ, దయ చూపితే మారుతుంది. ఆవిడ హృదయం బంగారం" అన్నదట. ఆ సంగతి చలంగారికి చెప్పి చాడ్విక్ ఒకటే నవ్వు. మెక్కే రాజయ్యర్ మీదికి నిష్కారణంగా పోలీసుల్ని తీసుకురావడం మొదలు పెట్టింది. దాంతో మెర్‌స్టన్ ఆమెని తన wing లోంచి తీసేసుకుంది.

రోజూ పొద్దుటిపూట హిరేన్ హార్మోనియం మీద సంగీతసాధన చేసుకునే వాడు, సాధారణంగా బాగా ఆలస్యంగా లేచి సాధన చేసే వాడు. మనుషుల సందడివలన మెక్కేకి అది వినబడేది కాదు. ఒక రోజు తెల్లవారగట్ట హిరేన్ సంగీతసాధన మొదలు పెట్టాడు. అది

విని మెక్కే చేతికర్ర పట్టుకుని సరాసరి చలంగారింటివైపు బయల్దేరింది; ఆ సంగీతం చలంగారింటిలోంచే వొస్తోంది అనుకొని, ఆవిడ రాక చూసిన హిరేన్ దబ్బున తన ఇంటి తలుపులన్నీ మూసేసుకుని లోపల దాక్కున్నాడు. ఆవిడ చలంగారింటి ముందు కొచ్చి "మీకేమన్నా వెఱ్ఱా. పొద్దున్నే గ్రామఫోను సంగీతం ఎవరన్నా వింటారా?" అని గట్టిగా అరిచి వెళ్ళిపోయింది. ఆ తరువాత ఆమె కోటగిరికి వెళ్ళిపోయింది.

కనకమ్మగారు వుపాధ్యాయిని. చలం కుటుంబం బెజవాడలో వున్న రోజులలోనే వారిని చూడటానికి వెంకటనారాయణగారనే టీచర్‌తో కలిసి వొచ్చారు. 1949వ సం॥లో వెంకటనారాయణగారితో కలిసి ఆమె భగవాన్ దర్శనం చేసుకున్నారు. వారితో కలిసి నర్తకి భగవాన్‌ని చూచి వొచ్చింది. భగవాన్ చివరి రోజుల్లో చలంగారు అరుణాచలంలో స్థిరపడడానికి వొచ్చిన కొత్తలో కనకమ్మగారు వారిని చూడటానికి వొచ్చారు. ఆమె ఎప్పటి నించో నర్తకికి వుత్తరాలు రాస్తూ వుండేవారు.

ఆమె ఒక వుత్తరంలో తాను విపరీతమైన తల నెప్పులతో బాధ పడుతున్నామని నర్తకికి రాశారు. "ఈశ్వరుడ్ని మీరు విశ్వసిస్తే మీ తలనెప్పుల్ని కుదురుస్తారని" ఆమెకి జవాబు రాసింది నర్తకి. "ఈశ్వరు డేమిటి, తలనెప్పుల్ని కుదర్చడ మేమిటి?" అన్నట్లు హేళనగా వుత్తరం రాశా రామె.

ఈశ్వరుడు ఏదో జవాబు రాయించారు. ఈశ్వరుడు రాయించిన వుత్తరాన్ని చూసి వాళ్ళవాళ్ళు ఆమెని కోప్పడ్డారు "నువ్వింత హేళనగా తేలికగా రాస్తావా?" అని. ఆ తరువాత ఏం జరిగిందోకాని కనకమ్మ

గారికి ఆ వుత్తరంతో ఈశ్వరుడంటే చాలా గురి కుదిరింది. ఆమెకి శెలవులు దొరకగానే అరుణాచలం వచ్చారు.

ఈశ్వరుడు ఆమెచేత యోగాసనాలు మొదలు పెట్టించారు. తలకి మధ్యాహ్నం పూట పెరుగు అంటుకోమన్నారు. ఈ వైద్యంతో ఆమె తలనెప్పులు కుదిరాయి. (ఈశ్వరుడి దగ్గర తలనెప్పులు కుదుర్చుకోవడానికి వచ్చిన వారెవరికీ ఒకటే వైద్యం కాదు. ఒక్కొక్కరికి ఒక్కొక్క వైద్యం చెప్పి చేయించేవారు)

ఆనాటి నించి కనకమ్మగారు ఈశ్వరుడ్ని ఎన్నడూ వదలలేదు. ఏ ఆటంకాలు లేకపోతే వేసవి శెలవుల్లో ప్రతీ సంవత్సరం తప్పకుండా ఈశ్వర సాన్నిధ్యానికి అరుణాచలం వస్తూనే వున్నారు. ఆమెకి ఈశ్వరుడి పట్ల చాలా గట్టి విశ్వాసం కుదిరింది. ఆమె ఇక్కడికి వచ్చినప్పుడల్లా డాలీతో, డాలీ (చుట్టూతావున్న) స్నేహితులతో అల్లర్లు చేస్తూ, డ్యాన్సులు చేస్తూ పాటలు పాడుతూ చిన్నపిల్లలాగ అయిపోయేవారు.

మళ్ళీ కొన్నేళ్ళకి కనకమ్మగారికి జబ్బు చేసింది. ఈ జబ్బు విషయం పూర్తిగా వింటే ఈశ్వరుడు ఆమెలో విశ్వాసాన్ని పరీక్షించి దృఢం చేశారు అనిపిస్తుంది.

ఈశ్వరుడి నించి విభూతి అందినా కూడా ఆమెకి జబ్బు కుదరలేదు. పాపం ఆమె చలం కుటుంబంలో ఒకరిగా మసులుతూ వుండేవారు. అందుకని ఇంటిల్లిపాదికీ ఆవిడంటే ఎంతో ఇష్టం. కనకమ్మగారెట్లా వున్నారోనని అందరూ దిగులు పడ్డారు. కనకమ్మగారికి పెళ్ళికాలేదు. ఒంటరిగా వున్నారు. అందువలన ఆమెగురించి అందరూ ఎక్కువగా ఆదుర్దా పడ్డారు.

ఇంతలో కనకమ్మగారు వుత్తరం రాశారు. ఆ వుత్తరంలో మొదటి వాక్యం "నేను సుఖంగా వున్నాను" అన్నదే. జరిగిన సంగ

తిని ఆమె తనవుత్తరంలో వివరించారు. తాను పడుకుని వుండగా ఒకరు తలుపు కొట్టారనీ, తాను తలుపు తీసేసరికి ఒక ముసలాయన నుంచుని వున్నారు. ఆయనను ఇంతకి మునుపు ఆమె ఎప్పుడూ చూడ లేదు. ఆయన "బెజవాడలో ఒక పెద్దాయన, ఆయన పక్కన తెల్లని బట్టలు కట్టుకుని జుట్టు విరబోసుకుని వున్న ఒకామె కనిపించా రమ్మా. ఫలానిచోట కనకమ్మగారనే టీచరు చాలా జబ్బుగా వున్నారు. మీరు ఈ మందు తీసుకునివెళ్ళి ఆమె కివ్వండి అని చెప్పారమ్మా, అందు వల్ల ఆమందు తెచ్చాను" అని చెప్పి తనకి మందు ఇచ్చి వెళ్ళిపోయా రట. ఆ మందు వేసుకున్నాక లోపలినించి ఎంతో హాయిగా వుందని తెలిపా రామె. ఆ తరువాత ఆ తాత తాను జయంతి చేసినప్పుడు వచ్చారనీ, ఫలాని రోజు వచ్చారనీ కనకమ్మగారు పుత్తరాలు రాస్తూ వుండేవారు.

తాను జీసస్ జీవితం చదివినప్పుడు, ఆపుస్తకం చదువు తున్నంతసేపూ ఆమెకి జీసస్ పుట్టినప్పటి నించీ, ఆ జీవితంలో తానొక భాగస్తురాలై, సాక్షిగా చూస్తూన్న ట్లనిపించిందని వుత్తరం రాశారామె.

"లాలించే వేళ తల్లిలా - మొర లాలించే వేళ పరాత్పరిగా- పాలించే వేళ విరాట్రూపిణిగా ఆమె కనిపిస్తారు. ఈ ప్రపంచంలో ఆమెకి ప్రేమతప్ప ఏ అనుబంధమూ లేదు. ఎవరినించీ ఆమె కేమీ అక్కరలేదు. అందరూ ఒకటే ఆమె దృష్టిలో - - - - ఆస్తిపాస్తులు, ఐశ్వర్యాలూ ఏవీ ఇవ్వలేని గొప్ప ఆత్మశాంతి ఆమెని తలుచుకున్నంత మాత్రంలోనే లభ్య మౌతుంది. ఆమె చల్లని చూపు సోకిన మేర కోటిస్వర్గాలు వెల్లి విరుస్తాయి" అని అంటారు కనకమ్మగారు షౌని గూర్చి.

డివోషన్‌లో వుండగా చలంగారు వాళ్ళు పౌర్ణమి రోజున అడవిలో వున్న, విఘ్నేశ్వరాలయానికి వెళ్ళి- భజనచేసి పిక్‌నిక్ చేసు

కోవాలని సరదా పడ్డారు. చలంగారు అప్పుడు varicose veins తో బాధ పడుతున్నారు. ఐనా మొత్తానికి పిక్‌నిక్‌కి బయలు దేరారు. ఓ బండిలో ముందుగానే తయారుచేసి వుంచిన చక్కెర పొంగలి, దధ్యోదనం పెట్టుకున్నారు. చలంగారు బసవరాజుగారి సైకిల్ వెనక కూచున్నారు. ఆశ్రమం వారినందరినీ, ఆ పిక్‌నిక్‌కి పిలిచారు చలం. ఆశ్రమంలో ఒక్క పిట్ట మిగలకుండా అందరూ ఆ భజనకి వొచ్చారు.

బోస్, మా తల్యార్‌ఖాన్, మెర్‌స్టన్, రోజ్, చాడ్విక్, సుందరేశయ్యర్, రామస్వామి అయ్యర్ ప్రభృతులందరూ వొచ్చారు. సూర్యాస్తమయ సమయానికి గణేశాలయ మండపం చేరుకున్నారు. ఆ ప్రదేశమంతా నిరామయంగా, నిర్జనంగా, నిశ్చలంగా వుంది. అక్కడ మండపంలో భజన చేయడం ఆరంభించారు. కొంతసేపటికి కొండ వెనకాలనించి చంద్రోదయమైంది. ఎదురుగుండా వున్న కొలనులో వెన్నెల ప్రతిఫలిస్తోంది. క్రిందంతా నల్లని చెట్లనీడ, కొండమీద, మండపంమీద మాత్రం పాలవెన్నెల. కొలను నీటిలో మేలిమిబంగారు వెన్నెల. కొలను చుట్టూరా చెట్ల నల్లని నీడలు. ఆ వెన్నెట్లో భజన ఎంత గొప్పగా వుందో. ఎదురుగుండా నిరామయంగా అరుణాచలం-శిఖల కొసలకి ఎగబాకే వెన్నెల .... వెన్నెల వెంటనంటే లయాన్విత సంగీతం. అది కాముని పున్నమి.

ఆ వెన్నెట్లో గణపతికి చక్రపొంగలి, దధ్యోదనం ఆరగింపు చేసి ఆ ప్రసాదాలనందరూ ఆలయం మెట్లమీద కూచుని ఆరగించారు. మళ్ళీ ఇళ్ళకి బయలు దేరారు. చలంగారు సైకిల్ వెనక ఎక్కారు. ఈ లోగా వూరివైపుకి వెడుతున్న బస్సొకటి వొచ్చింది. చలంగారు, నర్తకి, నడవలేని వారందరూ ఆ బస్సెక్కి వెళ్ళి పోయారు,

షా, సుందరేశయ్యర్ మొదలైనవారు వెన్నెట్లో నడుస్తూ బయలు దేరారు. సుందరేశయ్యర్ 'అక్షరమణిమాల' పాడుకుంటూ బయలు దేరారు. ఆయన చివర అరుణాచలా అనే సరికీ అందరూ కోరస్‌గా అరుణాచల శివ అని పాడేవారు. ఆ విధంగా ఎంతో వుత్సాహంగా ఇంటికి చేరుకున్నారు.

చాడ్విక్ ప్రభృతులకి తమకి కూచునేందుకు సరైన జాగాలు దొరక లేదని కోపాలు వచ్చాయి. చలంగారు వాళ్ళకి సమూహంగా వెళ్ళాలని సరదాయేగాని వీళ్ళెక్కువ వాళ్ళు తక్కువ అన్న ఆలోచన వాళ్ళకి ఎన్నడూ లేదు. పెద్ద లనబడే వాళ్ళు ఎన్నో లోపాలు చూచి— ఎందుకులే అని పిక్నిక్‌లు మానేసు కున్నారు.

చిత్ర తన భర్త దగ్గిరకి వెడతా నని షాతో చెప్పింది. డాలీకి చిత్ర పుటక గురించి చెప్పకండా వుండడం మంచిది కాదనిపించింది షాకి. ఈశ్వరుడు తప్పకుండా ఆ అమ్మాయికి స్పష్టం చేయండి అని చెప్పారు. డాలీ తండ్రి ఫలాని చోట వున్నాడనికూడా డాలీకి చెప్పడం జరిగింది.

డాలీని పిలిపించి షా ఆమెకి విషయ మంతా స్పష్టం చేశారు. "చిత్ర తనభర్త దగ్గరకి వెడుతోంది. నువ్వుంటావా? వెడతావా?" అని అడిగారు.

"ఎందుకే నువ్వు మొగుడి దగ్గరకి వెళ్ళడం. ఇక్కడ హాయిగా వుండలేవు?" అని చిత్రని అడిగేది డాలీ. "అసలు వాడి నెందుకు పెళ్ళి చేసుకున్నావే?" అని చిత్రని నిలవేసేది.

డాలీ తండ్రి డాలీకి వుత్తరం రాశాడు. అప్పుడు డాలీ "నాన్నా నువ్వు డబ్బుమీద ఆశ పెట్టుకో వద్దు" అని వుత్తరం రాసింది.

చిత్ర "నాతోకూడా నువ్వూ వస్తావా?" అని డాలీని అడిగింది.

"నాకు అమ్మా, నాన్నా లేరే. మా అమ్మా, నాన్నా ఈశ్వరుడే" అని జవాబు చెప్పింది డాలీ. ఇంక చిత్ర ప్రయాణానికి సిద్ధం అయినప్పుడు-

"ఏం డాలీ! వుంటున్నావా? వెడుతున్నావా?" అని అడిగారు షా.

"నాకు జూకాలు చేయిస్తే వుంటాను" అంది డాలీ.

"డాలీ, నేనేమి నిన్ను వుండ మనటల్లేదు. మీ అమ్మతో వెళ్ళాలని వుంటే వెళ్ళు. నా అభ్యంతరం లేదు" అన్నారు షా.

"ఇక్కడే వుంటాను. చిత్రతో వెళ్ళను" అంది డాలీ.

చిత్ర ప్రయాణానికి సిద్ధమై పోయింది. వెళ్ళే ముందర దిగులు బరువుతో ఒకటే ఏడ్చింది చిత్ర. అరవంలో తన స్నేహితులకి "భర్త దగ్గరకి వెడుతున్న పెళ్ళాం ఏడుస్తోంది చూడండే (వీటి కారు కిట్ట పోర పొండాటి అళువదు పారుంగో)" అని చెబుతూ, నవ్వుతూ గంతులు వేసింది డాలీ.

"చిత్ర వెడుతూ వుండగా నన్నూ డాలీ ఏమీ కదల లేదు. కులాసాగా ఆడుకుంటో, వెళ్ళి రమ్మంది. నాతో మాత్రం "ఒక ఏడాది తరవాత నువ్వెళ్ళి చిత్రని తీసుకు రావాలి" అంది. చిత్ర వెళ్ళాక రెండువేళ్ళు బాగా గాయాలు చేసుకుంది. నెమ్మళించాయి. ఇప్పుడు ఎంతో బుద్ధిమంతురాలు డాలీ. మీరీసారి వొచ్చినప్పుడు గుర్తుపట్టరు." (శాస్త్రిగారికి చలంగారి లేఖ 29-8-55)

చిత్ర జట్కాలో వెడుతోంటే జట్కా మలుపు తిరిగే వరకు గంతులు వేస్తూ తరువాత ఇంట్లోకి వొచ్చేసింది. ఏ బెంగా చూపించకుండా చిత్ర వున్నట్టే తిరుగు తోంది. కానీ రాత్రుళ్ళుమాత్రం తనలో తాను చిత్రకోసం ఏడుస్తూనే వుండేది. చిత్ర కావా లనిగాని, తాను

చిత్ర దగ్గరకి వెడతా ననిగాని ఎన్నడూ అనలేదు డాలీ. ఇంక పూర్తిగా డాలీని తానే తల్లయి నర్సకే పెంచింది.

కొందరు భజన్లలో బాగా న్యూసెన్స్ కావడమూ, పగలుకూడా వొచ్చి కూచోవడమూ, ఇట్లాంటివి చేసేవారు. చలంగారు వాళ్ళని నెట్టి వెయ్యడమో ఏదో జరిగేది. సారంగపాణి, గంగాధరం "షా మాకు పర్మిషన్ ఇచ్చేయండి. వాళ్ళని సున్నంలోకి ఎముకలు లేకండా చితక గొడతాం" అనేవారు. షా ఒప్పుకోక పోతే - "వీళ్ళ ఈ న్యూసెన్స్ అంతా భరిస్తారుగాని తన్నడానికి ఒప్పుకోరేం ?" అని తమలో తాము అనుకునే వారు. కాని ఎప్పుడూ షా నోటిమాటని జవదాటేవారు కారు వాళ్ళిద్దరూ.

ఒకసారి శాస్త్రిగారు వొచ్చినప్పుడు చలంగారు ఈ గొడవలన్నీ చెప్పారు ఆయనకి. చలంగారు వాళ్ళింటి గుమ్మంమీద శబరి రక్షగా పెట్టిన ముళ్ళకట్ట ఒకటి వుండేది. అది తీసుకుని శాస్త్రిగారు "ఇది జోగ్ శక్తి, ఏం చేస్తానో చూసుకోండి !" అని దాన్ని ఆయుధంగా పెట్టు కున్నారు భజనలో. ఇంక ఆ న్యూసెన్స్ అయిన మనిషిని బయటికి తీసుకుపోయి "ఏమిటనుకుని ఇక్కడికి వొస్తున్నావు" అని బెదిరించారు. ఆ మనిషి శాస్త్రిగారి బెదిరింపులకు బెదరలేదు. అలాగే భజన్లోకి వొచ్చి కూచుంటూనే వున్నాడు. ఇంక శాస్త్రిగారు ఆ మనిషి గుమ్మంలో అడుగు పెట్టగానే "హలో మైడియర్ యంగ్ హజ్‌బెండ్" అని చివాల్న పెనవేసుకుని బయటికి వెళ్ళిపోయే వారు. అతన్ని అక్కడ ఏంచేసేవారో కాని అతను రావడం తగ్గించేసు కున్నాడు.

చలంగారు వాళ్ళని చూడటానికి చిత్ర, శ్రీ వచ్చారు. డాలీ తండ్రిని సహించలేదు, తల్లి అతనితో వుందని కోపం. తనకీ తల్లి కావాలి. తండ్రి తెలియడు. ఆ తండ్రి కోసమేగదా తల్లి తనను వదలి

వెళ్ళిపోయిందని బాధ పడేది. తనలో తను ఎంత Struggle అయిందో డాలీ. తరువాత చిత్ర, శ్రీ వెళ్ళిపోయారు.

శర్మగారు వచ్చినప్పటినించి westerners ముఖ్యంగా జర్మను వాళ్ళు, ఆయన చెప్పడం వలననో ఏమో చలంగారు వాళ్ళని చూడటానికి ఎక్కువగా వచ్చేవారు. భజనలకి అన్ని జాతులవారు చేరుకునేవారు. దగ్గర దగ్గర భజన అంతర్జాతీయ (International) భజనగా రూపొందింది. భజనలలో రష్యన్‌లో, ఫ్రెంచిలో, లాటిన్‌లో పాడుతూ వుండేవారు. కొందరు Flute (వేణువు) వాయించేవారు. అప్పట్లో భజన లెంత గొప్పగా వుండేవో!

స్త్రీలు పురుషులు ఎంత అందమైన వారు వచ్చేవారో! ఒక్కొక్కరి ముఖాలు కాంతితో వెలిగిపోతూ వుండేవి. ఇంక చలంగారింట్లో భజనలకి వచ్చే విదేశీయుల సంఖ్య నానాటికి ఎక్కువ అయిపోతుందని - - - - "మీరు భజనలకి అక్కడికి వెళ్ళకూడ" దని తమ ఆశ్రమానికి వచ్చే దేశ విదేశీయులని ఆశ్రమంవారు ఆంక్ష పెట్టారు. అక్కడినించి భజనకి వచ్చే విదేశీయుల సంఖ్య క్రమ క్రమంగా తగ్గిపోయింది. మొట్టమొదట వాళ్ళ కోసం దిగులుపడి ఆశ్రమంవారు ఎందుకిట్లాంటి పని చేస్తున్నారు? అనిపించింది షౌకి. తరువాత్తరువాత ఎంతమంచి పని జరుగు తోందో నని సంతోషం వేసింది. చివరికి తమ మేలుకోసమే భగవాన్ వారిచే ఇట్లా చేయిస్తున్నారని షౌకి స్పష్టంగా తెలిసిపోయింది. ఎందుకంటే ఇదంతా విస్తీర్ణం కావడం షౌకి ఇష్టం వుండేది కాదు.

ఇంతలో చిత్ర కడుపుతూ కాన్పుకని వచ్చింది. అప్పుడు చిత్రా వాళ్ళు ఖమ్మంమెట్టులో వున్నారు. "కాన్పుకి ఖమ్మంమెట్టు వెళ్ళు" అన్నారు చిత్రతో ఈశ్వరుడు. చిత్ర ఎంతో నొచ్చుకుంది. డాలీ

వొొయ్యి చేతుల్లో పుట్టింది. ఈ కాన్పుకూడా ఇక్కడ చేసుకోవా లని చిత్రకి ఆశ. చిత్ర ఖమ్మంమెట్టు వెళ్ళిపోయింది. తరువాత షౌ వాళ్ళకి తెలిసింది. ఆస్పత్రిలో చిత్రకి కాన్పు కష్టం అయిందనీ, డాక్టర్లు పొట్టకోసి పిల్లని తియ్యాలని అన్నారనీ ఆమెచేత భర్త చేత సంతకాలు చేయించు కున్నారనీ- అప్పుడు చిత్ర తన లోపల 'భగవాన్' అని అనుకుందట. వెంటనే నెప్పులు ప్రారంభమై తేలికగా ఏ ఆపరేషన్ లేకండానే ప్రసవించిం దట. కూతురు పుట్టిందని చలంగారికి టెలి గ్రామ్ వచ్చింది.

సీత చలంగారికి వుత్తరాలు రాసేది. ఆ రోజుల్లోనే ఆ అమ్మా యిని ఆమె తల్లి తమ చేతుల్లో అప్ప జెప్పినట్లు షౌకి కల వచ్చింది. షౌకే కాకండా అమ్మాయి తల్లికి కూడా అదేకల వచ్చింది -తాను షౌకి సీతని అప్పగించు తున్నట్లుగా. అప్పటినించి వాళ్ళవాళ్ళు గోలపడడం ఆరంభించారు. "మా అమ్మాయికూడా సన్యాసిని అయి పోతుందా?" అని,

"సీత- అనే అమ్మాయి సౌరిస్‌కి భక్తురాలు. ఏడాదిపైన అయింది. ఇక్కడికి వొొచ్చి. వొొచ్చి రెండు రోజులు వుండి వెళ్ళి "నే నెరి గిన సౌరిస్" అనే వ్యాసం రాసింది.

అది 'తెలుగు విద్యార్థి'లో ప్రకటిత మయింది. చాలా కాలం కిందట. (26-6-58 ప్రసాద్‌కి చలంగారి లేఖ)

"సీతకి వయస్సు 20-25 మధ్య అనుకుంటాను. ఆమెకి పెళ్ళ యింది. S.S.L.C: అయిం దనుకుంటాను. స్కూల్లోనూ, బైటా మొత్తానికి ఓ వ్యక్తి కింద impress చేసి తన ప్రయత్నం లేకండానే prominence లోకి వచ్చే personality"

(8-7-58 ప్రసాద్‌కి చలంగారి లేఖ)

"నాలుగైదు ఏళ్ళ కిందట వరసగా సౌరిస్‌కి ఉత్తరాలు రాసింది. ఆ వుత్తరాలు ఉంచినట్టయితే నువ్వు చాలా **enjoy** చేసేవాడివి. **So very clever and intellectual.** కాని అవే ఈ ఆధ్యాత్మికానికి ముఖ్యమైన ఈ యుగపు ఆటంకాలు. చాలా వోపికతో జవాబు రాయించారు ఈశ్వరుడు. అప్పటికీ మొండివాదన పెట్టుకుంది. చివరికి నేను **''Don't waste your time and my time. Wait and leave it''** అని రాశాను. కొన్నాళ్ళకి మళ్ళీ రాసింది. ఇక్కడికి రావాలనే తన ప్రయత్నాలు ఎట్లా విఫలమైనాయో! ఆమె కుటుంబం- అత్తవారూ- ప్రసిద్ధి కెక్కినవారు- తమ **blue blood** కి గర్వించే వారు. మంచి లౌకికులు.

ఒక ఉదయం ఓ **beggar girl** లాగు ఈమె వొచ్చి "సౌరిస్ మీరేనా?" అని ఏడుస్తో సౌరిస్ వొళ్ళో పడిపోయింది. "ఇంక మీ నించి పంపెయ్యకండి" అని యేడ్చింది. "వెళ్ళ నక్కర్లేదు"అన్నాను నేను. అనవసరంగా - కథ - వాళ్ళ వాళ్ళని తప్పించుకుని, చేతికి దొరికిన డబ్బుతో, కట్టుబట్టలతో రైలెక్కింది. తిండికి డబ్బు లేదు. రెండు రోజులు మాడి, బండికి డబ్బులేక, మండు టెండలో నడిచి పడిపోయింది. గారాబంతో పెరిగిన పిల్ల. ఆ అమ్మాయి వచ్చాక అక్కడ యేం జరిగిందో యేమో, తరువాత **reconstruct** చేసు కున్నాము. చలం దగ్గిరకి వెళ్ళిందని తెలీగానే పెద్ద యేడుపులు. చలం దగ్గిరకి వెళ్ళిన ఆడపిల్ల కాటికి వెళ్ళినట్టే. మనకేం దక్కుతుందని బిగ్గరగా ఏడవడానికి వీల్లేదు, అత్తవారికి తెలిస్తే చలం దగ్గిరకి వెళ్ళిన పిల్లని తమ గడప తొక్కనీరు. వాళ్ళు బైలు దేరారు—— తల్లీ, అన్నా - కానీ అప్పటికే ఆ అమ్మాయిని మాయంచేసి వుంటానని వాళ్ళ నమ్మకం. నా ప్రతాపాలన్నీ బాగా విన్నారు. గుండెలు బాదుకుంటో, బిగ్గరగా యేడ్చుకుంటో వొచ్చారు ఆ తల్లి! చూడాల్సిందే. **Worldliness** అబ

ర్థాలు, మోసాలు- భయాలు, గొప్పలు - ఎన్నో. భజన ఐ మాట్లాడు కుంటో కూచున్నాము. ఏ మెరగనట్టు తమని ఆహ్వానించే కూతుర్ని చూసీ, దాంతో ఏదో మోసం వుందనే వాళ్ళకి.

ఆమెని రమ్మన్నారు, రానంది. వెళ్ళకపోతే పోలీసులు కోర్టు అన్నీ పూర్వం మళ్లే జరిగేవే, ఈశ్వరుడిని అడిగింది ఆ అమ్మాయి "వెళ్ళనా, వుండనా" అని, "నీ ఇష్టం" అన్నారు.

వెళ్ళా లని నిశ్చయించు కుంది.

ఈ వ్యవహార మంతటిలోనూ చలం **out of map**. ఆ అమ్మా యికి చలాన్ని చూస్తే కోపమో, భయమో !

వెళ్ళి పోయారు. (18-7-58 ప్రసాద్‌కి చలం లేఖ)

"సీతని కలుసు కున్నావా ? అవును ఇక్కడ మూడు రోజులు వుంది. నాకు ఆ అమ్మాయికే **vibrations** కుదరలేదు. ఆ అమ్మాయి పూర్తిగా ఈశ్వరుడిది. ఆ పాదాల దగ్గర నేనూ పడి వుండటంచేత నన్ను గుర్తించక తప్పింది కాదు."

(21-12-57, కామేశ్వరికి చలం లేఖ)

సీత వెళ్ళి పోతుంటే ఆమెమీద షా దృష్టి పెట్టారు. ఆ తరు వాత సీత షాకి వుత్తరం రాశారు. తాము రైల్లో కూచుని వుంటే షా తమ పక్కనే కూచుని వున్నారనీ, రైలు కిటికీలోనించి చూస్తే రైలు చక్రాలలో షాయే తిరుగుతున్నారని. తమ అరుణాచల అనుభవాల్ని సీత "నే నెరిగిన సౌరిస్" అన్న పేరిట అక్షరీకరించారు. అదే సౌరిస్‌పై వెలువడ్డ తొలి రచన.

"కేవలం స్వానుభవం వలన మాత్రమే అర్థం చేసుకో గల- అతిలోకమైన ప్రేమ సౌరిస్ ప్రదర్శించ గలరు. ఆ ప్రేమకి లోకంలో ఎక్కడా బంధం లేదు. ఎక్కడా స్వలాభా పక్షపాతా ల్లేవు. ఈశ్వర

సామ్రాజ్యంలోని ప్రతివ్యక్తి ఆమెకి సన్నిహితుడే" అని అంటారు సౌరిస్ గురించి సీత.

"సీతని నే నెప్పుడూ మరిచి పోలేదు" అంటారు షా.

దాదాపు ప్రతి సంవత్సరం షాకి జలుబూ, జ్వరం వొస్తూ వుండేవి. ఆ ఏడు అట్లానే దగ్గు, జలుబూ, జ్వరం వొచ్చాయి. సాధారణంగా ఎంత బాధ వొచ్చినా, ఎలాంటి బాధ వొచ్చినా, షా విభూతి తప్ప ఏ మందూ వాడేవారు కాదు. ఈ మారు జలుబు అతి తీవ్రంగా వొచ్చింది. చాడ్విక్ **tissue medicine** ఇస్తే వేసుకున్నారు. ఆ రోజు నర్తకి డాల్డాతో వంట చేసింది.

షా వాళ్ళింట్లో చిన్నప్పటినించీ వంటకి నెయ్యే వాడేవారు. నూనె జబ్బు చేస్తుందని. నూనె వాడకమే వారికి తెలియదు. ఇంక యుద్ధపు రోజుల్లో నెయ్యి ఖరీదు విపరీతంగా పెరిగి పోయింది. వంటలో పూర్తిగా నూనె వాడటానికి భయపడి ఇంట్లోవాళ్ళు అప్పుడే కొత్తగా వొస్తున్న డాల్డాని వాడటం మొదలు పెట్టారు. ఆ తరువాత నించి షా వాళ్ళ ఒళ్ళు బలహీనం కావడం, నీరసం చేయడం, ఆకలి లేకపోవడం ఈ డాల్డా వల్లనే. తిరువన్నామలైలో కూడా డాల్డానే వాడుతున్నారు. ఈశ్వరుడు రాంగానే ముందర ఆ డాల్డా డబ్బా అవతల పారెయ్య మన్నారు. "డాల్డా ఎంత హానికరమో మీకు తెలియదు. ఇది మనుషుల ఆరోగ్యాన్ని పీల్చి పిప్పిచేసి పారేస్తుంది" అన్నారు.

చాడ్విక్‌కి నారాయణయ్యర్ ఇంట్లో వుండగా ప్రాణం మీదకి వచ్చింది. తరువాత ఒకసారి చలంగారు కనిపించినప్పుడు ఆయన అన్నారట. "చలం నా ప్రాణం మీదకి తెచ్చింది ఏదోతెలుసా? డాల్డా." అని.

ఈశ్వరుడు ఆ తరువాత కొబ్బరినూనెనీ, చివరికి వేరుశనగ నూనెనీ వంటలకి వాడమన్నారు. "నువ్వు ఎన్నడూ, డాల్డా వంటల్లో వాడవద్దు" అని నర్తకికి ఈశ్వరుడు గట్టిగా చెప్పారు. కానీ నర్తకి ఎవరో ఇచ్చారని డాల్డా వంటలో వాడింది. అదే షా ఆరోగ్యంమీద చాలా గట్టిదెబ్బ తీసింది.

చాడ్విక్ ఇచ్చిన మందు షా వంట్లో తడినంతా పీల్చేసింది. డాల్డావల్ల కఫం చేరింది. అది సాయంత్రానికి పెద్ద స్పాజమ్స్ (Spasms) తో వచ్చింది. ఊపిరి తిత్తులు పుండులా అయి పోయాయి. ఇంక ఏమిచేసినా తగ్గటల్లేదు.

**Govt. Doctor** ని పిలిచారు. ఆయన వచ్చి షాని పరీక్షచేసి "ఇలాంటి **attack** ఎప్పు డయినా వచ్చిందా?" అని అడిగారు. ఇదే మొద లన్నారు చలంగారు. ఆ డాక్టర్ ఇది ఆస్త్మా ఎటాక్ అని ఒక **injection** ఇచ్చారు. "ఈవిడ వెంటనే **Treatment** తీసుకోకపోతే ఇది క్రానిక్ అవుతుంది. ఒక **Course of injections** తీసుకోవాలి" అని చెప్పి మందు పంపిస్తానని వెళ్ళారు. చలంగారు దిగాలు పడిపో యారు. "ఈశ్వరు డుండిగూడా నీ కింత జబ్బు తెప్పించారా" అన్నారు నీరసంగా, అక్కడే వున్న కె. నాగేశ్వరరావుగారు "ఆమె ఈశ్వరుడు గదా, ఆస్త్మా ఆమె నేంచేస్తుంది" అన్నారు. అప్పుడు ఈశ్వ రుడు "నువ్వేం బెంగ పడకు. మళ్ళీ ఇట్లాంటి ఎటాక్ ఎప్పుడూ రాదు" అని చలంగారికి చెప్పారు. రెండు మూడు రోజులు షా పక్కమీద వుండాల్సి వచ్చింది.

ఈలోగా ఆగష్టు 15 వచ్చింది. చిత్తూరు జిల్లా అధికారి ఒకరు చలంగారు వాళ్ళని చూడటానికని వచ్చారు. ఈశ్వరావతరణ రోజు. పొద్దున్నకూడ షా పక్కమీదే వున్నారు. కానీ ఆ సమయానికి యథా

విధిగా భజన జరిగింది. షౌకి కంఠం మామూలుగా రాలేదు. భజనలో హీనస్వరంలోనే పాడారు. ఆ రాత్రి ఆ జిల్లా అధికారికి నిద్రపోయి మెలకువ వచ్చినప్పుడు భజనలో పాడిన పాటలన్నీ మళ్ళీ వినబడ్డాయట ఆయన చెవులకి.

"ఏమిటి అర్ధరాత్రి లేచి మళ్ళీ పాడు తున్నారా?" అని ఆశ్చర్య పోయారట. ప్రొద్దున్నే ఆయన షౌ దగ్గరకి వచ్చి "ఇట్లా జరిగింది దీని కర్థం ఏమిటి?" అని అడిగారు "నేనేం చెప్పగలను? సాధారణంగా అట్లాంటివి ఇక్కడ జరుగుతూ వుంటా య"న్నారు షౌ.

ఆయన తనతో ఒక జాడీలో వంకాయ చింతకాయ కలిసిన, వెల్లుల్లి తిరగమోత వేసిన పచ్చడిని తీసుకు వచ్చారు. ఆ పచ్చడి తినడంతో షౌకి కఫం తగ్గడం మొదలు పెట్టింది. అప్పటినించి రోజూ ఆపచ్చడి తినేవారు షౌ. తరువాత ఈశ్వరుడు మూసివున్న షౌ గది తలుపులన్నీ తెరిపించేశారు. అంత వరకూ బైటకి కదలని షౌని ఈశ్వరుడు షికార్లకి వెళ్ళ మన్నారు.

ఇంతకి ముందే అమ్మ ఆంధ్రదేశ పర్యటనానికి వెళ్ళి వచ్చింది. ఆ తరువాత చిత్రా ఆమె రెండో కూతురు 'కాకా' వచ్చారు. కాకా ఆర్నెల్ల పిల్ల, ఆ పసిపిల్లలో ఎంత అందమో! సాధారణంగా పసిపిల్లల్లో అంత అందాన్ని చూడం. చిత్రకూడా షికార్లలో కలిసింది. కాంపౌండ్ నౌకరు పరశురాం పిల్లలు కిష్టా, పచ్చయమ్మకూడా వీళ్ళ షికార్లలో కలిశారు.

'కాకా' అంటే అమ్మకి ప్రాణం. షికార్లలో కాకాని పట్టుకుని కూచునేది అమ్మ. అసలు అమ్మకే కాదు, కురంగేశ్వరరావుకి కూడా కాకా అంటే ఎంత ప్రేమో! చూసిన వారందరికి ముద్దు గొలిపేది కాకా. అప్పట్లో అమ్మ ఎంత హుషారుగా, జోరుగా వుండేదో!

ఈ షికార్లులో వున్నంత సంతోషంగా అమ్మని ఆమె జీవితకాలంలో ఎన్నడూ చూడలేదు షౌ.

అమ్మ కాకాకి తాళ్ళతో ఇంట్లో అక్కడక్కడ రెండు మూడు వుయ్యాలలు కట్టేది, కాకాని వుయ్యాలలో పడుకో బెట్టి "గోవింద హరి హరి గోపాల హరి హరి" అని జోల పాడేది. కాకా ఆ పాట పాడితేనేగాని నిద్రపోయేది కాదు. కాకా కొంచెం పెద్దది అవగానే షికారు సమయానికి షౌకి చెప్పులు, అమ్మకి బెత్తం తీసుకు వచ్చి ఇచ్చేది.

షికార్లలో శ్మశానాలు దాటి వెళ్ళేవారు. తిరువన్నామలైలో చచ్చిపోయిన వారిలో చాలామందిని సమాధి చేస్తారు. దహన సంస్కారం కొద్దిమందికే జరుగుతుంది. ఎవరెవర్ని కొత్తగా పూడ్చేరో అమ్మకి, పకపకకి, చిత్రకి లెఖ్ఖ. నిత్యమూ కొత్తగా పూడ్చినవాళ్ళ సమాధులన్నీ లెక్కపెట్టుకు వొచ్చేవారు వాళ్ళు. ఒకసారి శవాన్ని ఎట్లా పూడ్చిపెట్టి సమాధి చేస్తారో తీరుబడిగా చూచి వొచ్చారు పకపక. చిత్ర, చిత్ర వూరుకోక ఆ శవవాహకుల్ని అడిగింది. 'ఒక్కొక్క శవాన్ని మోయడానికి ఎంత తీసుకుంటా' రని. వాళ్ళలో ఒకడు "అందరికీ పదిహేసు, నీకయితే ముప్పై" అన్నాడు. "పీడ దుంప తెగా, నన్నెట్లా అన్నాడో" అంటూ చిత్ర తిరిగి వొచ్చేసింది. "నిన్నేవ రడగ మన్నారు చిత్రా ఈ సమాచార మంతా?" అంటూ నవ్వు పట్టలేక పోయారు షౌ. ఆవేళ చిత్ర మాటల్నే తలుచుకుని షికారంతా 'ఏక నవ్వు' అయిపోయింది.

బోస్ కాంపౌండ్‌లో వున్న 'సేవా' అనే భవంతిని అద్దెకి తీసుకుని మథానీ అనే భక్తుడు వుండేవారు. ఆయన ఆ ఇంటిని వెంకట రావు గారనే వారికి Sublet చేశారు. ఆ వెంకటరావుగారు చలంగారు

వాళ్ళతో షికార్లుకి భజనలకి వొచ్చేవారు. ఆయన కాకాని చూచి మురిసి పోయేవారు. భజనలో కూర్చున్న వారెవరైనా భజన చెయ్యకపోతే కాకా నోటిమీద వేలు వేసుకుని వాళ్ళని భజన చెయ్యమని సంజ్ఞ చేసేది. భజన చెయ్యకపోతే తంతాను అన్నట్లుగా కాలు చూపించేది.

అమ్మ, డాలీ, కురంగేశ్వరరావు, పకపక, షాతోబాటు షికార్లకి బయలు దేరేవారు. ఒక్కొక్కప్పుడు పకపక, షా చాలా దూరం నడిచేవారు. ఒకోసారి గిరిప్రదక్షిణం వెళ్ళే మలుపులలో వున్న గణేశాలయం దాకా వెళ్ళేవారు. ఆ రోజుల్లో షికార్లు భలే జోరుగా వుండేవి. అమ్మ తన చేతిలో ఒక బెత్తంతో సముద్రం అన్న చెరువుని చూపిస్తూ -'ఇది సువర్ణముఖీనది పాయ' అనేది. వెంటనే కురంగేశ్వరరావు ఏదో నీటిధార చూపించి 'ఇది పినాకిని పాయ' అనేవారు.

ఈ విధంగా కబుర్లు చెబుతూ గంతులు వేస్తూ ఆ రోజుల్లో షికార్లు సాగేవి. చలంగారికి వేరికోజ్ వెయిన్స్ గనక నర్తకి, చలం గారు వొచ్చేవారు కాదు. షా చలంగారి చేత మెల్లిగా అడుగులో అడుగు వేయిస్తూ పదేసి గజాలకి ఒకసారి కూచోబెడుతూ నడిపిస్తూ షికారు ఆరంభం చేయించారు. చివరికి మెల్లగా మైదానంలో మూడు చింతచెట్లు దాకా రాగలిగారు. మెల్లగా చలంగారికి యమలింగం దాకా నడిచే శక్తి వొచ్చింది. అప్పటి నించీ షికార్లకి రోజూ యమలింగం దాకా వెళ్ళేవారు. చలంగారు, నర్తకి కూడా షా వెంబడి నడవడం మొదలు పెట్టారు.

ఆ సంవత్సరం జయంతికి శాస్త్రిగారితో సంగీతరావుగా రనే ఆయన వొచ్చారు. ఆయన ఘంటసాల వారికి హార్మోనిష్టు. ఆ రాత్రి భజనలో ఆయన అద్భుతంగా పాడారు. ఎంత గంభీరంగా వుందో ఆయన కంఠం. మరుసటి రోజు ఈశ్వరుడు సంగీతరావుగారితో సంగీ

తం మీద ఎన్నో విషయాలు మాట్లాడారు. సప్తస్వరాల పుటక, నాదోపాసన ఒకటేమిటి ఎన్నో సంగీతశాస్త్ర రహస్యాలను ఈశ్వరుడు విప్పి చెప్పా రావేళ. ఈశ్వరుడు సంగీతరావుగారితో "మీది చాలా గొప్ప కంఠం. దీన్ని మాత్రం professional గా (వృత్తికి) వుపయోగించ కండి. హార్మోనియాన్ని మాత్రం ఉపయోగించండి" అన్నారు. సంగీతరావుగారు సరేనని ఈశ్వరుడికి వాగ్దానం చేసేరు. "చేతిసంగీతం సినిమాకీ, కంఠసంగీతం ఈశ్వరుడికి అర్పించారు సంగీతరావుగారు."

(జగ్గారావుగారికి చలంగారి లేఖ 16-1-59)

సంగీతరావుగారు ఆ తరువాత ఘంటసాల వారితో కలిసి వొచ్చారు అర్ధరాత్రి బస్సులో. ఘంటసాల పాడే సినిమా పాటలు చలం గారు వాళ్ళకి ఇష్టంలేదు. 'అనాసక్తి'లో రంగ వొదిలిపెట్టిన తంబూరా వుండేది. ఘంటసాల ఆ తాంబురా తీసుకుని తెల్లవార్లు పాడుతూనే వున్నారు. ఎంత బావున్నాయో ఆ పాటలూ, ఆ పాడిన పద్ధతి. సంగీతం మీద అంత ఆసక్తి, శ్రద్ధ ఆయనకి వుండటం చూసి షౌకి ఎంతో సంతోష మనిపించింది.

"ఘంటసాల ఇక్కడకు వొచ్చి పాడారు వోసారి. మా ఇంటోనే వున్నారు- ఒక పగలు, రెండు రాత్రులు.

ఘంటసాల అర్ధరాత్రి వొచ్చారు. ఆ గదిలో రంగ తంబుర ఎన్నాళ్ళబట్టో అట్టా పడివుంది. దాన్ని చూడగానే ఆయన దాన్ని శ్రుతి పెట్టుకుని తెల్లార్లు పాడాడు. ఎన్నడూ తాంబూరా మొహం చూడని వాడిమల్లే, అష్టపదులు గొప్పగా పాడాడు. ఘంటసాల రేడియోలో విన గానే దూరంగా పరిగెత్తే నేను అంతసేపు మైమరిచి విన్నాను."

(20-12-74 సత్యవతికి చలంగారి లేఖ)

ఘంటసాల మరుసటి రోజు రాత్రి భజనలో పాడారు. ఆయన జయదేవుని అష్టపదులే పాడారు. ఆయన సినీ సంగీతానికి ఇక్కడ

పాడిన సంగీతానికి ఎంత తేడాయో. గొప్ప తన్మయత్వంతో పాడా రాయన. ఆ తరువాత ఘంటసాలగారు లేచి నిలబడి "నా దేముందండీ. ఇక్కడ నా కెంతో శాంతిగా బావుంది. నేనుకూడా ఇక్కడికి వొచ్చే స్తాను" అన్నారు షౌతో. ఆ విధంగా ఎందరో చలంమహర్షి దగ్గరికి వచ్చి అక్కడ ఈశ్వరతేజస్సుకి ముగ్ధులైపోయి- ఎప్పటికీ అక్కడే వుండిపోవా లనుకునేవారు. అక్కడ వున్నప్పుడు లోకంలో వుండటం ఎందుకనే ప్రశ్న ప్రతీవారికి కలుగుతుంది. కాని గుమ్మం దాటగానే ప్రపంచం ఎదురొచ్చి వాళ్ళని ఊపిరి సలపనివ్వకుండా కావలించు కుంటుంది.

"నువ్వు ఈశ్వరయుగంలో వొచ్చావు. చలం అనే ఎరతో నిన్ను ఇక్కడికి లాగింది ఈశ్వరుడు. చలం నిస్సహాయుడు. తన మిత్రులు, జీవితమనే మురుగు కాలువలో కొట్టుకు పోతూవుంటే పిలిచి లాభం లేదని తెలిసి గుటకవేస్తో చూస్తో వుంటాడు. ఒకరిద్దర్ని మొదట్లో గట్టిగా పిలిస్తే వాళ్ళు అతని చేతినే కరిచారు కట్టేసిన కుక్కల మల్లే. కనక ఆ ప్రయత్నాన్ని పూర్తిగా వొదులు కున్నాడు. కొత్తగా రాగానే ఎన్నాళ్ళు నిలుస్తాడు. నెలా లేక కొన్ని రోజులేనా?" అని ముందే లెక్కలు వేసుకునేవాడు చలం. కాని ఇప్పుడు వేరు. ఈనాడు అసలు చలం ఇష్టమైనా అర్హత లేనివారిని రానీయరు. ఈశ్వరుడు రానిచ్చారా వారింక తప్పించు కోలేరు.

(జగ్గారావుగారికి చలంగారి లేఖ 25-3-58)

"చూస్తుండగా నా మిత్రుల్ని జీవితం మింగేస్తుంది. మృత్యువు మింగితే సులభంగా భరించ వొచ్చు. పీనిగలై, బూడిదై పోతారు. జీవితం ఎవర్ని మింగుతుందో వాళ్ళు పీనిగలై నడుస్తూ, మాటాడు తుంటారు."

(శాస్త్రిగారికి చలంగారి లేఖ 5-8-56)

ఒకరోజు చాడ్విక్ రెండు చేతులూ జోడించుకుంటూ వొచ్చారు. నర్తకి దగ్గరకి వెళ్ళి "భవతీ, భిక్షాం దేహి" అన్నారు.

చాడ్విక్ నారాయణయ్యర్ ఇంట్లో వుండగా వాళ్లు వొండిన భోజనం తిని చాలా జబ్బు పడిపోయారు. చాడ్విక్ అక్కడ వుండగానే ఈశ్వరుడు "చాడ్విక్ తన గూటికి తానే చేరుకుంటా" డని చెప్పారు. ఆ విధంగానే ఆశ్రమంలో వున్న తన ఇంటికి చేరుకున్నా రాయన. ఆయనకి మొదటినించి ఒక వంటవాడు వొండి పెట్టేవాడు. అతను ఎప్పుడన్నా చాడ్విక్ మీద అలిగి వెళ్ళిపోతా ననంగానే ఆ రాత్రి భగవాన్ ఆ వంటతని కలలో కనబడి "నా కోసం అంతదూరం నించి వొచ్చాడు నా శిష్యుడు. అతన్ని వొదిలి వెళ్ళిపోతావా?" అని అడిగే వారట. ఇంక వంటవాడు ప్రయాణం మానుకుని వుండిపోయే వాడు. చాడ్విక్ యాత్రలకి వెళ్ళగానే వంటవాడుకూడా వెళ్ళిపోయాడు. యాత్రల నించి వొచ్చి చాడ్విక్ నారాయణయ్యర్ ఇంట్లో వుండగా "చాడ్విక్ ఆరోగ్యం సంగతి జాగ్రత్తగా చూసుకోవాలి" అని ఈశ్వరుడు చాడ్విక్‌కి చలంగారిచేత చెప్పించారు. చాడ్విక్‌తో చలంగారు "మీకు ఎప్పుడు భోజనం ఇబ్బందయితే అప్పుడు మా ఇంట్లో భోజనం చెయ్యవచ్చు" అని చెప్పారు.

చాడ్విక్ చాలా మొహమాటం వున్న మనిషి. నారాయణయ్యర్ ఇంట్లో వుండగా ఆయనకి భోజనం ఒంటబట్టక జబ్బు చేస్తున్నాగాని భోజనానికి చలంగారు వాళ్ళింటికి రాలేదు. వాళ్ళ సహాయం అడగ లేదు.

ఇంతలో వంటవాడు తిరిగి వొచ్చాడు. తమ గూటికి చేరుకున్నారు చాడ్విక్. ఆ వంటవాడు వండి పెడుతూనే వున్నాడు. కానీ అప్పుడప్పుడు జబ్బు పడుతూనే వున్నారు చాడ్విక్.

ఒకసారి షా ఆయనని చూడడానికి వెళ్ళి "ఎందుకిట్లా మీకు మాటి మాటికి జబ్బు చేస్తుంది? వంటవాడు సరిగా వండి పెట్టడం లేదా?" అని అడిగారు. చాడ్విక్‌కి Chronic Dyspepsia (అజీర్ణ రోగం) ఆయన "ఏమీ లేదు ఒక beef steak తిన్నానంటే ఈ జబ్బంతా తగ్గిపోతుంది" అన్నారు. "మరింకేం తినరాదా?" అన్నారు షా. "నాగురువుకి నేను అటువంటి పదార్థాలు ఎన్నడూ ముట్టుకోనని వాగ్దానం చేశాను. నేను చచ్చిపోయినా సరే, ఎన్నడూ ఆ మాటని, జవ దాటను అన్నారు. ఆయనలో ఆ పట్టుదల చూసి షాకి ఎంత గర్వం అనిపించిందో!

తరువాత ఆయన చెప్పారు, మొట్టమొదట తాను జాం (Jam) డబ్బాలు, వెన్నడబ్బాలు, చీజ్ (Cheese) డబ్బాలు తెప్పించుకుని వుంచుకునే వారట తనగదిలో. ఆశ్రమం అధికారులు వాటిని చూసి చాడ్విక్ తమ ఇంట్లో మాంసం డబ్బాలు పెట్టుకున్నారని భగవాన్‌కి Complain చేశారు. భగవాన్ చాడ్విక్‌ని 'నిజమేనా!' అని అడిగారు. చాడ్విక్ ఆ డబ్బాల్లో ఏమేం వున్నాయో భగవాన్‌కి చెప్పారు. "నువ్వు ఆ డబ్బా లేపి నీగదిలో పెట్టుకో వద్దు" అన్నారు భగవాన్. అప్పటి నించి చాడ్విక్ ఆ డబ్బాలు పెట్టుకోవడం కూడా మానేసుకున్నారు.

ఇప్పుడు ఆ వంటవాడికి క్షయవ్యాధి వొచ్చి వాళ్ళ వూరు వెళ్ళి పోయాడు. చాడ్విక్‌కి భోజనం తయారు చేసి పెట్టేవా రెవరూ లేరు.

చలంగారు భోజనానికి ఎప్పుడు ఇబ్బందయితే అప్పుడే తమ ఇంటికి వొచ్చెయ్యమని చాడ్విక్‌కి చెప్పారు. అట్లాగే ఆయన తమ వంటవాడు వెళ్ళి పోయాక చలంగారు వాళ్ళింటికి వొచ్చారు.

అప్పటి నించి చాడ్విక్‌కి చలంగారు తమ ఇంట్లోనే భోజనం ఏర్పాటు చేశారు. ఇక్కడి భోజనం తినగానే చాడ్విక్‌కి ఎం తాశ్చర్యమో!

ముప్పై ఏళ్ళ నించీ ఆయన శాకాహారం తింటున్నారు. ఆ శాకాహారంలో ఆయనకి ఏ రుచీపచీ కనబడేది కాదు. కాయగూరలకి రుచి వుండదని తమకి తాము నచ్చ జెప్పుకు తింటున్నా రాయన. చలం గారు వాళ్ళింట్లో భోజనం చేసేసరికి కాయగూరల్తో ఇంత రుచిగా వంట చేయడానికి వీలుంటుందా ? అని ఆశ్చర్యం కలిగిం దాయనకి, అదే కాకండా ఆయన ఆరోగ్యం ఎంత మెరుగయి పోయిందో ! చూచిన వారంతా నీ వయసుకి పదేళ్ళు చిన్నవాడి వయిపోయావు. ఏం జరిగిం దేమిటి ? అని అడుగుతున్నారని చెప్పా రాయన.

అప్పట్లో చలంగారు వాళ్ళు బీదవారికి కూళ్ళు (రాగుల అంబలి) పోసేవారు. ఎంతమంది ముష్టివాళ్ళు వొస్తే అంతమందికి రాగి అంబలి వొండి పోసేది నర్తకి. రాను రానూ వొచ్చే భిక్షుకుల, సాధువుల సంఖ్య విపరీతంగా పెరిగింది. వారిలోనే కొందరు సాధువులు నర్తకికి సాయం చేసేవారు.

"బిచ్చగాళ్ళూ, సాధువులూ - వాళ్ళకి వొండి పెట్టలేక నర్తకి వాళ్ళచేతనే వంట చేయిస్తోంది."

(శాస్త్రిగారికి చలంగారి లేఖ —— తేదీ లేదు)

ఆ బిచ్చగాళ్ళు, సాధువులూ ఎప్పుడూ ఒకచోటే వుండరు, ఏ క్షేత్రంలో వుత్సవం జరుగుతూ వుంటే ఆ క్షేత్రానికి పోతారు. మరు సటి ఏడాదికి ఇక్కడి వుత్సవాలకి తిరిగి హాజరయే వారు. వాళ్ళు నర్తకికి ఆ యా క్షేత్రాల కబుర్లన్నీ కథల్లా చెప్పేవారు.

బిచ్చగాళ్ళు సాధారణంగా ఒకచోట చేరితే ఎంత గోలో! ఎంత రద్దియో ! కాని చలంగా రింట్లో బిచ్చగాళ్ళు వరసగా కూచుని వుంటే ఇద్దరు పొయ్యిమీద రాగిపిండి వొండి భిక్షుకుల డబ్బాల్లో పోసుకుంటూ వెళ్ళి పోయేవారు. "తక్కిన చోట్లలో పోట్లాడుకుని రద్దీ చేస్తాం.

ఇక్కడేమీ గోల చెయ్యంమేం ?" అని వాళ్ళల్లో వాళ్లు అనుకునే వారు. ఒకవేళ ఎవరైనా కొత్తవాళ్ళు గోల మొదలు పెడితే "వూరుకో! ఎందుకట్లా గోల చేస్తావు? అమ్మ అందరికీ కూళ్ళు సమానంగా పోస్తుంది. నీ దగ్గరకి వొచ్చేసరికి నీ డబ్బాకూడా నింపుతుంది" అని పక్కన కూచున్నవాళ్ళు వాళ్ళకి నచ్చజెప్పి గొడవ చెయ్యకుండా చూసేవారు.

ఒక రోజు ఒక బిచ్చగత్తె దూరంగా నించుని షౌని పిలిచింది. షౌ ఆమె దగ్గరగా వెళ్ళారు. ఇన్ని పనసగింజలు షౌ చేతుల్లో పోసింది. షౌ వాటిని లోపలికి తీసుకువెళ్ళి కూర చేయించారు.

కేవలం తాము వీరినించి ఏదో తీసుకోవాలనే కాకండా, తాము వీరికి ఏదయినా ఇవ్వాలనే తలపుతో, ఆ బిచ్చగత్తె ప్రేమతో సమర్పించిన ఆ పనసగింజల బహూకృతికి షౌ ఎంత move అయిపోయారో!

బిచ్చగాళ్ళలో ఎవరికైనా జబ్బుగా వుంటే ఇంకోరు "వాడికి జబ్బుగా వుంది. వాడి వంతు కూళ్లు నాకివ్వండి - నేను తీసుకు వెళ్ళి వాడికి ఇస్తాను" అని చెప్పి శ్రద్ధగా తీసుకు వెళ్ళి ఇచ్చేవారు.

ఈ బిచ్చగాళ్ళలో కొందరు అరుణాచలేశ్వర ఆలయంలో వుండేవారు. ఎప్పుడైనా చలంగారింటినించి ఎవరయినా గుడికి వెడితే ఆశకొద్దీ ఏ బిచ్చగాడయినా భిక్షం అడిగితే- రెండోవాడు "ఒరే వాళ్ళు అక్కడికి పోతే మనకి కూళ్లు పోయటల్లేదుట్రా! ఇక్కడ ఎందుకురా అడుగుతావు?" అని కోప పడేవాడు.

1958లో డాలీకి టాన్సిల్స్ ఆపరేషన్ జరిగింది. నర్తకి డాలీ దర వుండి పోయింది. చలంగారు తమకి ఒళ్ళు బాగాలేక డాక్టర్ చె యార్‌కి చూపించుకోవడానికని బండిలో బయలుదేరారు. ఆయన డా ర్‌కి చూపించుకుని తిరిగి వొస్తూవుండగా బజారుస్క్వేర్‌లో

గుర్రం కాలు మడతపడి కింద పడింది. అక్కడంతా మసకచీకటి ఆవరించి వుంది. బండిలోంచి ఆయన కింద పడిపోయారు. కళ్ళజోడు, పర్సు అన్నీ చిందర వందరగా పడిపోయాయి. ఆయనకి చుట్టూరా ఏమీ కనబడటల్లేదు. పర్సు తెరుసుకుని చిల్లరంతా కిందపడి చెల్లాచెదురై పోయింది. ఆ చీకట్లో నలుమూలలనించీ ఆయనకి కొన్ని కంఠాలు వినబడ్డాయి- "మన అయ్యా పడిపోయినారు. మన అయ్యా పడిపోయినారు" అని నాలుగు వైపులనించి బిచ్చగాళ్లు వచ్చి ఆయనని ఎత్తి కూచోబెట్టారు. రోడ్డుమీద చెల్లాదుచెదరైన చిల్లరంతా పర్సులో పెట్టి, ఆయనని భద్రంగా బండి ఎక్కించారు, ఆయన ఇంటికి వొచ్చేశారు.

వారు ప్రవర్తించిన తీరు చూస్తే ఎంత admiration పుట్టుకు వొస్తుందో! చలంగారికి జరిగిన ఈ సంఘటన చూస్తే "మనం ప్రేమని స్తేతప్పకండా ఆ ప్రేమ ఇతర హృదయంలో పలుకుతుం దనే" సంగతిఎంతో బాగా విశద మవుతుంది.

## 13

మొట్టమొదట తనో పుస్తకం రాసి, ఆ పుస్తకాన్ని చలంగారి అభిప్రాయాన్ని కోరుతూ చలంగారికి పంపించారు కురంగేశ్వర్. "ఆపుస్తకం నాకేమీ బాగాలేదు" అని చలంగారు రాశారు.

ఆ తరువాత తమ స్నేహితులు ఈవైపుకి వస్తుంటే చలంగార్ని చూసి రమ్మని పంపించారు ఆయన. ఇంకొద్దిరోజుల తరువాత "నేను ఈశ్వర సేవ చేసుకోవడానికి త్వరలోనే వొస్తున్నాను" అని పుత్తరం రాశారు.

కాని రాసిన కొన్నాళ్ళకిగాని ఆయన రాలేదు. ఇంటి వరండాలో ఆయన అడుగు పెట్టగానే షౌ ఆయనే కురంగేశ్వర్ అని గుర్తించారు

అప్పటి నించి ఇంట్లో ఒకరై పోయా రాయన, ఇంట్లోవాళ్ళు ఏదయినా పనిచెబితే చేసేవారు. లేకపోతే ఓమూల మౌనంగా కూచునే వారు. కురంగేశ్వర్ ఆగమన పూర్వా పరాలని అనుభూతులని ఆయననే చెప్పమందాం.

"చలంగా రింటికి 1957 జూన్ 15న వొచ్చాను. అంతకు ముందు రెండు దినాలు ఆశ్రమంలో వున్నాను.

ఓ సాయంత్రం నాలుగు ప్రాంతాల Devotion లో మంచి నీళ్ళు తాగడానికి వెళ్ళాను. ఆవేళే షికారు ఆరంభ మయింది. "మీరూ వస్తారా?" అని అడిగారు నాన్న. తల వూపాను. నాన్న, నర్తకి యిపు డున్న యింటి దగ్గరగావున్న చింతచెట్టు వరకు వచ్చి ఆగారు. అమ్మ వెనక పడేది. షౌ Speedగా నడిచేవారు. నేను follow అయ్యేవాణ్ని- ఆ షికారు కూడా గిరిప్రదక్షిణం వెళ్ళే రోడ్డు చీలేదాకా! నా కెన్నో సం దేహాలు- ఏం అడగ లేను-కాని అన్నిటికీ ఆ షికారులో సమాధానాలు చెప్పేవారు. నే నెంతో wonder అయ్యే వాడిని.

రెండు దినాలలో దీపావళి వుందనగా మా అమ్మని చూడడానికి యింటి కెళుతున్నాను. సాయంత్రం టిఫిన్ చేసి జట్కాలో రైలుస్టే షన్‌కి వెళ్ళడానికి అన్ని ఏర్పాట్లు చేశాను. అందరితో నేను వెళుతు న్నానని చెప్పడానికి నాకెవ్వరితోనూ పరిచయం లేదు. నాన్నతో నా సంభాషణ పుత్తరాలలోనే. ఎవరితో ఏమీ మాట్లాడి ఎరగను. షికారులో షౌతో చెప్పాను యీపూట వెడుతున్నా నని - 'వూ' అని వూరు కున్నారు, వెళ్ళమనా, వద్దనా? ఏం అర్థం కాలేదు - చాల ఆందోళ నలో వున్నాను - ఏదో చెపుతూనే వున్నారు. నాకేం ఎక్కడం లేదు. మరల 'వెళ్ళ మంటారా?' అని సాహసించి అడగ లేక పోయాను. ఇట్లా వేదనపడు తూనే టిఫిన్ చేస్తున్నాను - అకస్మాత్తుగా షౌ

నాన్నతో "ఈ పూట కురంగేశ్వరరావు గారు వెళుతున్నా రట" అని చెప్పింది. మీరు ఎలా feel అవుతారో నాకు తెలీదు కాని నా పాలిట ఆమె ఈశ్వరుడుగానే భాసించారు ఆ క్షణాన — నాభోజనం అయి అన్నీ సర్దుకుని బండిలో పెట్టి మరల లోపలకి వెడుతున్నాను చెప్పి వద్దామని - యింకా షా భోజనం కాలేదు. మధ్యగదిలో మంచం మీద పడుకున్న నాన్న లేచి నేను చెప్పక ముందరే నమస్కారం చేశారు— మనసులో ఓ joke వెలిగింది నేను వెళ్ళడం లేదని చెపుదా మని. ఆ వాకిలి ప్రక్కగానే షా కూర్చొని వున్నారు కంచం ముందర. వెళ్ళి వొస్తానని నమస్కారం చేశాను. సూర్యనారాయణగారూ! షా నా వంక చూస్తో (ఆ చూపులో ఏముందో ఇవాల్టికి చెప్పలేను కాని నాకు ఈశ్వరుడు కనిపించారు ఆ చూపులో) "మమ్మల్ని మరచిపోకండి" అన్నారు. నేనేం అయ్యానో ఎలా చెప్పను — అసలు వెళ్ళడం మానేద్దాం అనుకున్నాను. వెళ్ళడం లేదంటే పిచ్చివాడిని అనుకుంటారేమో! జట్కా దగ్గరి కెళ్ళాను. మళ్ళీ ఎన్నాళ్ళ కొస్తానో అని వెను దిరిగాను బండి ఎక్కుతో. ఎప్పుడూ నేను మాట్లాడి ఎరగని చిట్టిపాప నావెనక వుండి "పోగానే పుత్తరం రాస్తారు కదూ!" అంది- నామీద ప్రేమని వర్షింప చేశారు. అందరూ, అమ్మ మరీను." నిన్ను చూస్తే మా వసంత్‌ని చూసినట్లే వుంటుందిరా" అనేది. నన్ను ఎంత ప్రేమించిందో ఆమె- ఎంత మందితోనో విరోధపడే అమ్మ నన్నొక్క సారి కూడ ఒక్కమాట కూడ అనలేదంటే నామీది ఆమె ప్రేమ అమూల్యం- ఆమె క్షోభ నాకు బాగా తెలుసు, పాపం అలాంటి స్థితిలో కూడా నన్ను ప్రగాఢంగా విశ్వసించింది. ఆమె కోసం ఏదయినా చేద్దా మనిపించేది. ఒకొక్కసారి ఎంతో ఔన్నత్యంతో మాట్లాడేది. ఒకోసారి తిట్టేది. నాన్నని తిడుతూంటే బాధ వేసేది. ఆమె నాన్న ఔన్నత్యాన్ని

ఎంత గొప్పగా చెప్పేదో! అలా నాకు బాగా అవగాహ నయింది ఆమె స్థితి - అంచేత ఆమెతో నేను తగూ పడలేదు. "నే నున్నాను నీకేం భయం లేదంటే" ఎంతో ధైర్యంగా వుండేది. పాపం ఎంతగా hurt అయ్యిందో! భజనలో మధ్యలో వొస్తే "ఏరా ఆక లేస్తోందా?" అని ఏదో పెట్టేది- 'నేను గంజి చేసుకున్నాను త్రాగరా' అని ఇచ్చేది. ఇలా ఎంతో రాయగలను-మీకు పనికి వొచ్చేది వుండదని తలంపు, ఎందు కంటే నాది ప్రశ్నలేని విశ్వాసం. ప్రశ్నలేని మౌనం. ఆ మౌనంలోనే అర్థం చేసుకున్నాను. నాన్నతో ఈశ్వరుడు ఎన్నోగంటలు చర్చించే వారు. నావరకు నాకే చెబుతున్నారా అనిపించేది. నేను యిక్కడినించి కదలడం ఈశ్వర విలాసం- ఇవాళ యిలా రాయడానికి నేను వుండ డమూ ఈశ్వర విలాసమే—

1957 నించి ప్రతి సంఘటనా నాజీవితంలో పెనవేసు కున్నది. అప్పటికి ఇప్పటికి అసలు మార్పువున్నట్లు నాకు తోచదు. అయితే అప్పుడు యింతమంది మిత్రులు వుండేవారు కాదు. రహ్మాన్, జ. రు. శాస్త్రి మొదలైన కొద్దిమందే- మనుషుల భేదం తప్ప మాధుర్య భేదం నాకేం కనపడదు. మీ కోరిక తీర్చ లేనందుకు అశక్తుణ్ణి- ప్రత్యేకంగా చెప్పుకో దగ్గ సంఘటనలు జరగలేదు- జరిగినదంతా మౌనంలో జరి గింది. నేను స్పష్టంగా చెప్ప కలిగింది మాత్రం ఒక్కటే అది ప్రేమ నిలయం. కాకా మొదలు షౌ వరకూ నా ఎడల అందరూ ప్రేమనే చూపారు" అంటారు,

(ఆ. సూర్యనారాయణకి కురంగేశ్వరరావు లేఖ 25-9-77)

అప్పట్లో రంగస్వామి ఇక్కడే వుండేవాడు. చలం గారింట్లో వూరికే కూచునే వాళ్ళని చూస్తేగిట్టేది కాదు అతనికి. "ఏం ఇక్కడ వూరికే తిని ఇట్లా కూచోవడమే ననుకుంటున్నావా? పద" అని కురం

గేశ్వర్‌ని తనతో తీసుకు వెళ్ళేవాడు. వాడో బికారి. అయినా కురంగే శ్వర్ తలవొంచుకుని అతనితో వెళ్ళేవాడు. రంగస్వామి కురంగేశ్వర్ చేత ముళ్ళు కొట్టించి, పొలాల్లో ఆవుల కోసం గడ్డికోయించి తన అసి స్టెంటుగా తిప్పుకునే వాడు. కురంగేశ్వర్ అసిస్టెంటు చేయాల్సిన పనులన్నీ చేసి తిరిగి వొచ్చేవారు. అలాగే చలరిగా రింట్లో వుంటున్నా రాయన.

ఈ రోజులలో భగవాన్ భక్తులు ఒక రిద్దరు చలంమహర్షి దగ్గ రకి వొస్తూనే వుండేవారు. వారికి ఏ సంశయాలు వొచ్చినా షౌ దగ్గర తీర్చుకు వెడుతూ వుండేవారు. వారిలో సుందరేశయ్యర్ ముఖ్యులు.

సుందరేశయ్యర్ మంచి సంస్కృత భాషా పాండిత్యం వున్న వారు. కావ్యకంఠ గణపతి శాస్త్రిగారి శిష్యులు. ఆ తరువాత భగవాన్‌కి ముఖ్యమైన శిష్యులు. ఆయన తనకి ఎన్నో ఆధ్యాత్మికానుభవాలు కలి గాయనీ తాను ఒక ప్రలోభం వలన పతనం అయిపోయాననీ ఆయన బాధ పడుతూ వుండేవారు. 'నేను పాపిని' అని గోల పెట్టేవారు.

"పాపిని అనుకోవడం వల్ల ఎవరూ ఏదీ సాధించ లేరు. పాపం అంటే ఎక్కడ వుంది? పాపం అనుకుంటూ కూచోవడం కన్నా 'నా గురువు నాయెడల వున్నారు. ఆయన తప్పకుండా సాయం చేస్తారు' అని ధైర్యంగా నడవండి" అని ఆయనకి ధైర్యం చెప్పేవారు ఈశ్వరుడు.

ఆ తరువాత సుందరేశయ్యర్ తరచు రమణస్థాన్‌కి వొస్తూ వుండేవారు. చివరికి ఆయనకి అక్కడికి పోకూడదని ఆంక్ష వొచ్చింది. గిరిప్రదక్షిణం వంకతో ఇక్కడికి తొంగి చూసేవారు. ఆయన కొక వుద్యోగం offer వొచ్చింది. అప్పు డాయన "వెళ్ళ మంటారా?" అని షౌని అడిగారు. "ఏమాత్రం వెళ్ళ వద్దు, భగవాన్ సమక్షం వొదిలి." అన్నారు షౌ. ఆయన అట్లాగే మానుకున్నారు.

ఆయన గురువులు గురించి, శిష్యుల గురించి, ఎన్నెన్ని కథలు చెప్పేవారో! అవి ఎంత గొప్పగా వుండేవో! ఆయన కొడుకులు ఇద్దరు ఢిల్లీ, బెంగుళూర్లలో గొప్ప పదవులలో వుండేవారు. వా రాయనకి తరచు "మాదగ్గరకు రాకూడదా! అక్క డెందుకు కష్టపడడం" అని వుత్తరాలు రాసేవారు.

ఆయనకి లివర్ క్యాన్సర్. దానివలన తరచు జబ్బు చేసేది. అప్పు డప్పుడు షౌ వెళ్ళి ఆయనని చూసి వొచ్చేవారు. కొన్నాళ్ళ తరువాత ఆయన ఇక్కడికి (రమణస్థాన్) రావడం మానుకున్నారు. తరువాత ఒక రోజు పొద్దున్న కులాసాగా కబుర్లు చెబుతూ వెనక్కి పడి చచ్చిపోయారని విన్నారు షౌ. ఆ అనాయాసమరణం గురించి విన్నప్పుడు షౌకి ఎంతో సంతోష మనిపించింది.

ఇంతలో గుంటూరు లక్ష్మీకాంతంగారు వొచ్చారు. ఆయన చాలా మంచివారు. ఆయన ఖరగ్పూర్లో వుండేవా రట. కావ్యకంఠ గణపతి శాస్త్రిగారు తమ చివరి దినాల్ని వారింటి లోనే గడిపా రట. కాంతంగారు గణపతి మునీంద్రుల జీవిత చరిత్ర రాసే ప్రయత్నంలో వున్నా రారోజుల్లో, విషయ సేకరణకి ఆయన అరుణాచలం వొచ్చారు. అరుణాచలం వొచ్చినప్పుడల్లా కాంతంగారు చలంమహర్షిగా రింటిలోనే దిగేవారు. చలంగారి కుటుంబానికి ఆయన మంచి స్నేహితులైనారు.

కాంతంగారి రాక పోకలతో కావ్యకంఠ గణపతిశాస్త్రి గారికి సంబంధించిన అనేక విషయాల గురించి రమణస్థాన్లో ముచ్చటించు కోవడం ఆరంభం అయింది. కాంతంగారు గణపతిముని జీవిత చరిత్రను 'నాయన' అనే పేరుతో ప్రచురించి, చలంగారికి ఒకకాపీ పంపించారు.

ఆ పుస్తకం చదివేదాకా చలంగారికి, షౌకి, నాయన భగవాన్ శిష్యులన్న విషయమే తప్ప నాయన గురించి పూర్తిగా తెలియదు. కాంతంగారి పుస్తకం చదివాక నాయన ఎంత గొప్ప మేధావో, ఎంత తపశ్శాలో, గురువు ముందెంత నమ్రులో, ఆ గురువున కెటువంటి శిష్యులో ఎంత మహాపండితులో ఎంతటి మంత్రోపాసకులో వాళ్ళకి తెలిసింది.

ఈశ్వరుడు చలంగారికి ఒక మంత్రాన్ని ఇచ్చి జపించమన్నారు. "దానివల్ల నా కేమి రావటల్లేదు" అన్నా రాయన. ఆయన కలలోనే — ఈశ్వరుడు "ఓం నమో భగవతే శ్రీ రుద్రాయ" అని చెప్పి నట్లయ్యింది. చలంగారు ఆ మంత్రాన్ని కొన్నిదినాలు చేసే సరికి — ఒళ్ళంతా మంటలూ, వేడి పుట్టుకు రావడం మొదలు పెట్టాయి. ఈశ్వరుడు ఆ మంత్ర జపాన్ని వొదిలివేయ మని చెప్పారు.

చలంగారు తాను దక్షిణామూర్తి స్తోత్రం చదువు తామని ఈశ్వరుడ్ని అడిగారు. ఈశ్వరుడు అనుమతించి, ఆ స్తోత్రం ఎట్లా చదవాలో చలంగారికి నేర్పించారు. చలంగారు ప్రత్యూషంలో దక్షిణామూర్తి స్తోత్రం చదివి త్యాగరాయ కృతులు పాడుకునే వారు. ప్రాతఃకాలంలో చలంమహర్షి దక్షిణామూర్తి స్తవం చదువుతూంటే పక్క మీదనే ఉండి - సగం మెలకువతో సగం నిద్రతో వినడం ఎంతో గొప్ప అనుభవం అంటారు సౌరిస్. కొద్దికాలం ఆయన తన అనారోగ్యం వలన చదవడం మానుకొన్నారు. ఇటీవల ఆరోగ్యం మెరుగయి మళ్ళీ నిత్యమూ చదువు తున్నారు. ప్రాతఃసమయంలో చల్లగాలి వీచే వేళ పక్షుల కలరవాలు మిన్నంటేవేళ చలంగారి గంభీర మధురగళం నించి వినవొచ్చే దక్షిణామూర్తి స్తవాన్ని ఆలకించడం శ్రీ రమణ స్థాన్‌లో ఒక మహత్తరానుభూతి అనిపిస్తుంది నాకు.

చలం గారింటికి కూళ్ళు తాగడానికి వొచ్చే బిచ్చ గాళ్ళలో రంగ స్వామి ఒకడు. అతను మెల్లిగా నర్తకి ప్రాపకంలో చేరాడు. నెమ్మదిగా వాడు చలంగా రింటి ముందు వేపచెట్టు కింద చేరాడు. అతనికి కుష్ఠువ్యాధి. ఆ వ్యాధి అతని వేళ్ళను కొన్నిటిని తినేసింది. నర్తకి పోసిన కూళ్ళు తాగి ఆ చెట్టుకిందే పడుకుని వుండేవాడు. అతను బిచ్చం ఎత్తు కోవడమే కాకండా, ఊళ్ళో అక్కడక్కడ కూలీ నాలీ చేసుకునే వాడు. ఆ డబ్బులన్నీ తీసుకు వొచ్చి నర్తకి దగ్గర దాచుకునే వాడు. తన కథలన్నీ నర్తకికి చెప్పుకునే వాడు. వాడు మునుపు గొప్ప శృంగార పురుషుడు. ఆస్తి కలవాడు. కుష్ఠు వ్యాధి రాగానే భార్య అతన్ని ఇంటినించివెళ్ళ గొట్టేసింది. వాడు అరుణాచలం చేరుకున్నాడు.

ఇంక బోస్ కాంపౌండ్ అంతా చలంగారి సొంతమే ననుకుని ఆ కాంపౌండ్ నౌకర్లు ఆర్ముగం మీద పరుశురాం మీద కేకలు వేసి వొచ్చేవాడు. "ఏమి టిదంతా ఇలా వుంచు తున్నారు? అమ్మగా రిల్లిలాగేనా వుంచేది? మీరు సోమరు లై పోతున్నారు. ఆ చెత్త అలా వుంచా రేమిటి? ఎత్తండి" అని వాళ్ళని గదిమే వాడు.

ఎవరైనా భజనకి రాకపోతే వారి దగ్గరకి వెళ్ళి- "నువ్వు భజన కెందుకు రాలేదు? అంతకన్నా ఘనమైన పని నీకేముంది?" అని కేకలు వేసి వొచ్చేవాడు. మునిసిపల్ ఆఫీసులో వుద్యోగి సారంగపాణి చలం గారింటికి భజనకి వొస్తో వుండేవారు. ఆయన నాలుగు రోజులు వరసగా రాకపోతే సరి రంగస్వామి సరాసరి మునిసిపల్ ఆఫీసుకి వెళ్ళి పోయే వాడు. సారంగపాణికి ఈ కుష్ఠువాడు తనకోసం వొస్తున్నాడని చచ్చే టంత సిగ్గు. ఆఫీసులోకి వెళ్ళి సారంగపాణిని "ఏమిటి భజనలకి రాకండా ఇక్కడ కూచున్నావు? ఇక్కడేమన్నా వైకుంఠం వొరుగుతుందా? పదా?" అని గట్టిగా కేకలు వేసేవా డట. సారంగపాణి-

"ఇదేమి అఘాయిత్య మండీ, వీడొచ్చి నా మీద కేకలు వేస్తాడు?" - అంటూ చలంగారి దగ్గరకి వొచ్చి గోల పెట్టేవాడు.

హిరేన్ అలిగి భజనలకి రావడం మానేశాడు. ఒకరోజు చలంగారింటి ఆవరణలో హిరేన్ లిల్లీపువ్వుని కోస్తూ ఉండగా చూసి రంగస్వామి ఉగ్రుడై పోయి- "భజనలకి రావు, ఏమీ లేదు. ఇక్కడి పువ్వు కోస్తావా? ఎట్లా కోస్తావో కొయ్యి చూద్దాం" అని అటకాయించాడు. అంతేకాదు రంగస్వామి ప్రతీవాళ్ళ మీద అధికారం చేసేవాడు.

అరుణాచలం కోతుల మయం. అలాంటిచోట చలంగారింటికి ఒక్క కోతిని కూడా రానిచ్చేవాడు కాదు రంగస్వామి. వాడికి కూళ్ళే కాకండా ఇంట్లో అందరితో సమానంగా భోజనం పెట్టేది నర్తకి. వాడికి ఏది మనసయితే అదికూడా చేసి పెట్టేది.

వాడు "మనకో ఆవు వుండాలి. ఇన్ని వుండి మనకి ఆవు లేకపోతే ఎట్లా? ఆవుని నేనే మేపుతాను. దానికి నేనే గడ్డి తెస్తాను" అంటూ సరదా పడిపోతూ కలలు కనేవాడు. వాడి మాటలు వింటూ వుంటే అందరికి కూడ ఒక ఆవు వుంటే బావుండు ననిపించింది.

ఒక ఆవుని షౌకి vision లో చూపించి "కొంటే ఈ ఆవునే కొనండి" అన్నారు ఈశ్వరుడు. చివరికి అట్లా వున్న ఆవునే కొన్నారు. అది చాలా అందమైన ఆవు. చాలా తెల్లని ఆవు (గౌరి). రంగస్వామికి ఆ ఆవంటే ప్రాణం. దాన్ని వాడు దగ్గరుండి మేపుకుని తీసుకు వొచ్చేవాడు, దానికోసం ఇంత గడ్డికోసి తెచ్చేవాడు.

ఇంతలో చలంగారు వాళ్ళ పాలవాడికి అవసరంగా డబ్బు కావాల్సి వొచ్చింది. అతని దగ్గర వున్న ఆవు చాలా ఖరీదైంది. దాన్ని అతను ప్రాణప్రదంగా చూసు కుంటున్నాడు. అత్యవసర స్థితిలో దాన్ని చలంగారికి అమ్మాల్సి వొచ్చిం దతనికి. ఆ ఆవు అప్పుడే

పిల్లని వేసింది. ఆ ఆవు పేరే లక్ష్మి. దాని పిల్లే బుజ్జాయి. ఇంక రంగస్వామి గౌరిని సొంత ఆవు కింద, లక్ష్మిని పరాయి ఆవుకింద చూసేవాడు: గౌరికి బాగా గడ్డి వేసేవాడు. లక్ష్మికి గడ్డి వేసేవాడు కాదు. "లక్ష్మికి గడ్డివేయ లేదేం?" అని నర్తకి అడిగేది. దానికి గడ్డి ఎందుకు? అది వాడి ఆవు కదా" అనేవాడు. "మనం కొన్నాం కదా" అనేది నర్తకి. "కాదు వాడిదే" అని ఎంత చెప్పినా లక్ష్మికి సరిగ్గా గడ్డి వేసేవాడు కాదు.

ఆవుల్ని కొట్టకండా మేపాలని రంగస్వామికి చలంగారు వాళ్ళ ఆదేశం. ఒకసారి నర్తకిమీద కోపంతో రంగస్వామి గౌరిని కొట్టాడు. చలంగారు వాళ్ళు అతను ఆవును కొట్టే డనేటప్పటికి అతనిమీద కోప పడ్డారు. దాంతో వాడు అలిగి 'నే నిక్కడ వుండను' అని పల్లా కుత్తులోకి పోయి పడుకుని మూడు రోజులు దాకా ఇంటికి తిరిగిరాలేదు. ఆ ఆవు ఆ మూడు రోజులూ గడ్డి తినడం మానేసింది. మూడవరోజున వాడు వచ్చి షౌ కాళ్ళమీద పడ్డాడు. "భగవానమ్మా! మూడు రోజులూ నా ఒళ్ళంతా మంటలు, బాధ భరించ లేకండా వున్నాను క్షమించండమ్మా" అని వేడుకున్నాడు. తరువాత ఆవు దగ్గరకి వెళ్ళి 'అమ్మా నిన్ను బుద్ధిలేక కొట్టానమ్మ. ఇంక ఎప్పుడూ కొట్టనమ్మా!" అని ఆవు పాదాలమీద పడ్డాడు. దూరం నించి అతని కంఠం వినగానే గౌరి గడ్డి ముట్టుకుంది.

కూళ్ళు తాగటానికి వొచ్చే బిచ్చగాళ్ళలో ఒకతను వున్నాడు. అతని పేరు రామస్వామి. అతను గొల్లవాడు. అతను ఆవుల సంగతి తాను చూసుకుంటానని చలంగా రింట్లో పనికి కుదిరాడు. రంగస్వామి నెట్లా చూసేదో రామస్వామిని అట్లాగే చూసేది నర్తకి. కానీ రామస్వామికి అది గిట్టేది కాదు. వాడిని ఎక్కువగా చూస్తున్నావని నర్తకితో

తగవాడే వాడు. "వా డేమన్నా నీ తలకి చిచ్చు పెడతాడా?" అని నర్తకిని అనరాని మాటలు అనేవాడు. అన్నం తినడం మానేసి అలిగ్గే వాడు. "ఏదో అన్నాడులే" అని నర్తకి దులిపేసుకునేది కాదు. వాడు బాధ పడుతోంటే తాను బాధ పడేది. ఇంక వాడే అలకతీరి వొచ్చి "అమ్మా తప్పయి పోయింది. బుద్ధి గడ్డి తిని నిన్ననరాని మాటలన్నీ అన్నానమ్మా! మన్నించమ్మా" అని బతిమాలేవాడు నర్తకిని.

ఏ కూరల వాళ్ళనయినా, గడ్డిమోపుల వాళ్ళనయినా సరే గేటు దగ్గర అటకాయించి "మా అమ్మగారికి కూరలు కావాలి. మా ఆవులకి గడ్డి కావాలి" అని తీసుకు వొచ్చేవాడు. రంగస్వామికి కుష్ఠువ్యాధి. వా డెక్కడ తమని అంటుకుంటాడో నన్న భయంతో వాళ్ళకి రాక తప్పేది కాదు. చలంగారు వాళ్ళు అడిగిన బేరానికి వాళ్ళు ఇవ్వకపోతే "ఏమను కుంటున్నావు, ఇది భగవాన్ ఇల్లు" అని జులుం చేసేవాడు రంగస్వామి. ఆ ధరకి ఇచ్చిపోక తప్పేది కాదు వాళ్ళకి. వాడి బారి నించి తప్పించుకోవడానికి వాళ్లు అలాగే చవకగా ఇచ్చేసి త్వర త్వరగా వెళ్ళిపోయేవారు.

ఒకసారో చిన్నపిల్ల వంకాయ లమ్మడానికి వొచ్చింది. రంగస్వామి ఆ అమ్మాయితో "ఇది భగవాన్ ఇల్లు. వంకాయలిచ్చి వెళ్ళు. నీకు త్వరగా పెళ్ళవు తుంది" అన్నాడు. వాడిలో ఎంత విశ్వాసమో! ఆ అమ్మాయి అలాగే వంకాయ లిచ్చి వెళ్ళింది. అట్లాగే ఆ అమ్మాయికి కొద్ది రోజుల్లోనే పెళ్ళయింది.

పూర్వం కుష్ఠువ్యాధికి చికిత్స చెంగల్పట్టులో తప్ప వేరేచోట లేదు. ఇప్పుడు అన్నిచోట్లా లెప్రసీ క్లినిక్స్ పెట్టేశారు. రంగస్వామిని లెప్రసీ క్లినిక్‌కి పంపించి మందు తీసుకో మన్నారు చలంగారు అలాగే వాడు మందు తెచ్చుకుని వేసుకునేవాడు.

ఒకరోజు 'రంగస్వామీ! మందు వేసుకుంటున్నావా? అని అడిగారు షా. వాడు షా అడిగారనే సంతోషం పట్టలేక వారం రోజుల మందు ఆ రోజే మింగేశాడు. ఒక్క మోతాదు మందు వేసుకుంటేనే ఎంతబాధో! ఇంక ఆ రోజు వాడిబాధ వర్ణనాతీతం. మందు వేసుకుని త్వరగా కుష్ఠు నయం చేసుకుని చలంగారు వాళ్ళకి దగ్గర కావాలని-వాడి తాపత్రయం. ప్రతిరోజూ షా నడిగి విభూతి వేసుకునే వాడు.

ఒకసారి రంగస్వామి అలిగి తను నర్తకి దగ్గర దాచుకున్న డబ్బుని తీసుకుని సొంతవూరు బయల్దేరాడు. కానీ రెండు రోజులకే చలంగా రింటిముందు మళ్ళీ ప్రత్యక్ష మయ్యాడు. వొచ్చి అమాంతం షా కాళ్ళమీద పడ్డాడు. "ఏమిట్రా, ఏం జరిగింది?" అని అడిగారు షా. వాడు తన వూరు వెడుతూ మధ్యదోవలో ఒక చెట్టు కింద పడుకుని వున్నా డట. విరబోసుకున్న పెద్ద జుట్టుతో ఒకతెల్లని ఆకారం కనిపించి అతన్ని 'వెనక్కి వెళ్ళు' అని ఆజ్ఞాపించిం దట. దానితో మళ్ళీ తిరిగి వొచ్చేశా డట.

రంగస్వామి గడ్డి కోయడానికి వెళ్ళినప్పుడు వాడి కాళ్ళనిండా ముళ్ళు గుచ్చు కునేవి. ఆ ముళ్ళవలన కాళ్ళు బాగా వాచి చీము పట్టిపోయేవి. నర్తకి ఆముళ్ళన్నిటినీ బైటకిలాగి ఆచీము నంతా తుడిచి వాడికి మందువేసి కట్టు కట్టేది. "నర్తకి అతనికి ఇంత దగ్గరగా వుండి సేవ చేస్తోంది. డాలీ చిన్నపిల్ల. అతన్ని కొంచెం దూరంగా వుంచితే మంచిదేమో" అన్నారు షా చలంగారితో. "ఏమీ ఫరవాలేదు. ఇప్పుడు మంచి మందులు వొచ్చాయి కదా" అన్నారు చలంగారు.

రంగస్వామిని ఇంటి ముందు వేపచెట్టు కిందనించి మైలోటి ఇంట్లో పెట్టింది నర్తకి. వాడు ఆవుల సంగతీ అదీ చూస్తూ అక్కడే పడుకునేవాడు. శ్రద్ధగా మందు తీసుకునే వాడు. విశ్వాసంతో విభూతి వేసుకునే వాడు.

ఇంతలో రంగస్వామి బుర్రని ఏం పురుగు దొలిచిందోగాని నర్తకితో గట్టిగా పోట్లాడి తనడబ్బు తీసుకుని పల్లాకుత్తు కాపలాదారు కోనార్ దగ్గరకి వెళ్ళి పోయాడు. రంగస్వామి న్యూసెన్స్‌ని భరించ లేక, ఒకవేళ వాడు తిరిగి వొచ్చినా చేర్చుకో కూడదని చలంగారు వాళ్ళు నిశ్చయించు కున్నారు. ఆ డబ్బు తెచ్చి మళ్ళీ నర్తకికి ఇద్దామని చూశాడు రంగస్వామి, కాని నర్తకి తీసుకోలేదు.

"నీ అలకలూ, పోట్లాటలూ, మేం భరించలేమని" స్పష్టంగా చెప్పేసింది. గేటు దగ్గరకి వొచ్చి "అమ్మా, అమ్మా" అంటూ గోల పెట్టేవాడు. కాపలాదార్లు కాంపౌండ్‌లోకి వాడిని రానిచ్చేవారు కాదు. ఇంక వాడు షౌ వాళ్ళు షికారు వెళ్ళి నప్పుడు మధ్యదోవలో కలుసుకుని వాళ్ళతో కబుర్లు చెబుతూ నడిచి వొచ్చేవాడు. వాడు షౌకి కాళ్ళూ చేతులు చూపించే వాడు తనజబ్బు తగ్గిపోతోందని సంతోషంగా - "శ్రద్ధగా మందు తీసుకో, తగ్గి పోతుంది" అని చెప్పేవారు షౌ. వాడు షౌ మాటప్రకారం తప్పకండా మందు తెచ్చుకుని తినేవాడు. వాడిని కాంపౌండ్‌లోకి రానివ్వక పోయినా షౌ, నర్తకి వెళ్ళి వాడిని పలకరించి మాట్లాడే వారు. చలంగారు వాళ్ళు తమ నివాసాన్ని 'సేవా' లోకి మార్చేశారు. రోడ్డుమీద రాత్రంతా అరుపులు అరుస్తూ డ్యాన్సులు చేసే వాడు రంగస్వామి తనని మళ్ళీ చేర్చుకో మని. వాడి అరుపులకి చలం గారికి నిద్ర పట్టేది కాదు.

రంగస్వామికి జబ్బు పూర్తిగా నయమై పోయింది. ఓరోజు షికారులో వొచ్చి షౌకి ఆసంగతి పరమానందంతో చెప్పుకున్నాడు. వింటూన్న షౌ వాళ్ళంతా ఎంతో సంతోషించారు. కోనార్ రంగస్వామికి పల్లాకుత్తులో ఒక గుడిశ వేసి పెట్టాడు. కొన్నాళ్ళకి వాడికి స్ఫోటకం వొచ్చింది. నర్తకి వాడ్ని ప్రతిరోజు చూసి వొచ్చేది. ఎప్పు

డయినా కనబడక పోతే అంత స్ఫోటకం లోనూ వాడు ఒణుక్కుంటూ వొచ్చి 'అమ్మా, అమ్మా' అని పలకరించే వాడు. ఆ స్ఫోటకంలోనే వాడికి విరోచనాలు పట్టుకున్నాయి. కదలలేని స్థితికి వొచ్చేశాడు రంగస్వామి. షౌని 'భగవానమ్మా!' అని పిలిచేవాడు. నర్తకి వెళ్ళినపుడు "భగవానమ్మని రమ్మను. నేను చూడాలి" అని అడిగేవాడు. అప్పుడు షౌ వాడిని చూడ్డానికి వెళ్ళి విభూతి ఇచ్చి వొచ్చేసే వారు, చివరికి ఆ విరోచనాలే వాడిని పరలోకానికి తీసుకు పోయాయి.

ఆ రోజుల్లోనే నర్తకి వాళ్ళ అన్నయ్య 'వొస్తున్నా' నని వుత్తరం రాశారు. ఆయన చలంగారు వాళ్ళు బెజవాడలో వుండగా నర్తకిని చూడటానికి వొస్తూ వుండేవారు. షౌ ఆ రోజుల్లో అధికభాగం ఏకాంతంలో వుండడం వలన ఆయన వొచ్చి వెళ్ళారని వినడం తప్ప సరిగ్గా ఎన్నడూ ఆయనని చూడ లేదు.

ప్రస్తుతం అన్నయ్య పెళ్ళి చేసుకుని ఇద్దరు పిల్లలతో వొచ్చారు. ఆయన చాలా పొడుగు. భారీ మనిషి.

ఆయన స్వస్థలం తెనాలి. తెనాలిలో ఒక తరహా మనుషులు ( **Type of people** ) వున్నారు. వాళ్ళు ఏ మనిషినీ చూసి భయపడరు. ఏ మనిషినీ లక్ష్య పెట్టరు. కాని వారు చాలా సిన్సియారిటీ, చిత్తశుద్ధి కల మనుషులు. అసలు ఆంధ్రులకి అది పుటకతో వొచ్చిన గుణం. తెనాలివారిలో ఈగుణం మరింత జోరుగా వుంటుంది. వారికి ఎవరిమీదైనా గౌరవం కలిగిందా, వా రది పైకి చూపించినా, చూపించక పోయినా తమ హృదయ మంతటితోనూ వాళ్ళని తమలోనికి తీసుకుంటారు. అన్నయ్య ఆ కోవకి చెందినవారు. ఆయన పేరు నరసింహారావు. షౌ నర్తకిలాగ 'అన్నయ్యా!' అని పిలిచేవా రాయన్ని. ఆమెతోబాటు అందరూ ఆయనని 'అన్నయ్యా' అని పిలిచే వారు. ఆయన భార్య నందరూ 'వదిన' అని పిలిచేవారు.

నర్తకి ఈశ్వరుడ్ని గురించి చెప్పినప్పటి నించీ ఈశ్వరుడంటే ఆయన కెంతో భక్తి, ప్రేమ కలిగాయి.

పూర్వం ఆయ నొక tea stall పెట్టి నడిపేవారు. వ్యాపారం చాలా బాగా సాగుతూ వుండేది. కానీ పిల్లలు చచ్చిపోతూ వుండేవారు. అప్పు డాయన విజయనగరంలో 'బాబాజాన్' అనే మహాత్ముడి దగ్గరకు వెళ్ళారు. అక్కడికి వెళ్ళిన తరువాతే ఈ ఇద్దరు పిల్లలూ బతికి బట్టకట్టారు. అన్నయ్య ఇక్కడికి వొచ్చేసరికి వాళ్ళ అమ్మాయికి మూడేళ్ళు, అబ్బాయికి యాణ్ణార్థం వయస్సు. అబ్బాయి పేరు 'బాబ్జీ', అమ్మాయి పేరు 'మల్లిక'.

పిల్లలు పుట్టిన తరువాత అన్నయ్య వ్యాపారం దెబ్బ తిన్నది. ఎంత ప్రయత్నించీ ఆయన మళ్ళీ నిలదొక్కుకోలేక పోయారు. దాంతో కుటుంబంతోసహా తిరువన్నామలై వొచ్చేశారు. అన్నయ్య కుటుంబం 'అనాసక్తి' (guest house) లో వుండేవారు. అమ్మ ఆ కుటుంబాన్ని తన wing కింద తీసేసు కుంది. ఆ పిల్లలు అమ్మని 'అమ్మమ్మ' అని పిలిచేవారు. ఆ పిల్లలకి ఫలహారాలు పెట్టడం, భోజనం తినిపించడం అంతా అమ్మే చూసుకునేది. పిల్లలకి షౌతో బాగా స్నేహం అయింది. ఆమె వాళ్ళతో ఆడు కోవాలి, వాళ్ళు ఆమె చుట్టూ చేరి గంతులు వేసేవారు. తమ తోటిపిల్లల్ని పిలిచినట్లే షౌని "దామ్మా, ఆలుకుందాం" అని పిలిచేది మల్లిక.

ఒకసారి మెర్స్టన్ ఇదంతా చూసి "పిల్లలు నిన్నెంతగా ప్రేమిస్తారో, ఇంతగా పిల్లలమీద ప్రేమ పెట్టుకుని నువ్వు పిల్లల్ని కనక పోవడం ఆశ్చర్యం" అన్నారు షౌతో. డాక్టరు శర్మగారు ఆవేళ అక్కడే వున్నారు. ఈ సంభాషణంతా విచిత్రంగా వింటున్నా రాయన. "చిన్నతనం నించీ నాకు పిల్లలంటే ఎంత ప్రేమో! ఈశ్వరుడు

వొచ్చినప్పుడు—— నీకు ఏ కష్టం లేకండా గడ్డాలు, మీసాలతో ఎదిగిన పిల్లలు, ఎదిగిన ఆడపిల్లలు ఎంతోమంది రాబోతున్నారని చెప్పారు. అక్కడితో పిల్లలు లేరనే బెంగ దూరమైపోయింది నాకు" అని చెప్పారు షా.

"ఇదంతా నీ **imagination** (వూహ) కాకూడదా? ఈశ్వరు డంటున్నావు అది నీ **personality** (వ్యక్తిత్వమే) యే కాకూడదా? అన్నారు మెర్‌స్టన్ షాతో.

"ఆయన (ఈశ్వరుడు) కళ్ళలోకి నేను చూడలేక పోయేదాన్ని. అట్లాంటిది నా **personality** ఎలా ఔతుంది?" అన్నారు షా. మెర్‌స్టన్ మరేం మాటాడలేక పోయారు. కాని షా మాటలు శర్మగార్ని ఎంతో **impress** చేశాయి.

నర్తకి అన్నయ్యకి చెప్పిందో లేకపోతే అన్నయ్యకే తోచిందో "నన్నేం చేయమంటారు ఈశ్వరుడు" అని షాని అడిగారు. "సొంతంగా వ్యాపారం చేస్తే దెబ్బ తింటోం దంటున్నావు. ఇంత అనుభవం వుందికదా! ఒకరికింద పనికి కుదురు" అని చెప్పారు షా.

"ఆ పనేదో ఇక్కడే చూసుకుంటాను. మళ్ళీ ఆంధ్రదేశం పోను" అన్నా రన్నయ్య. సారంగపాణి, గంగాధరం ఆయనకోసం ఇక్కడే వుద్యోగం చూశారు. కానీ అన్నయ్యకి తమిళం రాకపోవడంతో, తనకే ఇక్కడ నచ్చక పోవడంతో- 'తెలుగుదేశం వెళ్ళిపోతా' నని అడిగారు. ఈశ్వరుడుకూడా అన్నయ్య తెలుగుదేశం వెడితేనే నయమని చెప్పారు. ఆయన అక్కడికి వెళ్ళిన కొద్దిరోజులకే సొంత వ్యాపారం పెట్టారు. అది లాభసాటి అయిపోయింపి. అన్నయ్యకి డబ్బుతోబాటు కుటుంబమూ పెరిగింది. కానీ ఎప్పుడో ఒకప్పుడు ఈశ్వరదర్శనం చేసుకు వెళ్ళేవారు అన్నయ్య. నర్తకి నవ్వుతూ

"ఎప్పు డీ (పిల్లల) సంఖ్యని ఆపుతావు?" అని అన్నయ్యాని అడి గేది. వీలున్నప్పుడల్లా వారి ఖర్చులు భరించ గలిగినప్పుడల్లా కుటుంబా న్నంతటినీ తిరువన్నామలై తీసుకువచ్చేవా రన్నయ్య. ఒక్కొక్క-సారి కొంతమందిని మాత్రమే వెంటబెట్టుకుని వొచ్చేవారు.

ఈ లోపల చలంగా రింట్లో భజనలకి కృష్ణభిక్షు. సుబ్బ రామయ్యగారు రావడం ఆరంభించారు. కృష్ణభిక్షుగారికి మొదటినించీ చలంగారి అభిప్రాయాలు, చలం కుటుంబీకుల రీతులూ, పద్ధతులూ గిట్టేవి కావు. ఆయన చాలా ముందుకాలం నించీ, ఇంకా ఆశ్రమం వృద్ధి కాని రోజులనించీ, భగవాన్ అందరితోనూ చాలా చనువుగా పలుకుతున్న రోజులనించీ, భగవాన్ భక్తులు. ఆయన భగవాన్‌మీద మంచి పాటలు కట్టారు, భజనలకి వొచ్చి ఆ పాటల్ని పాడేవారు. ఎంతో భావయుక్తంగా పాడగల రాయన. ఆయన సౌరిస్‌ని చూచి చాల **impress** అయ్యారు. కొంతకాలం రమణస్థాన్‌కి ఎంతో అభిమాను లుగా వుండేవారు. కానీ కొన్ని విషయాలవల్ల ఆయన దూరమవాల్సి వొచ్చింది.

మద్రాసులో వుంటూ చలంగారిని చూడటానికి వొచ్చారు నారా యణమూర్తిగారు. ఆయన షౌతో ఆధ్యాత్మిక తత్వం గురించి వాదిం చారు. వారి వుద్దేశ్యం ఇదంతా సైంటిఫిక్‌గా రుజువు చేయాలని. షౌ "అయిన్‌స్టీన్ మొదలైనవారు ఏమంటారు? అని వారనేది వివరించే టప్పటికి సైన్సు అయిన్‌స్టీన్ మొదలైన వాళ్ళని ఒప్పుకోదండి" అన్నా రాయన. ఐన్‌స్టీన్ లాంటి గొప్ప సయిన్టిస్టుని విశ్వసించని సైన్సుని నమ్ముకున్నవారికి చెప్పే దేముందని మాటలాడకండా వూరు కున్నారు షౌ. కానీ ఆయన మాటిమాటికీ చలంగార్ని చూడటానికి వొచ్చేవారు. ఆయనకి షౌ పాటంటే చాలా ఇష్టం. ఇక్కడికి వొచ్చి

నేప్పుడు ఎవరితోను మాట్లాడేవారు కాదు. ఓ సిగరెట్ కాల్చుకుంటూ ఓమూలి కూచునే వుండేవారు. జీవితం అంటేనే ఆయనకి bore. షా వాళ్ళు అడిగే వాళ్ళు "ఇక్కడికి వొస్తే boredom ఏమయినా తగ్గుతోందా?" అని. లేదనేవా రాయన. ఇక్కడకూడా బోరే అయితే ఆయన ఇక్కడికి ఎందుకు వొస్తున్నారో ఎవరికీ అర్థం అయ్యేది కాదు.

ఆయన మద్రాసులో వుండి రిసెర్చి చేస్తున్నన్నాళ్ళు తిరువన్నామలై వొస్తూనే వున్నారు. మొట్టమొదట వుద్యోగంలో చేరగానే మొదటి జీతం తెచ్చి చలంగారి చేతుల్లో పెట్టారు. "మీ కివ్వా లనిపించింది. ఇచ్చేస్తున్నాను" అని.

ఒకసారి ఆయిన ఇక్కడికి వొచ్చినప్పుడు "నేను జిడ్డు కృష్ణమూర్తి పుస్తకాలు చదివాను. ఆయన పుస్తకాలవల్ల చాలా impress అయ్యాను" అని చెప్పారు. ఆయనకి జీవితంలో ఏదో ఒక గురి కుదిరింది కదా అని షా ఎంతో సంతోషించారు. తరువాత ఆయన అమెరికా వెళ్ళి పోయారు. అక్కడి నించి చలంగారికి వుత్తరాలు రాస్తూ వుండేవారు. మొట్టమొదట్లో అమెరికన్ మనుషులూ ఆ జీవితమూ ఆయనకి నచ్చలేదు. "ఇక్కడి మనుషులు యంత్రాల్లో వుంటారు. ఇక్కడి జీవితం యాంత్రికం" అని చాలాకాలం Complain చేస్తూ వుత్తరాలు రాసేవారు.

చలంగారు తమ కథలు అనువాదాలు చేస్తే ఎవరైనా తీసుకునే వాళ్ళున్నారా? అని నారాయణమూర్తిగారికి వుత్తరం రాశారు. ఆయన "తీసుకుంటారేమో నేను ప్రయత్నించి చూస్తాను" అని రాశారు. చలంగారు ఇక్కడినించి తమ కథలు కొన్నిటిని అనువదించి ఆయనకి పంపించారు. అక్కడ వాటిని ఎవరూ తీసుకో లేదు. ఒక కథని (దెయ్య

మేనా?) మాత్రం ఎవరో ప్రతికవాళ్ళు తీసుకుని చలంగారికి, కొద్దిగా డబ్బు పంపించారు. నారాయణమూర్తి గారు చలంగారి సుధ కావ్యాన్ని ఆంగ్లంలోకి అనువదించారు. సౌరిస్, జూలీ కావ్యానువ్వాదాన్ని చూసి spirit వొచ్చేలా సవరించారు.

కొన్నాళ్ళకి ఆయన ఇండియా వొస్తున్నా నని, వొచ్చినప్పుడు మిమ్మల్ని చూడడానికి వొస్తానని వుత్తరం రాశారు. ఒక అమెరికన్ స్నేహితుడ్ని వెంట బెట్టుకుని వొచ్చా రాయన. ఆయన రాంగానే "ఇప్పుడయినా మీ boredom పోయిందా?" అని ఆయనని అడిగారు షౌ. అప్పుడు ఆయన "పూర్తిగా పోయింది. అమెరికాలో రెడ్ ఇండియన్ ఆమె ఒకరు వున్నారు. ఆవిడ (Spiritual dancer) ఆధ్యాత్మిక నృత్యాలు చేయిస్తుంది. నేను వాటికి వెళ్ళాను. అక్కడ ఆమె దగ్గర నా కెంతో శాంతి లభించింది." అన్నా రాయన. ఆ groupకి చెందినవారిలో ఒకరినే తమతో తీసుకు వొచ్చా రాయన. ఆ దేశాలనించి వెతుక్కుని వెతుక్కుని వొచ్చేవారికి భారతదేశంలో శాంతి లభిస్తే, భారతదేశీయులైన నారాయణమూర్తిగారికి ఆ దేశాలలో శాంతి లభించింది. "నాకు అమెరికా చాలా నచ్చింది. ఆ జీవితం నాకు బాగా సరిపడింది. నాకు అక్కడినించి రావా లనిపించడం లేదు" అన్నా రాయన. ఒకవేళ ఆయన ఇక్కడికి వొచ్చినా ఆయన చదివిన చదువుకి సరిపడే వుద్యోగా లిక్కడ లేవు. మళ్ళీ అమెరికా వెళ్ళిపోయారాయన. కొన్నాళ్ళు వుత్తరాలు రాసేవారు. ఆ తరువాత వుత్తరాలు రాయడం మానేసుకున్నారు. 1975లో మళ్ళి చలంగారికి వుత్తరం రాశా రాయన.

"మీకు వుత్తరాలు రాసి చాలా కాలం అయింది. ఇప్పుడు నేను ఒక అమెరికన్ ఆమెని పెళ్ళి చేసుకున్నాను. ఒక కూతురు. మేమంతా మిమ్మల్ని చూడటానికి వొస్తున్నాం, ముఖ్యకారణం షౌ పాటే" అని రాశారు.

"సరే తప్పకండా రండి" అని చలంగారు రాశారు. ఆయన భార్యాసమేతంగా రమణస్థాన్‌కి వొచ్చారు. ఆయన కూతురు ఎంత ముద్దుగా వుందో! ఆ పాపాయిని బుజ్జి అని పిలిచేవారు. ఆ పాప ఎంతో ప్రత్యేకతవున్న పిల్ల. ఆ పాప షా బొట్టుని చూసి ఇట్లాంటి బొట్టు పెట్టుకో లేదేం? అని తల్లిని అడిగింది. ఇంతా చేస్తే ఆ పాప వయస్సు యాణ్ణార్థం.

కృష్ణ భజనకని హార్మోనియాన్ని పెట్టెలోంచి తీయగానే, ఆ పాప హార్మోనియం పెట్టెలో కూచుని నమస్కారాలు చేసేది. ఆ హార్మోనియం పెట్టె మూతలోపల కృష్ణుడు, సరస్వతి, ఈశ్వరుడు బొమ్మలు అంటించి వున్నాయి. ఆ పాపకి ఆ పటాలకి నమస్కరించమని ఎవరు చెప్పారో! ఇంక ఆ దేవుళ్ళందరికీ నమస్కారాలు చేస్తూ ఒక పాట పాడేది.

తరువాత నారాయణమూర్తిగారు కుటుంబంతోసహా హైదరాబాదు వెళ్ళారు. అక్కడి నించి ఆయన అమెరికా వెళ్ళిపోయారు. ఆయన భార్య అరుణాచలం వొచ్చి, రమణస్థాన్‌లో కొన్నాళ్ళు గడిపి ఆమె పాపను తీసుకుని తిరిగి అమెరికా వెళ్ళిపోయారు. ఇప్పటికీ నారాయణమూర్తిగారు చలంగారికి వుత్తరాలు రాస్తూనే వున్నారు. రమణస్థాన్‌లో ఈశ్వరుడు ఆయనని కట్టేయక పోయినా షా పాట ఆయనని ఆకట్టేసింది.

## 14

చలంగారింటి పక్కన 'ప్యూరిటీ'లో ఒక తమిళ కుటుంబం అద్దెకి వుండేవారు. వాళ్లు చలంగారు వాళ్ళతో ఎంతో స్నేహంగా వుండేవారు. వాళ్ళకో కుక్క వుండేది. సాధారణంగా చలంగారికి జంతువులతో సహవాసం వుండేది కాదు. ఒక్క బుజ్జాయి (ఆవు

చూడ) మాత్రం చలంగార్ని ప్రేమించి ఆయనకి తనంతట తానే దగ్గరయింది.

ఒక రోజు చలంగారు ఆశ్రమానికి వెడుతుంటే పక్కింటి కుక్కకూడా ఆయన వెంట వెళ్ళింది. ఆ కుక్క పుణ్యమా అని చలంగారు కుక్కకాటుకి గురయ్యారు. ఆ సంగతి సందర్భాలు వారి మాటల్లోనే విందాం.

"నా కాలిని కుక్క కరిచింది. ఒకకాలు కుంటి. రెండోకాలు కుక్కకాటు. పక్కమీదనే ఈ అయిదు రోజులూ కథ వినండి.

సాయంత్రం ఆశ్రమానికి వెళ్ళాం. నేను, నర్తకి, డాలీ. మాతో వొచ్చిన కుక్క (జాకీ కాదు) మీద పడ్డది ఆశ్రమం కుక్క. మా కుక్క నా కాళ్ళ సందున దూరింది. దాని కంఠం అనుకుని నా కాలుని కరిచింది. పోతున్న నా వెనక రక్తపుధారని చూసి, నర్తకి గుర్తుపట్టింది, అరుగులపైని కూచుని ఆరుగురు చూస్తున్నారు ఈ తమాషా. ఒక్కరు కదల లేదు. ఆస్పత్రికి వెళ్ళాము- డాక్టరు మమ్మల్ని చూసి తలుపు వేసుకున్నాడు.

నర్తకీ, డాలీ కిష్టా వెళ్ళి బతిమాలారు. నెత్తురు కారిపోతోంది, కట్టు కట్టమని.

"పెద్ద ఆస్పత్రికి పోండి" అని కసిరాడు. అంతకు ముందు ఆశ్రమం తోవలో కనపడి నవ్వుతూ మాట్లాడాడు. ఆ డాక్టరు నాకు స్నేహితుడు.

రక్తం కారుతూనే ఇంటికి వొచ్చాం. బండీ లేదు. ఏం చేసినా రక్తం ఆగటం లేదు. కాంపౌండరన్నా దయ తలుస్తాడేమో నని ఆశ్రమానికి పరిగెత్తింది నర్తకి. అతను భోజనంచేసికాని రానన్నాడు. అక్కడే కూచుంది. చాడ్విక్‌గారు కనపడ్డారు. నర్తకి చెప్పింది. దానికి

ఆయన "ఆ కుక్క అంతే, నా పిల్లిని కూడా చంపింది. నెమళ్ళని తరుముతుంది- అని ఆ కథ నంతా సవిస్తరంగా వినిపించారు. భోజనమై కాంపౌ రు వొచ్చాడు. అతన్ని పిలిచి డాక్టరు "నువ్వు వెళ్ళి కట్టు కట్టవ న్నాడు. తిరిగి తిరిగి బతిమాలింది నర్తకి. ఆస్పత్రి లోంచి మం ఇవ్వ నన్నాడు. పాపం, ఆ కాంపౌన్డరు వుత్త చేతులతో వొచ్చాడు.

తరువాత ఇంతవరకూ ఎవరూ ఆశ్రమంవారు ఇటు రాలేదు— సుందరేశయ్యర్‌తో సహా.

కాలు నయ మయింది- ఎట్లా నయ మయిందో- మీకూ తెలుసు, నాకూ తెలుసు,

ఇదంతా నిజమంటారా ? కల అంటారా ? మీరు నమ్మ గలుగు తున్నారా ?

చాడ్విక్‌కి ఏమొచ్చినా, ఈశ్వరుడే కదిలి ఆయన గదికి వెళ్ళి చూసి వొస్తారు- నేను సరేసరి !

ఆ రాత్రి బసవరాజుగారు గిరిప్రదక్షిణం వెళ్ళారు. పరశురాం కాలు వాచి కదలలేదు. ఆరోగ్యం వూళ్ళో లేదు. Setting ఎట్లా ఏర్పాటు చేశారో చూశారా ఈశ్వరుడు ? కాలు రక్తం కారుతో మంచం మీద నేను, తమాషా చూస్తో ఎదురుగా నవ్వుతో ఈశ్వరుడు. గాయం పైన వేలు పెట్టి పకపక, ఎవరు దిక్కు ? ఎవరు దిక్కు ? అని గుండె లదురుతో పరుగులు తీస్తో నర్తకి !

ఏదో గొప్ప వుద్దేశ్యంతోనే చేయించారు. ఏదో పరీక్ష గావును·

ఎందు కంటే- దీంట్లో రాసిన, పేర్లు కలవా రందరూ చాలా మంచివారు. హృదయం కలవారు, భక్తులు.

వారి హృదయాలపైన, కళ్ళపైనా పొర కప్పారు- నన్ను పరీక్షించడానికే- వారిని తరింప చేయడానికే.

తనపైన ఆధారపడి నిలుస్తానా? తన భక్తుల్ని ద్వేషించ కండా వుంటానా? ఇట్టాంటి దేమన్నా పరిశీలనేమో? అదేదో కల!

ద్వేషం లేదు - - - - కాని - - - కాని - - - - ఏదో కలిగింది. అందుకే అంటున్నాను.

కుక్కకాటు మానింది - - - - మనిషికాటు మానలేదు అని.

ద్వేషం రాదు- కాని మన మిత్రుల్ని చూసి ఏ మౌతాము — ఎంతసిగ్గో నాకు వాళ్ళని తలుచ కుంటే - నేనేదో వాళ్ళని చేసినట్టు.

ఇట్లా నిష్కారణ ద్వేషాన్ని రేపడం నా జాతకం కాబోలు! ఆ కాంపౌన్డరు నర్తకి ఆవేదన చూసి రక్తం కారిపోతోందంటే నిలవలేక పోయాడు. చిత్రం- చాలా లోతుగాయం - ఒక నిమిషం నాకు ఏనెప్పి కలగలేదు— అది లేనట్టే, గుర్తు లేకండా మాయమయింది- అంతగట్టి గాయమూను.

మనిషి కాటుకు ఈశ్వరుడే మందు"

(శాస్త్రిగారికి చలంగారిలేఖ 18-4)

ఆ తరువాత చలంగారి గాయం పూర్తిగా మాని పోయింది. కాంతంగారు 'నాయన' సమాచారసేకరణలో అరుణాచలం వొచ్చినప్పుడు ఆశ్రమం పూజార్లు వాళ్ళు ఆయనకి చలంగారిని కుక్క కరిచినప్పటి సంగతి చెప్పారట. కుక్క కరిచినా గాని చలంగారు నిశ్చలంగా, శాంతంగా వుండిపోయారని, ఆయనని చూస్తూవుంటే ఆ నిమిషాన భగవాన్‌లా కనిపించారని చెప్పారట.

ఆ రోజులలోనే షా కూచుని వుండగా ఈ ప్రపంచ ఖండాలలోని సముద్ర తీరాలన్నీ నీళ్ళలో మునిగి పోయినట్లుగా ఒక దృశ్యం

కనబడింది. స్పష్టంగా తేదీ కూడా 8 ఫిబ్రవరి 1962 గా కనిపించింది. సాధారణంగా షౌకి ఎన్నో దృశ్యాలు కనబడుతూ వుండేవి. కానీ ఈ దృశ్యం సంగతి మాత్రం ఆమె ఎవరికీ చెప్పలేదు, భయపడిపోతారని.

చాడ్విక్ ఒక జ్యోతిషపత్రిక తీసుకు వొచ్చి జ్యోతిషం గురించి చలంగారితో మాటలాడే వారు. ఆ పత్రికలో 1962 లో ప్రళయమని జోస్యం చెప్పారు. శాస్త్రిగారు, చలంగారు ఈశ్వరుడ్ని "ఏమిటి ఇలా ప్రళయం వొస్తుందని predict చేస్తున్నారు నిజమేనా?" అని అడిగారు. షౌ తాను చూచిన దృశ్యాన్ని చెప్పారు. "ఈ విషయంలో ఈశ్వరు డేమంటారు?" అని అడిగారు వాళ్ళు.

"వొస్తుందో, రాదో, అదంతా మీ కెందుకు?" అన్నారు ఈశ్వరుడు.

"ఏమండి మేమంతా మునిగి పోతుంటే మీరు చూస్తూ వూరు కుంటారా?" అని ప్రశ్నించారు వాళ్ళు.

"ఆ సంగతి నేను చూసుకుంటాను" అన్నారు ఈశ్వరుడు.

"ఏమిటండీ అంతా మునిగిపోతుంటే మీరు చూస్తూ వుంటా రన్నమాట" అన్నారు శాస్త్రిగారు.

ఆ తరువాత చలంగారు, శాస్త్రిగారు జ్యోతిష్యపరంగా ప్రళయ కాలాన్ని లెక్క కట్టడం ప్రారంభించారు. ఈశ్వరుడ్ని అడుగుతూనే వున్నారు. ఈశ్వరుడు "ప్రళయం వొస్తుందని శాస్త్రాలన్నింటిలోనూ వుందని, శాస్త్రాలు సత్యం కనక ప్రళయం వొస్తుందనీ తాను ఈ కాలం, ఆ కాలం అని చెప్పనని" అన్నారు. చలంగార్ని ఈ ప్రళయం సంగతి ఎవరికి రాయొద్దని ఆజ్ఞాపించారు.

కానీ చలం మహర్షి ముందుగా చిన్నారావుగారికి తరువాత అనే కులకి ప్రళయం సంగతి వుత్తరాల్లో రాశారు. ఆ వుత్తరా లివి.

"1962 ఫిబ్రవరిలో ప్రళయం రాబోతుందనీ, చాలా భూమి సముద్రం నీటిలో కొంతకాలం మునిగి వుండ బోతోందనీ అక్కడితో కలియుగం ఆఖరనీ, అనేక మూలలనించి వార్తలు తెలుస్తున్నాయి. ఈశ్వరుడు కూడా అదే అంటున్నారు."

(చిన్నారావుగారికి చలంగారి లేఖ 6-3-58)

"ఈశ్వరుడు ప్రళయం వొస్తుం దంటున్నారు. ఎప్పుడో నిర్ణయంగా చెప్పరు.

జ్యోతిష పత్రికలో 1962 లో గోచారంవల్ల అన్ని గ్రహాలు ఒకచోట చేరతాయనీ, దానివల్ల ప్రపంచానికి ఉపద్రవాలు వొస్తాయనీ రాశారుట. జ. రు. శాస్త్రిగారు లెక్కరాసి 1962 ఫిబ్రవరిలో ప్రళయమని తేల్చారు. ఇంకా కొన్ని జ్యోతిషాల్నిబట్టి 1961 నించే సంహారం ప్రారంభ మవుతుంది అనుకుంటున్నాము.

"ఈ యుగసంధిలో ప్రళయంతో పాపాన్నంతా వూడ్చి కొత్త యుగాన్ని స్థాపించడానికే భూమికి దిగివొచ్చాను" అని తరచు అంటున్నారు- ఈశ్వరుడు. యూరప్ క్రిస్టియన్స్‌లో కొందరు 1962 కి ఎదురు చూస్తున్నారు."

(చిన్నారావుగారికి చలంగారి లేఖ 10-4-58)

ఈశ్వరుడు నిన్న సుందరేశంగారితో "అవును, ప్రళయం రాబోతోంది. కాని నేను అది 62 లో అనలేదు- 'వీళ్ళు' - అంటున్నారు" అన్నారు. (శాస్త్రిగారికి చలంగారి లేఖ 7-4-58)

ఇంక ప్రతీవారు ప్రళయం గురించే మాటలాడేవారు. ప్రళయం వొస్తుందని ఏ ఏ శాస్త్రాలలో చెప్పారో, ఏ ఏ జ్యోతిష్కులు చెప్పారో ప్రపంచ మంతటా ఇదే కలవరం బయలు దేరింది. సాగరశాస్త్రం ప్రకారం 1962లో sea bergs కొట్టుకువొచ్చి సముద్రా లుప్పొంగి

వూళ్ళు కొట్టుకు పోతాయని సాగరశాస్త్రవేత్తలు చెప్తున్నారని కొందరు చెప్పారు. History ప్రకారం 1962 లో ప్రళయం తప్పదని చరిత్ర కారులు చెప్తున్నారని చెప్పేవారు కొందరు. ఏ పుస్తకం చూచినా, ఏ శాస్త్రం చూచినా 1962 ప్రళయం అని వుంది అనేవారు కొందరు. అష్టగ్రహకూటమి ఏర్పడి 1962 ఫిబ్రవరి 4వ తేదీన తొమ్మిదిగ్రహాలు అంటే ఎనిమిదిన్నీ ఒక్క జలరాశిలో చేరబోతున్నాయి అని చెబుతోంది ఎస్ట్రానమీ. ఇంక ప్రపంచ మంతా ఇవే వార్తలు పొక్కిపోయాయి. ప్రళయం వొస్తుందో, రాదో ఎవరికీ తెలియదు, గానీ ప్రళయం గురించి చర్చ లోక ప్రళయంలా వొచ్చాయి. ఇంక ఎందరెందరో చలంగారికి "ఇలా ప్రళయం వొస్తుందని అంటున్నారు ప్రపంచమంతా— మీ రేమంటారు?" అని రాసేవారు. వారికి చలం గారు "మీరు ఈశ్వరుడ్ని చూశారు కదా! మీకేం భయంలేదు" అని అభయమిస్తూ సమాధానాలు ఇచ్చేవారు.

"ఇదేం ధైర్యమా?" అనుకునేవారు షౌ.

కాని చలంగారికి పూర్ణవిశ్వాసం— ఎవరైనా ఈశ్వరదర్శనం చేసుకుంటే వారిని ఏ ప్రళయాలైనా ఏమీ చేయలేవని. అందువల్లే అందర్నీ వా రావిధంగా assure చేశారు.

9-2-57వ తేదీన గొఱ్ఱెపాటి వెంకట సుబ్బయ్యగారు చలంగారిని చూడడానికి అరుణాచలం వొచ్చారు. ఆయన, చలంగారు బెజవాడలో వుండే రోజుల్లో ఒకసారి చలంగా రింటికి వొచ్చారు. అప్పట్లో వెంకట సుబ్బయ్యగారు "అక్షరాభిషేకం" అనే పుస్తకం రాస్తున్నారు. అప్పటి దాకా తెలుగులో అలాంటి పుస్తకం రాలేదు. చలంగారి దగ్గరికి వొచ్చి చలంగారి మీద రాసింది చదివి వినిపించారు. చలంగారది చాలా బావుం దని మెచ్చుకున్నారు. ఆ పుస్తకం అచ్చయ్యాక చలంగారికి పంపించా

రాయన. ప్రస్తుతం ఆయన చలం జీవిత చరిత్ర రాస్తానని పట్టు పట్టి కూచున్నారు.

"నే నిక్కడ నా పాతచరిత్ర నంతా ప్రయత్నించి మర్చిపో యాను. ఇంకేం చెప్పను?" అన్నారు చలంగారు.

"ఏమిలేదు. నా కోసం కొంచెం గుర్తు తెచ్చుకోండి మీ జీవితం లో కొన్ని Periods లో ఏం జరిగిందో నాకోసం కొంచెం జ్ఞాపకం చేసుకుని చెప్పండి" అన్నారు వెంకటసుబ్బయ్యగారు.

"ఈశ్వరుడు చెప్పమంటే చెబుతా న"న్నారు చలంగారు.

"సరే రాయండి" అని షౌ తాము విశ్రాంతికి కూడా లోపలికి పోకుండా తమకి తెలిసి నంతవరకూ చలం జీవిత విశేషాలను తెలి పారు. వెంకటసుబ్బయ్యగారు ముందుగానే ఒక ప్రణాళిక ( plan ) ప్రకారం వొచ్చి దానికి తగినంత matterనే తీసుకుని రాశా రాయన. ఆ పుస్తకానికి గొప్ప response వొస్తుందని షౌకి ముందుగానే తెలి సింది. అట్లాగే వొచ్చింది.

వెంకటసుబ్బయ్యగారు తమ రచనాప్రణాళికని గురించి చలం గారికి, సౌరిస్‌గారికి ముందుగానే చెప్పివుంటే బావుండేది. ఆయన చలంగారి మీదేదో (మేగ్నమ్ ఓపస్) మహాకావ్యం రాయబోతున్న ట్లుగా చలం ప్రేమికు లందరూ అనుకున్నారు. కానీ చలం, సౌరిస్‌ల చేత ఎన్నోరోజులు చెప్పించిన సమాచారం వొదిలిపెట్టి తమ దృక్ప ధంతో తమకి తోచినట్లు వెంకటసుబ్బయ్యగారు చేసిన రచన eventful అయినదేగానీ సాహితీ పరుల్ని ముఖ్యంగా చలం అభిమానుల్ని డిజ ప్పాయింట్ చేసింది.

"ఒక వారంగా గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు ఇక్కడ వుంటున్నారు. నా జీవితచరిత్రకి material కోసం. ఈ వారం రోజులూ

ఈశ్వరుడు లోపలికి పోకండా పగలంతా కూచుని ఆయనకి చాలా విష యాలు చెబుతున్నారు. నా చరిత్రని నాకు జ్ఞాపకంచేసి చెప్పిస్తున్నారు. నీతి, ధర్మం, అశ్లీలం. వివాహం వీటిపైన ఆయనకు కొత్త విజ్ఞానం ఇచ్చారు. ఏదో ఓ చలం జీవితవిశేషాలు ఏకరువు పెట్టడంలాగు లేదు. ఏదో మహత్తరమైన బోధ జరుగుతున్నట్టుగా వుంది ఇన్ని రోజులూ. దీంటోంచి ఏం ఉద్భవం కాబోతోందో. వారు ఏ ప్రయోజనం సాధించ తలుచుకున్నారో అనుకుంటాను. చలం జీవితానికి ఒక 'రిదం' ఒక అర్థం కనపడేట్టు మాట్లాడారు ఈశ్వరుడు.

వెంకట సుబ్బయ్యగారి ఆకారంలో ఎంత మార్పో. సంతో షంతో గంతులు వేస్తున్నారు.

(శాస్త్రిగారికి చలంగారిలేఖ 16-2-57)

"జగ మెరిగిన వెంకటసుబ్బయ్యగార్ని పరమెరిగిన వెంకట సుబ్బయ్యగారుగా మార్చారు ఈశ్వరుడు.

ఒచ్చిన రోజునించి 10-30 నించి సాయింత్రం 5-30 వరకు నేను, ఆయన, ఈశ్వరుడు కూచుంటున్నాము. 10 వరకు నాతో సుబ్బ య్యగారు **Discussion**. ఆయన రాసిన అక్షరాభిషేకంలోని చలం సంగతుల్ని **revise** చేయించారు ఈశ్వరుడు. నీతి అంటే, ధర్మ మంటే, శృంగారం, కామం, బూతు వీటి **definitions** ని ఆయన తలలో **clear** చేశారు. ఇప్పుడాయన చలం **biography** రాయాలని కూచున్నారు. ఇక్కడ మూడు రోజుల నించి చెపుతున్నారు. ఈశ్వ రుడు చెప్పిస్తున్నారు. గోడలు, తలుపులు, చెవులు విప్పి వింటున్నాయి. చాలా గొప్పగా జరుగుతోంది. కావ్యజగత్తుని కదిలించబోయే ఘట్టం. చాలా విశేషమైన రోజులు రాబోయే పుస్తకానికి **tentative title** 'చలం - అచలం'. నీ రాకకూ ఆయన రాకకూ భేదం - ఆయన శర

ద్దర్శనం నించి బైలుదేరి ఈశ్వరదర్శనం కోసం వొచ్చారు, దర్శించ గానే పాదాక్రాంతులైనారు. చలం చరిత్రకు matter ప్రసాదించు మన్నారు. జరుగుతోంది.

60 ఏళ్ళ వెంకటసుబ్బయ్యగారు 4 రోజుల్లో తన వయసుని shed చేసి తన పూర్వాభిప్రాయాల్నీ, నా నించి భేదాభిప్రాయాల్ని మరిచి, చిన్న పిల్లాడి మల్లే గంతులెయ్యడం చూడాలి నువ్వు. చాలా గొప్ప plan చేస్తున్నారు biography కి.

(ప్రసాద్‌కి చలంగారి లేఖ 14-2-57)

అసలు చలం అంటూ ఒకరు వున్నారనీ, ఆయనెవరో ఏమిటో తెలుగుదేశానికి తెలిపింది వెంకటసుబ్బయ్యగారు రాసిన చలం జీవితమే, చాలా మందికి ఆయన రాస్తున్నప్పుడు ఆశాభంగం కలిగింది. చలంగారితో "ఏమిటండీ! ఇలా రాస్తున్నారు" అంటూ complain చేసేవారు. వెంకటసుబ్బయ్యగారు "నే నేదో ప్రయత్నం చేయాలని చేస్తున్నాను. మీకంత 'అసంతృప్తిగా వుంటే మీరూ రాయండి. నేను అభ్యంతర పెట్టడం లేదే. నేను ప్రారంభం చేస్తున్నాను" అని అనేవారు. ఆయన stand point షౌకి చాలానచ్చింది. వెంకటసుబ్బయ్యగారు చరిత్ర రాస్తున్న కాలంలోనే ఆయన ఒకరోజు వొచ్చి "చలాన్ని చూసిం తరువాత నాకు చలం రచనలమీద అభిమానం పోయింది. ఆయనని చూస్తే చాలు" అని అన్నారు.

ఇంక చలంగారింట్లో అందరికీ ఎంత దగ్గరై పోయారో ఆయన. తరువాత చలం చరిత్ర రాయడానికి మళ్ళీ మళ్ళీ వొస్తూనే వున్నారు. వెంకటసుబ్బయ్యగారి, చలం గురించి చలంగా రేమంటారో విందాం.

"సుబ్బయ్యగారి 'చలం' సంగతి. ఆయన చాలా పరిశ్రమ చేసి రాశారు. సుబ్బయ్యగారి జీవితమూ, అభిప్రాయాలూ, అభిరుచులూ, చలం వాటికన్నా చాలా భిన్నం. అయినా వాటిని అతిక్రమించి అర్థం చేసుకోవాలని ప్రయత్నించారు. అంతవరకే మనం ఆనందించాలి.

(జగ్గారావుగారికి చలంగారి లేఖ 16-12-58)

ఒకాయన నా బయోగ్రాఫీ ఎటెంప్ట్ చేస్తున్నారు — (గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు) ఆ సంగతి తెలిసి ఆమె రాసింది— నీ జీవితంలో ఏముంది రాయడానికి ?

ప్రతివాళ్ళనీ తిట్టాడు. ప్రతివారిచేత తిట్లని తిన్నాడు. ఇంకేముంది ? అన్నది.

ఆ సంగతి ఆయనకి రాశాను.

ఆమె ఎడ్రస్ ఇమ్మని ఆయన చలంపైన వో ఎస్సే ఇమ్మని కూచున్నాడు.

అయింది అమ్మాయిగారి పని.

"చలమంటే నాకు చాలా ఇష్టం" అని ఒక్కవాక్యం రాసి పంపుతుందిట. (కామేశ్వరి లేఖ 18-6-59)

ఒక ఏడాదినించి హైదరాబాదు నించి వొచ్చి పెద్దక్కయ్య చలంగారు వాళ్ళతోనే వుంటోంది. బెజవాడలో చూడడమే ఆమెని. మళ్ళీ ఇన్నేళ్ళకి అరుణాచలం వొచ్చాకనే ఆమెని చూచారు చలంగారు వాళ్ళు. నర్తకి, పకపక ఆమెని ఏపనీ చెయ్యనివ్వకుండా ఆశ్రమానికి పంపించేసేవారు.

మొట్టమొదటి రోజున పెద్దక్కయ్య ఆశ్రమానికి వెళ్ళి షౌ దగ్గరకి వొచ్చింది— ఒళ్ళంత ఒణికి పోతూ, పెద్ద ఆవేశంతో కళ్ళమ్మట

నీళ్ళు కారుస్తూ. "నాకు ఆశ్రమంలో గొప్పవెలుగులో భగవాన్ దర్శనం ఇచ్చార"ని షాకి చెప్పింది. షా ఎంతో సంతోషించారు. చిన్నప్పటి నించి ఆమెని తమనించి వెళ్ళి పోవొద్దని బలవంతం చేసేవారు చలం కుటుంబీకులు. కానీ కొడుకు మీద ప్రేమ ఆమెని లాక్కొని పోయేది. ఇప్పుడూ అట్లానే అందరూ బలవంతం చేశా రామెని. "ఎందుకు వెడతావ్? మాతో వుండిపోకండా?" అని. కానీ పెద్దక్కయ్య మళ్ళీ కొడుకుమీది మమకారంతోనే బయలు దేరింది. వెంకటసుబ్బయ్యగారు తమవూరు వెడుతూంటే ఆయనతో తానూ బయలుదేరి వెళ్ళిపోయింది. వెళ్ళిపోయిన యాడాదికే చచ్చిపోయింది.

చలంగారికి వజీర్ రహ్మాన్ ముందుగా ఉత్తరం రాశారు— "నేను మీరచనలలో కొన్ని సెంటెన్‌సెస్ తీసుకొని పద్యరూపంలోకి కూరుస్తున్నా" నని. అప్పటినించి వారికీ చలంగారికి పుత్తర ప్రత్యుత్తరాలు జరుగుతున్నాయి ఆయన చలం వాక్యాలతో తాముకూర్చిన పద్యాలని, తమకు చలంగారు రాసిన వుత్తరాలతో సహా అచ్చు వేయించారు— అదే "కవిగా చలం".

"మొదట అవేవో మీరు రాశారను కున్నాను. ఎవరీ గొప్పకవి? అని ఆశ్చర్యపడ్డాను. కొంచెం దూరం చదివితేనే గానీ అవి నేను రాసినవని తెలీలేదు. చదువుతున్న కొద్దీ ఇంత గొప్ప కవిత్వం నేనేనా రాసింది. అని ఆశ్చర్యపడ్డాను. మీరు వాటిని ఏరి ఏర్పరిచి రాయడమూ అంతకు ముందు మీరు వాటిని, వాటిలో కవిత్వాన్ని గుర్తించి, వాటిని మననం చేసుకుని అనుభవించడమూ ఆ గీతాలకి కొత్త అందా బలాన్ని ఇచ్చిం దనుకున్నాను, కాకపోతే, నేను గుర్తించనో త్వాన్నీ, అందాన్ని మీ కళ్ళు గుర్తించ గలిగాయి అంటే: హృదయ మాధుర్యం అతికి వుండదా?"

(వజీర్‌రహ్మాన్‌గారికి చలంగారి లేఖ 24-9-55)

చలంలో వున్న గొప్ప కవిత్వానికి అంధమైపోయిన ఆంధ్ర దేశం కళ్ళు తెరిపించారు. ఆ అమూల్యకవితా సంపుటిలో వజీర్ రహ్మాన్.

చిన్నారావుగారితో కలిసి చలంగారిని చూడటానికి వొచ్చారాయన ఆయనది artistic appearence. అయనలో ఎంతో grace. ఆయన సౌరిస్‌తో "ఆయనే ఈశ్వరుడైతే గాడిదని గుఱ్ఱంగా మార్చకూడ దండీ, గాడిదని గుర్రంగా మారిస్తే తప్పకండా ఆయన ఈశ్వరుడని నమ్ముతాను" అన్నారు.

"మీ రిప్పుడు నమ్మకపోతే ఏమండి?" అన్నారు షా.

"మరి నేను నమ్మితే నేను మార్తాను. నాకు మారాలని వుంది. ఆయన నన్ను నమ్మించాలి" అన్నా రాయన.

"ఆయన ఎవర్నీ నమ్మించరు. మీ ఇష్టం. నమ్మితే నమ్మండి. లేకపోతే లేదు." అని చెప్పారు షా,

చలంగారితో మూడు రోజులపాటు సరదాగా గడిపి— చిన్నా రావుగారు, వజీర్ రహ్మాన్ వెళ్ళిపోయారు.

శాస్త్రిగా రీసంగతి విని "గాడిదలని గుఱ్ఱాలుగా మార్చడమే కదా ఇప్పుడు ఈశ్వరుడు చేస్తున్న పని" అన్నారు.

షాకి ఒక visionలో వజీర్, పకపక పెళ్ళి చేసుకో బోతున్నా రని కనిపించింది. షాకి ఆశ్చర్యం కలిగించిం దావిషయం. ఎందు కంటే పకపక పెంపకం వేరు. శుద్ధబ్రాహ్మణ వాతావరణంలో పెరి గింది. ఆమెకి బ్రాహ్మణత్వం మీద గట్టిపట్టు. ఇంక ఈయన నెట్లా పెళ్ళి చేసుకుంటుందా అనిపించింది. ఆయన వుత్తారాలనిబట్టి చూస్తే ఆయన పెళ్ళి చేసుకునే పద్ధతిలో లేరు. కొత్త భాషలు పరిచయం చేసు

కోవడం, సాహిత్యాధ్యయనం చేయడం ఆయన కెంతో ప్రీతి. ఆయన కొక artistic life lead చేయాలని వున్నట్లుగా తోచేది షాకి.

అందరికి ఫ్లారెన్స్ నైటింగేల్‌లా ఏ ఏవగింపూ లేకండా సేవ చేసిన నర్తకికి కుష్ఠు వొచ్చింది. అది early stages లోనే కనుగొన్నారు.

ఇక్కడనించి ఈశ్వరుడేం విలాసం చూపనున్నారో ఎవరికెరుక.

అంతకు మునుపు ఈశ్వరుడికి నర్తకి ఎంతగా ఎదురు తిరుగుతోం దంటే, అది ప్రపంచంలో ఏమీ అంటని షాని బాధ పెట్టింది. ఆ విషయం నర్తకికి తెలియదు. నర్తకి ఏదన్నా జబ్బుపడితే బావుండుననిపించిది షాకి— అప్రయత్నంగా. కానీ ఆమెకి ఈ జబ్బు చేస్తుం దను కోలేదు.

నర్తకి డాక్టరు దగ్గరికి పరిక్ష చేయించు కోవడానికి వెళ్ళింది. డాక్టరు అది కుష్ఠేనని నిర్ధారణ చేశాడు. నర్తకి తిరిగి వొచ్చేసరికి షా తమ గదిలో వున్నారు. షాకి నర్తకి వాళ్ళమాటలు వినబడు తున్నాయి. అప్పుడు షా తమ గదిలో నించి బైటికి వొచ్చేశారు. "నేను ఏవిష మన్నా తాగి చచ్చిపోతాను. నావల్ల ఇంతమందికి ఈ వ్యాధి వొస్తుం దని భయంగా వుంది. నేనది భరించలేను. నావల్ల ఎవరికీ బాధ కలగక ముందేనన్ను హాయిగాచచ్చిపోనివ్వండి" అంటోంది నర్తకిపుద్వేగంతో. అప్పుడు షా నర్తకిని దగ్గరగా తీసుకుని "నర్తకి, నువ్వేం భయపడకు. నేను నీకు కుదర్చ బోతున్నాను" అని చెప్పారు. అందరూ నిశ్చేష్టితులై వింటున్నారు. "అయితే నా కే భయంలేదు"— అంది నర్తకి.

నర్తకిని regular గా మందు తీసుకోమన్నారు షా. ఆవూళ్ళో Govt. Hospital లోనే leprosy clinic విడిగా వుంది. నర్తకి

అక్కడే మందు తీసుకోవడం మొదలు పెట్టింది. రోజూ నర్తకికి మచ్చలు వున్నచోట విభూతి రాసేవారు షౌ. చిత్రతో నర్తకి "కాకా చిన్నపిల్ల, నానించి దూరంగా వుంచు ఎందుకైనా మంచిది" అని చెప్పింది.

"ఆ జబ్బు దానికి రావాలని రాసిపెడితే దూరంగా వుంచినా రాకమానదు. నాకేం భయంలేదు నర్తకి" అని చెప్పింది నిశ్చలంగా చిత్ర.

అందరికీ నర్తకికి తొందరగా వ్యాధి నయమై హాయిగా వుండాలని ఆదుర్దాగా వుండేది. కానీ అమ్మకి కుష్ఠువ్యాధి అంటే వల్లమాలిన భయం. ఆమెకి తిండి సయించేది కాదు. అన్నం ముద్ద నోట్లో పెట్టుకోగానే భళ్ళున డోకు వొచ్చేసేది. అమ్మని control చేయడం షౌకి మరీ కష్టమై పోయింది. అమ్మ బాధని చూడలేక నర్తకిని 'అనాసక్తి' లో కొన్నాళ్ళు లుంచారు. తమనించి వేరుగా వుంచడం ఇంట్లో ఎవరికీ ఏమాత్రం ఇష్టంలేని, భరించలేని సంగతైనా గాని, అమ్మకోసం నర్తకికి కంచం, గ్లాసు విడిగా ఇచ్చేశారు. తాము ప్రేమించిన నర్తకిని ఆవిధంగా తమనించి వేరుగా వుంచడం అమ్మకోసం (అమ్మ పడే అలవిమాలిన బాధని చూడలేక) ఒప్పుకోక తప్పింది కాదు వాళ్ళకి. ఎన్నడూ ఏ పట్టింపులూ లేని చలంగారూ వాళ్ళు నర్తకిని ఈ విధంగా ఎలా వుంచగలిగారా అనుకునే వారు చలంగారింటికి వచ్చిన కొంత మంది మిత్రులు. కానీ చూచే వారి కేం తెలుసు వాళ్ళుపడే గుండె కోత. ఇటు అమ్మా, అటు నర్తకీ unhappy కాకండా కాపాడుకోవాలన్న వాళ్ళ ఆ కాంక్షని ఈశ్వరుడు షౌ నించి తీర్చారు.

తిండి సయించక అమ్మ మంచాన పడేలాగ వుంది. ఆమెకి మెర్‌స్టన్‌తో స్నేహం. ఆవిడ దగ్గర తన పరిస్థితి అంతా చెప్పుకొని

గోల పెట్టేది. ముఖ్యంగా షా తాను చెప్పినా వినకుండా నర్తకిని ముట్టు కుంటోం దనీ ఆవ్యాధి షా కెక్కడ వాస్తుందోనని తన భయమని. మెర్స్టన్ అంతా ఓపికిగా విని అమ్మతో "అంతగా నీకు కిట్టకపోతే సువ్వెక్కడికన్నా వెళ్ళి వుద్యోగం చేసుకో. నువ్వు వుద్యోగం చేసు కోగలవు కదా!" అంది.

లెప్రసీ మందులు సాధారణంగా రిగరస్ రియాక్షన్‌తో మంటలు పుట్టిస్తాయట. కానీ ఆ మందులు వేసుకున్నాగాని నర్తకికి ఏమాత్రం బాధ అనిపించేది కాదు. నర్తకి ఈశ్వరుడి వొళ్ళోకి చేరింది, ఆమెకి ఈశ్వరు డంటే ఎంత విశ్వాసమో అప్పుడు. ఆ సందర్భంలో చలంగా రే మంటారో విందాం.

"నర్తకికి జబ్బుచేసిన తరువాతకూడా వొచ్చారు కదా మీ రిక్క డికి! చూడలేక పోయినారా! ఆ జబ్బువల్ల ఏం బాధ పడింది నర్తకి! సరే, వెలిపడ్డది. ఆ కడపటిస్థితికి వెళ్ళగానే ఈశ్వరుడు చూపారు— నేను దీనులవాణ్ణి. నాస్థానం దుమ్ములో అని. నర్తకిని అడగండి— ఈ జబ్బు చేసినందుకు జబ్బుకీ ఈశ్వరుడికి Thankful గా వుంది."

(శాస్త్రిగారికి చలంగారిలేఖ 22-2-58)

నర్తకికి జబ్బుగా వుందని తెలిసి బొంబాయి నించి 'చే' నర్తకికి వుత్తరం రాసింది. "నేను వుద్యోగానికి శలవు పెట్టి నేను వొచ్చి నిన్ను తీసుకుపోనా లేకపోతే నువ్వే వాస్తావా?" అని.

"ఇక్కడ ఇంట్లో అందరూ నన్ను చూసుకుంటున్నారు. అంచా తను నువ్వు వుద్యోగానికి శలవుపెట్టి నాకోసం ప్రత్యేకంగా రావాల్సిన అవసరంలేదు" అని నర్తకి ఆమెకి జవాబు రాసింది.

నర్తకికి బాగా నయమ వుతోంది. మొట్టమొదట కొద్దిరోజులు మాత్రం 'అనాసక్తి'లో వుంది. తరువాత అందర్తో బాటు ఇంట్లో మస

ల్లడం మొదలు పెట్టింది. డాలీ "నర్తకికి కాళ్ళు, చేతులూ పుళ్ళు కాని వ్వకండి ఈశ్వరా!" అని ప్రార్ధించేది.

చాడ్విక్ చల్లంగారింట్లో భోజనం చేస్తున్నారు గనగ చలంగారు నర్తకికి లెప్రొసీ అని చాడ్విక్‌కి చెప్పారు. అప్పుడూ "చలం నేను ముసలాడ్ని, ఆ వ్యాధి వొస్తుందని నాకు భయం లేదు. ఇక్కడ భోజనం చేయడానికి నాకేం అభ్యంతరం లేదు" అన్నా రాయన.

ఇంక చలంగారు, షౌ, ఫకపక, చిత్ర, నర్తకి తమలో తాము ఎంత దగ్గరై పోయారో! త్వరలోనే చిత్ర కాకాని తీసుకుని వూరు వెళ్ళిపోయింది.

నర్తకికి విశ్రాంతి నిచ్చేసి, ఈశ్వరుడు పకపకని వొంట చేయమన్నారు. నర్తకి బదులు పకపక వొంట చేస్తుందని తెలియగానే చాడ్విక్ గోల పెట్టారు. భోజనంలో రుచి కుదరదనే భయంతో, ఆ వొంటలో రుచంతా నర్తకి చేయడం వల్లనే అనుకున్నా రాయన. కాని పకపక చేసిన వొంటని తిని "చంపక కూడా ఇంత బాగా చేస్తుందని అనుకో లేదు" అని మెచ్చుకున్నారు చాడ్విక్.

లెప్రొసీ హాస్పిటల్‌లో డాక్టర్ గోపాలమీనన్ ఎంత మంచి డాక్టర్! నర్తకి ఆసుపత్రికి వెళ్ళివొచ్చి చల్లంగారు - వాళ్ళకి, అక్కడి కబుర్లు చెప్పేది. రోగుల పుళ్ళని స్వయంగా లోషన్స్‌తో కడిగి కట్టు కట్టే వారాయన. ఎవరైన్నా "డాక్టర్ మీరు ఈ పనులన్నీ మీ చేతులతో చేస్తున్నారు కదా. మీకు భయం లేదా?" అని అడిగితే "మందు లున్నాయికద్దా. మీ కెందుకు భయం!" అని నౌకర్లకి ధైర్యం చెప్పే వా రాయన. ఆయన ఈ ఆసుపత్రికి వొచ్చాక, మునుపు మందు తీసుకోవడానిక్కి సంశయించిన లెప్రొసీ పేషంట్లు ఇప్పుడు ధైర్యంగా వొచ్చి మందులు తీసుకోవడం మొదలు పెట్టారు. " నువ్వుకూడా షౌతో

వొచ్చి పనిచేయరాదా ?" అని నర్తకిని అడిగారాయన. అంతకి మునుపే ఈశ్వరుడు "నువ్వు వెళ్ళి ఆసుపత్రిలో లెప్రొసీ పేషంట్లకు సేవ చెయ్యి" అని నర్తకికి చెప్పారు. ఇక నర్తకి రోజూ పొద్దున్న పూట ఆసుపత్రికి వెళ్ళి అక్కడ పేషంట్లకు మందు లియ్యడం, పుళ్ళు కడిగి డ్రెసింగ్ చేయడం—మొదలైన పనులలో ఆస్పత్రి వారికి సహాయపడేది. నర్తకికి ఎంతో వుత్సాహం వొచ్చేసింది. ప్రతివారు లెప్రొసీ అంటే ఎందుకు భయపడతారా అనిపించేది ఆమెకి. తరువాత ఆ ప్రాంతాలలో తమకి కుష్ఠని అనుమానం వున్నవాళ్ళు కూడా నర్తకిని చూచి ధైర్యం తెచ్చుకుని కొందరు ఆసుపత్రికి వెళ్ళేవారు. కొందరు ఆమె దగ్గరికి వొచ్చి మందు తీసుకునే వారు. వారిలో చాలామందికి ఏమచ్చ వొచ్చిన కుష్ఠేనని భయం. నర్తకికి ఆరోగ్యం మెరుగవడం మొటలు పెట్టింది. నర్తకి జబ్బుతో బాధపడటం చూడలేక పకపక "మనమంతా చచ్చిపోదాం. ఎందు కింకా బతకడం?" అనేది నర్తకితో.

ఒకరోజు పకపక కలలో యమలింగేశ్వరుడు కనబడి "నాగుడికి మీరు రండి. మీకు మంచి జరుగు తుంది" అని చెప్పారు. ఆ కలలో చలంగారు నడవలేకపోతే ఆయనని అక్కడికి మోసుకుని తీసుకు వెళ్ళినట్లూ, అక్కడి నించి ఆయనంతట ఆయనే నడచి ఇంటికి వొచ్చినట్లు కనబడింది.

అమ్మా వాళ్ళు తమ షికార్లతో చాలాసార్లు ఆగుడిని చూశారు. దానికి ఏగుడి ఆకారమూ లేదు. అందువలన ఒకసారి అమ్మ, షౌ, పకపక అందులో ఏముంటుందా అని తొంగి చూశారు. వారికి అక్కడొక పెద్ద శివలింగం కనిపించింది. అందువల్లనే వారికి ఆ గుడి ఎక్కడుందో తెలుసును. కొన్ని గన్నేరు పువ్వులూ, పూజాద్రవ్యాలు

తీసుకుని షా. నర్తకి, పకపక యమలింగేశ్వరాలయానికి బయల్దేరారు. భగవాన్ దగ్గరికి వొచ్చినప్పుడుకానీ, చివరికి ఈశ్వరుడు దర్శనమిచ్చి నప్పుడుగానీ ఎన్నడూ భగవాన్‌ని గాని, ఈశ్వరుడ్నిగానీ మాకు మంచి చేయమని కోరలేదు. ఈకీడు మాకెందుకు జరిగిందని ప్రశ్నించుటలేదు షా. కానీ యమలింగేశ్వరుడ్ని మాత్రం నర్తకికి నయం చేయమని కోరారు షా. ఈశ్వరదర్శనం చేసుకుని అందరూ ఇంటికి తిరిగి వొచ్చేశారు.

షా వాళ్ళు యమలింగానికి పూజ చేయడానికి వెడుతున్నప్పుడు తమకన్నా ముందుగా ఎవరో దండలూ అవీ వేసి వెడుతున్నారని వారికి తెలిసింది. ఎవరై వుంటారని అందరికీ వుత్కంఠ. తాము కాక ఎవరు యమలింగేశ్వరుడిని పూజిస్తున్నారో— వారిని చూడాలని అందరిలోనూ కుతూహలం బయలు దేరింది. కొన్నిరోజుల వరకూ వారెవరో వాళ్ళకి తెలియదు. వారికికూడా షా వాళ్ళు పెట్టిన పువ్వులు ఎవరు పెట్టేరా అన్న ఆశ్చర్యం కలిగించి వుండవొచ్చు. ఓరోజు షా వాళ్ళు పూజచేసి బైటికి వొస్తూవుంటే ఎదురైనా రాయన. ఆయనే నటరాజన్. వారే అందిర్నీ ఆంగ్లంలో పలకరించారు. వారు తమ కథ చెప్పారు.

నేను రమణ భక్తురాలైన సుజాతికి ఎన్నో ఏళ్ళు మోటారు డ్రైవర్ని. ఒకసారి మేడపైకి ఎక్కి కిందికి దిగుతూ వుండగా మెట్ల మీది నించి కిందికి దొర్లిపోయాను. ఏడు పక్కఎముకులు (ribs) విరిగి పోయాయి. నన్ను హాస్పిటల్లో చేర్చారు. నేను బాధ పడుతుండగా కలలో యమలింగేశ్వరస్వామి కనిపించి "నీకు నయమైనాక నాదగ్గరికి రా!" అని పిలిచారు. నయమవడంకూడా ఎంతో విచిత్రంగా జరిగింది. ఎంత త్వరగా ఆస్పత్రినించి నేను బైటికి వొచ్చానో తలుచుకుంటే నాకే ఆశ్చర్యం వేస్తుంది. యమలింగేశ్వరుల మహత్తు అపారం.

ఆయనే నాదైవం, ఆయన్నే నమ్ముకుని వున్నాను" అని చెప్పారు నటరాజన్.

ఆ తరువాత నటరాజన్ షౌ వాళ్ళను రోడ్డుమీద కలుసుకుంటూనే వుండేవారు. చలంగారు వాళ్ళు కనపడినప్పుడల్లా పలకరించిగాని వెళ్ళేవారు కాదు. కొన్నిరోజుల తరువాత నటరాజన్ కనబడకపోతే షౌ "ఏమిటి వెళ్ళి యమలింగేశ్వరుడికి పూజలు చేయటల్లేదా?" అని అడిగారు. "ఏం చెప్పను మాతాజీ! నన్ను సాతునూరుకి driverగా బదిలీ చేశారు. నాకు బొత్తిగా తీరుబడి లేదు. ఆయననే ప్రార్థిస్తూ వున్నాను— ఎప్పుడు నన్ను తిరువన్నామలై రప్పిస్తారని" అని అన్నారు నటరాజన్. మళ్ళీ కనబడినప్పుడు నటరాజన్ షౌకి ఎంతో సంతోషంతో నమస్కరించి— "నాదైవం నాపార్థన విన్నారు. నేనిక్కడే post అయ్యాను" అని చెప్పారు.

అప్పట్లో షౌ సాధారణంగా ప్రతిరోజూ నర్తకికి విభూది ఇచ్చేవారు. అంతేగాక తమ చెయ్యి నర్తకి మీద వేసి heal చేసేవారు. అది spiritual healing. ఆ విధంగా చలంగారికి తప్ప షౌ ఎవరికీ heal చేయలేదు. షౌ ఎప్పుడో ఎవరికో heal చేయడం సకృత్తుగా జరుగుతుంది. వారం రోజుల తరువాత షౌకి చేతిమీద ముఖంమీద మచ్చలు ఏర్పడ్డాయి. ఆవిధంగా కుష్ఠు వొస్తుందని ఎలోపతి వైద్య శాస్త్రము ఒప్పుకోదు. షౌకి తాము మునుపు తమ శరీరాన్ని వికృత పరచమని ఈశ్వరుడ్ని ప్రార్థించడం గుర్తుకు వొచ్చింది. బహుశ ఆయనే ఆవిధంగా చేశారను కొన్నారామె. కానీ నర్తకికి వచ్చేలాగే వొళ్ళు మంటలు ఆమెకి కూడా వొచ్చేవి. ఆమెకి ఆ జబ్బంటే భయం లేదు. కానీ ఆమె ప్రతీ వారికి విభూతి వేస్తారు. అందరితో కలిసి వుంటారు. అందుచేత ఆ వ్యాధి తమనించి ఎవరికీ రావడం ఇష్టంలేదు. తమకి

వచ్చిన మచ్చలు ఆవ్యాధికి సంబంధించినవో కాదో అనే యోచన ఆమెకి suspense ని కలిగించేది. ఆ మచ్చల్ని పరీక్షచేసి చూసుకో గల రామె. కాని అమ్మ రెప్ప వాల్చకండా నిరంతరం షౌని కనిపె డుతూ వుండేది. ఎక్కడ ఆవ్యాధి షౌకి వస్తుందో నన్న భయంతో. షౌ ఆ మచ్చల్ని పదేపదే చూసుకోవడమూ అదీ అమ్మ కనిపెట్టింది. అప్పటి నించి "నాకు తిండి సయించటల్లేదో" అని గోల పెట్టేది. షౌకి ఆ వ్యాధి వొచ్చేసిందని ఆమెకి నమ్మకం ఏర్పడి పోయింది. అది కాదని షౌ వాళ్ళెంత చెప్పినా ఆమెకి నమ్మకం కలిగేదికాదు. ఇంక ఆమె పడ్డ యాతన వర్ణనాతీతం. షౌకి ఆమె నావిధంగా బాధ పడనీయకూడ దనిపించింది. "నేను వెళ్ళి డాక్టరు దగ్గర పరీక్ష చేయించు కుంటాను. ఆయన లేదని చెబితే నువ్వు నమ్ముతావా?" అని షౌ అడిగా రామెని. "తప్పకుండా వెళ్ళు. అదే నేనుచెప్పాలని అనుకుంటున్నాను." అంది అమ్మ

ఈశ్వరసాక్షాత్కారం అయినాక సౌరిస్ వూళ్ళోకి ఎప్పుడూ వెళ్ళ లేదు. బండికూడ ఎక్కలేదు. షౌ డాక్టరు దగ్గరికి బయలు దేరారు. నర్తకి, చలంగారు ఆమెతో కలిసి వెళ్ళారు. ఆ మచ్చల్ని పరీక్షచేసి, డాక్టర్ ఇది కుష్ఠు కాదన్నారు. కానీ నర్తకికి వొచ్చిన symptoms అన్నీ షౌకి వొచ్చేవి. దాంతో ఆమెకి కొంత అనుమానంగానే వుం డేది. ఈశ్వరుడు, భగవాన్ ఆమెకి దర్శనమిచ్చి ఆమెకి వొచ్చినది ఆవ్యాధి కాదని తెలిపారు. డాక్టర్ షౌకి వొచ్చింది ఆ వ్యాధి కాదనే సరికి అమ్మకి భయం పోయింది. కాని అమ్మకి— ఆ వ్యాధి షౌకి ఇప్పుడు కాకపోతే ఇకముందు వొస్తుందని భయమే.

నర్తకికి కుష్ఠు అని తెలిసి చలంగారు ఆశ్రమానికి వెళ్ళినప్పుడు మెర్స్టన్ గోల పెట్టింది.

"ఇంత జబ్బు వొస్తే చిన్నపిల్లల మధ్య ఆమెని పెట్టుకున్నారా? ఇన్ని సెంటర్స్ వున్నాయి. ఏ సెంటర్ కన్నా పంపించెయ్యండి" అంది మెర్స్టన్.

"ఈశ్వరుడు పంపించ వొద్దన్నారు. ఆయన కుదురుస్తానన్నారు" అన్నారు చలంగారు.

అది మామూలు వ్యాధను కుంటున్నారా? అంటువ్యాధి. కాంపౌండ్‌లో వాళ్ళందరికీ ప్రమాదం. నర్తకిని ఏ సెంటర్ కన్నా పంపించక పోతే మీ ఇంటి owner చేత మిమ్మల్ని ఇంట్లోంచి వెళ్ళ గొట్టిస్తాను" అంది మెర్స్టన్ కోపంగా.

"ఇంకో ఇంటికి పోతాం" అన్నారు చల్లగా చలంగారు.

"ఎక్కడా ఇళ్ళు దొరక్కుండా చేస్తాను" అంది మెర్స్టన్ ఆవేశంతో.

"ఎక్కడా ఇళ్ళు దొరక్కుండా చేస్తే మా ఇష్టం వొచ్చినచోటికి పోతాం" అన్నారు శాంతంగా చలంగారు.

"మిమ్మల్ని వూళ్ళోంచే వెళ్ళ గొట్టిస్తాను" అంది మెర్స్టన్ వుద్రేకంతో.

"మాకేం భయంలేదు" అన్నారు నవ్వుతూ చలంగారు.

"మిమ్మ ల్నెక్కడా నిలవ నివ్వను" అంది ఆయన ధీరత్వాన్ని భరించలేక మెర్స్టన్.

"మేం ఎవరిమీద ఆధారపడి లేం. మీ దయా దాక్షిణ్యాలమీద మేం బతకటల్లేదు. మమ్మల్ని ఇక్కడికి తీసుకు వొచ్చింది భగవాన్. మా ఆధారం, ఆశ అన్నీ ఆయనే. ఆయన నించి దూరమైన వాటికి మేం భయపడం" అన్నారు చలంగారు దృఢంగా.

ఇంక మెర్‌స్టన్ నోట మాట రాలేదు. ఇంటి యజమానులు కూడా చలంగారు వాళ్ళని ఏ విధంగానైనా పంపించెయ్యాలని ప్రయత్నం చేస్తున్నారు. ఆశ్రమంవారు, భక్తులు, ఇంటి యజమాన్లూ ఎక్కడా చలంగారికి ఇళ్ళు దొరక్కుండా చేయాలని ప్రయత్నం చేశారు.

## 15

అప్పట్లో నాగేశ్వరరావుగారని ఒకరు 'సేవా'లో వుండేవారు. ఆయన చలంగారితో "ఎందుకండీ, నేను వెళ్ళిపోతున్నాను. ఈ ఇంటిని మీరు తీసుకోండి" అని చెప్పారు. అప్పట్లో ఆ యింటికి అద్దె 8 రూ॥లు. అమ్మకీ, నర్తకికీ సేవామీద చాలా ఇష్టం. ఎప్పటినించో ఆ ఇంటికి మారిపోవాలని వాళ్ళ కలలు.

"అది పెద్ద ఇల్లు. చాలా బాగా వుంటుంది. అక్కడికి వెళ్ళిపోతే ఎంతో సుఖంగా వుంటుంది" అని పదే పదే చెప్పేవారు. కానీ ఈశ్వరుడు "నీ సాధన ఇక్కడే జరగాలి. ఇక్కడే వుండు" అని చెప్పారు షౌకి. వాళ్ళు తనని అడిగినా అదే చెప్పేవారు. అదిగాక చలంగారా యింటికి మారితే జబ్బుపడతారని షౌకి తెలుసు. కాని తామున్న ఇంటిని చూస్తే చలంగారికి గుబులు పుట్టేది. చివరికి ఆయన కూడా "ఇక్కడ వుండొద్దు. ఆ ఇంటికి పోదాం" అన్నారు. నర్తకి వ్యాధి సంగతి తెలిసికూడా చలంగారింటికి రావడం ఏ భక్తులూ మానుకోలేదు. కాని అమ్మని మాత్రం భయం వొదిలిపెట్ట లేదు.

జయంతి అయిన తరువాత ఒక మంచి ముహూర్తాన రుక్మిణీనాథ శాస్త్రిగారు భగవాన్ ఫోటో కొని దానిని మంత్రాలు చదువుతూ 'సేవా' లోకి తెచ్చి పెట్టారు. చలంగారి కుటుంబం అందరూ ఈ ఇంట్లోకి వొచ్చేశారు. అదే నేటి శ్రీరమణస్థాన్.

పకపక నర్తకి ఇంటిని సర్దాడు. మధ్యగది షాకి ఇచ్చారు. ప్రస్తుతం చిత్ర వున్న గది భోజనాల గదిగా వుంచారు. ఆ పక్కగది వంటిల్లు. ఇప్పటి చలంగారి బాత్‌రూం అమ్మ గది. ఆ పక్కగది నర్తకి తీసుకుంది. ఈ ఇంటికి వొచ్చాక అందరికీ తలో గది వొచ్చింది. కొత్తింట్లోకి మారాక అందరికీ ఎంతో సంతోష మనిపించింది. ఓ పెద్ద చీకటిని, భరించలేని తనాన్ని భుజాల మీదినించి దింపుకు వొచ్చిన ట్లుంది.

"నర్తకికి త్వరగా నయంగా కనపడు తోంది. రంగనాయకమ్మ గారికి ప్రత్యేకమైన గది. నర్తకికి ప్రత్యేకం. డాబాపైన ఓ ధ్యాన కుటీరం. చాలా గొప్పగా వుంది తెండి వ్యవహారం."

(శాస్త్రిగారికి చలంగారి లేఖ 11-2-58)

ఒక రోజు అందరూ భోజనాలు చేస్తున్నారు. మెర్‌స్టన్ చలం గారు వాళ్ళని చూడటానికి వొచ్చింది. ఆ సమయంలోనే నర్తకి, చలం గారు అందరూ చుట్టూరా కూచుని నవ్వుకుంటూ కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు చేస్తున్నారు. ఆ దృశ్యాన్ని చూసి ఆవిడ తెల్లబోయింది.

నర్తకి క్లినిక్‌కి వెళ్ళి పనిచేయడం మూలాన ఆ డాక్టరుగారి కుటుంబ మంతా చలంగారు వాళ్ళకి పరిచయం అయింది. ఆయన భార్య, పిల్లలు ఎంతో అందమైన వాళ్ళు. ఎంతో మంచి వాళ్ళు. వాళ్ళు తిరువన్నామలైలో వున్నంత కాలమూ చలంగారు వాళ్ళని చూడటానికి వొస్తూనే వుండేవారు.

నర్తకి ఆస్పత్రిలో పనిచేస్తూనే వుంది. అమ్మకి ఇంకా భయం గానే వుంది. షా నర్తకిని ముట్టుకుంటే చాలు గోల పెట్టేసేది.

అంతకి ముందు నర్తకే షాకి తలంట్లు పోస్తూ వుండేది. అమ్మకి బాధ కలిగించడ మెందుకని తమంత తామే తలంటు పోసు

కోవడం నేర్చుకున్నారు షౌ. ఈశ్వరుడు జుట్టుని పెంచుకో మన్న ప్పుడు "అబ్బా ఈ జుట్టంతా నే నెక్కడ చూసుకో గలను" అన్నా రాయనతో షౌ.

"నీజుట్టు సంగతి నేను చూసుకుంటాను కదా" అన్నా రాయన. జుట్టు పెరిగి నప్పుడల్లా అరమూరెడు అదంతటదే తెగిపోయేది. అందు వల్లనే ఎప్పుడూ షౌ జుట్టు పొడుగు అయ్యేది కాదు.

చిత్రకి ఇంకో ఆడపిల్ల పుట్టినట్లు వుత్తరం వొచ్చింది. ఆ అమ్మాయికి పేరు పెట్టమని 'వ' అనే అక్షరం మొదట వుండాలని 'శ్రీ' రాశాడు. షౌ "వరలక్ష్మి అని పేరు పెట్టారు. 'శ్రీ' 'భారతి' అని పేరు పెట్టాడు. ఇక్కడికి వొచ్చాక ఆ అమ్మాయి పేరు కస్తూరిగా మారింది. కిట్టూ ఆమె ముద్దుపేరు.

కాకా చిత్రతో వెళ్ళిపోవడం,నర్తకికి జబ్బుచెయ్యటం అమ్మని బాగా కుంగదీశాయి షికార్లకి రావడం మానుకుంది. ఎవరితోనూ మాటా డేది కాదు. తన మానాన తాను వుండేది. కాకా గురించి మాత్రం పలవ రించేది. త్వరలోనేపకపక బెంగుళూరు వెళ్ళిపోయింది. డాలీ స్కూలుకి వెళ్ళిపోయింది.

వంట చేయడం అమ్మ వంత యింది. "అమ్మలూ ఏం చేయ మంటావురా నన్నీవేళ"అని షౌని కనుక్కుని,షౌ ఏది చేయమంటే అది చేసేది. పకపక వెళ్తోందంటే గోలపెట్టారు చాడ్విక్."చంపకా నువ్వెళ్ళి పోతేనాగతిఏమయిపోతుందని."అమ్మ వంటతిని ఇంకా మెచ్చుకున్నారు చాడ్విక్ "రంగనాయకి ఇంత బాగా వంట చేస్తుందని నాకు తెలియదే" అని. కానీ ఇక్కడ వంట చేయించేది, ఆ వంటకి అద్భుతమైన రుచిని పట్టించేది నర్తకి కాదు, అమ్మకాదు, పకపక కాదు, ఇక్కడ

ఏది జరిగినా ఎందుకు గొప్పగా వుంటుం దంటే అది ఈశ్వర విలాసం.

చలంగారు వాళ్ళు బెజవాడలో వుండే రోజులలోనే లక్ష్మిగారు వారింటికి వచ్చారు. అక్కడే కొన్నాళ్ళు చలంగారి కుటుంబంతోనే కలిసి వున్నారు. ఆవిడ ఏదో దిగులుగా కనిపించేవారు. తమ కష్టాలన్ని షాతో చెప్పుకుంటూ వుండేవారు. కాని కొద్ది రోజులలోనే సంతి, నర్తకి, చిత్రలతో కలిసి చీట్ల పేక ఆడడం, నవ్వులూ, గోలలూ, గంతులు, కేకలలోకి దిగిపోయా రావిడ.

తిరువన్నామలై వొచ్చాక లక్ష్మిగారు మద్రాసులో హిందీటీచరుగా పనిచేస్తున్నారని చలం కుటుంబీకులకి తెలిసింది. ఎవరైనా మిత్రులు తిరువన్నామలై వొస్తూంటే "నేను తిరువన్నామలై వొస్తున్నానని వాళ్ళతో చెప్పండి" అని చెప్పేవారు ఆమె.

చివరికి 1958లో మొట్టమొదటి సారిగా ఇక్కడికి వొచ్చారు. తమ రెండో అబ్బాయిని తమతో తీసుకు వొచ్చారు. ఆమెకి ఈశ్వరుడిలో గురి కుదిరింది. తమ కుమార్తెతో, చిన్న కొడుకుతో, కలిసి ఎప్పుడు వీలుంటే అప్పుడు తిరువన్నామలై వొచ్చేసే వారు. నర్తకి, చిత్ర, పకపక,— వీళ్ళందర్నీ ఆమె చిన్నపిల్లలుగా ఎరుగును గనుక వాళ్ళతో నవ్వుతో సందడిగా గడిపి వెళ్ళేవారు. ఇంక ఆమెలో ఎంత విశ్వాసమో; ఏపని చేయదలుచుకున్నా ఈశ్వరుడి నడిగిగానీ చేసేవారు కాదామె. అట్లా ఇప్పటికీ వొస్తూనే వున్నారు.

ఇంతలో మా తల్యార్‌ఖాన్‌గారి తల్లి ఆమెతో వుండటానికి వొచ్చారు. అమ్మ చెప్పిందో, మరెవరు చెప్పారో గాని సౌరిస్‌ని చూడాలని కోరా రామె. ఆమె షాని చూసి ఎంతో ఇష్టపడ్డారు. మూడుజన్మల తరువాత షా దేవత అయిపోతారని ప్రోఫెసీ చేశా రామె. తరువాత

చలంగారు వాళ్ళని చూడాలని కబురంపించారు. ఆమెకి చలం కుటుంబం మీద ఎంత ప్రేమో! అంతకు మునుపు చలం కుటుంబం మీద మా తల్యార్‌ఖాన్‌కి అభిమానం వుండేది. కానీ తన తల్లి వాళ్ళని ఎంతో గొప్పగా పొగిడే సరికి ఆమెకి చలంకుటుంబం మీద ప్రేమాభిమానాలు ద్విగుణీకృత మైపోయాయి.

నర్తకి తన గ్లాసు, కంచం మాత్రం విడిగా వుంచుకొని మామూలుగా ఇంట్లో తిరుగుతోంది. నర్తకి క్లినిక్‌కి వెళ్ళి పనిచేస్తూనే వుంది. ఆమెద్వారా రమణస్థాన్ సంగతి విని "హాయిగా ఎవరికి పడితే వారికి భోజనం పెట్టేటట్లయితే ఈ వుద్యోగం ఎందుకు నాకు, నేనుగూడా మీ తోటలో చెట్లకి నీళ్ళుపోస్తూ ఇడ్లీపిండి రుబ్బుతూ వుండి పోతాను మీ ఇంటి దగ్గరే," అన్నారట—నవ్వుతూ leprosy clinic డాక్టరుగారు. ఆ రోజుల్లో కొత్త మిత్రు లెవరూ లేరు. అమ్మ షికార్లకి వొచ్చేది కాదు. సాయంత్రం చలంగారు, షా కొంతదూరం నడిచి ఏ మైదానాల్లోనో, ద్రౌపతి ఆలయం ముందో కూచుండే వాళ్ళు. నర్తకి క్లినిక్ నించి తిరిగి వొచ్చి వాళ్ళని కలుసుకునేది. ముగ్గురూ బాగా చీకట్లు పడేదాకా ఈ కబుర్లూ ఆ కబుర్లూ చెప్పుకుంటూ కూచునేవారు.

మధ్యాహ్నాలు చాడ్విక్ వొచ్చి వాళ్ళకి కబుర్లు చెబుతూ వుండేవారు. అమ్మకి ఇష్టం అయితే ఆ కబుర్లలో తాను కూడా కలిసేది లేకపోతే తల వొంచుకు వెళ్ళి పోయేది. చాడ్విక్ ముందుగానే అమ్మ ఏ moodలో వుందో చలంగార్ని అడిగేవారు. అమ్మ మంచి mood లో వున్నదంటే పలకరించేవారు, లేదంటే ఆమె వొస్తోంటేనే తల తిప్పేసుకునే వారు. ఆ రోజుల్లో వాళ్ళలో ఒకరై వారికెంత దగ్గరై పోయారో చాడ్విక్. ఎవరైనా వొస్తే "చలంగారు మా father" అని చెప్పుకునేవారు. నిజానికి చాడ్విక్ చలంగారి కంటే పదేళ్ళు పెద్దవారు.

కురంగేశ్వర్ తిరిగి అరుణాచలం వొచ్చారు. అప్పట్లోనే జగన్నాధం వొచ్చారు. వొయ్యి జగన్నాధం వాళ్ళింటి డాక్టరు. ఆ రోజుల్లో జగన్నాధం హైస్కూల్లో చదువుకునే కుఱ్ఱవాడు. సైకిల్ మీద జోరుగా తిరుగుతూ వుండేవారు. ఏపని కావాలన్నా ఇట్టే చేసిపెట్టేవారు. ఇప్పుడు ఆయన ఇంటి దగ్గర సరిపడక చలంగారి దగ్గరికి వొచ్చేశారు. ఇంక కురంగేశ్వరరావు. జగన్నాధం ఒకటే గంతులు వేస్తూ అల్లరి చేసేవారు.

ప్యూరిటీలో ఒకాయన వుండేవారు. ఆయనకి చలంగారు వాళ్ళు కవిగారని పేరు పెట్టారు. ప్రతిరోజూ ఇంగ్లీషులో రాసిన కవిత ఒకటి తీసుకు వొచ్చేవారు వాళ్ళకి చదివి వినిపించేందుకు. ఆయన కొంత కాలం అరవిందాశ్రమంలో వుండేవారట. ఆ అనుభవాలు చెబుతూ వుండేవారు చలంగారు వాళ్ళకి. తనకి ఏవో Bus head lightsలాంటి లైట్లు visionలో కనపడ్డాయనీ— ఇలా ఏవేవో చెబుతూ వుండేవారు.

ఇంక చలంగారు తనకి ఏవేవో దృశ్యాలు కనిపించాయని ఆయనతో చెప్పేవారు వేళాకోళానికి. కవిగారి అనుభవాలు నమ్మదగినవిగా కనిపించేవి కావు. దాంతో అందరూ పడీ పడీ నవ్వేవారు.

అప్పట్లో భజనలలో లైట్లు ఆర్పేసి కూచునే వారు చలంగారు వాళ్ళు. ఆయన భజనలో పరండా చివర స్తంభానికి ఆనుకుని కూచుని చేతులతో తాళంవేస్తూ పారవశ్యంలో ఇటూ, అటూ వూగిపోయే వారు. ఊగుతూ, ఊగుతూ అరుగుమీంచి ఎక్కడ కింద పడతారోనని అందరికీ భయం. భజన పూర్తవగానే- తను ఆ రోజు రాసిన పద్యం చదివి వినిపించడానికి light వేయమని అడిగేవారు. ఆయన ముందుగానే చెప్పారు తాను వంద పద్యాలు రాశాననీ అవి చదివి వినిపించడానికే భజనలకి వొస్తున్నాననీ, అవి చదవడం పూర్తయితే ఇంక రాననీ.

భజన పూర్తయి లైటు వేయంగానే అందరు ఎవరి దోవనవాళ్ళు వెళ్ళి పోయేవారు. షౌ ఒక్కరు కూచుని ఆ పద్యాన్ని వినవల్సి వొచ్చేది. ఆయన ఆపద్యం చదివి వెళ్ళిపోయే వారు.

ఒకరోజు షౌ ఆయన్ని వెక్కిరిస్తున్నారు బాతులా నడుస్తారని ఆ నడకని అనుకరించి అందరికీ చూపించి నవ్విస్తున్నారు. సరిగ్గా ఆ సమయానికే భజనకి అట్లాగే నడచుకుంటూ వొస్తున్నా రాయన. అంతా నవ్వు ఆపుకో లేకపోయారు. కురంగేశ్వర్ చటుక్కున లైటార్పేశారు. అక్కడినించి అందరూ నవ్వు ఆపుకోలేక పారిపోయారు. చివరికి షౌ ఒక్కరు మిగిలారు. ఆమె ఒక్కరూ అలాగే మాటాడకుండా భరించారదంతా లోలోపలే. వెళ్ళిపోయిన వాళ్ళు భజనకి కూడా రాలేదు. కొన్నాళ్ళకి "నూరు పద్యాలు పూర్తయినాయి. నేను రావడం మానేస్తున్నా" నన్నారు ఆయన. కానీ ఇంతలో ఆయన లోంచి ప్రణయ కవిత్వం బయలు దేరింది. ఆయన చలంగారితో నాలో ప్రణయ కవిత్వంకూడా వొస్తోంది. వీటినికూడా మీరు వినాలి— అని మధ్యాహ్నాలు వొచ్చి చలంగారికి చదివి వినిపించేవారు. పాపం చలం గారు ఓపికగా వినేవారు.

ఆగష్టు 15కి ఆయన అరవింద జయంతికి పాండిచ్చేరి వెళ్ళిపోతారు. అందువలన చలంగారికి ముందుగానే చెప్పేవారు."మీ ఈశ్వ రావతరణోత్సవానికి నేనుండటం లేద"ని. పాండిచ్చేరి నించి వొచ్చి "ఆగష్టు 15కి నేను ఇక్కడ లేను గనక నాకుమీరు ఈ రోజు భోజనం పెట్టాలి" అని అడిగేవారు ఆయన. చలంగారు ఆ విధంగానే ఆయనకి భోజనం పెట్టించేవారు.

ఒక ఆగష్టు 15 కి చాలామంది అతిథులు వొస్తున్నారని చలం గారు కవిగారి ఇంటి తాళం చెవులు అడిగి పుచ్చుకున్నారు. చిన్నా

రావు, కురంగేశ్వర్, కృష్ణారావు, శ్రీనివాసమూర్తి ఇంకా కొందరు మిత్రులు భోజనాలైనాక ఆ గదిలో చేరారు. చిన్నారావుగారు ఈగల్ని భరించలేక దోమతెర కట్టుకుని పడుకున్నారు. ముందు వరండాలో కురంగేశ్వర్, కృష్ణారావు, శ్రీనివాసమూర్తి మాట్లాడుకుంటూ పడుకున్నారు. ఇంకా చాలామంది మిత్రులు చేరి విశ్రమించారు. అంతా అల్లరి, గోల. ఆ ఇల్లు ఎవరిదో, అక్కడికి చేరిన వారికి తెలియదు. ఎప్పుడూ మరుసటి రోజుకు వొచ్చే కవిగారు ఆవేళ మధ్యాహ్నమే తిరిగి వొచ్చేశారు. వాకిట్లో బండి ఆగింది— బాతులా నడుచుకుంటూ కవిగారు వొచ్చేసరికి వరండాలో వాళ్ళు ఎవ రీ సూకరం అన్నట్లాయన వంక చూచారు. ఆయన సామాను పట్టుకుని తన గదిలోకి వెళ్ళారు. అక్కడి దోమతెరని వొత్తిగించుకుంటూ ఓ మూల సామాను పెట్టుకున్నారు. చిన్నారావుగారు "కృష్ణారావు ఖడ్గమృగ మేదో వొచ్చి నా దోమతెరని తోసేస్తోంది. వొచ్చి చూడు" అని అన్నారు. ఆయనే ఆ ఇంటి యజమాని అని తెలియని శ్రీనివాసమూర్తి కన్నడంలో 'ఎవరు నువ్వూ' అని అడిగాడు. ఆయన హిందీలో జవాబు చెప్పారు. కృష్ణారావు— "ఈ గది ఇవాళ్టికి మాకోసం ఇచ్చారు. రేపు ఖాళీ చేస్తాం. ఇవాళ మాత్రం మీ రేంచేసినా కదలబోవటల్లేదు" అన్నారు. ఆ హిందీ అర్థమయ్యీ, కాక, ఈలోగా ఒకరు ఆయన సామాన్లని బయట పెట్టేశారు. అక్కడితో ఆయన రమణస్థాన్‌కి వచ్చి చలంగారితో అంతా గొడవ గొడవగా చెప్పుకున్నారు. "వాళ్ళని పొమ్మని చెప్పండి" అన్నారు. "వాళ్ళంతా మా **guests**, ఎట్లా పొమ్మని చెప్పను? భోంచేసి **rest** తీసుకుంటున్నారు" అన్నారు చలంగారు. చివరికి ఆయన అవస్థ చూడలేక చలంగారు వాళ్ళందర్నీ ఇటూ అటూ సర్దేశారు. కొద్ది రోజులకి ఆయన వెళ్ళి పోయారు. వెళ్ళి పోయిన కొద్ది రోజులకి వచ్చి పోయారు.

"బోస్ కాంపౌండులో ఒక ఇంటోకి రంగు రంగుల బట్ట వేసుకునే ఒక అమెరికన్ అమ్మాయి, ఒక గడ్డం హిందూ సాధువూ వొచ్చారు.

అతను రోడ్లపైన అడుక్కునే వాడు. అతన్ని తీసుకొచ్చి గురువు చేసుకుని మంచి బట్టలు వేసి తిప్పుతోంది, ఆ అమ్మాయి. సూటు వేసి అమెరికాకి తీసుకు వెడుతుందో ఏమో!"

(4-4-59 జవహర్‌కి చలం లేఖ)

ఒక ఇంగ్లీషు ఆవిడతో ఒకరు వొచ్చి షౌ వాళ్ళు వొదిలేసిన 'భక్తి' (devotion) లో వుంటున్నారు. ఆయనే శ్రీరాం జైరాం. ఆ ఇంగ్లీషు ఆమెకి పెళ్ళయింది. భర్త ఇంగ్లాండులో వున్నారు. వాళ్ళిద్దరూ ఆ ఇంట్లో వుంటున్నారని రమణనగర్‌లో వున్న westerners లో చాలా కోలాహలం బయలు దేరింది.

ఒక ఇంగ్లీషు లేడీ ఇండియన్ స్వామి వెంట వుండట మేమిటని గోల పెట్టారు. షౌ విన్న దేమిటంటే ఆవి డాయన కళ్ళు చూసి ఆకర్షణలో పడిం దని. అప్పు డప్పుడూ ఆ ఇంటినించి షౌ వాళ్ళకి చాలా స్వచ్ఛం అయిన నవ్వులు వినబడేవి. తరువాత 'శ్రీరాం జైరాం' అని బిగ్గరగా వినబడేది. వాళ్ళిద్దరూ ఒకసారి రమణస్థాన్ భజనకి వొచ్చారు. ఆయన 'శ్రీరాం జైరాం' అని పాడారు. అప్పటినించి ఆయనకి ఆ పేరు అతుక్కుపోయింది. తరువాత తరచు భజనలకి వొస్తూ వుండేవారు. చాలా పాటలు పాడుతూ వుండేవారు ఆయన. అవి వింటూ వుంటే చెట్టుకింద కూచుని ఏకతారతో పాడే వైష్ణవీ గీతాలలాగ అడవులు, కొండలు, సెలయేళ్లు గుర్తుకు వొస్తూవుండేవి. అంటే ఆ పాటలు పల్లెపదాల రాగాల సరళిలో వుండేవి. ఆ ఇంగ్లీషామె కొన్నాళ్ళుండి వెళ్ళిపోయింది.

ఆ తరువాత శ్రీరాంజైరాం ఎక్కడ వుండేవారో గాని రోడ్ల మీద తిరుగుతూ వుండేవారు. ఆవిడ వుండేటప్పుడు గొప్పగా బట్టలు వేసుకునే వారు. అవే ఇప్పుడు దుమ్ము కొట్టుకుపోయి వుండేవి. ఆకలి వేస్తే చలంగారింటికి వొచ్చి భోజనం చేస్తూ వుండేవారు.

ఆయనకి చలంగారంటే గొప్ప admiration. Tagore గురించి ఎంతో గొప్పగా చలంగారితో మాటలాడేవారు. అప్పుడప్పుడు చలం గారు తాము రాసినవి ఇంగ్లీషులోకి తర్జుమాచేసి ఆయనకి చెప్పేవారు. అవి వింటూ ఆయన తన్మయత్వంలోకి వెళ్ళిపోయే వారు. ఆయనకి షౌ గీతగోవిందం పాడితే చాలా ఇష్టం. రోడ్డుమీద ఎక్కడవున్నా సరే పాట వినపడగానే పరిగెత్తుకుని వొచ్చేసే వారు. కానీ మనిషిలో కొంత తిక్క వుండేది. ఒకసారి షౌ శ్లోకం, అష్టపదిని పాడి time అయి పోతుందని, జయదేవముద్రని వొదిలి వేశారు. దాంతో ఆయన తాము అష్టపది పాడమంటే ఏదో పాడేరని కోపగించి వెళ్ళిపోయారు. కానీ రమణస్థాన్‌లో జరిగే వుత్సవాలకి వాటికీ వొస్తూనే వుండేవారు. చాలా మంది జనం చేరడం వల్ల ఆయన పాడుతూ వుంటే కొంతమంది పిల్లలు, పెద్దలు నవ్వేవారు. ఆయన— 'శంకర్ ఢమరు డిమిడిమ్ బాజేనా' అన్నపాట పాడుతుంటే ఎంత బావుండేదో! పిల్లలు నవ్వులు విని ఆయన కష్టపెట్టుకున్నారు. "చిన్న పిల్లలంటే నాకు ఎంతో ప్రేమ. ఇట్లా నవ్వుతారా?" అని అలిగి వెళ్ళిపోయారు. ఇక్కడికి వొచ్చేదంతా అల్లరి మూకకదా. వాళ్ళని ఎట్లా control చేయగలరు? కానీ ఆయన తరచు వొస్తూనే వుండేవారు. మిశ్రీ ఏడాది పిల్ల. మిశ్రీని చూస్తే ఆయనకి చాలా ముద్దేకాదు ఏదో భక్తి— కాళ్ళు ముద్దు పెట్టుకొని చేతులు కళ్ళకి అద్దుకునేవారు. మిశ్రీకి ఆయన గెడ్డం చూస్తే ఎంతో ఇష్టం. ఆయన గెడ్డం పట్టి పీకేది. ఎంత పీకినా ఓర్చుకునే వారు పాపం

మహానుభావుడు. తరువాత రమణస్థానీయులకు చాలా దూరం అవడం మొదలు పెట్టారు. రమణస్థానీయులకే కాదు. ప్రపంచానికి కూడా దూరమవడం మొదలు పెట్టారు.

అప్పుడప్పుడు శ్రీరాం జైరాంని గుళ్ళో కాగితాలు కట్టుకుని కొలను గట్టుమీద పడుకుని వుండగా చూసేవారు చలంగారు వాళ్లు.

ఒకసారి గిరిప్రదక్షిణంలో జగదీష్ శ్రీరాంజైరాంకి పిచ్చెక్కిందని షౌకి చెప్పారు. సరిగ్గా షౌ వాళ్ళు ఈశాన్యమఠం వైపుకి వొస్తూ వుండగా అక్కడ ఆయన ఎదురైనారు- శ్రీరాంజైరాం. ఆయన చుట్టూ కాగితా లున్నాయి. ఆ మొహంలో ఎంతానందమో! గొప్ప ఆనందంలో తన్మయత్వంతో ఒళ్ళు మరచి వెళ్ళిపోతున్నా రాయన. చిరపరిచితులైన షౌ వాళ్ళనిగూడ కన్నెత్తి చూడలేదు. అప్పుడు పక్కనున్న జగదీష్‌తో షౌ "ఇదే పిచ్చయితే అందరూ కోరుకోదగ్గ పిచ్చి ఇదే" అని చెప్పారు. అదే ఆఖరుసారి షౌకి ఆయనని చూడడం.

తరువాత కొన్నేళ్ళకి ఒక అమెరికన్, ఒక ఆంధ్రులు రమణస్థాన్‌కి వొచ్చారు. వాళ్ళు "ఇక్కడొక సిద్ధపురుషు డున్నారు. ఆయనని వెదుక్కుంటూ మేము వొచ్చాము. ఆయన ఎక్కడ వుంటారో మీరు చెప్పగలరా? అని షౌని అడిగారు. "మాకు ఎవరూ సిద్ధపురుషులు తెలియదు" అని షౌ చెప్పారు. అప్పుడు వాళ్ళు శ్రీరాంజైరాం పేరు చెప్పారు. ఆయన సంగతి వారికెట్లా తెలిసిందా? అని షౌ ఆశ్చర్యపోయారు. అప్పుడు వాళ్లొక పుస్తకం తెచ్చి షౌకి చూపించారు. అది ఒక అమెరికన్ రాసిన శ్రీరాంజైరాం చరిత్ర. ఆ పుస్తకంలో ఆయనవి రంగులలో ఫోటో లున్నాయి. ఆ ఫోటోల్లో ఆయన ఎంత గొప్పగా వున్నారో! వాళ్ళు ఆయనని దర్శించుకుని వెళ్ళారు

ఇప్పుడు ఎందరో చాలా గొప్పవాళ్ళు వొచ్చి ఆయనని దర్శిస్తూ వుంటారు. ఆయన మాత్రం కాగితాలు చుట్టుకుని ఏ కొలను పక్కనో పడుకుని వుంటారు.

ఒకసారి భజన జరుగుతూ వుండగా ఒకామె వూరి నించి వొచ్చారు. ఆమె చలంగారి వైపు తిరిగి "నే నెవరో తెలుసా ?" అన్నారు. "నాకు మీ రెవరో తెలియదు" అన్నారు చలంగారు. "తెలీదా ? ఏమాత్రం కనుక్కోలేరా ? అని రెట్టించిం దామె. 'వూహు' అని తలని వూయించా రాయన. "నే నెవరో మీకు తెలియకపోతే నే నెందుకు వుండడం, నేను వెళ్ళి పోతున్నాను" అన్నా రామె. "కామే శ్వరి" అన్నారు షౌ. ఆ మాట అనేవరకు కామేశ్వరికి షౌ మీద దృష్టి లేదు. ఆ మాట వినేసరికి ఆమె "అయితే మీకోసం వుంటాను" అని వుండి పోయారు. ఆ మాట ఇప్పటి వరకు నిలుపుకుంటున్నారు.

కామేశ్వరిని గురించి శాస్త్రిగారు మొట్టమొదట చలంగారికి చెప్పారు. "మా ఇంటి దగ్గరొక అమ్మాయి వుంది. ఆ అమ్మాయికి మీ రంటే చాలా ప్రాణం" అని. ఆ రాత్రి కామేశ్వరి చలంగారికి కలలో చాలా దగ్గిరగా కనిపించింది. చలంగారు ఆ సంగతి ఆమెకి వుత్తరం రాశారు. "ఇట్లా నాకు నువ్వు కనిపించావు" అని. అప్పటి నించి చలంగారు కామేశ్వరి వుత్తరాలు రాసుకుంటున్నారు- ఉత్తరాల్లో మొట్టమొదటి నించి చలంగార్ని నాన్నా అని పిలుస్తున్నారు కామేశ్వరి. ఇక చలంగారి కామె పెంపుడు కూతురై పోయారు. తాను వొస్తున్న ట్లుగా ముందుగానే వుత్తరం రాశా రామె. కానీ చలంగా రామెని పోల్చుకోలేక పోయారు.

కామేశ్వరి **Vizag లో medicine** చదువుతున్నారు. ఎత్తరి మనిషి. అప్పట్లో చాలా సన్నగా వుండేవారు. ఎంత చలాకీయో! ఎంత

హుషారో ఆమె! ఒకటే కబుర్లు చెప్పేది. నర్తకికి ప్రాణస్నేహితురా లయిపోయింది. వాళ్ళిద్దరూ మధ్యాహ్నాలు ఒకే చాపమీద దొర్లేవాళ్ళు కబుర్లు చెప్పుకుంటూ.

కామేశ్వరి మైగ్రేన్ తలనెప్పులతో బాధ పడేవారు. ఆమె తన ప్రొఫెసర్ల దగ్గర అన్నిరకాల వైద్యాలు చేయించు కున్నారు. కాని తల నెప్పులు తగ్గలేదు. విపరీతంగా బాధ పెడుతున్నాయి. చలంగారు "ఈశ్వరుడు నీ తలనెప్పుల్ని కుదిర్చేస్తారు. గొడవ పడకు" అన్నా రామెతో.

మర్నాడే కామేశ్వరికి విపరీతమైన తలనెప్పి వొచ్చింది. పైగా గర్భిణి. షౌ తలనెప్పులతో బాధపడ్డారు. తలనెప్పులతో బాధపడేవారిని చాలా మందిని చూశారు. కానీ కామేశ్వరిలా కాళ్ళు గిలగిలా కొట్టు కుంటూ ఏడ్చినవారిని ఎవరినీ చూడలేదు. పైగా ఆవిడ కాబోయే డాక్టరు.

షౌ ఆమెకి విభూతి వేశారు. తలనెప్పి తగ్గింది. "నాకీ తల నెప్పులు పూర్తిగా తగ్గిపోయేలా చూడండి" అని షౌని కోరుకున్నారు ఆమె. **Medicine** పూర్తి కాంగానే **M. D.** చదవాలని ఆమె అభి లాష. "మరి నీ తల్నెప్పులు కుదిరిస్తే నువ్వు మళ్ళీ చదవ కూడదు. **M. D.** కి **appear** కావడానికి వీలులేదు. నేను నీ తలనెప్పులు కుదిర్చినా గాని ఆ చదువు **strain** వల్ల మళ్ళీ నీకు తల్నెప్పులు రావొచ్చు" అన్నారు షౌ కామేశ్వరితో.

"మీరు చదవవద్దు అంటే నేను **M. D.** కి చదవను" అన్నారు కామేశ్వరి.

షౌ కామేశ్వరి తల్నెప్పుల్ని పూర్తిగా నయం చేశారు.

తనకి అందమైన పాపాయి పుట్టాలని రోజూ షా దగ్గర విభూతి వేసుకునేవారు కామేశ్వరి. ఆమె పుట్టింటివారు పిల్లలమఱ్ఱి వారు. వాళ్ళది తెనాలి. వాళ్ళలో చాలా మంది దేవీ భక్తులు. వాళ్ళెన్నో తరాల నించి తెనాలిలో వున్నారు. అద్ది పెద్దవంశం. కామేశ్వరి తండ్రి సన్యసించారు, కళ్యాణానంద భారతీమహంత్ స్వాములవారికి శిష్యులాయన. ఆ సంగతి సుబ్బారావుగారి ద్వారా తమ చిన్నతనంలోనే విన్నారు షా.

కామేశ్వరిమీద అమ్మకి అకారణంగా కోపం వొచ్చింది. ఆమె పొడ గిట్టేది కాదు. ఆమెని పడాపడా తిట్టేది. పాపం కామేశ్వరి "నే నేం చేశాను?" అని ఏడ్చేది. అమ్మ చాలా మంది మీద అట్లా నిష్కారణంగా కోపం తెచ్చుకుని కేకలు వేసేది. ఒక్కొక్కప్పుడు షా అమ్మని కోపపడి తిరిగి కేకలు వేసేవారు. అమ్మ కామేశ్వరిని కేకలు వేయగానే "ఆ అమ్మాయిమీద ఎందుకు అన్యాయంగా కోపం నీకు?" అని అమ్మని కేకలు వేశారు. "అయితే నేను వెళ్ళిపోతాను" అంది అమ్మ. "సరే నీయిష్టం వెళ్ళిపోతే వెళ్ళిపో" అన్నారు షా. అమ్మ కోపంతో తన గదిలోకి వెళ్ళిపోయింది. తరువాత నాలుగు రోజులుండి కామేశ్వరి వెళ్ళిపోయారు. వుత్తరాలు రాస్తూనే వున్నారు. తరువాత ఎన్నేళ్ళకో గానీ మళ్ళీ రాలేదామె.

కామేశ్వరి వుండగానే పకపక, రంగ బెంగుళూరు నించి వొచ్చారు. రంగ నాలుగురోజు లుండి తంబురామీద అద్భుతంగా పాడి తన తాంబురాని తీసుకు వెళ్ళిపోయాడు. పకపక ఇక్కడే వుండి పోయింది. తానే వంట చేయడం మొదలు పెట్టింది.

లలితం బొబాయి నించి చలంగారికి వుత్తరం వొచ్చింది. "అమ్మకి చాలా జబ్బుగా వుంది. నీపేరు, షాపేరు కలవరిస్తోంది"

అని. చలంగారు "మేం రాలేం నీకు విభూతి పంపిస్తున్నాం వేసుకో" అని తన తల్లికి జాబు రాశారు. విభూతి అందక ముందే ఆమె పరమ పదించింది. కానీ హైదరాబాదులో చిత్ర, శ్రీ మాత్రం దాదాపు రోజూ వెళ్ళి ఆమెని చూచి ఏపండో ఫలమో ఇచ్చి వొస్తూ వుండేవారు.

## 16

ఇంటి డాబామీద పాక వేయించారు చలంగారు. ప్రతిరోజూ చలంగారు, బసవరాజుగారు, షౌ అక్కడే కూచుని ఉషఃకాంతి చుంబితమైన అరుణాచల శిఖారాన్ని చూస్తూ కూచునేవారు. చలంగారిని చూడటానికి వొచ్చినవారుకూడా మేడమీదనే వాళ్ళతో కూచునేవారు.

ఆ రోజుల్లో ముందుగా బుజ్జిగా డనే గోరింక వొచ్చారు. వారి రాక గురించి చలంగా రేమంటారో విందాం.

"ఇప్పుడు ఓకొత్త ఆశ్రమవాసి వొచ్చారు. దెబ్బతిన్న గోరింక పిల్ల. దెబ్బనయమై రెక్కలు వొచ్చాయి— ఎగిరి వెళ్ళి పోతుంది. తిరిగి మాదగ్గరికి వొస్తుంది. రాత్రులు ఇక్కడే పడక. అడిగి రేడియో పెట్టించుకొని వింటుంది. నాదస్వరం, ఆషా. లతా పాటలు ఇష్టం. రేడియో ఆపితే పాడమని రేడియోని పొడుస్తుంది. ఆ గోరింకకి చెదలూ పూసుఖ్యా పట్టడంతో సరిపోతుంది— కురంగ్‌కి, జగన్నాథానికీ. దాన్ని బైలులోకి తీసికెళ్ళి **flying practce** ఇచ్చారు ఇనాళ్ళూ. షికార్లో దాని స్నానానికి కొండనించి కొండమీదికి నీళ్ళు— ఒకరి చేతుల్లో చదల డబ్బా— ఒకరి చేతులలో తాగడానికి బుడ్డీలో నీళ్ళు. ఒకరి చేతులలో **twine** వుండ. ఇప్పుడు స్వేచ్ఛ నిచ్చారు, ఎప్పుడూ ఈశ్వరుడి బుజాలపైన తలపైనా ఈ గోరింకే.

(శాస్త్రిగారికి చలంగారిలేఖ 4-8-57)

ఆ తరువాత ఎన్నో చిలకలూ, గోరింకలూ, అడివి పిచికలు— వొచ్చాయి. అప్పట్లో చలంమహర్షిగా రింట్లో మనుష్యుల సంఖ్యకన్నా ఆవుల సంఖ్యా పిట్టల సంఖ్యా ఎక్కువగా వుండేది.

"కొత్త పిట్టలు నర్తకి ఆధీనంలో పెరుగుతున్నాయి. 1. నెమలి పిల్ల. 2. జంగ్లీ గోరింక. 3. మూడు అడవి పిచికలు— రెండుపిట్టల్ని వొదిలేసింది, భరాయించుకోలేక. ఈ పిట్టలు (పిచికలు) మావేళ్ళమీద వాలి ఆడుకుంటో వుంటాయి పొద్దస్తమానం. ఆ పిచికలు— పొద్దస్తమానం ఆకలి, ఆకలి, ఆకలి అని అరుస్తాయి. ఇవిగాక ఇంట్లో మచ్చికయిన మామూలు పిచ్చికలు అద్దం ముందు పిట్టమయ జీవితంగా వుంది" (శాస్త్రిగారికి చలంగారి లేఖ 8-10-58)

ఆ రోజుల్లో షౌ కూరలు తరుగుతూ పాటలు పాడేవారు. ఆమె పాడుతూ వున్నంతసేపూ ఆమె భుజాలమీద, తలమీద చిలకలు, గోరింకలు, అడివి పిచికలు వాలి ఆమె పాటతో గొంతు కలిపేవి. బుజ్జిగాడి తరువాత 'కీకి' అనే పక్షి వారికి ఎంతో దగ్గరయ్యాడు.

"మూడు చిలకలు సంహారక్రియా కౌశలులు— కుర్చీల్ని— పుస్తకాల్ని— కాళ్ళనీ— పెన్నుల్నీ, కూరల్నీ ముక్కలు ముక్కలు చేస్తున్నాయి." (శాస్త్రిగారికి చలంగారి లేఖ 16-7-59)

అప్పట్లో హీరా అనే నెమలి వుండేది. అది షౌ గదిలోనే పగలంతా కూచునేది. ఇంకో నెమలి వొచ్చింది. దానిపేరు మణి. అది షౌ రాతబల్ల మీదే కూచునేది.

శాస్త్రిగారు "మాష్టారూ! ఈపిట్టలదే చాలా అదృష్టం అనుకొంటానండీ. మన సంగతికన్నా వీటిసంగతే చాలా బావుంది. ఇక్కడికి మేం రావాలంటే ఏ అబద్ధమో చెప్పి శెలవుపెట్టి భార్యతో దెబ్బలాడి రావాల్సి

వొస్తుంది. వీటి కేమండి రెండురెక్కలు కట్టుకొని సరాసరి షావాళ్ళో వచ్చి కూచుంటాయి. వీటిపనే హాయిగా వుంది" అనే వారు చలం గారితో.

చలం మహర్షి సపరివారంగా నెలకొన్న తరువాత సేవాగృహం గంతులు వేసే వుడుతలతో, కలకలారావాలు చేసే శకుంత సంతతులతో, నర్తించే మయూరాలతో, నేత్రపర్వం చేసే గో సంపదతో మున్యాశ్రమ శోభని సంతరించు కుంది.

చిక్కాల కృష్ణారావుగారు చలంగారికి వుత్తరాలు రాసేవారు. ఆయన భీమవరం కాలేజీలో చదువుకునే రోజుల్లో. ఆయన తన కలల అనుభవాల్నీ, జీవిత సమస్యల్నీ వుత్తరాలలో రాసేవారు. ఆయన మొదట రాసిన వుత్తరానికి ప్రత్యుత్తరంగా చలంగారు రమణభగవాన్ ఫోటో పంపిస్తూ వుత్తరం చివర 'ఈశ్వరాశీర్వాదాలతో చలం' అని చేవ్రాలు చేశారు. భగవాన్ ఎవరో ఏమాత్రం తెలియక పోయినా ఆ ఫోటోని చూడగానే కృష్ణారావుగారిలో అవ్యాజమైన ప్రేమ పెల్లుబికింది. ఆశీర్వదించే ఆ ఈశ్వరు డెవరో ఆయనకి అర్థం కాలేదు అనాడు. భగవాన్ పట్ల వున్నట్లే చలం అన్నా ఆయనకి గొప్పప్రేమ, ఆరాధనా కలిగాయి. "మిమ్మల్ని త్వరలోనే చూడటానికి వొస్తున్నా" నని చలం గారికి రాసేవారు. చివరికి చిన్నారావుగారితో కలిసి మద్రాసు నించి రమణస్థాన్‌కి వొచ్చారు. అప్పట్లో ఆయన మద్రాసులో చదువు కుంటు న్నారు. ఆ రోజుల్లో అమ్మే వంట చేసేది. బుజ్జి భూపాలుడు రమణస్థాన్‌లో రాజ్యం చేస్తున్న రోజులవి. ఆవేళ అమ్మ 'బిస్సి బేళా హాళి' అన్నది తయారు చేసింది, సాయంత్రం భోజనానికి. ఆ వంటకం రుచిని ఇప్పటికీ ఆయన తలుచుకుంటూ వుంటారు. ఓ నాలుగు రోజులుండి సరదాగా గడిపి చిన్నారావుగారితో వెళ్ళిపోయారు. అప్పటినించి ఉత్తరాలువుత్తరాలు రాస్తూనే వున్నారు.

ఘరానా బంధువు లంతా ఆయనకి వుద్యోగం యిప్పించాలని సర్వీస్ కమీషన్ పరీక్షలకి గుంటూరు పంపిస్తే, పరీక్షహాల్లో తీరుబడిగా రేగిపళ్ళు తింటూ కూచున్నారు. అంతలో ఇన్విజిలేటరు వొచ్చి "పేప రన్నా రాయండి లేదా బైటికన్నా పొండి" అన్నారు.

"అయితే బైటికే పోతా" నని— తిన్నగా తిరువన్నామలై వొచ్చేశారు. ఆమరుసటి రోజే రమణస్థాన్‌లో భగవాన్ జయంతి.

మొదట్నించీ ఆయన ఆరోగ్యం సరయింది కాదు. ఆస్మావల్ల ఆయన దుర్బలంగా వుండేవారు. షౌ ఆయనచేత యోగాసనాలు, ప్రకృతివైద్యం చేయించారు. దాంతో ఆయన ఎంత bloom అయ్యారో! ఎంత ఘూర్తి ఆయనలో! ఆడుతూ పాడుతూ చిన్నపిల్ల వాడిలా ఐ పోయా రాయన. అప్పట్నించీ రమణస్థాన్‌లో ఏ కష్టం, సుఖం వొచ్చినా తమదిగా భావించి తమ చాతనైంది చేయడానికి పూను కునేవారు. ఎప్పుడన్నా తమవూరు వెళ్ళినా కొద్ది రోజు లుండి తిరిగి వచ్చేస్తారు. అట్లా ఆనాటినించి ఈనాటి వరకూ రమణస్థాన్‌లోనే వుంటున్నా రాయన.

చేకి కొంచెం డబ్బు సమకూడింది. ఆ పైకంతో సేవాగృ హాన్ని కొనిపెట్టా లనుకుంది. తాను ఆయింటి ఓనర్స్ దగ్గరికి వెళ్ళి మాటాడింది. వాళ్ళు కోటీశ్వరులు. ఆరోజులలోనే వాళ్ళ తండ్రి చని పోయారు. చే వెళ్ళి "మీకు తిరువన్నామలైలో ఒకఇల్లూస్థలం వుంద"ని చెప్పేవరకూ వారికి అక్కడ తమకొక ఇల్లు, స్థలం వున్నాయని తెలి యదు. ఆ ఇంటి ఖరీ దెంతో వారికి తెలియదు. "మీ నాన్నగా రున్న ప్పుడు ఆ ఇంటిని మామేనత్త కొనాలను కుంది. ఆ ఇంటిని రూ. 4500/-కి ఇస్తామని మీ తండ్రిగారు ఒప్పుకున్నారు. నాకూ ఆ ఖరీదుకే ఇవ్వండి." అని చే వారిని అడిగింది. వారికి అలాంటి ఇళ్ళూ వాకిళ్ళూ

ఓ లెక్క లేదు. వాళ్ళు ఏమి బదులు చెప్పేవారు కాదు. చే వాళ్ళ చుట్టూ తిరిగి తిరిగి చివరికి వాళ్ళచేత ఒప్పించింది. వాళ్ళు ఆ ధరకి ఒప్పుకోవడమే కాక ఆ స్థలాన్నికూడా ఇంటితో బాటుగా ఇచ్చేశారు.

మర్యాదస్తులు చలం కుటుంబాన్ని అరుణాచలాన్నించి తరిమెయ్యాలని ప్రయత్నించే సమయంలో భగవాన్ వారికో స్థిరనివాసం ఏర్పరచి సురక్షితంగా నిలిపారు.

చలం మహర్షికి భక్తులొకరు చిరునామాలో శ్రీరమణాశ్రమం అని రాయడానికి బదులు శ్రీరమణస్థాన్ అని రాశారు. అది చూడగానే సేవాగృహానికి అదే సరైన పేరుగా తోచింది సౌరిస్‌కి. ఆ పేరునే ఆ ఇంటికి పేరుగా నిలిపారు.

"కాకా కిట్టూ ఇద్దరితో వూపిరి సలపడం లేదు. ఉత్తరాలు రాసుకోవాలని కాకాని పంపించాను ఇప్పుడే. పెద్దవాళ్ళకి అర్థంలేని పనికిమాలిన ఈ పనులేమిటని ఆశ్చర్యం పిల్లలకి. తనతో మాట్లాడకండా ఉత్తరాలు రాస్తే తనెంత బాధపడుతుందో తనకి ఉత్తరం రాయకండా కాకాతో ఆడుకుంటో కూచుంటే బాధపడే బేబీ నా కోడున్నాడని కాకాకి ఎట్లా తెలియజెయ్యడం. వజీర్ రహ్మాన్ ఇచ్చిన మంచి మంచి పుస్తకాలు చదువు తున్నాను, కాకా కిట్టూ నిద్ర పోయేప్పుడు."

(29-1-59 జవహర్‌కి లేఖ)

"నేను ఉత్తరాలు రాయడానికి కూచోగానే కాకా కిట్టూ ఇద్దరూ నేనో **toy exhibition open** చేశా ననుకుని, నా కలం, కాయితం అన్నీ ఎత్తుకు పోతారు. ఇప్పుడే పోయి ములక్కాడలు కత్తులుగా నేనూ కాకా కిట్టూ ప్రచండ యుద్ధాలు చేసి అలిసి వొచ్చాను."

(30-3-59 జవహర్‌కి చలం లేఖ)

చిత్ర కాకా, కిట్టూలతో శ్రీరమణస్థానానికి వొచ్చింది. ఆ వొచ్చిన కొద్దిరోజులకే శ్రీ వుద్యోగం పోయింది. అందువలన చిత్ర ఇక్కడే వుండిపోయింది.

అప్పటికి వజీర్‌రహ్మాన్ కలకత్తా యూనివర్శిటీలో సీటు కోసం ప్రయత్నం చేస్తున్నారు. ఆయన హఠాత్తుగా మద్రాసుకి వొచ్చి అక్కడ కాలేజీలో చేరారు. అక్కడనించి అరుణాచలం వొచ్చారు.

పకపక ఒకరోజు షాతో "నేనూ వజీర్ పెళ్ళి చేసుకో బోతు న్నాం" అని చెప్పింది. పకపకకి బ్రాహ్మణత్వంమీద చాలా పట్టు. చలంగారు వజీర్‌తో పెళ్ళి చేసుకోవద్దని గట్టిగా చెప్పారు.

"పెళ్ళివల్ల ఇన్ని అనర్థా లున్నాయిరా అని ఎంత రొద పెట్టినా చలం శిష్యుల్లో ఆ మాటని లక్ష్యపెట్టిన వాణ్ణి ఒకణ్ణి చూపండి."

(జగ్గారావుగారికి చలంగారి లేఖ 16-5-61)

పకపక నిశ్చయం విని అందరూ ఎంతో ఇష్టపడ్డారు. తమ patron అయిన చేకి ఆ సంగతి రాశారు. ఆమె తను వస్తానని రాశారు. ఎవరికీ ఈ పెళ్ళి విషయం తెలపడం వజీర్‌కి ఇష్టం లేదు. కానీ రాజయ్యర్ ఎట్లాగో కనిపెట్టారు. ఈ విషయం ఆశ్రమంలో అందరికీ తెలిసి పోయింది. అది రిజిష్టర్ మేరేజ్. వేలూరు వెళ్ళి, రిజి ష్టరు చేసుకోవాలి. పెళ్ళి మార్చి పదహారుకి ఫిక్స్ చేశారు. పదిహేనవ తేదీన బొంబే నించి చే వొచ్చారు. చలంగారి దగ్గరేమీ డబ్బులేదు గనక బట్టలు అవీ తానే తీసుకువొచ్చా రామె.

చలంగారు రమణనగర్‌లో అందర్నీ తమ ఇంటికి డిన్నర్‌కి పిలిచారు. చలం కుటుంబ మిత్రులైన తల్యార్‌ఖాన్, చాడ్విక్, ముఖర్జీ, రోడా .... ఇంకా అనేకులు వొచ్చారు. వారందరికీ ఆ డిన్నర్

ఎందు కిస్తున్నారో తెలుసు కానీ చలంగా రేమీ చెప్పకండా పిలవడం వలన వారూ మాటాడకండా వుండిపోయారు.

భోజనాల వేళ పకపకే అందరికీ వొడ్డిస్తోంది. ఇంక వాళ్ళు వుండబట్టలేక "చంపక పెళ్ళికూతురిలా వుంది కదూ" అనడం మొదలు పెట్టారు. చివరికి చొరవ తెచ్చుకుని (అక్కడ ఎంతోమంది కుఱ్ఱవాళ్ళు వుండడంవల్ల ఎవరు పెళ్ళికొడుకో తెలుసుకోలేక) "పెళ్ళి కొడుకు ఎవరు?" అని అడిగేశారు. చలంగారు వాళ్ళ వెంటనే వజీర్‌ని చూపించారు.

పకపక, వజీర్ మేడమీద పాకలో వుంటా మన్నారు. చే వాళ్ళతో వేలూరు రిజిస్ట్రారాఫీసుకి వెళ్ళి, పెళ్ళి చేయించి అక్కడి నించి బొంబాయి వెళ్ళిపోయింది. పకపక, వజీర్ వేలూరు నించి తిరిగి వొచ్చే లోపల నర్తకి, సౌరిస్ మేడమీది పాకనంతా పువ్వుల్తో అందంగా అలంకరించారు.

వజీర్ రహ్మాన్ మద్రాసు యూనివర్సిటీ నించి తిరుపతి యూని వర్సిటీకి మారారు. ఆయన **study period** అయిదేళ్ళు. ఆ ఐదేళ్ళూ ఆయన చలంగారు వాళ్ళతోనే వున్నారు. చిత్ర, చిత్ర పిల్లలూ, పకపక, వజీర్ అంతా ఒక పెద్ద కుటుంబమై పోయింది. ఆ రోజుల్లో రమణస్థాన్ ఎంత సందడిగా వుండేదో. కొత్త కవిత్వాలు చదువు కోవడం, కొత్త కొత్త సంగీతాలు వినడం, ఎన్నో కళలమీద చర్చించు కోవడం, వజీర్ రాకతో రమణస్థాన్‌కి ఒక విధమైన **artistic atmosphere** పట్టింది. వజీర్ కోసం అన్నీ మసాలాకూరలు చేయిం చడం మొదలు పెట్టారు షౌ.

ఈవివాహం ఆశ్రమంలో గగ్గోలు పుట్టించింది. అప్పట్లో దీక్షి తులుగారు వొచ్చారు. చలంగా రాయనతో "వాళ్ళంతా నాతో ఎంత

విరోధంగా వున్నారో చూడండి" అని అన్నారు. దీక్షితులుగారు శాంతంగా చిరునవ్వుతో "వెంకట చలంగారు. మీ రిటువంటి వాటిని ఎన్నడూ లెక్కచేయలేదు కదండీ" అన్నారు.

అయిదేళ్ళ తరువాత వజీర్ చదువు పూర్తయింది. కొద్ది రోజుల్లో ఆయనకి మద్రాసులో వుద్యోగం దొరికింది. సరిగ్గా పకపకకి ఈశ్వరుడెట్లా చెప్పారో అట్లానే మద్రాసులో వాళ్ళు ఓ ఇంట్లో చిన్నభాగంలో వుండేవాళ్ళు. పెళ్ళయినాక పకపకలో ఎంత సహనమో ఎంత ఓర్పు, ఎంత పొదుపరి తనమో! ఆ అయిదేళ్ళు రమణస్థాన్‌కి ఎంతమంది వొచ్చినా తనే వంట చేసేది. ఈశ్వరుడి శిక్షణతో ఎంతపని మంతురాలైందో!

పకపక పెళ్ళి ముందు అమ్మకి తాను ఎవరినన్నా కోప్పడుతుంటే షౌ తన మీద కోపపడటం, తనెంత చెప్పినా వినకండా షౌ నర్తకిని ముట్టుకోవడం, చాలా బాధని కలిగించాయి. ఇదికాక ఇంటి వెనకా లెవరో డైనమైటు పేల్చబోతున్నారని భయం బయలుదేరిందామెకి. ఎవర్తో చెప్పుకున్నా మాత్రం ఆమె భయాలు ఎవరి కర్థమవుతాయి. అంతే కాకండా ఎవరో తనమీద ప్రయోగాలు చేస్తున్నారని గోల పెట్టేది. ఆ మాటకూడా నిజమే.

చలంగా రామె పరిస్థితి గురించి ఇలాఅంటారు— 'ఈశ్వరుడు మీకు రాయ మన్నారు."నువ్వు అమ్మ (రంగనాయకి) గురించి చాలా ఆదుర్దా పడుతున్నావు. నేను చూస్తున్నాను. ఆమెని నేను తీసుకున్నాను. ఇంక ఏభయమూ అక్ఖర్లేదు" అని.

(శాస్త్రిగారికి చలంగారిలేఖ 30-12-58)

ఒకసారి శాస్త్రిగారు వొచ్చినప్పుడు అమ్మ ఏడుస్తూ "మామీద ఎవరో ప్రయోగాలు చేస్తున్నారు శాస్త్రి!"అని చెప్పింది.అలా అనేసరికి

శాస్త్రిగారు "మీకేం భయం లేదమ్మా. మళ్ళీ తిరిగి ప్రయోగం చేసి వాళ్ళ నణిచేస్తాను. మీ కెందుకమ్మా దిగులు?" అని assure చేశా రామెకి.

ఇవే కాకండా పకపక పెళ్ళితో అమ్మ తట్టుకోలేక కాకినాడ వెళ్ళిపోయి తన స్నేహితురాలు నడుపు తున్న institution లో చేరి పనిచేయడం మొదలు పెట్టింది. ఇక్కడనించి చలంగా రామెకి కొద్దిగా డబ్బు పంపించే వారు. ఆ తరువాత 'చే' ఆమెకి సరిపడా డబ్బు పంపించ సాగింది. ఆ institutionలో తనికి జబ్బు చేసేవరకూ చివరి దాకా పనిచేస్తూనే వుండి పోయింది అమ్మ.

ఒకరు చలంగారికి వుత్తరాలు రాస్తూ వుండేవారు. చివరికి చలం గారిని చూడడానికి అరుణాచలం వొస్తానని వుత్తరం రాశారు. "మీ కళ్ళ వేపు చూస్తూ కూచోవడం కన్నా నాకేమీ అక్కర లేదు అందుకోసమే వొస్తూన్నా నండి" అని రాశా రాయన. 'సరే' రమ్మన్నారు చలంగారు.

ఆయన రాక గురించి చలంగారి మాటల్లోనే విందాం.

"మీకు రాశానుకదూ——గారని ఓ అబ్బాయి హైదరాబాదు నించి వొచ్చి (మా) ఆశ్రమ సాధకుడుగా చేరారని. ఆయన ఒకటిన్నరరోజు ల్లోనే "నే నిక్కడ వుండలేను, వెళ్ళిపోతా నన్నారు. ఈ మూల కూచుంటే నా జీవితం వృధా. లోకంలోకి వెళ్ళి సంస్కరణకి పూను కొంటా నన్నారు. సరే నన్నాం, వెళ్ళి పోయారు.

ఇవాళ పొద్దున్న తిరిగి వొచ్చారు, కాట్పాడి దాకా వెళ్ళి, ఈ లోపల ఆలోచించుకున్నా రట. తను ద్వేషించే లోకంలోకి తిరిగి పరి గెత్తడంలో అర్ధ మేమిటని.

ఇంక ఉంటా రనుకుంటాను.

"లోకంలో చెల్లక, ఆశ్రమానికి వొచ్చాం. ఆశ్రమంలోనూ పనికి రాకపోతే, అరుణాచలం నించి కిందికి దూకి చద్దాం అనే నిశ్చయంతో."

కాఫీ మానేశారు. సిగరెట్లు కూడా చాలా వరకు. ఇంకా యుద్ధం సాగుతోంది.

నే నన్నాను— "పూర్వం శాస్త్రిలలో అంతశ్శత్రువులు కాక, బహిశ్శత్రువులు భార్యా, పిల్లలే— ఈ నాడు వారి కంటే కూడా బలమైన బంధాలు కాఫీ, సిగరెట్"- అని.

— గారు ఉద్యోగానికి రాజీనామా చేసి, బంధువుల్ని, తల్లిని, అన్నని, ప్రియురాళ్ళని వొదిలి వొచ్చారు.

అక్కడినించి ఇక్కడికి ఒక దూకు
ఒక్క ఆమెతో వొస్తా నన్నారు.
ఈశ్వరుడు వీల్లేదంటే ఆమెనీ వొదిలి వొచ్చారు.
భగవాన్ అనుగ్రహం ఆయనపట్ల ఎలా వున్నదో !"

(శాస్త్రిగారికి చలంగారి లేఖ 9-7-59)

ఆయన అతివాగుడు మనిషి. Control లేకండా మాట్లాడేవాడు. ఆయనని యోగాసనాలలో పెట్టారు ఈశ్వరుడు. కాకా, కిట్టూని చూచుకోవడమే ఆయన పని. ఆయన కళ్ళు చలం కళ్ళ మీదినించి స్త్రీ కళ్ళమీదికి జారాయి. ఇంకాయన విపరీతంగా ప్రవర్తించడం మొదలు పెట్టాడు. చలంగా రాయన్ని అదమాయించాల్సి వొచ్చింది. యోగాసనాలు వేసేవారు సిగరెట్లు కాల్చకూడదు. అతను సిగరెట్లు కాలుస్తోనే వున్నారు. షా అతన్ని నివారించారు. "నేను కాల్చేది ఒక్క సిగరెట్టేనండీ. అదికూడా కాల్చవద్దంటే ఎలా?" అని షాతో పోట్లాడి బయటికి వెళ్ళిపోయారు.

మరుసటి రోజాయన గుండు చేయించుకుని గోచీ పెట్టుకుని వొచ్చారు. "చలంగారూ నా కంతా తెలిసి పోయింది" అన్నారు. ఆయనకి ఏం తెలిసి పోయిందో చలంగారూ వాళ్ళకి అర్థం కాలేదు. ఆశ్రమానికి, సిగరెట్టు కాలుస్తో వెళ్ళి ఆయన భగవాన్ సోఫాలో కూచుని నేనే భగవాన్‌ని అని గట్టిగా అరిచాడట. అక్కడి వాళ్ళంతా కలిసి ఆయన్ని ఒక్క లాగు లాగి దెబ్బలువేసి బయటికి ఈడ్చేశారు.

"—గారు విజృంభించారు. ఆశ్రమంవాళ్ళు వుడుకుతున్నారు."
(శాస్త్రిగారికి చలంగారి లేఖ 27-8-59)

మళ్ళీ రమణస్థాన్‌కి వొచ్చి గోలచేయడం మొదలు పెట్టారాయన. చలంగా రాయన్ని బైటికి వెళ్ళిపొమ్మన్నారు. అలాగే వెళ్ళిపోయారు. అతని పెట్టీ బేడా బైట పడేసి "నువ్వింక రావొద్దు వెళ్ళిపో" అన్నారు చలంగారు.

ఆయన బైటనే వుండి చలంగారికి చీటీలు పంపించే వాడు— "నా ఆశలు అన్నిటికీ నువ్వే అడ్డు. చూస్కో నిన్ను చంపేస్తాను" అని. అప్పు డప్పుడు లోపలికి దూకుడుగా వొచ్చేసేవాడు. ఆ పిచ్చిలో ఆయన చలంగార్ని నిజంగానే చంపేస్తా డని అందరూ భయపడేవారు. చలంగారు తమకి ఏమీ అంటనట్లు కూచునే వారు. కానీ చలంగార్ని ఆయ నేమీ చేయలేదు. చివరికి ఒక టీ స్టాలాయనకి ఆయనమీద జాలి పుట్టి ఆయన్ని ఒక లారీమీద ఎక్కించి గుంటూరు పంపిం చేశారు. ఎప్పుడైతే తెలుగు నేలమీద కాలుపెట్టారో అప్పుడే ఆయన పిచ్చి ఎగిరి పోయింది. వెళ్ళి ఎప్పటిమల్లే తమ వుద్యోగం చేసుకుంటున్నాడుట.

"ఎంత మంది ఇక్కడ దివ్యలోచనాల కోసమని వొచ్చి వారి దృష్టిని 'చర్మలోచనాల' మీదికి దిగజార్చు కునేవారో! మనుషులకి తప్ప దది. కొందరు పాపం వాళ్ళ లోపల జరుగుతున్నది తెలుసుకుని

తప్పుకుని వెళ్ళిపోయే వాళ్ళు. కొందరు తమని తాము control (అదుపు) లోనికి తెచ్చుకుని మసిలేవాళ్ళు. కొంద రదేదో తమకి హక్కుభుక్తం అయినట్లు నాతో వొచ్చి పోట్లాడే వాళ్ళు. ఇంక చాత కాక రోషంతో unpleasant చేసుకుని విరోధించి వెళ్ళిపోయే వాళ్ళు. అందుకని ఎవరి శక్తి వాళ్ళు చూసుకు నిలబడితే తప్ప ఇక్కడ నిలవ లేరు. సామాన్యంగా అన్ని ఆశ్రమాలలో లాగా జీవితం మీద విరక్తి చెందో, ముసలితనంలో ప్రశాంతంగా కళ్లు మూసుకుని 'కృష్ణా రామా' అంటూ కూచోవడమో కాదు- ఇక్కడి ఆశ్రమ రీతి. అట్లా అనుకుని చాలామంది డిజప్పాయింట్ అవుతారు. ఇది అగ్ని. ఆ అగ్నిని తట్టుకో గలవారే ఇక్కడ నిలవగలరు" అంటారు సౌరిస్ రమణస్థాన్ ఆశ్రమరీతి గురించి.

('ఈనాటి మాటలు' - సౌరిస్ - సేకరణ స్వామి రామానంద)

చాడ్విక్‌కి జబ్బు చేసింది. ఆయనకి హెర్నియా ఆపరేషన్ చేయవలసి వొచ్చింది. ఆయన తిరువన్నామలై గవర్నమెంటు హాస్పిటల్లో ఎడ్మిట్ అయ్యారు. సౌరిస్ ఆశ్రమం ఆసుపత్రికి తప్ప బైట ఆసుపత్రులకి వెళ్ళేవారు కారు. కానీ చాడ్విక్‌ని చూడటానికి మాత్రం ఒకసారి వెళ్ళారు. చాడ్విక్ హాస్పిటల్‌లో వుండగానే వజీర్ పకపక పెళ్ళి చేసుకోబోతున్నారని ఎవరికీ చెప్పని చలంగారు ఆయన ఒకరికే చెప్పారు. ఆయన ఈ సంగతి విని ఎంతో సంతోషించారు.

## 17

పకపక పెళ్ళి కాగానే ఈశ్వరుడు చలంగారితో "మీ ఇంటిని ఆశ్రమం చేస్తున్నాను" అన్నారు.

ఆశ్రమ స్థాపన గురించి చలంగా రేమంటారో విందాం.

"ఆశ్రమంలో చేరాలని కొంచెంగా అలజడి బైలుదేరింది తెలుగు యువకుల్లో"

(శాస్త్రిగారికి చలంగారి లేఖ 9-7-59)

"ఇనేళ్ళకి ఈసారి మీరు వొచ్చి ఈ ఆశ్రమంలో మాలో ఒక రైనా రనిపించింది.

1960 నించి ఈ ఇళ్ళ స్వరూపం పూర్తిగా ఆశ్రమంగా మారబోతోంది అన్నారు ఈశ్వరుడు నిన్న"

(శాస్త్రిగారికి చలంగారి లేఖ 27-8-59)

చలంగారు అంతకిత్రమే ఈశ్వరుడ్ని "మమ్మల్నెప్పుడు రోడ్ల మీదికి తీసుకు పోతారు?" అని అడేగేవారు. చిన్నప్పటి షౌ కలలని జ్ఞాపకం చేసుకుంటూ.

అప్పుడు షౌ "స్వేచ్ఛ అన్నది రోడ్లమీదికి పోతే వొస్తుందా? అది లోపల్నించి తెచ్చుకోవాలి" అన్నారు.

చిన్న తనంలో చలంగారి అమ్మమ్మ ఉన్నప్పటి నించి వారి ఇల్లు ఒక **open house** సౌరిస్ చిన్న తనంలోనూ అలాగే నడిచింది—— ఇప్పటివరకూ అలాగే నడుస్తోంది. ఆ **open house** నే ఆశ్రమంగా మార్చారు ఈశ్వరుడు. డబ్బువున్నా లేకపోయినా ఎవరన్నా వొస్తే.

"మీ రెన్నాళ్ళు వుంటారు?" అని అడగడం వుండేది కాదు. ఉన్నదాంట్లో సరి పుచ్చుకునేవారు. చలంగారు వాళ్ళు ఈ అడవిలోకి వొచ్చినా, చలంగార్ని చూడటానికికని వొచ్చి ఇక్కడ వుండి పోయే వారు చాలా మంది వున్నారు. కానీ ఇక్కడ కొందరిలో ప్రశ్నలు రేగాయి. "వారివారి సొంత ఆస్తులన్ని వుంచుకుని వూరికే ఇక్కడ

ఎందుకు వుండడం?" ఏ పని పాట లేకుండా వూరికే ఎందు కట్లా కూచోవడం?" అని. అప్పుడు ఈశ్వరుడు నిర్వాహకభారం అంతా తమ చేతిలోకి తీసుకున్నారు.

"ఒక కాలపరిమితి చెప్పి, ఇన్ని రోజులు ఆశ్రమ అతిథులుగా తీసుకోండి, అంతకన్నా ఎక్కువరోజులువుంటే వారిని మీలోకితీసుకుని పనీపాటలు చెప్పండి" అని చలంగారు వాళ్ళకి చెప్పారు ఈశ్వరుడు. వా రావిధంగానే చేస్తున్నారు. ఈశ్వరాజ్ఞల్ని శిరసావహించి చలంగారు వాటిప్రకారం ఆశ్రమాన్ని మేనేజ్ చేసేవారు. ఆ ప్రకారమే ఆశ్రమం ఇంతవరకూ నడుస్తున్నదంటే అది చలంగారి విశ్వాసబలమే అనాలి. ఎవరిలో నన్నా ఆశ్రమవాసులలో గానీ, వొచ్చినవారిలో గాని సంఘర్షణ తలెత్తితే చలంగారు వాళ్ళని దగ్గరకు తీసుకుని Explain చేసి, ఆసంఘర్షణని ఈశ్వరకారుణ్యం వలన చల్లార్చే వారు.

చలంగారికి తనది అన్నభావన ఏ నాడు లేదు. ఆయన ఇంటిని ఆర్తులకోసం శోకోపహత మానసులకోసం ఇచ్చు కున్నారు. ఇప్పుడు సర్వస్వాన్నీ ఈశ్వరాదేశానికి సమర్పణం చేసుకున్నారు. ఎన్నడూ చలంగా రిట్లా చేశారేమి టన్న ప్రశ్న వారి కుటుంబ సభ్యులకి రాలేదు. ఈనాడు అంతే. ఎవరు వొచ్చినా, సాధకులుగా వుంటారన్నా అభ్యంతరం చెప్పేవారు కాదు కానీ వాళ్ళలో చాలా మంది వాళ్ళకి తెలియకుండానే ఇక్కడ వేడిని తట్టుకోలేక ఎదో ఒక మిషతో, వాంఛతో వెళ్ళిపోయే వాళ్ళు అనేకులు. ఎవరికి ఇక్కడ వుండే ప్రాప్తి వున్నదో, ఎవరికి ఆత్మాభివృద్ధి ముఖ్యమో వారి ప్రారబ్ధాన్ని ఎవరు తపస్సు ద్వారా తీర్చుకోవడనికి ఈశ్వరుడు వుద్దేశించారో అటువంటి కొద్దిమందే నిలుస్తా రిక్కడ.

ఈ ఆశ్రమం గురించి చలంగా రేమంటా రంటే:

"ఇది నిజమైన ఆశ్రమమని ఈశ్వరు డంటే, ఇప్పుడు నే నెరిగిన, చదివిన, ఆశ్రమాల వంటి ఆశ్రమం అవబోతుం దనుకున్నాను. డబ్బు, బిల్డింగులు, మీటింగులు. పత్రికలలో ప్రతిష్ఠ, యిట్లాంటివన్నీ ఈ ఆశ్రమంలో వుంటా"యని భ్రమ పడ్డాను. ఇది యిప్పుడు చూడగా చూడగా నాకు పూర్వపు ఋష్యాశ్రమం లాంటి దని తెలుస్తోంది".

('చలం' పేజీ 361)

అ రోజునించి క్రమంగా ఇదంతా ఒక ఆశ్రమంగా తయారయింది. అప్పటినించీ ఈశ్వర విలాసం శ్రీరమణస్థాన్ ద్వారా ప్రసరించి జిజ్ఞాసువులని, ఆర్తులని, ఆధ్యాత్మిక గవేషణాపరులని నడుపసాగింది.

జగ్గారావుగారు చలం గారితో చాలాకాలం వుత్తర ప్రత్యుత్తరాలు నడిపి 1958లో చలంగారిని చూడటానికని వొచ్చారు.

ఆయన మునుపు చలంగారు బందర్లో పనిచేసే రోజుల్లో చలం గారి పుస్తకాలు చదివి వారిని చూడటానికి వొచ్చారట.

"నా భార్య చచ్చిపోయింది. నాకింక బతకాలని లేదు. మిమ్మల్ని చూసి చచ్చిపోదా మనుకున్నాను. మిమ్మల్ని చూశాను గనక, ఇంక చచ్చిపోతాను" అన్నారటాయన చలంగారితో. "సరే అట్లానే కానియ్యండి" అన్నారు చలంగారు. కానీ లీలగారు ఏం చెప్పారోగాని ఆయన బతకాలని నిశ్చయించుకొని తిరిగి వెళ్ళిపోయారు.

ఆ తరువాత మళ్ళీ ఇన్నాళ్ళకి చలంగారిని చూడటానికివొచ్చారు. ఆయనలో వెలమపట్టుదల జాస్తి. ఆయన ఏమయినా అనుకున్నారో హరిహరబ్రహ్మాదు లడ్డం వొచ్చానా ఆ పని చేసి తీరుతారు. ఆయనకి పూర్తిగా చలంగారి దగ్గిరే వుండిపోయి ఆధ్యాత్మికసాధన చెయ్యాలనే పట్టుదల కలిగింది.

జగ్గారావుగారికి సాధనకి వొచ్చే అవరోధాలు గురించి చలంగా రేమంటారో విందాం.

"జగ్గారావుగారికి పట్టిన అలవాట్లు, 16 గంటలు బీడీలు, వరస వరస కారాకిల్లీలు, టీలు, చీట్లపేక— ఇదే వృత్తి— అంత బలంగా, మాంసం లేంది— ముద్ద దిగదు. అడప తడప స్త్రీ ఇవన్నీ సాధనకి ఆటంకాలు ఆ బొబ్బలి వెలమవీరుడి యుద్ధవిరమణ. ఆయన కార్డు పంపుతున్నాను. అన్నీ మానారు— ఒక్కసారిగా చాలావరకు— ముఖ్యం బీడీలు."

(శాస్త్రిగారికి చలంగారి లేఖ 23-4-58)

కానీ ఇక్కడ వుండాలంటే బీడీలు పూర్తిగా మానుకోవాలి. అదొక్కటే తంటా ఆయనకి. బీడీలు మాత్రం మానుకో. లేరాయన.

ఆ రోజుల్లో కురంగేశ్వర్, జగన్నాధం, జగ్గారావుగారు రోడ్డు మీద నడచి పోతోంటే చలంగారు తమ రక్షణకోసం ఆంధ్ర యోధులని పిలిపించుకుని తమ దగ్గర అట్టేపెట్టుకున్నారా అన్నట్లుగా వుండేవారు. పైగా జగ్గారావుగారు ఆశ్రమానికి వెళ్ళి "ఇట్లా ఎందుకు చేస్తున్నారు? ఎందు కిట్లా వుంచా రివన్నీ?" అని ప్రతిదాని గురించి ధీమాగా అడిగేవారు. వారు ముగ్గురూ నడుస్తూ వుంటేనే ఎవరిమీదనో యుద్ధానికి పోతున్నట్లుండేది. అంత ఠీవిగా అంత రాజసంగా నడిచేవారు వాళ్ళు. చివరికి జగ్గారావుగారు "ఈ బీడీలు మానలేకండా వున్నానండి. నేను మావూరు వెళ్ళి బీడీలు మానడమే సాధనగా పెట్టుకుని— జయించి అప్పుడు వస్తాను" అని వాళ్ళ వూరు వెళ్ళిపోయారు.

ఊరు వెళ్ళాక ఆశ్రమానికి వచ్చేయాలనే నిశ్చయం చేసుకుని అన్నీ ఏర్పాట్లు చేసుకుంటున్నారు. ఆయనకి కావాల్సిన వారొకరు— ఆశ్రమానికి వెళ్ళి ఏంచేస్తావని హితబోధ చేసి, పెళ్ళి చేసుకోమని

పోరు పెట్టారు. ఆవిడంటే ఆయనకి చాలా గురి. కానీ ఆమె చెప్పినా గూడా తన నిశ్చయాన్ని మార్చుకో లేదాయన.

కొద్ది రోజుల్లోనే ఆయన జీవితాన్ని చాలా సుఖవంతం చేసే ఒక సంఘటన జరిగింది. ఆయన "నేను చాలా హాయిగా వున్నాను. నాకు రావా లనిపించటల్లేదు" అని చలంగారికి వుత్తరం రాశారు. ఆ తరువాత చాలాసార్లు అరుణాచలం వొచ్చారు. వున్న కాసిని రోజులు సరదాగా హాయిగా గడిపి వెళ్ళి పోయేవారు.

అప్పట్లోనే కర్లాంనించి పార్వతీశంగారు వొచ్చారు. ఆయనకి చలం, సౌరిస్, భగవాన్‌లపై గొప్పభక్తి. ఆయన వుండే ప్రాంతాల వారికి ఈయన వలన భక్తి కుదిరింది. పండగలకి వుడతా భక్తిగా ఏదో సమర్పించు కుంటారు. పార్వతీశంగారి అరుణాచల సందర్శన అనుభవాలు వారి మాటల్లోనే విందాం.

"నా జన్మస్థానం కర్లాం. మా జననీ జనకులు ఎల్లప్పుడూ సాధువులను పూజిస్తూ వారి ఆశీస్సులను పొందు చుండేవారు. మా ఇంటికి విచ్చేసిన సాధువులను మహాత్ములను నేను చూచి నప్పుడల్లా వారు ఈశ్వరుడిని చూచి వుంటారని అనుకుని, నాకు కూడా ఈశ్వరుని చూడాలనే సంకల్పం కలిగింది.

నేను అయిదవ తరగతి చదివిన మరుసంవత్సరమే ఇంట్లో ఎవరికీ చెప్పకుండా— ఈశ్వరుడ్ని చూడాలని కాశీ వెళ్ళి పోయాను. అక్కడ ఈశ్వరుడు ఎక్కడ కనిపిస్తాడా అని వేసారి పోయాను. ఆయన సర్వసాక్షి. అంతటా వుంటారు అన్నారుకదా అని నన్ను నేను సమాధాన పరుచుకొని తిరిగి— మరల కర్లాం చేరుకుని, అక్కడ శశ్మాన వాటికలో వున్న శివాలయంలోని ఈశ్వరుని గురించి తపస్సు చేద్దామని కళ్ళు మూసుకుని అలా కొన్ని దినాలు కూచుండి పోయాను.

కొద్ది రోజుల తరువాత నా తల్లిదండ్రులు ఇంటికి పట్టుకుపోయారు. ఎంతో దేశం ఎన్ని ప్రాంతాలో తిరిగాను. నన్నుద్ధరించి నాకు దోవని చూపించే సద్గురువు కోసం వెదికాను. నా అంతర్యం తెలిసి, నన్ను పోల్చుకుని- తనవైపుకి నన్ను పిలుచుకునే తేజోమూర్తియైన గురు దేవుడు నాకు లభ్యం కావాలన్నదే నా తపన. అందుకోసం ఎన్నో దిక్కులు కలయతిరిగి వెదికాను. నా అంతఃకరణంలో నేను నిరంతరం అన్వేషించే గురుదేవుని పిలుపు వినిపించనే లేదు- మాకర్లాం సుబ్బయ్యనాయుడిగారి కుమారుడు రామనాయుడుగారో రోజు- "పార్వతీశం, ఎందుకట్లా తెగిన గాలిపటంలా దేశాలు పట్టి తిరుగుతున్నావు. మీ అమ్మా నాన్నా నీకోసం బెంగపడుతున్నారు. నువ్వు దేనికోసమిట్లా తిరుగుతున్నావో నాకు చెప్పు అన్నారు. "ఈశ్వర దర్శనం చెయ్యాలని నా కోరిక కనుక తిరుగుతున్నాను" అన్నాను. అప్పుడు నాయుడుగారు ఎన్. వీరేశలింగంగారనేవారు నాకు మంచి స్నేహితులు. ఆయన మొదట్లో కమ్యూనిస్టు. ప్రస్తుతం ఆయన రమణాశ్రమంలో చలంమహర్షి దర్శనం చేసి భక్తిమార్గంలో ప్రవేశించారు. వారితో నీకు పరిచయం చేస్తాను" అని నాకు వీరేశలింగంగారి ఎడ్రస్ ఇచ్చారు.

వీరేశలింగంగారికి నేనొక కార్డు రాశాను నా ఆవేదనని తెలుపుకుంటూ. ఆయన చలంమహర్షి చిర్నామానేకాక- "చలంగారి కుమార్తె సౌరిస్ సందర్శనం చేసుకుంటే మీ సమస్యలు తీరిపోతాయి" అని రాశారు. ఆ పుత్తరంలో సౌరిస్ అని చదవగానే ఈశ్వరుడు, ఈశ్వరుడు అని నా హృదయంలో నాకు తెలిపినట్లయింది. నా వొళ్ళంతా చెమటలు క్రమ్మాయి. అప్పటికి భగవాన్ రమణులను, చలం మహర్షిని, ఈశ్వరి సౌరిస్‌ని ఎరుగని నా కళ్ళకి ఆ త్రిమూర్తులు ఒక్క-

సారిగా దర్శన మిచ్చినట్లయ్యింది. ఆ త్రిమూర్తులని అవశ్యం దర్శించా లనే నిశ్చయం నాలో కలిగింది. చలంమహర్షికి నా ఆకాంక్షని తెలుపు కుంటూ లేఖని రాశాను. అప్పుడు మహర్షిగారు "ఈశ్వరానుగ్రహం ఎప్పుడూ వుంది. భగవాన్‌లో విశ్వాసం నిలుపుకోండి. తప్పకుండా రా గలుగుతారు" అని నాకు జవాబు రాశారు. ఆ వుత్తరం చదవగానే నా ఒళ్ళు పులకరించింది. ఆ ఆనందాన్ని మాటల్లో తెలపడం సాధ్యం కాని పని.

అది 1959 వ సంవత్సరం. వెంటనే మహర్షి వుత్తరం అందిన మరుసటి రోజే నేను వొస్తున్నట్లు మహర్షికి రాశాను. రాశానన్న మాటే గానీ రాకపోక ఖర్చులకి నా చేతిలో చిల్లిగవ్వ లేదు. హృదయం మాత్రం సౌరిస్ దర్శనానికి ఆరాట పడుతోంది. అకారణంగా ఒక మిత్రుడు వొచ్చి పార్వతీశం దిగులు పడకు. అరుణాచలం వెళ్ళిరమ్మని డబ్బు ఇచ్చారు. ఈశ్వర కారుణ్యం ఎట్లా వర్షిస్తుందో అదే తొలిసారిగా అనుభవమైంది నాకు.

వెంటనే బైలుదేరి రెండో రోజు రాత్రి పదిగంటల కల్లా అరుణాచలం చేరుకున్నాను. రైలుస్టేషన్ నించి బైలుదేరి ఆశ్రమం దోవ పట్టాను. ఆశ్రమాలు అరణ్యాలలో వుంటాయని పురాణాలలో విన్నాను. అందుకని అలా ముందుకి నడుచుకుంటూ అడివి వుంటుం దేమో నని సాగిపోయాను. ఒకచోట ఒక పోలిస్ జవాన్ కనిపించాడు. అక్కడే నన్నెవరో నా కుడిచెయ్యి పట్టుకుని లాగిన ట్లయింది. కానీ నేను ఆగక అట్లా నడుచుకుంటూ పోయాను. Station నించి సుమారు నాలుగైదు మైళ్ళు దూరం నడిచాను. దూరంగా electric లైట్ల కాంతి, అడవి లేదు. ఆశ్రమం లేదు. "భగవాన్ నేను మార్గం తప్పానా? నిన్ను నమ్మి నీవు రప్పించితేనే ఇక్కడికి వొచ్చాను ప్రభూ! నాకు

నీ దర్శనాన్ని ఎందుకు కల్పించటల్లేదు. ఈ పసివాడిమీద ఎందుకు తండ్రీ ఆగ్రహం" అనుకుంటూ- ఆ చీకటిలో ఎదురుగుండా వున్న కొండ వైపు చూస్తూ నిలబడ్డాను. ఒక వృద్ధు నాముందల్లంత దూరంలో నిలబడి - నీ కుడి చెయ్యి లాగిన న స్థలమే భగవాన్ ఆశ్రమం అని చెప్పారు. తలెత్తి చూసేసరికి అక్కడ ఎవరూ లేరు. అంతా ఆశ్చర్యంగా అనిపించింది. అర్థంకాక ఎవరా అని భయంతో వొణికి పోయాను. అంతట్లోనే తమాయించుకుని ఆ ముదుసలి చెప్పి నట్లే నా చెయ్యి లాగినట్లైన చోటికి తిరిగి వొచ్చాను. అక్కడ ముందు కనబడ్డ పోలీసుజవాను నిలిచే వున్నాడు.

"మీరు చలంగారింటికి పోతున్నారని అనుకున్నాను. ఆశ్రమాని కని తెలిస్తే ఇందాకనే చెప్పి వుందును"- అని వొచ్చీ రాని తెలుగులో చెప్పాడు. వెళ్ళి కాళ్ళు చేతులు కడుక్కుని భగవాన్ సమాధి ముందు కొంచెం సేపు కూచున్నాను. ఉదయకాల సూర్యబింబంలాంటి తేజం సమాధి మీద నాకు దర్శనం ఇచ్చింది. తరువాత నెమ్మదిగా చలం guest house కి వొచ్చాను. నా వుత్తరం ముందుగా అందడంతో గెస్టుహౌసులో వున్న మిత్రులు బసవరాజుగారు, కురంగేశ్వర రావుగారు- ఇతరులు నన్ను ప్రేమగా లోపలికి పిలుచుకుని పోయి నిద్రించేందుకు జాగా చూపి ఒక చాపని ఇచ్చారు. "హమ్మయ్యా అరుణాచలం వొచ్చేశాం కదా! రేపు వుదయం నా ప్రభువుని నేను దర్శించుకో వొచ్చు" ననే వుత్సాహంతో రాత్రి గడిచి పోయింది.

తెల్లవారింది. చలంమహర్షి దర్శనార్థం మిత్రులతో కలిసి వెళ్ళాను. మహర్షి నన్ను చూసి చిరునవ్వుతో ప్రేమగా "వొచ్చారా?" అన్నారు. చలంగారి పాదాలకు నమస్కరించి లేచి తలెత్తేసరికి ఎదురుగుండా నవ్వు వెన్నెలలు చిందు లాడుతుండే ప్రభువు ముఖం-

ఫాలభాగాన విభూతి రేఖలు, విరబోసిన జుత్తూ తెల్లనిచీర - - - కాస్సే పలా చూస్తూ వుండిపోయాను. ఆమె ఫాలంలో మూడవ కంటితో సహా ఈశ్వరుని దర్శనం నాకు ప్రాప్తించిది. వీరే ఈశ్వరుడని నా హృదయంలో స్ఫురించి నాజన్మ తరించిందని, సౌరిస్సే నేను వెదికే ఈశ్వరుడని నాకు నిర్ధారణ కలిగింది. వారి సన్నిధిలో కూచుని వుండగా నాలో వున్న సమస్యలన్నీ అంతర్ధాన మైపోయాయి. ఆనాటినించి ఈ నిమిషందాకా ఏసందేహం వొచ్చినా నే నడక్కుండానే వారే నా కలల్లోనో, ధ్యానంలోనో తీరుస్తున్నారు. వారి దయవల్ల ఏదీ సమస్యగా పరిణమించలేదు. ఏ చిక్కులైనా గాలికి చెదిరిపోయే మబ్బుల్లాగా దూర మైపోతున్నాయి. ఆ ఈశ్వరకాంతిలోనే నా ప్రయాణం సాగుతోంది. నేను నడుస్తున్నా ననుకోవడం తప్పు. ఎందుకంటే నన్ను నడిపిస్తున్నది వారే, దోవ చూపిస్తున్నది వారే.

ఈశ్వరుడు నామీద చూపిన కరుణవల్లనే కర్లాంలో భగవాన్ రమణనిలయం పేరిట ఆశ్రమాన్ని నిర్మించగలిగాను. ఈ నిర్మాణంలో ఎన్నో శోధనలుచేసి. వాటికి తట్టుకుని నిలబడే బలాన్నికూడా ఈశ్వరుడే ఇచ్చారు. ఆశ్రమం నిర్మించిన చోటునే—— భగవాన్ రమణ మహర్షికి ఒక ఆలయమును నిర్మించాను. ఆ ఆలయంలో ప్రతిష్ఠ నిమిత్తంగా భగవాన్ రమణ శిలావిగ్రహంను చేయించాము. వారి ముందు కాశీనగరం నించి శివలింగం తెచ్చి ప్రతిష్ఠించ వలెనని ఈ సంవత్సరం (77) ఆగష్టు పదిహేనవ తేదీకి కాశీవెళ్ళాను.

కాశీ విశ్వేశ్వరాలయం ముందు క్రిక్కిరిసిన వేలాది జనంలో నిలబడ్డాను. ఇంతమందిలో ఈశ్వరదర్శనం దొరుకు తుందా? అని ఈశ్వరుడ్ని ప్రార్థించాను. కానీ విచిత్రంగా నేను ముందుకి వెడుతుంటే జనం తొలిగి నాకు దోవ నిచ్చారు. కాశీ విశ్వేశ్వరలింగానికి

పుష్పాల్ని సమర్పిస్తుంటే— ఆ శివలింగం వెనకభాగంలో సౌరిసేశ్వరులు అభయ హస్తంతో, విభూతిరేఖలతో, ఫాలనేత్రంలా భాసించే కుంకుమతో, నీలిమవర్ణంలో దర్శనం ఇచ్చారు. ఒక్కసారిగా ఒళ్ళు తెలియని ఆనందంలో నా కన్నీళ్ళు శివలింగపై పడినాయి. అరుణాచలంలో వున్నా— కాశీలోవున్నా ఎక్కడవున్నా నాగురువు సర్వస్వం నా ఈశ్వరుడు సౌరిస్సే నని నాకు గట్టిగా ఇంకోమారు తెలుపడానికే ఈ దర్శనం ఇచ్చారు కాబోలు ననుకున్నాను. సన్నిధిలో కాకండా నేను దూరంగా వున్నా నా ప్రభువు నామీద చూపించే అనుగ్రహం అపారం. వారి నామం జపిస్తూ ఇచ్చిన విభూతితోనే ఎందరో ఆర్తులకు నేను వుపశమనాన్ని ఇవ్వగలిగాను. అవన్నీ చెప్పడం నన్ను నేను పొగుడు కున్నట్లుగా వుంటుంది కానీ అది నా ప్రభువు మహిమ గనక చెబుతున్నాను.

ఏదయినా అనుభవంలో ఆనందించడం నాకు ఇష్టం. రాతల కెక్కించా లన్నది నాకు కోరికకాదు. ఈశ్వరు లనుమతించారు. కనుక చెప్తున్నాను.

ఒకో్కసారి నాధ్యానంలో ఒక శివలింగంలో నుంచి సౌరిసేశ్వరులు వారివెనక జీసస్, భగవాన్ దర్శనం ఇస్తూ కరిగి పోవడం చివరకు సౌరిస్ కూడా కనిపించకుండా దివ్యతేజం గోచరించడం జరుగుతోంది. ఏ మూర్తిలో నయినా నేనేనని వారి అభయప్రదానమేమో ననుకుంటాను.

ఈనాడు జీవితం వెనుకకు తిరిగి చూసుకుంటే నాకు తెలిసిందల్లా ఒకటే, ఈశ్వర విశ్వాసికి ఏదీ దుఃఖాన్ని కలిగించదని, ఒకవేళ దుఃఖం కలిగినా అది ఆనందంగా పర్యవసించుతుందని. ఈనాడు

నేను కోరుకునేదల్లా నా జీవితం ఈశ్వరకరుణలో ఒక పువ్వుగా ఆయన పూజకే అంకిత మైపోవాలని.

ఆ రోజుల్లో చిత్ర, పకపక వంటని పంచుకున్నారు. పగలు పకపక రాత్రి చిత్ర వంటలు చేసేవారు. ఎంతమందికైనా పకపక ఇట్టే వంటచేసి పెట్టేది ఏ ప్రయాస లేకండా.

ఇంతలో జగన్నాధం తమ వూరు వెడతామని చెప్పి వెళ్ళి పోయారు,

ఆ రోజుల్లో చలంగారికి వొచ్చే వుత్తరాల సంఖ్య విపరీతంగా పెరిగి పోయింది. చలంగారు రచనలు సాగించడం లేదు గనుక వారి వుత్తరాలనే యువతరం వారు, జిజ్ఞాసువులూ— Messages గా తీసుకుని ఎంతో విలువగా చూసుకునేవారు. వారి లేఖలే ఈ రచయితని ఈశ్వర చరణాల చెంత చేర్చాయి.

ఉత్తరాల వుప్పెన గురించి చలంగారు ఏమంటా రంటే "ఈనాడు చలానికి వొచ్చే వుత్తరాలు మీరు చూస్తే, చలం పురుషుడా, స్త్రీ ఆ - చలానికి ఇప్పుడు వయసుని ఎంత పెట్టి భాగిస్తే అసలు వయసు తేలుతుంది అని ఆలోచిస్తారు. కదలిందిరా జగత్తు, కుండలిని కదిలింది." (శాస్త్రిగారికి చలంగారి లేఖ 18-4-57)

"మొన్న కొత్తగా ఓ అమ్మాయి రాసింది నాకు. ఆమెకి రాశాను 'ఆలోచించి, ఆలోచించి చివరికి పులినోట్లో చెయ్యి పెట్టావు. నీ కింక ముక్తి లేదు. ఈ చలం వుత్తరాలకి వెంటనే జవాబు రాసే world federation కి అధ్యక్షుడు. గొప్ప గొప్ప వొస్తాదులు అలిసి పడిపోయినారు' అని. లాభంలేదు కొన్నాళ్ళకి అలిసి పడిపోతారు అని బోధించాను." (కురంగేశ్వర్‌కి చలంగారిలేఖ 13-8-58)

నా శరీరాన్ని నేను ఎప్పుడూ గాజుపెట్టె మల్లే కాపాడు కొంటాను, బాధని భరించలేను కనుక. ఇప్పుడు ముసురు. చలిచినుకుల బెదిరింపు; నా వొంటిమీద వో బనియను, చిన్న కోటు, ఒక బొచ్చు స్వెట్టర్. ఇప్పుడు తృప్తిగా వుందా? నీకు. జాతకం ప్రకారం నే నెప్పుడో చచ్చిపోవలిసింది. అనేక సాధనలతో నన్ని ప్రకారం ఈశ్వరుడు నిలబెట్టి వుంచారు నీకు ఉత్తరాలు రాయడానికి.

(28-11-59 వసుంధరకి లేఖ)

చలంగారు పంటిబాధ మునుపు ఎన్నడూ ఎరుగరు. కానీ అప్పట్లో 'పళ్ళు సలుపు తున్నాయి' అనేవారు. ఎన్ని మందులు వాడినా ఆయన పంటిసలుపులు తగ్గలేదు. కొన్ని రోజులకి ఆయనకి నోరు అంతా పుండులా అయితే షౌకి చూపించారు. చలంగారి పళ్ళని పరీక్షించి చూచా రామె. పంటిమీద పెద్దకురుపు వంటిది కనిపించిందామెకి. ఆ కురుపు ఆయనని కించిన్మాత్రంగా కూడా బాధ పెట్టటల్లేదు. ఆ వాసన, ఆ కురుపు రూపం చూచేసరికి అదేమి వ్యాధో షౌకి తెలిసిపోయింది. కానీ అనుమానంకొద్దీ చలంగార్ని డాక్టరు దగ్గరకి వెళ్ళి చూపించుకో మన్నారు షౌ.

చలంగారు డాక్టరు దగ్గరకి వెళ్ళి పరిక్ష చేయించు కున్నారు. డాక్టర్ అదొక **infection** అని చెప్పారు. చలంగారికి పెన్సిలిన్ పడదు గనుక ఏరోమైసిన్ క్యాప్సుల్స్, నోటిపుండుకి **B. complex injection** ఇచ్చి పంపించారు డాక్టర్. షౌ తామేదో అనుమాన పడ్డామనీ వుత్త **infection** గామోసని వూరుకున్నారు.

ఆ రాత్రి షౌ నిద్ర పోతున్నప్పుడు పెద్దశక్తి ఒక **flash** లాగ వొచ్చి, ఆమెకి మెలకువ తెప్పించింది.

"మీ నాన్నకి క్యాన్సర్" అని పెద్ద అక్షరాలతో కనబడింది. షౌ పొద్దున అనుమానపడింది అదే. చలంగారికి నొప్పి లేదు. మామూలుగా నిద్ర పోతున్నారు. తరువాత సౌరిస్ **mouth cancer** కి మొదట్లో బాధ వుండదని, ముదిరాక నొప్పి ప్రారంభ మౌతుందని ఎక్కడో చదివారు.

షౌ ఆ వ్యాధిని నిరోధించడానికి ఏమీ చేయలేదు. అలాగే ఒక దృశ్యంలో తండ్రిని తీసుకుని భగవాన్ సమాధి దగ్గర అర్పించారు. భగవాన్ చలంగార్ని మళ్ళీ షౌ ఒడిలోకే ఇచ్చేశారు.

అప్పటినించీ షౌ చలంగారికి విభూతివేసి, తమ చేతిని నోట మీద కొంతసేపు వుంచేవారు. ఒక్కొక్కమాటు ఆ పుండు లాంటిది మెత్తబడి విపరీతమైన బాధ పెట్టేది. ఏం చేసినా ఆ బాధ తగ్గేది కాదు.

ఒకసారి షౌ కలలో ఎన్. వీరేశలింగంగారు కనబడి "మీ నాన్నగారికి విటమిన్ E ఇవ్వండి" అని చెప్పారు. విటమిన్ 'E' తో ఆ పుండు నొప్పి పూర్తిగా ఆగిపోయింది. కానీ ఒక్కొక్కప్పుడు ఆ పంటి చిగురు వాచేది. చలంగారికి విటమిన్ 'E' ని తట్టుకోలేక రియాక్షన్ వొచ్చేసేది. కొద్ది రోజుల్లో చలంగారి నోటిపుండు పూర్తిగా తగ్గిపోయింది.

కొన్నాళ్ళు చలంగారి తల సగం భాగం ఎఱ్ఱగా కందిపోయి బరువెక్కి పోయింది. అప్పుడే మిత్రులకు చలంగారు పుత్తరాలలో రాసేవారు "నా కేదో ఘోరమైన వ్యాధి వొచ్చింది. నేను బతుకుతానో లేదో" నని. అది ఫలానా వ్యాధి అని చలంగారికే తెలియదు. డాక్టర్లే కనుక్కో లేకపోయారు.

అప్పుడు ఈశ్వరుడు చలంగారిని పిలిచి "నువ్వు గట్టివిశ్వాసంతో వుండు. నిన్ను ఏ వ్యాధీ బాధపెట్టదు. నువ్వు ఏ జబ్బుతోనూ

చచ్చిపోవు. ముసలి వాడివై పండిన పండులాగ రాలిపోవాల్సిందే" నని చెప్పారు. అలాగే ఆయన తమ విశ్వాసాన్ని మరింత దృఢం చేసుకున్నారు. రాత్రులకి రాత్రులు సౌరిస్ మేలుకొని తండ్రికి స్వస్థత చేకూర్చేవారు. ఆయన బాధలని తాను తీసుకుని భరించే వారు. నెమ్మదిగా చలంగారికి తలలో ఆ వాపు, ఆ ఎర్పు ఆ బరువు అన్నీ మానిపోయాయి. అప్పు డప్పుడు చలంగారి చెవిదగ్గర గ్లాండు వాచి బాధ పెట్టేది. దానికి ఎవరో ఒకమందు ఇచ్చారు. అది పూస్తే తగ్గిపోయేది.

ఒక దశాబ్దం తరువాత (1969) డా. కామేశ్వరి, డా. సుధ చలంగార్ని పరీక్షచేసి అంగట్లో గీసినట్లు ఎర్రగావున్న చోటుని చూసి "నీకు క్యాన్సర్" అన్నారు. అప్పటికి కొంచెం మిగిలి వుంది. "షౌ నాకు క్యాన్సర్ అంటున్నారు" అన్నారు చలంగారు షౌతో. "ఈనాడు కొత్తగా వొచ్చిం దేమీ కాదు. నీకు పదేళ్ళనించీ వుంది. నేను దానిని నయం చేశాను. విశ్వాసం మాత్రం వొదులు కోకు" అన్నారు షౌ.

శ్రీ రమణస్థాన్ సంగతి పుస్తకాలద్వారా ప్రజలు అధికంగా తెలుసు కుంటున్నారు. ఆశ్రమం వారు ఎంత గట్టి ఆంక్షలు పెట్టినా భగవాన్ కోసం నిజంగా వెదుకుంటూ వొచ్చేవాళ్ళు సౌరిస్‌ని వెదుక్కుంటూ వొచ్చేవారు. కొందరు ఆమెని ఆధ్యాత్మిక ప్రశ్నలు వేసేవారు. కొందరు వూరికే దర్శనం చేసుకునేవారు. కొందరు దర్శనార్థం వొచ్చి ఎదురుగుండా కొద్దిసేపు కూచుని ఆమెలోంచి భగవాన్‌ని చూచామని, సంతృప్తిపడి వెళ్ళేవారు— అలా చాలా మంది వొచ్చి వెళ్ళడం రమణస్థానీయులకే తెలియదు.

పూర్వం ఎన్నడూ షౌ నాలుగు గోడల మధ్య వుండేవారు కాదు. తిరువన్నామలై వొచ్చాక ఆవిధంగానే ఆరుబయట ఏ చెట్టు కిందో కూచునే వారు. ఈవూరు వొచ్చాక షౌ పుస్తకాలు చదవడం తగ్గి

పోయింది. సాధనలో వుండే రోజులలో పుస్తకాలు చదివేవారు కాదు. ఆ రోజులలో తీరుబడిగా షౌ బయట కూచున్నప్పుడు, ఏ పుస్తకంలో నించయినా మంచి భాగాలు చలంగా రామెకి చదివి వినిపించే వారు. మిగిలిన వారి కెవరికైనా ఇంటరెస్టింగ్‌గా వుంటే వొచ్చి వినేవారు. జిజ్ఞాసువులు తమకి రాసిన లేఖలకు మహర్షిచలం తాము రాసిన సమాధానాలు షౌకి చదివేవారు. వానిలో ఏవైనా సవరణలు చేయాల్సి వస్తే చేసేవారు షౌ.

అప్పట్లోనే బుజ్జి భూపాలుడు (పక్షి) షౌ చేత మంచి మంచి పుస్తకాలు చదివించుకునే వాడు. కొన్ని మంచి పుస్తకాలు షౌ చలం గారికి, నర్తకికి చదివి వినిపించేవారు. కొద్ది రోజుల తరువాత షౌకి రాతపని వొచ్చింది. అప్పటినించి ఇంట్లో నాలుగు గోడలమధ్య కూచోక తప్పంది కాదామెకి.

నర్తకి మందు తీసుకోవడం పూర్తయింది. నర్తకి రెండేళ్ళు ఎలోపతీ వైద్యం, మూడేళ్ళు ఆయుర్వేద వైద్యం చేయించు కొంది. ఆయుర్వేదం మందులు డా॥ పాలంకి సూర్యనారాయణగారు ఇచ్చేవారు. ఆయనది పిఠాపురం. చలంగారికీ ఆయనకీ బాగా స్నేహం. ఆయన చలం ఆరాధకులు (admirer) కూడాను.

చలంగారు తిరువణ్ణామలై వొస్తూవుంటే ఆయన కూడా, భగవాన్‌ని చూడటానికి వొచ్చారు. చలంగారు భగవాన్‌కి సాష్టాంగ ప్రణామం చేస్తోవుంటే ఆయనకి చాలా బాధ వేసింది. ఆయనకి చలంగారి మీద ఎంతభిమాన మంటే— భగవాన్ ఎంతవారైనా, వారికి చలం గారు మాత్రం సాష్టాంగ నమస్కారం చేయకూడ దనేటంత గౌరవం ఆయనకి.

చలంగారు భక్తి (Devotion) లో వుండే రోజులలో చలం గారిని చూడడానికి వొచ్చా రాయన. షౌని చూచి చాలా impress అయ్యారు. "నేను మళ్ళీ వొస్తానండీ" అని చలంగారికి చెప్పి వెళ్ళారు. కానీ ఆయనకి తీరుబడి ఎక్కడ? అప్పటి నించీ ఏ మందు చలంగారికి అవసరమైనా ఆయనే పంపిస్తూ వుండేవారు. నర్తకికి అలోపతి వైద్యం కన్నా ఆయన ఇచ్చిన ఆయుర్వేదం మందులే గుణం ఇచ్చాయి. ఆయన అప్పటి నించి ఇప్పటి వరకూ చలంగారికి గొప్ప admirer గా నిలిచి పోయారు.

ఆ రోజులలోనే బసవరాజుగారు చిన్న సింగిల్ రీడ్ హార్మోనియం ఎక్కడినించో తీసుకుని వొచ్చారు. సౌరిస్‌కి పూర్వం రెండు చేతులతో తొక్కుడు హార్మోనియం వాయించడం అలవాటు. ఇప్పుడు ఆమెకి ఒక చేత్తో హార్మోనియం వాయించడం సాధన చేయాల్సి వొచ్చింది. ఆవిధంగా హార్మోనియం శ్రీరమణస్థాన్ భజనలలో ప్రవేశించింది. పకపక వివాహానంతరం భజనలలో పాడటం మానుకొంది.

ఒక చలంగారి కంఠం వుంటే చాలు భజనలో ఎంత నిండు దనం, గొప్పదనం వొచ్చేవో! దానికి తోడు హార్మోనియం వొచ్చింది, కానీ చలంగారు వజీర్ "ఈ హార్మోనియం కాదు. ఇంకా మంచి హార్మోనియం రావాలి. ఈ హార్మోనియం ఏమిటి?" అనేవారు.

చలంగారు సంగీతరావుగారికి పుత్తరం రాశారు "మీరు cinema studio లో తిరుగుతూ వుంటారుకదా! మీ కేదయినా second hand హార్మోనియం దొరికితే మాకు ఇప్పించండి" అని. అప్పుడు సంగీత రావుగారు ఒక హార్మోనియం పంపించారు. అదే ఈనాటికీ భజనలో వినియోగింప బడుతోంది. "ఈ హార్మోనియంకి మీరేమి ఇవ్వనక్కర లేదు. శ్రీరమణస్థాన్ భజనలో వినియోగానికి పంపిస్తున్నాను" అన్నారు

సంగీతరావుగారు. వజీర్ మద్రాసు నించి వొస్తూ తమతో పట్టుకు వొచ్చారు ఆ హార్మోనియాన్ని. ఇంక ఆ హార్మోనియం శబ్దం అంత వరకూ ఏ హార్మోనియంలోనూ వినలేదు షౌ. అంత గొప్ప శబ్దం అది. ఆమె కంఠానికి ఎంత సరిపోయిందో! చలంగారు పాడుతూ వుంటే హార్మోనియం ఏదో, కంఠం ఏదో తెలిసేది కాదు. అసలు ఆ హార్మోనియం వాయిస్తూ వుంటే, హార్మోనియం వినిపిస్తూనే దాని లోంచి ఇంకెవరో బొంగురు కంఠంతో తనతో పాడుతూ వున్నట్లు అనిపించేది షౌకి. మొదట్లో ఆ హార్మోనియంతో సంగీతసాధన చేసే టప్పుడు ఆమెకి చలంగారు తమ వెంట పాడుతున్నట్లనిపించి ఇటూ అటూ చూసేవారు షౌ. భజనలోనూ అదే అనుభవం.

అప్పట్లోనే సుబ్రహ్మణ్యదేవర సంగీతపద్ధతి, ఆ అందాలు అట్లాగే నిలిచిపోవాలని షౌ చలంగారి నించి కృతులు నేర్చుకున్నారు. చలంగారు ఏదో స్వరజతి పేరు రాసి ఇది మీకు తెలుసా? అని సంగీతరావుగారికి వుత్తరం రాశారు. సంగీతరావుగారు "ఆ స్వరజతి నా దగ్గర లేదు. మీ రెందుకు రాశారో గానీ ఈ మూడు స్వరజతులంటే నాకు చాలా ఇష్టం. వాటిని మీకు పంపిస్తున్నాను. అవి కలతపెట్టి కన్నీళ్ళు తెప్పిస్తాయి" అని జవాబు రాస్తూ ఆ మూడు స్వరజతులు రాసి పంపించారు. వాటిలో ఒకటి మాత్రం పాడరు గాని, 'రావె హిమ గిరి కుమారి' అనే తోడిరాగంలోని స్వరజతి 'కామాక్షి' అనే భైరవి రాగంలోని స్వరజతి ఇప్పటికి ఆమె పాడుతూనే వుంటారు. అవి రెండూ శ్యామశాస్త్రి కృతులు.

హార్మోనియం గురించి సంగీతరావుగారికి రాస్తూ "మీ హార్మోనియం ఎంత గొప్పగా వుందో! దీని ధ్వని వింటోంటే శ్రీకృష్ణుడి మురళి వింటున్నట్లుంది నాకు" అన్నారు చలంగారు.

అప్పట్లో చలంగారు తమంత తామే చదువుకునే వారు గనుక, వుదయం భోజనాలు అయినాక ఆ హార్మోనియం వాయిస్తూ షౌని పాడమనే వారు.

మెక్‌స్టన్‌కి హార్మోనియం అంటే చాలా కోపం. "అబ్బా ఈ హార్మోనియా లేమిటి? హాయిగా మంచి కంఠం పెట్టుకుని సౌరిస్ ఎందుకు దీంతో పాడుతుంది. అన్ని శ్రుతులు దీంట్లో పలకవు" అనేది.

ఇంక కొంతమంది హార్మోనియం ప్రియులు కొంతమంది హార్మోనియం వ్యతిరేకులు తయారయ్యారు. సౌరిస్ హార్మోనియం పక్షాన వాదించే వారు.

భజనలో పాడేవారి సంఖ్య రానురాను తగ్గిపోసాగింది. అందు వల్ల షౌకి హార్మోనియం చాలా ఆధారం అయ్యింది. వజీర్ హార్మోనియం నేర్చుకుంటా మన్నారు గనుక లక్ష్మిగారికి, శాస్త్రిగారికీ— 'సంగీత స్వయంబోధినిలు' పంపమని రాశారు చలంగారు.

వజీర్ అనుకున్నట్లుగా నేర్చుకో లేదు కానీ, ఆ పుస్తకాల సాయంతో సౌరిస్ కర్ణాటక సంగీతం సాధన చేయడం ఆరంభించారు. అంతక్రితం షౌకి హిందూస్తానీయే గానీ కర్ణాటకం అట్టే రాదు. కర్ణాటక సంగీతపు తాళ పద్ధతులు అవీ ఆమెకి తెలియవు. గొంతుని తెరిచి గాలిలోకి వొదిలి వెయ్యడమే తప్ప ప్రత్యేకంగా ఆమె ఎన్నడూ సంగీత సాధన చెయ్యలేదు. హార్మోనియం వొచ్చాక గట్టి సంగీత సాధనలోకి దిగారు షౌ. ఆమెకి హిందుస్తానీ సంగీతం అదంతటది సహజంగా వొచ్చేసేది. స్వరం తెలియకుండానే రాగాన్ని గుర్తుపట్టేసి తప్పులేకండా పాడేవారు.

సౌరిస్ కర్ణాటక సంగీతం మాత్రం శాస్త్రోక్తంగా నేర్చుకున్నారు. ఆమె ఎక్కువగా సాధన చేసేది కర్ణాటకమే. సాధనచేస్తున్న కొద్దీ ఆమెకి కర్ణాటక సంగీతంలో ఎన్నో అందాలు కనిపించసాగాయి. తాళం, లయ పుస్తకంలో చదివితే ఆ సంగీత పద్ధతిని చూపిస్తాయి. ఆమె అభ్యాసం చేస్తూనే వున్నారు. అప్పట్లో స్వరం హార్మోనియం ద్వారానే తెలుసుకుని పాడేవా రామె.

కొన్ని స్వరాలు హార్మోనియంలో పలకవని మెర్‌స్టన్ చెప్పిన మాట రైటేనని తోచిం దామెకి. కాని షౌ హార్మోనియం మీదనే స్వరాన్ని చూసుకునేవారు. రాను రాను ట్రాన్సిస్టర్లలో సంగీతకచేరీలు విని స్వరపద్ధతి నేర్చుకోవడం ఆరంభించారు. ముందు ఆమె దగ్గర చాలా **simple music books** వుండేవి. కానీ ఆమె సంగీతసాధనకి అనుగుణ్యంగా నేటిదాకా ఆమెకి అవసరమైన సంగీతం పుస్తకాలు దొరుకుతూనే వొస్తున్నాయి.

బెజవాడలో వుండగానే షౌ కలలో ఒక కాషాయం కట్టిన సన్యాసి ఆమెచేత సర్కసుఫీట్లు చేయిస్తూ సంగీతసాధన చేయిస్తున్నట్లు కనిపించింది. మరి కొన్నేళ్ళ తరువాత ఇంకొక కలలో తామొక కొండమీద నిలుచుని వుంటే ఒక బ్రాహ్మణుడు వొచ్చి తమచేత సంగీత సాధన చేయిస్తున్నట్లు షౌకి కనిపించింది. అట్లానే ఇప్పుడు షౌచేత సంగీతసాధన చేయిస్తున్నది ఈశ్వరుడే. ఎక్కడన్నా ఏ సంగతైనా తప్పితే సవరించి ఆమె సంగీతసాధనని నడుపుతున్న వారు ఈశ్వరుడే.

## 18

చాడ్విక్ నారాయణయ్యర్ ఇంట్లో వుండే రోజులలో, భగవాన్ సేవకురాలైన కీ. శే. వారణాసి సుబ్బలక్ష్మమ్మగారుకూడా ఆ కాం

హౌస్‌లోనే వుండేవారు. ఆవిడ చాడ్విక్ దగ్గరికివచ్చి కూచుని భగవాన్ గురించి కబుర్లు తెలుగులో చెప్పేవా రట. ఆమె ఏం చెప్పేవారో ఆయనకి అర్థం అయ్యేది కాదు. ఒకసారి చాడ్విక్ చలంగారి దగ్గరకు వొచ్చినప్పుడు "భగవాన్ అనుభవాలు సుబ్బలక్ష్మమ్మగారి దగ్గర చాలా వున్నాయి. అవి నువ్వు note చేసుకుంటే బావుండు" నన్నారు. అది చాలా మంచి ideaఅనిపించింది షౌకి.

ఆశ్రమం వంట ఇంటిలో సేవకులుగా నిలిచివున్న వారిలో సుబ్బలక్ష్మమ్మగారు ఒకరు. ఈ స్త్రీలు చదువు కోనివాళ్ళు. వారిని చూచే వారికి వారిక్కడేదో పనికి కుదిరా రనిపించేది.వాళ్ళకి ఎక్కడా ఏదిక్కూ లేక ఆశ్రమంలో వున్నా రనుకునేవారు. ఎంతసేపూ వాళ్ళు వంటల గురించే మాటలాడే వారు. వాళ్ళకి పెద్దపెద్ద స్థానాలమీద ప్రేమ లేదు భగవాన్ దగ్గర కూచోవాలన్న ఆసక్తి లేదు. ఎవరితోను పోటీ పడేవారు కాదు. వారికి ఎక్కడా ఏ ప్రాముఖ్యతా లేదు. అంత నిరాడంబరం వాళ్ళలో. వారిని చూస్తూ వుంటే వారికి తామొక మహాత్ముని దగ్గర వున్నామని తెలుసా? వాళ్ళాయన దగ్గరేమి పొందు తున్నారా? అని యోచన వొచ్చేది షౌకి.

భగవాన్ దేహం చాలించే వరకూ ఆయనను అవతారంగా గానీ ఇంకో విధంగా గానీ షౌ తీసుకోలేదు. సాధకులుగా సాధనచేసిన వారి సంగతి అట్లా వుంచి, ఏమీ లేకండా ఆయన సేవ చేసుకుంటున్న ఏమీ తెలియని వాళ్ళకి ఆయన నించి ఏమి వొచ్చింది? రేపు భగవాన్ దేహం చాలించాక ఈ సేవికలకి ఏ ఆధారం వుంది? తక్కిన స్త్రీలు భగవాన్ ప్రేమ కావాలని కోరుతూ కూచునేస్థలాల కోసం ఒకరితోఒకరు పోట్లాడుకునేవారు. ఈ సేవికలకి అదేమీ లేదు. ఏదో ఒకమూలన వుండేవారు. భగవాన్ అంతర్ధానం అవుతుంటే తక్కిన ఆడవాళ్ళు ఏడ్చినట్లు ఈ

సేవికలు ఏడవ లేదు. వాళ్ళ దృష్టిలో ఈయన ఏదో మహాత్ములైన ముసలి వారు కింద అనుకుంటున్నారా? గృహపెద్దగాఅనుకుంటున్నారా? వాళ్ళ దృష్టి ఏమిటి? అన్న ప్రశ్న వొచ్చింది షౌకి— ఆమె ఆలోచించే సరికి. అప్పుడు ఒక flashలాగ ఆమెకి ఒక గొప్పసత్యం గోచరించింది— భగవాన్ కేవలమూ ఒకగురువు కాదు. ప్రపంచోద్ధరణం కోసమే వొచ్చిన అవతారపురుషుడాయన. అందువల్లనే ఆయనవొచ్చింది ఆయన ఎవరో తెలుసుకున్న వాళ్ళకోసమే కాదు— సాధకుల కోసమే కాదు. భగవాన్ శిష్యులం అనుకునే వారికోసమే కాదు. ఆనాడు కృష్ణ భగవానుడు వొచ్చి బృందావనాన్నంతా సమ్మోహనం చేసి బంగారాన్ని వర్షించినట్లు రమణభగవాన్- తనని ప్రేమించిన వారిపై- తననినమ్ము కొన్న వారిపై వారు చదువు కోని వారైనా- సాధనలు చేయని వారైనా- వారిపైఅమృతమయమైన ప్రేమనివర్షించారు తనను సేవించిన సేవికల మీద. అలనాడు శ్రీకృష్ణుడు గోపికల మీద ప్రేమజల్లులు కురిపించి నట్లుగా భగవాన్ ప్రేమానుగ్రహవర్షాన్ని కురిపించారనిపించింది షౌకి.

ఆశ్రమంలో సుబ్బలక్ష్మమ్మగారు కనిపించినప్పుడు "మీ అనుభవాలు నాకు చెప్పండి" అని అడిగారు చలంగారు. ఆమె "మీ ఇంటికి వొచ్చి నేనే చెబుతాను" అని రోజూ చలంగారింటికి వొచ్చి చెప్పడం ఆరంభించారు. రోజూ అవన్నీ విని రికార్డు చేసుకోవడం మొదలు పెట్టారు చలంగారు. అస్త్రసన్యాసం చేసిన 'చలం' మహర్షిగా కలం పట్టి రంగంలోనికి దిగింది 'భగవాన్ స్మృతులు'తోనే.

ఆనాటి అనుభవాలను గురించి చలంగా రేమంటారో విందాం.

"నేను సుబ్బలక్ష్మమ్మగారి చుట్టూ తిరుగుతున్నాను. ఇప్పుడు ఆశ్రమంలో చలం ఫోటో తీస్తే, పక్కన 60ఏళ్ళ జుట్టులేని ముసుకు, మోకాళ్ళ నొప్పుల సుబ్బలక్ష్మమ్మ వుంటుంది. విధి కృత్యం. ఎవరు తప్పించ గలరు?

పద్యం

"నాదనామక్రియ, హార్మోనియం వాయించరా.

(1) అలనాడు హరిశ్చంద్ర మహారాజు
— మాలని కొలువు

(2) ఆ నలుం డేమిజేసి — వార్ష్ణేయుని
కొలువు లోన

(3) శ్రీరామచంద్రుండు భార్య సీతను బాసి

(4) పాండవ జేష్ఠుండు — విరటు కొల్వున జేరి
అటులనేకాదె ఈనాడు ఈ వెంకటచలాఖ్య
వచనకవి వరేణ్యుండు అరుణాచలాన
బుడ్డె బైరాగి గాడ్దెల పంచజేరి
జుట్టు లేనట్టి మోకాళ్ళ పట్టులేని
సుబ్బలక్ష్మమ్మతో గూడి వనట నొందె—
వౌన్సుమోర్ "

(శాస్త్రిగారికి చలంగారి లేఖ 18-11-55)

"లోకమ్మగారు కూడా ముందుకి దూకు తున్నారు. 'అసలైన భగవాన్ విషయాలు నా దగ్గ రున్నా' యని అంటో."

(శాస్త్రిగారికి చలంగారి లేఖ 11-2-57)

ఒక రోజు చలంగారు షా దగ్గరకి వొచ్చి

"ఏం రాయను షా, ఇవన్నీ రాస్తే భగవాన్ గురించి అంతా నవ్వుతారు. ఇట్లాంటి విషయాల గురించి రాస్తే ప్రతిఇంట్లో సణిగే గొణిగే ముసలి ఆయనలా పిక్చర్ వొస్తోంది భగవాన్ గురించి ఏ అనుభవం రాసినా— ఇంకేం రాయను?" అన్నారు.

అప్పుడు ఈశ్వరుడు ఆ అనుభవాల వెనకాల వుండే ఆ మహత్తరమైన జ్ఞానాన్ని, భగవాన్ హ్యూమర్‌ని, ఉపదేశాన్ని చలంగారికి విశదంచేసి చూపారు.

ఒకసారి భగవాన్ పొయ్యి దగ్గర కూచుని గుమ్మడికాయ కుత కుత పుడుకుతో వుంటే కలియ బెడుతున్నారు. ఆవిర్లు, పొయ్యి వేడి, వారి వళ్ళంతా చమటలు పట్టి పోయింది. ఆ కూర ముక్కలు చింది వారి కాలి వేలు బొబ్బ ఎక్కింది. కాని అడ్డం వెళ్ళే ధైర్యం లేదు ఎవరికి. మర్నాడు ఒకరు భగవాన్ వేలిమీద బొబ్బని చూసి "భగవాన్ మీ వేలుమీద అదేమిటి?" అన్నారు. దానికి భగవాన్ "నీకు తెలియదా నేను వుంగరం చేయించు కున్నాను!" అన్నారు. గోచీ తప్ప ఏమీలేని ఆ యోగికి వుంగరమట !! ఇటువంటి దృష్టి చలంగారికి ఈశ్వరుడు ఇచ్చేసరికి భగవాన్ సేవికలకి కూడా హృదయాలు విచ్చుకుని వాళ్ళ హృదయాల్లో దాగివున్న అనుభవా లన్నీ చెప్పడం మొదలు పెట్టారు. తరువాత ఎంతోమంది వూరు పేరులేని భక్తులు దగ్గరకు వెళ్ళి వారి అనుభవాలు సేకరించటం మొదలు పెట్టారు చలంగారు.

"సంపూర్ణమ్మగారి వ్యాసం చాలా అందం— చివరికి పంపారండీ— రెండూ - వుత్త - రెండూ రెండే నండీ, ఒకటీ రెండు. రెండు కాపీలు - కుంకముండా కాపీ లంటారు వీటినే— పంపారండీ. ఏమిటండీ - నలుగురికీ చూపించు కోవాలా? లేక లేక నాకు ఒకత్తె సంపూర్ణమ్మ - ఆమె వ్యాసం నలుగురికీ చూపించుకో వొద్దంటారండీ! దీన్నే కుంకముండా వ్యవహార మనేది."

(శాస్త్రిగారికి చలంగారి లేఖ 26-10-56),

అవి వంటింట్లో భగవాన్ పేరిట ఆంధ్రపత్రిక సారస్వత అనుబంధాలలో ప్రచురితాలై తరువాతి సంవత్సరాలలో 'భగవాన్

స్మృతులు' పేరిట పెద్ద పుస్తకంగా వెలువడినాయి. ఎంతో సాధారణంగా కనబడే సన్నివేశాలలో భగవాన్ చేసిన మహత్తరోపదేశాలకు అందరి కళ్ళను తెరిచింది ఆ పుస్తకమే.

నార్ల చిరంజీవి చలంగారికి వుత్తరం రాశారు "గీతాంజలిని మీరు అనువదించా" లని. దానికి షా "ఆ Tagore works అన్నీ కూడా కాపీరైట్స్ వాటి సంగతి కనుక్కుని మనం దీనికి అంగీకరిద్దాం" అన్నారు.

చలంగారు చిరంజీవిగారికి ఆ విషయం వుత్తరం రాశారు. చిరంజీవిగారు "ఆ సంగతులు మేం చూసుకుంటాం" అని రాశారు.

తరువాత చిరంజీవిగారు, సంజీవదేవ్‌గారు, బి. వి. నరసింహారావుగారు కలిసి అరుణాచలం వొచ్చారు. వాళ్ళు సాయంత్రం వొచ్చారు. చలంగారితో షికారుకి వెళ్ళా రావేళ. భజనలో బి. వి. నరసింహారావుగారు గొప్పగా పాడారు.

బి. వి. నరసింహారావుగారు మునుపు చలంగారు devotion లో వుండే రోజుల్లో గొత్తిపాటి వెంకటసుబ్బయ్యగారితో కలిసి వొచ్చారు. అప్పు డాయన చిన్నపిల్లలమీద పాటలు రాస్తున్నారు. ఆయన సంగీతమంటే షాకి చాలా ఇష్టం. ఇప్పుడు చిరంజీవిగారితో కలిసి వొచ్చారాయన.

మర్నాటి వుదయం చిరంజీవి గీతాంజలి సంగతిని ప్రస్తావించారు. నరసింహారావుగారు చలంగారిని తమ ఆత్మకథ రాయాలంటూ పట్టుపట్టారు. "'నేను' అనే సంగతిని మరిచి పోవడానికే అరుణాచలం వొచ్చాను. పాతసంగతులన్నీ గట్టిప్రయత్నం మీద మరచి పోయాను. ఇప్పుడు నేనేం రాయగలను? సరే చిరంజీవి అడిగారు కనక నేను గీతాంజలి translate చేస్తాను" అన్నారు చలంగారు. వాళ్ళంతా చలం

గారి చేత ఎట్లాగయినా ఆత్మకథ రాయించాలని షౌకి appeal చేశారు. తరువాత వాళ్ళు వెళ్ళిపోయారు.

చలంగారు గీతాంజలి translate చేయడం ఆరంభించారు. ఆ అనువాదం గురించి చలంగారు ఏమంటారో విందాం.

"గీతాంజలి తర్జుమాలో— నా చిక్కుల్ని మీరు గ్రహించినట్లు లేరు. నన్ను నాకు వొదిలేస్తే ఇంగ్లీషు, తురకం, తెలుగుని వంకర్లు తిప్పి ఎట్లాగో మీకు అర్థం చేయగలను. కాని ఈశ్వరుడు వొప్పుకోరు. భాషలోకూడా గీతాంజలి గౌరవాన్ని నిలపాలి. అందువల్ల సరైన పదాల్ని నేను సంపాయించాల్సిన అంకుశం కిందకి రావాల్సివొచ్చింది.

టాగూరు పుస్తకాన్ని గానాన్ని నాటకాల్ని చక్కగా అనుభవించే వారుకూడా 'గీతాంజలి' అర్థం చేసుకోలేక పోతున్నారు. టాగూరు బెంగాలీ పాటల్నేగాని, ఇంగ్లీషు గీతాంజలిని తమలోకి తీసుకుని అనుభవించినవారు ఇండియాలో ముఖ్యం ఆంధ్రాలో ఎందరున్నారో, నాకు అనుమానం.

అర్థాలు—

Nest —గూడు, కులాయంకాక ఇంకేమన్నా సంస్కృతం

basket — బుట్ట. తట్ట సంస్కృతం

harmony — సంస్కృతం Eg. The harmony in your heart

(శాస్త్రిగారికి చలంగారి లేఖ 19-7-58)

అంతక్రితం చలంగారు తన స్వంత రచనలేగానీ, అనువాదాలంటూ చేయలేదు. గీతాంజలే చలంగారి అనువాద రచనలకి మొదలు. ఇంక రోజూ చలంగారు అనువాదాన్ని షౌకి చదివి వినిపించేవారు. ఈశ్వరుడు వాటిల్ని సరిచూసేవారు. అంతా పూర్తయినాక స్క్రిప్టులో

అక్షరం అక్షరం చూచి సవరించేవారు. గీతాంజలిని ఎంతో అందంగా ప్రచురించారు చిరంజీవి.

కురేంగేశ్వర్ ఆ తరువాత crescent moonని 'చంద్రవంక' అన్న పేరిట తెలుగు చేశారు. దాన్నికూడా ఈశ్వరుడే సవరించారు. ఆ తరువాత చలంగారు టాగూర్ ఉత్తరణ, ఫలసేకరణ.... ఇత్యాది కావ్యాలను అనువదించారు.

ఈశ్వరుడు లోగడ చెప్పినట్లే, చలంగారు బైబిల్ అనువాదం చేయడం ఆరంభించారు. ఆయన తాము ఏదయినా చేసేముందు ఈశ్వరుడితో చెప్పి చేసేవారు. "ఈ గ్రంధాన్ని ఎంతో గొప్పమేధావులు study చేసి అనువాదం చేశారు. నాకిది శక్యం అవుతుందో, లేదో," అన్నారు చలంగారు ఈశ్వరుడితో. "నువ్వు translate చేస్తావని ఎప్పుడో అన్నాను కదా" అన్నారు ఈశ్వరుడు.

చలంగారు ఈశ్వరుడు చెప్పినట్లుగానే ఎంతో ఉత్సాహంతో బైబిల్ని తెలిగించడం ఆరంభించారు. జీసస్ sayings ప్రతీదీ తరచి, తరచి దానిలో వుండే అంతరార్థాల్ని ఈశ్వరుడ్ని ప్రశ్నించి మరీ అనువదించా రాయన. తాము అవసరంగా భావించిన చోట వ్యాఖ్యానాన్ని కూడా జతచేశారు. ఆకృషి ఒకసంవత్సరంలోనే పూర్తయింది. ఆవిషయం ఆయనకే ఆశ్చర్యాన్ని గొలిపింది.

అనువాద కాలంలో తమ అనువాద సరళినిగూర్చి చలంగారేమంటారో విందాం.

"ఒక్కొక్క సువార్త (శుభవార్త)ని తెలుగు చేయడానికిమూడు నెలలు పడుతుంది. కనక ఇది ఓసంవత్సరం పని—ఇప్పుడు లూకాలో సగం అయింది.

ఇప్పుడు ఈశ్వరుడు చెప్పే వ్యాఖ్యానంతో ఏసు శుభవార్తలు చదివితే హిందువులు తమకే తెలుసునని విర్రవీగే గురున్యాయం,

మొదలైన ఆధ్యాత్మిక సాధన విషయాలు చాలా విపులంగా కన పడతాయి.

గీతాంజలి విషయంలో కాని, ఏసు శుభవార్తల విషయంలో కాని గమనించవలసింది ఏమంటే అర్థమయ్యేట్లు చెయ్యడం కాదు. మనస్సు కర్థమయ్యేట్లు మనసు వెనకాల మీ ఆత్మకి అర్థమయ్యేట్లు చెయ్యడం. గొప్ప క్రైస్తవ పండితులకి తెలియని విషయాలు చలం తర్జుమాలో విశద మవుతాయి. మళ్ళా ముక్కకి ముక్క తర్జుమా చెడదు. గీతాం జలిలో జరిగింది అంతే. టాగూరుకే చెప్పారు అతని గీతాలలో ఇమిడి వున్న అంతరార్థం. షేక్స్పియర్‌కి చెబుతున్నారు. అందువల్లనే చలం తర్జుమాని క్రిష్టియన్లు ఇష్టపడరు. దానికి హిందూవేదాంత పరమైన అర్థం కనబడుతుంది వాళ్ళకి. అది హిందూ కాదు. క్రిస్టియనుకాదు. అసలు సత్యం.

అర్థం కావడానికి చలం తర్జుమా అన్నాను. —తర్జుమాలనే చిన్న మాటని ఈశ్వరుడికి ఆపాదించలేక, ఎందుకు చేస్తున్నారో ఈనాడు ఆపని చేస్తున్నారు.

"చలమే భగవద్గీతని తర్జుమా చేస్తే ఈహిందువులు ఒప్పుకుంటా రంటారా?" (శాస్త్రిగారికి చలంగారి లేఖ 23-9-59)

"ఈశ్వరుడిని అడిగి తెలుసుకుని శుభవార్తలకి చలంరాసిన **notes**తో కూడా చదివితే ఇంకా ఎన్ని కొత్త అద్భుతమైన అర్థాలు వికసిస్తాయో మీ కళ్ళముందు."

(శాస్త్రిగారికి చలంగారిలేఖ 12-1-61)

ఆనాటినించి ఈనాటివరకు ఎందరో పరిశోధన చేసి రాసినా, ఎప్పుడూ ఎవరూ చలంగారు వెలుగులోకి తెచ్చిన సత్యాల్ని చూపలేక పోయారు.

ఈ గ్రంథం గురించి విన్న క్రిస్టియన్ సొసైటీవారు "మేం అచ్చువేస్తాం" అని ముందుకు వొచ్చారు. కాని "ఓం శాంతి" 'ఈశ్వరుడు' అనే మాటలు వారికి అభ్యంతరాలనీ, అవి తీసేస్తే తాము తప్పకుండా అచ్చువేస్తామనీ, ఎంతో డబ్బు ఇస్తామనీ అన్నారు. కానీ చలంగారు అందుకు ఒప్పుకోలేదు. ఎందుకంటే ఆ గ్రంథం ఆయన ధనార్జన కోసం రాసింది కాదు. (ఏ గ్రంథాన్నీ ధనార్జనకోసం రాయలేదు) అది ఆయన 'జీసస్' అనే సత్యాన్ని లోకానికి తెలిపేందుకు రాసింది, మతాల్ని. వాటి సంకుచితత్వాన్నీ, నిర్మూలించి ఒకసత్యాన్ని చాటేందుకు రాసిన మహద్గ్రంథ మది. ఆ సొసైటి వారికోసం దాన్ని ఎందుకు మారుస్తారు చలంగారు? అట్లానే హిందూ పత్రికలుకూడా తాము తీసుకుంటా మని అన్నాయిగానీ చలంగారు తమకి నచ్చక ఇవ్వలేదు.

కె. సభా తమ దేవదత్తం పత్రికలో శుభవార్తల నించి చిన్న చిన్న Portions వేసుకునే వారు. చలంగారు శుభవార్తలు రాస్తూ వుండగానే ఆ strain తట్టుకోలేక మొట్టమొదటి సారిగా ఆయనకి High Blood Pressure వొచ్చింది.

చలంగారు రాస్తూవుండే రోజుల్లోనే చాడ్విక్ తమ దగ్గరో గ్రంథం వుందని చెప్పారు. క్రిస్టియన్ చర్చి మొట్టమొదట ఈ గాస్పెల్స్‌ని తీసుకునేటప్పుడు తమకి నచ్చిన నాలుగు గాస్పెల్స్‌ని- ఇవే సత్యమైనవని ఏరుకున్నారు. తత్తిమా వాటిని వారికి అర్థంకాక, అనవసరమని వొదిలేశారు. అలా వొదిలేసిన వాటిని MONTAGUE RHODES JAMES అనే ఆక్సఫర్డ్ డాన్ ( Don) ఇంగ్లీషులోనికి అనువాదం చేశారు. దానిపేరే ఎపోక్రిఫా. అదే చాడ్విక్ దగ్గరవున్న గ్రంథం. ఆ 'డాన్' వాటిని గురించి "దీనిలో వజ్రాలు వున్నాయి. రాళ్ళు వున్నాయి.

వ(జాలేవో, రాళ్ళేవో తెలుసుకోవడం చాలా కష్టం. నేను వ(జాలనీ, రాళ్ళనీ కలిపి అనువాదం చేస్తున్నాను. వీటిల్లో మీకు కావాల్సినవి ఏరుకోండి" అన్న ధోరణిలో preface రాశారు. చలంగారు ఆ పుస్తకం చదివి "అయ్యో too late. నేను ఈ పుస్తకమే ముందు చదివి వుంటే ఈ కథ లన్నింటితో శుభవార్తల్ని పూర్తి చేసే వాడ్ని" అన్నారు. ఈ గ్రంథమేకాక చాడ్విక్ దగ్గర 'గాస్పెల్స్ ఇన్ పేరలల్' అన్న మరో గ్రంథం వుంది. ఆ గ్రంథంలో నాలుగు గాస్పెల్స్‌లోని సంఘటన లన్నీ సాదృశ్యపట్టిక (comparative table) గా రాశారు. చలం గారికే ఆరోగ్యం బాగావుంటే చలంగారు aspire చేసిన (ఆకాంక్షించిన) గ్రంథాన్ని వారిచేతనే రాయించేవారు షా. కానీ వారి ఆరోగ్యం బాగా దెబ్బ తిన్నది. ఆ కార్య్రకమాన్ని షా చేపట్టారు,

ఆ కార్య్రకమంలో షాకి ముఖ్యంగా సహాయం చేసింది ఎపోక్రిఫా. షా "రాళ్ళలోంచి వ(జాలను" ఏరి- కృష్ణారావుగారిచేత వాటిని కాపీ చేయించారు. తమకు ఆథంటిక్‌గా (అధికారికంగా) సత్యమైన సంఘటనల నన్నింటిని ఏరి మేరీ పుటక నించి- జీసస్ శిలువ పడేదాకా కథగా కూర్చారు. ఎపోక్రిఫాలో నాలుగు గాస్పెల్స్‌లో లేని జీసస్ కథ ఎంతో వుంది. శుభవార్తలు చదువుతూ వుంటే జీసస్ బోధ, మహాత్మ్యలే తప్ప, దాంటో జీసస్ ఎక్కువగా కనబడరు. జీసస్ జీవితంలో బోధలకన్నా అధికంగా జీసస్ ఒక వ్యక్తిగా గోచరిస్తారు. గాస్పెల్స్ ఇన్ పేరలల్ కూడా చాలా సాయపడిం దామెకి. ఆ గ్రంథంలో ఏ ఏ సంఘటన లెప్పుడెప్పుడు జరిగాయో కూర్చిపెట్టారు- నంబర్ల వారీగా- అవసరమైన సంఘటనలని తీసుకుని- ఒక క్రమపద్ధతి మీద అందులో వున్న సంగతుల్ని, చలంగారి శుభవార్తల నించి జీసస్ బోధల్ని తీసుకుని ఫోర్ గాస్పెల్స్‌కి ఒక రూపం ఇచ్చారు షా. అందులో ఆమె

కల్పన ఏమీలేదు. Fragments (ముక్కలు) గా వున్న సంఘటనల్ని కలిపారు. అక్కడక్కడ తీసిన film ని edit చేసి ఒక చిత్రంగా రూపొందించడం వంటిది ఆమె చేసిన పని. అదే జీసస్ జీవితం. శుభ వార్తలకన్నా జీసస్ జీవితం ముందర అచ్చయింది.

1960 భగవాన్ జయంతికి చలంమహర్షి ఆరాధకులు, మిత్రులు, ఈశ్వరభక్తులు ఎందరో వొచ్చారు. జయంతినాడు సాయంత్రం నిర్వాణం (భవంతి) వెనకవున్న చెట్లమధ్య కృష్ణారావుగారు వారి నంచరినీ సమావేశ పరిచి, "చలం, సౌరిస్ రాసిన 'జీసస్ జీవితం' అనే పుద్గ్రంథం తయారై వుంది. దాన్ని మనమంతా కలిసి వెలుగు లోకి తీసుకురావడం మనధర్మం- ఎందుకంటే వారిద్దరూ పుస్తకాలు అచ్చు విషయాలు పట్టని స్థితిలో వున్నారు. కనుక మనం పూనుకుని దాన్ని అచ్చువేసే ప్రయత్నం ఆలోచించా" లన్నారు. భక్తులు యథా శక్తి ధనసహాయం చేశారు. అది ఎక్కడ అచ్చు వేయించాలి అనే ప్రశ్న వొచ్చేసరికి, శాస్త్రిగారు మదరాసులో తాము దగ్గరుండి వేయిస్తా మన్నారు.

తీరా తొలి ప్రూఫుల్ని చూచేసరికి అందరికీ చాలా అసంతృప్తి కలిగింది. శాస్త్రిగారికి చలంగారు చాలా ఘాటుగా వుత్తరం రాశారు- "ఈశ్వరకార్యంలో నిర్లక్ష్యానికి చోటెందు కిస్తున్నార"ని— శాస్త్రిగారి నుండి సమాధానం సంతృప్తికరంగా వొచ్చినట్లు తోచదు.

ఆంధ్రప్రభలో పనిచేసే రోజులలో కె. సభా చలంగారిని చూడ టానికి వొచ్చారు. ఆయనకి భగవాన్ సమాధి దగ్గర ఒక అనుభవం కలిగి, అప్పటినించీ చలంగారి మీద ఆయనకి గట్టిపట్టు ఏర్పడింది. తరువాత ఆయనకి ఈశ్వరుడిలో గట్టి విశ్వాసం కుదిరింది.

ఆయన ఆంధ్రప్రభలో వుద్యోగం మానేసి చిత్తూరులో job work చేసే చిన్న press పెట్టుకున్నారు. "జీసస్ జీవితం" ముద్రా

సులో సరిగ్గా అచ్చు కాకపోయేసరికి — కె. సభా ఆ పుస్తకాన్ని తమ ప్రెస్‌లో అచ్చువేస్తా మంటే చలం, సౌరిస్ ఆయన కిచ్చారు. ఆయన భక్తిశ్రద్ధలతో అంత చిన్న press లోనూ ఎంతో బాగా వెయ్యడం మొదలు పెట్టారు. అది ఆయన press లో అచ్చువు తున్నప్పుడు కొంతమంది క్రైస్తవులు వెళ్ళి ఆ ప్రూఫులు చదివి "ఇదెంత బావుందో— జీసస్ మీద. సువార్తలు చదువుతోంటే మాకేం బోధ పడలేదు" అని మెచ్చుకున్నా రట.

మంత్రవాది లక్ష్మిగారు ప్రతీవిషయం ఈశ్వరుడ్ని అడిగి చెయ్యడం ఆమెభర్త వెంకటరత్నంగారికి చాలా బాధగా వుంది. ఏ విషయం అడిగినా ఈశ్వరుడు చెయ్య మంటున్నా రనేవా రామె. చివ రికి ఆయన "నువ్వు ప్రతీ దానికి ఈశ్వరు డంటున్నావ్. చూస్కో, నేను వొచ్చి మీ ఈశ్వరుడ్ని ఐదునిమిషాల్లో ఓడిస్తాను" అన్నారు. లక్ష్మిగారివెంట ఆయన అరుణాచలం వొచ్చారు. షౌ ముందుకి వొచ్చి కూచున్నారు. రెండు నిమిషాలు కాకండానే అప్రయత్నంగా 'ఈశ్వరా, ఈశ్వరా' అన్నారు. ఆ మాట తప్ప ఇంకొకటి లేదాయనకి. అయన మంచి ఆర్టిష్టు. చలంగారి పెద్దబ్బాయి కీ. శే. రవికి చిత్రకళ నేర్పిం చిన మాష్టా రీయనే. ఆయన వేసిన శివధ్యానం అనే పటం చలంగా రింట్లో వుండేది. షౌ ఎన్నో శివుడి paintings చూశారు కాని ఆమెకి గొప్పగా అనిపించినవి నందలాల్ బోస్ వేసిన శివుడి painting. ఆ తరువాత ఆమె వెంకటరత్నంగారు వేసిన శివధ్యానం అంత గొప్ప painting మళ్ళీ చూడలేదు షౌ. ఏ భక్తి లేని ఆ రోజుల్లోనే షౌ ఆ చిత్రం వైపు తదేక దృష్టితో చూస్తూ వుండేవారు.

వెంకటరత్నంగారు జీసస్ జీవితం cover page ని తమ పనిగా తీసుకుని "దీనికోసం నేను డబ్బు పోగుచేస్తాను. ఇది ఈశ్వరకార్యం

కిందతీసుకు తోడ్పడతాను" అని అన్నారు. చలంగారిదగ్గరవున్న రెండు జీసస్ పెయింటింగ్స్ తీసుకుని, వాటికి బ్లాక్స్ తయారు చేయించి, పుస్తకానికి కావాల్సిన అట్ట, దానిమీద డిజైన్ అన్నీ ఆయనే తయారుచేశారు. ఆ టైటిల్ పేజీ, బ్లాకులు మొదలైన వాటికయ్యేఖర్చు కోసమని స్వయంగా వెళ్ళి చందాలు సేకరించాడాయన అంతేకాకండా పుస్తకంపైన అట్ట కొనడానికని ప్రతీషాపుకీ వెళ్ళి "ఇది ఈశ్వరకార్యం, మీరు చవకగా ఇవ్వాలి" అని డబాయించి తీసుకుని వొచ్చారాయన.

ఇంక ఆపుస్తకం అచ్చయి వొచ్చినతరువాత westernersకూడా ఆకవర్ని, కాగితాన్ని గెటప్‌ని చూసి ఎక్కడ print అయిందని ఆశ్చర్యంతో అడేగేవారు. అంతగొప్పగా తయారయింది ఆపుస్తకం.

శుభవార్తల తదుపరి చలంమహర్షి 'నిర్వికల్పం' అనే గ్రంథం రాశారు. ఏసుపైని వ్యాసావళి అది. హిందూ క్రైస్తవ మతాలను సమన్వయించి ఏకత్వాన్ని చూపే పుద్గ్రంథ మది. అటువంటి ప్రయత్నం యోగానంద గురువైన శ్రీయుక్తేశ్వరగిరి "హోలీ సైన్స్" అనే పుస్తకంలో చేశారు కానీ అది సూచన మాత్రమే.

చలంమహర్షి 'నిర్వికల్పం'లో హిందూ క్రైస్తవ మతాలసారాంశాన్ని పూర్తిగా సమీక్షించి— ఏకత్వాన్ని చాటిచెప్పారు. అది మహత్తరమైన కృషి.

మహర్షి చలం కలం నించి వెలువడిన మరో మహత్తరమైన నవరసభరితమైన ఒరిజినల్ నావెల్ 'మార్తా'. అది విశ్వసాహిత్యంలోనే గొప్ప కళాఖండం. శుభవార్తల నించి మూడు సంఘటనలని ఆధారంగా తీసుకుని అందమైన నవలగా మలిచారు.

" 'సుధ' జ్ఞానమార్గం.
'మార్తా' భక్తి మార్గం.

ఈ రెంటిలోనూ, గొప్ప రహస్యాల్ని, ఆపద్ధతుల్నీ ఆచరణలో పెట్టే విధానాన్ని విశదీకరించారు ఈశ్వరుడు నా పేరు మీద. 'మార్తా' అచ్చవడం ఈశ్వరుడి చేతుల్లో వుంది. తన బోధని ఏసు తన జీవితం లో తన శిష్యులపట్ల ఎట్లా ఆచరణలో చూపారో ఆకథ 'మార్తా".

(జగ్గారావుగారికి చలంగారిలేఖ 21-3-62)

మార్తా పుస్తకం విడుదలైనాక క్రైస్తవసోదరులు కొందరు— 'వాళ్ళ విఘ్నేశ్వరుడి మీదనో రాముడి మీదనో రాసుకోరాదా? మా ఏసుజోలికి ఎందు కొచ్చారు? అసలు మార్తామీద చలంగారు రాయడ మెందుకని, తిట్టారుట. కాని ఇప్పుడు క్రైస్తవసోదరులే "చలంగారూ! మార్తాలో మీరు రాసినట్లుగానే జీసస్ జీవితం నడిచిందని మేము విశ్వ సిస్తున్నాం" అంటున్నారు. మార్తాని క్రిష్టియన్ సొసైటీలో ప్రచారానికి తీసుకునిరావడానికి ఫిల్ము తీస్తామని అది దేశదేశాలలో ప్రదర్శిస్తామని క్రైస్తవసోదరులే ముందుకి వొస్తున్నారు.

అప్పట్లో రోజ్ అనేవారు శుభవార్తల గురించి చలంగారితో మాటాడుతూ.

"Chalam there is money in your book" అనిఅన్నారు. అప్పుడు చలంగారు "There is big money in many of my books, if I cared to change small bits in my stories to please my readers" అన్నారు.

శుభవార్తలు అముద్రితంగానే వున్నాయని నర్తకి సూచనతో కృష్ణారావుగారు ఒకప్రణాళిక ఆలోచించి ఈశ్వర భక్తులైన ఎన్. వీరేశ లింగంగారికి చెప్పారు. ఆ ప్రకారంగానే వీరేశలింగంగారు ఈశ్వరా రాధకులకి, చలం అభిమానులకి శుభవార్తల ప్రచురణ విషయం ఒక మనవిని కార్డుపై ప్రచురించి పంపారు. త్వరలోనే శుభవార్తల ప్రచుర

ణకి సరిపడే పైకం సమకూరింది. వెంటనే విజయవాడలో ప్రచురించే ఏర్పాటు చేయించి 1966 క్రిస్మస్ celebrations కి కృష్ణారావుగారు శుభవార్తల పుస్తకాలు రమణస్థాన్‌కి తీసుకు వొచ్చారు. శుభవార్తలు అచ్చు కావడానికి మూలకారణం నర్తకి ప్రోత్సాహమే. కృష్ణారావుగారు, నర్తకి చేసే ప్రయత్నాలు చూసి చలంగారు శల్యసారథ్యం చేశారు. "ఎందుకు నర్తకీ ఈ ప్రయత్నాలు చేస్తావు? చివరికి చెదలు తినడానికే కదా?" అన్నారు.

శుభవార్తలు అచ్చయినప్పుడు చలంగారు చాలా నిరుత్సాహ పడిపోయారు. వీటిని చదివి ఎవరూ జ్ఞానులు కారనీ, చెదలు తిని వాటికేమైనా జ్ఞానం వస్తుందేమో నన్నారు. కానీ శుభవార్తలు చదివిన కొందరు జీసస్ బోధలపైన ఇటువంటి వెలుగు పడవేసిన అనువాదాన్నింతదాకా తాము చూడలేదనీ, ఇటువంటి కామెంటరీ జీసస్ వాక్కులపైన ఎక్కడా చదవలేదనీ మూర్ఛలు పోతూ వుత్తరాలు రాశారు.

సౌరిస్ 'జీసస్ జీవితం' రాసిన తరువాత బైబిల్‌లో Acts నూ Apocrypha లోని అపోస్తులుల Actsతో జతపరుస్తూ ఒకకథగా తయారు చేశారు. ఇది ఆమెకి చాలా సులభ మయింది. ఈ ప్రయత్నంలో fragments ని కలిపి కథగా చేయాల్సిన అవసరం లేకపోయింది. ట్రాన్స్‌లేట్ చేసి కంపైల్ చేశారు అంతే. అదే "సుందరరూపం". ఈ పుస్తకంలోకూడా అసత్యం అయినవి, కట్టు కథల్లా అనిపించేవి తీసేసి దాంటో ఎంత వరకు సత్యమో అంత వరకూ తీసుకున్నారు. తమకి సత్యంగా ఆథంటిక్ అనిపించిన వన్నీ కథలలోకి ఎక్కించారు. ఈ గ్రంథంలక్ష్యం జీసస్‌ని మించి అపోస్తులులు చేసిన మాహాత్మ్యాలు కాదు. అపోస్తులులు ఎటువంటి సత్యాలని బోధించారో తెలియజెప్పడానికి రాయబడింది. జీసస్ బోధంతా చాలా సులువైంది. అది అంతమైన

కవిత్వం. 'సుందరరూపం'లో చేపలుపట్టుకునే ఔస్త వాళ్ళ నోళ్ళనించి ఉపనిషద్వాక్యాల్ని మించిన సత్యాలు దొర్లాయి. అసలు దేనికీ కట్టుబడని, అవధులు లేని ఆ పరమాత్మ మానవరూపం దాల్చి వొస్తే ఎలా వుంటుందో వారు వర్ణించినట్లు ఎవరూ వర్ణించ లేదు. "ఏ పరిమితులు, ఏ హద్దులూ లెనినువ్వు మాకోసం ఈపరిమితుల్లోకి వొచ్చి, బంధాల్లో బంధితుడి వయ్యావు. శిలువపడ్డావు. కానీ అది నీ మాహాత్మ్యం కాదు. ఏ పరిమితులూ హద్దులూలేని నువ్వు మాకోసం దేహం దాల్చి వొచ్చావు. అదే నీ మాహాత్మ్యం." అంటారు వాళ్ళు. సుందరరూపాన్ని కామేశ్వరి అచ్చువేయించారు.

అపస్తులుల కథలతో కూర్చిన 'సుందరరూపమే' ఆంగ్లములో 'సైన్ ఆఫ్ ది క్రాస్'. అపస్తులులు తామెటు వెడుతున్నారో అక్కడ క్రాస్, చేప బొమ్మలువేసి వెళ్ళేవారు. అది తక్కిన క్రైస్తవులకి వారు వెళ్ళిన మార్గాన్ని తెలిపేందుకు.

జీసస్ జీవితం తరువాత గాస్పెల్స్‌ను, ఎపోక్రిఫాను కలిపి edit చేసి 'Sacred Heart 'గా రూపొందించారు సౌరిస్. దీనిలో షా చేసిన పని గాస్పెల్స్‌లో వున్న దానినీ ఎపోక్రిఫాలో వున్నదానినీ కంపైల్ చేయడం మాత్రమే. కానీ ఇది జీసస్ జీవితమంత పనే. అది మొత్తం old english, ప్రతీపదం స్పెలింగులు తారుమారు కాకండా refer చేయవలసి వొచ్చేది. జీసస్ జీవితానికి మూలమైన ఆంగ్లకథనమే 'Sacred Heart '

సుందరరూపం (Sign of the cross) జీసస్ జీవితం (sacred Heart ) ఎంతమందిని అగ్ని పరీక్షలుచేసి వొదిలాయో! అసలు ఒక మహాజ్ఞాని జీవితంలోనూ, పలుకుల్లోనూ గొప్ప అగ్ని వుంటుంది. ఆ అగ్ని అజ్ఞానితో ఏవిధమైన సంబంధంవున్న వారినైనా గట్టిపరీక్షలు

చేసి వొదిలి పెడుతుంది. ఒక మహాజ్ఞాని చరిత్రని, ప్రబోధాన్నీ - ఒక అవతారమూర్తి అయిన పూర్ణజ్ఞాని తమ చేతులతో పుస్తక రూపమో, వాగ్రూపమో ఇచ్చినప్పుడు అందులో ఎలాంటి దావాగ్ని వుంటుందో వూహించుకో లేము. "సుందరరూపం"—ఆ పుస్తకంతో సంబంధం పెట్టుకున్నవారి నందరినీ మహాఅగ్ని పరీక్షలు చేసింది. **sign of the cross** శుద్ధప్రతి రాస్తామని వొచ్చిన వారంతా అయిపూ, అంతూలేకుండా పోయారు. అది కొద్దిభాగం మాత్రం **fair** అయింది. నేటికి **rough**ని **fair** చేయడానికి ఎవరూ సాహసించటల్లేదు. సాహసించేవారు జాడ లేకండా ఐపోతున్నారు.

'శుభవార్త' లనించి - 'సుందరరూపం' దాకా ఆయా స్క్రిప్టులకు శుద్ధప్రతులు రాస్తూ, మూలగ్రంథ విభాగాల్ని అవసరానుగుణ్యంగా కాపీ చేస్తూ అరచనా సందర్భంలో సందర్భశుద్ధితో సహకరిస్తూ చివరిదాకా ఈ చిచ్చులో డానియల్‌లా నిలిచి నిస్తరించు కోగలిగింది ఒక్క కృష్ణారావుగారే.

ఆ సంగతి నిలా చెప్పారు సౌరిస్.

"ఈ పరీక్షల్ని, అగ్నిని తట్టుకొని నిలబడింది కృష్ణారావుగారే. ఆయనకి ఇవేకాదు ఎన్నిపరీక్షలో! మిత్రుల నించి, బంధువుల నించి, జీవితం నించి- అరుణాచలంలో ఆయనకి అడుగడుగునా పరీక్షలే. ఏ పరీక్షకీ- చలించకుండా నిలబడ్డారు. ఒక్కసారి మాత్రం ఒకరు **Play** చేసిన **cunningness** ఆయనలో కొంత సంచలనం పుట్టించింది. కానీ నేను ఆయనకి అదంతా **explain** చేసి నిలబెట్టాను. ఆవిధంగా శ్రీరమణస్థాన్‌లో ప్రతీపుస్తకం అచ్చులో వొచ్చేవరకూ ఆయన చెయ్యి వుంది. అట్లాగే నిన్న మొన్నటి "సౌరిస్" మొదటిభాగం ఎందరినో అగ్ని పరీక్షల్ని చేసింది. అదికూడా తట్టుకుని ఆపుస్తకాన్ని **fair** చేసింది ఆయనే" అని.

ఇటీవల బార్బారారోజ్ అనే అమెరికన్ ఆమె షా మీది ప్రేమతో షాని వొదలలేక - మధ్యాహ్నాలు రమణస్థాన్‌కి వొచ్చి కూచునేది. ఆమె "నా కేదయినా పని చెప్పండి. ఊరికే కూచోవడం నాకు ఏమీ బాగా వుండదు" అన్నారు షాతో. షా అప్రయత్నంగా "sign of the cross" అనే తమ పుస్తకం కొంత వరకూ fair అయిందనీ, దానిని Type చేసి పెట్టమని చెప్పారు. కానీ తమ గదిలోకి వెళ్ళాక షాకి జ్ఞాపకం వొచ్చింది— ఆ పుస్తకంలోని చిచ్చు సంగతి. "అయ్యో! ఈమెకి ఇది ఇవ్వా నేమిటి? దీన్ని fair చేయా లనుకున్న వారందరూ అయిపూ అంతూ లేకండా వెళ్ళిపోయారు. ఇంత ప్రేమించి వొచ్చిన ఈమెకి ఈ పుస్తకం ఇచ్చానా? ఈమె సంగతి ఏమవుతుందో" అని అనిపించింది షాకి.

మర్నాడు బార్బరా రోజ్ రాగానే "ఈ పుస్తకానికి ఈ విధమైన jinx వుంది. దీన్ని fair చేయా లనుకున్న వాళ్ళు నాకు దూరమవు తున్నారు. నా మీద నీకింత ప్రేమ. నువ్వేమయి పోతావో? వేరే ఇంకే దయినా పని చెబుతాను చెయ్యి" అన్నారు షా.

"మీరు నా విషయంలో పొరబడు తున్నారు. ఏది వొచ్చినా మీ నించి నన్ను దూరం చేయలేదు. I want to cross this stream" అన్నా రామె.

"వూరికే చెప్పాను ఈ సంగతి. తరువాత అంతా నీ ఇష్టం" అన్నారు షా.

ఆమె 'నే నిది type చేసి తీరుతా' నని fair చేసినంత వరకు script ను తీసుకున్నారు. ఇంతకు ముందు ఆమె అరుణాచలంలోనే వుండి పోవడానికి నిశ్చయించుకుని రమణాశ్రమంలో ఇల్లు కట్టు కున్నారు. ఆవిడ నాలుగు పేజీలు type చేశారో లేదో ఆమె భర్త

దగ్గరనించి వుత్తరం వొచ్చింది. వెంటనే నువ్వు అమెరికావొచ్చెయ్యి. నాకు ఒళ్ళు బాగా లేదు" అని. ఇంక ఆమె "నేను మళ్ళీ వొస్తాను. ఏమాత్రం నిన్ను వొదులు కోను" అని షాకి చెప్పి వెళ్ళిపోయారు. కొద్ది కాలానికి తిరిగి వొచ్చారు. అంత ప్రేమగాను షా దగ్గరకి వొచ్చారు. కానీ రెండు మూడు రోజులలోనే ఆశ్రమానికి భయపడి రావడం మానేశారు. ఆ తరువాత మళ్ళీ రాలేదు. ఆ తరువాత ఇక్కడ వుండలేక అమెరికాకి తిరిగి వెళ్ళిపోయారు. మళ్ళీ ఇండియాకి తిరిగి రాలేదు. ఆ విధంగానే వుండి పోయింది. సైన్ ఆఫ్ ది క్రాస్, ఇప్పటి దాకా **fair** కాకండానే.

**Sacred heart** మాత్రం ఫెయిర్ పూర్తయి **type** అయింది. కానీ ఇంకా ప్రచురితం కాలేదు. తురగా జానకీరాణి ఎంతో శ్రద్ధగా లిఖితప్రతిని మూడు **volumes** గా **type** చేసి పంపించారు. ఇటీవల లిండా అనే ఒక అమెరికన్ ఆమె ఆ టైపుచేసిన ప్రతిని చదివి— పారవశ్యంతో "జీసస్ గురించి తెలుసు కునేందుకు నేను **India** రావాల్సి వొచ్చింది" అన్నారు.

ప్రస్తుతం షా ఓల్డ్ టెస్టమెంట్ అనువాదం చేస్తున్నారు. ఆమె తమ ప్రయత్నానికి 'చీమ గంగాయాత్ర' అని పేరుపెట్టారు. "అతి వృష్టి, అనావృష్టి" అనే రెండు కలాల సాయంతో ఆ రచన సాగు తూనే వుంటుంది. కానీ మధ్యలో ఏవో అనువాదాలో, పుస్తకాలు సవ రించడమో, అనారోగ్యమో- అడ్డుపడుతూ వుంటాయి గానీ— ఆ చీమ గంగాయాత్ర నెమ్మదిగా సాగుతూనే వుంటుంది" అంటారు సౌరిస్.

ఆ తరువాత 'సుధ' అనే కావ్యం రాశారు చలంగారు. అది పూర్తిగా జ్ఞానమార్గోపదేశకమైన జీవన కావ్యం. అది శుష్క వేదాంత

గ్రంథం కాదు. జగ్గారావుగారికి చలంగారు 1-6-62న రాసినట్లుగా "అది సుఖ దుఃఖాలలో, వేదనా నందాశ్రువులతో కూడిన జీవన సారం" సుధ సంగతిని ఎప్పుడో చెప్పారు ఈశ్వరుడు. ఈశ్వరుడు వచ్చిన కొత్తలో "చలం నువ్వు నా ప్రతినిధిగా నిలబడ బోతున్నావ్. నువ్వు బైబిల్‌ని అనువాదం చేస్తావు. ఇంకెన్నో గ్రంథాలు రాస్తావు. నీ జీవిత సంగ్రహాన్నంతా సుధ అనే కావ్యంగా రాయబోతున్నావ్" అని.

అప్పుడు చలంగారు నవ్వారు. 'అస్త్రసన్యాసం' చేసిన నేనేం రాస్తాన'ని, కానీ రాశారు. మొట్టమొదట చలంగారు రాసినప్పుడు కావ్యాంతం ఎంతో bitter గా వుంది. చలంగారికి తమ జీవన యాత్రలో తమకేం ఆనందం రానట్లు, వుత్త చేదే జీవితంలో మిగిలి నట్లుగా సూచిస్తోంది. ఈశ్వరుడు "నువ్వు నేర్చుకున్న దంతా ఇదేనా? నువ్వు feel అయేది ఈ bitterness ఏనా!" అని అడిగారు.

చలంగారు తమ లోపలికి చూసుకున్నారు. ఆ చేదు ఎక్కడా కనిపించలేదు తనకి. తమ లోలోపలికి అంతర్వీక్షణతో చలంగారు పరి కించి చూచుకునే సరికి తామేమీ నిర్జనారణ్యాల్లో ఒయాసిస్సుల వెంట బడ్డ ఒంటరి ప్రయాణికుడు కాలేదు. తమ జీవనగానంలో ఏ అప శ్రుతులూ వినిపించ లేదు. అది చలంగారికి వున్న artistic dis-satisfaction అనిపిస్తుంది. ఆనందం అంటే ఆయనకి conception ఒకటి వుంది. ఆనందం అంటే concrete గా ఏదో తనలోకి వొస్తుం దని ఆయన అంచనా. కానీ వాస్తవానికి ఆనందానికి అలాంటి నిర్వ చనం ఏదీ లేదు. అది చాలా సహజంగా చెట్టుమీద పువ్వులా హృద యంలో విచ్చుకుంటుంది. అనుభూతుల పరిమళాల్ని వెదజల్లుతుంది.

ఈశ్వరుడు చలంగారిని ఆభాగం మళ్ళీ రాయమన్నారు. ఈసారి కావ్యం ముగింపులో గొప్పమార్పు వొచ్చింది.అలాంటి కావ్యముఅప్పటి దాకా తెలుగు భాషలో రాలేదు.

జ్ఞానసంబంధర్ నించి భగవాన్ వరకూ అరుణాచల స్తోత్రం చేయడం సాంప్రదాయంగా వొస్తోంది. అది ఈ కాలంలో మళ్ళీ చలం గారి కలంలో రూపం దిద్దుకొంది. జీవిత అనుభవాన్ని అంతిమ సత్యాన్ని కావ్యీకరించిన కళాకారుడు చలంమహర్షి ఒకరే ననిపిస్తుంది. తెలుగు సాహిత్యంలో సుధకావ్యం వెలువడిన కాలానికి అనిబద్ధకవిత్వం కొత్తగా వొస్తోంది. తెలుగులో వచ్చిన తొలి అనిబద్ధకావ్యం 'సుధ'. తెలుగులో వచనకవితా సంప్రదాయానికి కూడా ఈ కావ్యరచనతో చలం వరవడి పెట్టారు.

"చలంగారు 'సుధ'లో ఆవిష్కరించిన అనుభూతులు కవిత్వానికి అతీతమైనవి **mystic experience** కవిత్వపు సరిహద్దు కవతలే సంభవిస్తుంది. కవిత్వపు సామాన్య కొలమానాలు దానికి సరిపోవు. టాగోర్ 'గీతాంజలి' గురించికూడా అదే అన్నాను. 'గీతాంజలి'ని సామాన్య మానవవిరహంగా తప్ప మనం అర్థం చేసుకోలేము. అంటే టాగోర్ కి చాలా అన్యాయం చేస్తున్నా మన్నమాట. 'సుధ' విషయంలో అదే అంటాను నేను." అంటారు. ఇస్మాయిల్ గారు.

(స్వామి రామానందకు ఇస్మాయిల్ గారి లేఖ 11-11-77)

తదుపరి సుధకావ్యానికి ప్రతిధ్వనులుగా ఆంధ్రదేశంలోఎన్నో వచనకవితా కావ్యాలు— త్యాతిక దృష్టి, గవేషణ, నేపథ్యంగా (**back ground**) కలిగినవి వెలువడినాయి. చలం సాహిత్యం ప్రత్యేకత అదే. అది ఏకాంతంగా ఎన్నడూ చూడని వెలుగు వెల్లువలాగ, వెలువడు తుంది, అసంఖ్యాక ప్రతిధ్వనుల్ని సృష్టిస్తుంది. చలం ధ్వనే,

ఎన్నడూ ఆయన ప్రతిధ్వని కాదు— ఆ గుణం ఆధునిక తెలుగు సాహిత్యంలో— ఒక చలంలోనే కనబడు తుంది.

ఒకరోజు చలంగారు Imprint తిరగవేస్తో వుండగా— భగవద్గీతలో ఒక శ్లోకానికి ఆంగ్లానువాదం కనిపించింది. అది ఎంతగొప్పగా ఉందో! భగవంతుడి గురించి ఇంత గొప్పగా డెఫినిషన్ ఇవ్వ గలరా అనిపించి భగవద్గీతలో ఇంత గొప్పశ్లోకాలు వుంటాయా అని అడిగారు చలంగారు షౌని. 'సరే చదివి చూడు' అన్నారు షౌ. చలంగారికి ఈ వేదాంత గ్రంధాలన్నా ముఖ్యం భగవద్గీతన్నా చాలా ప్రిజుడీస్. ఆ శ్లోకానువాదం చదవగానే ముగ్ధులైపోయారు చలంగారు. తాము భగవద్గీతని translate చేస్తా మన్నారు. ఈశ్వరుడు 'సరే' నన్నారు. ఎక్కడెక్కడివో గీతానువాదాలు ఆంగ్లాంధ్రభాషల లోనివి తెప్పించారు చలంగారు.

"భగవద్గీత విషయంలో మీరురాసిన వన్నీ నిజమే. అదెప్పుడు పుట్టిందో తెలీదు, మధ్య మధ్య చేర్పుడాలు అవీ పండితూలూ, విమర్శకూలూ— దాని కాలమూ నిర్ణయించాలి. నిర్ణయించి చూసినట్టున్నారు. కాని, వారికి మాత్రం ఏమి తెలివి వుంది, దాన్ని నిర్ణయించడానికి.

కాని భగవద్గీత అర్థం ఆలోచిస్తో వుంటే అది పరమేశ్వర బోధితమని తోస్తుంది. అన్ని సృష్టిరహస్యాలు. పైగా తానే పరమేశ్వరుణ్ణి అనే అధికారం ఇంకోరి నించి మనహృదయాల్లో పలకవు.

అవును— భగవద్గీతని ఎవరి నీచత్వానికి వారు ఉపయోగించుకుంటున్నారు.

భగవాన్, శంకరాచార్యులు, శ్రీకృష్ణుడు మొదలైన జ్ఞానులు రాసిన వాటిల్లో అర్థం సరేసరి. బోధా, మాటలలో చెప్పలేని దాన్ని మాటలలో చెప్పే సమర్థతా ఇన్నీ ఉంటాయి. అదికాక ఆ శ్లోకాల శబ్దమే మంత్ర జపం వలె పని చేస్తుంది. ఏ నీచ వుద్దేశ్యంతో పఠిం

చినా సరే. అందుకని భగవద్గీత పారాయణం ప్రశస్త మయింది. ఆ శబ్దమే మారుస్తుంది మనసుని. ఎక్కడా మార్పు కనపడని. ఆ మనుషుల్లో అంటే మరి ఎంత కాలుష్యం వారిలో పేరుకొని వుందో.

ఈ మనుషులు భగవద్గీత ఉచ్చరించే విధము, వంకర అర్థాలు తీసే విధమూ చూసి నేను ఇన్నేళ్ళూ అసహ్యించు కున్నాను. భగవద్గీత నేం, ఈశ్వరుణ్ణి ఎట్లా ఉపయోగించుకుంటున్నారు ?

మీరు భగవద్గీతలో అన్యాయమూ చెత్తా చూస్తున్నారే వాటి నిజమైన అర్థం తెలిస్తే అంత అన్యాయ మనరు.

ప్రతి ముక్కకీ ఏమి అర్థమో నాకు వివరించి రాయిస్తున్నారు ఈశ్వరుడు. ఇంతవరకూ ఎవరూ సరైన అర్థం రాయలేదు భగవద్గీతకి, తెలిసినవారు కూడా తెలిసిందంతా కూడా రాయలేదు ఎందుకో! చలం రాసిన 'శుభవార్తలు' భగవద్గీత ఇదివర కెన్నడూ తెలీని గొప్ప విజ్ఞానాన్నియ్య బోతున్నాయి ఏనాటికో !

భగవద్గీత మెల్లిగా సాగుతోంది. చాలా కష్టం సరైన అర్థంలో తెలుగు చెయ్యడం."

(జగ్గారావుగారికి చలంగారి లేఖ 4-11-64)

"భగవద్గీత కాదు, ఇంకే గీత చదివి ఏం ప్రయోజనం? భగవద్గీత సారం మూడు ముక్కలు.

"నేను చెప్పినట్టు చెయ్యి. చేశావా నన్నందుకొంటావు. చెయ్యవా నశిస్తావు. నామీద భారంవెయ్యి, భయపడకు, నన్ను నమ్ము."

భగవద్గీత ముందు నా హృదయంలో ముద్రణ పొందాలి. అప్పుడు నా అక్షరాలలో దాని నకలు దింపాలి. అప్పుడు బైట ముద్రణాలయంలో అచ్చు. భగవద్గీత రాయడానికేం, చాలా సులభం! ఎన్ని భగవద్గీతలో. చదివేది, రాసేది. కానీ అది ఇంకోరిలో పలికినప్పుడే

కదా భగవద్గీత రాసిన సార్థకం! ముందు నాలో పలికించుకోవాలి. అదే నా సాధన ఇప్పుడు. ఇంకో సంవత్సరం లోపు రాతప్రతి తయారుకావడానికి. అప్పుడు కురంగేశ్వరరావు వంటివారు ఓ రెండు నెలలు ఇక్కడ వుండి అచ్చుకు కాపీ తియ్యాలి. ఇంత కథ వుంది."

(రాయిడి నాగేశ్వరరావుగారికి చలంగారి లేఖ 24-6-64)

ఆ రోజుల్లో మామ్మగారుకూడా చలంగారు, ఈశ్వరుడూ, సాగించే గీతాసంవాదాల్లో ఎంతో కుతూహలాన్ని చూపుతూ వొచ్చి కూచునేవారు.

చలంగారికి ఈశ్వరుడికి మధ్య కృష్ణార్జునుల సంవాదం కన్నా తీవ్రమైన సంవాదం జరిగింది. భగవద్గీతలో ప్రతివిషయాన్ని దాని లోతుల లోయల్లోకి. దాని మూలానికే వెళ్ళి అర్జునుని కన్నా ఆ విషయాల్ని తన హృదయం లోతుల్లోకి తీసుకుని తరిచి తరిచి ప్రశ్నించేవారు చలంగారు. ఈశ్వరుడు దానికి అంత విశదంగానూ సమాధానం ఇచ్చేవారు. చలం తన ప్రశ్నలకి ఆయన నించి సమాధానం వొస్తే దాంతో తృప్తిపడేవారు కాదు. ఏ సమాధానం చెప్పినా దాని అసలు అర్థం ఏమిటి? మూల మేమిటి అని ఈశ్వరుణ్ణి నిలేసి ప్రశ్నించేవారు.

ఇక్కడి నించి చలం మహర్షి మాటల్లోనే విందాం.

"చలానికి భగవద్గీతలో ఆ శ్లోకం ఎక్కడా దొరక లేదు. అప్పుడు ఒక ఐడియా తట్టింది. భగవద్గీత **translate** చేద్దామని-

"ఆత్మ నిత్యం .... .... "

" .... దీనిని శస్త్రాలు ఛేదించవు, గాలి ఎండించదు, నీరు తడపదు, అగ్ని కాల్చదు."

"దీనికై దుఃఖ పడతా వెందుకు?"

అని అడుగు తున్నాడు శ్రీకృష్ణుడు అర్జునుడ్ని. ఇదా నేను **translate** చేసి చూపవలసిన మహాబోధ. ఇది ఎవరికి తెలియదు. ఈ మాటలు అర్జునుడికి తెలియవా ? అని అడిగాను షౌని. "ఒక మహా గ్రంథాన్ని అర్థం చేసుకోవలసిన విధం అది కాదు" అంది షౌ.

"చచ్చిపోతానని అందరికి తెలియదా ? చావు అంటే ఆత్మ చచ్చిపోతుంది. అని ఎవరూ అంటల్లేదే, అర్జునుడికి ఆమాత్రం తెలియదా? ఈ మాటనే కృష్ణుడు వొచ్చి చెప్పాలా? చావు అంటే ఏమిటో.

ఏమిటి ఇంత సిల్లీగా వుంది ఈ పుస్తకం? అని షౌని అడిగాను.

"మామూలు మరణంవల్ల కలిగే దుఃఖోపశమన వాక్యాలు చెప్పటం లేదు శ్రీకృష్ణుడు."

"తాను యుద్ధంలో ప్రవేశించ ననడానికి అర్జునుడు ఎన్నో కారణాలు చెప్పాడు. బంధుమిత్రు లందరూ యుద్ధంలో చచ్చిం తరువాత రాజ్య మెందుకనీ, నెత్తురుకూడు తినలేననీ, కులక్షయం చెయ్యడం పాపమనీ, ఇట్లాంటివి. ఇట్లాంటి కార్యవిముఖత్వానికి సాధారణమైన జవాబు——

"క్షత్రియుడివి కావా ? నిన్ను నమ్మి యుద్ధానికి దిగిన నీ సోదరులకి ద్రోహం చేస్తావా ? ద్రౌపతి మొహం, అభిమన్యుడి మొహం ఎట్లా చూస్తావు ? ద్రౌపతి వస్త్రాపహరణం, నీ ప్రతిజ్ఞా మరిచావా?" – అంటే చాలు, ఎట్లాంటి స్తబ్ధుడైనా యుద్ధోన్ముఖు డౌతాడు.

కాని శ్రీకృష్ణుడి ముఖ్యోద్దేశం అర్జునుడి చేత యుద్ధం చేయించాలనీ కాదు, కౌరవసేనల్ని నాశనం చేయాలనీ కాదు. అతనిలో సంశయం, దుఃఖం, కార్పణ్యం, మోహం ఇంక తలెత్తకుండా అణిచెయ్యాలని.

తాతల్నీ, గురువుల్నీ, ఎట్లా చీల్చి చంపను? అనే అర్జునుడి రోదనకి—

"అనంతమైన కాలంలో యానంచేసే చావుపుటకలులేని ఈ ఆత్మల తాత్కాలిక బాంధవ్యాలు వాస్తవమని భ్రమపడి విలపిస్తావెందుకు?" అని అడుగు తున్నాడు శ్రీకృష్ణుడు.

తనమిత్రుడి మనసులో రేగిన తుఫానుని పురస్కరించుకుని, అతనికి ఉన్నత దృష్టి నిచ్చి, లోకోత్తరకాంతికి కళ్ళు తెరవాలని శ్రీ కృష్ణుడు పూనిక. అందుకని అతనికి వేదాంతాన్ని బోధించాడు. ఆ బోధించేది మహాయోగీశ్వరుడైన నారాయణుడు కాకపోతే అర్జునుడు "నాబాధ ఏమిటి? నువ్వు మాట్లాడే దేమిటి?" అని ధిక్కరించేవాడే.

అందరూ చచ్చిం తరువాత ఏం రాజ్యం? అంటాడు అర్జునుడు. కాని మమతలు కాలిపోయిం తరువాత కలిగే శాంతి వెలుగుల ముందు తాత్కాలిక రాజ్యసుఖం ఏపాటిది అంటున్నాడు శ్రీకృష్ణుడు. వేదాంత పరంగా, శాస్త్రపరంగా, నీతిపరంగా, బుద్ధిపరంగా, ఆశపరంగా, అవమాన భీతిపరంగా, అర్జునుడి ధర్మమేదో అన్ని planes లోనూ తెలిపి అతనికి జ్ఞాన మిచ్చాడు.

ఈ ధర్మమనే దానికి ఎన్నో మెట్లు. అర్జునుడు ఒక అంతస్తులో దుఃఖిస్తున్నాడు. శ్రీకృష్ణుడు ఇంకో అంతస్తులో బోధిస్తున్నాడు.

తన అంతస్తులో చూడగల దృష్టి నివ్వగల సమర్థుడు గనకనే శ్రీకృష్ణుడికి ఆమాటలు బోధించగల అధికారం వుంది. జన్మ మృత్యు సుఖ దుఃఖ ద్వంద్వాలు దాటిన జ్ఞాని నోటినించి కాకపోతే, ఆమాటలు వుత్త శుష్కవేదాంత శబ్దాలే అయేవి.

శత్రువుల్ని చీల్చి చంపాలి అనేది మామూలు మెట్టు.

చంపడం పాపం అనేది దాని పైమెట్టు.

వాళ్ళపై కరుణచూపు అనేది అంతకన్న ఉన్నతం.

నీ శత్రువుల్ని ప్రేమించు అనేది గొప్ప అంతస్తు.

సర్వ భూతాల్నీ నిన్నుగా చూసుకో అనేది దానిపైది.

జీవితం అనంతం పుటకలేదు. చావులేదు.

చంపాల్సి వొస్తే చంపు— అనేది ఒకపై మెట్టు.

ఫలాపేక్ష, మమతలూ లేకండా ఇష్టా నిష్టాలకి సముడివై, నీ కర్తవ్యానికి పూనుకో— అనే వేదాంత బోధ చాలా ఉన్నతమైంది.

దాన్ని మించిన చివరి మెట్టు—

"తటస్థుడివై, సాక్షివై నించో, ఏం జరగాలో అది జరుగుతుంది" అనేది.

"ఎవడైనా సరే, తండ్రిగాని, తాతాగాని, శత్రువుని చంపు: అది నీ క్షత్రియ ధర్మం" అనే మొదటి మెట్టునించి తనంతట తనే అదివరలోనే కదిలాడు అర్జునుడు.

"చావు లేదు, పుటకలేదు" అనే జ్ఞానానికి సన్నద్ధుణ్ణిచేసి, ఫలాపేక్ష లేకండా కర్మచెయ్యి- అనే చివరి మెట్టుకి ఎత్తేశాడు తనసఖుణ్ణి శ్రీకృష్ణుడు.

మొదటి అంతస్తులోనూ, చివరి అంతస్తులోనూ జరిగేపని ఒకటే, "శత్రువుల్ని చంపడం" కాని ఉద్దేశ్యంలోనూ పర్యవసానాల్లోనూ, భూమికీ ఆకాశానికీ ఉన్నంత భేదం వుంది ఆ రెంటికీ.

భగవద్గీతలో బోధ, మధ్యకి వొచ్చేప్పటికి "చంపేది నువ్వు కాదు. వీళ్ళని ఎప్పుడో చంపాను నేను" అనే త్రికాలాతీతమైన నిగూఢ ఆధ్యాత్మిక తత్వాన్ని నిరూపించాడు, మనుష్యరూపంలో మాట్లాడే పరమేశ్వరుడు.

ఒకే ధర్మసూత్రం ఇన్ని planesలో పనిచేస్తుంది. కనుకనే, పూర్వపు వర్ణాశ్రమ ధర్మాలకి అర్థం వుండేది.

ఏవర్ణం వారికి ఆధర్మం, ఏ ఆశ్రమం వారికి ఆనీతి భిన్న భిన్నంగా వర్తించేవి.

"ధన మార్జించు" అని గృహస్థుకి,

"ధనాన్ని విషతుల్యంగా చూడు" అని సన్యాసికి,

ఈ మోహ పంకిలంనించి శాశ్వతంగా విముక్తి పొంది, పరమ నిర్వాణా న్నందు కునేందుకు, ఏ సాధనలు చెయ్యాలో, ఏ విధంగా ఉత్తీర్ణుడు కావాలో బోధిస్తున్నాడు శ్రీకృష్ణుడు ఈ భగవద్గీతలో" అని వివరించారు షౌ గారు.

రమణస్థాన్ భగవద్గీతాసంవాద వేదికలో ఒక స్తంభాన్ని ఆనుకుని వుత్సాహంతో అర్జునిడిలా చలం, నిటారుగా కూచుని వున్న సౌరిస్ లోనించి పార్థసారథిలా పలికే ఈశ్వరుడు— కురుక్షేత్రంలో వుభయ పక్షాల సేనావాహినుల్లా రమణస్థానీయులు, ఆగతులు, నర్తకి, కృష్ణా రావు, మామ్మగారు...........వుండేవారు.

ఒక్కొక్క శ్లోకం, వివిధ వ్యాఖ్యానకర్తల వ్యాఖ్య— కృష్ణా రావుగారు చదివేవారు. రథంలో శోకోపహత మానసుడై కళ్ళప్పగించి కూలబడ్డ అర్జునిడిలా కాకండా చలంగారు ధీమాగా, తాజాగా, వేడిగా ప్రశ్నలు వేస్తూ వుంటే— పార్థసారధికన్నా పరమోత్సాహంతో సౌరిస్‌లో నించి పరమేశ్వరుడు సమాధానాలిస్తూ వుంటే— కలం పట్టుకుని ఓపికగా నోట్సు రాసుకునేవారు కృష్ణారావు.

ఇది నిర్వీర్యుడైన అర్జునుడి కథనం కాదు. మానవాళిలో ప్రతి నరుడిలో తలెత్తే సంశయ సమతానికి అవ్యాజ కరుణానిధి యైన ఈశ్వరుడిచ్చిన అభయప్రదానాన్ని గహన సంస్కృత భాషనించి -

సుగమంగా అవగాహనకి తెచ్చేందుకు ప్రత్యక్షంగా పరమేశ్వరులతో వాదించి మహర్షిచలం చేసిన భగీరథ ప్రయత్న మిది.

భగవద్గీత రచనాకాలంలో మహర్షి చలం రమణస్థాన ప్రాంగణంలో ఒక తురాయి చెట్టుని ఆనుకుని కూచునే వారు. ఎదురుగుండా పెద్దగంపలో— తిలక్, ఆదిశంకరులు, అరవిందులు, చిన్మయానంద, రాధాకృష్ణ .... మొదలైన ప్రపంచ ప్రఖ్యాతులు చేసిన భగవద్గీతా వ్యాఖ్యానా లుండేవి. ఒకపక్క నర్తకి, ఇంకొకపక్క కృష్ణారావు కావాల్సిన రిఫరెన్సులు అందించే వారు.

అది ఒకరోజు పుదయం పదకొండు గంటల సమయం. అప్పుడు చలం గీతలోని పదమూడో అధ్యాయంలోని పధ్నాలుగో శ్లోకం వివరణకోసం ఈశ్వర సాన్నిధ్యానికి తమ బలగంతో వెళ్ళారు. ఇంతకీ పదకొండు గంటలకి ఆరంభించిన ఆ సంవాదం మధ్యాహ్నం 2-30 దాకా సాగింది. అలుపు బరువుతో తురాయిచెట్టు నీడకి చేరిన చలంమహర్షి కృష్ణారావుగారితో— "దిద్దమని వెడితే ఈశ్వరుడు మన నిల్చా రుద్దే రేమిటి?" అన్నారు. ఈ విధంగా గీతా రచనాకాలంలో చలంగారు ఛలోక్తులు కోకొల్లలుగా ఈశ్వరుడి మీద విసిరే వారు.

ఆ రోజుల్లో చలం రాస్తున్నారో తామే రాస్తున్నారో సందేహం కలిగేటంతగా చలంగారి పక్కన దిగజారని పుత్సాహంతో పనిచేశారు నర్తకి, కృష్ణారావు. ఆ రిఫరెన్సులు అన్నీ ఓపికగా జ్ఞాపకం పెట్టుకోవడం, ముందుగా చలంగారు రాయించిన అనేక విభాగాలు అడిగిన వెంటనే తడుము కోకండా ఇవ్వడం- ఇత్యాది కార్యక్రమాల్లో నర్తకినీ, కృష్ణారావుగారినీ తెలుగుజాతి తప్పకుండా కృతజ్ఞతాభావంతో స్మరించు కోవాల్సిందే.

ఈ భగవద్గీతా ప్రబోధం- అనువాద మహాయత్నం సాగే సమయంలో రమణస్థాన్‌లో భజనలకి వొచ్చే- తామే మహా పండితులం అనుకునే వారొకరు- "సంస్కృతం రానివారు భగవద్గీతలు అనువాదం చేస్తున్నారుట. ఇట్టాంటి అపభ్రంశ రచనలు పెరిగి పోతున్నాయి లోకంలో. కలికాలం, కలికాలం" అని సణుక్కునే వారు. ఏ మహా కార్యాన్ని ఆరంభించినా అ విధంగా పలురకాల వ్యాఖ్యానాలు, దెప్పుళ్ళు రావడం సహజమే. ఎందుకంటే లోకంలో ఆ మహాయత్నం తాలూకు వేడిని, వాడిని భరించలేక అల్లకల్లోలం బయలుదేరు తుంది.

అప్పట్లోనే కృష్ణారావుగారికి ఒక స్వప్నం వొచ్చింది. ఆ కలలో దక్షిణామూర్తి ఆలయం గర్భాలయంలో విగ్రహానికి వుభయ పార్శ్వాల సౌరిస్, చలం కూచుని వున్నారు. కృష్ణారావు చలంగారి భగవద్గీతా వ్యాఖ్యానాన్ని చదువు తున్నారు. భగవాన్ రమణులు చేతిలో కర్ర పట్టుకుని నిలబడ్డారు. కృష్ణభగవాన్ చెప్పే తత్వాన్ని వ్యాఖ్యానించే చలం వ్యాఖ్యానాన్ని వింటూ భగవాన్ తల వూపుతున్నారు—సానందంగా. ఆ మెరిసే కళ్ళల్లో, వారి మౌనంలో ఆ వ్యాఖ్యానాన్ని ఆమోదించినట్లు కృష్ణారావుగారికి తోచిందట.

మరుసటిరోజు కృ రావుగారు ఆశ్రమం లైబ్రరీని గాలించి భగవాన్ రమణులు భగవ త పదునెనిమిది అధ్యాయాల నించి ఏర్చి కూర్చి అనువదించి, వ్యా ్యనించిన 42 శ్లోకాలను తీసుకు వొచ్చారు. ఆ రోజు కృష్ణారావు వాటిని చదివి వినిపిస్తోంటే సౌరిస్, చలంగారు ఎంతో శ్రద్ధతో విన్నారు. భగవద్గీత అంతటిలోనూ గొప్ప వేదాంత సారాన్ని బోధించే ఆ శ్లోకాలకు భగవాన్ వ్యాఖ్యానాన్ని చలం చేసిన వ్యాఖ్యానాన్ని పోల్చి చూచారు సౌరిస్, కృష్ణారావు. చలం వ్యాఖ్యానం ఒక్క పొల్లు కూడా తేడా లేకండా అది భగవానే తెలుగులోకి రాశారా అన్నట్లుంది. అది చూచి సౌరిస్, కృష్ణారావుగారు ఆశ్చర్యపోయారు.

భగవద్గీతకి ఎంతో వివరంగా వుపోద్ఘాతం రాయాలని చలంగారి వుద్దేశం. Publisher తొందరతో- వుపోద్ఘాతం రాసినంతవరకూ ఆపు చెయ్యాల్సి వొచ్చింది. కానీ చలం భగవద్గీతలో అందరూ మెచ్చేది సగం సగం పూర్తయిన ఆ వుపోద్ఘాతాన్నే.

ఇంక ఆ ప్రచురణకర్త చలంగారిని అదేపనిగా తొందర పెడుతున్నారు. దాంతో మరో మహాయజ్ఞంగా దాన్ని fair copy చేయడం ఆరంభించారు. నర్తకి, కృష్ణారావు అందరూ చుట్టూ కూచుని fair రాతలో రిఫరెన్సులు అందిస్తూ వుంటే కృష్ణారావుగారు చేసిన fair ని చలంగారు సరిచూచే వారు. ఆ సాఫు ప్రతి పూర్తయ్యేసరికి చలంగారికి నయమై పోయిందనుకున్న B. P. (రక్తపుపోటు) తిరగ బెట్టింది. అందువల్లనే సౌరిస్ "తెలుగు వాళ్ళ కోసం రాసిన రెండు మహా గ్రంథాలు నాన్న నెత్తుర్ని పీల్చేశాయి"ని అంటారు.

"శ్రీ రమణస్థాన్‌లో జయంతి ఈ నెల 30న భగవద్గీత Text జయంతికి పూర్తి ఐనట్టే."

ఇంక ముందుమాట రాయాలి—

(రాయిడి నాగేశ్వరరావుగారికి చలంగారి లేఖ 16-12-64)

"భగవద్గీత పూర్తి కావడం కనుచూపుమేరలో లేదు. అదికూడా నేనో, అంతకన్నా మంచిది ఈశ్వరుడో విపులంగా అర్థం చెబితేనే గాని తెలీదు స్పష్టంగా."

(రాయిడి నాగేశ్వరరావుగారికి చలంగారి లేఖ 6-12-65)

పూర్తయిన భగవద్గీతని కృష్ణారావుగారు ముచ్చటగా గిరిప్రదక్షిణం చేయించారు.

భగీరథ యత్నంతో భగవద్గీతని దివ్యమైన వ్యాఖ్యానంతో అందించిన చలం ప్రయత్నాన్ని ఆంధ్రజాతి నీరాజనాలెత్తి స్వాగతిం

చింది. పారవశ్యంతో పాదాలకు మొక్కి శిరోధార్యంగా నిలుపుకొంది. చలం జీవితంలో ఆయన భగవద్గీతకి జరిగినంత విశేషగౌరవం ఆయన ఏ రచనకీ జరగలేదు. 'సెక్సు వాఙ్మయ నిర్మాత'గా పేరుమోసిన చలం భగవద్గీతా వ్యాఖ్యానంతో ప్రేమర్షిపదంతో ఆశ్రమపీఠంలో నెలకొన్నారు. వెలివేసి రొష్టుపెట్టి చలాన్ని హింసించిన తెలుగుజాతి (భగవద్గీతా రచనతో) కన్నీళ్ళతో, ప్రేమతో, భక్తితో చలంమహర్షి పాదాల్ని అభిషేకించింది.

ఈశ్వర కాంతిలో వెలువడ్డ చలం మహర్షి భగవద్గీతా వ్యాఖ్యానం భారతవర్షంలోనే భగవద్గీతపై జరిగిన ఇదివరకెన్నడూ జరగని ఇతరు లెవరూ చెయ్యని అమూల్య పరిశోధనం.

త్రిగుణాత్మక సృష్టికి చిన్నారావుగారు రూపం దిద్దిన త్రివర్ణాత్మక ముఖచిత్రంతో — ప్రేమచంద్ పబ్లిషర్స్ చలం భగవద్గీతను తెలుగుజాతికి అందించారు.

"అవును భగవ తని (చలం అంత సులభంచేసి రాసినా) అర్థం చేసుకోవడం క మే. మీరందరూ ఇక్కడికి వొచ్చి చలానికి B. P. తగ్గి మీకు భగ గ్గీత అర్థం చెప్పే కాలమనేది వొస్తుందా— లేక వొచ్చే జన్మకి వాయిదా పడుతుందా!"

(రాయిడి నాగేశ్వరరావుగారికి చలంగారి లేఖ 2-5-66)

## 19

చిత్ర, పిల్లలు నర్తకితో కలిసి తెనాలి వెళ్ళారు. నర్తకి ఇంతకి మునుపు బెంగుళూరు, మద్రాసు వెళ్ళింది. కాని చలంగారి దగ్గరకు వొచ్చాక ఎన్నడూ తెనాలి వెళ్ళలేదు. అన్నయ్య పోరుపెట్టగా, చాలా రోజులకి బయలుదేరింది. ఆమె తెనాలి ప్రయాణం అనుభవాల్ని ఆమె ముఖతానే విందాం.

"ఒరే నరసింహం చెల్లెలు వుందంటావ్, వెళ్ళి చూసి వొచ్చా నంటావ్? ఎక్కడికి వెడతావో? తల్లి లేని బిడ్డని ఎప్పుడు చూశామో, నిజంగా బతికే వుంటే ఒకసారి మాకళ్ళకి చూపించరాదా?" అని చిన్న తనాన నామీద అంతులేని వాత్సల్యం కురిపించిన ముసలమ్మలంతా గోలపెడితే ఎన్నిసార్లో అన్నయ్య పిలవగా పిలవగా చివరికి చిత్రతో కలిసి తెనాలి బయల్దేరాను, ఎప్పుడో 1938లో వొదిలిపెట్టిన తెనాలి. నన్ను ఎన్నో ఏళ్ళనించి తలుచుకుంటున్న వాళ్ళని చూస్తాను కదా అని సంతోషం రైల్లోనించి దిగగానే.

చిన్నతనంలో, నెలల పిల్లగా వుండగా అమ్మచచ్చిపోతే ఇంటి పక్కన సాయెబుగారింట్లో పెరిగాను. వాళ్ళు కొత్తగా పెళ్ళైన దంపతులు, ఆమెని బాయమ్మ అని పిలిచేదాన్ని. ఆవిడ ఒక ఆవును కొని ఆపాలుపోసి నన్ను అల్లారు ముద్దుగా పెంచింది. ఆ తరువాత నాయనమ్మతో నండూరు వెళ్ళడం, అక్కడినించి బెజవాడ, అలా అలా వొయ్య దగ్గరికి చేరుకోవడం జరిగింది.

మళ్ళీ రమారమి ఇరవై ఏళ్ళకి తెనాలి గడ్డ తొక్కింది ఇవాళ. వీళ్ళందర్నీ ఎప్పుడో ఎక్కడో చూసినట్లుంది. కలలోనా? ఇలలోనా? వీళ్ళమాటలు ఎక్కడో విన్నానా? అనిపిస్తుంది. వాళ్ళందరూ ఎంత ఆప్యాయంగా ప్రేమగా వొచ్చారో నాదగ్గరికి.అమ్మా లక్ష్మి, లక్ష్మడూ అని ప్రతి ముసలమ్మా వొచ్చి కావలించుకునే వాళ్ళే.ఒకావిడ "అమ్మా లక్ష్మి మళ్ళీ నిన్ను కళ్ళారా చూస్తాననుకోలేదే తల్లీ! అమ్మలేని బిడ్డవు ఏమయిపోయావో అని అల్లాడి పోయానమ్మా!" అనే సరికి కదిలి పోయాను.

బాయమ్మ ఇంటికి వెళ్ళాను."బాయమ్మా అని ఏడ్చావుగుర్తుందా అమ్మా? నువ్వెళ్ళి పోయాక నేనెంత బాధ పడ్డానో! నా తల్లీ! నిన్ను

మళ్ళీ చూస్తాననుకోలేదమ్మా" అంటున్న బాయమ్మ పలుకుల్లోని ప్రేమ గుండెల్లో ఏదో తెలియని గుబులుని పుట్టించింది,

బాయమ్మ పిల్లలంతా వొచ్చారు. నా చుట్టూతా మూగారు. మిమ్మల్ని మేం చూస్తామనుకోలేదు. అమ్మ చెప్పేది అందరికీ మిమ్మల్నికూడా కలుపుకుని 'నాకు ఆరుగు రమ్మాయిలు. పెద్దమ్మాయి బెంగుళూరుదగ్గర వుందని—" అంటూ చెప్పారు. అయిదుగురు యువతులు. వాళ్ళ చేతుల్లో చంటి బిడ్డలు.

బాయమ్మ భర్త ముసలివారు. మంచంమీద పడుకుని—'అమ్మా ఈ నాన్నతో ఆటలాడడం మరిచి పోయావా?' అంటే జ్ఞాపకాల మరుగునించి ఆయనెవరో తెలియక తడబడుతుంటే బాయమ్మ చెబితే తెలిసింది.

'బాయమ్మ నిన్ను మరవలేదమ్మా' అన్నాను అప్రయత్నంగా. 'కూచోమ్మా' అంటూ బాయమ్మ వెన్ను నిమిరింది. ప్రేమగా తినడానికేదో ఫలహారం తీసుకువొచ్చి పెట్టింది.

బాయమ్మ ........ చిన్నతనంలో పాలుతాగే రోజుల్లో ప్రేమగా సాకిన బాయమ్మ....20 ఏళ్ళుగడిచినాయింకా మరిచిపోని బాయమ్మ ఆమె ప్రేమకి హృదయం లోతుల్లో కదలిక,అదిమాటల్లో చెప్పగలిగింది కాదు.

"బాయమ్మ! అన్నయ్య దగ్గరికి వెడతా"నని లేచాను. "అమ్మా ఇన్నేళ్ళకి వొచ్చావు నాలుగు రోజు లుండిపో అమ్మా! మళ్ళీ ఎన్నాళ్ళకో, ఎన్నేళ్ళకో, ఎప్పటికో .... ఇంక చూస్తానో, లేదో?".... బాయమ్మ మాటలకి ఏం జవాబియ్య గలిగాను. "బాయమ్మా వుండేది రెండేరోజులు. ఈమాటు వొచ్చినప్పుడు తప్పకుండా వొస్తానమ్మా!" అని చెబితే బాయమ్మ ప్రేమగా దగ్గరగా తీసుకుంది. అమ్మని చూశాననిపించింది. ఏ లోకాలకో తరలిపోయిన అమ్మ మళ్ళీ ఇట్లా వొచ్చి నన్ను హృదయానికి హత్తుకుం దనిపించింది.

అన్నయ్యా వాళ్ళింటికి నడుస్తోంటే - చిన్నతనం కొంచెంగా లీలగా ఎక్కడో జ్ఞాపకాల్లో మబ్బుచాటున నీరెండలా మెరుస్తోంది. బాల్యం పక్కన అందరికీ మమతామయి అమ్మ కనిపిస్తుంది. నాకు మాత్రం తల్లిలేని పిల్లనని నాపయి అందరూ చూపిన ప్రేమ, వాత్స ల్యం గుర్తుకి వొస్తాయి. అప్పట్లో పళ్ళకొట్లలో యాపిల్స్ దారాలకి కట్టి వేళ్ళాడ గట్టేవారు. అవి గాల్లో ఎట్లా వేలాడుతున్నాయో నని వింతగా వుండేది. జీడీలు చేసేవాళ్ళు అవి స్తంభాలకి పట్టిలాగి ఇవతల ముక్కలు కొట్టడం ఆశ్చర్యం గొలిపేది. పూలబావి పేరు వింటే పూలతో చేసిన బావి అనుకునేదాన్ని. కాలవలో పడవలు పోతూ వుంటే ఎంతో వింతగా అనిపించేది. మళ్ళీ అవన్నీ ఈనాడు మామూలుగా కని పించాయి. ఆనాటి వింతజ్ఞాపకం మాత్రం మనసుకి సంతోషం. చిన్న ప్పటి అన్ని వింతలూ ఇప్పుడూ వున్నాయి కాని వాటిలో ఏదో వెలితి కనిపిస్తోంది. ప్రపంచంకూడా తన చిన్నతనాన్ని పోగొట్టుకున్నట్టు, తన అమాయకత్వాన్ని ఎక్కడో పారేసుకున్నట్టు అనిపిస్తోంది. ప్రపంచం చుట్టూతా కూడా ఏదో పెద్దరికపు గోడ మొలిచిం దని పిస్తోంది.

సంజవేళకి గూళ్ళకి చేరుకునే పక్షుల గుంపుల్లా కోటి ఆలోచ నలు గుండెల నిండా ముసురుకొంటూ వుండగా అన్నయ్యా వాళ్ళింటికి చేరుకున్నాను.

మల్లెపూ లమ్ముకునే కోటయ్యొ నన్ను చూడటానికి వొచ్చాడు- "అమ్మా నీ గౌను నిండా మల్లెమొగ్గలు పోస్తేనేగాని అమ్ముకోడానికి వెళ్ళేవాణ్ని కాదు. ఇన్ని సంవత్సరాలు అవే జ్ఞాపకాలతో ఇంకా మల్లె పూలు అమ్ముతున్నానమ్మా! .... .... .... ఈ ఏడు పూత ఇప్పుడే ప్రారంభమయిందంటూ చేతుల్లో పోశాడు .... గుప్పెడు మల్లెపూలు.

గుండెల్లో పూచిన వాత్సల్యం పువ్వుల్తో కలిపి. మల్లెపూల తాత ఇచ్చిన కానుకతో తూగగల కానుక ప్రపంచంలో లేదనిపించింది. పువ్వుల్తో బాటు కొంచెం డబ్బు చేతుల్లో పెట్టి "జాకెట్టు కుట్టించుకో అమ్మా! నేను బతికి వుండగా ఇంక మళ్ళీ నిన్ను చూస్తానా తల్లీ! ఇన్నేళ్ళ తరవాత చూడగలిగాను అదే ఆశ్చర్యం" అని చెప్పి వెళ్ళిపోయాడు. ఓ ఏడెనిమిదేళ్ళ తరవాత అతను చనిపోయాడని విన్నప్పుడు అత డానాడు చెప్పిన మాటలు గుర్తొచ్చి దిగులువేసింది — ఇప్పటికీ ఆ తాత ఇచ్చిన గుప్పెడు మల్లెపూలు .... .... నా గుండెల్లో వాడిపోలేదు.

అన్నయ్య ఓ రోజు హోటలు పని ఎవరికో అప్పజెప్పేసి వొచ్చాడు. "అలా వూరంతా చూపిస్తానమ్మా నీకు చిన్నతనం గుర్తుకి వొస్తుందేమో" అంటూ తెలిసిన వాళ్ళందరి ఇళ్ళకీ తీసుకెళ్ళాడు.

వాళ్ళ ఇళ్ళు ఎప్పుడో కలల్లో చూశానా? అన్నంత చిన్న జ్ఞాప కాలు. వాళ్ళకి మాత్రం నేను తెలిసినట్లు ఎంతో ఆప్యాయాలూ, అభి మానం చూపారు. నాలుగు రోజులకల్లా తిరిగి తిరువన్నామలై వొచ్చే శాను. ఈమాటు తెనాలే నాతోపాటు వొచ్చేస్తున్నట్లనిపించింది."

ఆశ్రమం నించి westerners ఇక్కడికి వొచ్చి భజనలు చేసి, డ్యాన్సులు చేసేవారు. వాళ్ళు చలంగారిని ఎంతగా ప్రేమించేవారో! కానీ ఆశ్రమం వాళ్ళు ఆంక్ష పెట్టారు- 'అక్కడికి వెడితే ఆశ్రమా నికి రాకూడ' దని— పాపం వాళ్ళకి ముందు రోజు తెలిసేది కాదు. ఆ ఆంక్ష సంగతి తెలిశాక మర్నాటినించి వొచ్చేవారు కాదు. కొంత మంది ఎంత బాగా కలిసి వుండేవారో! కొంతమందికి ముందే తెలి సేది, వాళ్ళు మర్నాటినించి కంటికి కనపడరని, చలంగారు వాళ్ళకీ తెలుసు. మరి కొంతమంది వొచ్చి "వాళ్లు వొద్దంటున్నారు. అక్కడికి వొచ్చాంకదా, ఎందుకు unpleasant చేసుకోవడం" అని చెప్పి వెళ్ళి

పోయేవారు. కొందరికి చలంగారే చెప్పేవారు. "ఆశ్రమంవారికి మీ రిక్కడికి రావడం ఇష్టం వుండదని" వాళ్ళు "సరే మేం రావడం మానుకుంటాం" అని ఆ ఒక్కరోజు తమకి వుండకదా అని చాలా సరదాగా గడిపి వెళ్ళిపోయేవారు.

చాడ్విక్‌కి మళ్ళీ జబ్బు చేసింది. ఆ జబ్బు చేయక ముందే చలంగారింట్లో వంటలలో కారాలు ఎక్కువగా వున్నాయని తాము తిన లేకుండా వున్నామని చాడ్విక్ చెప్పారు. మొట్టమొదటే షౌ ఆయనకి చెప్పారు— "ఇక్కడ వంటల్లో మీకు కారాలు ఎక్కువ అవుతాయి. మీకు విడిగా చప్పిడిగా వండి పంపుతాం" అని. కాని ఆయన వినే వారు కారు.

"మీరేది చేసుకుంటే అదే నాకు పంపండి" అన్నా రాయన.

"మీరు అక్కడ తినడ మేమిటి? మీకు భోజనం మేం పంపి స్తాము" అన్నారు యూరోపియన్ మిత్రులు ఆయనతో. అక్కడితో చాడ్విక్ రమణస్థాన్ భోజనం మానుకొన్నారు. కానీ వాగ్దానం ఇచ్చిన మిత్రు లెవరూ ఆయనకి భోజనం పంపటల్లేదు. వంటవాడు అంతకి మునుపే మానేశాడు. దాంతో కిట్టూ అనే పూజారి తమ ఇంట్లో భోజనం తయారుచేయించి ఆయనకి పంపేవారు.

మళ్ళీ జబ్బు చేసింది చాడ్విక్‌కి. ఈ సారి కూడా ఆయన చాలా బాధ పడుతున్నారు. ఆయనకి బ్లాడర్‌లో **infection.** పూజారులు, వేద పారాయణ పిల్లలు అందరూ ఆయన సేవ చేస్తున్నారు. ఒక జబ్బు తగ్గితే మళ్ళీ ఇంకో జబ్బుతో చాడ్విక్ బాధ పడుతున్నారని తెలిసి షౌ ఎంతో బాధపడ్డారు.

యూరోపియన్ మిత్రులు ముఖ్యంగా మెర్‌స్టన్, మా. తల్యార్ ఖాన్ చాడ్విక్‌ని మద్రాసు వెళ్ళి- వైద్యం చేయించుకోమని గట్టిపట్టు

పట్టి ఆయనని మద్రాసు తీసుకుని వెళ్ళారు అక్కడ నర్సింగ్ హోమ్‌లో డాక్టరు, చాడ్విక్ చాలా పెద్దవారనీ, ఆపరేషన్ చేయడానికి వీల్లేదనీ- అన్నారు. మెర్‌స్టన్, మా తల్యార్‌ఖాన్ ఆ డాక్టర్ని "ఎట్లా గైనా ఆయనకి ఆపరేట్ చేయండి" అని కన్నీళ్ళతో బతిమాలారు. అప్పుడు డాక్టర్ "సరే ఇది పెద్ద రిస్కే. మీరు రిస్కు తీసుకోమంటే నేను తీసుకుంటాను" అన్నారు. "తీసుకోండి" అన్నారు వాళ్ళు చాలా ధైర్యంగా. అది చాలా పెద్ద ఆపరేషన్.

డాక్టరు వాళ్ళ మాటమీద ఆపరేషన్ చేశారు. ఆయన మద్రాసులో వున్నన్నాళ్ళూ ఇక్కడినించి షౌ రాత్రింబవళ్ళూ ఆయన మీద దృష్టి పెట్టి వుంచేవారు.

ఆపరేషన్, **rest** పూర్తయినాక చాడ్విక్ తిరువన్నామలై వొచ్చేశారు. చలంగారు వాళ్ళంతా ఆయనని చూడడానికి వెళ్ళారు. ఆయన ఎంతో సంతోషంతో "భగవాన్ నాకు జీవితానికి మళ్ళీ లీజ్ ఇచ్చారు" అని వాళ్ళతో అన్నారు. తమ భారమంతా భగవాన్ మీదవేసి నిశ్చింతగా వుండి పోయానని, ఆపరేషన్ వల్ల తమకి చీమంత బాధకూడా కలుగలేదని చెప్పారాయన.

చాడ్విక్ చలంగారింట్లో భోజన భాజనాలు మానుకున్నా. చలంగారి దగ్గరకి స్నేహితుడుగా వొస్తూనే వున్నారు. ఎవరి కోసం షౌని గదిలోంచి పంపని ఈశ్వరుడు ఆయన ఎప్పుడు వొచ్చినా గదిలోంచి బయటికి పంపించే వారు. కొన్నాళ్ళకి చాడ్విక్ వొచ్చినా కూడా షౌ గదిలోంచి బయటికి రావడం మానేశారు. అయినాగాని ఆయన వొచ్చి చలంగారితో మాటలాడి వెళ్ళేవారు. చాడ్విక్ ఎప్పుడు వొచ్చినా చలంగారి పెంపుడు నెమలి హీరా ఆయనని తరుముతూ వుండేవాడు. కానీ ఆయన చలంగారింట్లో ప్రతి పండగకి, వుత్సవాలకి, అన్ని విశేష సందర్భాలకి హాజరయ్యేవారు.

# 20

1960లో పత్రికలలో ప్రళయం గురించి జ్యోతిష్యాలు పడుతూ వుండేవి. ప్రపంచ మంతటా చర్చలు రేకెత్తించిన వార్తలవి. బైబిల్‌లో చెప్పిన అనేక నిదర్శనాలు 1960, 61 లలో జరగడం మొదలు పెట్టాయి. ఎన్నడూ ఎక్కడా లేని రోగాలు చెలరేగుతున్నా యని, పెద్దపెట్టున భూకంపాలు వొస్తున్నా యని, కొండలు విరిగి పడు తున్నా యని- ప్రతివాళ్లు చలంగారికి వుత్తరాల ద్వారా తెలియ జేసే వారు. 1961 రాగానే, "సరే ప్రళయానికి నువ్వు ఏర్పాట్లన్నీ చెయ్యి" అన్నారు షౌతో ఈశ్వరుడు.

ప్రళయం గురించి చలంగారి వుత్తరాలు చదివి, పత్రికలు చదివి చాలామంది—— "ప్రళయం వొస్తుం దని అంటున్నారు గనుక మా కుటుంబాలతో సహా మేం తిరువన్నామలై వొచ్చేస్తున్నాం" అని చలంగారికి వుత్తరాలు రాసేవారు. ఆ సంఖ్య వందలు దాటిపోయేలా వుంది.

షౌ ముందుగా గంగాధరాన్ని, సారంగపాణిని పిలిచి "ఇట్లా ప్రళయం రాబోతోంది. ఇక్కడికి వొచ్చేవారికి మీ రేమయినా సహా యం చేస్తారా?" అని అడిగారు.

"ప్రళయం నిజంగా వొస్తే ఎంతమంది వొచ్చినా, వాళ్ళందరికీ మేం భోజనాలు పెడతాం. కాని రాకపోతే మాత్రం మే మేమీ చెయ్యం" అన్నారు వాళ్ళు.

భోజనాల విషయం కన్నా ఇంతమంది వొస్తే వారి నెట్లా **accommodate** చెయ్యా లన్నది, వారందరికి ఏ విధంగా సేవ చెయ్యడ మన్నది ఆలోచిస్తే చాలా గొప్ప సమస్యగా తోస్తుంది కానీ

వారి నందర్నీ ఈశ్వరుడు అరుణాచలం రానీయ దల్చుకోలే దని పిస్తుంది.

అప్పట్లోనే కనకమ్మగారి కో కల వొచ్చింది.

"ఇది కనకమ్మగారికి వొచ్చిన కల. ఇది ఈశ్వరుడు చేస్తున్న ప్రళయ సన్నాహాన్ని సూచిస్తోంది.

"రాత్రి నిద్రలో గొప్ప కల. ఈశ్వరుడు, భగవానులు, నాన్న. నర్తకి గారలు. ఈశ్వరుడు ఒక దివ్యపురుషులుగా కన్పించారు. ఒక వేదికపై నిలబడి క్రీస్తు యీ లోకంలోకి రాబోతున్నారు. ఇప్పుడు మీ రంతా అపోస్తలులు, పౌలు శిష్యుల పాత్రలు వహించాలి- అని చెబుతున్నారు మా కందరకు నాన్న! ఆ కలయొక్క గొప్ప అనుభూతి నన్ను ఇంతవరకు వదలలేదు. ఒళ్ళంతా ఒకటే గగుర్పాటు. తలలో ఏదో తెలియని దిమ్మ. భగవాన్ ఒక సోఫాపై పడుకుని మౌనంగా చూస్తు రు. నర్తకి అటూ, ఇటూ హడావిడిగా తిరుగుతున్నారు. నాన్న న వ్వతూ నిలబడి "నాకు దోసకాయలు తెచ్చారా?" అని అడుగు న్నారు. ఇదీ కల. ఇంకా ఎక్కువ కాలం వుంటే బాగుండేది ఆ కల. అంతలోనే కరిగి పోయింది. ఆ సంతోషాన్ని తెలుపుకుంటానికే ఈ కార్డు." (శాస్త్రిగారికి చలంగారి లేఖ 17-12-60)

ఆ సంవత్సరం ఈశ్వరావతరణ దినోత్సవానికి (**Aug. 15**కి) ఆహ్వానాలతో బాటు కొంతమందిని ప్రత్యేకంగా "మీరు తప్పకుండా రావాల్సింద"ని ఆహ్వానించారు. వా రెవరంటే జవహర్, కురంగేశ్వర్, లక్ష్మిగారు, శాస్త్రిగారు, జగ్గారావు, కె. సభా, నరసింహస్వామి. వారందర్నీ పిలిపించి "మీకు వీలయిన ప్రదేశాల్లో ఇట్లా ప్రళయం రాబోతోందని ప్రచారం చేయండి. ఎవరన్నా మీ మాట విని విశ్వసిస్తే — "మేం నమ్ముతున్నా" మని చలంగారికి ఒక వుత్తరం వ్రాయమనండి" అని చెప్పారు షా.

ఆ ఈశ్వరావతరణోత్సవానికి ఎంత హడావిడో ఎంత వుత్సాహమో కుట్టివాళ్ళలో. అంతా ఈశ్వరుడు చెప్పినట్లుగానే చేస్తామని వూనుకున్నారు. ఎవరికీ ఈశ్వరాదేశం పట్ల సందేహం లేదు.

ఈశ్వరుడు చెప్పిన దేమంటే సముద్రతీరాలవారు ఈశ్వరుడు నియమించిన సముద్రతీరాలు లేనివారిదగ్గరికిరక్షణకోసం వెళ్ళాలి. ఆవిధంగా సముద్రతీరాల నించి వొచ్చినవారికి రక్షణ ఇస్తామని—విద్యుత్ కుమార్, చిన్నన్నగారు, జగ్గారావుగారు కొండూరు నించి వొచ్చిన కుందేటి వెంకటేశ్వరరావుగారు తదితరులు ముందుకు వొచ్చారు.

షౌకి డబ్బంటే చాలా అసహ్యమైన సంగతి. కానీ ఈ వ్యవహారంలో డబ్బు సంగతి తననోటితో తామే ఎత్తవలసి వొచ్చిందామెకి. "రక్షణ నిమిత్తం వెళ్ళేవారు— తమకి ఆశ్రయం ఇచ్చేవారికి భారం కాకండా కొంతడబ్బు తమతో తీసుకు వెళ్ళండి" అని చెప్పాల్సి వొచ్చింది. అందరూ ఎంతో వుత్సాహంతో ఒప్పుకున్నారు.

విద్యుత్‌కుమార్ M. R. అప్పారావుగారి కొడుకు. విద్యుత్ కుమార్ చలంగురించి చిన్నారావుగారికి రాసిన ఉత్తరాలన్నీ చిన్నారావుగారు తిరువన్నామలై వొచ్చినప్పుడు చలంగారికి చదివి వినిపించేవారు. విద్యుత్ కుమార్ ఇంగ్లాండులో సోమర్‌సెట్ మామ్‌ని కలుసుకున్నారట.

"నాలాగే రాసే రివల్యూషనరీ రచయిత మీ దేశంలో ఎవరైనా వున్నారా?" అని మామ్ విద్యుత్‌కుమార్‌ని అడిగారు.

"మీలాగ రాసే రచయిత మాదేశంలో ఒకరే వున్నారు. వారి పేరు 'చలం'. వారు మా తెలుగువారే" అని గర్వంగా చెప్పారట విద్యుత్‌కుమార్, మామ్‌తో.

విద్యుత్‌కుమార్ చలంగార్ని చూడడానికని వొచ్చారు. ఆయనకి చలంగారి యెడల ఎంత ప్రేమో! ఎంత వినయమో!

"మీరు ఆశ్రయం కోరే వారికి రక్షణనిస్తారా?" అని ఈశ్వరుడు ఆయనని అడిగారు.

"చలం ఈశ్వరుడంటున్నారు గనక మేము ఈశ్వరుడంటున్నాము. తప్పకుండా ఆశ్రయం కోరిన వారందరికీ ఆశ్రయంఇస్తాము" అన్నారాయన. ఆయన చలంగార్ని చూచేందుకు రెండు మూడుసార్లు వొచ్చారు.

ఆ రోజులలో శాస్త్రిగారు, కురంగేశ్వరరావు మొదలైనవారు అరుణాచలంలోనే ఇళ్ళుకట్టుకుని చలంగారికి దగ్గరగా వుండాలని ప్రయత్నాలు చేశారు. చలంగారే కొంచెం వుత్సాహం చూపించినట్లయితే ఇక్కడే చలంగారి చుట్టూరా వుండిపోయేవారే, ఈపాటికి రమణస్థాన్ కోలనీ ఒకటి వెలిసి వుండేదేమో!

చివరికి కురంగేశ్వరరావు పెళ్ళి చేసుకున్నారు. ఆయనకి **Bombay films** లో ఒక **photographer** గా చేరాలని ఆశయం. ఈశ్వరుడ్ని 'చేరమంటారా' అని అడిగా రాయన. ఈశ్వరుడు "మీట్లాంటి వుద్యోగాల్లో చేరవద్దు" అంటే మాను కొన్నారు.

పెళ్ళి చేసుకునే ముందు ఫలాని ఆమెని పెళ్ళి చేసుకోబోతున్నాను— అని వుత్తరం రాశారాయన. ఏమాత్రం కట్నం తీసుకోవద్దని ఈశ్వరుడు రాయించారు. భార్యతో సహా అరుణాచలం వొచ్చి వుండాలని ఆయన ఆశయం. పాపం! అది నెరవేర లేదు.

ఈశ్వరుడు రాకముందే సౌరిస్‌లో ఒకవ్యాధి ప్రవేశించింది. షాకి ఆస్పత్రికి వెళ్ళి చూపించు కోవాలని ఉండేది కాని ఈశ్వరుడు వొచ్చినప్పుడు ఆయన నడిగితే ఆయన వొద్దన్నారు. ఆమెకి వైద్యం

తెలుసు గనక అందుకొ్కవలసిన మందు తెప్పించుకొని వేసుకున్నారు. కానీ ఆ మందుతో ఆ వ్యాధి నయంకాలేదు.

ఆమెకి ఒక ఆరని పుండు నయం కాకండా వుండేది. లివర్, ఇన్‌టెస్టెయిన్స్, యుటిరస్ అంతా వాచి నెప్పిగా వుండేది. 1960లో అది క్యాన్సరని ఆమెకే తెలిసింది. అలా తెలియగానే భగవాన్‌సమాధి దగ్గరికి వెళ్ళి ఒక నమస్కారం చేసి వొచ్చేశారు. ఆ దశాబ్దం అది తమని బాధించకుండా ఏవిధంగా వుందా? అని ఆమెకి ఆశ్చర్యం. కాని 1960లో మాత్రం బాగా వాపు ఎక్కువైపోయి కొంత బాధపెట్టడం మొదలు పెట్టింది.

ఆ రోజుల్లో ఆమెకి సంకల్పమంటూ ఏదయినా వుంటే అది ఒకటే, తాము తల్లిదండ్రులకి తెలిసే విధంగా జబ్బు పడకూడదని, వారికి తనవల్ల ఏవిధమైన పరితాపం కలగకూడదని.

చలంగారికి క్యాన్సరునొప్పి విటమిన్ E వల్లనయమైంది గనక మరీ బాధ అనిపిస్తే ఒకటి రెండుసార్లు విటమన్ E వేసికున్నారు షౌ. బాధంతా తగ్గిపోయింది. కాని ఆవాపు అట్లాగే వుండి పోయింది. కొంచెం నొప్పి చేస్తూనే వుండేది.

ఇదికాక ఎసిడిటీ బయలుదేరింది. కానీ ఈ ఎసిడిటీ దానివల్లేనని ఆమెకి తెలియదు. మెల్లిగా ప్రకృతి వైద్యం ఇంట్లో ప్రవేశించింది. షౌ ఎసిడిటీ కోసం చలంగారు నర్తకిఆమె పొట్టకి మన్నుకట్లువేసేవారు. మన్నుకట్లనే నాన్నవాళ్ళకి తెలియకుండా పొత్తికడుపు మీదకి జార్చుకునే వారు ఆమె. దాంతో ఆమెకి పొత్తికడుపులో వుండే బాధలన్ని తగ్గిపోయాయి. ఆవ్యాధి ఎప్పుడో అప్పుడు తమని మింగేస్తుందని అనుకునే వారామె. కానీ తల్లిదండ్రులు జీవించి వుండగా మాత్రం అది జరగ కూడ దనుకునేవారు. షౌ 1966లో నిమ్మకి నీరెత్తినట్లు నిశ్చ

లంగా తిరిగేవారు. కానీ అవి చాలా గడ్డురోజు లామెకి, ఆమెలోపల ఏం బాధ పడుతున్నారో ఎవరికీ తెలియదు.

అమ్మ హఠాత్తుగా నర్తకికి వుత్తరం రాసింది— "అమ్మలికి జబ్బుచేసిందో లేకపోతే చేయ్యబోతుందో మీరు జాగ్రత్తగా చూసుకోండేం" అని. షా నవ్వి వూరుకున్నారు. నర్తకి ప్రశ్నిస్తే "నాకేమి జబ్బు లేదు. అమ్మ ఎందుకు అట్లా గాభరా పడుతోంతో?" అని ప్రశ్నించారు. తండ్రికి వొచ్చిన **mouth cancer** ఆమె తన వొంటి మీదికి తీసుకున్నారు. అది ఆమె నోటికి **attack** అయింది. గొంతు సరిగా రాకపోవడం కఫం అట్లాంటివి కలిగేవి దానివలన. అంతేకాదు— పురుచక్రవర్తి యయాతి వార్ధక్యాన్ని తీనుకున్నట్లు తండ్రి ఒంటిమీద వార్ధక్యాన్ని ఆమె తీనుకున్నారు.

డెభైయ్యోపడిలో రోగగ్రస్తశరీరుడైన వున్న తండ్రి ప్రారబ్ధాన్నంతా ఆమె తీసుకుని భరిస్తూ వుంటే, ఆయన ఏబాధ తెలియకుండా హాయిగా గంతులువేస్తూ వుండేవారు. ఒక తండ్రి బాధనే కాదు. విశ్వాసులందరి వేదనలను, బాధలను ఆనందంగా తాము తీసుకుని భరించారు, భరిస్తున్నారు షా. ఆ విధంగానే జీసస్, రామకృష్ణపరమహంస, భగవాన్ రమణమహర్షి భక్తుల బాధలను తమ శరీరం మీదకు తీసుకునేవారని వింటాము.

ఎండాకాలం శలవలకి వొచ్చిన డాలీ తాను మళ్ళీ స్కూలుకి పోనని పంతం పట్టింది. షా "ఎందుకు వెళ్ళవు? ఏమిటి కారణం" అని అడిగారామెని. "నాకు అక్కడ బాగా లేదు, నేను వెళ్ళను" అంది డాలీ. "నువ్వు చదువుకోకపోతే పెళ్ళిచేసుకో, పెళ్ళి చేసేస్తాను" అన్నారు షా. డాలీ షా కాళ్ళమీద పడిపోయి "పెళ్ళిమాత్రం వొద్దు నాకు పెళ్ళి చెయ్యకండి" అని ఏడ్చింది. అప్పటి నించి డాలీని బసవ

రాజుగారి దగ్గర చదువుకి పెట్టారు. షా దగ్గర సంగీతం నేర్చు కునేది. డాలీ కంఠం ఎంతో బావుండేది. డాలీ పాడుతోంటే సన్నటి తీగమోగు తున్నట్లుండేది.

పి. నారాయణమూర్తిగారు వారి కుటుంబాన్ని అరుణాచలంలోనే వుంచారు. చలంగారు devotion (భక్తి)లో వున్నప్పుడే వుత్తరాలు రాసేవా రాయన. ఆయనకి చలంగా రంటే ఎంతో భక్తి. ఆయనకి ఇద్దరు కూతుళ్ళు. పెద్దమ్మాయి పేరు పరమేశ్వరి. ఆ అమ్మాయికి పోలియో వచ్చింది. చిన్నమ్మాయి పేరు శ్యామల. "మీరు వెంటనే Birthcontrol operation చేయించు కోకపోతే నాకు ఇంక ఉత్తరాలు రాయకండి" అని చలంగారు గట్టిగారాశారు. దాని కాయన "ఆపరేషన్ చేయించు కుంటాను, పిల్లల్ని కననండి" అని చలంగారికి వుత్తరం రాశారు. ఆయన పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయించు కున్నారు. చలంగా రాయనకి "మీకు ఈశ్వరుడిలో విశ్వాసం వుంటే ఆయన మీ ఆరోగ్యం సంగతి చూస్తారు" అని రాశారు. ఆయన ఈశ్వరుడి యెడల తమ విశ్వాసాన్ని ప్రకటిస్తూ పుత్తరం రాశారు. ఆ అమ్మాయికి విభూతి పంపించి, భగవాన్ పటానికి నిత్యం నమస్కారం చేయించ మని పుత్తరం రాయించారు ఈశ్వరుడు. పెద్దపిల్ల భగవాన్‌కి నమస్కారంచేసి విభూతి పేసుకుంటూ వుంటే చిన్నపిల్ల తానుకూడా వెళ్ళి భగవాన్‌కి నమస్కారం చేసేది.

నారాయణమూర్తిగారికి చిత్తూరు బదిలీ అయింది. ఆయన చలంగారితో "మా కుటుంబాన్నంతా తీసుకువొచ్చి తిరువన్నామలైలో మీ దగ్గరే వుంచుతా నండి" అని చెప్పి ఆయన కుటుంబాన్ని Bose compound లో gate house లో వుంచారు. ఆయనకి ఇద్దరు భార్యలు, లక్ష్మి, సీత. లక్ష్మి పిల్లలే ఆ ఇద్ద రాడపిల్లలు. సీతకి

పిల్లలు లేరు. సీత టీచర్. అప్పట్లో వాళ్ళందరేకాక పద్మనాభస్వామి గారి అబ్బాయి ఆంజనేయులు చలంగారు వాళ్ళతోనే వుండేవాడు. ఆంజనేయులికి చదువు సరిగ్గా రావడం లేదని వాళ్ళ నాన్నగారు అతన్ని ఇక్కడ వొదిలిపెట్టి వెళ్ళారు. అతనికి చదువు రాకపోవడం తెలివితక్కువవల్ల కాదు. అతని అశ్రద్ధే దానికి కారణం. ఇక్కడ చలంగారు, బసవరాజుగారు అతన్ని డిసిప్లిన్‌లో పెట్టేసరికి ఎంతో శ్రద్ధతో రాత్రులకు రాత్రులు మేలుకుని చదివేవాడు, అతనికి అన్ని విషయాల్లోనూ డాలీతో పోటీ. దాంతో డాలీకన్నా బాగా చదవాలని పట్టుపట్టి చదివేవాడు.

పరమేశ్వరిని ఎనిమిదేళ్ళవరకూ అడ్డాలలో చిన్నపిల్ల లాగ ఎత్తుకు తిప్పేవారట తల్లిదండ్రులు. ఆ అమ్మాయి మూతి ఒకపక్కకి వంకరపోయి వుండేదట. ఈశ్వర విభూతి వేసిన తరువాత ఆ వంకర పోయింది. తరువాత నడవడంకూడా ఆరంభించింది. కాని నడక అదో విధంగా వుండేది. ఆ అమ్మాయి వొళ్ళు సరిగా **form** కాలేదు. మాట ముద్దగా వొచ్చేది. ఇక్కడికి వొచ్చాక ఈశ్వరుడు ఆ అమ్మాయి నాలికకి ఒక ఎక్సర్‌సయిజ్ చెప్పి చేయించారు. అప్పటినించి చాలా మెరుగయింది ఆమె మాట. ఆ అమ్మాయికి ఆసనాలు, చదువు, సంగీతం ఏర్పాటు చేశారు ఈశ్వరుడు. ఎంత అందమో ఆ అమ్మాయిలో. చిన్నపిల్ల శ్యామల ఎంతో తెలివైన పిల్ల, చాలా హుషారు, చురుకు. ఆమె అందరికీ చాలా ఇష్టురాలైపోయింది. ఆ పిల్లలకోసం రమణ స్థాన్‌లో చిన్న స్కూలు తయారయింది.

ఆదివారం, ఆదివారం రిక్రియేషన్ క్లాస్ జరిగేది. ఏదో ఒక ఇంటరెస్టింగ్ **subject** చెప్పుకోవడమో, నాటకాలు వేయడమో, ఓ కథ చెప్పుకోవడమో రిక్రియేషన్ క్లాస్‌లో వుండేవి.

చలంగారు, నర్తకి— రమణస్థాన్‌లో (పకపక, వజీర్, షౌ తప్ప) మిగిలిన వాళ్ళంతా ఆ క్లాసుకి హాజరు అయ్యేవారు. తెలిసిన కథల్నే అప్పటి కప్పుడు నాటకాలు ఆడేవారు. ఆ నాటకాల్లో, లక్ష్మి, సీత, ఆంజనేయులు, డాలీ, నర్తకి, చలంగారు, బసవరాజుగారు అందరికీ పాత్రలు వుండేవి. ఎక్కువ మాటలు వున్న పాత్రల్ని చలంగారు వేసేవారు. డ్యాన్సు సీను లేమయినా వొస్తే, పిల్లలు డ్యాన్సు చేయడానికి సిగ్గుపడితే వాళ్ళకి బదులుగా చలంగారు డప్పు పట్టుకుని డ్యాన్సు చేసేవారు. అప్పట్లో ఎవరో చలంగారికి జబ్బుగా వుందని చూడడానికి వొచ్చారు. కానీ వాళ్ళు వొచ్చేసరికి కంజీరా పట్టుకుని డ్యాన్సు చేస్తున్న చలంగారిని చూసి వాళ్లు ఆశ్చర్యపోయారు.

ఒక్కొక్కసారి ఫ్యాన్సీడ్రెస్సులు వేసేవారు. ఒకోసారి వంటలు చేయడం గురించో ఏదో ఒక ఆసక్తికరమైన అంశంగురించో మాటలాడుకోవడం జరిగేది ఆ రిక్రియేషన్ క్లాసులో.

ఆంజనేయులు, డాలీ కలిసి ఎంత అల్లరి చేసేవారో! ఆంజనేయులు సంగీతం నేర్చుకునే వాడు. అతనిది మంచి కంఠం. భజన్లలో నాట్యం చేసేవాడు. ఆడవాళ్ళు చేసే పనులన్నీ అతనూ చేసేవాడు. ఏ పనైనా అతను చేసినంత బాగా ఆడపిల్లలు కూడ చెయ్యలేరు. ఆ రోజుల్లో వంటింట్లో నర్తకికి కుడిభుజం ఆంజనేయులు. అతను ముగ్గులు కూడ ఎంతో గొప్పగా వేసేవాడు. పాతడొక్కు హార్మోనియం తీసుకుని వాయించేవాడు. ఇంట్లో భరించ లేమంటే, బైటికి తీసుకుని వెళ్ళి చింతచెట్టు దగ్గర పెట్టుకుని వాయిస్తో, పాడుతో వుంటే చుట్టూ జనం చేరేవారు.

మూర్తిగారని ఒకాయన రమణస్థాన్‌లో వుండేవారు ఆ రోజుల్లో. ఆయన కొన్నాళ్లు సినిమాలలో డైరెక్టింగ్ చేశారు. ఆయన జాతకంలో

'కర్పణి' అని చాలా చెడ్డదశ వొచ్చింది. ఆ దశ వొచ్చినప్పటి నించి, ఆయన చాలా పెద్ద దెబ్బ తిన్నారు. ఏ దిక్కూ తోచక తిరువన్నామలై వొచ్చేశారు. "ఇలాంటి చెడుదశ నాకు వొచ్చింది. ప్రపంచంలో వుంటే ఏమయిపోతానో: అందువల్ల ఇక్కడే వుంటాను" అని చలంగారితో చెప్పి రమణస్థాన్‌లో వుండిపోయారు. ఒకరోజు ఆయనకి విరోచనాలు పట్టుకున్నాయి. ఆంజనేయులు guest house లోనే వుండేవాడు. మూర్తిగారికి అతనెంత సేవచేశాడో: రమణస్థాన్‌నించి జావ తీసుకువెళ్ళి ఆయనకి చెంచాతో తాగించేవాడు. నీరసంవల్ల ఆయన లేవలేకపోతే, చెయ్యి సాయం ఇచ్చి నిలబెట్టి పాకీదొడ్డికి తీసుకు వెళ్ళేవాడు. ఆయన కవసరమైన సహాయమంతా ఆంజనేయులే చేసేవాడు.

నారాయణమూర్తిగారి కుటుంబం రాకముందు రమణస్థాన్‌లో 'సుమ' అనే అమ్మాయి వుండేది. ఆ అమ్మాయి రమణస్థాన్‌లో వున్న పిల్లలకి హిందీనేర్పేది. సుమ పెద్ద కుటుంభం నించి వొచ్చింది. ఆమె తండ్రి ఢిల్లీలో పెద్ద ఆఫీసరు. ఆమె ఇంటినించి వచ్చెయ్యడానికి పెద్ద కారణం ఏమిలేదు. కట్టు బట్టల్తో ఇంటినించి రమణస్థాన్‌కి వొచ్చేసింది.

రమణస్థాన్‌లో పిల్లల్ని కొట్టకూడదని నియమం. ఆ ఎడ్వాంటేజ్ తీసుకొని సుమని ముప్పుతిప్పలు పెట్టేవాడు ఆంజనేయులు. ఆ అమ్మాయి పాఠం చెప్పేటప్పుడు 'కురిసీ' అనమంటే 'గుర్సీ' అనేవాడు "ఎందుకిట్లా అంటున్నావు" అని ఆ అమ్మాయి అడిగితే "మా స్కూల్లో ఇట్లానే చెప్పారు" అనేవాడు. షాతో complain చేసేది సుమ. షా ఆంజనేయుల్ని కోపపడాల్సి వొచ్చేది.

సుమకి వంట రాదు. ఆమెకి జీవితంలో వంట చేయవలసిన అవసరంకూడా రాలేదు. అట్లా అల్లారు ముద్దుగా పెరిగింది. సుమకి ఆంజనేయులుకి చపాతీలు చేసేపని పడింది. వాళ్ళు చేసిన చపాతీలు

తోళ్ళలా సాగేవి. అందువల్ల చలంగారు వాళ్ళిద్దరికి 'లెదర్ మర్చంట్స్' అని పేరు పెట్టారు.

సుమలాంటి అమ్మాయిలు నిష్కారణంగానో, ఇళ్ళలో చెప్పో, చెప్పకో, ఆశ్రమజీవితం గడపాలనో రమణస్థాన్ కి కట్టు బట్టల్తో వొచ్చేసేవారు. నర్తకీ, పకపక ఇచ్చే చీరలు కట్టుకుని చాపమీద దిండు కూడా లేకండా పడుకునేవారు. వాళ్ళ ముఖాల్లో ఎక్కడా మేం కష్టపడు తున్నాం అన్న ఫీలింగ్ కనపడేది కాదు. ఏ విషయంలోను వాళ్ళు **complain** చేసేవారు కాదు. వారంతా నర్తకికి సఖులై పోయేవారు. సుమ ఆగష్టు 15కి తిరిగి వాళ్ళ వాళ్ళ దగ్గరికి వెళ్ళిపోయింది. అక్కడి నించి ఇంగ్లాండు వెళ్ళిపోయింది. ఇంగ్లాండునించి చలంగారికి వుత్తరాలు రాస్తూ వుండేది.

సీతగారు వాళ్ళు ఓ చిన్న కుక్కపిల్లని తీసుకుని వచ్చారు. అది సిల్క్ హౌండ్ జాతికుక్క చాలా అందంగా వుండేది. వాళ్ళు ఆ కుక్కని వెంటబెట్టుకుని రోజూ షికార్లకి వొచ్చేవారు. అప్పట్లోనే చలంగారు జగ్గారావుగారికి రాసిన వుత్తరాలను ప్రచురణ నిమిత్తంగా **edit** చేసేవారు.

ఈ హడావిడులన్నీ చాల వన్నట్లు కృష్ణ వొచ్చింది. అంతకు మునుపు కృష్ణ భర్త 'పరుచూరి' చలంగారి గట్టి **admirer**. పరుచూరి అరుణాచలం సందర్శన అనుభవాలను వారి మాటల్లోనే విందాం.

"స్వతంత్ర, వీణ సంచికల్లో వొచ్చే చలంగారి రచనలకోసం— ప్రతీవారమూ ఒక ప్రియుడికోసం చూసే ప్రేయసిలాగ ఎదురు చూసే వాడిని— యవ్వనపు తొలిరోజుల్లో. ఎప్పుడైనా చలంగార్ని చూస్తానా? వారితో మాట్లాడ గలుగుతానా? అనుకుంటూ వుండేవాడిని. చలంగారు అరుణాచలం రావడం, ఈశ్వరుడిలో విశ్వాసం నిలుపు కోవడం కొంత

విడ్డూరంగా విమర్శనీయంగా feel అయ్యేవాడిని. చివరికి ప్రయత్నించి ప్రయత్నించి చలంగారి దర్శనం కోసం అరుణాచలం వొచ్చాను. చలం రమణాశ్రమంలోనే వుంటారని Bus stand నించి రమణాశ్రమానికి వొచ్చాను. భగవాన్ సమాధి ముందు ఇద్దరు యాభై ఏళ్ళు దాటిన వారు కూచుని వున్నారు. నాకు లోపల నించీ చలంగారు వాళ్ళిద్దరిలో ఒకరని తోచింది. చలంగారే నన్ను ప్రేమగా పలకరించి ఇంటికి తీసుకు వెళ్ళారు. అప్పట్లో వారు మహాస్థాన్‌లో ఒక ఇంట్లోఉండేవారు. చలంగారితో రోజంతా చర్చోపచర్చలతో గడిపేవాడిని. సాయంత్రం హోటలుకి వెళ్ళిపోయే వాడిని.

సౌరిస్‌కి అప్పటికే ఈశ్వర సాక్షాత్కారం జరిగింది. అప్పట్లో నాకు సౌరిస్ అంటే తెలుగులో గొప్ప రచయిత్రిగా గౌరవం. అడపా తడపా అరుణాచలం వొచ్చి పోతూ వుండే వాడిని. కాలక్రమేణా చలంగారి ప్రభావం కన్నా సౌరిస్ ఈశ్వరశక్తి ప్రభావం నా జీవితంలో పనిచేస్తూ వొచ్చింది. ఈనాడు నా దృష్టిలో సౌందర్యానికి, సత్యానికి ఆకృతి వుంటే అది సౌరిస్ అనీ, ఆశ్రమ మంటే రమణస్థానే నని గట్టి విశ్వాసం.

జీవితంలో ఎన్నో అనుభవాల నించి తెలుసుకున్నది ఒకటే— ఏ యోగమైనా, తపస్సయినా- సృష్టిలో సహజత్వానికి, స్వచ్ఛతకి దగ్గరచేసే విధానం. అందు కెన్నో విధానాలు వున్నాయి. వాటిల్లో సౌరిస్ చూపిన దివ్యమైన ప్రేమతపస్సు ముఖ్య మయింది. అందర్నీ తన సొంతంలాగ ప్రేమించుకునే విశాలదృష్టిని పెంచుకోవడం. హృదయం విశాలమైన కొద్దీ అదే ఈశ్వరనికేతనం. ఈ విశాలవిశ్వం మనలో అంతర్భాగం అవుతుంది. మనమే సమస్తానికి కేంద్రం అవుతాం. దానికి ప్రేమే ఆధారం, అదే సౌరిస్ నించి మౌనంలో నేను పొందిన వుపదేశం."

పరుచూరి వొస్తూ పోతూ వుండేవారు. పకపక పెళ్ళికి చలం గారూ వాళ్ళు ఎవర్నీ పిలవలేదు. ఆ విషయాన్ని ఆయనే తెలుసుకుని ఆయనంతట ఆయనే పెళ్ళికి వొచ్చారు. పకపక వాళ్ళతో వేలూరుదాకా వెళ్ళి, అక్కడినించి వాళ్ళవూరు వెళ్ళారు. పెళ్ళిన నెలరోజులకి ఆయన వుత్తరం రాశారు చలంగారికి. "నేను పెళ్ళి చేసుకోనని గట్టి నిశ్చయంతో వుండేవాడిని. కానీ వజీర్ పకపకల పెళ్ళి ఎంత గొప్పగా వుందో. అందుకనే నేనూ పెళ్ళి చేసుకోవాలని నిశ్చయించుకున్నాను. కాన్వెంట్‌లో పనిచేస్తున్న నా మేనకోడల్ని అడిగాను. ఆవిడ ఒప్పుకొంది. నేను పెళ్ళి చేసుకో బోతున్నాను" అని.

ఆయన మేనకోడలే కృష్ణ. ఆయనద్వారా ఈశ్వరుడ్ని గురించి విని కృష్ణకి ఈశ్వరుడి మీద ఎంతో భక్తి ఏర్పడింది. తానూ ఇక్కడికి రావాలని కుతూహల పడింది. ఆయన కృష్ణని తీసుకు వొచ్చారు. కృష్ణకి ఇక్కడ ఎంతో బాగుంది. తా నిక్కడే వుండిపోతా నంది. ఆయన ఎంతో సంతోషంతో ఒప్పు కున్నారు.

అప్పటినించి కృష్ణకూడా రమణస్థాన్ హడావిడిలో చేరింది. పిల్లలందరికీ కృష్ణ లెక్కలు చెప్పేది. రిక్రియేషన్ క్లాసులో "చింత గింజ చిక్కింది చిన్నవ్వకూ" అనే పాట పాడేది. ఆ పాటకి అందరూ కృష్ణతోసహా గంతులు వేస్తూ డ్యాన్సులు చేసేవారు.

అప్పట్లోనే భూపతి వొచ్చారు. గుడిపూడి ప్రాంతాలనించి అందరి కన్నా ముందుగా రమణస్థాన్‌కి వొచ్చినవారు భూపతి. అతను హైస్కూల్లో చదువుతున్న రోజుల నించీ చలంగారికి వుత్తరాలు రాసేవారు. చలం ఆరాధకులుగా వొచ్చిన అతను ఈశ్వరచరణాలకు జీవితాన్ని అంకితం చేసుకున్నారు. భూపతి భక్తి మౌనభక్తి. అతనికి ఈశ్వరుడి పట్ల అచంచల విశ్వాసం.

భూపతి వొచ్చిన రోజుల్లోనే ఒకాయన భార్య చనిపోయి, శ్మశాన వైరాగ్యంతో రమణస్థాన్‌కి వొచ్చేశారు. ఆయన తిరుపతిలో M. Sc. చదివి వొచ్చారు. ఆయినే డాలీ వాళ్ళకి సైన్సు మాష్టారు. ఆ సైన్సు మాష్టారు ఇక్కడే వుండిపోవా లనుకున్నారు. కానీ నిలువలేక త్వర లోనే తిరిగి వెళ్ళిపోయారు.

భూపతి చిన్నగెడ్డంకూడా పెంచారు ఆ రోజుల్లో. అస లీలోకం ఏమీ పట్టనట్లు కూచుండేవారు. చలంగారు భూపతిని చూపుతూ "ఈయనే ముందు ఆశ్రమవాసిలా వున్నాడు" అన్నారు. అప్పటినించి భూపతి ఇప్పటివరకూ వొస్తూనే వున్నారు. ఈశ్వరకటాక్షం దొరికిన వారు పథభ్రష్టులు కారనే భూపతి విశ్వాసం అతన్ని శాంతిలో ఆనం దంలో నిలిపింది.

లక్ష్మిగారికి చలంగారు ఆషుబాబు అని పేరు పెట్టారు (శరత్ 'శేషప్రశ్న' నవలలో ఒక పాత్ర) ఆవిడ చాలా లావు. ఆమెకూడా గొప్ప వుత్సాహంతో నాట్యాలలో చేరేది. అప్పటినించి నాటకాలలో కృష్ణకూడా పాల్గొనడం మొదలు పెట్టింది.

సెప్టెంబరు నెలలో ఒకరోజు రమణస్థానీయు లంతా షికారుకి వెళ్ళారు. కొండదగ్గర పెద్దమైదానంలో కూచున్నారు. అందరికంటె ముందు చలంగారు ఆకాశంవైపు తలెత్తి చూశారు. సూర్యుడు సరిగ్గా పడమటికి వెళ్ళినప్పుడు ఆకాశంలో పశ్చిమం నించి తూర్పుదిక్కుకి పూర్తిగా ఆకాశాన్ని ఆక్రమించుకుని ఈ చివరనించి ఆ చివరివరకు ఎర్రటి చార. అరుణాచలం కొండమీద నించి దక్షిణానికి వెలిగిపోతూ ఒక తెల్లని చార - గొప్ప వెలుగుతో - పెద్ద శిలువ రూపంలో - కని పించాయి. అందరూ ఆ క్రాస్ వైపే కళ్ళార్పకుండా చూస్తూ కూచు న్నారు.

ఎందుకట్లా కనబడుతోందో, ఏ విధంగానూ ఎంత వెతికినా కారణం కనపడలేదు. ఒక్క బైబిల్‌లో చెప్పిన 'ఆ రోజులలో మీరు విచిత్రమైన వన్నీ ఆకాశంలో నా చిహ్నాలుగా చూడబోతున్నా' రన్న వాక్యం తప్ప దానికి ఆధారం కనపడలేదు వారికి. సూర్యుడు పశ్చిమానికి క్రుంకేదాకా ఆ క్రాస్ అలాగే వుంది. సూర్యుడు క్రుంకేక కూడా చాలాసేపు కనిపించింది. తరువాత ఆ క్రాస్ మెల్లగా ఆకాశంలో కరిగి పోతూ అదృశ్య మైపోయింది. అంతసేపూ గొప్ప వెలుగులో క్రాస్ కనపడు తున్నాగాని మనుషులు తల వొంచుకు రోడ్డుమీద పోతూనే వున్నారు. ఆ మైదానంలో కూచున్న కొద్దిమంది రమణస్థానీయులే ఆ క్రాస్‌ని చూశారు.

ఇంతకి మునుపు జిన్నూరు నించి రంగరాజుగా రనేవారు తమ తమ బంధువులతో కలిసి చలంగార్ని చూడటానికి ఒక వేన్‌లో వొచ్చారు. వారు చలంగారి 'బుజ్జిగాడు' చదివి ఆ పుస్తకంలోని అరుణాచలం వర్ణనల వలన ఆకర్షింపబడి అరుణాచలం వొచ్చారు. తరువాత జిన్నూరు నించి రాజు లెందరో రమణాశ్రమానికి రావడం మొదలు పెట్టారు. వారంతా చలంగారిని చూడటానికి వొచ్చేవారు.

ఒకసారి రంగరాజుగారు తమ పినతల్లితో కలిసి వొచ్చారు. ఆయన 'అనాసక్తి'లో వుండేవాడు. ఆయన పిన్నిగారు నర్తకి వాళ్ళం చరితో రమణస్థాన్‌లో ఒకరిగా కలిసిపోయారు. రమణస్థానీయు లందరు ఆమెని మామ్మగారు అని పిలిచేవారు. మామ్మగారంటే ఇంటిల్లిపాదికి ప్రేమ ఏర్పడింది. ఆమె "నాకిక్కడే వుండిపోవాలని వుంది. ఇక్కడే వుండిపోతా నమ్మా!" అన్నారు షౌతో. "ఇక్కడ వుండదలుచుకుంటే ముందుగా ఈశ్వరుడికి అర్పించుకోవాలి!" అన్నారు షౌ. "అలాగే అందుకు సిద్ధంగా వున్నాను" అన్నారు మామ్మగారు. "అట్లాగే మీ

భర్త గారి దగ్గరికివెళ్ళి వారి అనుజ్ఞ తీసుకుని రండి" అన్నారు షా. ఆయన అనుజ్ఞ ఇవ్వలేదు. మామ్మగారు జిన్నూరులోనే వుండిపోయారు కాని అడపా తడపా రమణస్థాన్‌కి వొచ్చి ఈశ్వరదర్శనం చేసుకుంటూనే వున్నారు.

దీపోత్సవానికి కొద్దిరోజులు ముందు ఒకరాత్రి భజన అవంగానే ఒక పిచ్చికుక్క బోస్ కాంపౌండ్‌లో ప్రవేశించింది. అప్పట్లో సీతగారు లక్ష్మిగారు వాళ్ళపిల్లలు ఇంటిలోపల వుక్క భరించలేక ఆ చలి రోజుల్లోగూడా బయటే పడుకునేవారు. కాంపౌండ్‌లోకి వచ్చిన పిచ్చి కుక్క సీతగారు వాళ్ళ కుక్కమీద పడింది. తరువాత అది ఎటో వెళ్ళి పోయింది. రమణస్థాన్‌లో అందరూ "మీ కుక్కని పిచ్చికుక్క కరిచింది. మీకుక్కకి ఇంజక్షను చేయించండి." అని లక్ష్మిగారు వాళ్ళకి చెప్పారు. వాళ్ళు తమ కుక్కని ఆకుక్క కరవలేదన్నారు.

కొన్నాళ్ళ తరువాత చాలాసాధువైన వాళ్ళకుక్క షికార్లలో వాళ్ళమీదనే మొరగడం, కరవడానికి రావడం మొదలు పెట్టింది. ఆ మర్నాడు వాళ్ళకుక్క వాళ్ళింట్లో అందరిని కరిచింది. తరువాత వాళ్ళ దగ్గరనించి తప్పించుకొని కాంపౌండంతా తిరగడం మొదలు పెట్టింది. చాలా సేపు అట్లా తిరిగితిరిగి రమణస్థాన్‌లో ప్రవేశించి బైటవరండాలో పడుకొన్న 'లీనా' అనే చలంగారి కుక్కను కరిచి వెళ్ళిపోయింది. అక్కడితో వాళ్ళకుక్కకి పిచ్చెత్తిపోయిందని అందరికీ స్పష్టంగా తెలిసిపోయింది. అది ఎవరికీ లొంగక మీదికి వొస్తూవుంటే అక్కడే వున్న ఆర్ముగం కర్రపెట్టికొట్టి దాన్ని చంపేశాడు.

ఇంతలో లీనాకి కూడా బాగా పిచ్చెత్తి పోయింది. అప్పుడు దీపోత్సవం. రమణస్థాన్ వూరికి చివరిఇల్లు. ఆ ఇంటి వెనకాల దీపోత్సవానికి పెద్దబజారు ఏర్పడుతుంది. వెటర్నరీ హాస్పిటల్, మునిసిపల్

ఆఫీస్.... అన్ని డిపార్టుమెంటులవారు పాకలలో తమ కేంద్రాలు ఏర్పాటు చేసుకుంటారు ఈ సంవత్సరమూ మామూలుగానే జరిగింది.

లీనాకి పిచ్చెత్తినా అదితన సాధుత్వాన్ని పోగొట్టుకోలేదు. రోజూ నర్తకి లీనాని ఎత్తుకుని తీసుకుని దీపోత్సవం వెటర్నటీ బ్రాంచి హాస్పిటల్లో మందు వేయించుకొని తీసుకొని వొచ్చేది. చివరికి లీనాకి బాగా పిచ్చెత్తిపోతే ఒకగదిలో కట్టేశారు. అది చచ్చిపోయింది.

నర్తకీ వాళ్ళు సీతగారు వాళ్ళతో "చూడండి, మీకుక్క కరిచి మా కుక్కకూడా చచ్చిపోయింది. మీరింకనైనా injections తీసుకోవడం చాలా మంచిది" అన్నారు.

"ఈశ్వరుడు మమ్మల్ని injections తీసుకోమని చెప్పలేదు. ఆయన తీసుకోమంటే కానీ మేము తీసుకోము" అన్నారు వాళ్ళు. "ఇది చెయ్యండి, అది చెయ్యండి అని ఆయనెప్పుడూ ఎవరికీ చెప్పరు. మీరు injections చేయించుకుంటా నంటే ఆయన అభ్యంతర పెట్ట లేదుకదా! మీరు వెళ్ళి అడిగి చూడండి" అంది నర్తకి. వాళ్ళు వొచ్చి ఈశ్వరుడ్ని అడిగారు. ఆయన "అట్లాగే తీసుకోండి" అన్నారు. వాళ్ళందరూ ఆవిధంగానే injections తీసుకున్నారు.

1945లో అమ్మ తొలిసారిగా అరుణాచలం వొచ్చినప్పటినించి ఆమెకి మెర్‌స్టన్ చాలా గట్టి స్నేహితురాలు. ఆమె గురించి చలంగారు ఏమంటా రంటే,

"కలుసుకున్నప్పటి నించీ ఇద్దరికీ (చలంకి ఆమెకి) చాలా సన్నిహితం. అప్పటికే ఆమె ముసలిది. సంస్కారి. ఎంతో దూరదృష్టి కలది. ధనవంతురాలు English Jew వనిత. సంవత్సరానికి కోసారి అంత వృద్ధాప్యంలోనూ భూమిని చుట్టి వొచ్చేది. భగవాన్ భక్తురాలు. నీచురాలు. కపటి. ఆమె మాటలలో నాజూకు, మాధుర్యం, ప్రేమవున్నా

ఆమెకే తెలియని నటన. ఆనటన నించి తప్పించు కోవడం కష్టం. కొన్నేళ్ళనించి చలం ఆమెముఖం చూడడం మానివేశాడు— పక్క ఇంట్లో నివసిస్తో. ఆమె ముద్దుపేరు మెట్టి" అని

చలంగారి కుటుంబమంతా ఇక్కడికి వొచ్చేశాక ఆమెకి వారితో స్నేహ మైపోయింది. ఆవిడ మామూలుగా హిందూస్త్రీకి మల్లే చీరకట్టుకుని, జాకెట్టు వేసుకుని, పెద్ద కుంకుమబొట్టుతో, తలలో పూలు పెట్టుకుని వుండేది. ఆవిడ ఒంటి రంగు, ఆకారం ఆజుట్టూ, కళ్ళూ ఇంగ్లీషు మాట్లాడడం— మొదలైనవాటివలన ఆమె ఆంగ్లస్త్రీ అని తెలుస్తుంది. కానీ కూచునేపద్ధతి తీరు చాలావరకూ హిందుస్త్రీకి మల్లేనే వుండేది. అందరినీ కలివిడిగా పలకరించేది. అందరితోనూ స్నేహం చేసుకునేది. ఏదయినా సంగతి చెబితేమాత్రం లోతుగా ఆలోచించి, అర్థం చేసుకోవడానికి ప్రయత్నించి మరీ ఆవిషయాన్ని గురించి మాట్లాడేది.

చలంగారు ఆమెతో **Women's imancipation** మీద మాటలాడేవారు. ఆమె చెప్పేది "మీ దేశ స్త్రీలు కూడా పాశ్చాత్యభావనలతో పాడయి పోతున్నారు. ఆ దేశాలలో తమంత తాముగా జీవితభాగస్వాముల్ని ఎన్నిక **(choose)** చేసుకున్న వాళ్ళెవరు సుఖంగా **(happy)** లేరు. యూరోప్ ఎంత ఘోరమైన స్థితిలో వుందో మీకు తెలియదు. **Freedom** వలన ఈ దేశీయులుకూడా జీవితాన్ని పాడు చేసుకుంటున్నారు" అని తీవ్రంగా వాదించేది. ఒక్కొక్క చిన్న విషయంలో కూడా ఎంత ఇంటరెష్టు ( ఆసక్తి ) తీసుకునేదో! ప్రతీదీ ఇంటరెష్టే ఆమెకి. చాడ్విక్ చలంమీద అలిగినప్పుడల్లా ఆయనని కోప్పడి చలంగారింటికి తీసుకుని వొచ్చేది.

అమ్మ ఆమెతో తన **social work** గురించి మాటాడుతుంటే "రంగనాయకీ నిన్ను **social work** ఎవరు చేయమన్నారు. **Hindu women**కి **place** వంటిల్లే" అని కోపపడేది మెరస్టన్ అమ్మని.

మెర్‌స్టన్‌కి, షాకి క్రిస్టియన్ లిటరేచర్ (క్రైస్తవవాఙ్మయం) మీద వాదప్రతివాదాలు నడిచేవి. మెర్‌స్టన్ English Jew. ఇంగ్లాండులో settle అయింది.

ఒకరోజు ఆమె షాతో "జీసస్ భూమికి దిగివొచ్చి కొత్తగా ఏమి చెప్పలేదు. జ్యూలు వారి సంప్రదాయంలో ఆధ్యాత్మిక వేదాంతంలో గొప్ప కృషి చేశారు. అవన్నీ చదివే జీసస్ తన వేదాంతబోధ చేశాడు" అంది.

"జీసస్‌కి చదువు రాదని బైబిల్ చెబుతోంది. చదువురాని వాడు ఈ వేదాంతసత్యా లెలా చెబుతాడు — స్వానుభవంతో గాక" అన్నారు షా.

"Sowris! Read your bible again" అంది మెర్‌స్టన్. (సౌరిస్: మరోసారి బైబిల్ చదువు)

మరుసటి రోజు షా బైబిల్‌లో వున్న జీసస్‌కి చదువ రాదనే వాక్యాన్ని ఆమెకి చూపించారు.

"ఇతనికి ఈ పాండిత్య మెక్కడిది, ఈ చదువుకోని వాడికి? అని యూదులు ఆశ్చర్యపడ్డారు".

(యోహాను అధ్యాయం 7 వార్త - 15)

"ఐతే నువ్వే correct" అని హాయిగా నవ్వేసింది మెర్‌స్టన్. అటువంటి sportive spirit ఆమెది.

అప్పుడప్పుడు ప్రపంచమంతా ఓసారి చుట్టి తిరిగి అరుణాచలం వొచ్చేది. తన అనుభవాలన్నీ చలంగారు వాళ్ళతో చెప్పేది. ఇటలీ, ఫ్రాన్స్ వెళ్ళి తాను ఏమేమి చూసి వొచ్చిందో చెప్పేది.

మెర్‌స్టన్ గురువు (GURDJIEF) గుర్జీఫ్ అనే రష్యన్ మహాత్ముడు. ఆయన రష్యానించి వొచ్చి ఫ్రాన్సులో ఒక ఆధ్యాత్మిక కేం

్రదాన్ని (spiritual centre ) స్థాపించారు మెర్‌స్టన్ అక్కడ ఆయన శిష్యురాలిగా వుండి చాలాకాలం ఆ సెంటర్‌లోనే పనిచేసింది. ఆవిడ తిరగని చోటులేదు. ఆమె చూడని Personalities లేవు. ఆ తరువాత భారతదేశం వొచ్చి కాశీదగ్గర చిన్న పల్లెటూరిని గవర్నరుగా పాలించింది. దానివల్ల ఆమెకి O. B. E. అని పెద్దటైటిల్ ఇచ్చారు ప్రభుత్వం. గాంధీ దగ్గరనించి కాంగ్రెస్‌లో ముఖ్యమైన లీడర్స్ అందర్నీ, ఆధ్యాత్మిక గురువులు జిడ్డు కృష్ణమూర్తి మొదలుకొని, స్వామిరామదాసు, ఆనందమయిామా, రమణభగవాన్ వరకూ అందర్నీ దర్శించి కొంతకాలం వాళ్ళతో వుండి వొచ్చిం దామె.

ఇక మెర్‌స్టన్ హిందూమతంమీద, ఆచారాలమీద, బ్రాహ్మణ పద్ధతులమీద ఎంతైనా మాట్లాడగలదు. అదేకాక ఆమె ప్రపంచంలో చాలా cultures ని observe చేసింది. ఏ subject మీద మాటాడినా ఆ subject మీద ఆమె తనకి పరిచయ మున్నట్లుగా మాట్లాడేది. చివరికి సైకియాట్రిక్ సెంటర్లోకూడా పనిచేసిం దామె.

1960 లో Bose compound లో ఇల్లు కట్టుకోవడం మొదలు పెట్టింది మెర్‌స్టన్. కాని అప్పటినించి ఆమె చలం కుటుంబీకులతో దేనికో దానికి అకారణంగా తగవు పెట్టుకునేది. కానీ వారితో స్నేహం పొదుల్లుకో లేదు. అసలు చలం కుటుంబానికి ఎవరితోనూ విరోధం లేదు. ధర్మరాజులాగే సౌరిస్ కూడా అజాతశత్రువు. కానీ చలంగారింట్లో మిగిలిన పిల్లలకి మాత్రం ఆవిడంటే ఒళ్ళుమంట. అంతకు మునుపు చలంగారికి మెర్‌స్టన్‌కి చాలా స్నేహం. కానీ బోస్ కాంపౌండ్‌కు వొచ్చాక ఆమె ప్రతీదానికి silly గా పోట్లాడు తుండడంతో చలంమహర్షికి కూడా ఆవిడంటే గిట్టేది కాదు.

మెర్స్టన్‌కి ప్రళయంలో చాలా నమ్మకం. ఆవిడ ప్రపంచమంతా తిరిగేదిగనక ప్రపంచంలో ఎక్కడెక్కడ ప్రళయం సంగతులు చెప్పుకుంటున్నారో ఆ వార్తలన్నీ చలంగారూ వాళ్ళకి చేప్పేది ఆవిడ. రమణస్థానీయులు ప్రళయంకోసం చేస్తున్న ప్రయత్నాలన్నీ చూసి చాలా సంతోషించి, తానుకూడా సాయం చేస్తానని ముందుకు వొచ్చింది. ముందునించి తన ఇంట్లో చాలా భోజన సామగ్రిని store చేసింది. "ప్రళయ రక్షణార్థులు మీ దగ్గరకి ఎక్కువమంది వొస్తే నాదగ్గరకి పంపండి. వారి భోజనం సంగతి నేను చూసు కుంటాను" అని చెప్పింది షౌకి. అప్పటినించీ ప్రళయం గురించిన చర్చలలో ఆమె ఎంతో వుత్సాహంగా పాల్గొనేది.

ఇంతలో క్రిస్‌మస్ వొచ్చింది. చాడ్విక్ తమ ఇంట్లో భోజనం చేస్తున్నప్పటినించీ క్రిస్‌మస్‌కి చాడ్విక్‌ని, మరి కొందరు యూరోపియన్స్‌ని భోజనాలకి పిలిచేవారు చలంగారు. ఆ విధంగా క్రిస్‌మస్ జరుపుకునేవారు. ఒకవేళ చలంగారు వాళ్ళు ఆ రోజు క్రిస్‌మస్ అని మరిచిపోయినా ఆ రోజున ఎవరో ఒకరు కేక్ తీసుకు రావడమో, ఎవరో ఒకర్ని భోజనానికి పిలవడమో అప్రయత్నంగా జరిగేది.

రమణస్థాన్‌లో మొట్టమొదట క్రిస్‌మస్‌కి జీసస్ పటానికే అలంకరణ చేసేవారు. తరువాత christmas tree తయారుచేసి అలంకరించడం మొదలు పెట్టారు. పకపక బాలజీసస్, జోసఫ్, మేరీ బొమ్మలు తెచ్చింది. అవి వొచ్చినప్పటినించి ఒక పాక తయారుచేసి, చుట్టూతా ఒక కొలను, గుట్టలు, జంతువులు అన్నీ ఏర్పరిచేవారు. చివరికి క్రిస్‌మస్ రమణస్థాన్‌లో జరిగే ముఖ్యమైన పండుగగా రూపం దిద్దుకుంది. ఎంతోమంది ఆస్ట్రియన్, ఫ్రెంచి, కెనెడియన్ అమ్మాయిలు ఆశ్రమం నించి వొచ్చి జీసస్‌మీద అద్భుతంగా పాడేవారు.

ఆ క్రిస్మస్ (1961) కి కె. సభా 'జీసస్ జీవితం' ప్రతులను తీసుకుని వొచ్చారు. ఆ రోజే పాపత్త రెండు వ్యాన్లలో తన పిల్లల్ని, కోడళ్ళని, అల్లుళ్ళని, మనవల్ని— అందరినీ తీసుకుని తిరువన్నామలై వొచ్చింది.

భోజనా లయ్యాక పాపత్త "గిరిప్రదక్షిణం వెళ్దామా షా" అంది. ఆ రోజు భోజనా లయ్యాక 11 గంటలకి అందరూ గిరిప్రదక్షిణం బయలు దేరారు. రెండు వేన్లతో సహా. ఎంత బావుందో ఆ రోజు. చలంగారు వేన్‌లో కూచుని వొచ్చారు. మిగిలిన వారందరూ కబుర్లు చెప్పుకుంటూ, గిరి చుట్టూరా సరదాగా నడిచారు. మధ్యదోవలో షాకి కాల్లో పెద్దముల్లు దిగబడి బాగా రక్తం వొచ్చింది. కాని ఆమెకి ఏమీనొప్పి అనిపించ లేదు. అట్లానే నడిచారు.

ఒకచోట అందరూ ఆగినప్పుడు నర్తకి అందరికీ ఫలహారాలు పెట్టింది. షా మామూలే, గిరిప్రదక్షిణాల్లో ఏమీ తినరు, తాగరు. ఇంటికి తిరిగివొస్తూ వుండగా బసవరాజుగారి కాల్లో ముల్లు దిగింది. ఆయన కాలినించి బాగా రక్తం కారింది. సభా ఆయన స్నేహితుడు— బసవరాజుగార్ని సైకిలుమీద తీసుకుని వొచ్చారు తిరిగి వొస్తూవుండగా వజీర్, చలంగారు కార్లో ముందుగానే వెళ్ళి కేక్‌లు, ఫలహారాలు కొని ఇల్లు చేరారు. సాయంత్రం చాలా అందంగా క్రిస్మస్ సెలబ్రేషన్స్ జరిగాయి.

జయంతికి మద్రాసునించి, చిత్తూరునించి, ఎన్నో చోట్లనించి ఎంతోమంది వొచ్చారు. అప్పుడు సముద్రతీరాలకి దగ్గరున్నవాళ్ళు ఏ ఏ రక్షణకేంద్రాలకి వెళ్ళాలో ఈశ్వరు డాదేశించినట్లుగానే షా అందరికి చెప్పారు. ఆ వొచ్చినవారిలో ఒకాయన "ప్రళయం వొస్తుందని మీ రింత గట్టిగా చెబుతున్నారుకదా! ఒకవేళ ప్రళయం రాక

పోతే" అన్నారు. "ఇది రాకపోతే నేనూ వుండను. మీరు వుండరు. ఎందువల్లనంటే న్యూక్లియర్‌వార్ (అణుయుద్ధం) రాబోతోం" దని షా చెప్పారు. ఆ విధంగానే ప్రళయపుటుధృతం చాలాచోట్ల కనిపించింది. అంతేగాక చైనాతో యుద్ధం వొచ్చింది. చైనీయులు షిప్‌లో ఆటంబాంబు తీసుకువొచ్చి ఇండియామీద వేయజూస్తుంటే ఆ షిప్ సాగరమధ్యంలోనే మునిగి పోయిందని తరువాత తెలియవొచ్చింది.

జయంతినాడు, మరుసటిరోజు పాపత్త కూతురు గీత నాట్యం చేసింది. ఆశ్రమం నించి చాలామంది ఆ డ్యాన్సు చూడటానికి వొచ్చారు.

ఆ రోజుల్లో అందరికీ ప్రళయంగురించి కలలు వొచ్చేవి. ఒకసారి షా కలలో పెద్దగా వువ్వెత్తున నీళ్ళు ముందుకి పొంగుకుని వొస్తూ వున్నట్లూ, చలంగారి చెయ్యి పట్టుకుని తాము నడుస్తూ వున్నట్లూ చలంగారు 'షా, షా' అని పిలుస్తూ వుండగా ఆ ప్రవాహం తమః ఇద్దరినీ ముంచేసినట్లుగా కనిపించింది.

ప్రళయం కోసం వొచ్చిన కురంగేశ్వరరావు భార్యని ఇక్కడే కాన్పు చేయడానికని తీసుకువచ్చారు. కాని ఆవిడ ఇష్టపడక తిరిగి వెళ్ళిపోయింది.

ఇంతలో 1962 వొచ్చింది. కృష్ణని ఇక్కడ వొదిలిపెట్టినఆమె భర్త వొచ్చి, ఆమెని మళ్ళీ తీసుకువెడతా మన్నారు. కృష్ణకి వెళ్ళడం ఇష్టంలేదు. కాని ఆయన గట్టిపట్టు పట్టేసరికి ఎందుకు ఇక్కడవాళ్ళని బాధించడమని చేసేదిలేక వెళ్ళిపోయింది.

జనవరిలోనే చిత్ర తన ఇద్దరు పిల్లలతో, కడుపుతో తిరిగి వొచ్చింది (కాకా,కిట్టూ). కిట్టూ అంటే అందరికీ చాలాముద్దు. కాకాలో చాలా **individuality independence** కనబడేది. వారిద్దర్నీ ఈశ్వరు

డికి అప్పజెప్పేసింది చిత్ర. చిత్ర, పకపక చెరోపూట వంటపనిని పంచుకున్నారు. నర్తకి పిల్లల్ని చూసుకునేది.

సాధన చేస్తామని రమణస్థాన్‌కి వొచ్చినవారికి చిత్ర పిల్లల్ని అప్ప జేప్పేవారు షౌ. ఆపిల్లల్ని చూసుకోవడమే గొప్పసాధన వాళ్ళకి.

పోలేపెద్ది సుబ్బారావుగారు అంతకు ముందునించి వుత్తరాలు రాస్తున్నారు— "వెంకట చలం నిన్నోసారి చూడాలని వుంది" అని. ఇంక కురంగేశ్వరరావుకి వెంకటరత్నంగారికి ఆంధ్రదేశంలో వున్న నలుగురైదుగురు మిత్రులకి ఎంత స్నేహమైపోయారోఆయనఅప్పట్లో. ఆయన ఆరోగ్యం బాగాలేదు. కురంగేశ్వరరావు ఆయన్ని వెంటబెట్టుకుని మద్రాసుదాకా రైల్లో, అక్కడనించి టాక్సీలో తిరువన్నామలై తీసుకు వొచ్చారు. ఆయన షౌని చూసి చాలా సంతోషించారు.

తమ స్నేహితుడ్ని చూసి సుబ్బారావుగారి సంతోషానికి మేర లేదు. వాళ్ళ అమ్మగారు "సౌరిస్ చాలా గొప్పస్థితిలోకి వొచ్చిందని'' ఆయన చెప్పగానే— 'అవునురా నాకేం ఆశ్చర్యం లేదు. చిన్నప్పటి నించీ తనని భగవాన్‌కి ఇచ్చేసుకుంది. అందుకనే ఆవిడకి అంతస్థితి వొచ్చింది. చిన్నప్పుడు ఆధ్యాత్మికదృష్టి రానిదే పెద్దయాక సాధన చెయ్యడం చాలా కష్టం" అన్నారట.

సుబ్బారావుగారు కూడా ప్రళయంలో ఇంట రెష్టు తీసుకున్నారు. "ఔను నిజమే కొత్త కొత్త **stars** ఇప్పుడు కనిపిస్తున్నా యంటున్నారు సైంటిస్ట్సు" అన్నారు. ప్రళయం మూడురోజులు ఆయన అరుణాచలం లోనే వున్నారు. తరువాత కురంగేశ్వరరావుతో కలిసి ఆంధ్రదేశం వెళ్ళిపోయారు.

ఆంజనేయులి తల్లి తండ్రి పల్లూరి వెడుతున్నారు, "ఏం ఆంజనేయులు నీకు మీనాన్న వాళ్ళతో వెళ్ళాలని వుందా?" అని అడిగారు

షా. "లేదు, నే నిక్కడే వుంటా" నన్నాడు ఆంజనేయులు. ఆ తరువాత అందరూ వెళ్ళిపోయారు.

కె. సభా వలన రామానంద ఆశ్రమ స్వామికి షా గురించి తెలిసింది. షా ప్రళయరక్షణకి కొంతమందిని వాళ్ళ ఆశ్రమానికి పంపితే వాళ్ళందరికీ ఎంతో ఆదరంతో తమ ఆశ్రమంలో రక్షణ నిచ్చారు వారు. ఒకసారి ఆ స్వామిజీతో బాటు అన్వర్ అనే ఆయన అరుణాచలం వొచ్చారు. స్వామీజీకి వారి ఆశ్రమంలో, గుడిలో, ఆ మండపం పరిసరాల్లో షా తిరుగుతూ వున్నట్లుగా కనిపించారట. అందువలన ఆయన షా తమ ఆశ్రమానికి ఒకసారి రావాలని పట్టుబట్టారు. "నేను అక్కడే తిరుగుతున్నాను కదా! వేరుగా నేను రావాల్సిన పనేముంది?" అన్నారు షా. "అమ్మ నెట్లాగైనా తీసుకుపోతాను" అని అన్వర్ పట్టుబట్టారు. మిగిలిన వాళ్ళంతా "ఆమె ఎక్కడికీ వెళ్ళరు. ఆమెని బలవంతం చేయకండి" అని ఆయనకి నచ్చజెప్పి వాళ్ళని పంపించేశారు.

1962 లో రాబోయే ప్రళయం గురించి ప్రపంచ మంతటా అంతర్కితమే చర్చలు ముమ్మరంగా సాగుతున్నాయి. ప్రళయం గురించి చలంగారు రాసిన లేఖ లివి.

"ఈశ్వరుడు నిన్న సుందరేశంగారితో 'అవును, ప్రళయం రాబోతోంది. కాని నేను అది 62 లో అనలేదు. వీళ్ళు అంటున్నారు' అన్నారు." (శాస్త్రిగారికి చలంగారి లేఖ 7-4-58)

"నిన్న ఈశ్వరుడు మాట్లాడారు. ప్రళయం కాలాన్ని గురించి-పర్యవసానం-

"నేను 1962 అని చెప్పను కాని 1962 ఎందుకు కాకూడదు? మీరు ఏవో లెఖ్ఖలు వేశారుగా? అవి తప్పిపోతాయి. పోనీ 1962 మాత్రం

ఎందుకు కాకూడదు?" అని ఇంకా అన్నారు. "నేను ఏ తారీఖో చెప్పేస్తే, మీరు అందరికీ చెప్పేస్తారు. అప్పుడు జాగ్రతపడి దుర్మార్గులంతా తప్పుకుంటారు" అన్నారు. నేనన్నాను మొహంమీద స్పష్టంగా తారీకు గంటలతోసహా చెప్పినా ఎవరు నమ్ముతారు. అనాదినించి అంతా తెలిసికూడా ఎవరు తప్పించుకో గలిగారు అన్నాను."

"ఔను" అన్నారు అంతే.

.... .... .... .... .... .... ....

ఈ నెల భారతి చదవండి. యస్వీ 1987 ప్రళయం అని ఏ లెక్కలవల్ల రూఢీ చేశాడో చూడండి. మనం వాటిని 1962కి అన్వయిద్దాము." (శాస్త్రిగారికి చలంగారి లేఖ 11-4-58)

ప్రపంచ మంతా ప్రళయం ప్రళయం అని ఘోష పెడుతోంది. చలంగారికి ఎందుకీ గొడవలంటే ఆయన ఎవరి దుఃఖాన్నీ ఆర్తిని భరించలేరు. ఈశ్వరకాంతితో తనని విశ్వసించిన వారినైనా కనీసం ఈ ప్రమాదం నించి తప్పించాలని ఆయన ఆరాటం. దీనుల యెడల, ఆర్తుల యెడల, అసహాయుల యెడల ఆయనకి వల్లమాలిన జాలి. అదే ఆయనని ప్రళయం విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకునేలా చేసింది.

షాలో అప్పటి కింకా చెరిగీ చెరగని వ్యక్తిత్వం వుంది. ఏదన్నా మాట్లాడి నప్పుడు ఆ వాక్కు ఈశ్వరుడిదో, షాదో, చలంగారు, శాస్త్రిగారు గుర్తించలేక ఆ **confusion** లో షా వాక్కుని ఈశ్వరవాక్కుగా తీసుకున్నారు. రక్షణ ఏర్పాట్లకి మాత్రం ఈశ్వరుడే షాకి చెప్పి చేయించారు. ఈశ్వరుడు ప్రళయం 1962 లో వొస్తుందని మాత్రం ఎన్నడూ చెప్పలేదు.

కాలం కదిలింది. 1962వ సంవత్సరం వొచ్చింది. అది ఫిబ్రవరి నెల. తమకి ఈశ్వరు డిచ్చిన ఆదేశాల ప్రకారం అందరూ ఏ ఏ కేంద్రాలకి వెళ్ళాలో ఒక పొల్లు పోకండా ఆ ప్రకారమే చేశారు—విశ్వాసులు.

కురంగేశ్వరరావు, కృష్ణారావు, నరసింహస్వామి మొదలైన నలుగురు రక్షణకి అరుణాచలం వొచ్చారు. మంత్రవాది లక్ష్మిగారి మరిది ఇక్కడికే పెద్దకుటుంబంతో వొచ్చి వేరే ఇల్లు అద్దెకు తీసుకుని వుంటున్నారు. లక్ష్మిగారు, వెంకటరత్నంగారు వొచ్చి వాళ్ళతోనే వుంటున్నారు. శాస్త్రిగారు చిత్తూరులో కె. సభా ఏర్పాటుచేసిన రక్షణ కేంద్రానికి వెళ్ళారు. పద్మనాభస్వామిగారు పల్లూరు రామానందాశ్రమానికి వెళ్ళారు.

ఏడవ తేదీన భజన పూర్తయినాక షా అక్కడే కూచుని వున్నారు. అందరూ ఆమె చుట్టూరా కూచుని వున్నారు. ఆమె కళ్ళ ముందొక పెద్ద దృశ్యం కనబడుతోంది. వువ్వెత్తున అలలతో ముందుకి పొంగుకు వొస్తున్న సముద్రం .... ఆ సముద్రంవొడ్డున మఠాధిపతులు పెద్ద పెద్ద సన్యాసులు అంతా కూచుని హోమాలు చేస్తున్నారు. ఉత్తుంగ తరంగాలతో వురకలు వేసే సముద్రానికి అడ్డుగా ఎంతో పెద్ద త్రిశూలం నిల్చుని వుంది. సముద్రంలో ఒక తెల్లని లాంచీ తేలుతోంది. దానిమీద "చలం" అనే అక్షరాలు కనిపించాయి. రమణస్థాన్‌కి రక్షణకోసం వొచ్చిన వారందరూ ఆ లాంచీలో వున్నారు. షా కాసేపు అలాగే కూచుని తమ గదిలోకి వెళ్ళిపోయారు.

ఆమె కనులముందు రాత్రంతా అదే దృశ్యం కదలాడింది. ఆ సముద్రం ముందుకి పొంగుకొని రావడం. ఆ త్రిశూలం అడ్డుప

డం —— —— ఆ force అంతా ఆమెకి తెలుస్తోంది. ఆ సముద్ర వేగం, వుధృతం ఆమె లోపల ఆమెకి స్పష్టంగా తెలుస్తున్నాయి.

ఆ రాత్రి చలంగారికి గండమని ఆమెకి స్పష్టంగా తెలుసు, చలంగారిని కంటికి రెప్పలాగ కాపాడుకుంటూ ఆమె ఆ రాత్రంతా మేలుకునే వున్నారు. ఆమె కనుల ముందు భయంకరంగా గర్జిస్తూ ముందుకి వురకలువేస్తూ పరవళ్ళుతొక్కే సముద్రం అవిరామంగా కనిపిస్తూనే వుంది.

మరుసటి రోజున జవహర్ నించి వుత్తరం వొచ్చింది. "విశాఖ పట్టణం అంతా పట్టపగలే కటికచీకటి ఆవరించింది. సముద్రంముందు కుప్పొంగు తోంది. ఏం జరుగుతుందో చూడాలి అని రాశారాయన. జవహర్ రక్షణ తీసుకోలేదు. విశాఖపట్టణంలో మెడిసిన్ చదువుతున్నా రాయన.

ఆరోజు తెల్లారగట్ట వెంకటరత్నంగారు వాళ్ళు వొచ్చి—— ఆ తెల్లవారు జామున అరుణాచలం చుట్టూతా వున్న ప్రదేశం ఆకాశం, భూమి అంతా ఎన్నడూ చూడని కాంతితో నిండిపోయిందని చలంగారికి చెప్పారు.

చలంగారు రమణాశ్రమానికి వెళ్ళినప్పుడు—— మద్రాసు అంతా పగలే చీకటయిపోయి సముద్రం ఎంతో వుధృతంగా ముందుకి పొడుచుకు వొచ్చిందనీ, కలకత్తాలోనూ అట్టాగే సముద్రం పొంగిందనీ—— చాడ్విక్ చెప్పారు.

ప్రళయం ప్రళయం అని ప్రపంచమంతా గగ్గోలు పడుతోంది. ఇది వేదాలు చెప్పిన యుగాంతమో? మరే విశేషమో? ఎవరికీ తెలియటల్లేదు.కానీ ప్రపంచంలో ఏమూలనించి వొచ్చినవార్తలు విన్నా ప్రళయం ఆరంభం అయినట్లుగా అనిపిస్తోంది. ఇది ఎవరిలో నన్నా ప్రళయమో?

సృష్టిలోనే ప్రళయమో? ఎవరి స్వరూపమన్నా ప్రత్యగాత్మలో లయం కావడంలో చెలరేగిన ప్రళయమో?

సౌరిస్ మాత్రం ఎనిమిదవతేదీ నించి నామమాత్రంగా కొంచెం మజ్జిగా అన్నం తిని తమ గదిలోనే వుండిపోయారు. ఈశ్వరసాక్షాత్కారమైన రోజుల్లోనూ ఆమె అలాగే ఏకాంతంలో వుండిపోయారు. మళ్ళీ సరిగ్గా అలాగే జరుగుతోంది ఇప్పుడుగూడా. ఇది ఇంకా విశేషమైన పరిణామ కాల మేమో? లోకంలో జరుగుతున్నదేదీ ఆమెకి పట్టటల్లేదు. ఆ రోజునకూడా పెద్దసముద్రాలు ముందుకి పొంగుకుని వొస్తున్నట్లు— ఆసముద్ర సంచలనశక్తి తన ఆత్మికశక్తివలన ముందుకి వురకకుండా నిలిచి పోతున్నట్లు వుంది. ఎక్కడ కూచున్నా ఆమెకి అదే అనుభవం క్షణక్షణానికి మరింత ప్రబలంగా అదే అనుభవం. భజన నిమిత్తం బైటికి వొచ్చినా అదే అనుభవం. ఉత్తుంగ తరంగాలతో వుధృతంగా వురకలువేసే సముద్రం — — —ఆసముద్ర సంచలనశక్తిని అడ్డుకుంటూ తమ ఆత్మికశక్తి. ఆసముద్రగతి నిరోధిస్తున్నది ఏదో మహత్తర శక్తి. అది తమలోనుండే ప్రసరిస్తోందని ఆమెకి స్పష్టంగా తెలిసింది.

తొమ్మిదవ తేదీన వేరొక దృశ్యంలో ఆమెకి యూరోప్ అంతటా సముద్రం పొంగి అక్కడవున్న తీరాలు కొట్టుకుని పోవడం కనిపించింది. పదవతేదీన కూడా ఆమె తనగదిలో అలాగే కూచుని వున్నారు,

ఏ ప్రళయా లొచ్చినా పత్రికలు ఆగవుకదా! చలంగారికి రమణ స్థానీయులకి పత్రికలవల్ల ప్రళయం రాలేదనీ ఏమీ జరదలేదనీ తెలిసింది. చలం చలంగారి వెనక నర్తకి ఏవో తర్జన భర్జనలు చేస్తూ షా గదిలోనికి నొచ్చారు.

"ప్రళయం ఏమి జరగలేదు షా" అన్నారు చలంగారుకోపంగా.

ఆమాట వినేసరికి షా ఒకపెట్టున పెద్దగా నవ్వారు. ఆనవ్వుతో చలంగారికి మరీకోపం వొచ్చింది.

"జరక్కపోతే మంచిదేకదా నాన్న" అన్నారు షా చల్లగా.

"మరి ఇదంతా జరుగుతుందని నమ్మి అన్నిటినీ వొదులుకుని వొచ్చారే— మరి వాళ్ళందరికి విశ్వాసం ఎట్లా నిలుస్తుంది? వాళ్ళంతా ఏమనుకుంటారు షా?" అన్నారు చలంగారు.

"వాళ్ళ విశ్వాసం ఏమీ చెదరదు. అట్లా (వినాశం) జరిగితే చాలా ఘోరం అయ్యేది. జరగక పోతే చాలా సంతోషమే కదా" అన్నారు షా.

"ఇక ఈశ్వరుడని నిన్నెట్లా నమ్ముతాం" అన్నారు చలంగారు.

ఎంత నవ్వు వొచ్చిందో షాకి. ప్రళయం నాటికి షా అన్న వ్యక్తిత్వం పూర్తిగా అదృశ్యమై పోయి ఈశ్వరుడే షాలో నిండి వున్నారు. ఆ మూడురోజుల్లో సౌరిస్‌లో వ్యక్తిత్వం పూర్తిగా నశించి పోయి ఈశ్వరమూర్తిగా నిలిచారు షా.

'ఈశ్వరుడ'ని షాలోంచి ప్రత్యేకంగా పలకడమనేది ఇప్పుడు పూర్తిగా అదృశ్యమై పోయింది. అసలు ఏది వున్నదో అదే అయి పోయారు షా.

ఇంక ఈశ్వరు డంటే నేం? షా అంటే నేం? .... .... .... ఏమంటే మాత్రమే ముంది? .... .... అక్కడ షా అన్న ఆకృతిలో ఏదీలేదు .... .... అంతా వుంది కాని ఇది లోకానికి ఎలా తెలుస్తుంది. ప్రపంచమే మనోకల్పన, మనో విభ్రమం వల్లనే ప్రపంచం దృశ్యమానం అవుతోంది. దృశ్యమాన ప్రపంచానికి నిద్రపోయిన జ్ఞానపూర్ణ చైతన్యంలో వున్న ఆ అనంత చైతన్య మూర్తిమత్వం షా అనే

చర్మపు తొడుగులో వుంది. దానికి ప్రళయాలు ఇత్యాదిక మనోకల్పన లున్నాయా? షౌగా వెలిసిన ఆ ఈశ్వర శక్తి నించి— "మీరు ఎవరని పిలిచినా సరే మీ ఇష్టం" అని సమాధానం వొచ్చింది నిర్లిప్తంగా.

పదవ తారీఖునకూడా సొఁరిస్ (ఇక్కడినించి పాఠకులు ఈశ్వరుడికి పర్యాయపదంగా గుర్తింపగలరు) అలాగే గదిలోనే కూచున్నారు.

ఆరోజు సాయంత్రం ముందుగదిలో కురంగేశ్వరరావు, కృష్ణారావు, నరసింహస్వామి అందరూ కూచున్నారు. సొరిస్ అక్కడికే వచ్చి కూచున్నారు. ఆమె ముందొక దృశ్యంలో .... .... ఒక పెద్ద క్రాస్ కనబడింది. దానిమీద తామే కనిపించారామెకి. ఆదృశ్యాన్ని చూస్తూ ఆమె "ఇది నా క్రూసిఫికేషన్" (శిలువవేత) అన్నారామె. అక్కడున్న వాళ్ళలో ఎక్కడా అవిశ్వాసం కనిపించలేదు ఆమెకి. ఏం జరిగింది? ఏం జరగలేదు అన్న పెద్ద అయోమయంలో వున్నారు వాళ్ళు అంతవరకు. తాను క్రూసిఫికేషన్ మాట చెప్పగానే వారిలో వున్న భారమంతా దిగిపోయినట్లుగా తోచిందామెకి.

ప్రళయం వొస్తుందని విశ్వసించి— ఈశ్వరుడు మేమంతా మునిగిపోతుంటే చూస్తూ వూరుకుంటారా? అని గోలపెట్టి— అతిగా బాధపడిన వారందరూ— ఈశ్వరుడు ప్రళయాన్నించి అందర్నీ రక్షించి నందుకు సంతోషించ లేదు సరికదా ప్రళయం రాలేదేమని బాధపడ్డారు.

ఆరోజు భోజనాలదగ్గర వజీర్ వాళ్ళు షౌని అడిగారు.

"ఇంత చెప్పారు (ప్రళయం వొస్తుందని) ఏమిటండీ, ఏమీ రాలేదు?" అని.

"వొచ్చింది. ఈశ్వరుడు ఆపేశారు." అన్నారు షౌ.

"అందరూ వొచ్చి ఇదంతా జరగలేదని గొడవచేస్తారేమో? ప్రచారం చేశారుకదా?" అన్నారు వాళ్ళు.

"ఎవరు ఏమీ చెయ్యరు. ఒక మహాసత్యం జరిగినప్పుడు వాళ్ళ మనసులకి తెలియక పోయినా వాళ్ళ అంతఃకరణానికి తెలుస్తుంది" అన్నారు షౌ నిర్లిప్తంగా.

చలంగారు మాత్రం అలిగారు. ఈశ్వరుడని దగ్గరకి రావడం మానుకున్నారు. కానీ షౌ కేమీ పట్టలేదు.

కొద్ది రోజుల్లోనే యూరోప్‌లో west coasts అన్నీ మునిగి పోయినాయని వార్తలు వొచ్చాయి.

తరువాత షౌ అందరికి చెప్పారు.

"ఈ ప్రళయంలో నేనందర్నీ సముద్రతీరాల నించి ఇటూ, అటూ పంపించాను కానీ ఇది భూమినంతా ముంచడానికి వొచ్చిన ప్రళయం. దాన్ని ఈశ్వరుడే ఆపేశారు" అని.

పదిరోజు లవగానే అలిగివున్న చలంగారిని దగ్గరకు తీసుకుని "నన్ను వొదిలేశావా నువ్వు? ఒక గొప్పదైన మహత్‌సత్యాన్ని మీ మనస్సులు చూడలేవు.అప్పుడప్పుడుచల్లనిమాయ కప్పవలసి వొస్తుంది" అన్నారు ఈశ్వరుడు.

అప్పటినించి షౌ ఈశ్వరు డిలా అంటున్నారని చెప్పడం పోయింది, ఏం చెప్పినా "నేను" అనే చెప్పేవారు.

రమణస్థాన్‌లో వారంతా షౌని 'షౌ' అని ఈశ్వరుడు అని వారికి తోచినట్లు పిలుస్తారు. చలంగారు మాత్రం ఎప్పుడూ ఈశ్వరుడనే అనేవారు. మెల్లిగా అందరి మనసులు తేరుకుని షౌ చెప్పినట్లు వినడం మళ్ళీ మొదలు పెటారు.

ఎవరైతే ప్రళయంగురించి ఎంతగట్టిగా తీసుకున్నారో వారంతా కోపాల్తో ఉత్తరాలు రాశారు. ఆతరువాత శాస్త్రిగారు అరుణాచలం పైపే రాలేదు. నారాయణమూర్తిగారికి చిత్తూరు నించి బదిలీ అయిపోయింది. ఆయన కుటుంబ సమేతంగా వెళ్ళిపోయారు. డాలీ మళ్ళీ స్కూల్లో చేరతానని వెళ్ళిపోయింది. ఆంజనేయులు వాళ్ళ వాళ్ళదగ్గరకు మద్రాసు వెళ్ళిపోయాడు. వజీర్ వుద్యోగాన్వేషణలో వెళ్ళిపోయారు. మిగిలిన వారిక్కడ మిగిలారు.

తమ రక్షణకేంద్రాలలో రక్షణ తీసుకున్న వారందర్నీ కె.సభా, రామానందాశ్రమం, విద్యుత్‌కుమార్, జగ్గారావు, వెంకటేశ్వరరావు ఎంతబాగా చూసుకున్నారో! కనకమ్మగారు కొండూరు రక్షణకేంద్రానికి వెంకటేశ్వరరావుగారి దగ్గరికి వెళ్ళారు. రక్షణ పొందిన వారివల్ల రమణస్థానీయులకి తెలిసింది. వారిలో ఎంతప్రేమా ఆదరణం దాగి వున్నాయో. వారిలో ఎంతగా విశ్వాసం పాదుకొని వుందో అప్పుడే తెలిసింది షోకి.

ఎవరూ అరుణాచలం వొచ్చి చలంమహర్షిని ప్రళయం గురించి ప్రశ్నించుటలేదుగానీ ప్రతికల్లో మాత్రం చలం మహర్షిని తిట్టిపోశారు. ప్రళయం పేరు చెప్పి బాగా డబ్బుచేసుకున్నారనే అపవాదు పుట్టింది. సూనృతాన్ని చూడలేని ప్రపంచం సూనృతుల్ని నీచంగా నిందిస్తుంది. అది ప్రపంచస్వభావం నిజానికి చలంమహర్షి తమ దగ్గరున్నడబ్బంతా ప్రళయ ప్రచారాల్లో, ప్రళయరక్షణ కల్పించడంలో అణాపైసాల్తో ఖర్చు పెట్టేశారు. వారి చేతిలో చిల్లిగవ్వకూడా మిగలలేదు. కానీ లోకానికి అదేం తెలుసు. దాని తీరువే అంత. పైపై విషయాల ప్రచారంలో వాస్తవాలు మరుగున పడిపోతాయి.

## 21

ఆ రోజుల్ని అణాకానీ రోజు లనేవారు నర్తకి, పకపక. ఆ అణాకానీ రోజులలో రమణస్థానీయులు ఏదో ఒక కూర, ఇంతన్నం తయారు చేసుకుని తినేవారు. అతిథి, అభ్యాగతులకు తమతోబాటూ ఆ ఒకటే పదార్థాన్ని పెట్టేవారు. ఆ రోజుల్లో ఇంట్లో భోజన సామగ్రి వుండేది కానీ ప్రళయం పుణ్యమా అని చలంగారి చేతిలో చిల్లిగవ్వ కూడా మిగల లేదు.

ఒకరోజు నర్తకి పకపక - చాలా బాధతో షా దగ్గరకి వొచ్చి - "ఎన్నాళ్ళు ఇట్లా గడుస్తుంది షా! నాన్నకా ఆరోగ్యం సరిలేదుకదా! అతనికి special గా బలంగా వుండే పదార్థం ఏదయినా ఇవ్వాలన్నా వీలుపడకుండా వుంది. ముందింక ఎట్లా గడుస్తుందో! మేమయితే ఏదైనా తిని వుండగలం" అన్నారు.

"ఇప్పుడీ తిండివలన నాన్నేమయినా అనారోగ్యంగావున్నాడా?" అని అడిగారు షా. వాళ్ళు చలంగారిని అదేప్రశ్న అడిగారు.

"నాకే జబ్బు లేదు. చాలా హాయిగా వున్నాను" అన్నారు చలం మహర్షి.

"ఇకముందు జబ్బుచేస్తే ఎట్లా వైద్యం చేయిస్తాం?" అని షాని అడిగారు వాళ్ళు.

"ఎప్పుడో రావడ మేమిటి? ఇప్పుడే చాలా ఘోరమైన వ్యాధి అతనికి వుంది. ఈ వ్యాధి నయం అయ్యేది కాదు. ఎంత డబ్బు దానికి ఖర్చు అవుతుందో? కాని ఎంత డబ్బు వుంటే మాత్రం ఏం లాభం? అది కుదిరేది కాదు" అన్నారు షా.

దాంతో వాళ్ళు ఏం తెలుసుకున్నారో, సర్దుకున్నారోగానీ, ఆ రోజునించి డబ్బులేకండా ఎలా బతుకుతా మనే చింత వాళ్ళకి పూర్తిగా పోయింది.

భవిష్యత్ చింత గురించి చలంమహర్షి ఏమంటారంటే "నా బతుకెట్లా అని ఆలోచించే వారికి అరుణాచలవాసం అసాధ్యం. తల్లి దగ్గరకి పరిగెత్తుకొచ్చే పిల్ల నా బతు కెట్లా అని condition పెట్టి అడగదుకదా :" అని.

(వీరేశలింగంగారికి చలంగారిలేఖ 15-8-61)

షౌలో వ్యక్తిత్వస్పృహ ప్రళయంతో పూర్తిగా అంతరించి పోయింది. ప్రళయంతో షౌ వునికి, తీరూ, మాటా- అంతా పూర్వం కన్నా మారింది, పూర్వం ఈశ్వరుడు మాటలాడుతున్నప్పుడు షౌకి కాన్షస్‌గా తెలిసేది. ఆయన తనలోంచి అందర్నీ నడుపుతున్నారని. కానీ ఇప్పుడు పూర్తిగా వున్నది ఆయనే- అంటే ఆమె వ్యక్తిత్వం పూర్తిగా నశించి అవ్యక్తమైన ఈశ్వరశక్తి- సౌరిస్ (అనే చర్మపు తిత్తిలో) గా మిగిలింది.

అప్పట్లో షౌ నడక, తీరు, మాట, అన్ని aspects లో పురుషత్వం తొణికిస లాడేది. తరువాత ఇప్పుడు పూర్వంలా ఈశ్వరుడు చెబుతున్నా రనటంలేదు. అన్ని విషయాల మీద మాట్లాడడం లేదు. గట్టిగా అవసరం అయితేనేగానీ, అడిగితేనేకానీ జన్మలు అవీ చెప్పట ల్లేదు. ప్రొఫెసీలు లేవు.

"మీ రది చేయండి, ఇది చేయండి" అని చెప్పడమూ లేదు.

చిత్ర, నర్తకి, పకపక అందరూ మునుపు ఈశ్వరుడు చెప్పి నడిపిస్తే ఎట్లా నడిచేవారో ఇప్పుడూ అట్లానే నడుస్తున్నారు. సరిగ్గా వాళ్ళు చెయ్యనప్పుడు షౌ కేకలు వేస్తూనే వున్నారు. అంతా ఇదివరకటి లాగే కొనసాగు తోంది. చలంమహర్షి పూర్వంలాగే ఈశ్వరుడని అంటున్నారు షౌని. ఈశ్వరాజ్ఞకి బద్ధులై సంచరిస్తున్నారు వాళ్ళంతా. మళ్ళీ వారిలో విశ్వాసం దృఢమై పోయింది.

ఒకరోజున మెర్‌స్టన్ వొచ్చి చాడ్విక్‌కి జాండిస్ అని చెప్పింది. షా కాకాని తీసుకుని ఆయనని చూడటానికి వెళ్ళారు. ఆయన ఒళ్ళంతా పచ్చబడి పోయింది. "ఏం మందు తీసుకుంటున్నారు" అని షా అడిగా రాయన్ని.

"ఏ మందు తీసుకోవటల్లేదు. ఏవో మంత్రాలు వేస్తున్నారు. పసర్లు ఇస్తున్నారు. పెరుగూ అన్నం తప్ప తినడంలేద"ని చెప్పారు చాడ్విక్.

"మా డాక్టరు చాలా మంచి మందు ఇస్తారు. మీరు ఆయన దగ్గర మందు తీసుకోరాదా?" అన్నారు షా.

"ఎలోపతి దీన్ని కుదర్చలేదు. అయినా తగ్గిపోతోంది. గొడవెందుకు" అన్నారు చాడ్విక్,

"ఔను భగవాన్ చూస్తున్నారు కదా" అన్నారు షా.

"ఔను నన్నేకాదు. అందర్నీ చూస్తున్నారు" అన్నా రాయన.

తరువాత షా ఇంటికి వెళ్ళడానికి లేచారు. ఆయన తలుపు తీయడానికి లేచారు. క్పొంతసేపు ఇద్దరూ అలాగే నిలబడ్డారు. అప్పుడు షాకి ఆయనలో నిశ్చలత్వం, వైరాగ్యం గోచరించాయి. లోగడ ఆయనలో చాలా పెద్ద struggle కనబడేది. ఇప్పుడు ఆయనలో ఆ నిశ్చలత్వం చూసి షాకి ఎంత సంతోషం వేసిందో! అంత జబ్బులో కూడా ఆయన తాము ఆశ్రమానికి వెళ్ళి వొస్తున్నామని, తమకి నీరస మనిపించడం లేదని చెప్పారు.

మెర్‌స్టన్ వాళ్ళు చాడ్విక్‌కి నయంకావడం లేదని చెప్పారు షాతో. మెర్‌స్టన్, మా తల్యార్‌ఖాన్ "నే నిక్కడనించి కదలను మొర్రో" అని చాడ్విక్ అంటున్నా వినకుండా ఆయన నొక టాక్సీలో వేసి వేలూరు తీసుకుని పోయారు. వేలూరు ఆస్పత్రిలో డాక్టర్లు

మా తల్యార్‌ఖాన్‌కి తెలుసు. ఆవిడ దగ్గరుండి చాడ్విక్‌ని జాగ్రత్తగా ఆసుపత్రిలో చేర్పించింది. మా తల్యార్‌ఖాన్, మెర్‌స్టన్ ఆయనని చూసివొస్తూ వుండేవారు. ఆయనకి అప్పుడప్పుడు కాన్షస్‌నెస్ పోతూ వుండేది.

అది ఈస్టర్. అప్పుడు మెర్‌స్టన్ అక్కడే వుంది. చాడ్విక్ గోడవైపు చూస్తూ "జీసస్ తమశిష్యుల కాళ్ళు కడుగు తున్నారు. తువ్వాలు పెట్టి తుడుస్తున్నారు"— అని. ఒకొక్కక్క దృశ్యం తనకి కనబడుతున్నట్లు మాటాడుతున్నారని చెప్పింది మెర్‌స్టన్.

ఒక రోజు మెర్‌స్టన్ షాతో చెప్పింది. "చాడ్విక్‌కి మాంసాహారం తినకనే జబ్బు చేసింది. మేం (westerners) పాశ్చాత్యులమంతా కూడబలుక్కున్నాం. ఆయన ఆస్పత్రినించి రాంగానే మాంసాహారం తినిపించాలని. నువ్వేమంటావు సారిస్!" అని అడిగింది.

"ఆయన మాంసాహారం తినడానికి ఒప్పుకోరు" అన్నారు షా.

"మేం బలవంతం చేసి తినిపిస్తాం" అంది మెర్‌స్టన్.

"ఆయన భగవాన్‌కి మాట ఇచ్చారు. మీరెంత బలవంతం చేసినా, ఆయన చేత మాంసం తినిపించలేరు. అటువంటి ఇబ్బందిలో పడేకంటే ఆయన చచ్చిపోనన్నా చచ్చిపోతారు గానీ మాంసం తినరు" అన్నారు షా.

"చూస్తూవుండు మేం తినిపిస్తాం" అంటో మెర్‌స్టన్ వెళ్ళిపోయింది.

ఒకరోజు సాయంత్రం రమణస్థానీయు లంతా ఆరుబైట భజన చేస్తున్నారు, పండు వెన్నెల. పక్కింటి టి. పి. ఆర్‌తో మెర్‌స్టన్ మాటాడు తోంది. తరువాత టి. పి. ఆర్, చలంగారితో 'చాడ్విక్‌కి కాన్షస్‌నెస్ పోయిందిట. స్పృహ లేదట.' అనిచెప్పారు. మర్నాడు వుద

యం ఆంజనేయులు పరుగెత్తుకుంటూ వొచ్చి చాడ్విక్ చచ్చిపోయారు అనిచెప్పాడు.

Devotion లో వుండగా చాడ్విక్‌కి 1962లో రియలైజేషన్ హొస్తుందని షాకి కలలో తెలిసింది. ఆయనకి అప్పుడే ఆసంగతి చెప్పారు షా.

అసలు చాడ్విక్ చచ్చిపోవడం అన్నది షా వూహించలేని సంగతి. ఆశ్రమంలో ఆయనొక మాన్యుమెంట్. ఆ చోటుని ఖాళీగా వూహించడం చాలా అసాధ్యం ఆమెకి.

చాడ్విక్ శరీరాన్ని ఆశ్రమానికి తీసుకుని వొచ్చారు. ఆశ్రమంలో ఆయనగది దగ్గరే ఆయన దేహాన్ని పాతిపెట్టేశారు.

చాడ్విక్‌ని సమాధిచేసే సమయానికి వెళ్ళడానికి షాకి వీలు పడలేదు. ఆయన సమాధి దగ్గరకి మూడవ రోజున గులాబీలు తీసుకుని వెళ్ళి ఆయన సమాధిని గులాబీలతో అలంకరించారు. అప్పుడు ఎంతో గొప్ప ఆనందంతో ఆయన spirit షాని ఆవరించింది.

మే నెలలో చిత్రకి నెప్పులు వొచ్చాయి. ఆస్పత్రికి తీసుకుని వెళ్ళారు. ఆడపిల్ల పుట్టింది. అయిదారు రోజులైనాక పాపాయిని ఎత్తుకొని ఇంటికి వొచ్చేసింది చిత్ర. ఆ పాపాయే 'మిత్రీ'. శుక్రవారం పుట్టింది గనక ఆ పాపాయికి శ్రీలేఖ అని పేరు పెట్టారు షా.

అంత పసిపిల్లలోనూ కనుముక్కు తీరూ తీర్చిదిద్దినట్లుగా వుండడం ఒక్క మిత్రీ లోనే చూచారు షా. ఎంతో అందంగా వుండేది మిత్రీ.

తిరుపతినించి చలంగారికి ఒక కుఱ్ఱవాడు వుత్తరం రాశాడు. తాను మహాస్థాన్ చదివి చాలా impress అయ్యాననీ. చలంగార్ని చూడటానికి వొస్తానని రాసి, ఒక స్నేహితుడ్ని వెంటబెట్టుకు వొచ్చా

రాయన. ఆయనే చంద్రశేఖర్. అప్పుడు పందొమ్మిదేళ్ళు వుంటా యాయనకి. ప్రపంచం మురికిని దుమ్ముని ఎరగని ఒక అడవిలో పూసిన పుష్పంలాగ వున్నా రాయన అప్పట్లో. చలంగార్ని చూడగానే గట్టిగా కావిలించుకుని ఆ emotion పట్టలేక ఏడ్చేశారు. ఆయన కంఠం చాలా గంభీరం, మాట చాలా స్వచ్ఛం, ఎంతో గొప్పగా వుండేది. ఆయనకి భక్త్యావేశంతో ఒళ్ళు తెలియటల్లేదు. షౌ కాళ్ళమీద పడి నమస్కారం చేశారు. షౌకి ఆయనకి మధ్య చలంగారి పెంపుడునెమలి హీరా నిలబడ్డాడు. ఆయన ఒళ్ళు తెలియని స్థితిలో నమస్కరిస్తూవుంటే హీరా ఎక్కడ పొడుస్తాడో ననిపించింది షౌకి.

సాయంత్రం అందరూ కలిసి షికారు వెళ్ళారు. ఇంటి దగ్గరలో వున్న రాళ్ళమీద కూచున్నారు. ఆయన చుట్టూరా చూసి ఈశ్వరుడంతటి వారే ఇక్కడ కూచుంటే మనుష లేమీ పట్టనట్లు పోతున్నారేం? అన్నా రాశ్చర్యంతో. తరువాత ఆ రోజు భజనలో అన్నమాచార్యులు కీర్తన పాడా రాయన. ఆ కంఠంలో ఎంత గాంభీర్యమో! ఒకటి రెండు రోజు లుండి వెళ్ళిపోయారు.

అప్పటినించి వుత్తరాలు రాసేవారు. అప్పట్లో కాకాకి పెద్ద జ్వరాలు బ్రోంకయిటిస్ ఎటాక్స్ వొచ్చేవి. చంద్రశేఖర్ వొచ్చినప్పుడు ఆమెకి ఓపికగా కథలు చెప్పేవారు.

అచ్చయ్యగారికి సంసారంలో తగాదాలు ఎక్కువై పోయి, "ఆధ్యాత్మికసాధన చేస్తేగాని, నేను బాగుపడను" అని నిశ్చయించుకుని ఈశ్వరసన్నిధికి వొచ్చారు. వారికి ఒక మహాత్ములు "అక్కడికి (రమణస్థాన్‌కి) వెళ్ళు, నువ్వు బాగుపడతావ్" అని చెప్పారు. ఆయన ఆ మాటమీది గురితో రమణస్థాన్‌కి వొచ్చారు.

అచ్చయ్యగారిది భారీ విగ్రహం. ఆయన ఇంట్లో నడుస్తుంటే, బొమ్మరింట్లో ఏనుగు నడుస్తున్నట్లుగా అనిపించేది. ఆయన రమణ

స్థాన్‌లో వుండిపోతా నన్నారు. "సరే. అట్టాగే వుండండి" అన్నారు, చలంగారు. ఆయనకి అందరిలాగే పనులు చెప్పేవారు. ఆయన తనకి ఏం పని చెప్పినా "అబ్బే నాకు చాతకాదండీ, నేనెప్పుడూ ఈ పనులు చేయలేదు" అనేవారు. అయితే ఇప్పుడు నేర్చుకోండి" అనేది సర్తకి. అలాగే ఏ పని చెప్పినా, అది సగం సగం చేసి వొదిలిపెట్టి ఎటో వెళ్ళిపోయే వారు అచ్చయ్యగారు. "ఏమిటండీ ఇలా చేశారు" అని అడిగితే "నాకు చాత కావండీ ఈ పనులు" అనేవారు.

కాకా, కిట్టూ చిన్నపిల్లలు. ఆటల ధోరణిలో వాళ్ళు అన్నాలు సరిగా తినేవారు కారు. షౌ వాళ్ళచేత అన్నం పారెయ్యకుండా తినిపించాలని—— వాళ్ళు పోటీపడేలా– ఒక మెతుకుకూడా పారెయ్యకుండా ఎవరు ముందుగా * భగవాన్ విస్తరి చేస్తారో! అనేవారు షౌ. వాళ్ళు ఒకరితో ఒకరు భగవాన్ విస్తరి ఎవరు ముందుగా చేస్తారో అంటూ పిల్లలు పోటీలు పడుతోంటే అచ్చయ్యగారు వాళ్ళమాటల్ని సీరియస్‌గా తీసుకుని తమవిస్తట్లో ఆఖరికి ఏ గింజలు వున్నా అవి నమిలేసి తినేసే వారు భగవాన్ విస్తరి చెయ్యాలనే పట్టుదలతో.

బియ్యం ఏరడానికి బైట వరండాలో కూచునేవారు. కోతులు గోడలమీద నించి వొస్తుంటే "అమ్మయోయ్, అమ్మయోయ్ కోతులు వొస్తున్నాయ్ కొంచెం కొట్టండి". అని పరుగుపెట్టి లోపలికి పోయి చిన్నపిల్లలైన కాకా, కిట్టూల్ని బైటనే వొదిలేసి తలుపులు వేసుకునే వారు.

* భగవాన్ తమ విస్తట్లో ఒక్క మెతుకుకూడా వొదిలిపెట్టేవారు కాదుట. మెతుకుకూడ వొదలకుండా తినే వారి విస్తరిని భగవాన్ విస్తరి అనేవారు రమణస్థాన్‌లో.

కిట్టూ అంటే ఆయనకి ఎంతో ముద్దు. కిట్టూని మాత్రం ఎంతో ప్రేమగా చూచేవారు. దాంతో కాకాకి కోపం వొచ్చేది. కిట్టూని దగ్గరగా తీసుకుని కాకా రాంగానే కాకాని కొట్టేవారు. ఇంక కాకా సహిస్తుందా? ఆయనతో పోట్లాడి గోలగోల చేసి పెట్టేది.

పిల్లలు ఏపని చేసినా "ఇది తప్పు, అది తప్పు" అని అనేవారాయన. అంత చిన్నపిల్ల కిట్టూ ఆయనని చాలా ఘాటుగా "అందర్నీ తప్పు తప్పు అను. నువ్వు మాత్రం అన్నీ తప్పు పనులు చేస్తూనే వుండు" అనేది. దాంతో పాపం ఆ మానవుడు నివ్వెరపోయేవాడు. పెద్దవాళ్ళు చెప్పి చిన్నపిల్లచేత అనిపిస్తున్నా రనుకునే వాడేమో.

అచ్చయ్యగారు ఆశ్రమానికి వెళ్ళి రమణస్థాన్‌మీద, రమణ స్థానీయులమీద నానా స్కాండల్స్ (scandals) మాటలాడి వొచ్చేవారు. పకపక అది భరించలేక పోయేది. ఎవరికైనా ఆయనని భరించడమే కష్టం. పైగా అందరిమీద స్కాండల్స్ మాటలాడడంతో అందరూ మరీ సహించలేక పోయారు ఆయన్ని.

ఒక రోజు పకపక షా దగ్గరకి వొచ్చి "ఏమిటి షా, ఇట్లాంటివన్నీ చేస్తోంటే వూరు కుంటున్నావు" అని కేకలు వేసింది.

"చెబితే ఏం పకపకా" అన్నారు షా.

"ఎట్లా సహించడం ఇట్లాంటి అసహ్యమైన పనులు చేస్తూ వుంటే" అంది పకపక.

"చేస్తారు మనుషులు" అన్నారు షా.

"అట్లాంటి పాడుమాటలు అవీ అంటో ఆయన ఇక్కడ ఎందుకు వుండడం?" అంది పకపక.

"పోనీతే చెప్పుకోనీ పకపక" అన్నారు షా.

"నువ్వయితే ఇట్లాంటివి విని వూరుకో గలవు. మే మెట్లా భరించ గలం. మేము నీ స్థితికి రాలేదు కదా" అని కేకలు వేసింది పకపక.

"మన వాళ్ళైతే మనం భరించమా? అట్లా కాదా పకపకా" అన్నారు షా.

పకపకకి చాలా కోపం వచ్చింది. "ఇటువంటి వాళ్ళంతా చేరు తున్నా రీ రమణస్థాన్‌లో" అని గోల పెట్టింది.

అంతేకాదు అచ్చయ్యగారు చెప్పకండా సైకిల్ తీసుకుని వూళ్ళో ఎక్కడి కెక్కడికో వెళ్ళిపోయే వారు. చలంగారు ఆయన్ని చాలా కేకలు వేసేవారు. కాని ఆయన నే కేకలు వేసీ ప్రయోజనంలేక పోయేది.

ఒకసారి ఎవరో చలంగార్ని చూడటానికి వొచ్చారు. "మీరెం దుకు వొచ్చారు? ఎవర్ని చూడటానికి వొచ్చారు?" అని వాళ్ళని అడి గారు అచ్చయ్యగారు.

"ఏదో చలంగార్ని చూడటానికి వొచ్చాం. మీరెందుకు వొచ్చా రండి" అని వాళ్ళాయన్ని మళ్ళీ అడిగారు.

"నేను ఎందుకు వొచ్చానో నాకే తెలియదు" అన్నా రాయన. వినేవారికి ఆయనమాట లెంత దిగులు పుట్టించాయో!

ఎవరైనా ఇక్కడ వుండటానికి వొస్తే ఈశ్వరుడు వారికి మూడు నెలలు time ఇచ్చేవారు. వాళ్ళకి ఇక్కడ వుండగలిగిన శక్తి వుందని తెలిస్తే వుంచేవారు. ఉండలేనివారు తమంత తాముగా తెలుసుకుని మూడు నెలల లోపే వెళ్ళిపోయే వారు. అలా వొచ్చి వున్న వారిలో కొద్దిమంది వుండిపోతా మని అనేవారు. వారు వున్నందుకు అందరూ సంతోషించేవారు.

కానీ అచ్చయ్యగారు చేసే పనులన్నీ అవక తవక పనులే. ఏ పనీ సజావుగా చేసేవారు కారు. ప్రతీ దానికి పేచీయే. ఎన్నడూ క్రమ పద్ధతిలో వుండేవారు కారు. చలంగారు ఎన్ని చివాట్లువేసినా ఏడవడమో అరవడమో చేసేవా రాయన. ఆయనలో భరించలేని దుర్భరత్వం వుండేది. ఎవరూ ఆయనని సహించ లేకపోయేవారు. అయినా ఎవరూ షౌ చెబితే తప్ప ఏమీ మాట్లాడేవారు కారు. ఎవరివల్ల ఎంత బాధయినా వాళ్ళు ఇలా చేస్తున్నారని షౌకి చెప్పడంతప్ప ఎవరినీ పంపించెయ్యండి అని చెప్పేవారు కారు రమణస్థానీయులు.

ఆయన వొచ్చి మూడు నెలలు గడిచి పోయింది. ఆయనలో షౌకి ఏమార్పు కనబడలేదు. ఆయన పుత్త న్యూసెన్స్ అయిపోవడం తప్ప ఆయనలో ఏ మార్పురాదని స్పష్టంగా తెలిసి పోయింది. ఎవరూ భరించ లేని దుర్భరత్వాన్ని బలపంతాన రమణస్థానీయుల నెత్తిమీద ఎన్నడూ వుంచేవారు కారు షౌ.

ఆయనకి మినపరొట్టితో బాటు చింతపండు పచ్చడి బెల్లంవేసి చేస్తే చాలా ఇష్టం. ఆపేళ రమణస్థాన్‌లో మినపరొట్టె చేశారు. ఆయన నర్తకికి దగ్గరుండి చింతపండు పచ్చడి ఎలా చెయ్యాలో చెబుతున్నారు,

"ఏముండి మూడు నెల లైంది మీరింక వెళ్ళిపోండి," అన్నారు నర్తకి.

"ఎక్కడికి పోనండి నేను నా అవగుణాలన్నీ పోయి నేను బాగు పడతా నని గంపెడు ఆశతో వొచ్చానండి, ఇలాగే ఏ మార్పు లేకండా ప్రపంచంలోకి పోతే ఎట్లాగండి" అన్నా రాయన.

ఆ మాటలు వినేసరికి అందరికీ ఎంతో జాలివేసింది. అయినా గాని షౌ "అవి ఎవరిదగ్గరున్నా పోయేవి కావు. మీరు వెడితేనే మంచిది" అన్నారు.

పాపం అచ్యుయ్యగారు (షౌ భోజనంచేసి వెళ్ళమని చెప్పినా) మినపరొట్టి తినకుండానే ఆంధ్రదేశం వెళ్ళిపోయారు.

'చలం', 'చలం' అని మిత్రులు చెప్పుకుంటూ వుండగా విని, చలంగారిని చూడా లనిపించి జిన్నూరునించి రాజుగా రనే ఆయన వొచ్చారు. అప్పటి కాయన చలం పుస్తకం ఏదీ చదవలేదు. మొట్ట మొదట ఆయన వొచ్చినప్పుడు హోటల్లో దిగారు. పొద్దున్నే రమణ స్థాన్‌కి వచ్చి సాయంత్రం భజనవరకూ వుండి అప్పుడు హోటలుకి తిరిగి వెళ్ళేవారు. ఒకరోజు 'నా నోట నీ మాట గానమయ్యే వేళ' అని షౌ భజనలో పాడుతున్నారు. ఆయన వరండాలో స్తంభాన్ని పట్టుకు తలవంచుకుని నిలబడ్డారు. ఆయనలో ఏదో పరివర్తన కనిపెట్టి చలం గారు "మీరు మాలాగ అయిపోతార్లెండి" అన్నారు. రాజుగారు అక్కడి నించి వెళ్ళిపోయారు.

రాజుగారు చలం మహర్షి ఎవర్నీ కాదనకండా ఇంతమందిని ఆదరించి తమదగ్గర వుంచుకోవడం అదీ చూసి, చలంగారికి ఏదో విధంగా సహాయం చేయాలని అనుకుని చలంగారు రాసిన నాలుగు పుస్తకాల్ని అచ్చువేయ దలిచారు. చలం అముద్రిత గ్రంథాలలో (1) భగవాన్ స్మృతులు, (2) నిర్వికల్పం, (3) మార్తా, (4) ఆ రాత్రి, (5) కొత్త చిగుళ్ళు, (6) చలం గీతాలు, (7) వెలుగురవ్వలు అనే పుస్తకాల్ని ఏరుకుని రాజుగారే అచ్చు వేయించారు. వాటిని తామే అమ్ముతా మన్నారు.

పుస్తకా లన్నీ ఒకచోట పెట్టాలి గనక మహాస్థాన్‌లోని gate house అద్దెకి తీసుకున్నా రాయన. అక్కడ వుండి భోజన భాజనాదులు రమణస్థాన్‌లో చేసేవారు. రమణస్థాన్‌లో ఒకరిగా స్థిరపడాలనీ, ఆశ్రమజీవితం గడపాలనీ ఆయనకి కోరిక. చలంగా రంటే ఆయనకి

ఎంత ప్రేమో! అసలు రమణస్థాన్ మీదే అవధులులేని అభిమానం ఆయనకి. కాకా, కిట్టూలతో ఆడుకుంటూ వుండేవా రాయన. షో తమకి తీరుబడి వున్నప్పుడు బయటికి వొచ్చినప్పుడు కాకా, కిట్టూలతోనే ఆడు కునే వారు. చలంగారు, నర్తకి సరేసరి, రోజంతా ఆ పిల్లలతోనే గడిపేవారు.

చిత్ర సినిమాకి వెడితే, పిల్లలు ఏడుస్తారని నర్తకి వెళ్ళేది కాదు. పిల్లలతోనే వుండిపోయేది. నర్తకి చిత్రపిల్లల్ని చిత్రకన్నా ఎక్కువగా ప్రేమించి పెంచింది. ఇందర్నికన్నా చిత్ర చిన్నపిల్లే. నర్తకే వాళ్ళందరికి తల్లయింది.

కాకాది చాలా **independent spirit.** ఆమె పోకడల్ని చూస్తే ఆమె తక్కిన ఆడవాళ్ళలాగ మామూలు జీవితం గడపదని తెలుస్తూనే వుండేది. కిట్టూది చాలా లోతయిన గుండె. తొణకడ మనేది లేదు. సమయానుకూలంగా అల్లరి చేసేది. ఎంతవరకూ అల్లరిచేస్తే కోప్ప డరో అంతవరకే అల్లరి చేసేది. ఏ మనిషితో ఎలా ప్రవర్తించాలో అలాగే ప్రవర్తించేది. అందుకని చివాట్లు ఎప్పుడూ కాకాకే తగిలేవి. పేరొకరిది, నోరొకరిది అన్నట్లు కిట్టూ చేసిన అల్లరికూడా కాకా చేస్తు న్నట్లుగా కనబడేది. ప్రపంచంలో పిల్లల అల్లర్ని భరించగల మానవు డెవరన్నా వుంటే అతను చలం తరువాతే. అలాంటి చలంగారే హాస్యా నికి శాస్త్రిగారితో ఏమంటారో వినండి.

"చిత్ర కూతురు పేరు కాకా. కాకా అల్లరిని చూడడానికి నోచ కోలేదు మీరు." (శాస్త్రిగారికి చలంగారి లేఖ 20-9-57)

"తొందగావొచ్చి నన్ని కాకా నించి రక్షించండి"

(శాస్త్రిగారికి చలంగారి లేఖ 24-10-57)

కాకాది అల్లరిలో సిద్ధహస్తం అయినట్లే కిట్టూ మిమిక్రీలో గొప్ప నైపుణ్యం చూపేది. గడ్డి అమ్మకునే వాళ్ళు గడ్డిమోపులు తీసుకు రావడం, గడ్డి వెయ్యడం ఎంత చక్కగా అనుకరించి చూపించేదో! ఏ చిన్న పిల్లలూ మాట్లాడని మాటలు మాట్లాడేది. చిత్ర మిత్రీని కడుపుతోన్నప్పుడు "చిత్ర చచ్చిపోతే నువ్వే మా అమ్మవి కదూ. మమ్మల్ని అమ్మలా చూసుకుంటావు కదూ!" అనేది కిట్టూ షౌతో. ఆ అమ్మాయి మాటలుకూడా ముద్దుగా వుండేవి. ఆవిధంగా పూర్తివాక్యాలు మాట్లాడడం ఏచిన్న పిల్లలలోనూ షౌ చూడలేదు.

"నాకు కొడుకు పుడితే నీకే ఇచ్చేస్తాను షౌ" అనేది కిట్టూ.

"ఇప్పుడట్లానే అనిపిస్తుంది కానీ ఆనాడు ఇట్లా అనిపించదు. అట్లా అనకు" అనేవారు షౌ.

"నా కొడుకుని తప్పకుండా నీకే ఇచ్చేస్తాను షౌ" అనేది కిట్టూ.

చెట్టుకి వేసిన వుయ్యాల ఎక్కి రకరకాల ఫీట్లు చేసేది— ఒక కాలు వొదిలి వెయ్యడం, చెయ్యి వొదిలి వెయ్యడం, అట్లాంటి ఫీట్లు. కిట్టూలో ఎంత గ్రేసో! ఎంత అందమో!

1962 ఈశ్వరావతరణోత్సవం జరిపేందుకు చలంగారి చేతిలో చిల్లిగవ్వకూడా లేదు. ఆ సంవత్సరం ఈశ్వరావతరణ దినోత్సవానికి అయ్యేఖర్చు అంతా రాజుగారే భరించారు. ఎవరినీ ఆహ్వానించకుండా పండుగ జరిపింది ఆ ఒక్క ఏడాదే. పండుగనాటి మధ్యాహ్నం రాజుగారు తమవూరు బయలు దేరారు, షౌతో కలిసి రమణస్థానీయు లంతా గిరిప్రదక్షిణానికి వెళ్ళారు.

ఆరోజు ఎండ ఎక్కువగా లేదు. కొంచెం కొంచెం మబ్బుగా వుంది ఆకాశం. పిల్లల్ని ఒంటెద్దు బండిలో ఎక్కించి - సాయంత్రం

భోజనాలు బండిలోనే పెట్టుకుని, వాన రావచ్చని గొడుగులు పట్టుకుని, రమణస్థానీయు లందరూ గిరి ప్రదక్షిణానికి బయలు దేరారు.

సాయంత్రం ఐదువుతుండగా డేంజరు మంటపానికి చేరుకున్నారు. పిల్లలు బండిలోనే వొస్తున్నారు. నర్తకి, చలంగారు నడవలేక బండి ఎక్కారు. చిత్ర, పకపక, పిల్లలు ముందుగానే బండిలో ఎక్కారు. బండి ముందుకు నడిచి పోతోంది.

షౌ వెంబడి నరసింహారావుగారు, బసవరాజుగారు నడుస్తున్నారు. పటమట నల్లని పెద్దమబ్బు కమ్మింది. ఆ మబ్బువలన అంతటా చీకటి అలుము కుంటోంది. చలంగారు వాళ్ళు ఆ మబ్బుని చూసి ఒకచోట బండిని ఆపారు. బసవరాజుగారు పరిగెత్తుకుంటూ వెళ్ళి బండిలో వున్న గొడుగుని తీసుకుని వొచ్చారు. పెద్దపెద్ద చినుకులుతో వాన పడటం మొదలు పెట్టింది. చలంగారు వాళ్ళ బండి ముందుకు వెళ్ళి పోయింది.

పెద్ద గాలితోబాటు జోరుగా వాన పడుతోంది. గాలి వుధృతంగా వీస్తోంది. షౌ తడిసిపోకుండా గొడుగుని గట్టిగా పట్టుకున్నారు బసవరాజుగారు. కన్ను పొడుచుకున్నా కనిపించని చీకటి. ఎక్కడా దీపాలు లేవు. రోడ్డంతా గతుకులు, గోతులు. వాటిల్లోంచి బసవరాజుగారు, నరసింహారావుగారు నెమ్మదిగా షౌని నడిపించి ఇంటికి తీసుకుని వొచ్చారు. ఆనాటి గిరిప్రదక్షిణం షౌకి ఎంత బావుందో - చలంగారు ఆందోళన పడతారనే ఒక్క బాధతప్ప ఆప్రదక్షిణం చాలా గొప్పగా నడిచింది. షౌ చీర మోకాళ్ళదాకా తడిసి పోయింది.

షౌ ఇంటికి తిరిగి వొచ్చేసరికి చలంగారు వరండాలో దిగులుగా కూచున్నారు. షౌ వొచ్చేదాకా ఆయన భోజనం చెయ్యలేదు.

"వొచ్చేశాం నాన్నా" అన్నారు షౌ.

"చీకట్లో, వానలో నువ్వెట్లా వొస్తున్నావో నని మేమంతా ఎంత ఆదుర్దా పడుతున్నామో షౌ" అన్నారు చలంగారు.

అప్పుడు షౌ ఆ గాలివానలో గొడుగు అడ్డుపెట్టి బసవరాజు గారు, నరసింహారావుగారు తమ నేవిధంగా నడిపించుకు వొచ్చారో చలంగారికి వివరంగా చెప్పారు.

"ఇంతగా ఈశ్వరుడని నమ్మితే ఇట్లా వాన కురిపిస్తారా ?" అన్నారు చలంగారు.

"వాన వొస్తే నేం నాన్నా! నేను తడవలేదు కదా?" అని షౌ చలంగారిని సముదా యించారు. ఆ తరువాత అంతరూ కలిసి భోజ నాలు చేశారు.

'టీ స్వామియార్' చలం మహర్షి కథనం.

(రచనాకాలం 16—11—77)

"ద్రౌపది ఆలయం మాకు పడమటివైపు సరిహద్దు. ప్రతి సాయంత్రం మేము అటువేపు షికారు వెడుతో ఆ చిన్నమందిరం ఎవరు ఎందుకు కట్టించి వుంటారా? అని ఆశ్చర్య పోయేవాళ్ళం. ఆలయంలో ద్రౌపతే అమ్మవారై విగ్రహరూపంలో వుంటే, ఎంత అపురూపంగా వుంటుందో: అనిపించేది. కాని ఆ కాస్త దూరం నడిచి ఆ కుతూహలాన్ని మేము తీర్చుకో దలుచుకో లేదు.

ఒక రోజు పొద్దున్న రాజయ్యరు వొచ్చి "ఓ రెండు రోజులు ఈ మంచాన్ని ఎరువు ఇయ్యండి" అని తీసుకు పోతున్నారు.

"ఎవరికి" అన్నాం.

"టీ స్వామియార్ కి, అత న్నెరగరూ ?" అంటూనే వెళ్ళి పోయారు.

ఆ సాయంత్రం మేము ద్రౌపతిగుళ్ళో కూచుందామని వెళ్ళే టప్పటికి ఆ ద్రౌపతిగుడి వరండాలోంచి కంఠాలు వినపడు తున్నాయి. పూర్తిగా లోపలికి వెళ్ళి చూడకండానే వొచ్చేశాం.

వొస్తో వుండగా మా మంచం కనపడింది."ఆ టీ స్వామియార్ ఇక్కడ వుంటా డన్నమాట."

మర్నాడు రాజయ్యరుని అడిగాను అతని గురించి. అతన్ని మేము చీకట్లో తప్ప పూర్తి వెలుగులో చూడలేదు.

రమణబృందంలోకి ఎట్లా ప్రవేశించారో? అక్కడక్కడ ఏదో ఒక పనిమీద తిరుగుతో కనబడేవారు. ఆ తరువాత. మా ఇంటిపక్క పరశురాం కూతురు చిన్నకణ్ణుకి **tution teacher** కింద, తర్వాత త్వరలోనే పాల్‌బ్రంటన్ తెరలవెనక **private secretary** కింద దర్శన మిచ్చాడే; అతనే ఇతను.

"ఎవరండీ ఈ టీ స్వామియార్".

దానికి రాజయ్యర్ "అతనా? రోజూ చూస్తూ వుంటారుకదూ! ఇట్లా పోతూ వుంటాడు. మీ మంచం తీసుకువెళ్ళింది అతనికోసమే కదండీ! రోజూ రెండుసార్లు మీ ఇంటి ముందునించి వెడతాడు, ఎవరితోనూ మాట్లాడకండా" అతనే టీ స్వామియార్.

టీ స్వామియార్ అంటే ఎవరో అనుకున్నాం.

ఆ ఎండాకాలం షికారులో మా కాకా కిట్టాలకు దాహానికి నీళ్ళు ఇవ్వడానికి మా టీకెటిల్‌లో నీళ్ళు తీసుకుపోతో "దాంట్లో ఏమున్నా యని" ఎవరో అడిగితే— "కనపడటం లేదా? ఇది టీ కెటిల్! నేను టీ కెటిల్ స్వామియార్‌ని" అన్నాడు చలం.

"ఇంక నా మంచం నాకు ఇవ్వకూడదా?" అని అడిగాను రాజయ్యర్‌ని.

ఆ సాయంత్రం మేము వెళ్ళేప్పటికి ఆ గుడిలో పొయ్యి వెలిగించి వుంది. ఎవరూ లేరు. ఓ కుండలో నీళ్ళు వున్నాయి.

మర్నాడు రాజయ్యర్‌ని అడిగాను.

"ఆయన ఆ గుళ్ళోనే వొండు కుంటారా?" అని.

"మీకు తెలియదా? ఆయనే టీ స్వామియార్. ఆయనకు భోజనం లేదు, ఏమీ లేదు. టీ మాత్రం తాగి బతుకుతారు. ఆ నీళ్ళు అక్కడే కాచుకుంటారు. అందుకే టీ స్వామియార్ అయినాడు" అన్నారు.

ఇంకో రోజు సాయంత్రం వెళ్ళేప్పటికి గుళ్ళో ఎవరూ కన్పించ లేదు. మాతో వొచ్చిన పచ్చమ్మ మేము వొచ్చేస్తూ వుండగా, "టీ స్వామియార్" అని కేకేసింది.

"ఆ!" అని బదులు పలికారు ఎవరో చీకట్లో. ఆయనకి ఆ పేరు తెలుసు నన్నమాట. బైట అరుగుమీద కూచున్నాం మేము. కాకరకాయలు ఎన్నివిధాల కూరలు చేయవొచ్చో చెబుతోంది షౌ. కృష్ణారావు రాస్తున్నాడు. చీకట్లోంచి ఒక పాయ చీల్చుకుని బైటపడ్డట్లు వొచ్చి నుంచున్నారు టీ స్వామియార్ !

"నమస్కారం అమ్మా" అన్నాడు షౌతో మాత్రం-మమ్మల్నందర్నీ వొదిలేసి. తరువాత నాతో "నాకు సహాయం చేయాలి, నాకు పతినెల చక్కెర కొనిపెట్టాలి లేదా నేను తెచ్చుకుంటాను. నాకు ఒక రూపాయి ఇవ్వాలి" అన్నాడు. 'సరే' నన్నాను. ప్రతీనెల 1stన వొచ్చేవాడు. నేను ఇంట్లో లేకపోయినా ఆయన రాగానే ఆ రూపాయి ఇయ్యమని చెప్పి పోయేవాడిని. మాకు పుట్టిన కొన్నిసందేహాల్ని ఆయన తీర్చాలని చూసేవాడు. మేము ఏమి అడిగేవాళ్ళం కాదు. ఆయనే కొన్ని ప్రశ్నలు రేపి సమాధానాలు చెప్పి వెళ్ళేవాడు. ఆయన ఇట్లా చేస్తో

వుంటే ఆయన మీద కొంత కనికరమేకాక కొంత ఇష్టంకూడా వొచ్చేది మాకు. క్రమంగా షాకి చాలా అనవసరమైన ఉపన్యాసాలు మొదలు పెట్టేవాడు.

"ఇంతకన్నా ఏంచేయాలో చెప్పండి. ఈ తపస్సంతా ఎందుకు చేయడం" అనేవాడు. ఎవరేం చెప్పినా వినిపించుకునే వాడు కాదు. అతని గొడవ అతనిదే. "నేనింక వూరు కోలేను. నాకు ఆత్మ సాక్షాత్కారం అవనన్నా అవాలి. లేదా ఆత్మహత్యైనా చేసుకుంటాను" అని మొండి కేసేవాడు.

"అంత తొందర పడకండి. భగవాన్‌మీద విశ్వాసం వుంచి ఆయన ఎట్లాచేస్తే అట్లా వొప్పుకోండి" అంది షా. ఒకరోజు మేము షికారుకి వెళ్ళి వొస్తుండేసరికి ఇంటి దగ్గర ఒక కారు ఆగి వుంది. అందులోంచి కొందరు దిగి షాతో మాట్లాడు తున్నారు. వాళ్ళు టీ స్వామియార్ గురించి వొచ్చారు. వాళ్ళు చెప్పిందేమంటే అతను వాళ్ళవూళ్ళో ధనవంతుడుట. హఠం వేసుకుని కూచుని ఈశ్వరుడు ఆత్మసాక్షాత్కారం ఇవ్వాలని, ఇవ్వకపోతే తిండిలేకండా ప్రాయోపవేశం చేస్తానని మొండికేసి ఈవూళ్ళో కూచున్నాడుట. అతనికి. ఏదోవిధంగా నచ్చజెప్పి వాళ్ళవూరు పంపించమని షాని అడిగారు. షా ఆ వ్యవహారం తనకేమీ తెలియదని అతన్నే అడగమంది. అతను వొప్పుకోకపోతే విసుగెత్తి వెళ్ళిపోయారు వాళ్ళు.

చక్కెర దొరకటం లేదుకనక ఎట్లాగో ఓలాగు మమ్మల్ని చక్కెర సంపాదించి పెట్టమనే వాడు. ఐతే అదిమాకు సాధ్య పడలేదు. ఇంక మామీద విసుగెత్తి ఈవూళ్ళో వుండడం అసాధ్య మవుతోందని యమలింగేశ్వర ఆలయంలో వుండపోతున్నానని చెప్పి ఒక్కడు ఆ అడివిలో ఏ భయమూ లేకండా వుంటున్నాడు.

కొన్నాళ్ళకి అక్కడా లేడు. ఏమయ్యాడని విచారిస్తే వాళ్ళ బంధువులు అక్కడికి వొచ్చి ఆయన్ని అక్కడినించి బలవంతంగా వాళ్ళ వూరు తీసుకు వెళ్ళారని కొన్నాళ్ళకక్కడ చచ్చిపోయాడని తెలిసింది.

అప్పట్లోనే మాధవి అనే అమ్మాయి "నాకు మీ రక్షణకావాలి" అని చలంగారికి వుత్తరం రాసింది. షౌని అడిగి "తప్పకుండా రమ్మ"ని చలంగా రామెకి జవాబు ఇచ్చారు.

మాధవి వొచ్చింది. ఆ అమ్మాయి ఎంత చలాకి అయిన అమ్మాయో! కొంతమంది రచయితలమధ్య మెలిగిన ఆమె. ఆవిడ తనతో ఏమీ తెచ్చుకో లేదు. (దాదాపు) కట్టుబట్టలతో వొచ్చేసింది. రాజుగారు జాలిపడి ఆవిడకి అవసరం అయిన వస్తువులు కొనిపెట్టాలనుకున్నారు.

"నాకట్లా తీసుకోవడం ఇష్టంలేదు. ఒకరి దాక్షిణ్యాన్ని భరించడం కష్టం" అంది మాధవి.

నర్తకి నిర్లిప్తంగా నవ్వి "మేమంతా ఎట్లా బతుకుతున్నాం. మాకట్లా అనిపిస్తుందా?" అంది. ఆమాట వినేసరికి కనువిప్పై రాజుగారి సహాయాన్ని తీసుకునేందుకు ఒప్పుకుంది.

మాధవి కెంతో **sense of humour.** ఇక్కడికి వొచ్చాక కూడా చాలా షోకుగా వుండేది మాధవి. ఒకరోజు షౌ "మాధవీ! రెండు జడలెందుకు వేసుకుంటావు? ఒకే జడ వేసుకుంటే బావుంటుంది" అన్నారు మాధవితో. అప్పటినించి పూర్తిగా తన రూపాన్నే మార్చేసుకుంది. రమణస్థాన్‌లో ఈవిడ వంటావిడా? అనిపించేంత సాధారణంగా వుండేది. రానురాను ఆఅమ్మాయికి తన ఒంటిమీద బట్టలు ఎలా వున్నాయన్న దృష్టికూడా పోయింది.

వంట చేయడమంటే మాధవికి చాలా బాధ. "తిండిమీద మీరింత శ్రద్ధ తీసుకుంటా రేమిటి?" అని సణుక్కునేది. మాధవి మంచి

పెంకిఘటం. నర్తకీ వాళ్ళు ఆమెకి పనులు చెప్పేవారు. రమణస్థాన్‌లో అందరికీ పని చెప్పమని షా ఆదేశం. పని చెప్పమని ఎందుకు **insist** చేస్తారో ఆమె మాటల్లోనే విందాం.

"అరుణాచలం వాతావరణాన్ని ఎవరూ భరించలేరు. అందుకనే ఇన్ని వ్యాపకాలు కల్పించడం. కొందరు నర్తకి పనులు చెప్పిందని విసుక్కుంటారు. నేను పని చెప్పమంటాను. ఇక్కడ పనిలేక సోమరిగా కూచుంటే ఈ వాతావరణంలోని వుధృతం తట్టుకోలేక పిచ్చెత్తిపోతుంది".

(ఈనాటి మాట - (సౌరిస్ సంభాషణలు) సేకరణ రామానంద)

కానీ మాధవి పని చెప్పినప్పుడల్లా పెంకితనం చేసేది. దాంతో నర్తకి వాళ్ళు కోప్పడేవారు. ఆ అమ్మాయి వాళ్ళతో పోట్లాడేది. ఏడుస్తూ షా దగ్గరకి వొచ్చేది.

"వీళ్ళు నన్నిలా అంటున్నారు. అలా అంటున్నారు" అని **complain** చేసేది. "మరి నువ్వేమన్నావు" అని అడిగేవారు షా. దాంతో మాధవికి రోషం వొచ్చేది.

ఆమెపట్ల రమణస్థానీయులు చూపిన ఓర్పుకి, సహనానికి వాళ్ళని ఎంతగా **admire** చెయ్యొచ్చో! ఎప్పుడన్నా వాళ్ళింక భరించలేకపోతే ఆ అమ్మాయి తమకి అలివి కాకపోతే వాళ్ళు షాకి **complain** చేసేవారు.

"వీళ్ళు నన్నేమి అనరేం ?" అని **defiant** గా అడిగేది షాని మాధవి.

"అవునమ్మా! వాళ్ళు సహనం నేర్చుకున్నారు, అందుకని నిన్నేమి అనరు" అనేవారు షా.

"మీకు పక్షపాతం. డాలీ అంటేనే మీ కెక్కువ ప్రేమ. నే నేమి కాదు మీకు" అని షౌతో పోట్లాడేది. ఇంక పట్టలేక షౌ ఒళ్ళో వాలి ఏడ్చేది. ఆమెకి అంతా అర్థం అయ్యేలా చెప్పాలని చూచే వారు షౌ.

కానీ ఆమెకి చెప్ప ప్రయోజనం లేదు. షౌని ఏవేవో మాట లనేది. నిర్గుణమైన షౌ వ్యక్తిత్వానికి సంకుచిత గుణా లంటగట్టేది. అయినా షౌ ఏమి మాటలాడే వారు కాదు. ఆమెకి స్పష్టంగా తెలుసది మారని ఘటమని.

ఓ సారి మాధవి షౌని ఏదో అన్నది. అప్పుడు షౌ "మాధవీ! నీకు సరైన మాట దొరకలేదు. నన్నేమనాలో తెలుసా? నన్ను **tyrant** (నిరంకుశురాలు) అనాలి, ఎందుకంటే ప్రేమించేవాళ్ళే **tyrants** అవుతారు" అని అన్నారు షౌ. మళ్ళీ మారుమాట పలుకలేదు మాధవి.

అందంమీద మాధవికి ఎంతో గొప్ప దృష్టి. జీవితాన్ని ఒక గొప్ప అనుభవంలా లోతుగా తీసుకునే మనిషిలా కనపడేది ఆమె. మాధవికి చలంగారిమీద అత్యంతమైన ప్రేమ. చలం మాటాడినా, కదిలినా ఎంతో కదిలిపోయేది.

అప్పట్లోనే సత్యనారాయణసింగ్, చక్రపాణి నరసింహారావు అనే ఇద్దరు రమణస్థాన్‌లో సాధకులుగా చేరారు. మళ్ళీ రమణస్థాన్ కలకల లాడడం మొదలు పెట్టింది.

వజీర్ రహ్మాన్‌కి మద్రాస్‌లో వుద్యోగమై పకపక వెళ్ళిపోయింది. ఈశ్వరుడు చెప్పినట్లుగానే వాళ్ళు ఒక చిన్నగదిలోనే వుండే వారు. అప్పట్లో వజీర్‌కి చిన్న జీతం.

వజీర్ కుటుంబీకులకి వజీర్ పకపకల పెళ్ళి గురించి తెలిసి ఎంతో సంతోషించారు. పకపకని వాళ్ళలో ఒకర్తెగా తీసుకున్నారు.

వజీర్‌ని చూస్తే షాకి చాలా జాలిగా వుండేది —— హాయిగా artist గా బతక్క ఈ ఆఫీసుల్లో భరించలేని వాతావరణాల్లో పకపక కోసం దిగారే—— అని. ఆయనకి కాలేజీ లెక్చరర్ అవాలని ఆకాంక్ష. కానీ అది నెరవేరలేదు.

ఇంతలో రాజుగారు పుస్తకాల ప్రచురణ ప్రయత్నంలో వెళ్ళిపోయారు.

మాధవికి ఆస్పత్రిలో ఒకకొడుకు పుట్టాడు. ఆస్పత్రి డాక్టర్లు ఆ పిల్లవాడు బతకడని చెప్పారు. మాధవినీ ఆ పిల్లవాడినీ చిత్ర, నర్తకి ఆస్పత్రికి వెళ్ళి చూసివొస్తూ వుండేవారు.

మాధవి ఆస్పత్రి నించి ఇంటికి వొచ్చేసింది. ఆ పిల్లవాడ్ని ఎత్తుకోవడమే భయం- అందరికి. అంత అర్భకుడుగా వుండేవాడు. వాడికి చిన్నబేసిన్‌లో నీళ్ళు పోసేవారు షా. మాధవికి పిల్లవాడికి పాలివ్వడంకూడా చాతకాదు. చిత్ర, షా ఆమెకి దగ్గరుండి నేర్పించారు. వేలెడంత వుండడాన ఆపిల్లవాడికి వేలుగాడని పేరు పెట్టారు. మాధవి వాడిని ప్రిన్స్ ఆఫ్ వేల్స్ అని పిలిచేది.

మిశ్రీ చాలా ప్రత్యేకమైన పాపాయి. డాలీ తరువాత మిశ్రీలోనే అలాంటి ప్రత్యేకత చూశారు షా. చలంగారు నర్తకి అప్పుడప్పుడు గుడికి వెడుతూ వుండేవారు. ఒకసారి గుడికి బయల్దేరుతో

"గుడికి పిల్లల్ని తీసుకుని వెళ్దామా, వద్దా?" అంది నర్తకి.

మిశ్రీ నిద్ర పోకపోతే వెంట తీసుకుని వెళ్దాం" అన్నారు చలంగారు.

మిశ్రీ గుడికి వెళ్ళేసమయానికి బలవంతంగా నిద్రని ఆపుకుని మేలుకుని వుంది. దాంతో వాళ్ళకి మిశ్రీని తీసుకువెళ్ళక తప్పలేదు. ఇంక గుడికి వెళ్ళివొచ్చాక ఆ పాపలో ఎంతమార్పో ఆ కళ్ళలో, ఆముఖంలో!

మాధవి ఎంత చలాకీయో! ఆ పిల్లవాడ్ని ఎత్తుకుని గొప్పసం తోషంతో గంతులు వేసేది. మిశ్రీకి వాడంటే అమితమైన ముద్దు. ఆ పిల్లవాడిని తను మోసుకుంటూ పొస్తూవున్నట్లు మిశ్రీ పట్టుకుంటే మాధవి వాడిని షా దగ్గరకి తీసుకుని వొచ్చేది. మిశ్రీ తను వాడికి అక్కని అని చెప్పాలని- వాడిని చూపించి 'అక్క' అనేది. అందు వల్లనే వాడికి 'అక్కా సాహెబ్' అని ఇంకోపేరు వొచ్చింది. వేలు గాడు అయిదునెలలు వొచ్చేసరికి మాంచి ఒళ్ళు చేశాడు. తెల్లగా బొద్దుగా ముద్దు వొచ్చేవాడు.

నెలదాటని పసివాడుగా వున్నప్పుడు వేలుగాడు షా వాడి వుయ్యాల దగ్గరకి వెడితే- 'ఎత్తుకో' అన్నట్లు చేతులు చాచేవాడు. భజ న్లలోనూ, చదువుకునేవేళల్లోనూ షా పక్కన వాడిని పడుకో బెట్టేది మాధవి. భజనముందు షా పిల్లలకి కథలు చెబుతూ వుంటే వాడుకూడా 'వూ' కొట్టేవాడు.

అప్పట్లో భజనలో ఆవేళ పాడే ఏ నామావళి (హరేరామో, చం ద్రశేఖరో) అందరూ చెప్పుకోవాలి. తప్పుచెప్పిన వారికి మార్కులు లేవు. సరిగా చెప్పేవారికి మార్కులు వేసేవారు. వేలుగాడికి రెండు వేళ్ళు చూపితే ఒకవేలు పట్టుకునే వాడు. వాడికికూడా మార్కులు వేసే వారు షా. అవన్నీ సీరియస్‌గా ఒక పట్టీరాసి పెట్టేది మాధవి.

చలంగారు మిశ్రీకోసం ఒక చెక్కబండి చేయించారు. అది రథంలాగ వుండేది. మాధవి వేలుగాడ్ని దాంట్లో పడుకోబెట్టుకుని తాడు కట్టి లాక్కుని వెళ్ళేది. ఆ అమ్మాయిలోంచి సంతోషమూ, ఉత్సా హమూ పొంగుకుని వొచ్చేవి. నర్తకి మాధవిని "పిల్లవాడికోసం నువ్వు ఇక్కడే వుండిపో" అని చెప్పేది. కానీ రంగురంగుల జీవితానికి అల వాటుపడ్డ మాధవికి వెళ్ళిపోవాలనిపించేది పాపం. కాని అట్లాగే

తమాయించుకుని దగ్గర దగ్గర రమణస్థాన్‌లో ఏడాదిపాటు వుంది వేలు గాడి కోసం.

పిల్లవాడు పుట్టిన కొన్నినెలలకి మామ్మగారు రమణస్థాన్ వొచ్చారు. ఆవిడ వేదాంతి, అనుభవజ్ఞురాలు. కానీ అంతటి ఆమె ఓ చిన్నపిల్ల మల్లే మాధవి కన్న ఎక్కువ గంతులు వేసేవారు.

మాధవి మరీ పెంకితనాలు చేసినప్పుడు మామ్మగారు "అట్లా చేయకూడ దమ్మా!" అని కొంచెం మందలించే వారు.

"మీరు చెప్పక్కరలేదు లెండి. షౌ చెబుతుంది" అనేది మాధవి.

ఒకరోజు పికారులో షౌతో "ఇలా అంటోందమ్మా ఆ అమ్మాయి నాతో. ఇక్కడ చేరింది ఎందుకు? తన పరిస్థితిని తాను తెలుసుకో నక్కర్లేదా? అమ్మా! నాకూ్కడా అప్పుడప్పుడు అహం లేస్తూ వుంటుంది. పెద్దదాన్నని చూడకుండా నాఅహం మీద ఒక్కో దెబ్బ వేస్తూ వుండండి" అన్నారు మామ్మగారు.

మామ్మగారు వాళ్ళవూర్లో అందరికీ ఒకగురువు. ఆమె నమ్రత చూస్తే షౌకి ఎంత ముచ్చట వేసిందో! ఆవిడ నవ్వుతూ షౌతో అనే వారు "అక్కడ వుంటే నాలోంచి అహం లేస్తుంది. ఆఅహం అణచు కోవడానికే ఇక్కడికి వొస్తూ వుంటానమ్మా" అని.

చలంగారు వాళ్ళు అందరూ వరండాలో పడుకునే వారు. మిశ్రీ రాత్రి లేచి ఏడుస్తూ వుంటే చలంగారు వుయ్యాలలో పడుకో బెట్టి

"భక్త జీవన పరమ పావన
ముక్తిదాయక భువన నాయక"

అని జోల పాడేవారు. చలంగారు అంతసేపు మేలుకుంటున్నా రని, వారిని పడుకోమని చెప్పి అదే లాలిపాట తానుపాడి, మిశ్రీని నిద్ర పుచ్చేవారు మామ్మగారు.

మామ్మగారు భజన్లలో సాంప్రదాయిక గీతాలు, భక్తిగీతాలు అచ్చతెలుగులో పాడేవారు. అవి ఎంత బాగా వుండేవో !

మాధవి ఇక్కడొక ఏడాదిపాటు వున్నాక ఆమెకి మళ్ళీ తిరిగి తన చోటుకి వెళ్ళాలని బుద్ధి పుట్టింది. ఒకరోజు షౌ, మాధవి మాత్రమే షికారు వెడుతున్నారు. నడుస్తూ వుండగా మాధవి హఠాత్తుగా వేలు గాడ్ని షౌ చేతికి ఇచ్చేసి "ఇప్పటినించీ వీడు నీవాడు. నీ కప్పగించి వెళ్ళిపో బోతున్నాను" అంది.

"ఆవిడ నా చేతికి ఇచ్చింది గనక నేను తప్పకండా పెంచు తాను" అన్నారు షౌ. కాని ఆశ్రమంలో ఎవరికీ షౌ ఆ పిల్లవాడ్ని పెంచడం ఇష్టంలేదు.

తరువాత వాళ్ళు ఆమెతోనే మాట్లాడి పిల్లవాడ్ని ఆమె వెంట తీసుకుని వెళ్ళేట్లు ఏర్పాటు చేశారు. ఆ విధంగా మాధవి ఆశ్రమరక్షణ నించి- కోరి విశాల ప్రపంచంలో రంగు రంగుల జీవితంలోకి నడిచి వెళ్ళిపోయింది.

మాధవి నిష్క్రమణానంతరంకూడ వేలుగాడు షౌ కలల్లో కని పించేవాడు, అక్కడ ఒకళే ఏడుస్తూవున్నట్లు. ఇక్కడెప్పుడూ గొప్ప ఆనందంలో వుండే పిల్లవాడు అక్కడ సుఖంగా లేకండా, ఈదురో మని వున్నాడని అతన్ని చూసి వొచ్చిన వారొకరు చెప్పారు షౌకి.

ఈ విధంగా ఆపదలో వున్నవారు, దుఃఖితులు, వోదార్పుకోసం అల్లాడేవారు, ఈ లోకంలో ఎక్కడా దిక్కు అనేది లేని దీనులు, సంఘ బహిష్కృతులు, ఎంతమంది స్త్రీలు, తల్లుల్ని వొదిలి వొచ్చిన పిల్లలు, ఈశ్వరవిలాసిని షౌ, చలంమహర్షి, మమతామయి నర్తకి గార్ల దగ్గర రక్షణపొంది ఎంత సంతోషంతో వారి జీవితాలలో ఒక గొప్ప **fulfilment** జరిగినట్టు తృప్తిపడ్డారో!

## 22

తారకంగారు చలంగారికి చిన్నప్పటినించీ స్నేహితులు. ఆయన చలంగారింటికి తరచు వొస్తూ వుండేవారు. చలంగారు బెజవాడలో వున్నప్పుడు ఆయన భార్య సుగుణమ్మతో, కొడుకుతో కలిసి చలంగార్ని చూడడానికి వొచ్చారు.

ఇటీవల కాలంలో మద్రాస్ ప్రాంతాలకి వొచ్చినప్పుడు ఆయన తిరిగి సుగుణమ్మగారితో మనవల్తో కలిసి చలంగారు వాళ్ళని చూడటానికి వొచ్చారు. ఆయన చలంగారితో మాట్లాడుతూ "నాకు పాపం ఏమిటో, పుణ్యం ఏమిటో తెలియదు. నేను జీవితం అంతా దేన్ని మంచి అనుకున్నానో దేనికి జంకకుండా దానిని చేసి తీరాను. నా ఈశ్వరుడిలో నాకు అప్పుడు ఎంత భక్తి విశ్వాసా లున్నాయో ఇప్పుడూ అంతే భక్తి. అంతవరకే నాకు తెలుసు. ఇంకేం తెలియదు" అని అన్నారు.

ఇంకాయన భార్యని చూస్తూ వుంటే షౌకి ఆమె ఆయనని భర్తగా కాదు ఒక దైవంగా చూసుకుంటోం దనిపించింది. ఆమె మాటలోనూ, తీరులోనూ అట్లా కనపడింది షౌకి, మాటల్లో. ఆమె చనిపోయిన తరువాత ఆయన ఏమై పోయుంటారో నని తలుచుకున్నప్పుడల్లా షౌకి ఎంతో బాధగా అనిపిస్తుంది.

చలం, "చలం మిత్రులు" రాసిన తరువాత తారకంగారు ఒకసారి అరుణాచలం వొచ్చారు. చలంగారు ఆయనకి ఆయన గురించి రాసింది చదివారు. చలం ఆయన చేసిన త్యాగం గురించి రాసింది చదువుతున్నప్పుడు ఆయన చిర్నవ్వుతో **"It is all mere selfishness"** అన్నారు. అది సహజమే. త్యాగంచేసిన వారికి తాము త్యాగం చేశామని తెలియదు. అది తారకంగారిలో వున్న ప్రత్యేకత.

మామ్మగారి రాకతో శ్రీరమణస్థానానికి ఆశ్రమ వాతావరణం పట్టింది. ఆవిడ నోటినించి వేదాంత శ్లోకాలు తళుక్కు మనేవి. ఆవిడ ఇంటికొక పెద్దదిక్కయి అందరికీ తలలో నాలుకై నిలిచి పోయారు. పసివాళ్ళ ఆటలలో అలకలు తీర్చడం నించి వంటా వార్పులో సులువు బలువులు వివరించడం దాకా ఆమె లేని అంశం లేదు. అన్నిటిలోనూ తోడ్పడుతూ వుండేది ఆమె చల్లని చెయ్యి.

ఆ రోజుల్లో ఆంధ్రదేశం నాలుగుదిక్కుల నించి పసివారినించి పండుముసలివారి వరకూ చలంగారిపైన వుత్తరాల వర్షం కురిపించే వారు. అప్పట్లో రమణాశ్రమం పోష్టాఫీసులో టపాలో 3/4 వంతులు చలంగారివే. అవి చలం మహర్షి జీవితంలో గొప్పగావెలిగిన రోజులు.

తమ రక్తంలో వసంతకుసుమాలు పరిమళిస్తున్న యవ్వనంతో మత్తెక్కి కలల్లోకి పోతున్న లోకంలో అందాలకి కళ్ళు తెరుస్తున్న యువకులు- స్వేచ్ఛత్వాన్ని ప్రేమించే యువకులు - చలంమీద ప్రేమ తో, ఆరాధనతో ఆయన రచనలలోని వేడి, వాడి ఐన సత్యాలకీ, సౌందర్యాలకీ తమ హృదయాల్ని విప్పుకుని చలంమహర్షి సందర్శ నార్థం అరుణాచలం వొచ్చేవారు. ఇంకెంత మందో లేఖలద్వారా చలం మహర్షి ఆదేశాలను కోరి వాటిని అనుష్ఠించేవారు.

కరుణార్ద్రితమైన చలం కలం యువకులకి సత్యాన్వేషణ పథంలో నడిచేందుకు వుత్తరాలద్వారా గొప్ప బలాన్ని ఇచ్చింది. చలంమహర్షి ఆ రోజుల్లో తమ లేఖల్లో రాసిన ప్రతి మాట అక్షర సత్యాలు. చలం లేఖలు ముఖ్యంగా కురంగేశ్వర్, వజీర్ రహ్మాన్, ప్రసాద్, వీరేశలింగం, జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి, శివం, జానకీ రాణి, బి. వి. నరసింహారావు, సంజీవదేవ్, జవహర్, నాగేశ్వరరావు .... ప్రభృతులకి రాసినవి వారు భద్రపరిచారు. ఆ విధంగా చలం

రాసిన వుత్తరాలు ఎందరెందరి దగ్గర వున్నాయో అవన్నీ ప్రచురిత మైతే భక్తి, వైరాగ్యం, కవిత్వం, తత్వం, సంగీతం, శాస్త్రం, తర్కం .... ఇత్యాది విషయ బాహుళ్యంపై చలం మహర్షి లేఖిని నించి సాగిన జ్ఞానసింధువునీ, ఈశ్వర కరుణా విహారాన్ని చూడవచ్చు. కానీ ఆ కలని ఈశ్వరు డెప్పుడు నిజంచేస్తారో!

చలంగారికోసం వొచ్చిన అభిమానులలో కొందరు సౌరిస్ (ఈశ్వరుడి) వైపుకి తిరిగేవారు, మిగిలిన వారంతా చలంమహర్షి చుట్టూరా పెద్ద బృందంగా చేరేవారు. నర్తకి చలంమహర్షి వెంటనే 'నీడ' లాగ వుండేది. కృష్ణారావుగారో, అన్ని బృందాలలోని సందడి ఆయనదే. ఇటూ, అటూ సుగంధితమైన మలయపవనంలా తిరిగేవారు. చిత్ర ఏ గ్రూప్‌లోనూ చేరకుండా అన్ని బృందాలమీద- విమర్శలు, ఛలోక్తులు విసిరేది— రేడియోలో ప్రత్యక్ష వ్యాఖ్యాతలాగ.

చలంమహర్షి ఆశ్రమానికి కొత్తగా వొచ్చినవారికి **at home** గా **feel** అయ్యేలా కృష్ణారావుగారు వారికి ప్రతీవిషయం సాదరంగా వివరించి చెప్పి వారి బెరుకుని పోగొట్టేవారు. వచ్చినవారు తమ అభిరుచులకు అనుగుణంగా ఏదో ఒక బృందంలో చేరి ఆనందంగా కాలాన్ని గడిపేవారు.

నర్తకి చిత్రల ఆధ్వర్యంలో మొదట్నించీ **compound** నౌకర్ల సమావేశాలు జరిగేవి. అధ్యక్షురాలు చిత్ర. ఉపాధ్యక్షురాలు నర్తకి. వాళ్ళ కుటుంబాలలో వుండే సుఖదుఃఖాలు మంచిచెడులు అన్నీ పరామర్శించి అవసరమైన సలహా, సహకారాలు అందజేసేవారు.

సాయంత్రాలు వూళ్ళోవాళ్ళు కొందరు చిత్ర చుట్టూ చేరేవారు. ముఖ్యంగా సారంగపాణి, గంగాధరం, కందన్, చిన్నరాజు వొచ్చేవారు. కిట్టూ వాళ్ళకి చతురోక్తులని పేరు పెట్టింది. ఇంక వారందరూ

శ్లోకాభిరామాయణం సాగించేవారు. చిత్ర ఆ సమావేశానికి permanent president. ఆ సమావేశాలు అట్లా కొన్నేళ్ళు అవిచ్ఛిన్నంగా సాగాయి.

"కాకా, కిట్టూ అనే రెండు పుద్యమాల్లన్ని బైల్లుదేర దీసి లోకం మీదికి వొదిలింది చిత్ర. వాళ్ళిద్దరితో ఎక్కడున్నానో మర్చిపోతు న్నాను." (శాస్త్రిగారికి చలంగారి లేఖ 7-2-60)

ఒకరోజు షికార్లో "కాకాకి అయిదేళ్ళు నిండాయి. ఇక కాకాని క్లాసుల్లో ప్రవేశపెట్టాలి" అన్నారు షా. కాకా క్రానిక్ బ్రోంకయిటీస్‌తో బాధపడేది. అందువల్లనే యోగాసనాలు వేయించేవారు షా. కాకా యోగాసనాల్లు వెయ్యడం చూచి కిట్టూకూడా వొచ్చి యోగాసనాలు చెయ్యడం మొదలుపెట్టింది. కూరలు తరగడం మొదలైన చిన్నచిన్న పనులు చేసేవారు కాకా, కిట్టూ- షా ఆదేశం ప్రకారం.

మొట్టమొదట వాళ్ళిద్దరికీ బసవరాజుగారి దగ్గర క్లాసులు పెట్టించారు షా. కానీ చలంగారు వాళ్ళకి ఆయన దగ్గర, వాళ్ళ చదువు సంతృప్తికరంగా లేకపోవడంవలన — షా 'వాళ్ళ' ని అరుణాచలంలోనే వున్న 'కన్యకాపరమేశ్వరి స్కూలు'కి పంపించారు.

కాకా స్కూలుకి వెడుతోంటే కిట్టూకూడా వెంట వెళ్ళేది. కాకా స్కూల్లులో తోటిపిల్లల పలకల్ని పగలకొట్టడం, వాళ్ళని కొట్టడం, కొరకడం, వాళ్ళు రాసుకున్నవి చెరపడం మొదలైన గట్టి అల్లరు చెయ్యడంతో టీచర్ చేసేదేమీలేక కాకాని కొట్టింది. టీచర్ కొట్టింది గనక తాను స్కూలుకి పోనంది కాకా.

సాయంత్రాలు స్కూల్నుంచి 105 డిగ్రీలఫారన్‌హీట్ జ్వరంతో, బ్రోంకయిటీస్ ఎటాక్‌తో ఇంటికి వొచ్చేది. ఇక లాభం లేదని కాకా కిట్టూలని స్కూలు మానిపించి బసవరాజుగారిచేత, చక్రపాణి

నరసింహారావుగారిచేత ఇంటిదగ్గర క్లాసులు పెట్టించారు షా. వాళ్ళు బసవరాజుగారి దగ్గర కొంచెం భయంతో చదువుకున్నాగానీ వాళ్ళకి నరసింహారావుగారంటే బొత్తిగా లెక్కలేదు.

కాకా కిట్టూల అల్లరి మరీ విపరీతమై పోయింది. ఇంక వాళ్ళని అదుపులోకి తేవడానికి ఎ, బి, సి లనే మూడురకాల శిక్షావిధానాలు అమలులోకి తెచ్చారు షా. ఓమోస్తరు అల్లరిచేస్తే- వాళ్ళు షాగదిలోనే కూచుని వుండాలి- బైటికి రమ్మని పిలిచేవరకూ- అది ఏ క్లాస్ శిక్ష. అంతకన్నా భరించలేని అల్లరి చేస్తే నర్తకి-గదిలో పెట్టేశేవారు కొంతసేపు. అది బి క్లాస్ శిక్ష. హద్దులుమీరిన విశృంఖలపు అల్లరి అయితే పాకీదొడ్డి ముందు నుంచోడం అది సి క్లాస్ శిక్ష.

నరసింహారావుగారు చదువు చెపుతోంటే కాకా, కిట్టూ ఆయనని కొరికి, గిల్లి, రక్కి, ఏడిపించుకు తినేవారు. ఆయన ఆ మచ్చలన్నీ షాకి చూపించేవారు. వాళ్ళు కొడితే ఆయనని దెబ్బ వేయమనేవారు షా. కానీ వాళ్ళాయనని కొట్టినా, రక్కినా, గిల్లినా, కొరికినా ఆయన వాళ్ళనేమీ చేసేవారు కాదు.

కాకా సాధకులు వుండే 'అనాసక్తి' కి వెళ్ళి నానాఅల్లరి చేసి వొచ్చేది. ఇంక కాకా వొస్తోంది అనంగానే రాక్షసుల్ని చూచి చెల్లాచెదురై పారిపోయే మునుల్లాగ, అంతటి వీరయోధాగ్రగణులూ గదులలో దూరి తలుపులు వేసుకుని గడియలు పెట్టుకునేవారు.

నరసింహారావు కాకా, కిట్టూల అల్లరిని భరించలేక గోల పెట్టేవారు. మొదట్లో ఆయన అనంతపురం దగ్గర స్కూలు టీచర్. "స్కూల్లో ఆ యాభైమంది పిల్లలకి పాఠాలు చెప్పలేక శరణాగతి అని ఇక్కడికి వొచ్చినా, కర్మ ఎట్లా తప్పుతుందండీ! ('అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం' అన్నారు గీతలో) ఈ ఇద్దరికీ

పాఠాలు చెప్పడం కన్నా ఆ యాభై మందికి చెప్పడం చాలా సులువు" అనేవారు ఆయన. కాకాకి చెప్పినట్లుగా వినాలనే దృష్టివున్నా ఆ శరీరం రక్తం defiant గా ఎదురు తిరిగేవి. సరిగ్గా చిత్ర విషయంలో ఇలాంటి పరిస్థితుల్నే face చేశారు చలంగారు వాళ్ళు. ఆ పాత అనుభవం దృష్ట్యా కాకా, కిట్టూల్ని గట్టి మిలిటరీ డిసిప్లిన్‌లో పెట్టి నడపాల్సి వొచ్చింది షౌకి. షౌ వాళ్ళని ఏ పనైనా ఇది చెయ్యి అంటే చెయ్యాల్సిందే. ప్రశ్నించేందుకు వాళ్ళకి అవకాశం లేదు. ఎందుకంటే వాళ్ళలోంచి ఆ నెత్తురలా ఎదురు తిరిగేది. అట్లా వొదిలివేస్తే పిల్లలు ఎందుకూ పనికిరాకుండా పోతారు. ఒకవేళ స్వేచ్ఛని ఇచ్చినా ఆ స్వేచ్ఛ ఆ పిల్లలకి సుఖాన్ని ఇవ్వదు. ఎందుకంటే వాళ్ళు తమని అదుపులో పెట్టుకుందామన్నా పెట్టుకోలేరు. అలాంటప్పుడు మిలిటరీ డిసిప్లిన్ అవసరం. అందుకే ఆ పద్ధతిని అవలంబించి కాకా కిట్టూలని నడిపారు షౌ.

కాకాది జాలిగుండె. ఎవరు బాధ పడుతున్నా చూడలేక విలవిలలాడేది. కిట్టూకి మృగాలమీద ఎంతదయో! కాకాకి ఎవరూ చెప్పకుండానే షౌ కూడా కూడా వుండి ఆమె కేది అవసరమో ఆసేవ చేసేది. అంత పసిపిల్లా దిండు ఏవిధంగా వేస్తే షౌకి సుఖంగా వుంటుందో ఏ పని ఎలాచేస్తే షౌకి సుఖాన్ని ఇస్తుందో ఆవిధంగా మెలకువతో గొప్ప సేవ చేసేది. అంత చిన్నపిల్లలో ఆదృష్టి ఎలావొచ్చిందా? అని ఆశ్చర్యం వేసేది షౌకి. భగవాన్ దగ్గర మస్తాన్ అనే ముసల్మాన్ భక్తుడు ఇట్లాగే భగవాన్ అడగకుండానే ఆయనకి ఏవింధంగా సుఖంగా వుంటుందో- ఆయన చెప్పకుండానే తనంతట తనబుద్ధికే తోచి ఆవిధంగా సేవలు చేసేవారట. కాకా చేసే సేవని చూస్తూవుంటే అతను జ్ఞాపకం వొచ్చేవాడట షౌకి.

మాణిక్యమ్మగారు కొంత ద్రవ్యాన్ని రమణస్థాన్ కోసమో, రమణ స్థానీయుల కోసమో వినియోగించ దలుచుకున్నారు. రమణస్థాన్ డాబా మీద చిన్న గది కట్టించాలనే ఆకాంక్ష కలిగిందామెకి. "మేడమీద గది కట్టిస్తానమ్మా" అని షౌకి చెప్పి, అట్లానే కట్టించారు. ఇదివరకు ఆ డాబా వైపు పెంకుటిల్లు. అదంతా మేడమీద గదికోసం డాబా చేయించారు మాణిక్యమ్మగారు.

ఒకరోజు సాయంత్రం షౌ హార్మోనియం వాయిస్తూ వుండగా ఒకరువొచ్చి నమస్కారం పెడుతూ మోకరించి కూచున్నారు. ఆయన చెప్పారు తాము గుడిపూడి అనే వూరునించి వొస్తూ వున్నామని. ఆ వూళ్ళో తమ గురువు చలంమహర్షికి గట్టి భక్తులనీ వారు చెప్పగా విని దర్శనార్థం వొచ్చానని చెప్పారు.

ఆయన కేదో గట్టి సమస్యవల్ల ఇక్కడికి వొచ్చామని చెప్పారు. ఆ సమస్య ఇక్కడికి రావడంతో తీరిపోయి ఆయన వెనక్కి వెళ్ళిపోయారు. ఆయనే బ్రహ్మయ్యగారు.

బ్రహ్మయ్యగారి గురువే గుడిపూడినివాసి రాయిడి నాగేశ్వరరావుగారు. ఆయన దగ్గరకి కురంగేశ్వర్, నరసింహస్వామి అడపా తడపా వెళ్ళి వొచ్చేవారు. ఆయన ఎంతో బాగా పాడతారనీ. ఆయన దగ్గర ఎంతో అద్భుతమైన హార్మోనియం వుందనీ, అది తప్పకుండా శ్రీరమణస్థాన్‌లో వుండాల్సిందనీ- వాళ్ళు షౌకి చెప్పేవారు. ఆయన పాటని మెచ్చుకుంటూ చలంమహర్షికి వుత్తరాలు రాసేవారు.

నాగేశ్వరరావుగారికి చలంమహర్షికి వుత్తర ప్రత్యుత్తరాలు (1961 నించి) చాలా రోజుల్నించి సాగుతున్నాయి. ఇంక ఆ సంవత్సరం ఈశ్వరావతరణకి నాగేశ్వరరావుగారు ఆయన బృందం రమణస్థాన్‌కి వొచ్చారు. 1962 ఈశ్వరావతరణోత్సవానికి మల్లే కాకుండా ఈ

మాటు వుత్సవానికి సరిపడా డబ్బు సమకూడింది. ఈసారి పండుగకి ఎంతమందో వొచ్చారు.

నాగేశ్వరరావుగారు 14వ తేదీన సాయంత్రం వొచ్చారు. చలం మహర్షి హార్మోనియం ఆయన చేతికి ఇచ్చారు. ఆరోజు సాయంత్రం పాడా రాయన.

"నేను సాధనగా ఏం చేయాలండీ" అని షౌని అడిగా రాయన.

"ఏమిటండీ! అంత గొప్ప కంఠం, సంగీతం పెట్టుకుని వేరే సాధన ఏం చెయ్యాలి? పాడుతూ వున్నప్పుడు పాట ధ్వనిమీద దృష్టిని పెట్టండి" అన్నారు షౌ.

ఆ తరువాత ఆయన ఎప్పుడూ ఒక్కమాట కూడా మాట్లాడ లేదు. ఇప్పటికీ షౌ పలకరిస్తేనేగాని ఒక్కమాట కూడా మాట్లాడరు రమణస్థాన్‌లో- ఆయన కురంగేశ్వర్‌తో "నాకిక్కడ మాట్లాడవలసిన అవసరం కనబడటల్లేదు" అని అన్నారట.

ఈశ్వరావతరణ నాటి వుదయం ఆయన హార్మోనియం మీద పాడారు "అరుణాచలా, ఘనీభవానంద తరంగా" అని. చలంమహర్షి జీవనకావ్యం 'సుధ' లోని చరణాలవి. ఎంత గొప్పగా వుందో! ఇంటిల్లి పాది చేతుల్లో పనులు ఎక్కడి వక్కడే వొదిలిపెట్టి పరిగెత్తి వొచ్చారు —ఎక్కడి నించి ఈధ్వని వొస్తోందని.

ఏమిటా కంఠం. ఎంత మాధుర్యమో! ఎంతగొప్ప ధ్వనో! అని మెర్‌స్టన్ ఎంతగా మెచ్చుకుందో! అప్పటినించీ ఒకవేళ పాట వినడానికి తాను రాలేకపోయినా నాగేశ్వరరావుగారి పాటని విని పాడు తున్నది ఆయనేనా? అని అడిగేది మెర్‌స్టన్.

ఆ రోజున అందరూ కలిసి గిరిప్రదక్షిణం వెళ్ళారు. వెన్నె లలో నడుస్తున్నారు. సగం దూరం వొచ్చేసరికి పాలవెన్నెల అరుణా

చల పర్వతం చుట్టూ వెలిగిపోతోంది. అందరికీ ఆ పర్వతాన్ని ఆ వెన్నెట్లో చూస్తూ వుంటే ఎంతానందంగా వుందో!

చలంమహర్షికి ఈ మారు గిరిప్రదక్షిణం వెళ్ళడం ఇష్టంలేదు. నడువలేరు కూడా. అందువలన నర్తకి, పిల్లలు ఇంట్లో చలంగారికి తోడుగా వుండిపోయారు.

స్వచ్ఛ శుభ్ర చంద్ర జ్యోత్స్నాభిషిక్తుడైన అరుణాచలేశ్వరుడిని చూసి పరవశించిపోయిన కృష్ణారావుగారు "నాన్న వుంటే ఎంత బావుండేదండీ! నాన్న లేకండా, నాన్న శ్లోకులు లేకండా ప్రదక్షిణంలో ఎంత లోటుగా వుందో" అన్నారు షౌతో.

ఇంటికి తిరిగి వొచ్చేసరికి, ఒంటరిగా కూచుని అరుణాచలం వైపు నిర్నిమేష దృక్కులతో చూస్తున్న చలంమహర్షిని చూసి నాగేశ్వరరావుగారు కదిలిపోయారు. "నాన్నగారిని ఒంటరిగా వొదిలి గిరి ప్రదక్షిణాలకి వెళ్ళొద్దమ్మా" అన్నారు షౌ తో.

ఇక ఆగస్టు పదిహేను గడిచి పోయింది. నాగేశ్వరరావుగారు, అతిథులు అందరూ వెళ్ళిపోయారు. అప్పటినించీ చలంమహర్షికి వుత్తరాలు రాస్తూనే వున్నారు నాగేశ్వరరావుగారు.

"ఒకటి మట్టుకు నిజం. వారు సాక్షాత్ అర్ధనారీశ్వర రూపంలో వున్న— 'సౌరిస్ ఈశ్వరుడు' అనంత జ్యోతీశ్వర రూపం. నాలో అశాంతి- అది అగ్నిగుండం, నాచుట్టూ కాలుస్తూ చిత్రవధచేసి, నా మనస్సులో, శరీరంలో, అణువణువూ, దహిస్తూ వెంటాడేది- ఆ ఈశ్వరశక్తే, వారే నా ప్రభువు, నాథుడు, నేను దీనుడ్ని, అభాగ్యుడ్ని, అశాంతుడ్ని. నా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఉదాత్త అనుదాత్త స్వరాలతో ఆ ఈశ్వరుడ్ని నిరంతరమూ గానంచేస్తూనే వుంటాయి"- అంటారు నాగేశ్వరరావుగారు శివశక్తి స్వరూపిణియైన సౌరిస్‌ని గూర్చి.

(త. సూర్యనారాయణకి నాగేశ్వరరావుగారిలేఖ 4-8-74)

నాగేశ్వరరావుగారి ప్రభావంవల్ల 'గుడిపూడి' ఈశ్వరుడి 'గుడి'గా మారింది. ఆ వూళ్ళో అందరి దృ అరుణాచలం వైపు సౌరిసేశ్వ రుడి వైపు తిరగడం మొదలుపె ంది. ఆ చుట్టుపక్కల వూళ్ళల్లో చలంమహర్షి విరాట్ స్వరూపంల వ్యాపించారు. అదే ఆశ్చర్యం నాకు, తెలుగుదేశం వొదిలిపెట్టి వెళ్ళిన 'అన్వేషి' చలం - 'మహర్షి చలం'గా తెలుగునాట కోదండరాముడితో బాటు ఇలవేల్పుగా ఇంటింటా పూజాపీఠాల్లో నిలిచి పూజ లందుకుంటున్నారు.

చిన్నతనంలో షౌకి కల వొచ్చింది. ఆ కలలో ఒక పల్లె ప్రాంతాలవారు చలంమహర్షి పటానికి పూజలుచేస్తూ వున్నట్లుగా కని పించింది. సరిగ్గా అదే జరిగింది గుడిపూడిలో. చలం, సౌరిస్, భగ వాన్‌ల పటాలు పూజా పీఠాలపైకి ఎక్కి నిరంతరం పూజల నందు కుంటున్నాయి,

అక్కడే కాదు ఎక్కడో హిమాలయాల్లో కాశ్మీరసీమలో మారు మూల పల్లెటూళ్ళలో గూడా సౌరిస్‌కి, భగవాన్‌కి పూజలు జరుగు తున్నాయి.

"గుడిపూడి అంతా ఈశ్వర నిలయ మయింది కదా! నీకెందుకు నరక మయింది ?"

(సోదరి సాంరాజ్యానికి చలంగారి లేఖ 8-10-70)

"కం॥ గుడిపూడి భక్తకోటికి
గుడిపాటి 'చలంబు' 'రమణగురుడు'ను 'సౌరిస్'
గుడిలోన వేల్పులైరట
నడిపింపగ బ్రతుకులెల్ల నవ్యపథానన్"

అని రాశాడు సూ — గుడిపూడిని చూచి. అది సార్థకమే నని పిస్తోంది.

శ్రీరమణస్థానానికి పరిపూర్ణంగా పురాతనకాలంలోని ఆర్షఋషుల ఆశ్రమ పరిమళాలు, ధార్మికతా వాల్లభ్యమూ, శాంతిసుధా మాధుర్యమూ దట్టంగా పట్టాయి. ప్రళయానంతరం శ్రీరమణస్థానధ్వజం పై కెగిరింది.

## 23

" అరుణాచల రూపేణ
పరిణామ ముపాగతమ్
జ్యోతీర్మయం పరం బ్రహ్మ
జ్ఞానాయ మమ కల్పతామ్"

(కావ్యకంఠ గణపతిముని కృత స్తోత్రమ్)

అరుణాచలం జ్యోతిర్లింగం. పర్వతమే శివపార్వతి స్వరూపం. "ఈ క్షేత్రము నందు అరుణాచల మను పర్వతరూపమున శక్తీశ్వరులు వెలిసి, భూమి కంతకు ఆధారకేంద్రమై యున్నారు. అట్టి యీ పరతత్త్వ మనేక భూముల కాధారకేంద్రమగు సూర్యతత్త్వమును బోలి తేజోలింగతత్త్వ మగుచున్నది. అయిన సూర్యునియం దా తత్త్వము బాహ్యదృష్టికి గోచర మగుచుండగా ఇక్కడ అంతర్దృష్టి కలవారికి మాత్రమే గోచర మగును. అట్టి తత్త్వముచే ప్రకాశించు ఈ పర్వతములో దిగువభాగము నవకోణములు కలిగి శ్రీచక్రాకారమున నుండి శక్తి భాగమగుచున్నది. మీది భాగమగు శిఖరము లింగాకృతియై ఈశ్వరభాగ మగుచున్నది. దీనిని బోలిన పర్వత మింకొకటి యెక్కడను లేదని ప్రకృతిశాస్త్రజ్ఞులుసైతము సిద్ధాంత పరచిరి.

మన ఆర్యఋషులు దీని అపురూపపు టాకృతినే గాక, దీని యందున్న దివ్యతత్త్వమునుగూడ గ్రహించి పూజించిరి. అయినను పుష్పాదులచే పూజించువారికి అలవిగాని రూపమైనందున అభిషేకాది

అర్చనలకు వీలగునట్లు కొండదిగువ ఆలయమం దరుణాచల లింగ మును అపీతకుచాంబా విగ్రహమును ప్రతిష్ఠించిరి. ఈ పర్వత రూప మునకు ప్రదక్షిణము సల్పుట కొరకు బాట కొండచుట్టును నిర్మింప బడెను. దాని పొడవుగూడ నవసంజ్ఞాయుతమై తొమ్మిది మైళ్ళుండును. అన్నివిధముల పంచదశీ మహావిద్యను అక్షరముల నిరూపించుచున్న దీ క్షేత్రతత్వము.

('నాయన' [కావ్యకంఠ గణపతిముని చరిత్ర] శ్రీ గుంటూరి లక్ష్మీకాంతం రచన. పుట-125)

తన్త్రవిదో నవయోనితు చక్రం
శోణ ధరాధర రూపముశన్తి
అర్థ మముష్య వపుర్మదనారే
రర్ధనగేన్ద్రసుతే! తవ గాత్రమ్.

(వాశిష్ఠ గణపతి ముని)

తంత్రకోవిదులు తొమ్మిదికోణములు కలిగిన శ్రీచక్రమే అరు ణాచలం అని చెబుతున్నారు. పార్వతీ! శ్రీచక్రరూపమగు ఈ అరుణ గిరి యందలి అర్ధభాగం- శివశరీరం; అర్ధభాగం నీ శరీరం.

శ్రీపురం అనే శ్రీచక్రమే అరుణాచలం. శివచక్రాలు నాలుగు, శక్తి చక్రాలు ఐదు, మొత్తం తొమ్మిది— ఇదే నవావరణాలు కలిగిన శ్రీచక్రం. దీనినే ఉమామహేశ్వర శరీరం అంటారు.

(కావ్యకంఠుల శ్లోకానికి వివరణం)

అరుణాచలానికి ఇటువంటి ప్రాధాన్యత వుండడం వల్లనే భగ వాన్ గిరిప్రదక్షిణ మంటే ప్రత్యేక శ్రద్ధను కనబరిచారు. ఆయన అంతేవాసులైన కావ్యకంఠగణపతిముని, సౌరిస్ అటువంటి దృష్టితోనే తమ శిష్య ప్రశిష్య గణాలకు గిరిప్రదక్షిణా వైశిష్ట్యాన్ని నిరూపించి తాముకూడా అనేక గిరిప్రదక్షిణాలు చేశారు.

"జీవజాలంలో ఒక్క మనిషే ప్రకృతినించి వికృతిగా తిరుగుతున్నది. ప్రకృతికి విరుద్ధంగా వున్న మనిషి ప్రకృతికి అనుగుణ్యంగా తిరగడం నేర్చుకోవాలి. ప్రదక్షిణం అంటే అదే. గుడిలో ఈశ్వరుడి చుట్టూ ప్రదక్షిణాలు చేస్తారు. ఈ అరుణాచలంలో శివుడు శక్తి సమేతుడై గిరిరూపంలో నిలిచి వున్నారు కనకే గిరిని చుట్టడం. అదే గిరి ప్రదక్షిణం."

('ఈనాటి మాట' (సౌరిస్ మాటలు) సేకరణ, రామానంద)

భగవాన్ దర్శనం చేసుకొన్న తొలిరోజులలో సౌరిస్ చేసిన గిరిప్రదక్షిణ కథనాన్ని అరుణాచలం పట్ల భావనల్ని ఆమె మాటల లోనే విందాం.

"గిరిప్రదక్షిణంకి బైలు దేరాము నేనూ, నాన్నా లోకాన్ని, ప్రజల్ని వెనక విడిచి. ఎదురుగుండా మెలికలు తిరిగి వున్న దోవనే చూస్తో నడుస్తున్నాము. ఎటు పోతున్నామో, దానికి అంతమనేది వుందో లేదో కూడా ఆలోచించక ఎదురుగుండా చూస్తూ నడుస్తున్నాము. పెద్ద జయంటు (Giant) లాగ చతికిల బడివుంది అరుణాచలం. పెద్ద రాళ్ళూ,గుట్టలూ, చెట్లగుబుర్లూ, కింద రోడ్డునికూడా feel అవలేదు. అట్లా ఆకాశాన్ని చూస్తో చుట్టూ ఉన్నవి మరిచిపోయి, అదే మా గోల్ (goal) అన్నట్లు చూస్తో పోతున్నాం,

ఎన్ని గంటలయిందో! రోడ్డు ఇటూ, అటూ చెట్లు, పక్కన పెద్దపర్వతం తప్ప ఇంకేమీ కనపడవు, వెడుతున్నామా లేక అక్కడే నుంచున్నామేమో? అనిపిస్తుంది. మళ్ళీ మనుషుల్ని ప్రజల్ని చూస్తామా అని ఆశ్చర్యం వేసింది. life అంటే ఇదే. మనుషుల్లో వున్నాం అనుకుంటున్నాం. ఇంతకాలం ఈపర్వతం ఛుట్టూ, ఈదోవనే ప్రదక్షిణం చేస్తున్నా మనిపించింది. ఇట్లా తెరిపిలేకండా ఎన్నో ఏళ్ళనించి, అనం

తమైన బాటలో ప్రయాణం చేస్తున్నట్టుంది. ఇంక ఇంతే బతుకు. ఇట్లా నడుస్తో వుండడమే ఇంక ఏమీలేదనిపించింది. చెట్ల గుబుర్లూ. చుట్టూ పొలాలూ, అక్కడే నిజంగా, వాస్తవంగా చూశాను. యోగులు wise-men, భగవాన్ సత్యం, దేవుడూ అంటారే అది యీపర్వతంలో కన పడ్డది. ఏదో ఆ వొంటరితనంలో, అడవిలో, ఆ కొండలో కోనలో ఒకజీవం, ఒకశక్తి, ఊపిరి పీలవడం feel అయాను. అడావిడి, మను షులు అందరూ ఎదురైనారు. ప్రాణం లేచివొచ్చింది మూడు గంటల ఏకాంతం తరవాత. దుమ్ముకొట్టుకొని వున్న మమ్మల్ని వెర్రివాళ్ళని చూస్తున్నట్టు చూస్తున్నారు ప్రజలు"

(నవ్యనీతాలు (సౌరిస్ కవితలు) రచనాకాలం 1939)

"నేను పకపక డాబామీద వున్నాం. అరుణాచల పరిసరాల్లో వున్న భూమంతా మామేడతో సహా వూగి పోతోంది. అరుణాచలం లోంచి ఢాం ఢాం అని పెద్దశబ్దాలు వినిపిస్తున్నాయి.

అప్పుడు పకపక భయంతో "షా ఇవన్నీ కూలి పోయేట్టున్నాయి. చూడు నేలంతా ఎట్టా కదిలి పోతోందో" అంది. అప్పుడు నేను- "ఏం భయం లేదు పకపకా! అరుణాచలం ఈ భూమికి axle (ఇరుసు) అందుకనే ఏభయమూ అక్కరలేదు. ఇది కూలి పోదు, కవక ఈ చుట్టూరా ఏవీ కూలీపోవు" అంటున్నాను కల కరిగి పోయింది"

(ఒకనాటి సౌరిస్ స్వప్నోదంతం)

ఈ స్వప్నంలో సౌరిస్ అరుణాచల ప్రాశస్త్యాన్ని వివరించడం గమనించ వొచ్చును. ఈశ్వర విలాసిని సౌరిస్ గురుదేవుడు భగవాన్ అరుణాచలాన్ని భూమికి axle గా పేర్కొనడం అరుణాచల వైశి ష్ట్యాన్ని మరింతగా నిరూపిస్తోంది.

"అరుణాచలం చూస్తోంటే ప్రపంచానికి ఏ సంబంధం లేని ఏకత్వం. ఆ పర్వతం అన్నిటినీ చూస్తూ వూపిరి పీలుస్తున్నట్లు అని పిస్తుంది. ఏదో తెలియని మహత్తరత్వం వుంది, అరుణాచలంలో. ఆమో, ఆయనో అంతేకాని కొండ అని పిలవా లనిపించద్దు. సనాతన కాలం నించి సాక్షిగా నిలిచిన ఈ పర్వతచరణాల నీడలో ఎన్ని జీవన్సులు పుట్టాయో, అస్తమించాయో- సృష్ట్యాది నించీ తండ్రి లాగో, తల్లిలాగో, సాక్షిగా నిలిచింది. ఎంతమంది దేవతలు ఋషులు ఈ కొండ చుట్టూరా నివసించారో! అవన్నీ ఈ వాతావరణంలో స్పందిస్తూ వుంటాయి. ఈధూళిలో నడుస్తూ వుంటేకూడా ఆస్పందనం తెలుస్తుంది. ప్రతీ ఇసుక రేణువుకూడా గొప్ప స్పందనంతో వెలుగుతుంది. ఇట్లాంటి పర్వతం ఎక్కడాలేదు. దీని ముందు హిమాలయాలు కూడా ఏమీకాదు. ఈ విధంగా vibrations తో శాంతి కొండలోంచి emulate కావడం ఎక్కడా చూడం."

(ఈనాటి మాట (సౌరిస్ మాటలు) సేకరణ - రామానంద)

భారతదేశంలో ఇంద్రకీలాద్రి, గోవర్ధనగిరి- - - -మొదలైన చోట్ల పురాతన కాలంలో గిరిప్రదక్షిణ సంప్రదాయం వుండేది కాని పూర్వఋషుల కాలంనించి నేటిదాక ఆ సంప్రదాయం ఒక్క అరుణాచలంలోనే, గోవర్ధన గిరిలోనే నిల్చివుంది.

శ్రీ రమణస్థానీయు లంతా సౌరిస్‌తో కలిసి అనేక గిరిప్రదక్షిణాలు చేశారు. సాధారణంగా వారు ఎండలు ముదురుతున్న కాలంలో గిరిప్రదక్షిణం వెళ్ళినట్లయితే ప్రాతఃకాలం నాలుగు గంటలకి బయలు దేరి గిరిప్రదక్షిణం చేసేవారు. ఇంటికి తిరిగి వొచ్చేసరికి పదిగంటలయ్యేది. అందువల్ల భోజనాలు ముందుగా ఏ hotel నించో arrange చేసుకునేవారు. సారంగపాణి ఆ భోజనాలు ఆర్డర్ ఇచ్చిన జాగానించి

భోజనంతో వొంటెద్దు బండి కదిలిందో లేదో చూచి మరీ ఇంటికి వొచ్చేవారు. ప్రదక్షిణం అవగానే అందరూ ఇల్లుచేరాక - అందరూ బంతులు తీర్చి కూచుంటే నర్తకీ వాళ్ళు వొడ్డించేవారు. అందరిలోనూ ఎంత వుత్సాహమో! ఎంత సరదానో! "వ్యక్తిత్వం లేని సౌరిస్ చుట్టూరా కదిలి కధలై నిలిచిన రోజులలో ఆరోజులు గొప్పచైతన్యం విరిసిన రోజులు" అంటారు నర్తకి.

అట్లాగే ఆది అన్నామలైలో కాఫీ, టిఫిన్లకి ముందుగా ఏర్పాటు చేసి వుంచేవారు, ఒకప్పుడు. గిరిప్రదక్షిణ సమయంలో షౌ మాత్రం ఏమీ తినేవారు కారు, తాగేవారు కారు. తతిమ్తావాళ్ళు మాత్రం నర్తకి ఇచ్చే చిరుతిళ్ళు, చెరుకుముక్కలు, వేరుశనగకాయలు, మైసూరు పాకులు, మరమరాలు, మురుకులు ఆరగిస్తూ ప్రదక్షిణం చేసేవారు.

చలంగారికి నడక కష్టం అవడం వలన వారు జట్కాలో ఎక్కి వొచ్చేవారు. వారితోబాటు పిల్లలూ, నర్తకి ఆ బండిలో ఎక్కి వెళ్ళేవారు. ఒక్కోసారి భోజనం ఇంటిదగ్గరనే తయారు చేసుకుని బండిలో పెట్టి తీసుకు వెళ్ళేవారు.

ఒక్కోసారి మబ్బుగా వున్నరోజుల్లో మధ్యాహ్నం మూడు, నాలుగు గంటలప్రాంతంలో- సాయంత్రపు భోజనం వెంట తీసుకుని -భజనలు చేస్తూ, కబుర్లు చెబుతూ కోలాహలంగా గిరిప్రదక్షిణం చేసేవారు.

డేంజరు మంటపానికి అవతల కొంచెం దూరంగా రోడ్డుకి అవతలవైపు కొండరాళ్ళ మధ్య ఇసుకలో సుందరమైన జాగా వుంది. సాధారణంగా అక్కడ కూచుని భజనలు చేసేవారు. భోజనాలు రోడ్డుకి ఇవతల వున్న శ్రీచక్ర మండపంలో చేసేవారు.

మార్గశిర మాసంలో మధ్యాహ్నాలు గిరిప్రదక్షిణాలకి వెళ్ళేవారు. మెల్లిగా నడుచుకుంటూ భజనలు చేసుకుంటూ రాత్రి ఏ తొమ్మిదిగంటలకో నెమ్మదిగా ఇల్లు చేరేవాళ్ళు రమణస్థానీయులు.

ఒక్కొక్కసారి పున్నమినాటి తెల్లవారుజామునో, పౌర్ణమి మరుసటి రోజు తెలవారు జామునో- గిరిప్రదక్షిణానికి వెళ్ళేవారు, తెలవారుగట్ట నాలుగు గంటలకి. బ్రాహ్మీకాలంలో అరుణాచలేశ్వరునికి క్షీరాభిషేకం చేస్తూ వున్నట్లుగా వెలిగిపోయే వెన్నెట్లో గిరిచుట్టడానికి బయలు దేరేవారు రమణస్థానీయులు.

అరుణాచల సౌందర్యం ప్రస్ఫుటంగా కనపొచ్చే ప్రతీ జాగాలోనూ ఆగి అలా కొద్దిసేపు ఆ అందాలను చూస్తూ నిలిచేవారు సౌరిస్. మిగిలినవారు కూడా ఆమెతో ఆగిపోయే వారు.

ఒక్కొక్కసారి పౌర్ణమి ముందు రోజుల లేత వెన్నెల్లో గిరి ప్రదక్షిణానికి వెళ్ళేవారు. కార్తిక దీపానికి రమణస్థానీయులు వెన్నెట్లో గిరి ప్రదక్షిణానికి వెళ్ళి శిఖరాన వెలిగించబడ్డ జ్యోతిని చూస్తూ గిరిని చుట్టేవారు.

ఒకసారి అమావాస్య వెళ్ళిన రెండు రోజుల తరువాత గిరిప్రదక్షిణానికి వెళ్ళారు. నల్లని చీకట్లు ముసిరినప్పుడు అరుణాచల శిఖరం ప్రక్క తెల్లని వెలుగుతో వెలిగే నెలవంకని చూపి "అరుగో చంద్రశేఖరు లని" చూపారు షా. ఒకసారి శుక్రతార నెలవంకతో కలిసి దర్శన మిచ్చింది- వారికి.

వీలున్నప్పుడల్లా భజనలు చేస్తూ గిరిప్రదక్షిణాలకి బయలు దేరేవారు రమణస్థానీయులు. చలంమహర్షి, నర్తకి పిల్లలు బండిలో వొస్తూ వుంటే సౌరిస్ తదితర రమణస్థానీయులు ముందుకి సాగేవారు. ఏ మండపాల దగ్గరైనా నర్తకి దారిలో తినడానికి తీసుకు వొచ్చినవి

అందరికీ పంచిపెట్టేది. అవి తింటూ సౌరిస్ చుట్టూ చేరేవారు. రమణ స్థానీయు లందరూ జోక్స్ వేసుకుంటూ, ఏవో కబుర్లు చెప్పుకుంటూ భోజనం ఒక మండపం దగ్గర చేసేవారు. తరువాత అక్కడే కూచుని కొద్దిసేపు భజనలు చేసి పెద్దగుడి లోంచి ఇంటికి తిరిగి వొచ్చే వారు. చలంగారు బండిలో రాలేక పోయినప్పుడు టాక్సీని మాట్లాడుకునే వారు. ఆ విధంగా నెలకోసారన్నా గిరిప్రదక్షిణాలు చేసేవారు రమణ స్థానీయులు.

ఒకసారి రమణస్థానీయు లందరూ పౌర్ణమి రోజున గిరిప్రదక్షిణం బయలు దేరారు. సాయంత్రం భోజనం తయారుచేసి బండిలో పెట్టారు. చలంగారు, నర్తకి, పిల్లలు బండిలో ఎక్కారు. బండి ముందు నడుస్తోంటే మిగిలినవారు వెనకాల నడిచారు. ఇంట్లో పిట్టకూడా మిగల కండా అందరూ ఈసారి గిరిప్రదక్షిణానికి బయలుదేరారు.

గిరిప్రదక్షిణం చేసేదారి మలుపు తిరిగిన తరువాత ఒకచిన్న మంటపం వుంది. రమణస్థానీయులు ఆమంటపం చెంతనే విస్తళ్ళు వేసుకుని ఫలహారాలు చేశారు సాయంత్రం నీరెండలో. పశ్చిమాకాశం సంధ్య అరుణవర్ణ కాంతితో నిండి పోయింది.

ఆవేళ పౌర్ణమి అయినా చంద్రోదయం ఆలస్యంగా జరిగింది. తొందరగా చీకటి పడింది. భజన చేసుకుంటూ గిరిప్రదక్షిణం ముగించారు. కృష్ణారావుగారు- 'మనం ఇట్లా గిరిప్రదక్షిణం చేస్తూవుంటే ఎంతో బావుందండీ, అప్పు డప్పుడు మనం ఇలాంటి గిరిప్రదక్షిణాలు చేస్తూవుంటే బావుంటుందండీ" అన్నారు షౌతో. అందువల్లనే గిరిప్రదక్షిణాలకి ఆయనని **President** గా నియమించారు షౌ.

కిట్టూ పుట్టినరోజు ఎప్పుడూ తారీకుకి జరిగేది కాదు. దాంతో భోగినాడు చేశారు. ఆరోజే సాయంత్రం పూట గిరిప్రదక్షిణం బయలు దేరారు రమణస్థానీయులు.

మధ్యదోవలో అంతా రంగుల బట్టలు కట్టుకుని ఆడవాళ్ళు పిల్లలు, మగవాళ్ళు అందరూ చెట్లకింద పొంగల్ వొండు కుంటున్నారు. గిరి చుట్టే దారిపక్కంతా ఎంతమందో పొంగల్ వొండుకునేవాళ్ళు. మధ్య మధ్యలో 'పొంగలో పొంగల్' అని అరుస్తున్నారు. రమణ స్థానీయులకి వాళ్ళని చూస్తే ఎంత సరదా అనిపించిందో.

ఈసారి రమణస్థానీయులతో మామ్మగారు కూడా గిరిప్రదక్షిణంలో వున్నారు. ఆది అన్నామలై వొస్తూవుంటే మామిడిచెట్ల గుబుర్ల లోంచి, కొబ్బరిచెట్ల చాటునించి ఎంతో గొప్పగా కనిపిస్తుంది అరుణాచలం. గొప్పఅందాలున్న చోటల్లా షో కొంచెంసేపు ఆగి ముందుకి నడిచేవారు. మామ్మగారు సరిగ్గా ఆ సౌందర్యానికి అన్వయించే పద్యాన్ని చదివేవారు అప్పుడు. ఆమెలో ఎంత వుత్సాహమో! అరుణాచలం ముందు తమని తాము మరిచిపోయి పసిపిల్లలాగ, హాయిగా గంతులు వేస్తూ కేరింతలు కొట్టేవారు.

రమణస్థానీయులు ఆవేళ కొంచెం పెందరాళే బయలుదేరడం వల్ల మామూలుగా భోజనాలు చేసే చోటికి వెళ్ళేసరికి సాయంత్రం కాలేదు. కొంచెం ముందుకి వెడితేనేకాని దీపదీపాల వేళ కాదు. అందు వలన అందరూ ఇంకా ముందుకి నడిచారు.

మామ్మగారు గిరిప్రదక్షిణం చేస్తూ వెనక వొచ్చేవారి నందరినీ పలకరించుకుంటూ ముందుకి వెళ్ళేవారు. కాసేపు ఆగి ముందు వాళ్ళ నందరినీ కదిలించి మాట్లాడి, వెనకవాళ్ళతో కబుర్లు చెప్పుకుంటూ ముందుకి నడిచేవారు.

మధ్యదోవలో అందరికీ వేరుశనగ కాయలు, అటుకులు మొదలైన తినుబండారాలు పంచిపెట్టింది నర్తకి. మామ్మగారు అవి పట్టు

కుని * స్వర్గద్వారానికి పరుగు పెట్టారు. స్వర్గద్వారంలో దూరి పరిగెత్తుకుంటూ వొచ్చి- తమకి నర్తకి ఇచ్చిన తినుబండారాలని "స్వర్గాన్నించి ప్రసాదం తెచ్చాను. తినండి, తినండి!" అంటూ అందరికీ పంచిపెట్టారు.

భోజనాలు ఎక్కడ చెయ్యాలనే ప్రశ్న వొచ్చింది. సారంగపాణి, గంగాధరం "మనం మరకతశ్యామలాంబ కోవెలకి (పచ్చయమ్మన్ కోవెల) వెడితే అక్కడ నీళ్ళవసతి వుంటుంది. అక్కడికి వెడదాం" అన్నారు. వాళ్ళు ముందు దారి చూపించడానికి వెళ్ళారు. మామ్మగారు యోచనలో పడ్డారు. "ఈ దేశంకాని దేశంలో వూరికంతా చివర వుండి ఈ రమణస్థాన్ ఎట్లా నడుస్తోంది? ఏ తోడూ లేకండా, ఏ వస్తువుకి కొరత లేకండా, దేనికి తడుముకోకండా ఎట్లా నడుస్తోంది? ఈ గంగాధరం ఎవరు? ఈ సారంగపాణి ఎవరు? వీళ్ళెవరూ మీ కులం కాదు, మీ దేశస్థు లంతకన్నా కారు. వాళ్ళు మీ కెక్కడెక్కడ సహాయం కావాలో కనుక్కుని ఇల్లా తోడుపడడం చూస్తే ఆశ్చర్యం వేస్తోంది. వాళ్ళకి మీకు సంబంధ మేమిటి? ఏ పనయినా తమ పనిగా తీసుకుని మరీ చేస్తారే వీళ్ళు. ఇదంతా చూస్తే ఎంత విచిత్రంగా వుంటుందో?" అని అన్నారామె షాతో.

అడ్డదోవన మరకత శ్యామలాంబ ఆలయానికి బయలు దేరారు అందరు. కొంత దూరం వెళ్ళేసరికి చలంమహర్షి, † కృష్ణయ్యగారు నడువలే రనిపించింది. అక్కడొక బయలులో ఒక ఇటిక ఆ(మ

* గిరిప్రదక్షిణం వెళ్ళే దోవలో డేంజరు మండపం దాటాక అతి ఇరుకైన గదిలాంటి ద్వారం వుంది. దానిలో ప్రవేశించి బైటికి వొచ్చినవారు అతిసులువుగా స్వర్గానికి పోగలరని జనశ్రుతి.

† ఓరుగంటి వెంకట కృష్ణయ్యగారు - భగవాన్‌భక్తులు.

వుంది. ఆ పక్కనే ఒక గుడిశ వుంది. వాళ్ళ దగ్గరనించి మంచినీళ్ళు తీసుకుని వొచ్చారు నర్తకి, నరసింహారావు.

అందరు ఆ బయలులోనే భోజనానికి కూచున్నారు. పైన చంద్రుడు. పడమట సంధ్య, సంధ్యాకాంతుల వెలుగులో లీనమవుతూ చంద్రుడు, ఇంక అందరూ చుట్టూతా కూచుని భోజనాలు చేస్తున్నారు.

మామ్మగారు బృందావనంలో కృష్ణుడు ఆవుల్ని కాచుకుంటూ, మధ్యాహ్నవేళ తన చెలికాండ్రతో చల్దులు ఆరగించడం, ఒకరి నంజుళ్ళు ఇంకొకరు తినడం అంతా వర్ణిస్తూ ఊరగాయ నంజుకుంటూ తింటున్నారు.

ఆ ఘట్టం భాగవతంలో పోతన పద్యాన్ని స్ఫురింప జేస్తోంది.

సీ॥ మాటి మాటికి వ్రేలు మడిచి యూరించుచు
నూరుగాయలు తినుచుండు నొక్కఁ
డొకని కంచములోని దొడిసి చయ్యన మింగి
చూడు లేదని నోరుచూపు నొక్కఁ
డేగు రార్గురి చల్దు లెలమి బన్నిదమాడి
కూర్కొని కూర్కొని కుడుచు నొక్కఁ
డిన్నియు బొరలిచి యిడుచు నెచ్చెలి తన
మనుచు బంతెనగుండు లాడు నొకడు

ఆ॥ కృష్ణు జూడు మనుచు గికురించి వడిఁబ్రోల
మేలి భక్ష్యరాసి మెసగు నొకడు
నవ్వు నొకడు సఖుల నవ్వించు నొక్కఁడు
ముచ్చటలాడు నొకడు మురియు నొకడు.

(శ్రీమదాంధ్ర భాగవతం - దశమ స్కంధము)

అలా సరదాగా భోజనాలు ముగించి ముందుకి సాగారు. చలం గారి బండి ముందు వెళ్ళి పోయింది. మిగిలినవారు వెనకాల నడుస్తున్నారు. ఇంతలో కృష్ణయ్యగారు "నా తాళాలు లేవు. ఎక్కడో పారేశాను. ఎక్కడ పడ్డాయో. ఎట్లాగా ?" అనుకున్నారు. మరకత శ్యామలాంబ ఆలయానికి ముందున్న పచ్చిక బయల్లోనే పడివుంటాయి. సాధారణంగా రమణస్థానీయులు గిరిప్రదక్షిణంలో సైకిళ్లు వెంటవుంచుకునే వారు— పిల్లలు అలిసిపోయినా, ఇంకే అవసరం వొచ్చినా వుంటా యని. చలంగారు ఎక్కే బండిలో చోటు తక్కువ కనక సైకిళ్ళకే భోజనం కట్టి తీసుకు వెళ్ళేవారు.

నరసింహారావు, గంగాధరం తాళాలు వెదకడానికి సైకిళ్ళమీద వెళ్ళారు. మిగిలిన రమణస్థానీయు లందరూ ఈశాన్యమఠం వెళ్ళే దోవలో వంతెనమీద వాళ్ళకోసం కాచుకు కూచున్నారు. మంచి వెన్నెల; ఊరికే కూచోవడం ఎందుకని భజన చేయడం మొదలు పెట్టారు. అప్పుడు వాళ్ళకి గుర్తుకి వొచ్చింది మామూలుగా గిరిప్రదక్షిణంలో భోజనాలు కాగానే భజన చేయడం అలవాటు. ఆ రోజు హడావిడిలో భజన చేయడం మరిచిపోయా రని, భజన చేయడం మరిచి పోయారు గనుకే అరుణాచలేశ్వరుడు తాళాల మిషతో భజన చేయించా రని అందరూ నవ్వుకున్నారు.

ఒకసారి పెద్ద హార్మోనియాన్ని తీసుకు వెళ్ళి గిరిప్రదక్షిణంలో "అరుణాచల శివ" పాడాలని రమణస్థానీయు లందరూ సంకల్పించుకున్నారు. ఆ ప్రదక్షిణంలో సత్యం, అన్నయ్య, నాగేశ్వరరావుగారు మొదలైన వారంతా చేరి రమణస్థానీయులతో కలిసి పెద్ద గుంపుగా గిరిప్రదక్షిణం బయలు దేరారు- తెల్లవారుజామున వెన్నెట్లో.

అప్పటి కింకా హార్మోనియం తీసుకు పోవడానికి ముందే ఏర్పాటుచేసిన ఒంటెద్దుబండి రాలేదు. ప్రోగ్రాంలో ఏమాత్రం తేడా

వొచ్చినా చలంగారు చిందులు తొక్కుతారు. అందుకని కృష్ణారావు, శంకరరావు ముందుగానే లేచి అగ్నితీర్థం దగ్గర వున్న ఒంటెద్దుబండి వాడింటికి పరిగెత్తారు. ఇంతలో ప్రైమవుతోంది. అందరూ బయలుదేరే సన్నాహంలో వున్నారు. బండి రావడమే ఆలశ్యం. సమయానికి బండి దగ్గర ఎద్దు లేదు. ఆ ఎద్దుకోసం బండివాడు చాలా దూరం వెళ్ళి రావాలి. తీరా అతను వెళ్ళి తిరిగి వొచ్చేసరికి ఆలశ్యం అయి చలం గారికి చిరాకు పుడుతుందని— బండివాడికి ఎద్దుని రమణస్థానానికి తెమ్మని చెప్పి— బండిని లాక్కొచ్చేశారు శంకరరావు, కృష్ణారావు. వాళ్ళు బండిని లాక్కొని వొస్తోంటే వెనకాల బండివాడు ఎద్దుని తోలు కొస్తున్నాడు.

చలంగారు "బండేది ?" అన్నారు.

"అదిగో బండి" అని చూపించారు అప్పుడే వొచ్చిన కృష్ణా రావు.

"ఎద్దేది ?" అన్నారు బండివైపు చూసిన చలంగారు.

"ఇదిగో నే నున్నానుగా" అన్నారు శంకరరావు బండి కాడిని భుజాని కెత్తుకుంటూ.

"అయితే హార్మోనియం బండిలో పెట్టెయ్యండి" అన్నారు చలంగారు.

అలాగే వాళ్ళు హార్మోనియంని బండిలో పెట్టేశారు. ఇంతలో "నేను వొచ్చేశానత్తా" అంటూ వున్నట్లుగా బండి ముందు నిలబడింది ఎద్దు. టైమయింది నడవండి అంటూ ముందుకి నడిచారు షా.

బండిలో హార్మోనియాన్ని తీసుకుని వెళ్ళి మామూలుగా భజనలు చేసేచోట పెట్టారు. అక్కడి నించే దిక్కులు మారుమోగేలాగ భజన ఆరంభం చేయాలని షా అనుకున్నారు.

అసలు మామూలుగా భజన చేసేచోటు అత్యంత సుందరమైనది. పైగా ఆవేళ అప్పుడే వొస్తున్న లేత యెండ అరుణాచలేశ్వరుని మ్రోల వెలిగించిన కర్పూర హారతి కాంతిలా తళతళ లాడుతోంది. శిఖరంమీద తెల్లని మబ్బుతునక అరుణాచలానికి పట్టుగొడుగు పట్టి నటుగా భాసిస్తోంది.

రమణస్థానీయులు ఆవేళ అక్కడ భజనచేస్తూ వుంటే దారిన పోయే జనమంతా ఆగి విన్నారు. కొంతమంది భజనలో వొచ్చి కూచుని విన్నారు. వారందరినీ దయగా చూస్తూ విన్నారు అరుణాచలేశ్వరులు.

అందరితో బాటుగా ప్రభాతంకూడా ఆ భజన మాధుర్యానికి ముందుకి పోలేక ఆగి వినే వుంటుంది ఆవేళ. షా భజన చేశాక నాగే శ్వరరావుగారు చలంమహర్షి మేగ్నమ్ ఓపస్ "సుధ" నించి- "అరుణా చలా ఘనీభవా నందతరంగా" అన్న పద్యంతో ఆరంభించి కొన్ని గీతాలు పాడారు.

ఈ ప్రదక్షిణంలో చలంమహర్షి బండి కుదుపుని భరించలేక టాక్సీలో వొచ్చారు. నర్తకి అందరికి భజనలు చేస్తూ వుండగా ఫోటోలు తీసింది.

ఒక శివరాత్రికి సౌరిస్‌నీ రమణస్థాన్నీ చూడటానికి దీనా ఆసానా అనే ఆమె తమ మిత్రబృందంతో తరలి వొచ్చారు. ఆమెకి సౌరిస్ అంటే ఎంతో ప్రేమ, భక్తి. ఆమెతో బాటు భగవతీ, చంద్ర అనే సింధీ అమ్మాయిలు కుర్షీద్ అనే పార్సీ ఆమె, ఆమె భర్త ఇంద్రవదన ఠాకూర్- వొచ్చారు. ఇంద్రవదన గుజరాతీయులు.

ఆవేళ చలంమహర్షి బృందం గిరిప్రదక్షిణం వెడుతున్నారు· వారు దీనా ఆసానా బృందాన్ని "మేము గిరిప్రదక్షిణం వెడుతున్నాం మీరు వొస్తారా" అని అడిగారు. 'తప్పకండా వొస్తాం' అన్నారు

వాళ్ళు. ఆరోజే కె. సభా బృందం కూడా వొచ్చారు. అందరూ కలిసి గిరిప్రదక్షిణం వెళ్ళారు. దీనాఆసానా ఇంట్లో వుండి పోయారు. ఠాకూర్ల కారులో చలంమహర్షి, నర్తకి, పిల్లలు ఎక్కారు. బూట్‌లో భోజనాలు పెట్టారు. ఠాకూర్ల బృందానికి సౌరిస్‌తో నడవాలని ఆరాటం ఆరోజు ప్రదక్షిణానికి మండుటెండలో బయలు దేరారు. ఠాకూరు దంపతులలో ఒకరు కొద్దిసేపు కారు నడిపితే, రెండవవారు సౌరిస్ వెంట నడిచేవారు. వారు వంతులు మార్చుకుంటూ గిరిప్రదక్షిణం చేశారు.

ఇంతలో గౌతమాశ్రమం వొచ్చింది. అందరూ అక్కడ చల్లని చెట్లనీడలో కూచున్నారు. మండుటెండలో పడి నడిచి నడిచి ఆ చెట్ల నీడపట్టున చల్లదనం, చెట్ల మీదినించి వీచే చల్లనిగాలి- చల్లని షరబత్తు తాగినంతటి హాయిని గొలిపింది వాళ్ళకి. దీనాఆసానా బృందం తెచ్చిన పుచ్చకాయలను - ముక్కలుకోసి అందరికి పంచిపెట్టింది నర్తకి. అంతే కాదు అటుకులు, కొబ్బరి, వేరుశనగపప్పులు మొదలైన చిరుతిళ్ళని అందరికి పంచింది.

సాధారణంగా గిరిప్రదక్షిణాల్లో సౌరిస్ కదిలితేనే కాని ఎవరూ కదలరు. ఇంట్లో నించైనా ఆమె కదలందీ ఎవరూ కదలరు. కానీ ఆ చెట్లనీడనించి ఆమె కదిలినా ఎవరూ కదిలేటట్లు లేరు- ఆవేళ. మండు టెండలో నడిచిన వాళ్ళప్రాణానికి అంత హాయిగా వుంది ఆ చెట్ల నీడన చల్లదనం. చివరికి సౌరిస్ ముందుకి నడిచే సరికి వాళ్ళకి లేచి నడవక తప్పింది కాదు. అది అన్నామలై వొస్తూ వుంటే భజన చేయడం ఆరంభించారు. మధ్యదోవలోనే చీకటి పడిపోతుం దనిపించింది.

భోజనాలు చెయ్యాలి చీకటిపడ్డాక భోజనాలు చెయ్యడం కష్టమవుతుంది - మామూలుగా ఎప్పుడూ భోజనాలు చేసే శ్రీచక్రమండపానికి వెళ్ళడానికి time లేదు. నర్తకి దేంజరు మండపం ప్రాంతం

లోనే భోజనాలు ముగించడం బావుంటుందని అంది. మంచినీళ్ళు తేవడానికి బిందె పట్టుకుని వెనక్కి అది అన్నామలై వెళ్ళారు సత్యం, కృష్ణారావు.

సూర్యుడు కుంకుతున్నాడు. వెనకాల డేంజరు మండపం దగ్గర రోడ్డుపక్కన శుభ్రం చేశారు. చీకట్లో భోజనాలు చెయ్యడం కష్టం కనుక కారు హెడ్‌లైట్లని ఫోకస్ చేశారు. భోజనాలు ముగిసేసరికి మసకచీకట్లు పడుతున్నాయి. కృష్ణయ్యగారు నడవలేక పోతోంటే ఇంద్రవదన ఠాకూర్ ఆయనని కారులో ఎక్కించుకుని వెళ్ళిపోయారు.

సౌరిస్ బృందం చీకట్లో నడుస్తున్నారు. ఆ చీకటి రాత్రిలో ప్రదక్షిణం ఎంత గొప్పగా వుందో! అమరులు అరుణాచలేశ్వరుని చరణాలకు అర్చన చేస్తూ వున్నట్లు ఆకాశం నించి నక్షత్రాలు పర్వత పాదంలో రాలుతున్నాయి. ఆదృశ్యం ఎంతో గొప్పగా వుండివుంటుందని నాకు తోస్తోంది. సౌరిస్ ఆనాటి విశేషాలను వివరిస్తోంటే. కె. సభా బృందం అరుణాచల శివ, సాంబసదాశివ పాడడం ఆరంభించారు. అందరూ పాడుకుంటూ గిరిచుట్టి ఇల్లు చేరారు.

షా ఎన్నాళ్ళనించో ఒక ఆదర్శ గిరిప్రదక్షిణం చేయాలని అనుకునేవారు. ఆదర్శ గిరిప్రదక్షిణం అంటే ఏమిటంటే ఓ మబ్బు రోజు వుదయం భోజనా లయ్యాక బయలుదేరి దోవలో ఎక్కడ కూచోవాలనిపిస్తే అక్కడ కూచోవడం, ఎంతసేపు ఎక్కడ వుండాలనిపిస్తే అక్కడ వుండి నెమ్మదిగా సాయంత్రం 6 గంటలకి ఇల్లు చేరుకోవడం.

జగదీష్ గిరిప్రదక్షిణం చేసి ఆది అన్నామలైలో పగలంతా గడిపి సాయంత్రానికి తిరిగి వస్తే బావుంటుందని అన్నారు ఒకసారి.

అలాగే తెల్లవారుగట్ట ఇంటిల్లిపాదీ గిరిప్రదక్షిణం బయలు దేరారు. ఈ ప్రయాణంలో ఆది అన్నామలై లో వండుకోవాలని సరుకులు వెంట తీసుకుని వెళ్ళారు. ఈ మారు గిరిప్రదక్షిణానికి మామ్మగారు, ముమ్మడ, నాగమణి, వాళ్ళ చిన్నక్క, సౌరిస్ బృందం, జగదీష్, కృష్ణయ్యగారు .... పెద్ద హడావిడిగా బయలు దేరారు. ఆది అన్నామలై సత్రం ఆయన వాళ్ళని లోపలికి రానివ్వలేదు. వరండాలోనే వొండు కున్నారు. అక్కడ వంట చెయ్యడం నర్తకికి, చిత్రకి ఎంతో ప్రయాస అయింది. భోజనాలు అయినాక అందరూ ఆది అన్నామలై గుడిలోకి వెళ్ళి అక్కడ అందరూ నేలమీద పడకలు వేశారు. కొంతమంది కబుర్లు చెప్పుకుంటూ కూచున్నారు. సాయంత్రానికి చిత్ర, నర్తకి వుప్మా తయారు చేశారు. ఈలోగా సారంగపాణి బృందం కూడా వొచ్చారు. అందరికీ పెట్టి తినడం అదీ అయ్యేసరికీ ఆలస్యం అవుతుంది గనక వుప్మా పట్టుకు వెళ్ళి మధ్యదోవలో తిని ఇంటికి తరలి వొచ్చారు. ఆ రోజు ఆది అన్నామలైలో ఎంతో గొప్పగా వుంది. వంట చేసుకోవడం ఇబ్బంది ఐంది గనక- ఇక ముందట గిరిప్రదక్షిణాల్లో దోవలో వంటలు చేసే ప్రయత్నం విరమించాలని నిశ్చయించారు. చలంగారు, షౌ. ప్రత్యామ్నాయంగా (తెల్లవారకట్ట భోజనాలు చేయకండా గిరిప్రదక్షిణాలకి బయలుదేరితే) ఈశ్వరయ్యర్ **Mobile canteen** కి భోజనాలకి ఆర్డరివ్వాలని నిశ్చయం చేసుకున్నారు!

మరోసారి శివరాత్రి తెలవారుజామునే గిరిప్రదక్షిణం ఏర్పాటు చేసుకున్నారు సౌరిస్ బృందం. ముందుగానే ఈశ్వరయ్యర్‌కు తొమ్మిది గంటలకల్లా భోజనాలు తీసుకు రావాలని ఆర్డరిచ్చేశారు.

ఈ ప్రదక్షిణంలో సౌరిస్ బృందమేకాక, బోన్నీ, జూలీ, విల్లీ (అమెరికన్లు) లక్ష్మి, కృష్ణ, కృష్ణయ్యగారు, ముమ్మడమ్మ, మహతి కలిశారు. ముందుగానే ఆది అన్నామలై గుడిలో వసతి ఏర్పాటు చేసుకోవడంతో అక్కడొక వరండా కేటాయించారు. మెల్లిగా ఆది అన్నామలై గుడి చేరుకున్నారు. అరుణాచలశివతోసహా శివనామావళులన్నీ గుళ్ళో భజనలుచేసి పూళ్ళోనించి భోజనాలు రాగానే ఆ వరండాలో అందరూ బారులు తీర్చి భోజనాలు చేశారు. ఎంత బావుందో ఆనాటి గిరిప్రదక్షిణం. భోజనం కాగానే షౌ శృతిపెట్టి పట్టుకుని శివుడిమీద పార్వతిమీద కృతులు, కీర్తనలు పాడారు. ఆ మండపంలో ఆ **Music vibrate** అయి, ప్రతిధ్వనిస్తోంటే ఎంత బావుందో ననిపించిందందరికీ.

బోన్నీ అనే అమ్మాయి షౌ దగ్గరగా కూచుంది, పాటలు పాడడం అవగానే. ఇద్దరు తమిళస్త్రీలు వాళ్ళముందు కూచుని బియ్యం చెరుగు తున్నారు. వాళ్ళలో ఒకామె షౌని చూపిస్తూ బోన్నీని "ఆవిడ మీతల్లా:" అని అడిగింది తమిళంలో. బోన్నీ "ఆమె ఏమంటోంది?" అని షౌని అడిగింది. "నేను మీతల్లినని అనుకుంటోంది" అన్నారు షౌ. బోన్ని కాదని తలవూప బోయింది. కానీ షౌ ఔనన మన్నారు. బోన్ని ఔనని తల వూపింది "మీ ఇద్దరి పోలిక చూసి నీకూతురే అనుకున్నాను" అన్నారు వాళ్ళు షౌ తో.

"ఇంకా పెళ్ళి చెయ్యలేదా అమ్మాయికి" అని అడిగారు షౌని.

"లేదు, అవ బోతోంది" అన్నారు షౌ.

"ఔను, మెడలో తాళి లేదుగా" అన్నదామె.

షౌ అప్పుడు పమిట నిండుగా కప్పుకుని వున్నారు. లేకపోతే వాళ్ళకి ఆమె మెడలోనూ తాళి లేదని తెలిసేదే? సాయంత్రం అవ

గానే అందరూ కాఫీలు తాగారు. నర్తకి అందరికీ తినుబండారాలు పొట్లాలు కట్టి ఇచ్చింది. ఒక్కొక్క పొట్లాన్ని విప్పుకుని సరదాగా తింటూ, కబుర్లు చెప్పుకుంటూ, ప్రదక్షిణం ముగించి ఇల్లు చేరారు.

ఆ రోజుల్లో ఒక స్వామియార్ నిత్యమూ గిరిప్రదక్షిణం చేసేవారు. ఆయనని అందరూ గిరిప్రదక్షిణం స్వామియార్ అనేవారు. ఆయన ప్రదక్షిణం మధ్యలో పంచముఖీ అన్నామలై యార్ దగ్గర కూచునేవారు. ఎందరో ఆయన గురించి తెలుసుకుని ఆయన దగ్గరకు వొచ్చి తమ జబ్బులు కుదర్చమని, తమ కష్టాలు పోగొట్టమని ఆయనని అడిగేవారు. అలా అడిగిన వారి నందర్నీ ముప్ఫై, నలభై రోజులు వరసగా గిరిప్రదక్షిణం చేయమని పంపించారాయన, ఎన్నెన్ని వూళ్ళనించో వొచ్చిన వారంతా రాత్రి ఒంటిగంట నించి ప్రదక్షిణం చేస్తూ వుండేవారు. మూగవాళ్ళు తమకి మాటలు రావాలని అమ్మా అమ్మా అనుకుంటూ గిరిచుట్టేవారు, కుంటివాళ్ళు కర్రలు పట్టుకు బయలుదేరే వాళ్ళు ఇంక "మురుగన్‌కి హరోం హరా, అన్నామలై యార్‌కి హరోం హరా" అంటూ కేకలు వేస్తూ ప్రదక్షిణం చేసేవారు.

ఈ సారి షా బృందం గిరిప్రదక్షిణంలో ఈ గుంపుల మధ్య నడుస్తో బయలు దేరారు. చలంగారు, పిల్లలు, తంబి, నర్తకి, చిట్టూరి లక్ష్మిగారి కారులో కూచున్నారు.

తెలవారుజామున వెన్నెట్లో పందలాది జనం "మురుగన్‌కి హరోం హరా, వేలన్‌కి హరోం హరా" అను కుంటూ ప్రదక్షిణానికి వెడుతున్నారు. సౌరిస్‌తో వున్న కనకమ్మగారు. ఆంజనేయులు, సీతారామస్వామి కుటుంబం అందరూ "హరోం హరా" అనడం మొదలు పెట్టారు.

ఆడ పిల్లలు తెల్లచీరలు కట్టుకుని సన్నజాజులు తలలో పెట్టుకుని ఎంతో వుత్సాహంతో వెడుతున్నారు వందలాది జనంతో కలిసి. ఎకో (echo) మండపం దగ్గర అరుణాచలశివ, అపీతకుచాంబ రమణ భగవాన్ అని గట్టిగా పిలిచారు షౌ బృందం. ఆ గిరిప్రదక్షిణం ఎంత సరదాగా వుందో..

పంచముఖి అన్నామలై వొచ్చేసరికి ఆస్వామి చలంగార్ని పిలిచారు. చలంగారికి ఆయన ముందుకి వెళ్ళేసరికి. మనస్సు అంతా (Blank) శూన్యము అయిపోయి నట్లుగా అనిపించిం దట. అప్పటినించి రమణస్థాన్‌లో ఎవరు కనిపించినా స్వామియార్ "ఆయన కులాసాగా వున్నారా?" అని చలంగారి యోగక్షేమాలు అడిగేవారు. గిరిప్రదక్షిణం స్వామియార్ ఆగిన చోట వొచ్చే ఈ వందలమంది జనంకోసం వ్యాపారస్తులు దుకాణాలు పెట్టి డ్రింకులు, సోడాలు, అరటిపళ్ళు అమ్ముతున్నారు. షౌ కాశ్మీరాతో నవ్వుతూ "మనం కుండలతో మజ్జిగచేసి ఇక్కడ అమ్ముదామా?" అన్నారు. "అలాగే అమ్ముదా మండి" అంది కాశ్మీరా అమాయికంగా. ప్రదక్షిణం ముగించి ఇంటికి వొచ్చే సరికి హోటలు నించి భోజనాలు వొచ్చాయి, అందరూ భోజనాలు చేశారు.

ఒకసారి 'చే' వొచ్చినప్పుడు రమణస్థానీయులు గిరిప్రదక్షిణం బయలు దేరారు. ఆ రోజున పెద్దగుళ్ళో కుంభాభిషేకం జరుగుతోంది. అమ్మవారి కొత్త విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. గిరిప్రదక్షిణం పూర్తి చేసి గుడికివెళ్ళి ఆ వుత్సవాన్ని చూడాలని షౌ **plan.**

బయలుదేరే ముందు షౌ "భగవాన్ పూర్ణగర్భిణీయైన మహారాణి ఎట్లా నడుస్తుందో అట్లా నడుస్తూ గిరిప్రదక్షిణం చేయాలన్నా" రని 'చే' తో చెప్పారు. అలా చెప్పారే కానీ ఆ రోజున షౌ ఎంత వేగంగా

నడిచారో! 'చే' బాగా వెనకబడి పోయారు. రమణస్థానీయు లంతా మూడు బ్యాచెస్‌గా విడిపోయారు. ఇంక 'చే' షాని కలుసుకున్నప్పుడు "ఇదేమిటి భగవాన్ మెల్లిగా నడవమని చెప్పారని మాతో చెప్పి నువ్వే మిటీ పరుగు ?" అని నవ్వేరు.

గిరిని చుట్టి రాత్రి ఏడు గంటలకల్లా ఆలయంలో వుండాలని షా అనుకున్నారు. అందువల్లనే తొందరగా నడిచారేమో! సారంగ పాణి, గంగాధరం కూడా ఆ రోజు రమణస్థానీయులతో కలిసి గిరి చుట్టారు.

అందరూ గిరి చుట్టి ఆలయాన్ని చేరుకున్నారు. ఆరోజు ఆల యాన్ని **electric lights** తో చాలా అందంగా అలంకరించారు. ఒక పద్మాన్ని, ఒక భ్రమరాన్ని **electric lights** కదలికతో **arrange** చేశారు.

చలంగారు మెట్లెక్క లేరు. అందుచాత అందరూ పట్టుకుని ఆయనని మెట్లు దాటించేశారు. ఆలయ మంతటా ఎంతందంగా లైట్లు పెట్టారో! కొత్తగా వొచ్చిన దేవి విగ్రహం చుట్టూ తెరలు కట్టేశారు. గంగాధరం పూజార్లతో మాట్లాడి రమణస్థానీయులని అందులోకి తోసేసి వెంటనే దర్శనం అయ్యేలా చూశారు.

ఒక గిరిప్రదక్షిణంలో పెద్దలకన్నా పిల్లల సంఖ్యే అధికంగా వుంది. జగదీష్, ఆంజనేయులు, గణపతి (ఈ ముగ్గురూ యామిజాల పద్మనాభస్వామిగారి పిల్లలు). సారంగపాణి పిల్లలు కొంతమంది వొచ్చారు. రమణస్థాన్‌లో పిల్లలు కాకా, కిట్టూ, మిశ్రీ .... అందరూ పిల్లలే. ఇంతెంత గోలో! ఎంత హడావిడో! ఎంత సందడో! చలం గారి బండి పట్టుకుని పిల్లలందరూ పరుగులు తీసారు.

రమణస్థానీయులు నిత్యమూ గిరిప్రదక్షిణాల్లో భజనలు చేసే మండపంలో శ్రీచక్రం వుందట. ఈమాటు సాయంత్రానికి అక్కడికి చేరుకున్నారు. భోజనాలైన తరువాత అందరికీ వడ్డించి నర్తకి వాళ్ళు భోజనాలు చేస్తూవుంటే షా వెళ్ళి అక్కడ వంతెనమీద కూచున్నారు. తక్కినవాళ్ళు ఎదురుగా వంతెన కట్టుపైపున కూచున్నారు. సారంగ పాణి కుమార్తె ఓ చిన్నమ్మాయి షా చెయ్యి పట్టుకుని కూచుంది. మసక వెన్నెట్లో ఆ అమ్మాయి ముఖం షాకి కనబడుతోంది. ఆ అమ్మాయిపేరు కమల. "నాకు మీతో గిరిప్రదక్షిణంచెయ్యాలని ఎంతగా అనిపించిందో, నేను పట్టుపట్టి మా నాన్నని అడిగి వొచ్చాను. మీరంటే నాకెంతో ఇష్టం" అంటూ ఏవేవో కబుర్లు చెప్పింది. ఆ తరువాత అందరూ భజనలు చేసి ఇంటికి పోవడానికి లేచారు. కమల పిల్లల గుంపులో కలిసిపోయింది.

ఇంటికి రాగానే షా సారంగపాణితో "మీ కమలకి గిరిప్రదక్షిణా లంటే చాలా ఇష్టంట. మీతో పట్టుపట్టి వొచ్చిందట. ఈ మాటు నించి ఆ అమ్మాయిని గిరిప్రదక్షిణాలకి తీసుకు రండి" అన్నారు.

ఆయన బిత్తరపోయి చూస్తూ ఏమీ అర్థంకాక "కమల ఇంటి దగ్గర్నే వుంది. నేను వొచ్చేటప్పుడు 'నేను వస్తాన'ని అది చాలా ఏడ్చింది. నువ్వు నడవ లేవని చెప్పి తీసుకురాలే"దన్నా రాయన. ఆ తరువాత కమల ఒకసారి షాని చూడటానికి వొచ్చి "మీరంటే నాకు చాలా ఇష్టం. ఆవేళ నే నెంత గోలపెట్టినా మా నాన్న గిరి ప్రదక్షిణానికి తీసుకురాలే"దని చెప్పి ఎంతో బాధ పడింది. షాకి తనతో మాట్లాడిన ఆ చిన్నమ్మాయి ఇంకెవరా అని ఆశ్చర్యం వేసింది. ఎవరికి చెప్పినా వాళ్ళు అలాంటి పిల్లసలు ఆవేళ గిరిప్రక్షిణానికే రాలే దన్నారు.

ఆ రోజులలోనే జనార్దనరావు వొచ్చారు. తొలిసారిగా భార్య రాధతో, పిల్లలతో, చెల్లెలు భారతితో కలిసి వొచ్చా రాయన. అంతకి మునుపే ఆయన కుటుంబీకులకి షౌ అంటే చాల భక్తి. జనార్దన్ కొత్తగా అరుణాచలాన్ని, షౌని చూడటానికి వొచ్చా రిప్పుడు. ఆయన కుటుంబానికి షౌని చూస్తే ఎంత ప్రేమో! ఆయన భార్య రాధ పిల్లల్తో సహా కొన్నాళ్ళిక్కడే వుండి తరువాత వెళ్ళిపోయింది.

జనార్దనం కుటుంబంలో భార్య భర్త లిద్దరున్నూ విచిత్ర వ్యక్తులు. "సంసారం వదిలిపెట్టి మీ దగ్గరకి వొచ్చేస్తా"నని రాధ వుత్తరాలు రాస్తుంది. "నాకీ సంసారబంధం ఎందుకమ్మా నన్ను రప్పించు కోండి" అని జనార్దనం రాస్తారు. ఇద్దరూ కలిసి వొస్తే ఇక్కడే సంసారం తయారవుతుందని గుర్తించరు వాళ్ళు. కొన్నాళ్ళు జనార్దనం అట్లాగే సంసారాన్ని నెట్టుకుని వొచ్చారు. చివరికి ఆయన సంసారంలో వుండలేక రమణస్థాన్‌కి వొచ్చి కొన్ని నెలలు వుండి పోయారు.

తంగికి జనార్దన్‌కి గొప్ప స్నేహం కుదిరింది. ఇద్దరూ కలిసి ఇళ్లు కట్టుకునే వారు. ఆడుకునే వారు. "సౌరిస్ జీవితం మొదటిభాగం రచనలో ఆయ నెంతగానో సహకరించారు. ఆ రోజుల్లో ఒకవైపు సూ — ఒకవైపు జనార్దన్ కలాలు పట్టుకుని నా నోటినించి ఏమాట వొస్తుందా? అని ఎదురు చూస్తూ వుండేవారు. ఒకొక్కప్పుడు నవ్వు వొచ్చేది. అంతక్రితం వంటలు తప్ప ఏమీ చెప్పని నేను వాళ్లు వేసిన ప్రశ్నలకి జవాబు చెప్పాల్సి వొచ్చింది. అట్లా వొచ్చాయి • 'ఈశ్వరోక్తాలు' అంటారు సౌరిస్. రమణస్థాన్‌లో గడిపిన కాలాన్ని గురించి చెబుతూ.

• 'ఈశ్వరోక్తాలు' — శ్రీరమణస్థాన్ ప్రచురణ.
(సౌరిస్ ముఖతా వెలువడ్డ కొన్ని ఆధ్యాత్మిక సత్యాలు)

"ఆమె మహత్కార్యాలు చేసే మాంత్రికురాలు కాదు. వ్యర్థ కర్మాచార బద్ధురాలు కాదు. అణిమాది అష్టసిద్ధి మాహాత్మ్యలను ప్రదర్శించేది కాదు. ఆమె జగన్మాత, ఆనందదాయిని. దయామయి. అహం అన్నదే లేని స్వానుభవనిష్ఠయే తపస్సుగా స్వీకరించి తరించిన ధన్యురాలు. హృదయ నైర్మల్యమూ, దైవీ మహత్కాంతి ప్రసారమూ ఆమె ముఖ కమలంలో నిరంతరమూ వెలుగు లీనుతూ వుంటాయి. ప్రేమయే ఆమె భూషణం. విభూతి కుంకుమలే తప్ప విలువగు అలంకారము లామె ధరింపరు. ధన కాంచన స్పర్శ ఆమెకు అగ్ని స్పర్శా సదృశము. ఆమె ఆత్మ నెరిగినది. ఆత్మయే తానై పరమాత్మయై యొప్పెడి జీవన్ముక్తురాలు అంటారు ఈశ్వరరాజ్య సంధాత్రియైన సౌరిస్‌ని గూర్చి జనార్దనరావుగారు.

గిరిప్రదక్షిణ సప్తాహం అంటే ఏడురోజులు వరసాగ్గా గిరిప్రదక్షిణం చేయడం కాదు. రమణస్థానీయులు అనుకున్నది ఒకరోజు బయలుదేరి ప్రదక్షిణంలో కొంతదూరం వెళ్ళి అక్కడ మజిలీచేసి- భోజనం భజన ముగించి వెనక్కి వచ్చెయ్యడం. మళ్ళీ ఇంకోరోజు ఇంకో మజిలీ దాకా వెళ్ళడం వెనక్కి రావడం. అట్లా ఏడు మజిలీలలో ప్రదక్షిణాన్ని ముగించాలని, అది నాలుగు మజిలీల వరకే సాగి చతురాహంగా ముగిసింది. ఆ నాలుగు మజిలీలు (1) కాట్లస్వామి ఆశ్రమం (2) వినాయక గుడి (3) మామిడి తోపు (4) అడియన్నామలై.

## చతురాహం - తొలిమజిలీ

### కాట్లస్వామి ఆశ్రమం.

రమణస్థానీయులు గిరిప్రదక్షిణ సప్తాహానికి తొలిమజిలీ యైన కాట్లస్వామి ఆశ్రమానికి వెళ్ళారు. ఈ యాత్రలో సౌరిస్- రమణస్థానీ

యులేకాక మల్లిక, శివరాం, హనుమంతరెడ్డి, ఇందిరా. లక్ష్మి, జీవన్, సత్యం, రాధాకృష్ణ, గంగాధరం, మూడేళ్ళ తంబి, శోభకూడా పాల్గొన్నారు.

చలంమహర్షి, సౌరిస్ ఒకచెట్టుకింద కూచున్నారు. అందరూ బయల్దేరి వొస్తూ వుండగా అప్పుడే వొచ్చిన వెంకటప్పయ్య బృందం-ఈయాత్రలో కలిశారు. వెంకటప్పయ్యగారు హార్మోనియాన్ని నెత్తి మీద పెట్టుకుని కూడా తీసుకుని వొచ్చారు.

తంబి ఏడుస్తున్నాడని చలంగారు నర్తకి అతన్ని ఎత్తుకుని చెట్ల మధ్యకి వెళ్ళిపోయారు. పిల్లలంతా అక్కడున్న కొలనులో ఈత లాడడానికి వెళ్ళిపోయారు. అక్కడ ఒకటే కోతులు. అందు వలన భోజనాలకి రాధాకృష్ణని కాపలా పెట్టారు. ఆ అడవిలో ఎంతబావుందో పిల్లల కేరింతలతో పిట్టల కలరవాలతో అడవికే ఒకప్రత్యేకమైన అందం పట్టింది ఆవేళ.

అక్కడున్న చిన్న ఇసుకమైదానంలో భజనలు చేశారు. భోజనాలు చేస్తూవుండగా కోతులు వొస్తే- ఈ యాత్రలో పాల్గొన్న యువక యోధు లందరూ కర్రలు చేతబట్టి వాటిని తరిమేశారు. భోజనా లయి నాక చలంగారు వాళ్ళు బండిమీద ఇంటికి వొచ్చేశారు. మిగిలినవారు నడిచి ఇల్లు చేరుకున్నారు.

## ద్వితీయ మజిలీ - గణపతి గుడి

రెండవ మజిలీ చేసినప్పుడు రమణస్థానీయులతో టీచర్ కనకమ్మగారు, వెంకటప్పయ్యగారి బృందం పాల్గొన్నారు. వినాయకుడి గుడిదగ్గర అడవిలో అందరూ చేరి ఆకాశం హోరెత్తిపోయేలా గంతులూ, గోలలతో మధ్యాహ్నమంతా గడిపి, మునిమాపు వేళకి భజనలు, భోజనాలు ముగించి ఇల్లు చేరుకున్నారు.

# తృతీయ మజిలీ - ఆమ్రవనం
## (మామిడి తోప)

ఆ రోజు సౌరిస్‌కి యాసిడిటీ వొచ్చింది. అయినా గానీ అందరి సరదాను చల్లార్చడం ఇష్టంలేక బయలుదేరా రామె. అది ఎండరోజు. బయల్దేరే వేళకి మబ్బు పట్టింది. ఈ యాత్రలో కనకమ్మగారు, రాధా పిల్లలు, చంద్రశేఖర్, తంబి, జీవన్, జూలీ రమణస్థానీయులతోబాటు పాల్గొన్నారు. ఆ ఎండవేడిని తట్టుకోలేక కనకమ్మగారు తడిబట్టలు తలమీద వేసుకుంటూ వొచ్చారు. ఎండకి తోడు వానచినుకులు పడటం మొదలు పెట్టాయి. చలంమహర్షి నడుస్తూ నడుస్తూ నడవలేకపోయారు. ఆయన జీవితాన్నే వెలుగులోకి నడిపిన ఈశ్వరి సౌరిస్ ఆయనని పట్టుకుని నడిపించారు.

అందరూ మామిడితోపులో చెట్లకింద చేరారు. మామిడి చెట్లకింద దుప్పట్లు తగిలించి అంతా జిప్సీ (ప్రవాసుల) కేంప్‌లా ఎరేంజ్ చేసి పసిపిల్లల్ని పక్కలు వేసి పడుకో బెట్టడం ఇత్యాది అత్యవసర కార్యక్రమాన్ని పర్యవేక్షించారు షౌ.

కొద్దిసేపటికి ఎండ బాగా ఎక్కువై పిల్లలు తట్టుకో లేకపోతూ వుంటే— జంబుకానాలతో మామిడిచెట్లమీద కేనపి (డేరా)లా కట్టించారు షౌ.

ఇంతల్లో వాన ముంచుకుని వొచ్చింది. అందరూ గౌతమాశ్రమానికి పరుగు తీశారు. అక్కడ చోటు లేదు. అక్కడొక చిన్న మండపం వుంటే అక్కడికి వెళ్ళారు. ఆ మండపం ముందంతా సున్నం కుప్పలు. మండపంలో గబ్బిలాల వాసన— ఎలాగో భోజనా లయ్యాయనిపించి ఆదరా బాదరాగా ఇంటికి చేరుకున్నా రందరూ.

## చతుర్ధ మజిలీ - ఆది అన్నామలై

శివరాత్రికి రమణస్థానీయులు కృష్ణారావుగారితో సహా కలిసి నాల్గవ మజిలీయైన ఆది అన్నామలై వెళ్ళి వొచ్చారు.

ఆ తరువాత చలంమహర్షి ఆరోగ్యం బాగా లేకపోవడం వలన సప్తాహాలు మానుకున్నారు. అందువల్లనే అది గిరిప్రదక్షిణ చతురాహంగా చరిత్రకి ఎక్కింది.

"ఇప్పుడు సప్తాహాలు మానేశారు నామూలంగానే. నాకు సప్తాహాలు పడలేదు, అందుకని అందరూ మానుకున్నారు."

(వెంకటప్పయ్యగారికి చలంగారిలేఖ 28-8-70)

24

ఆ రోజులలో షౌకి కొంచెం పైత్యం చేసేది. చలంగారు పైత్యాంతకం, మాదీఫల రసాయనం ఇచ్చేవారు. ఒకొ్కక్కసారి డోకు వెళ్ళిపోయేది షౌకి. ఒకరోజు భజన అయిన తరువాత ఆమెకి కడుపులో పెద్ద తిప్పు వొచ్చింది. సోడా తీసుకు వొచ్చి షౌకి ఇచ్చారు. అది తాగినా డోకు ఆగక ఇంటిలోపల తూము దగ్గరకి పరిగెత్తారామె. పె వాంతి అయింది. (అప్పట్లో షౌకి వాంతి అయితే పొట్టంతా మెలిపె నట్లయి లోపలున్న నీరంతా వాంతిగా వొచ్చేసేది) ఈ మారు డోకేసి తరువాత ఆమెకి పొట్ట మెలిపెట్టి నట్లయింది. మళ్ళీ డోకేశారు. ఆ డోకులో అరఔన్సు రక్తం పడింది. పొట్టంతా బరువుగా నొప్పిగా అనిపించిం దామెకి. అయినా ఆమె వొచ్చి మామూలుగా భజనదగ్గర కూచున్నారు. అప్పుడు రాజుగారు, మాధవి ఇక్కడే వున్నారు.

చలంగారు అరుబైట కుర్చీలో కూచున్నారు. షౌకి వాంతిలో రక్తం పడిన సంగతి ఆయనకి చెప్పారు చిత్ర, నర్తకి. ఆయన దిగజారి పోయారు.

"ఏందు కిట్లా రక్తం పడింది షా, ఏమవు తుంది?" అని షాని అడిగారు చలంగారు ఆదుర్దాగా.

"ఏంలేదు తగ్గిపోతుంది నాన్నా" అన్నారు షా నిశ్చలంగా. ఆ మాట వినేసరికి చలంగారికి రోషం వచ్చింది.

"అన్నీ తగ్గిపోతా యంటావు? అన్నీ ఇట్లాంటివి వొస్తూంటే ఇంకా తగ్గట మేమిటి షా" అన్నా రాయన.

మర్నాడు కూడా షాకి పొట్టనొప్పి అలాగే వుంది. డాక్టర్ని పిలిచి చూపించారు చలంగారు. డాక్టరు పొట్టతడివి చూసి అది **peptic ulcer** అన్నారు. షా తమకి పదిహేను రోజుల కొకసారి పుల్లగా డోకు వొస్తోందని చెప్పారు. అప్పుడు అది **acidity** అని చెప్పి- భోజనంలో కారం, పులుపూ పూర్తిగా మానెయ్యాలని వక్క- వాడకూడదని అన్నారు డాక్టరు. ఆ ఏడాది చిత్ర పూర్తిగా కారం, పులుపూ లేకండా షాకి భోజనం ఏర్పాటులు చూసుకుంది. కాని షాకి నాలుగైదు రోజుల కొక సారి యాసిడ్ పడుతూనే వుంది. ఎంత మాత్రమూ **acidity** తగ్గలేదు, చివరికి కృష్ణారావుగారు తెచ్చిన ఆయుర్వేదం మందుతో, కొంత ప్రకృతి వైద్యంతో, ఇప్పుడు టిష్యూ మెడిసిన్స్‌తో కొంత వేరుశనగ పప్పుతో, పాలతో- షా **acidity** కొంత తగ్గింది. అంటే అది తాత్కా-లిక ఉపశమనమే. అది సౌరిస్‌కి ఈచరిత్ర రచనాకాలం దాకా వొస్తూనే వుంది.

హిందూ మతంలో గొప్ప అవతారాలు, సిద్ధులు, ఋషులు ఎవరు గానీ ఈలోకానికి దిగినప్పుడు వాళ్ళు తమని నమ్మిన శిష్యులైనవారి పాపాల్ని, బాధల్ని, రోగాల్ని, తాము భరించి వారికి ముక్తినిస్తారని, ఆబాధల్ని తాము తమవొంటి మీదికి తీసుకుని. సర్వ శక్తి వంతులు గనుక తాము ఆబాధల్ని ఏదో ఓరూపంలో, బాధని అనుభవించకండా

పడతారని విశ్వాసం. అది సత్యం కూడాను. రామకృష్ణపరమహంస **Cancer,** రమణ భగవాన్ **Sarcoma,** ఆనందమయి పెరాలిసిస్, సౌరిస్ యాసిడిటీ, ఇట్లాంటివే. సౌరిస్ నిరంతరమూ ప్రత్యక్ష ప్రత్యక్షలుగా అసంఖ్యాకుల బాధలు గ్రహిస్తున్నారు. అది యాసిడిటీరూపంలో భరిస్తున్నారు. బాధా స్వీకరణ స్థాయినిబట్టి ఆ యాసిడిటీ వుంటుంది. ఒక్కొక్కసారి తీవ్రమైతే గది వెలుపలికి కూడా రారు షౌ. ఆమె భోజనమూ మొక్కుబడి తిండే. ఒక పిడికెడు మెతుకులు. అలాంటి ఈశ్వరమూర్తులు బతికేది తిండిమీద కాదుకదా! అయినా వాళ్ళు శరీరాలు కాదు, గానీ ఇది శరీరబంధంలో వున్నప్పటి చరిత్ర గనక ఈ వివరణ.

డాలీ **third form** ప్యాసయి శలవలకి ఇంటికి వొచ్చింది. డాలీ సన్నటి బంగారు తీగలాగ వుండేది. ఎంత పొడుగయిందో! అప్పట్లో రాజుగారి పని సంతకి (సంత ప్రాంతంలో మర్రిచెట్లున్నాయి) వెళ్ళి మఱ్ఱాకులు కోయడం. ఆయన ఆకులు కోయడానికి ఒక కొంకి కర్ర పట్టుకుని వెడితే, డాలీ ఆకులు వేయడానికి ఒక బుట్ట పట్టుకుని వెళ్ళేది.

ఎండాకాలం గడిచిపోయింది. డాలీని మళ్ళీ స్త్రీ సేవాసంఘంలో చేర్పించి **S. S. L. C.** చదివించా లనుకున్నారు వాళ్ళు.

ఒకరోజు షికార్లో చలంగారు రాజుగార్ని అడిగారు. "ఎందుకట్లా దిగులుగా వున్నారు చెప్పరా?" అని. ఆయన "ఏమీ లేదండి" అంటూనే వున్నారు. చివరికి "ఈశ్వరుడితో చెప్పుకోండి" అని రాజుగార్ని షౌని వొదిలి వెళ్ళిపోయారు చలంగారు మిగిలిన వాళ్ళతో కలిసి. షౌ విఘ్నేశ్వరాలయం మండపంలో కూచున్నారు. ఆయన నిలబడి మెల్లిగా చెప్పారు— డాలీమీద తనకి చాలా ఇష్టమని.

"డాలీ ఇంకా మైనర్, ఆ అమ్మాయి మీద నా కేమీ అధికారం లేదు. ఏం చేసినా డాలీ తల్లీ తండ్రీ చేయాల్సిందే" అన్నారు షా.

"నాకేం తొందర లేదండి" అన్నా రాయన.

"అయితే రెండేళ్ళాగితే డాలీకి మైనార్టీ తీరుతుంది. అప్పుడు మీ ఇష్టం. ఒకరి బాధ్యత లేకండా మీ పెళ్ళి మీరే చేసుకో వొచ్చును" అన్నారు షా.

"అట్లాగే కానివ్వండి. నేను అప్పటిదాకా పెళ్ళికి ఆగుతాను" అన్నా రాయన.

ఈశ్వరుడు డాలీ ఆధ్యాత్మిక జీవితంలో దిగుతుందని అంటే షాకి సంతోషమే. డాలీయే కాదు: చిన్నవాళ్ళెవరన్నా సంసారం తప్పించుకుని ఈ జీవితంలో దిగుతారంటే షాకి చాలా సంతోషం. కానీ ఈ జీవితంలో నడవడమంటే చిచ్చులో నిలవడం. షాకి డాలీ అంటే అంతులేని జాలి. ఎలా ఈ చిచ్చులో నడుస్తుంది? అని. చిన్నప్పటి నించి డాలీ యోగినిలాగే పెరిగింది. డాలీ బాగా చిన్నపిల్ల. శ్రద్ధగా చదువు కుంటోంది. రాజుగారు ఇంటికి వెళ్ళి మళ్ళీ తిరిగి వొస్తూ వుండేవారు.

ఇల్లు కట్టుకుని చివరికి అరుణాచలంలోనే స్థిరపడింది మెర్స్టన్. ఇక్కడ స్థిరపడి నప్పటినించీ చలంగారితో విరోధించినా భజన్లకి వొచ్చేది, మామూలుగా వున్నప్పుడు. ఎప్పుడో ఒళ్ళు బావుండకపోతే తప్ప ఆమె భజనలకి రావడం మానేది కాదు. కానీ చలంగా రింట్లో ఒక్క షాని మినహాయించి అందరికీ మెర్స్టన్ అంటే తగని ఒళ్ళుమంట. షా మాత్రం ఆమెని చూడడానికి అప్పుడప్పుడు వెళ్ళేవారు. ఆమెకి ఒళ్ళు బాగా లేనప్పుడు కూడా ప్రత్యేకంగా వెళ్ళి ఆమెని చూచి వొచ్చేవారు.

ఆవిడ ధైర్యం, సాహసం, లోపల బలం గురించి చెబుతూ ఆ వయస్సు వొచ్చేసరికి ఆవిడ దారుఢ్యం (Grit) మన కెవరికి వుండదు అనేవారు చాడ్విక్ చలంగారితో. ఆ మాట మాత్రం నిజమే. ఎంత దారుఢ్యమో ఆమెలో. తాను ఇల్లు కట్టుకునే టప్పుడు ఆ ఎనభై ఏళ్ళ వయస్సు మనిషి కూలీల్తో సమానంగా ఇటుకరాళ్ళు తట్టల్తో మోసేది. ఆమెకి ఇరవై ఏళ్ళ క్రితం నించి క్యాన్సరు వుంది. అది ఎవరికీ తెలియదు. ఆమెకి ఆ సంగతి తెలిసి కూడా నిమ్మకి నీరెత్తినట్లు నిశ్చలంగా వుండేది.

ఒకరోజు మెర్‌స్టన్ బజారులో ఒక టీదుకాణం దగ్గర కళ్ళు తిరిగి పడిపోయింది. ఆమె కాలి చిటికినవేలు వూడి గూడలోంచి బైటికి వొచ్చేసింది. భుజం కూడా fracture అయింది. ఆవిడ ఏ పరిస్థితిలో వుందో చూసేందుకు షా వెళ్ళారు. నర్తకికి లోపల్నించి మెర్‌స్టన్ అంటే కోపంగా వున్నా షాకూడా ఆమెని చూడడానికి వెళ్ళేది. షాకి ఎవరిమీద కోపతాపాలు ఏనాడూ లేవు. అవి ఆమెలో ఎంతగా లేవంటే ఎవరినైనా కేకలు వెయ్యాలంటే కోపాన్ని నటించవలసి వొచ్చేది. ఇప్పటికీ అంతే.

మెర్‌స్టన్ పరిస్థితి ఎలా వుందో చూసేందుకు షా వెళ్ళేసరికి మెర్‌స్టన్ మేడమెట్ల మీదనించి కిందికి దిగి వొస్తోంది నవ్వుతో. ఎంతాశ్చర్యపోయారో! షా.

"ఇదేమిటి? నీకు దెబ్బలు తగిలాయటగా? మంచంమీద వుంటావనుకున్నాను" అన్నారు షా.

**"It is nothing dear"** అని షా భుజంమీద తట్టి షా వాళ్ళని డైనింగ్ టేబిల్ దగ్గరకి తీసుకునిపోయి కులాసాగా కబుర్లు చెపుతో భోజనం చేసింది.

ఇంకోసారి షౌ మెర్‌స్టన్‌ని చూడడానికి వెళ్ళారు. అప్పుడామె "నేను ఫ్రాన్సునించి కొన్ని ఇంజక్షన్లు తెప్పించు కున్నాను. లోకల్ నర్సులచేత ఇంజక్షన్లు చేయించుకోవడం నాకు ఇష్టం లేదు. నర్తకికి ఇంజక్షన్ చేయడం వొచ్చుకదా! వారానికోసారి నర్తకి వొచ్చి ఇంజక్షన్ ఇస్తే బావుండును అన్నారు షౌతో.

అంతకి మునుపు ఇంట్లో ఎవరికి ఇంజక్షన్ ఇవ్వాల్సి వొచ్చినా షౌయే ఇచ్చేవారు. నర్తకికూడా నేర్చుకుంది కాని నర్తకికి ఇంట్లో పనులు. అదీగాక ఆవిడంటే తగని ఒళ్ళు మంట. చివరికి తాను చెప్పినా నర్తకి వొస్తుందో రాదోనని షౌకి సంశయం. దాంతో నర్తకికీ బోలెడు పనులనీ నర్తకికి తీరుబడి దొరక్కపోతే తామే వొచ్చి ఇంజక్షన్ ఇస్తామని షౌ మెర్‌స్టన్‌కి చెప్పారు. కాని షౌ అడగగానే నర్తకి తాను వెళ్ళి మెర్‌స్టన్‌కి వారానికో **Injection** ఇవ్వడానికి ఒప్పుకొంది.

మెర్‌స్టన్ ఎంతో గొప్ప ఇంటలిజెంట్ పెర్‌సన్ (మేధావి). ఎంత అనుభవశాలో! గొప్ప కాన్వర్‌సేషనలిష్టు (సంభాషణాచతుర). షౌకి కొంత మందిలో వెలుగు కనబడు తుంది (ఈశ్వరకాంతి). ఆ వెలుగువున్న వారెలాంటి వారైనా ఆమెకి సన్నిహితులే, ఆ వెలుగు ప్రకృతిలో అంతటా వుంది. కానీ అది మనుషులలో చాలా అరుదు. వాళ్ళల్లోని వెలుగు చుట్టూ చిక్కని మాయకమ్మి వుంటుంది. కొద్దిమందిలో మాత్రమే ఆవెలుగు వున్నట్లు తెలుస్తుంది. అలాంటి కొద్దిమందిలో షౌదృష్టిలో మెర్‌స్టన్ ఒకరు. అందుకే ఆమెని చూడడానికి అప్పుడప్పుడు వెళ్ళే వారు.

తరచు షౌ తనగదిలో వున్నప్పుడు ఒకకంఠం వినబడు తుండేది. ఆ మాటలు ఆ కంఠం ఎంత సరదాగా వుండేవో! ఆ నవ్వు వింటూ వుంటే ఎంత హాయనిపించేదో! షౌ కొన్ని నెలల తరువాత

ఆయనని చూడటం జరిగింది. ఆయన చాలా పొడుగు. యూరోపియన్ హైట్. ఆయన మాటలెంత సరదా అయినవో! ఇంక చలంగారికి ఆయనంటే ఎంత ప్రేమో! ఆయనే జమ్మలమడక సుబ్రహ్మణ్యం. ఏ బ్రాహ్మణకన్య తమకి వుత్తరం రాసినా, ఆమె సుబ్రహ్మణ్యంని పెళ్ళి చేసుకుంటే బావుండు ననుకునే వారు చలం. కానీ ఎవరు కుదర లేదు.

చివరికి ఆయనే ఒకమ్మాయిని పెళ్ళి చేసుకుని ఇక్కడికి వొచ్చారు. ఆ అమ్మాయి పేరు శ్రీవళ్ళి. ఇద్దరూ కలిసి ఎంత సరదాగా వుంటారో! ఆ అమ్మాయి ఎంత బాగా పాడుతుందో!

అసలు రమణస్థాన్‌లో జరిగే ముఖ్యమైన వుత్సవాలన్నీ ముందు ఈశ్వరుడు చెప్పి చేయిస్తూ వుండేవారు. చెయ్యడానికి ఇంట్లో వారికి ఇష్టం లేకపోయినా (Aug 15) ఈశ్వరావతరణా, భగవాన్ జయంతీ చెప్పి మరీ చేయించేవారు.

ఒకసారి జయంతికి ఇంట్లో వాళ్ళు బాగా విసుక్కొన్నారు. "ఇవన్నీ మీ కోసమే చేయిస్తున్నాను. నా గురువు వుత్సవాలు కనుక నేను చేయిస్తున్నాను. ఇంక చేయ్యాల్సిన అవసరం నాకు లేదు కనుక నేను మానేసు కుంటున్నాను" అన్నారు షౌ. కృష్ణారావుగారు దిగాలుగా తల వొంచుకున్నారు.

"ఎందు కండీ?" అని అడిగారు షౌ. ఆయనేమీ మాట్లాడ లేదు. "ఈ చేయించే దంతా మీ అందరి కోసమే చేయిస్తున్నాను. ఇప్పుడు నేను ఇంకమీద చేయించ బోవటల్లేదు" అన్నారు షౌ. అప్పుడు "అదేమి టండీ. మే మంతా వున్నాం. మీరు చేయించక పోయినా మే మంతా చేస్తాం" అని సుబ్రహ్మణ్యం, కృష్ణారావుగారు హామీ ఇచ్చారు. ఉత్స వం వొస్తోం దనగా అందరికంటే ముందు సుబ్రహ్మణ్యానికి వుత్త

రం రాయించేది డాలీ. ఆయన పొడుగు గనక నిచ్చెన పని లేకండా ఏ అలంకరణైనా పందిట్లో ఆయనే కట్టెయ్యవొచ్చుని. ఆ విధంగానే కొన్నేళ్ళు వొచ్చారాయన. చివరిసారి తమ కుమార్తెతో వొచ్చారు. ఆ కుమార్తెకి సౌరిస్ అని పేరు పెట్టుకున్నారు. ఆ తరువాత మళ్ళీ రాలేదు. కానీ కృష్ణారావుగారు మాత్రం మాట ఇచ్చినందున ఇప్పటివరకూ నిలుపుకుంటూనే వున్నారు అనివార్య కారణాలవలన తప్ప.

చలంగారు వాళ్ళంతా వీలున్నప్పుడల్లా పెద్దగుడికి వెడుతూ వుండేవారు. ఈసారి రాజుగారి పుట్టిన రోజునాడు "నువ్వూ వొస్తావా షౌ?" అని అడిగారు చలంగారు. 'సరే' అని బయలుదేరారు షౌ. చిత్రగూడా వొచ్చింది. ఎక్కడికయినా షౌ తమతో రావాలని చలంగారి పట్టు.

గుడికివెళ్ళి గర్భగుడిలోకి ప్రవేశించారందరు. షౌ ముఖమండపంలో కూచున్నారు. గర్భగుడి లోపలినించి under currents పెద్ద బంగారుతరంగాలుగా షౌ వైపు ఎంతో వేగంగా వొచ్చాయి. ఆ సంగతి షౌకే అనుభూతం. అప్పటినించి అక్కడ కూచోవడం ఆమెకి ఎంతో ఇష్టం.

నర్తకి ఎన్నోరకాల ప్రసాదాలు కొన్నది. ఆ రోజు ఇంటికి తిరిగి వొచ్చాక అందరూ ప్రసాదాలే తిన్నారు. అప్పటినించే షౌ పెద్దగుడికి షికారుగా అప్పుడప్పుడు వెళ్ళి రావడం ఆరంభమయ్యింది.

బి. నరసింహయ్య కుటుంబంతో సహా భగవాన్ ఆశ్రమానికి వొచ్చారు. అక్కడనించి చలంగార్ని చూడటానికి వొచ్చారు. తరువాత, సాయంత్రం భజనకి వొచ్చారు. భజనలో కూచున్నప్పుడు ఆయన భార్య సుశీలమ్మకి కొంతసేపు షౌని చూస్తూ వుంటే గోడ తప్ప షౌ ఆకారం కనిపించలేదట. కొంతసేపటికి తమ గురువుగారు షౌలో నించి కనబడ్డారట. మరునాడు ఆమె షౌ దగ్గరకి వొచ్చేసింది. ఆమెకి

రెండేళ్ళ పసిపిల్ల. ఆమె ఒళ్ళు తెలియని స్థితికి వెళ్ళిపోయింది. ఆ పిల్ల పాలు తాగుతున్నా, ఏం చేస్తున్నా ఆమెకి ఒళ్ళు తెలియటల్లేదు. షాని వీడవలేకండా ఐపోయా రామె. ఇంక వూరికి కూడా షాని విడవ లేక విడవలేక విడిచివెళ్ళా రామె.

అరుణాచలం నించి వెళ్ళిపోయిన తరువాత కూడా అదే స్థితిలో వుండిపోయా రామె. ఆమె తనకి షా కనబడి ఏదో మాటలాడు తున్నా రని వుత్తరాలు రాసేవారు. సంసారంలో వుండి అన్నిపనులూ చేసు కుంటూ, భర్తని సేవించుకుంటూ వుండికూడా ఆమె ఏమి పట్టని స్థితిలో వుండి పోతున్నారు. ఒక్కొక్కప్పుడు ఆ స్థితిని తట్టుకోలేక నీరస పడిపోయి జబ్బు చేస్తూ వుంటుంది. అప్పుడు ఆమె షాకి రాసి విభూతి తెప్పించుకుంటారు. తరచు వొచ్చి ఆశ్రమంలో దిగినా, ఆమె, ఆమె భర్త, పిల్లలు షాతో కొన్నిగంటలు గడిపి మరీ వెడతారు.

డాలీ స్కూల్లో వుండలేనని ఇంటికి వొచ్చేసింది. ప్రైవేట్‌గా మెట్రిక్‌కి పంపాలని కృష్ణారావుగారి దగ్గర tution కి పెట్టారు షా.

ఒకరోజు రాజుగారు "నా సంగతేం చెబుతారు? నాకు డాలీని ఇప్పుడే పెళ్ళిచేసుకోవాలని వుంది" అని అన్నారు షాతో.

"నాదే ముంది? ఆ అమ్మాయి మీద నాకేం అధికారం లేదు. తల్లి వుంది. తండ్రి హైదరాబాదులో వున్నారు. వాళ్ళతో మాట్లాడు కోండి" అన్నారు షా.

రాజుగారు ఏదో మాటాడుతోంటే చలంగారు "ఇవన్నీ ఎందుకు? డాలీ విషయం ఈశ్వరుడు చూడొద్దా?" అన్నారు.

"సరే డాలీ నీ మైనారిటీ తీరేదాకా ఆగుతావా? ఇప్పుడే పెళ్ళి చేసుకుంటావా?" అని డాలీని అడిగారు షా.

"ఇప్పుడే పెళ్ళి చేసుకుంటాను" అంది డాలీ.

"సరే మీ నాన్న అనుమతికోసం అతనికి వుత్తరం రాయి" అన్నారు షా.

డాలీ మారుమాట లేకండా తండ్రి చిరునామాని రాజుగారికి ఇచ్చింది. రాజుగారు హైదరాబాదు వెళ్ళి శ్రీని కలుసుకుని పెళ్ళి విషయం మాటాడుకుని వొచ్చారు. శ్రీ డాలీ వివాహానికి ఒప్పుకున్నారు. రాజుగారు తిరిగి తిరువన్నామలై ఒచ్చేశారు.

అది దీపోత్సవ సమయం. షాకి తెలుసు డాలీ ఒక ఏడాదిపాటు పెళ్ళిచేసుకోకండా ఆగితే వెలుగుదోవన నడిచేదని. కాని కర్మగతి నెవరు తప్పించగలరు? బలీయసి కేవల మీశ్వరాజ్ఞ.

రాజుగారు "నేను పెళ్ళిక్కడ చేసుకోను. తిరుపతిలో చేసుకుంటాను" అన్నారు. షా చిత్రని పిలిచి "నీకిష్టమేనా?" అని అడిగారు. చిత్ర మనసులో ఏముందో గానీ మాట్లాడలేదు. "నువ్వు వెళ్ళి తిరుపతిలో పెళ్ళి చేసేసి రేపురాత్రి తొమ్మిది గంటలకల్లా ఇంటికి తిరిగి రావాలి" అన్నారు షా.

అప్పుడు మామ్మగారు, జిన్నూరునించి వొచ్చిన రాజులూ అంతా ఇక్కడే వున్నారు. రాజుగారు తాము వెళ్ళడానికి అన్నిఏర్పాట్లు చేసుకుంటున్నారు.

ఆ సాయంత్రం రమణస్థానీయులు, షా షికారు బయలుదేరారు, వాళ్ళు బయటికి వొచ్చేసరికి పొడుగు లాగు చొక్కా వేసుకుని చింత చెట్టు దగ్గర ఎవరో నించుని వున్నారు, ఆయనే లలితం బాబాయి.

ఆయన చలంగారిని చూసి "గుర్తున్నానా, అన్నయ్యా" అన్నారు.

"ఎవరు నువ్వు మంగారాం?" అన్నారు చలంగారు. మంగారాం అయితే అచ్చతెనుగులో "గుర్తున్నానా?" అని ఎందుకు అడుగుతాడని ఒకటే నవ్వు వొచ్చింది షాకి. అదీగాక మంగారాం ఎప్పుడో చచ్చిపోయాడు.

"నే నన్నయ్యా: నేను గుర్తు లేనా" అన్నారు లలితం బాధగా.

మళ్ళీ "నువ్వు మంగారాం వా?" అని అడిగారు చలం. చివరికి నేను లలితాన్ని గుర్తులేనా నేను? అన్నారు ఆయన.

"ఓ నువ్వా" అన్నారు చలంగారు.

దీపోత్సవానికి రమణస్థాన్ వెనకాలంతా పెద్ద పాకలు వేశారు. పికారులో రమణస్థానీయు లంతా చలంగారి చుట్టూరా చేరి నడుస్తున్నారు.

"వీళ్ళంతా ఎవరన్నయ్యా?" అన్నారు లలితం.

"మేమంతా ఆయన సంతానం" అన్నారు మామ్మగారు.

ఆ రాత్రి భజనలో లలితం పాడారు. షౌ ఆయనకి హార్మోనియం వాయించారు. మరుసటి రోజు లలితం తాము వెడుతున్నా మని చెప్పారు. అప్పుడు షౌ "పిన్నిని పిల్లల్ని ఈమాటు నీవెంట తీసుకుని రా" అన్నారు. కానీ లలితం మళ్ళీ ఎన్నడూ రాలేదు. పిన్ని మాత్రం వొచ్చింది.

మరుసటి రోజు జ్వరంతో వున్న చంటిబిడ్డ మిశ్రీని ఇక్కడే వొదిలిపెట్టి చిత్ర డాలీ, రాజుగారితో కలిసి తిరుపతి వెళ్ళిపోయింది. చిత్ర డాలీ పెళ్ళి దగ్గరుండి జరిపించి, షౌ చెప్పినట్లుగా అక్షరాలా రాత్రి తొమ్మిదిగంటలకల్లా రమణస్థాన్ చేరుకొంది. డాలీ, రాజుగారు అటునించటు తెలుగుదేశం వెళ్ళి పోయారు. చిత్రని తమతో రమ్మని రాజుగా రెంతో బలవంతం చెశారట. "నేను ఈశ్వరుడికి మాట ఇచ్చాను. నేను వెనక్కి వెళ్ళాలి" అని చెప్పి చిత్ర తిరిగి వొచ్చేసింది.

నర్తకికి డాలీ వివాహం పెద్ద shock. డాలీ అందర్నీ అలా వొదిలిపెట్టి వెడుతుందని వూహించ లేకపోయింది. నర్తకి చాలా

ప్రేమగా పెంచింది డాలీని. ఒక్క క్షణం కూడా తమని వొదిలిపెట్టి వుండలేని డాలీ ఈ విధంగా వెళ్ళిపోయే టప్పటికి నర్తకి ఏమయి పోయిందో? కానీ షా ఆమెకి నిలబడే శక్తి నిచ్చారు. నర్తకి చలంగారు ఒకటే గొడవ.

"డాలీ ఎందు కట్లా విడిచి వెళ్ళింది" అని.

"మంచి పని జరిగింది. డాలీ తన భవిష్యత్తుని తాను చూసుకుంది. అంతకన్నా ఏం చేస్తుంది, ఇక్కడ నించి వెళ్ళలేక ఆయనని వొదలలేక **struggle** అయి చివరికి ఆయనతో వెళ్ళడానికే నిశ్చయించు కొంది" అనుకున్నారు షా.

చుట్టుపక్కల వున్న చలంగారి స్నేహితులకి రమణస్థాన్‌లో జరిగే పను లేవీ కిట్టవు. ఇక్కడ పెరిగిన పిల్లల్ని చూపించి "వాళ్ళ భవిష్య తేమిటి?" అని చలంగార్ని పట్టుకుని అడిగే వారు. డాలీ పెళ్ళి కాగానే అందరూ "చలం వూరికే పైకి ఏమి పట్టనట్లుంటాడు. సమయం వొచ్చేసరికి సముచితమైనదే చేస్తాడు" అని ఆశ్చర్యపోయారు.

కానీ ఇదంతా చేయించేది షా. షా ద్వారా రమణస్థాన్‌లో అన్నిటినీ నడిపేది ఈశ్వరుడు. ఆ అదృశ్య హస్తవిలాసం అగపడక అందరూ మంచైనా, చెడ్డైనా చలమే చేశారు అనుకునే వారు. ఆ విధంగా ఏం జరిగినా చలంగారి పైన అది ప్రతిఫలించేది.

షా మెర్స్టన్‌ని చూడడానికి వెళ్ళి నప్పుడు "డాలీ వెళ్ళిపోవడం నీకేం ఆశ్చర్యం అనిపించలేదా? ఏ ప్రశ్నా లేకండా వెనక్కి చూడకండా వెళ్ళిపోయిందా?" అని అడిగింది షాని ఆమె.

"ఊఁ" అన్నారు షా.

"నువ్వు కూడా **struggle** అయ్యావు కదూ" అంది మెర్స్టన్.

"తప్పకుండా struggle అయ్యాను. అది చాలా బాధాకరమైన సంగతే" అన్నారు షా.

అప్పుడు మెర్‌స్టన్ "రేపు కాకాతో ఇదే విషయం face చేయాల్సి వొస్తే చేస్తావా?" అని అడిగింది.

"ఓ, తప్పకుండా చేస్తాను" అన్నారు షా. ఆ విధంగానే తరువాత కాలంలో face చేశారు కూడాను.

రాజుగారు హైదరాబాదు నించి వొచ్చేటప్పుడు ఆయన వెంట సత్యవతి, ఆమె కొడుకు మహేష్‌తో కలిసి వొచ్చారు. ఆమె ఇంతకి ముందు చలంగారికి వుత్తరాలు రాస్తూ వుండేవారు. ఆమెతోబాటు యమున అనే ఆమె కూడా చలంగారికి వుత్తరాలు రాస్తూ వుండేవారు. సత్యవతి, యమున తమ వుత్తరాల్లో చలంగార్ని 'బాబాయ్'అని సంబోధించే వారు. ఇద్దరూ రచయిత్రులే. వా రిరువురు అక్కా చెల్లెళ్ళనుకునే వాళ్లు రమణస్థానీయులు. కానీ అది నిజం కాదు.

రాజుగారు రాసిన వ్యాసంతో బాటు ప్రచురితమైన షా ఫోటోని చూసి, సత్యవతికి షా మీద, ఈశ్వరుడి మీద ఇంటరెష్టు కలిగింది.

రమణస్థాన్‌లో అడుగుపెట్టగానే సత్యవతి, మహేష్ షా పాదాల మీద పడిపోయారు. సత్యవతి అలా పారవశ్యంతో మోకరిల్లి ఎంత సేపు వుండి పోయిందో! భజనలో షా మీదే ఆమెకి తదేక దృష్టి. అసలామె ముఖం తీరువే పూర్తిగా మారిపోయింది.

మరుసటిరోజు షాకి విపరీతంగా దగ్గు జ్వరం వొచ్చి- బ్రోంకయిటిస్‌గా మారింది, ఇక ఒకటే ఆయాసం. మామ్మగారు షా దగ్గరకి వొచ్చి కూచున్నారు. సత్యవతికూడా వొచ్చి "నా దంతా మీరు తీసుకుని బాధపడు తున్నారా అమ్మా?" అని ఎంతో ఏడ్చింది.

"నేను మీదగ్గరే వుంటాను. ఇంక తిరిగి వెనక్కి వెళ్ళను" అంది సత్యవతి షాతో.

"నా దగ్గరెట్లా వుంటావు? ఇంకా పిల్లలు పుట్టొద్దా నీకు?" అన్నారు షా.

"నాకింకా పిల్లలా?" అని సత్యవతి గుండెల్లో రాయిపడింది.

సత్యవతికి షా కంఠం వినడం ఎంతో ఇష్టం. అప్పుడు షాకి బ్రోంకయిటీస్, గొంతునొప్పి. పెప్స్ మాత్రలు బజార్నించి తెప్పించి షాని వేసుకోమని, మాట్లాడించేది సత్యవతి. ఆవిడది జులుంతో కూడిన ప్రేమ. ఒకటే కబుర్లు చెప్పమని గోల పెట్టేది. ఈశ్వరుడి గురించి అడిగితే భగవాన్ గురించి చెప్పేవారు షా. "నేను ఈశ్వరుడి గురించి అడిగితే భగవాన్ గురించి చెబుతారెందుకు? ఈశ్వరుడి గురించి చెప్పు" మని కూచునేది. కొన్నాళ్ళిక్కడ సరదాగా గడిపి సత్యవతి వెళ్ళిపోయారు.

ఇక్కడ్నించి వెళ్ళాక చలంగారికి వుత్తరాలు రాస్తూనే వున్నారు సత్యవతి. ఆ వుత్తరాల్లో ఆమె చలంగారితో తగవాడే వారు. హైదరాబాదులో ఏ సహాయం కావాల్సి వొచ్చినా చలంగా రిది చేసిపెట్టు అని రాస్తే చాలు వెంటనే ఆపనిని నిముషాలమీద చేసిపెట్టేవా రామె. తెలుగుదేశానికి చాలా దూరంగా ఒక మారుమూల చలంగారు వున్నారు కనక ఆయన పుస్తకాలు మన ఇష్టం వొచ్చినట్లు చెలామణి చేసుకోవచ్చు అనే ధోరణిలో పబ్లిషర్లు, డిస్ట్రిబ్యూటర్స్ చలంగారి పట్ల నిర్లక్ష్యంగా వుండేవారు, వాళ్ళు మరీ తంటాలు పెట్టేసరికి చలంగారు సత్యవతికి సంగతి సందార్భాలన్నీ వుత్తరం రాశారు. సత్యవతి భర్త పెద్దిరెడ్డిగారు ప్లీడరు. ఆయన నించి ఒకకార్డు చలంగార్ని తంటాలు పెడుతున్నవారికి చేరింది. అక్కడితో ప్రచురణకర్తలూ, డిస్ట్రిబ్యూటర్లూ చలంగార్ని చిక్కులు పెట్టడం మానేశారు.

చలంగారికి హైదరాబాద్ నించి కొంత మంది S.U.S మొగ వాళ్ళు ఆడవాళ్ళూ (save our souls) వుత్తరాలు రాసేవారు. వారి సంగతి కనుక్కోమని చలంగారు సత్యవతికి వుత్తరం రాస్తే చాలు. సత్యవతి వారిని పిలిపించి అవసరమైన సలహాలిచ్చి సాయం చేసే వారు. ఇప్పటికీ చలంగారు ఎవరి విషయం రాసినా సహాయ సహకారాలు వారికి అందజేస్తూనే వున్నారు సత్యవతి.

ఎమ్. ఆర్. నాగేశ్వరరావుగారు అందర్నీ భగవాన్ జయంతులు జరిపించండని ప్రోత్సాహం చేయడంతో సత్యవతి నడుం బిగించి హైదరాబాదులో బ్రహ్మాండమైన స్థాయిలో జయంతిని జరిపించారు. ఆజయంతికి గుడిపూడి భక్తబృందం, కురంగేశ్వరరావు, టీచర్ కనకమ్మగారు తెలుగు దేశం నించి హైదరాబాదు తరలి వెళ్ళారు. ఇంక ఆభజనలు అవి విని- ఆ చుట్టుపక్కలవారు ఎవరి గురించిన వుత్సవమో అడిగి— అది భగవాన్ రమణమహర్షికి చెందిన దనేసరికి తాముగూడా అందులో పాల్గొన్నారు. వారి ఇళ్ళకి వొచ్చి రమణ భజనలు చేయమని- ఈ భక్తమండలిని, సత్యవతిని ప్రార్థించే వారుట. ఈ విధంగా హైదరాబాదు మహానగరం నాలుగు చెరగులా భగవాన్ రమణులనామం సత్యవతి వుత్సాహం వలన గొప్పగా వ్యాపించి పోయింది. అప్పట్లో రోజు వారిగా తాము చేస్తున్న రమణ సంకీర్తనోత్సవాల గురించి కురంగేశ్వరరావు వెంకటప్పయ్యగార్లు ఎంతో గొప్పగా డైరీ బులెటిన్‌లు- చలంగారికి పంపేవారు. అవి ఎంత వుత్సాహంగా insipiring గా వుండేవో:

"మీ ఆధ్వర్యం కింద సత్యవతి- కాదు- సత్యవతిరెడ్డి- గారి ఆతిధ్యం కింద ఎంత గొప్పగా ఎన్ని రమణ జయంతులు జరిగాయో చదివి ఆనందపడ్డాము. నన్నుకూడా తీసుకు పోయినారు కద మీరు.

"అప్పడ మొత్తి చూడు" సరే, ఆ అప్పడం హైదరాబాదు జొన్న అప్పడమేమో! అది తిన్న నీ ఆశ పీడు.

అది ఎట్లా చేస్తారో కనుక్కున్నారా?

తన తెలుగు భక్తులందర్నీ ఎట్లా ఏకం చేస్తున్నారో భగవాన్!

మీరు మన భక్తుల కందరికీ నాయకుడై సభలను జయప్రదంగా కొనసాగించారుట కదః మీరు రాసే వుత్తరాలు సౌరిస్ చదువు తుంది నేను వింటాను. అంతే. ఎవరూ వుండరు- ఆవేళకి.

నాగేశ్వరరావుల ఇద్దరి వాక్కులలోనే భగవాన్ కూచుని వారిని నడిపించారు. భక్తులు తన అంగడిని తినెయ్యడం మూలాన పుల్లారెడ్డి కూడా ధన్యుడైనాడు. కనకమ్మగార్ని కదిలించి తీసుకు వెళ్ళింది మీరే కదః అంతటి ఆమెని కదిలించడం ఇంకోరి తరమా?

(వెంకటప్పయ్యగారికి చలంగారిలేఖ 19-1-70)

సత్యవతి షామీద తమకి అవధులులేని ప్రేమ 'భద్ర' మని షాని హెచ్చరిస్తూ వుంటారు. ప్రస్తుతం చలంగారికి ఓపిక తగ్గి- అతిముఖ్యమైన వుత్తరాలు మాత్రం కృష్ణారావు గారికి డిక్టేట్ చేసి రాయిస్తున్నారు. అందువలన ఇప్పుడు సత్యవతి సౌరిస్‌గారితోనే వుత్తర ప్రత్యుత్తరాలు సాగిస్తున్నారు. చలం వుత్తరాల మిత్రులలో చాలామంది ఇప్పుడు సౌరిస్‌కే రాస్తున్నారు. సత్యవతి షాకి తన అలకలతో, తగాదాలతో పంతాలతో వుత్తరాలు రాస్తారు. ఒకసారి ఆమె తండ్రికి పక్షవాతం వొచ్చి ప్రమాదస్థితిలో వున్నా రంటే ఆయనని చూడడానికి వెళ్ళి, ఆయనెంతో ప్రమాదస్థితిలో వున్నాగాని- అక్కడి నించి సౌరిస్‌ను చూడడానికి వొచ్చేశారు సత్యవతి. ఆమెది అలాంటి నిరంకుశ ప్రేమ.

సత్యవతి తాము శ్రీరమణస్థాన్ మీద గొప్ప గ్రంథం తెలుగు సాహితీ పరుల్ని వుత్తూత లూపేదాన్ని రాస్తామని—— ఆ గ్రంథం ఎలా వుంటుందోః షాకి ఇటీవల కాలంలో అదే పనిగా వుత్తరాలు రాస్తున్నారు. ఆ గ్రంథం ఆమె రాస్తారో లేదో గానీ, ఆ గ్రంథం ఏ

విధంగా వుంటుందో నేను వూహించలేను గానీ తాను రాస్తా ననే ఆ గ్రంథం గురించి ఆమె రాసే వుత్తరాలు చాల గొప్పగా వున్నాయి.

ఆమె వూహా కావ్యం గురించి ఆమె మాటల్లోనే విందాం.

"నేను సృష్టించబోయే రమణస్థాన్ రంగుల హర్మ్యం ఏ వైపు నించి చూసినా మీకు తళుక్కుమని మెరిసే మెరుపుల కాంతే కనిపిస్తుంది.

చాలా సంవత్సరాల క్రితం— మొట్ట మొదటిసారి నేను రమణస్థాన్‌లో అడుగు పెట్టినప్పుడు- సౌరిస్‌గారి ముఖంలో నాకు ఎప్పుడూ సూర్యోదయంలో కన్పించే అరుణకాంతి లాంటి అరుణిమ ప్రజ్వరిల్లుతూ కన్పించేది. ఆ సమయంలో అతిలోక సౌందర్యంతో మెరుపు లీనుతూ అతి సుకుమారమైన రాకుమారిలా కన్పించేవారు నా కళ్ళకి మీరు.

ఆ figure నిలబడేలా రాయగలగాలి నేను."

(సౌరిస్‌గారికి సత్యవతి లేఖ 1-10-77)

ఆమె అనుభవాలని ఆమె మాటల్లోనే విందాం.

"మేము Hyderabad వచ్చిన క్రొత్తలో యింట్లో నా కేమీ తోచేది కాదు. రోజూ లైబ్రరీ నుండి రకరకాల పుస్తకాలు తెప్పించుకొని చదివేదాన్ని. ఓ రోజు రెడ్డిగారు మహాస్థాన్ అన్న పుస్తకం తెచ్చి యిచ్చారు.

అదేదో కథల పుస్తక మనుకున్నాను. కాని నిజాని కది ఏ కథా కాదు. సౌరిస్‌గారి ఈశ్వర సాక్షాత్కారం గురించి చలంగారు తన మిత్రునికి రాసిన వుత్తరా లవి. చదివేకొద్దీ నాలో వుత్సాహం పెరిగింది. ఆశ్చర్యంతోపాటు సంతోషం కూడా కల్గింది. చిన్నప్పటినించీ నాకు పార్వతీ పరమేశ్వరులు ఆరాధ్యదైవాలు. అందరూ పిచ్చి అన్నా

చాదస్తమన్నా అని అనుకోనీ కానీ నాకు ఈశ్వరుడి మీద భక్తి అధికం. నాకంత యిష్టమైన ఆ ఈశ్వరరూపం ఏ సినిమాల్లోనో, నాటకాల్లోనో చూడవల్సిందే తప్ప ప్రత్యక్షంగా చూసే అవకాశ మేదీ? ఆ ఈశ్వరుడు ఈనాడు స్వయంగా సౌరిస్‌గారి దగ్గరకి రావటం, అదే మనుష్యుల్లో మనిషిగా, ఒక కుటుంబంలో సభ్యుడిగా మసలటం— యివన్నీ నాకెంతో వింతగా కన్పించాయి. దానితో చదివిందే మళ్ళీ మళ్ళీ చదివా నా పుస్తకాన్ని. చివరికి నా కుతూహలాన్ని ఆపుకోలేక వారికే స్వయంగా రాసి యీ విషయ మేమిటో అడగా లనుకున్నాను. అప్పుడు చలంగా రెవరో, ఎక్కడున్నారో, అసలు బ్రతికే వున్నారో లేదో కూడా తెలీదు నాకు. ఆ పుస్తకం వెనకవైపున చేంతాడంత **address** వుంది. ఆ **address** తో చలంగారికి వుత్తరం రాశాను. మూడో నాటికే ఆయన దగ్గర్నుంచి జవాబు వచ్చింది. చలంగారు జవాబు రాస్తూ ఈశ్వరుడు సత్యరూపంలో సౌరిస్‌కి దర్శన మిచ్చిన సంగతి— వెలుగురూపంలో ఈశ్వరుడి రాక- అన్నీ వివరించారు నాకు. ఇక నా ఆనందానికి అంతే లేదు. ఆనాటి నుండి విడువకుండా ఆయనకి వుత్తరాలు రాస్తూ వచ్చాను నేను. మధ్యమధ్యలో సౌరిస్‌గారికి కూడా రాస్తూండే దాన్ని. నా కేమైనా సందేహాలు వస్తే సౌరిస్‌గారికే **direct** గా రాస్తే, ఆవిడ చలంగారిద్వారా జవాబులు రాయించేవారు.

ఆ సమయంలోనే ఓ పత్రికలో రాజుగారి వ్యాసం చదివి అందులో సౌరిస్‌గారి **photo** చూశాను. ఆ ఫోటో చూడగానే నే నెంతో **inspire** అయ్యాను. 'ఈవిడ నా కెంతో ఆత్మీయురాలు' అనిపించింది. అప్పుడే వజీర్‌గారు మరికొన్ని సౌరిస్‌గారి ఫోటోలు పంపించారు. ఓ ఫోటోలో సౌరీస్‌గారు నవ్వుతూ కూచుని వున్నారు. ఆ ఫోటోని తదేకంగా చూస్తూ సౌరిస్‌గారి గురించి వూహించు కుంటూ

ఏవో కలల్లో తేలిపోయే దాన్ని. ముఖ్యంగా సౌరిస్‌గారి నవ్వు నన్ను ఆకట్టుకుంది. ఆమె ఎంతో అందంగా నవ్వుతారని, ఆ నవ్వు వెయ్యి తామర లొక్కసారి వికసించి నట్లుంటుందని అనుకునే దాన్ని.

ఇక నవరసభరితమైన చలంగారి వుత్తరాల్ని చదువుతూ వుంటే ఆయనొక మహాపురుషుడని, భూమిమీదకాక ఏ గంధర్వలోకంలోనో విహరించే దివ్యపురుషుడనీ అన్పించేది.

వుత్తరాలతో సాన్నిహిత్యం పెరిగేకొద్దీ నాకు వాళ్ళిద్దరినీ చూడాలనే ఆరాటం అధికమైంది. ఎప్పుడెప్పుడు చూద్దామా అని తహ తహ లాడేదాన్ని.

ఇట్లా వుండగా ఓ రోజు కృష్ణంరాజుగారు వచ్చి **Hyderabad** నుండి అరుణాచలానికి **special bus** ఒకటి బైలుదేర్తుందనీ, ఆగష్టు 15వ తేదీకి అక్కడికి చేర్తామనీ, ఆ **bus** లో నన్నూ రమ్మని పిలిచారు. ఇంక నా సంతోషం చెప్ప నలవికాదు. ఇన్ని రోజుల నుండి నేను కన్న కలలన్నీ నిజం కాబోతున్నాయ్. త్వరలోనే చలంగారిని కలుసుకో బోతున్నాను. సౌరిస్‌గారి ప్రక్కన కూర్చునే అదృష్టం లభిస్తోంది— చక చకా సామాన్లన్నీ సర్దేశాను. అప్పుడే అరుణాచలం వెళ్ళినట్లు, అందర్నీ చూసినట్లు మురిసిపోతూ గంతులేస్తూంది మనస్సు. ప్రయాణసమయం దగ్గిర పడేకొద్దీ, ఏ నిమిషంలో వెళ్ళిపోదామా అన్న నా ఆతృతవల్ల గంటలే మహాయుగాల్లా విసుగు కలిగిస్తున్నాయ్ నాకు. ఇలా నేను మహావుత్సాహంగా ప్రయాణసంరంభంలో మునిగి వుండగా మళ్ళీ రాజుగారు వచ్చి "**sorry** సత్యవతిగారు! ప్రయాణం ఆగిపోయింది. వర్షాలవల్ల బస్సులు నడవటం లేదట" అన్నారు. పిడుగు లాంటి యీవార్త విని కొయ్యబారి పోయాను నేను. దుఃఖంతో నా హృదయం బ్రద్దలౌతుం దేమో నన్పించింది. నా వుత్సాహం మీద

కుండెడు నీళ్ళు చిలకరించింది ఆ వర్షం. ఎన్నో రోజుల నుంచీ నేను కన్న కలలన్నీ కల్లలై పోతున్నాయి. నిరాశ నిస్పృహలతో నా మనస్సు కృంగి పోయింది.

సౌరిస్‌గారిని చూడాలని, అందమైన ఆమె చిరునవ్వుని హృదయంలో చిత్రించు కోవాలని, ఈశ్వర పరంగా నాకు కలిగే అనంతమైన అనుమానాలని, సందేహాలని ఆవిడ ద్వారా తీర్చుకోవాలని, నెలలకు నెలలు, సంవత్సరాలు నేను వుబలాటంతో ఎదురు చూసింది యిందుకేనా? అన్న బాధ నన్ను నిలువునా వూపేసింది. దుఃఖంతో నా కళ్ళు శ్రావణమేఘాల్లా వర్షిస్తూనే వున్నాయ్ ఆ రోజంతా. దెబ్బ తిన్న మనస్సు ఈశ్వరుడి మీద ఎదురు తిరిగింది. వూహ తెలియని పసితనం నుండి ఆయన్ని ఆరాధించి పూజించింది యీ **disappointment** ఎదుర్కోవటానికేనా? ఆయన నాకిచ్చే కానుక యిదేనా? అనుకుని ఆయనమీద రోషం, కోపం కలిగాయి నాకు.

తెల్లవారితే ఆగష్టు 15. ఆ దినం శ్రీరమణస్థాన్‌లో ఈశ్వరావతరణోత్సవం వైభవంగా జరుపుకుంటారు వాళ్ళు. అన్నీ అనుకూలించి వుంటే ఆ రోజు నే నక్కడ వుండవలసిన దాన్నేకదా అన్న భావం నన్ను మరీ బాధింప జొచ్చింది. వ్యధతో నా మనస్సంతా మూసుకు పోయింది.

చలంగారితో పరిచయమైనప్పటి నుండి మేమందరంకూడా మా యిండ్లలో ఆగష్టు15 గొప్పగా జరుపుకోవడం ప్రారంభించాము. ఆ రోజుకూడా అలవాటుప్రకారం తెల్లారే లేచి స్నానం పూర్తి చేసి నైవేద్యం తయారు చేశాను. పూజ చేస్తున్నానేకాని కన్నీళ్ళు ధారగా కారటం మొదలు పెట్టాయి. సౌరిస్‌గారి రూపమే మెదుల్తోంది మనస్సులో. నా దృష్టంతా ఆమెమీద కేంద్రీకృత మైందే తప్ప పూజమీదకి ధ్యాస పోవ

టం లేదు. పొంగి పొరలే కన్నీటితోనే పూజ పూర్తి చేశాను. కాని నాకు కలిగిన ఆ అఘాతాన్ని మనస్సు తట్టుకో లేకపోయింది. వేదనతో బరువెక్కింది. ఇక యింట్లో వుంటే ఆ ఆలోచనలే వస్తాయని కాస్సేపు బైటికి ఎక్కడికైనా వెళ్దా మనుకున్నాను.

అప్పుడు మేము సుల్తాన్‌బజారులో ఒక మేడమీద వుండేవాళ్ళం. మా యింటి కెవరు రావాలన్నా ముందు క్రిందింటి వాళ్ళ అనుమతి తీసుకుకొనే పైకి రావల్సి వచ్చేది. మా యింటి మెట్లు వాళ్ళ main hall లో వుండేవి.

నేను బైటికి వెళ్దామని మెట్లదగ్గరికి వచ్చేసరికి అక్కడ చిరునవ్వుతో నిల్చుని వున్నారు ఓసాధువు. అందరు సన్యాసుల్లా ఆయన కాషాయంబరాలేం కట్టుకో లేదు. తెల్లటి పంచ, పైన కప్పుకున్న తెల్లటి కండువా, మెడలో రుద్రాక్షమాల, కుడిచేతి మణికట్టుకు మరో రుద్రాక్షమాల చుట్టుకున్నారు. నన్ను చూడగానే "అమ్మా! ఆకలేస్తోంది" అన్నారు. ఆయన్ని చూడగానే ఆశ్చర్యం వేసింది నాకు. క్రిందింటివాళ్ళని ఎలా తప్పించుకొని పైకి వచ్చారా యీయన? అని. సరే! ఎలాగూ పండగేకదా! సమయానికి వచ్చారు లెమ్మని నేను చేసిన పదార్థాల్ని పళ్ళెంలో పెట్టుకుని వచ్చాను. ఆయన రెడ్డిగారితో మాట్లాడ్తూ కూర్చొని వున్నారు. గంభీరమైన రూపం, కంచుకంఠం. ఆయన మాటల్లోకూడా ఏదో విలక్షణత. నేను పెట్టినవి తింటూ వేదాంతం మొదలు పెట్టారు. ఆయన చెప్పేవిధం ఎంతో ఆకర్షణీయంగా వుంది. నాకు తెలియ కుండానే అతిశ్రద్ధగా ఆయన మాటల్ని వింటూ కూచున్నాను.

అప్పుడప్పుడూ నాకు ఆధ్యాత్మిక పరంగా కలిగిన సందేహాల్ని నేను ఓ ప్రశ్నావళిగా తయారు చేసుకున్నాను, తిరువన్నామలై వెళ్ళినప్పుడు సారిస్‌గారిని అడగాలనుకుని. కాని ఆ అవకాశం కలగలేదు

కాబట్టి ఆ సన్యాసి మహారాజ్‌ని ఆ ప్రశ్నల్లో కొన్నిటిని అడిగాను. అవి వినగానే ఆయన నవ్వారు. ఆ నవ్వు చూడగానే హఠాత్తుగా అది సౌరిస్‌గారి చిరునవ్వు అన్పించింది నాకు. దానితో ఎంతో relief. ముడుచుకు పోయిన నా మనస్సు మామూలుగా తయారైంది. రాయిలా గడ్డకట్టుకు పోయిన మనస్సులో వుత్సాహం వురకలు వేసింది, ఆయన ఒక్కొక్క సమాధానమే చెప్తూంటే పువ్వులా విచ్చుకోవటం ప్రారంభించింది మనస్సు. చివరిలో నే నడిగాను "స్వామీ! సౌరిస్‌గారిని చూడలేని నిరుత్సాహం నన్ను కలచి వేస్తోంది. పోనీ, ఆమెలాంటి మరో వ్యక్తి నెవరినైనా చూస్తే యీ మనస్సు శాంతిస్తుందేమో" అని. ఆయన శాంతంగా, దృఢంగా "All that glitters is not gold. అందరూ సౌరిస్ లాటివారే ననుకోకు" అన్నారు.

వెళ్ళిపోవడానికి వుద్యుక్తుడై ఆయన రెండు మెట్లు దిగగానే నేను గబుక్కున "స్వామీ! మీరు మళ్ళీ రేపు రాకూడదూ?" అన్నాను. ఆయన చటుక్కున వెనక్కి తిరిగి "రేపుకు రూపమే లేదమ్మా!" అని చకచకా మెట్లుదిగి వెళ్ళిపోయారు. ఆయన వున్నంతసేపూ మాయిల్లు ఏదో వెలుగులో నాట్యం చేసిం దనిపించింది.

ఆ రాత్రి నాకు అద్భుతమైన కల వచ్చింది.

అది చలంగా రింటిముందు చిన్న పూలతోటట. ఆతోట మధ్యలో ఒకరాతి పలక. నేను తోటలో తిరుగుతూ పూలు కోసు కుంటున్నాను లలితాస్తవం సంస్కృతంలో చదువుతూ. సరిగ్గా నేను "శ్వేతాంబర వస్త్రధారిణీం" అంటూ వెనక్కి తిరిగే సరికి ఆ రాతిపలక మీద తెల్లటి బట్టల్తో ఓ స్త్రీమూర్తి కూర్చుని వుంది. విరబోసుకున్న ఆమె జుట్టు గాలికి చిందర వందరగా ఆమె భుజాల మీద పడ్తోంది. ఆమె నా వైపు వీపుబెట్టి కూర్చొని వుంది, ఎవరా అని ఆశ్చర్యంతో దగ్గరికెళ్ళి

చూస్తే సౌరిస్‌గారు గభాల్న పూలసెజ్జ ప్రక్కన పడవేసి వెళ్ళి కాళ్ళకి నమస్కరించాను. నన్ను లేపి తన ప్రక్కనే కూచోబెట్టు కున్నారు ఆవిడ. "నన్ను చూడలేదని అంత దిగులు పడ్డా వెందుకు! వచ్చాను కదా!" అన్నారు. తర్వాత నాకు తెలియని ఎన్నో విషయాల్ని విపులంగా విశదీకరించి చెప్పారు. మంత్రముగ్ధలా వింటూ కూచున్న నాకు సందేహాలన్నవే లేకండా అంతరించి పోయాయి. (ఆనాటి నుండి యీనాటి వరకూ నేను సౌరిస్‌గారిని ఏ ప్రశ్నా వెయ్యలేదు. మళ్ళీ) అయితే చిత్ర మేమిటంటే అంతసేపూ మేమిద్దరం సంస్కృతంలోనే మాట్లాడుకున్నా మట.

వుదయం లేచి నప్పటినుండి ఏదో అవ్యక్తానందం నాలో. వెంటనే జరిగిన సంఘటనలన్నీ చలంగారికి వుత్తరం రాశాను.

చలంగా రెంతో సంతోషంతో "చాలా అదృష్టవంతురాలివి నువ్వు. ఈశ్వరదర్శనం లభించింది నీకు. చాలా సంవత్సరాలక్రితం మా స్నేహితురాలు కనకమ్మగారనే ఆవిడకూ యిలాటి అనుభవమే కల్గింది.

చాలా ధన్యురాలివి నువ్వు. ఈశ్వరుడే స్వయంగా నీ యింటికి వచ్చారు. నీ వుత్తరం విని షౌ "ఆ రోజు సత్యవతి నన్ను విపరీతంగా ధ్యానించింది. నేనూ ఆమెను అనుకున్నాను. ఇది జరిగింది" అంది.

నీకు కల్గిన యీ ఈశ్వర దర్శనానుభవాన్ని నిత్యనూతనంగా నిలుపుకో నీలో! ఎప్పుడైనా ఎవరైనా అడిగితే 'అవునవును. అప్పుడెవరో, ఏదో వచ్చా రనుకున్నాము కదూ' అనేస్థితికి దిగజారకు" అని రాశారు.

ఈ సంఘటన తర్వాత మరీ close అయిపోయారు. సౌరిస్ గారు నాకు మానసికంగా. దానితో ఆమెను చూడాలనే తపన మరింత

అధిక మైంది. రాత్రింబవళ్ళూ ఆమెను ఎప్పుడు చూద్దామా అన్న ఆకాంక్షే! వుత్తరాలద్వారా నా మానసికస్థితిని గ్రహించిన మహా మేధావి చలం "ఇక్కడికి వొచ్చావా పూర్తిగా సౌరీస్‌మయం అయిపో తావు నీవు. ఇంక చలం కనపడడు నీకు" అని రాశారు. అసత్యమెరు గని ఆయన నోటిమాటే నిజమైంది తర్వాతి కాలంలో.

1964వ సం॥రం॥లో రాజుగారు మహేష్‌నీ, నన్నూ అరుణా చలం తీసుకు వచ్చారు. నేను చలంగారితో మాట్లాడ్తూనే దిక్కులు చూస్తున్నాను. అది గమనించి చలంగారు "షౌ ఆ గదిలో వుంది వెళ్ళు" అన్నారు. నాకు ఒళ్ళంతా చెమట పట్టింది. భయంగా, దడదడ లాడే గుండెలతో మెల్లిగా వెళ్ళి చీకటిగావున్న ఆ గదిలోకి తొంగి చూశాను. వుజ్జ్వలమైన కాంతితో ఓమూల కూచుని వున్నారు సౌరిస్ గారు. అమాంతం ఆమె పాదాలమిద పడ్డాను వెళ్ళి. నా ఒళ్ళు తెలియ లేదు నాకు. అలా ఎంతసేపు వున్నానో! సౌరీస్‌గారంతసేపూ నా తల నిమురోతునే వున్నారు. మా అబ్బాయి మహేష్ నిశ్శబ్దంగా అలాగే సౌరిస్‌గారి కాళ్ళమీద తలపెట్టి నమస్కరిస్తున్నాడు.

ఇన్నాళ్ళూ నా కల్పనాజగత్తులో విహరించిన వ్యక్తి యిప్పుడు యింత స్పష్టంగా నా కళ్ళముందు ప్రత్యక్షమయేసరికి తన్మయత్వంలో నన్ను నేనే మరిచి పోయాను. చిన్నప్పుడు నా మనస్సులో ఓ అంద మైన చిత్రం హత్తుకు పోయింది. అది ఎప్పుడు ఎందుకు ఏ విధంగా నా మనస్సులో ముద్రిత మైందో యీ రోజు నాకు జ్ఞాపకం లేదు.

తెల్లటి మంచు తెరలతో కప్పబడిన మహోన్నతమైన హిమా లయ శిఖరాల్లో ఓ పర్ణకుటీరం. ఆ కుటీరంలో తపోనిష్ఠాగరిష్ఠురాలైన ధవళవస్త్రాంబర ధారిణి సతీదేవి రూపం. ఈ చిత్రం ఎప్పుడూ నా కళ్ల

ముందు మెదులు తూండేది పసితనంలో. కాని క్రమంగా కాలం కప్పిన మాయ పొరలతో యీ రూపం అస్పష్టమై పోయింది నాలో.

ఎప్పుడైతే మళ్ళీ నేను శ్రీ రమణస్థాన్‌లో అడుగుపెట్టి సౌరీస్ గారిని చూశానో, ఆ క్షణంలో అన్నేళ్ళు మసకబారిన ఆ సతీదేవిరూపం మళ్ళీ నా కళ్ళ ముందు మిరుమిట్లు గొలిపే దివ్యకాంతితో ఇప్పుడు ప్రత్యక్ష మైంది. సౌరిస్‌గారివైపు ఎప్పుడుచూసినా వూహావాస్తవికతల సమన్వయ స్వరూపం సౌరిస్‌గా రనిపిస్తుంది నాకు.

సౌరీస్‌గారి కంఠం చాలా మధురంగా వుంటుంది. ఆమె స్వరం వింటూంటే వీణ మీటినట్లుగా వుంటుంది నాకు. గంటల తరబడి కబుర్లు చెప్పించుకున్నా తనివి తీరేది కాదు నాకు. సాయంకాలాలు రోజూ సౌరిస్‌గారు, చలంగారు, నేనూ సింహాతీర్థం వైపు షికార్లు వెళ్ళేవాళ్ళం. ఆ తీర్థం గట్టున కూచుని సౌరీస్‌గారు ఈశ్వరుడిగురించి, జన్మల గురించి, పాప పుణ్యాల గురించి, గురుశిష్య సంబంధాల గురించి ఎన్నో- ఎన్నెన్నో కబుర్లు చెప్పేవారు. ఒక్క గంట వూరికే వుండ నిచ్చేదాన్ని కాదు నేను. సౌరీస్‌గారు నవ్వుతూ "కామేశ్వరిని నేను వీణచేసి వాయిస్తే సత్యవతి నన్ను వీణలా వాయిస్తుంది" అంటూంటారు.

పగలంతా ఒక్క నిమిషం వదిలి వుండేదాన్ని కాదు. రాత్రిళ్ళు పడుకున్న తర్వాత ఎప్పుడో ఎందుకో హఠాత్తుగా మెలకువ వస్తే సౌరీస్‌గారు నా దగ్గరే నిలబడి వుండడం చూసి నిద్రమత్తులోనే "time ఎంతమ్మా" అని అడిగేదాన్ని. సౌరీస్‌గారు చెప్పగానే విని మళ్ళీ నిద్రలో పడిపోయేదాన్ని. తీరా వుదయం లేచి అడిగితే "ఆవేళప్పుడు మీ గదిలోకి రానుకదూ నేను" అనేవారు తియ్యగా నవ్వుతూ.

ముందు ఒకటి రెండుసార్లు తెల్లబోయాను. కాని తర్వాత తర్వాత అర్ధమైంది అది సౌరిస్‌గారి **physical form** కాదని.

అలా ఎప్పుడూ అంటిపెట్టుకొని తన వెంట వెంటే తిరిగే నన్ను చూసి నవ్వి "మనది మర్కట కిశోరన్యాయం" అంటారు సౌరిస్. అందరికి ఎట్లా కనిపిస్తారో కాని నా కళ్ళకు మాత్రం ఆమెలో అతిలోక సౌందర్యం గోచరిస్తుంది. అలౌకిక తేజస్సంపన్నురాలైన ఆమె నడక, మాట, ప్రవర్తన అన్నీ అద్భుతంగానే వుంటాయ్ నాకు. శాంతం, సహనం, గాంభీర్యం ఆమెకు పెట్టని ఆభరణాలు. ఆమె ప్రక్కన వున్నంతసేపూ నాకు యీ భూమిమీద వున్నానన్న స్పృహే వుండేది కాదు.

ఎన్నో జన్మల నుండి నేను వెతుకుతున్న గురువు, నా **ideals** అన్నీ కలబోసి మలచిన ప్రతిబింబం 'యీ సౌరిస్‌గారే' అన్పించింది చాలా గాఢంగా నాలో. తప్పుకోలేని, త్రిప్పుకోలేని ప్రేమ జనించింది నాలో ఆమె మీద. అప్పటినుండే ఆమెమీద అంత భక్తి విశ్వాసాలు నెలకొన్నాయ్ నాలో. అంతేకాక సౌరిస్‌గారి స్వభావంలోని మృదుత్వం, ప్రవర్తనలోని లాలిత్యం నన్నెంతో ఆకర్షించాయి.

నేను రమణస్థాన్ వచ్చిన సమయంలో చలంగారు భగవద్గీత **translate** చేస్తుండేవారు. అప్పుడు కృష్ణారావుగారింకా వూరినుండి రాలేదు. నర్తకిగా రొక్కరే సహాయం చేస్తూండే వారు చలంగారికి.

నేను వచ్చినప్పటి నుండి ఆపనిలో చలంగారికి నేను సహాయపడేదాన్ని.

ఈ భగవద్గీతా వ్యాఖ్యానం ప్రసక్తి అస లిక్కడ రాకపోయేదే! కాని నేనిప్పుడు **Hyderabad** నుండి వచ్చి సూర్యనారాయణగారు రాస్తున్న సౌరిస్‌గారి చరిత్ర వింటూవుంటే అందులో చలంగారి భగవ

గీతా **translation** విషయంలో నా పేరెక్కడా కన్పించలేదు నాకు. వెంటనే సౌరిస్‌గారి దగ్గరికెళ్ళి పోట్లాడాను. "మరీ యింత అన్యాయమా! అన్ని రోజులు నేనంత సహాయం చేస్తే నా పేరెక్కడా వుదహరించరా మీరు" * అని. సౌరిస్‌గారు ఒకటే నవ్వు. మర్చిపోయారట నన్ను. మర్చిపోతే నే నూరుకుంటాను గనుకనా! "నా నీడవు నువ్వు. ఎవరి నీడ వాళ్ళకు జ్ఞాపకం వుంటుందా?" అన్నారు నవ్వుతూ. "ఇదేం బాగాలేదు. నా సంగతి నేనే రాసుకుంటాను" అన్నాను.

'సరే! రాయి!' అన్నారు.

వుదయాలైతే యింటి ముందు కూచునే వాళ్ళం చలంగారు, నర్తకిగారు, నేనూ భగవద్గీత పుస్తకాలు ముందేసుకుని.

మధ్యాహ్నాలు బావి ప్రక్కన వున్న పెద్ద తురాయిచెట్టు క్రింద కూచునే వాళ్ళం ముగ్గురం. అనువాద విషయంలో ఏదైనా తనకు కలిగిన సందేహాల్ని నివృత్తి చేసుకోవటానికి చలంగారు ఈశ్వరుడిని ఎన్నో ప్రశ్నలు వేసేవారు. అటువంటి సమయాల్లో నన్నూ తనదగ్గర వుండమనేవారు. రాసేప్పుడు ఏదైనా మర్చిపోతే తనకి జ్ఞాపకం చెయ్యాటానికని చలంగారు.

నేను **Hyderabad** వెళ్ళిన తర్వాత చలంగారు చాలా సరదా అయిన వుత్తరాలు రాసేవారు. ఒక్కరోజు నాకు వుత్తరం రాయకుండా ఆలస్యం చెయ్యటానికి వీల్లేదు చలంగారు. వెంటనే ఆయనతో తగాదా పడేదాన్ని. ఒక్కొక్కప్పుడు నా అల్లరిమరీ ఎక్కువైతే చలంగారు "ఒరేయ్! నీకలంలో సిరాకాదురా నువ్వు పోసేది. బ్రహ్మజెముడు

* ఆమె పేరును చలంగారు భగవద్గీతలో పేర్కొనలేదు.
— రామానంద.

పాలు, బ్రాహ్మడి ముక్కు పొడుం, ఆంధ్రాకారం కలిపి పోసి మరీ రాస్తావు" అని రాసేవారు. అంత ఘాటుగా వుండేవి నా వుత్తరాలు.

అప్పటి నుండి సం॥రానికి దాదాపు రెండు మూడు సార్లు వచ్చేదాన్ని అరుణాచలం.

ఒకసారి నేను వచ్చినప్పుడు చలంగారు నాతో తనకు టాగూరు గారి **Gardener translate** చెయ్యాలని వుందని, నేనుండి తనకు సహాయం చేసేలా అయితే తను ఆ పని ప్రారంభిస్తానని. పెళ్ళిముందు షౌని **Permission** అడుగుదామని అన్నారు. సరేనని యిద్దరం వెళ్ళి సౌరిస్‌గారిని అడిగాం. అప్పట్లో చలంగారికి కాస్త **mental strain** ఎక్కువైతే **B.P. raise**అయ్యేది. అందువల్లసౌరిస్‌గారు **B.P.** ఎక్కువ కాకుండా రోజురోజూ కాస్త అనువాదం చెయ్యమన్నారు,

పది రోజులు పనిచేసే సరికి చలంగారికి **high blood pressure** వచ్చింది. దానితో మధ్యలోనే అనువాదం ఆపేశారు. నేను **Hyderabad** వెళ్ళిపోయినా వుత్తరాల ద్వారా ఛలంగారిని ఒకటే బలవంతం చేసేదాన్ని అనువాదం పూర్తి చెయ్యమని. "**snails** నడకతో సాగుతున్నాడు వనమాలి" అని రాసేవారాయన. చివరికెలాగైతేనేం? అనువాదం పూర్తయింది.

సం॥రాలు గడిచే కొద్దీ చలంగారు **silent** అయి పోయారు. మునుపటిలా ఎక్కువగా మాట్లాడటం మానేశారు. వుత్తరాలు రాయటం కూడా తగ్గిపోయింది కంటి చూపువల్ల. దానితో నాకు చాలా నిరుత్సాహం కల్గింది, మా యిద్దరి పోట్లాటలూ, అవీ తగ్గి పోవటంతో. అయినా కోపాలూ, తగాదాలూ, అవీ లేకపోతే ఏం సరదాగా వుంటుంది? అందుకని సౌరీస్ గారితో పోట్లాడటం మొదలు పెట్టాను. లేని కారణాలు కల్పించుకుని తగాదాలాడే నన్ను చూసి సౌరీస్‌గారు నవ్వుతూ వుంటారు.

సౌరీస్ గారంటే విపరీతమైన ప్రేమ నాకు. ఆ ప్రేమకు హద్దూ పద్దూ లేదు. అంతులేని ఆ ప్రేమ ఒక్కొక్కసారి నన్ను చాలా torture చేస్తుంది. ఒసారి సౌరీస్ గారినే అడిగాను. "అవధీ, అంతూలేని యీ ప్రేమకు ముగిం పేమిటో?" అని. సౌరీస్‌గారు చిరునవ్వుతో "అవధీ అంతూలేని ప్రేమకు అవధీ అంతూలేని ప్రేమే ముగింపు" అన్నారు. అయినా నా హృదయం శాంతించ లేదు. అంత గొప్పగా ప్రేమించే నా ప్రేమను ఆవిడ గుర్తించటం లేదని, ఏదో తెలియని ఆవేదన, ఆందోళన నాలో. "నా ప్రేమంతా one way traffic లాగా వుంది. ఈ గురువు గారేం పలకరు, వులకరు" అని పోట్లాడ్తూ వుంటాను ఎప్పుడూ.

తన చరిత్రలో తనమీద నాకున్న ప్రేమ గురించి సౌరీస్‌గారేం రాయించలేదని నేను అడిగితే "ఆహా! సత్యవతికి నామీద యింత ప్రేమ అని చెప్పుకోనా? నీవే నీ ప్రేమ గురించి సూర్యనారాయణగారికి రాసివ్వు" అన్నారు.

వూరికే పైకి అలా పోట్లాడతాను గాని సౌరీస్‌గారికి నా మీదున్న ప్రేమ నాకు తెలియకనా? కాని అది పైకి ఒప్పుకోను నేను. ఆమె మీది నా ప్రేమ గురించి తెల్పటానికి ఏ పదాలు వుపయోగించను? ఏ వర్ణనలు ప్రయోగించను? నా అణువు అణువులో, నా నర నరంలో ప్రవహించే ఆమె మీది ప్రేమకు ఏ రూపం కల్పించగలను నేను?

అయినా మాటల్లో పడితే ప్రేమ పేలవ మైపోదూ? అది నా హృదయానికి తెలుసు, సౌరీస్‌గారికి తెలుసు: అంతే!

## 25

మేరికపూడి కనకమ్మగారు రాయిడి నాగేశ్వరరావుగారికి అత్యంత ఆప్తురాలు. ఆమె కుమార్తె చనిపోయి అలవిమాలిన దుఃఖంలో

వుంటే అరుణాచలం సౌరీస్ ఈశ్వరసాన్నిధ్యానికి వెళ్ళు నీ దుఃఖం పోతుందని చెప్పి నాగేశ్వరరావుగారు ఆమెని రమణస్థాన్‌కి పంపించారు. ఆమె తమ కుమార్తె ఫోటోతో సహా ఇక్కడికి వొచ్చారు. డాలీ కనకమ్మగారి అమ్మాయిలాగే వుంటుందని నాగేశ్వరరావుగారు చెప్పారట. అందువల్ల ఆమె డాలీని చూస్తే తమ దుఃఖం తగ్గుతుందన్న ఆశతో వొచ్చారు, ఆ క్రితంరోజే డాలీ పెళ్ళి చేసుకోవడానికి వెళ్ళిపోయింది. ఆమె తమ కుమార్తె ఎంత దారుణంగా చనిపోయిందో షౌకి చెప్పుకున్నారు. ఆమెని ఎవరు ఓదార్చ గలరు? ఆ దుఃఖాన్ని ఎవరార్చ గలరు? ఇంకొక రయితే బిగ్గరగా ఏడుస్తూనే వుండేవారు. కానీ ఆమె చాలా గుండెనిబ్బరం కల మనిషి.

ఇంతట్లో ఎమ్. ఆర్. నాగేశ్వరరావుగారు తాము రాసిన * రామయోగి పిచ్చమ్మగారి జీవితచరిత్ర పోష్టులో పంపించారు. మామ్మగారు, సత్యవతి అప్పుడు ఇక్కడే వున్నారు. వారిద్దరూ పిచ్చమ్మగారి చరిత్రని తమకి చదివి వినిపించమని షౌని అడిగారు. షౌ ఆ పుస్తకాన్ని చదవ నారంభించారు. ఆ పుస్తకం షౌ చదవడం పూర్తయిన క్షణం నించి చేత్తో తీసేసినట్లు కనకమ్మగారి దుఃఖం అంతా మాయమై పోయింది.

కనకమ్మగారు వ్యవహార కర్త. ఆమే లేందే వ్యవసాయం, మిగిలిన పనులు జరుగవు. అందుచేత ఎప్పుడు వీలుపడితే అప్పుడు అరుణాచలం వొస్తారు. సౌరీస్ జీవితచరిత్ర మొదటి భాగాన్ని కనకమ్మ గారే అచ్చు వేయించారు.

* ఆమె గొప్ప యోగిని. సౌరీస్ మహాజ్ఞాని అవుతుందని పిచ్చమ్మ గారే సౌరిస్ బాల్యంలో తొలిసారిగా చెప్పారు.

జయంతికి ముందు రావుగారు వుత్తరం రాశారు. "జయంతికి నేను వసుంధర వొస్తున్నాం" అని. డాక్టరు రావుగారు రెండవ ప్రపంచ యుద్ధంలో army లో వుండే రోజులలో చలంగారికి వుత్తరాలు రాసే వారు. ఆయన చలంగారికి చాలా గట్టి admirer. చలంగారు బెజ వాడలో వుండే రోజులలోనే ఆయన తమ భార్యతో, రుక్మిణి అనే cousin తో కలిసి చలంగారిని చూడడానికి వొచ్చారు. రుక్మిణి, సరోజినీ వాళ్ళ కుటుంబమంతా చలంగారి కుటుంబానికి చాలా దగ్గరి స్నేహితులు. వారి కజినే రావుగారు.

కొన్నేళ్ళ తరువాత ఒకరింట్లో దసరా బొమ్మల కొలువుకి షా వాళ్ళందర్నీ పేరంటానికి పిలిచారు. ఆ పేరంటానికి వొయ్యి, చే, షా కలిసి వెళ్ళారు. ఆ పేరంటంలో ఒక అందమైన, ఎంతో charming గా వున్న అమ్మాయి కూచుని వుంది. ఆమె షా వాళ్ళవైపే నవ్వుతూ చూస్తోంది. వొయ్యి ఆమె దగ్గరకి వెళ్ళి "ఎవరమ్మా నువ్వు. నిన్ను చూస్తే మాకు చిరపరిచితురాలివిగా కనిపిస్తున్నావు?" అని అడిగారు ఆమెని.

"మీ మేనల్లుడి భార్యని నేను. నా పేరు కుసుమ" అని చెప్పారు - ఆమె.

మరుసటిరోజు కుసుమ తమ పసిపాపని ఎత్తుకుని చలంగారింటికి వొచ్చారు. వొయ్యి బిజీగా వుండటంవల్ల కుసుమని మేడమీదికి తీసుకు వెళ్ళమని షాకి అప్పజెప్పారు. అప్పట్లో షా మాట్లాడడం చాలా తక్కువ. ఆ మాట ఇప్పు డెవరూ నమ్మరు.

ఎవరన్నా వారంతట వారు మాట్లాడ వలసిందే గాని షా తాముగా కల్పించుకుని మాటలాడేవారు కారు. కుసుమ "మీనుందర్

చదివాను. నే నెంతో ఇష్టపడ్డాను. చాలా బావుంది" అన్నారు షౌతో. అలాగే కాసేపు కూచుని వెళ్ళిపోయా రామె.

1955 నించి ప్రసాద్ అనే అబ్బాయి చలంగారికి వుత్తరాలు రాయడం ఆరంభించారు. తమని తాము చలంగారికి పరిచయం చేసుకుంటో— "మా అమ్మ, పిన్ని అందరూ మీ admirers" అని రాశా రాయన. తరువాత తరువాత ప్రసాద్ ఇక్కడికి వొస్తూ వుండేవారు. ఆ ప్రసాద్‌కి మేనమామే రావుగారు.

రావుగారు, వసుంధర జయంతికి వొచ్చారు. వారితోబాటు జవహర్, సరోజ వొచ్చారు. ఆ జయంతికి సంగీతరావుగారు వొచ్చారు. సంగీతం గురించి షౌ, ఆయన చాలావిషయాలు మాట్లాడు కున్నారు. ఆ జయంతి ఎంతో వైభవంగా జరిగింది. రావుగారు "మనం బంధువుల మట. దగ్గర బంధువులమా, దూరం బంధువులమా ఎట్లాగ మనం బంధువుల మయ్యాం?" అని అడిగారు షౌని.

అప్పుడు షౌ "దూరమే కానీ ఎంత దూరమో కూడా నాకు తెలియదు. మీరు నాకు అన్న వరస అవుతారు" అన్నారు షౌ రావుగారితో. అప్పుడు రావుగారు, కుసుమ యాక్సిడెంట్‌లో చనిపోయారని చెప్పారు.

జయంతి మరుసటిరోజు నర్తకి షౌ దగ్గరకి వొచ్చి "వసుంధర, రావుగారు ఇక్కడ పెళ్ళిచేసుకుంటారట" అంది.

"ఆయన భార్య బాధపడతారు. ఇలాంటివి నా సమక్షంలో జరగడం నా కిష్టంలేదు. గుళ్ళో పెళ్ళి చేసుకోమను కావాల్సివస్తే" అన్నారు షౌ.

ఆ సంగతి నర్తకి వారికి చెప్పింది. వాళ్ళు గంగాధరాన్ని పిలిచి మాట్లాడు కున్నారు. ఇంక ఆ పెళ్ళి వ్యవహారంతో షౌకి ఏ సంబంధమూ లేదు. వారు ఏమనుకున్నారో గాని తెల్లవారకట్లనే బ్రాహ్మడిని

పిలిచి జయంతికి వేసిన పందిట్లోనే పెళ్ళి చేసుకుంటున్నారు. ఆ పెళ్ళి మామ్మగారి ఆధిపత్యంలో జరిగింది. తెల్లారి పందుంపుల్లతో పళ్ల తోముకుంటుంటే మిశ్రీ ఏడుపు వినిపించింది షాకి. మిశ్రీని సముదాయించాలని వరండాలోకి వొచ్చి, అక్కడే వున్న మిశ్రీని ఎత్తుకున్నారు షా. ఈలోగా రావుగారు, వసుంధర వివాహాలంకారంతో వొచ్చి షా పాదాలకి ప్రణమిల్లారు.

ఆ రోజే నర్తకి రావుగారిని మెర్‌స్టన్‌ని పరీక్ష చేయించడానికి తీసుకు వెళ్ళింది. రావుగారి **medical examination** ముగిశాక, మెర్‌స్టన్ "ఆయనకి ఫీజ్ ఇవ్వాలా?" అని అడిగారు. "ఆమెకి తోచింది ఇమ్మ" న్నారు రావుగారు. ఆమె 50 రూ॥ ఫీజ్‌గా ఇచ్చింది. ఆ డబ్బుతోనే రావుగారు రమణస్థానీయులకి పెళ్ళివిందు చేశారు. తరువాత రావుగారు ఇక్కడ నాలుగురోజు లుండి, ఫోటోలు తీసుకుని వసుంధరతో కలిసి వెళ్ళిపోయారు.

రమణస్థానీయులలో ఈశ్వరుడిమీద కోపతాపాలు విరోధాలు అధిక మైనాయి. ముఖ్యంగా నర్తకిలో ఈశ్వరుడిపట్ల విరోధం మరీ ఎక్కువైంది. రమణస్థానీయులు ఎవరూ తమలో ఎంతవిరోధం తలెత్తినా, తమకి ఎంత కోపం వొచ్చినాగానీ ఈశ్వరుడ్ని మాత్రం వొదిలేవారు కారు. తాము వింటామని అంటేనే షాద్వారా వారిని ఆదేశించి నడిపిస్తున్నారు ఈశ్వరుడు. జీవిత మంతా దేనిలోనూ **involve** కాని సౌరిస్- ఈశ్వరుడు తమకి వారిని నడుపమని అప్పగించారు కనుక కల్పించుకుని ఈశ్వర నిర్దేశానుసారం వారిని నడుపు తున్నారు. నర్తకి ఈ విధంగా విరోధిస్తే మళ్ళీ ఆమెకి పెద్ద జబ్బు చేస్తుం దని షాకి తెలిసింది. అంచాత తమ లోపలనించి ఏ నిమిషాన ఏమాట వొస్తుందోనని సౌరిస్ వీలున్నంతసేపూ తమ గదిలోనే వుండేవారు.

కానీ నర్తకి తనంత తాను ఆమె దగ్గరకి వొచ్చేది. ఈశ్వరాదేశం గనక షౌ వారిని నడుపు తున్నారు. ఈశ్వరుడు వారిని ఎన్నెన్ని విపత్తుల నించీ, ప్రమాదాల నించీ రక్షించారో! వారంతా ఈశ్వరుడితో విరోధించే వారేగానీ తమలో తాము ఎక్కడాలేని స్నేహభావంతో మెలిగేవారు. తను వారిని వొదిలేస్తే, ఇక వారిలో ఒకరి కొకరికి పడక పోవడంకూడా జరుగుతుందని షౌకి తెలిసింది. నిజానికి షౌ వ్యక్తిత్వం ప్రళయం నాటికే పూర్తిగా చెరిగి పోయింది. నడిపేందుకు, నడిపించేందుకు అక్కడ షౌ లేదు. షౌగా కించి ద్వ్యక్తిత్వంతో వున్నప్పు డామెకి ఈశ్వరుడు వప్పగించిన బాధ్యత మాత్రం మిగిలింది. రమణస్థానీయులలో ముఖ్యం నర్తకి ఈశ్వరుడితో విరోధించి ఒక **Dead end**కి రావడం, జబ్బుపడటం మళ్ళీ విశ్వాసం పెంచుకు నడవడం, విరోధించడం, ఇదంతా పదేపదే జరుగు తోంది. షౌకి వారిని నడపడం అసాధ్యమై పోయింది. అప్పుడు ఈశ్వరుడు అంతా తాము చూసుకుంటామని వారిని వొదిలివెయ్య మన్నారు, షౌ వొదిలారు కాని ఈశ్వరుడే వాళ్ళని ఇదివరకటికన్నా గట్టిగా పట్టుకున్నారు. ఆయన వారిని ఇదివరకటికన్నా బలంగా నడుపు తున్నారు. ఆయన వారిని వొదిలి వెయ్యమనగనే అర్థమైంది షౌకి- ఇక ఎవరూ వారిని ప్రత్యేకంగా నడపాల్సిన అవసరం లేదనీ. తనలోని ఈశ్వరశక్తి వారిని నడిపిస్తుందని.

ఆ తరువాతకూడా రమణస్థానీయులు ఆమెకి మునుపటిలాగే అన్నీ చెబుతున్నారు. అంతా మునుపటిలాగే నడుస్తోంది. కానీ ఆపట్టు పోయింది. షౌకి స్వేచ్ఛ, వారికి స్వేచ్ఛ. షౌ కాలంలో అధిక భాగం సంగీత సాధన ఆక్రమించింది. ఆమె జీవిత క్రమంలో ఈశ్వరుడు కాలనియమాన్ని పూర్తిగా సడలించారు. ఆమె **time** ఆమెదే.

మామ్మగారు జిన్నూరు వెళ్ళినప్పుడు అక్కడ జరిగిన సంగతి షౌకి చెప్పారు. తాము జిన్నూరు వెళ్ళేసరికి రాజుగారి కుటుంబీకులు

డాలీ తమజాతి అమ్మాయికాదని అభ్యంతరం చెప్పారట. అప్పుడు మామ్మగారు "ఆ రమణస్థాన్ ఎంతో గొప్పది. మీరు అక్కడి అమ్మాయిని అభ్యంతర పెట్టకండి" అని చెప్పారట వాళ్ళకి. అప్పుడు వాళ్ళు డాలీని స్వీకరించారట.

వెళ్ళే ముందర డాలీని షా అడిగారు- "డాలీ నువ్వీ జీవితంలోకి ఇష్టపడి అడుగు పెడుతున్నావు. రేపు ఏకష్టం సుఖం వొచ్చినా నీ కాళ్ళమీద నువ్వే నిలబడాలి సరేనా?" అని. డాలీ ఆమాటకి సిద్ధపడే వెళ్ళింది. ఆనాటి నించి ఈ నిమిషం దాకా అట్లాగే ధైర్యంగా నిలబడింది.

ఒకసారి మామ్మగారు జిన్నూరునించి వొచ్చి చెప్పారు. డాలీ కడుపుతోందని, మొదటి కాన్పుగనక భయపడుతోందని.

అప్పుడు షా డాలీకి వుత్తరం రాయించారు. "డాలీ నీకు భయంగా వుంటే కాన్పుకి ఇక్కడికిరా" అని.

నడక వొచ్చిన పిల్లని తల్లి ఎత్తుకుని కూచుంటుందా? నడక వొచ్చాక వొదుల్తుంది నడవడానికి. కానీ పడేటప్పుడు మాత్రం చూస్తూ వూరుకోదు. రక్షిస్తుందికదా! ఈశ్వరుడూ అంతే. లోకంలోకి పంపించినా అవసరమైనప్పుడు రక్షణ జరుగుతూనే వుంటుంది. బాధ్యత వుండదు గానీ ప్రేమ వుంటుంది. అదే డాలీ విషయంలో జరిగింది. అప్పట్లోనే, సత్యవతికూడా కడుపుతో వున్నట్లు వుత్తరం వొచ్చింది.

అన్నయ్యకి మోటార్ సైకిల్ యాక్సిడెంట్ జరిగిందని టెలిగ్రాం వొచ్చింది. నర్తకి అన్నయ్యని చూడటానికి వెళ్ళింది. అప్పుడు బెజవాడ వెళ్ళి శాస్త్రిగార్ని చూసింది. శాస్త్రిగారు నర్తకిని ఎంతో ఆప్యాయంగా పలకరించి తమ ఆరోగ్యం సరిగా లేదని, తాము మద్రాసు విడిచిపెట్టాక మళ్ళీ మద్రాసువైపు ఎన్నడూ రాలేదని,

వొచ్చి నట్లయితే తిరువన్నామలై తప్పక వొచ్చేవాడి నని, తాము రావటల్లేదన్న మాటేగాని తమ ఆత్మ నిరంతరమూ రమణస్థానంలో తిరుగుతూనే వుంటుందని, చలంగారు ఇంట్లో ఫలాని మార్పులు చేశారు కదూ అని- అన్నీ వివరంగా నర్తకికి చెప్పారట. అవన్నీ కూడా నిజమే ఆ రోజుల్లో షా తమ గదిలో ఆయన presence ని ఫీల్ అయ్యేవారు. ఆ తరువాత కొద్ది రోజులకే శాస్త్రిగారు పరమపదించారు.

సౌరిస్‌లోంచి పలికే ఈశ్వరశక్తికి తమని సమర్పించుకుని చివరి వరకూ తమ పట్టును నిలుపుకున్న వారిలో శాస్త్రిగారు నిస్సందేహంగా ఒకరు. ఈశ్వరుడు "శాస్త్రిగారు నా agent" అని పేర్కొన్నారంటే శాస్త్రిగారిపట్ల ఈశ్వరానుగ్రహం ఎంతగా ప్రసరించిందో వివరించాల్సిన పని లేదు.

శాస్త్రిగారికి చలం రాసిన లేఖలు ఈశ్వర విలాసాన్ని చలం అన్ని రచనలకన్నా అధికంగా చాటుతాయి. అందువల్లనే శాస్త్రిగార్ని నడిపిన ఈశ్వరకాంతిని చాటే ఆలేఖల్ని ఈ రచనలో ధారాళంగా వినియోగించుకోవడం జరిగింది.

ఆ ట్రిప్‌లోనే నర్తకి తెనాలి వెళ్ళి అన్నయ్యని చూసి, కూచిభొట్ల సూర్యనారాయణగారిని చూడటానికి వెళ్ళింది. ఆయన "మావాడి వల్ల నేను ఇక్కడ కట్టుబడిపోయాను. నే నెక్కడికీ వెళ్ళడం లేదు. కదిల్తే చలంగారి దగ్గరకు రానా" అన్నారట నర్తకితో. ఆయన తమ పాటలనుకూడా పాడుకోవటల్లేదట పాపం!

రామానంద 1969 నించి 71వ సంవత్సరం వరకూ సూర్యనారాయణగారితో ఎన్నో సాయంకాలాలు చలం- సౌరిస్‌ల గురించి వింటూ గడిపాడు. సంజచీకటులు ముసురుకొంటూ వుంటే దిగులుగా రామానందతో "జీవితం నన్ను పూడ్చి పెట్టకపోతే అరుణాచలాన్ని భగ

వాన్ సమాధిని వొదిలి పెట్టే వాడిని కాదు బాబూ" అనేవారు తరచు సూర్యనారాయణగారు.

డాలీ కడుపు తోందని తెలిసి తన స్నేహితులతో కలిసి 'చే' - మేజోళ్ళు, కోట్లు పూలుతో అల్లి, నేప్‌కిన్స్, ఫ్రాకులు ఎన్నో కుట్టి వాటన్నిటిని కలిపి ఓ పెట్టెడు సామాను పుట్టబోయే బుల్లిబుజ్జాయి కోసమై పంపించారు, ఆ పార్సిల్ అందే సమయానికి డాలీ అత్తవారింట్లోనే వుంది.

చే ఈ విధంగా వాళ్ళ బాబుకి presentation పార్సిల్ పంపిందనీ, దాన్ని మీకు పంపమా అని డాలీకి నర్తకి పుత్తరం రాసింది. "మా కవన్నీ అవసరం లేదు" అని వాళ్ళు జవాబు రాశారు.

చిత్ర. పకపక ఆ బట్టలు చూచి ఎంతో మురిసి పోయి "ఈ బట్టల కోసమన్నా మాకో పాపాయిని కనాలని వుంది" అన్నారు. ఇంక ఆ బట్టలన్నీ తమకి తెలిసిన వారిలో ఎవరు ముందుగా ప్రసవిస్తే వారికి పంపెయ్యాలని అనుకున్నారు రమణస్త్రానీయులు.

డాలీ పురిటికి వొచ్చింది ఇంక ఆపొట్టలో పిల్ల సరైన position లో లేదని తెలుస్తోంది. డాలీ భయపడటమూ దానివల్లనే. అప్పట్లో బోస్ కాంపౌండ్‌లో అరుణ అనే నర్సు వుండేది. నర్తకి ఆమెని పిలిపించి డాలీని examine చేయమంది. ఆమె డాలీని పరీక్షచేసి "పిల్ల సరైన positionలో లేదు. తలపైకి కాళ్ళు కిందికి వున్నాయి (Breech presentation ) ఈకాన్పు నేనే చేస్తాను," అన్నారామె. ఆవిడ చాలా అనుభవశాలినియైన నర్సు. అందువలన కాన్పుకి ఇంట్లోనే అన్ని ఏర్పాట్లూ చేయించారు షా.

డాలీకి సీమంతం చేశారు. షాయే స్వయంగా జాజిపూలతో పూలజడ వేశారు. రాజుగారు అరుణాచలం వొచ్చి హోటల్లో దిగారు.

డాలీ రోజూ హోటలుకి వెళ్ళి తిరిగి ఇంటికి వొచ్చేసేది. ఒక రోజు డాలీ రాజుగారితో కలిసి సినిమాకి వెళ్ళింది. అక్కడే నొప్పులు వొచ్చాయి డాలీకి. రాజుగారు డాలీని నర్సింగ్‌హోమ్‌లో దింపేసి చలం గారికి కబురు పెట్టారు. అది మామూలు ప్రసవం కాదు, **Breech presentation.** ఏమాత్రమూ ఆపరేషన్‌కి ఒప్పుకోవద్దని చెప్పి చిత్రని ఆస్పత్రికి పంపించారు షౌ. నర్తకి కూడా అదు పట్టలేక ఆస్పత్రికి వెళ్ళిపోయింది. చిత్ర డాలీని కన్నదే కాని, న కే డాలీని పెంచింది. అందువల్లనే చిత్ర పిల్ల లందరిలోనూ డా అంటే నర్తకికి ఎక్కువ ప్రేమ.

ఆ రోజు షౌయే వంటచేశారు. మిగిలినవారు ఆమెకి కావాల్సిన వస్తువు లందించారు. ఆమె **bath room** లోకి వెళ్ళినప్పుడు ఆమెకి ఒక వెలుగు కనిపించింది. సరిగ్గా ఆమె బైటికి వొచ్చేసరికి డాలీకి పిల్లవాడు పుట్టాడన్న కబురు తెలిసింది. "రాత్రి అయ్యేటప్పటికి పిల్లవాడు ప్రమాదస్థితిలో వున్నాడట మేం చూసి వొస్తాం షౌ" అన్నారు నర్తకి, చిత్ర. "వెంటనే వచ్చెయ్యాలి" అన్నారు షౌ. వాళ్ళు వెళ్ళి పిల్లవాడ్ని చూసి వొచ్చేశారు. అయిదారు రోజులైనాక డాలీ ఇంటికి వొచ్చేసింది. ఆ పుట్టిన చిరంజీవే బాబి. నెలరోజు లున్నాక డాలీ అత్తవారింటికి వెళ్ళిపోయింది.

ఇంతట్లో సత్యవతి ఆడపిల్లని కన్నదని వుత్తరం వొచ్చింది. ఏహో కొన్ని చిన్న చిన్న చొక్కాలు నర్తకి బీదవాళ్ళకి ఇచ్చేసిం తరువాత చే పంపిన పార్శిల్ పార్శిలే సత్యవతికి పంపేశారు. సత్యవతికి పట్టలేని ఆశ్చర్యం. పార్శిల్ నిండా పిల్లకి కావాల్సిన బట్టలు. ఆ పాప పేరు వసుధ. వసుధ మంచి బరువు 9 న్నర పౌన్లున్న దట. కానీ చే పంపిన బట్టలన్నీ ఆపిల్లకి సరిగ్గా సరిపోయాయట. "ఏమిటీ **gift**.

ఎంత బావుందో! నాకు ఏం చేయాలో తోచటల్లేదు"- అని రాశారు సత్యవతి షాకి.

డాలీ కొడుక్కి- చలంగారు రాజరాజనరేంద్రుడని పేరుపెట్టారు. డాలీ, రాజుగారు ఆ పేరే వుంచేశారు. సత్యవతి కూతురికి చలంగారే వసుధ అని పేరు పెట్టారు.

చంద్రరావుకి సాహిత్యంతో చాలా వరకూ పరిచయం వుంది. ఆయన కథలుకూడా రాస్తూ వుంటారు. చలం కథలు చదివి, చలం గార్ని చూడటానికని వొచ్చి ఈశ్వరుడి గాలానికి చిక్కుకున్నారు. ఆయన బాడ్మెంటెన్ ప్లేయర్. ఖరగ్‌పూర్‌లో వుంటారు. ఆయన ఎప్పుడు రమణస్థాన్‌కి వురుకుదామా అనే తహతహలో వుంటారు. వాళ్ళకి శలవలు దొరక్కవు, శలవు దొరికే లోపల రమణస్థాన్ గురించి కలలు కంట్ూ వుత్తరాల్లు రాస్తూవుంటారు. "చలం సాహిత్యసుమాలు" అన్న పేరిట చలం సాహిత్యంలో వున్న **quotations** అన్నీ చాలా శ్రమతో సేకరించి— చలంగారికి పంపించారు. అది నిజంగా ఆయన చేసిన, ఇతరులక్కు తోచని గొప్ప కృషి. ఆ పుస్తకాన్ని శ్రీ రమణ స్థాన్-ప్రచురణ సంస్థవారు ప్రచురించారు.

రెడ్డిగారు చంద్రరావుగారితో కలిసి వొచ్చారు. ఆయన ఇక్కడికి రావడం వలన ఎన్నో వ్యసనాలు ఆయనలోంచి తొలిగి పోయాయి. ఇంక ఆయనకి భగవాన్ మీద అచంచల విశ్వాసం. ఆయనా ఖరగ్‌పూర్ వాస్తవ్యులే. రెడ్డిగారికి, చంద్రరావుగారికి ఏ విధంగా రమణ స్థాన్‌కి వుపయోగపడదామా అని యోచన. రెడ్డిగారి అరుణాచల సందర్శనానుభవాల్ని వారి మాటల్లోనే విందాం.

"చంద్రరావుగారి వల్ల చలంగారిగురించి ఎంతగానో విన్నాను. చాలాసార్లు వారి దర్శనానికి తహతహ లాడాను. నేను చాలా దుర్వ్యస

నాలకి లొంగిపోయిన వ్యక్తిని. చలంగారి దగ్గరికి రాగానే నాకు సౌరిస్ గారితో మాట్లాడే అవకాశం కలిగింది. ఆమె ముందు ఏం మాట్లాడ గలను? కానీ ఆమె దర్శనం వలన నాలో ఏదో తెలియని మార్పు వొచ్చింది. నాకు పట్టిన దుర్వ్యసనాలన్నీ ఒకదాని వెంట ఒకటి అవం తటవే తొలగి పోయాయి. అవి ఒకటొకటే తొలగిపోతూ వుండగానే అరుణాచలమన్నా, సౌరిస్‌గారన్నా, చలంగారన్నా నాకు ప్రేమ, భక్తి పెరగ సాగాయి. నాలో ఎన్నడూ ఎవరూ వూహించని ఈ మార్పు సౌరిస్‌గారి వల్లనే కలిగిందని తెలిసిన నా భార్యా పిల్లలుకూడా అరుణా చలం వొస్తామని, వొచ్చి సౌరిస్‌గారి దర్శనం చేసుకున్నారు. అప్పటి నించి తరచు వొచ్చిపోతూనే వున్నాం.

రైల్వేలో పనిచేస్తూ వుండడంవల్ల ఎప్పుడు వీలుపడితే అప్పుడు అరుణాచలం వొస్తాను. సౌరిస్‌గారి లాగ, చలంగారి లాగ ఏమి ఆశించ కుండా, ఎవరూ అన్న ప్రశ్న లేకండా ఎదుటివారిమీద గొప్పప్రేమని వర్షించేవారిని నేను జీవితంలో చూడలేదు.

రాముని స్పర్శతో రాతిలో కదలిక వొచ్చినట్లు, నా జీవితం లోనూ సౌరిస్‌గారి దయవల్ల ఏ వెలుగులకో తలుపులు తెరుచుకుంటా యన్నదే నా ఆశ, విశ్వాసం. పూజాపీఠంలో నిలుపుకోవాల్సిన వారి గురించి ఇంతకంటే ఎక్కువగా చెప్పడం నా దృష్టిలో అపరాధం."

పిన్ని తొలిసారిగా ఇక్కడికి వొచ్చింది. తాను ఇక్కడే వుండి పోతానని, నెలకి కొంత డబ్బు ఇస్తానని అంది. "ఇక్కడ ఈశ్వరు డికి అర్పించుకుని వుండ వల్సిందే కానీ డబ్బుకట్టి వుండడం పడద"ని షా అన్నారు. పిన్ని వెళ్ళిపోయింది.

పిన్ని ఇప్పుడు మళ్ళీ తిరిగి వొచ్చింది—ఇక్కడే వేరే ఇల్లు కట్టుకుని చలంగారికి దగ్గరగా వుండాలని ఆమె వూహ. షా, చలం

గారు, పిన్ని, కురంగేశ్వర్, కృష్ణారావు షికార్లలో ఒక్కొక్క భూమినే వెదికే వారు, ఆమె ఇల్లు కట్టుకోవడానికి ఎక్కడ బావుంటుందా అని. చివరికి రమణస్థాన్ వెనకాల భూమిని ఏరుకుని — "ఇక్కడ ఇల్లు కట్టుకుంటే చాలా బావుంటుందండీ వెంకటచలంగారు మీరు నాకు దగ్గరగా వుంటారు" అంది పిన్ని.

అప్పుడు చలంగారు "నిజమే పిన్నీ ఇక్కడ ఇల్లు కట్టుకుంటే చాలా బావుంటుంది. నువ్వు ఓ కేక పెడితే మాకు వినిపిస్తుంది.అక్కడున్న గట్టుమీద కూచుని నువ్వు ఎంకిపాటలు పాడితే మాకు వినిపిస్తాయి" అన్నారు.

ఆ భూమి మధ్యలో ఒక సమాధి వుంది. "నా కిక్కడ ఒంటరిగా వుంటుం దేమో, చీకట్లో భయం వేస్తుందేమో" అంది పిన్ని.

"ఏం ఫరవాలేదు పిన్నీ ! ఆ సమాధిలో వా డున్నాడుగా. నువ్వెప్పుడన్నా భయంతో కేకలేస్తే 'నే నున్నానుగా' అని వాడు సమాధానం ఇస్తాడు పిన్నీ !" అన్నారు చలంగారు.

"అమ్మ బాబోయ్" అని కేక పెట్టింది పిన్ని.

ఆ సమయానికే ఒక ముసలాయన ముసుగు వేసుకుని ఆ వేపు నించి వెడు తున్నాడు. చలంగా రతన్ని పిన్నికి చూపించి "చూడు పిన్నీ వాడే వాడే ఆ సమాధిలో వుండేది. జాగ్రత్తగా చూడు. అప్పుడప్పుడు బైటికి వొచ్చి కూచుంటాడు" అని అన్నారు. పిన్నికి ఒకటే ఒణుకు పుట్టుకు వొచ్చింది. ఈ విధంగా సరదాగా హాస్యాలు చలంగారు చేయడం ఆవిడకి చాలా ఇష్టం. రాత్రి రమణస్థాన్ బైట వరండాలో బల్లమీద పడుకునేది పిన్ని. అప్పటి కింకా రమణస్థాన్ ప్రాంతాలలో **street lights** లేవు. చుట్టూరా కటిక చీకటి. అప్పుడప్పుడు పిన్నికి భయం వేసేది.

"వెంకటచలంగారూ నాకు భయంగా వుందండీ అబ్బా ఇంత చీక టేమిటి ? అని అనేది పిన్ని.

"నీకేం భయం లేదు పిన్నీ, పడుకో" అని చలంగా రనగానే పడుకునేది.

అప్పట్లో రమణస్థాన్ ప్రాంతం బాగా అడివిలా వుండటం వలన రాత్రంతా రకరకాల పక్షుల కూతలు వినిపించేవి. తెల్లవారగట్ల రమణస్థాన్ పక్కనే వున్న చింతచెట్టు మీదికి ఒకపక్షి వొచ్చేది. దాని అరుపు మనిషి మూలుగులాగ 'వూఁవూఁ' అని వుండేది. ఓరోజు తెల్లవారగట్ల ఆపక్షి అలా అరిచేసరికి-

"వెంకటచలంగారు, ఎవరండీ అట్లా మూలుగు తోంది. మీకు మూలుగు వినబడటం లేదా?" అని అడిగింది పిన్ని.

"నీకేం ఫరవాలేదు పిన్నీ. వాడే ఆసమాధిలో వాడే అక్కడ కూచున్నాడు- నీకు తోడుగా- నువ్వు భయపడుతున్నా వని" అన్నారు చలంగారు.

ఆవిడ భయంతో ఒక్క అరుపు అరిచి పరుపుచుట్ట తీసుకుని ఇంట్లోకి వెళ్ళిపోయింది. ఈ సంగతులన్నీ ఉదయం అందరికీ చెప్పు కుని నవ్వేది పిన్ని. నాలుగు రోజు లున్నాక పిన్ని వెళ్ళిపోయింది.

హైదరాబాదులో నాటక కళాసభలు జరుగుతోంటే పిన్ని అక్కడికి వెళ్ళింది. చలంగారు ఆమెకి వుత్తరాలు రాసి ఎడ్రస్ పిన్ని, The famous dancer అని రాసేవారు.

చలంగారు యమునకి, సత్యవతికీ వుత్తరం రాశారు ఆమె ఎడ్రస్ ఇస్తూ. "మాపిన్ని హైదరాబాదు వొచ్చింది. ఆమె చాలా గొప్ప dancer, వెళ్ళి కలుసుకోండి" అని. వాళ్ళు ఆమాట నిజమేనని నమ్మేశారు. సత్యవతి, యమున అంతదూరం ఓపికగా వెతికి ఆమెని చూడ

డానికి వెళ్ళారు. ఆవిడపేరు చెప్పగానే ఆమె బైటికి వొచ్చింది. వాళ్ళు ఆవిడే పిన్నని అనుకోలేదు. ఎవరో గొప్పగా రొమేంటిక్‌గా, ఛార్మింగ్‌గా వున్న **girl of sweet sixteen** వొస్తుందని వాళ్ళు **expect** చేస్తున్నారు. బైటికి వొచ్చిన పిన్నని చూసి "గొప్ప **dancer** (పిన్ని) నాటకకళాసభలకి వొచ్చారట. చలంగారు మమ్మల్ని ఆమెని చూడటానికి పంపించారు" అని చెప్పారు వాళ్ళు.

వెండిజుత్తుతో, కీళ్ళనొప్పులతో బాధపడుతున్న పిన్ని బోసినోటితో "నే నేనమ్మా! ఆ **dancer** ని" అంది. వాళ్ళు నిర్ఘాంతపోయి ఆ మాటని నమ్మలేక ఆమెవైపు చూశారు. "ఆయన అట్లానే రాస్తూ వుంటారు లెండి" అని నవ్విం దామె. అప్పుడు సత్యవతికి, యమునకి చలంగారి **sense of humour** ఎంత గొప్పదో బోధపడి ఆ **incident** ని ఎంతో గొప్పగా **enjoy** చేసి చలంగారికి- 'ప్రఖ్యాతనర్తకి' గురించి మంచి వుత్తరాలు రాశారట.

పిన్ని మళ్ళీ తిరువన్నామలై వొచ్చింది. రమణస్థాన్ వెనక మరీ ఒంటరిగా వుంటుందని పల్లాకుత్తులో స్థలాలు అమ్ముతున్నారని అక్కడ స్థలం కొనాలనుకుంది పిన్ని.

"పల్లాకుతులో వుంటే పాములు ఎక్కువేమో వెంకటచలం గారు" అని అడిగింది పిన్ని.

"వుంటేనేం- నీకు తోడుగా వుంటాయి. ఒంటరిగా వుండలేనంటావు కదా" అన్నారు చలంగారు.

పిన్ని ఇల్లెట్లా వుంటుందో కురంగేశ్వర్ **muse** చేసి బొమ్మలు వేశారు. పిన్నికి "పాముల పుట్టల-" అని పేరుపెట్టా రాయన. ఆయన వేసిన బొమ్మలు అందరికి చూపించుకునేది పిన్ని. పిన్ని ఇంటికి 'వల్మీకం' అని పేరు పెట్టారు కురంగేశ్వర్.

ఒకరోజు పల్లాకుత్తులో పెద్దపెట్టున చెట్లు కొట్టెయ్యడం మొదలు పెట్టారు. అక్కడి పాములన్నీ బోస్‌కాంపౌండ్‌లో ప్రవేశించడం మొదలు పెట్టాయి. బోస్‌కాంపౌండ్‌లో వాళ్ళు ఆ వొచ్చే పాములన్ని టినీ చంపుతున్నారు.

"వెంకటచలంగారూ! ఎన్ని పాములో, పల్లాకుత్తు నించి ఎట్లా వొస్తున్నాయో?" అంది పిన్ని.

"మరేమీ లేదుపిన్నీ! నువ్వింకా రావడంలేదేమా అని చూసి పోవడానికి, నువ్వెప్పుడు వొస్తావో కనుక్కోవడానికి వొచ్చి వుంటాయి" అన్నారు చలంగారు.

పిన్ని ఇల్లు కట్టుకోవడం గురించి ప్రణాళికలు ప్రయత్నాలు చేస్తోంది కానీ ఇంతట్లోకే వాళ్ళవా ళ్ళామెని ఇంటికి పిలిచేశారు.

సుధకి పెళ్ళయింది. (సుధ-షోంకజిన్) ఆయన మెడిసిన్ చదివారు. మెంటాడ అనే పల్లెటూళ్ళో ఆయనని Govt. doctor గా వేశారు. సుధకి ఈశ్వరుడంటే తిరుగులేని విశ్వాసం. ఆ వూరిలోనే ఈశ్వర భక్తులైన వీరేశలింగంగారు టీచర్‌గా పని చేస్తున్నారు. సుధకీ ఆయనకీ స్నేహం కలిసింది.

ముమ్మడమ్మ సుధ దగ్గరకి వెళ్ళింది. సుధా వీరేశలింగం ఈశ్వరవిలాసాన్ని గురించి మాట్లాడుకునే వారు. ముమ్మడమ్మ "షా ఈశ్వరుడంటే నేను నమ్మను. వాళ్ళ సంగతి నాకు తెలియదా? ఎంత అల్లరిమూకో!" అంటూ వుండే దట.

"మీ అభిప్రాయం సరైనది కాదమ్మా! మీ రొకస్సారి అరుణాచలం వెళ్ళి రండి. అప్పుడు మీరిట్లాగ మాట్లాడరు" అని వీరేశలింగంగారు ముమ్మడమ్మని అరుణాచలం వెళ్ళేందుకుగా ప్రోత్సహించారు.

వీరేశలింగంగారి ప్రోద్బలంతోనే ముమ్మడమ్మ అరుణాచలం వొచ్చింది.

"షా నువ్వు నాకు ఈశ్వరుడిగ్గా కాదు, నా మేనకోడలిగానే కని పిస్తున్నావు. నువ్వు మారావు కనక వొచ్చాను" అంది షాతో.

షా నవ్వి వూరు కున్నారు.

షా ముమ్మడమ్మ పాట ఎప్పుడూ వినలేదు. "నాన్న చెబుతాడు నువ్వు చాలా గొప్పగా పాడతా వని. భజనలో పాడు" అని అడిగారు షా, నర్తకి ఆమెని.

"ఎన్నడో పదమూడో ఏట నేర్చిన పాట నాకేం గుర్తు. ఇప్పు డెక్కడ పాడగలను, నాకేం జ్ఞాపకం?" అంది ముమ్మడమ్మ.

"నువ్వేదయినా కృతి పాడు, నే నందిసాను" అన్నారు షా.

ముమ్మడమ్మ గొప్ప పారవశ్యంతో పాడింది. తీగమల్లే మెలికేసి పోయిం దామె పాట. ఎంత భావమో! ఎంత ఆర్ద్రితో! ఎంత మాధు ర్యమో! నర్తకి, షా ముమ్మడమ్మని "నువ్విక్కడే వుండిపో రాదా?" అని అడిగారు.

"నాకేం తోస్తుంది, నేనేం చెయ్యగలను ఇక్కడ" అంది ముమ్మడమ్మ.

"మీరేం చెయ్యాలి? హాయిగా భజనలో పాడుకుంటూ వుం డండి" అంది నర్తకి.

కానీ ఆవిడ వుండ లేదు. పదిరోజులు తరువాత వెళ్ళిపోయింది. అప్పటినించి ఇప్పటిదాకా వొచ్చి పోతూనే వుంది. సుధవంటి ఉత్తము డికి, లోకోపకారికి తల్లి కావడమే ఆమె జీవితానికి పట్టిన సార్థక్యత అనిపిస్తుంది. మనసులోని మాటని దాచుకోలేని నిష్కపటి ముమ్మ డమ్మ. చరిత్ర రాస్తున్న రోజుల్లో వొచ్చి "నా గురించి ఒళ్ళు దగ్గర

పెట్టుకు రాయండి, భద్రం సుమా". అని రామానందని హెచ్చరించి మరీ వెళ్ళింది. ముమ్మడమ్మ ధాటిని చూచే సౌరిస్-

"అత్త పోరు తప్పినా నాకు మేనత్త పోరు తప్పలేదండి" అంటారు తమాషాకి.

"ముమ్మడమ్మ చిన్నప్పుడు ఎంత నాజూకుగా, ఎంత అందంగా వుండేదో! ఆవిడవేపు కళ్ళప్పగించి చూస్తూ వుండేదాన్ని" అంటారు షౌ. ఆ సంగతిని షౌ ఆమెతో ఈమధ్య చెప్పారు. ముమ్మడమ్మ నవ్వుతూ "చాల్చాలు, నా మెల్ల కన్నుతో నేనందమా? ఎవరంటారు నేనందమని?" అంది. నిజానికి ఆమె అందం ముందు షౌకి ఆ మెల్లకన్ను కూడా కనిపించేది కాదట. అప్పట్లో ముమ్మడమ్మ చల్లగాలికి కదిలిపోయే సన్నజాజి తీగకి మల్లే వుండేదట. ముమ్మడమ్మ చిన్నతవంలో చలం ఆమె talents మీద, తెలివితేటలమీద గొప్ప ఆశలు పెట్టుకున్నారు. ఆమెకి ఎంతో encouragement ఇచ్చారు. కాని పరిస్థితులు కలిసి రాలేదు. జీవితమూ, విధి ఆమెని ఎంతో క్రూరంగా పరీక్షించాయి. ఆ సంగతి తలుచుకుంటూ "నా చెల్లెలి జీవితం బూడిదలో పోసిన పన్నీరై పోయింది" అంటారు చలం.

## 26

తాళ్ళప్రొద్దుటూరు నించి శేషయ్యగారు అనే వారు వొచ్చారు. ఆయనకి ఈశ్వరుడిలో విశ్వాసం కుదిరింది. అరుణాచలం తరచు రావడం మొదలు పెట్టారు. ఆయనకి లేక లేక ఒక కూతురు పుట్టింది. ఆ అమ్మాయి పేరే గిరిజ. శేషయ్యగారి అరుణాచల అనుభవాలు వారి మాటల్లోనే విందాం.

"జీవితపు దుర్బలత్వం నన్ను అరుణాచలానికి విసిరి కొట్టింది. ప్రళయం నా కిచ్చిన వరప్రదానమే ఈశ్వరసందర్శనం. అప్పటికీ ఇప్పటికీ నాకు మరపురానివి చలంమహర్షి నాపయి చూపిన ప్రేమాదరాలు. అందరూ చలంమహర్షి రచనలు చదివి వారిని చూడడానికివొస్తే - వారు రాసిన ఈశ్వరుడ్ని చూడాలనే కోరికే నన్ను అరుణాచలానికి రప్పించింది.

ఆవేళ సౌరిస్ తల్లిని తొలిసారిగా చూడటం ఈ క్షణాన జరిగినంత తాజాగా నాకు జ్ఞాపకం వుంది. ఆమెని చూస్తోంటే ఎక్కడో లోకాల్ని వెలిగించే వెలుగు కన్నుల ఎదుట మనిషిరూపంలో నిలబడినట్లుగా అనిపించింది. ఆమె కన్నులలో కోటి తటిల్లతల కాంతులు, ముఖంలో విభూతిరేఖలు అరుణాచల శిఖరాన కమ్మే మేఘాలుగా, భ్రూచక్రంలో కుంకుమ అరుణాచల శిఖరోపరిభాగాన ఆకాశమధ్యాన వెలుగు లీనుతున్న మార్తాండబింబంగా, ఆమె పలుకులు పవిత్ర గంగానదీ శీకరాలుగా నాకు గోచరించాయి.

ఆనాడు నాలో ఆమె సమక్షంలో జరిగిన ప్రాసెస్‌ని ఏమనాలో తెలియదు గానీ— నా కింకా బాగా జ్ఞాపకం ఆ అనుభవం. నా లోపలంతా ఏదో నిద్రలాగ అయిపోయింది. ఇంతట్లో 'లే నాన్నా' అని పిలుస్తూ చల్లనితల్లి ఎవరో నన్ను నిద్రలేపి- కళ్ళు తెరిచే సరికల్లా నవ్వుముఖంతో- ఒక మిఠాయి వుండని నా చేతి కిచ్చి ప్రేమగా నా కళ్ళల్లోకే చూస్తోంది. ఆ మిఠాయి పరిమళం రుచి సూర్యనారాయణా! వర్ణించడానికి నాకు మాటలు చాలవు. షా నావైపు విస్ఫారితంగా చూస్తున్నారు - నవ్వు ముఖంతో - నాకు వొళ్ళు తెలిసేసరికి ఆ మిఠాయి తీపి నా నోట్లో అలాగే వుంది. నాకు నేను తెలిసి చూసేసరికి — నాలోంచి నన్ను నిద్రలేపిన తల్లి ఎవరో కాదు సౌరిస్సే. అప్పుడే

తన వొడిలోకి బిడ్డడిలాగ ఈశ్వరుడు స్వీకరించారు. అది వారి కరుణ. నాదేముంది? నాలో ఎన్ని అవగుణాలు, వక్రతలూ వున్నాయో ఈ నాడు ఈశ్వరుడు నన్ను స్వీకరించి నడుపుతున్నారంటే- నిస్సందేహంగా వారే జన్మజన్మలుగా నా గురువు. నన్నూ, నావంటి వాళ్ళనీ వుద్ధరించడానికే పరిపూర్ణులైన వారి దేహబంధంలోకి వొచ్చారు. అవమానాల్ని, అపనిందల్ని, స్తుతుల్ని, పూజల్ని, అన్నిటినీ సమానంగా ఒకే దృష్టితో అందుకుంటూ నిలిచిపోయా రచలత్వంలో అందర్నీ వెలుగులోకి నడుపడానికి.

అప్పటినించీ బదిలీలు కావాల్సినా, మరేసమస్యలు తీర్చబడవలసి వొచ్చినా- నేను చెప్పకుండానే ఈశ్వరుడు నాసమస్యల్ని పరిష్కరించారు. నా శరీరారోగ్యం అప్పట్లో బాగా దెబ్బ తిన్నది. ఈశ్వరుడే దగ్గర వుండి సూర్యనమస్కారాలు చేయడం నేర్పించారు. అప్పటినించి ఇప్పటిదాకా సూర్యనమస్కారాలు చేస్తూనే వున్నాను. నా శరీరక, మానసిక ఆరోగ్యాలు వారి దయవల్లనే చక్కబడ్డాయి.

గిరిప్రదక్షిణం అరుణాచలంలో నాకో దివ్యానుభవం. ఈశ్వరుడితో బాటు కొన్ని గిరిప్రదక్షిణాలలో నేనుకూడా పాల్గొన్నాను. బృందావనంలో కృష్ణుడి చుట్టూరా గోపికల మల్లే- మేమంతా ఈశ్వరుడి వెంట నడిచే వాళ్ళం. ఎంతో గొప్పగా వుండేవి ఆరోజులు. షా భజనలు, మధ్యేమార్గంలో భోజనాలు- ఎలాంటి సందడో! కానీ షా మా అందరితో కలిసి నవ్వినా హాస్యాలు చేసినా ఉపదేశాలు చేసినా పాటలు పాడినా, తాను మేము చూసే తాను కాదనే సంగతి మాకు లిప్తపాటు తట్టేది. కానీ అంతట్లోనే మాయ కమ్ముకుని వొచ్చేది. ఈనాటికీ అంతే- ఆతల్లికి మాతో ఇట్లా దాగుడుమూత లాడడం సరదాయేమో!

మిగిలినచోట్ల నయితే ఆశ్రమాల్లో గురుపీఠాలమీద, కూచుంటారు గురువులు. రమణస్థాన్‌లో అలాకాదు. కూరలు తరగడం నించి-

కుంపటి వెలిగించడం దాకా ఆవకాయ కలిపించడం నించి- ఆత్మ విద్యాతత్త్వాన్ని వివరించడం దాకా అన్నిటిలోనూ సౌరిస్ వున్నారు. తామూ పనిచేస్తారు. భేషజాలు కృతక మర్యాదలూ ఇక్కడ పేరుకి కూడా లేవు. ఇక్కడికి వొస్తే నాకేదో ఆశ్రమానికి వొచ్చినట్లుండదు- చదువులకి పట్నం వెళ్ళిన కుర్రవాడు శలవలకి తన ఇంటికి వొస్తే ఎట్లా వుంటుందో అట్లా వుంటుంది నా మనసులో.

సౌరిస్ దగ్గరకి ఎవరు వొచ్చినా ఆమెలో కనిపించే- ఆలోకాల తేజస్సుకి. దయకి, ప్రేమకి, సమదృష్టికి- కట్టుబడిపోయి ఇక్కడే వుండి పోతారు. వెళ్ళలేక వెళ్ళలేక కన్నీళ్ళతో ఆమె అభయంతో తిరిగి వెడతారు. ఈ అనుభవం ఆనాడు ఈనాడు నిరంతరం నేను పొందు తున్నదే- అందరి విషయంలోనూ చూస్తూ వున్నదే,

ప్రస్తుతం నేను మావూళ్ళోనే వున్నాగానీ నాదృష్టి రమణస్థాన్ మీదే వుంటోంది. ఎప్పుడు మళ్ళీ రమణస్థాన్‌కి పోదామా? అన్నదే నా కోరిక. అరుణాచలం లాగ.ఈశ్వరుడిలాగ నాజీవితంలో నన్ను విరహ పెట్టిన దింకోటి లేదు.

ఒక రోజు జరిగిన విషయం మాత్రం నాకళ్ళముం దింకా ఇప్పుడు విచ్చిన పువ్వంత తాజాగా నా జ్ఞాపకాల్లో వుంది. సూర్యనారాయణగారు (1974 సౌరిస్-1 రచనాకాలం) కలం కాగితాలు చేతుల్లో పట్టుకుని రమణస్థాన్ వరండాలో స్తంభానికి ఆనుకుని దిగాలుగా కూచు న్నారు. సౌరిస్ ఎదురుగుండా కుర్చీలో కూచున్నారు. ఎటో చూస్తు న్నారు. మేమంతా చుట్టూరా కూచున్నాం. ఆమె దృష్టి దిగంతాల కావల ఏ సీమలలో ప్రసరిస్తోందో! కంటిరెప్పల కదలిక లేదు. అం దరూ మౌనంగా కూచున్నారు. నాకు ఒక్కొక్కసారి సూర్యనారాయణ గారిమీద కోపం వొచ్చేది. ఎందు కీయన పనికిరాని ప్రశ్నలు ఇన్ని

వేస్తారు. షోకి అలుపు తెప్పిస్తారు. అయినా ఆ కలం కాగితాలు చేతుల్లో అహర్నిశాలూ ఎందుకు? ఎప్పటి కప్పుడు ఎదురుగుండా సమృద్ధిగా భోజనం పెడుతోంటే అది వేడి వేడిగా హాయిగా తిని, ఆకలి తీర్చుకుని ఆనందించక- పెట్టిన భోజనం పెట్టినట్లే సంచిలో దాచుకునే వాడిలాగ ఎందు కీయనకీ పిచ్చిపని అనిపించేది. రమారమి ఓ ఇరవై నిముషాలు గడిచాక సౌరిస్ మామూలు దృష్టికి వొచ్చారు. అంతదాకా- ఈ దేహంతో మాముందు కూచున్నా- తేజశ్శరీరంతో ఏ కైలాస శిఖరిమీదకో వెళ్ళి సృష్టి స్థితి లయాలనే తమ కార్యక్రమాల్ని చూసుకుని వొచ్చారని తోచింది.

"మామీద మీకు ప్రేమ, దయ లేవమ్మా" అన్నారు సూర్యనారాయణ బిక్క మొగం వేసుకుని. సౌరిస్ కళ్ళెత్తి సూర్యనారాయణగారి వంక సూటిగా చూశారు- ఆ చూపులో దయా, జాలి, వాత్సల్యం, కారుణ్యం అన్ని భావాలు వర్షిస్తున్నాయి. ఎక్కడో మంచులో తడిసిన దేవ పారిజాతం నించి జలజలమని రాలే- పువ్వుల జల్లులా సౌరిస్ తేనె సోనల పలుకులు మాచెవుల బడ్డాయి.

"మీ అందరిమీద ప్రేమ లేకపోతే ఇట్లా రూపం ధరించి వొస్తానా? నేను వుండగా అది నీకు తెలుస్తుందా? సూర్యనారాయణ! సరిగా మీరు అడిగిన లాంటి ప్రశ్ననే అపోస్తలులు జీసస్‌ని అడిగారు. మీరందరూ సూర్యుడి చుట్టూ కిరణాల వంటివారు. మీరంతా నాతో కలిస్తేనే కానీ నేను పూర్తిగా ప్రకాశించను అన్నారు జీసస్ వాళ్ళతో తెలిసిందా?"- అని. వింటున్న సూర్యనారాయణగారితో బాటు అందరి కళ్ళు చెమ్మగిల్లుకున్నాయి. మా అందరికీ ఆనాడు ఇంకా స్పష్టంగా తెలిసింది. ఈశ్వరుడు లోకంలో అందరిమీద కారుణ్యం వల్లనే సౌరిస్ దేహబంధంలోనికి వొచ్చారని. అది మాకు తెలియ కుండా వుందని.

ఇంతట్లో భోజనాల వేళయింది. అందరూ లోపలికి వెడుతున్నారు. నేను చిత్ర గదిలోంచి నడుస్తున్నాను. ఆర్ద్రమైన కళ్ళని వొత్తుకుంటోంది నర్తకి.

"యేమండీ ఏం జరిగింది?" అని అడిగాను.

"ఏమీ లేదండి. షా మాటలు వింటూ వుంటే.." అన్నారు.

"మీ కేమనిపించింది?" అని అడిగాను.

"ఏమని పిస్తుందండీ ? మాటల్లో చెప్పేవా ఇవన్నీ ! షా అంటే వెలుగు. ఆమె నడిచి వెడుతోంటే అలా చూస్తూ నిలబడిపోతామే కానీ మనకి అంకితం కావాలనే స్ఫురణ వుండదు. అవతలి వొడ్డునించి సౌరిస్ - స్వచ్ఛమయిన నవ్వుల సవ్వడి వినిపిస్తూంటే తెలుస్తుంది - ఆమె నడిచి వెళ్ళిపోయారని. ఎందరు జీసస్‌లూ, మహమ్మద్‌లూ, గాంధీలూ, సౌరిస్‌లూ ఈ భూమ్మీదకి దేహబంధంలోకి మనమీద ప్రేమతో దిగివొచ్చారో ? వాళ్ళని మనం గుర్తు పట్టలేము కదండీ శేషయ్యగారూ !" - అంటూ లోపలికి వెళ్ళిపోయారు నర్తకి. నిజమే : సరిగ్గా బిడ్డడి నోట భువన భాండాల్ని చూసి అబ్బురపడిన యశోదమ్మ లాగ తనని తాను మరచిపోయి మాట్లాడారు నర్తకి. నర్తకి మాటలు నిజమే, ఆ వెలుగులో నిలిచికూడా మనం కళ్ళు మూసు కుంటున్నాం. చేయూత నిచ్చే చేతినే కొరుక్కు తింటున్నాం. మన అజ్ఞానం అంత ఘోరమైంది. దీనికి మోక్షం ఎన్నటికో : ఆ వెలుగుకి అర్పితం కావాలి. ప్రభువుని తమలోకి మనందర్నీ కూడా నడిపించుకో మని వేడుకోవాలి. ఏజన్మ భాగ్యమో, ప్రభు కారుణ్యమో అతిసామాన్యుడినయిన నేనుకూడా ఈనాడీ ఈశ్వరమూర్తి చెంత నిలిచాను. ఈభాగ్యాన్ని నిలుపుకో గలిగితే చాలు ననిపించింది ఆ చరణ సన్నిధిని అర్పితమై నిలిచాను. లోకంలో ఏం జరిగితేనేంగాక ఈనాడిక నాకర

వ్యం గమనం సమస్తం ఈశ్వరుడే. ఎక్కడ వున్నా వారు నడుపుతారన్నదే ఆశ, విశ్వాసం, ఇంతకంటే చెప్పలేను క్షమించండి."

ఈశ్వరావతరణకి జయంతికి కాక టీచర్లంతా ఎండాకాలం శలవలకి వొచ్చేవారు. అలాగే ఎండాకాలం శలవలకి కొంతమంది students వొచ్చేవారు. ఆ విధంగా ఎందరో summerలో regular గా gather అయ్యేవారు. వారిలో వీరేశలింగం గారొకరు. ఆయన ఈశ్వరుడు వొచ్చిన కొత్త రోజుల నించి వొచ్చిపోతూనే వున్నారు.

నాగయ్యగారిది పుంగనూరు. చిన్నప్పుడు చలంగారు వాళ్ళు బ్రహ్మసమాజంలో వుండే రోజులలో నాగయ్యగారు వాళ్ళతోనే వుండేవారు. అప్పటినించీ ఆయనకి చలంగారితో స్నేహం. చలంగారు బ్రహ్మసమాజానికి దూరమైపోయాక వారిమధ్య touch పోయింది. పుంగనూరు అరుణాచలానికి దగ్గర కావడాన నాగయ్యగారు చలంగార్ని చూడడానికి వొచ్చారు. తమ చిన్నప్పటి కబుర్లు అందరికీ కథలుగా చెప్పేవారు. ఆయన దాదాపు తమకి ఓపిక వున్నంతకాలం అరుణాచలంలో చలంగారికి రెగ్యులర్ విజిటర్ అయిపోయారు.

షౌ తమ గదిలోపల వుండగా ఒక శ్రావ్యమైన కంఠం వినపడేది చలంగారితో మాటలాడుతో. ఏఆంగ్లేయ యువతో చలంగారితో మాటలాడు తున్నారని అనుకునే వారు షౌ. ఆ కంఠంలో మార్దవం. ఆమాటాడే తీరు- అచ్చా మచ్చా స్త్రీ మాట్లాడు తున్నట్లే వుండేది. చలంగారు ఒకతను వొచ్చి, నేను ఒక ఆశ్రమంలో గురుసేవ చేస్తూ వుంటున్నా ననీ, మీ తీరూ తెన్నూ నాకు చాలా నచ్చాయనీ, మీకొక ఆవుని ఇవ్వాలని వుందని, అంటున్నార"ని షౌకి చేప్పేవారు. ఈ శ్రావ్యమైన కంఠాన్ని, ఆ మనిషిని ఎసోసియేట్ చేసుకో లేదామె.

ఒకరోజు భజనలో కూచొని వుండగా లాల్చీ తొడిగి, లుంగీ గూడకట్టు కట్టుకుని, విభూతి కుంకుమ పెట్టుకున్న ఒకతను షౌ ఎదురుగుండా నమస్కరిస్తూ మోకరిల్లాడు — కళ్ళు కిందికి వాల్చి, చిన్న చిరునవ్వుతో.

Paintings లో వేసే శివుడికి మల్లే వున్నాడతను. ఆ నుదురు, ఆ కళ్ళు, ఆ చెంపలు, ఆ నోరు .... .... ....

కొంచెం సేపు అయిన తరువాత లేచి కూచున్నాడు. షౌ పాట పూర్తయిన తరువాత అతను పాట అందుకున్నాడు. ఎంత శ్రావ్యమైన కంఠమో అతనిది. ఆ పాడే ఫక్కీ అంతా ఎమ్. ఎస్. సుబ్బలక్ష్మి. ఇంక తేడా ఏమాత్రమూ లేదు. తెలుగులో, హిందీలో, అరవంలో పాటలు పాడాడు. కబీర్, మీరాల భక్తిగీతాలుకూడా పాడాడు. అతన్ని చూసి రమణస్థానీయు లంతా ఆశ్చర్య పోయారు. ఎవరీ మనిషి? ఎక్కడినించి వొచ్చాడు? అని. అతనే సాంబమూర్తి. ఇంక అతని మాట ఎంత సౌమ్యమో! అతనిలో ఎంత వినయమో! అతను రోజూ రావడం మొదలు పెట్టాడు.

రాజుగారు చలంగారి పుట్టినరోజు చేశారు. చలంగారు పుట్టినరోజు ఎప్పుడూ చేయనిచ్చేవారు కాదు, రాజుగారి యడల మొహమాటంచేత కాదనలేక మిశ్రీ పుట్టినరోజు చేద్దా మన్నారు చలం. మిశ్రీ పుట్టినది మే నెలలోనే.

"చలం పుట్టిన రోజుకి శ్రీరమణస్థాన్‌లో ఏ పండుగా జరగదు — చలానికి ఇష్టం లేదు గనక. ఎప్పుడూ జరగలేదు. ఓ సంవత్సరం మిశ్రీ పుట్టినరోజు కలిసి రావడంవల్ల తప్పిజారి జరిగింది."

(నాగేశ్వరరావుగారికి చలంగారి లేఖ 19-4-68)

ఆ రోజు సాయంత్రం పుట్టినరోజు celebrations డాబా మీద జరిపించారు రాజుగారు. అది వైశాఖ పౌర్ణమి. ఆ వేళనే బుద్ధజయంతి కూడాను. ఆ వేళ భజనకి సాంబమూర్తి, కృష్ణభిక్షు, ఆథాం తదితరులు వొచ్చారు.

సాంబమూర్తి అమ్మా ! నేను డ్యాన్సు చెయ్యనా ?" అని షౌని అడిగారు. అలాగే చెయ్యమన్నారు షౌ. అంత లావుపాటి మనిషి— వొళ్ళు కదలకుండా "భజరే గోపాలం" అన్న కీర్తనని ఎంత చక్కగా అభినయించి చూపారో.

సాంబమూర్తి అప్పుడప్పుడు వంటింట్లో వంటల తయారీలో ప్రవేశించేవాడు. అద్భుతమైన వంటకాలు తయారు చేసేవాడు. అంత లావు సాంబమూర్తి ఏదన్నా పండుగ వొచ్చి పిల్లలు ముగ్గులు వేస్తూ వుంటే- చాక్‌పీస్‌లు తీసుకుని అవలీలగా రెండు హంసలు రథాలువంటి గొప్ప డిజైన్స్ చకచకా వేసేవాడు. చిన్నారావుగా రది చూసి అద్భుత పడి పోయారు. "ఏమిటమ్మా ! ఇతను. ఒక్కలైను గీయాలంటే మేము ఎంత కష్టపడతామో ! ఇటో లైనూ, అటో లైనూ రాసేశాడు. ఇంతట్లోకి ఫారమ్ అయిపోయింది చిత్రం. ఎంత సులువుగా గీశాడో డిజైన్" అన్నారు షౌతో.

షౌ గదిలో పాడుకుంటూ వుంటే వొచ్చి కూచుని తనూ పాడే వాడు సాంబమూర్తి. అతను కొన్నాళ్ళు రాలేదు. ఒకరోజు వొచ్చేసరికి షౌ అతన్ని అడిగారు - "రావడల్లేదే" మని ? అతను షౌ వైపు నిదానంగా చూసి "నేను ఎక్కడెక్కడ మురికిలో దొర్లి వొస్తానో ! మీ దగ్గరకి రావడం నా కిష్టం వుండదు" అని చెప్పి వెళ్ళిపోయాడు. చిన్నారావుగారు "ఏమిటమ్మా అతను రావటల్లేదు ?" అని షౌని అడిగారు. ఆ సంగతి షౌ ఆయనకి చెప్పారు. "ఏం మనిషి ?" అని ఆశ్చర్యపోయారు చిన్నారావుగారు ఆ frank admission కి.

ఆ తరువాత అతను అప్పుడప్పుడు వొస్తూనే వుండేవారు. అతని గురించి రమణస్థానీయులు వింటూనే వున్నారు. అతను ఎంత మంది దగ్గరకో వెళ్ళి మాంచి ఇంగ్లీషులో మాట్లాడే వాడు. బెంగాలీ! హిందీ, కన్నడం, తమిళం, తెలుగు అతనికి రానిభాష లేదు. అతను ఎంతో గొప్పగా కబుర్లు చెప్పేవాడు. షౌ ఎక్కడో వున్న మనుషుల సంగతి మాట్లాడితే అతను "ఓ వాళ్ళు నాకు తెలుస"ని రకీమని వాళ్ళకి సంబంధించిన సంగతులన్నీ చెప్పేసే వాడు. అతను ఎరగని మనిషి లేడు. కొన్నాళ్ళు కనబడక మళ్ళీ వొచ్చేవాడు.

"ఆనందాశ్రమానికి వెళ్ళాను. అక్కడ కృష్ణాబాయితో మీ సంగతంతా చెప్పాను" అనేవాడు. చలంగారి మీద తమిళంలో ఒక పద్యం కట్టి అది భజనలో చదివాడు. షౌకి అరవం అంతగా తెలియక పోయినా అరవంలాంటి కటువైన భాషలో ఎంత మృదువైన పదాలతో ఎంత సంగీతంతో కూడిన సాహిత్యంతో అల్లాడో ఆ పద్యాన్ని.

అతను నెమ్మదిగా రమణనగర్ భక్తులు అందరి దగ్గరికీ వెళ్ళ డం మొదలు పెట్టాడు. జగదీష్‌కి, అతనికి చాలా స్నేహం. అతని సంగతులన్నీ నెమ్మదిగా బైటపడటం మొదలు పెట్టాయి. ఒకరోజు అతను తన కంబళీ ఎత్తుకుని పోయాడని జగదీష్ గోలపెట్టాడు. ముం దర ఎవరూ అతనిమీద ఏమాట వొచ్చినా నమ్మేవారు కాదు.

మెర్‌స్టన్‌కి అతనంటే ఎంతో ఇష్టం. నర్తకి ఒకరోజు ఇంజ క్షన్ ఇవ్వడానికి వెళ్ళినప్పుడు ఆమెకి సాంబమూర్తి సంగతి చెప్పింది మెర్‌స్టన్. అతను వొచ్చి తనతో మాటాడి వెళ్ళాక చూసుకుంటే బల్ల మీద పెట్టిన పదిరూపాయలనోటు అదృశ్య మైపోయిందని చెప్పింది మెర్‌స్టన్. అతను ఎంత మధురమైన వ్యక్తో! అతనిలో ఎంత తెలివో! ఎంత వికాసమో! ఎందు కిలా చేస్తాడో! అతనికి అర్థం అయ్యేలా

చెప్పాలని లెక్చర్లిచ్చి "ఎందు కిలాంటి పాడుపనులు చేస్తావు? మానుకో ఇంకనైనా" అని చెప్పింది మెర్స్టన్.

ఇటువంటి వారు శాపగ్రస్తులనీ. ఏశాపంవల్లనో ఇంతగొప్ప ప్రతిభ వుండికూడా ఏమీకాకండా ఇలాంటి బుద్ధితో పుడతారని, ప్రపంచం వాళ్ళని ద్వేషిస్తుందని వారిప్రతిభని గుర్తించదని అనుకున్నారు షా. కానీ వాళ్ళే మవాలి. అయితే ఏ రేడియోలోనో సినిమాలోనో చేరితేనో? ఇంతకన్నా మాలిన్యం పట్టి ఎప్పటికీ దిక్కు లేకండా పోరా? అనిపించింది షాకి యోచించే సరికి.

అతను ఎక్కడెక్కడి ఆశ్రమాలకో వెళ్ళి అక్కడ సేవ చేసేవాడు. చంద్రశేఖర్ అరుణాచలం వొచ్చినపుడు సాంబమూర్తి తమతో వొస్తామంటే తీసుకు వెడతా మన్నారు. శ్రీకంఠయ్య ఎందు కివన్నీ పెట్టుకుంటావని, నచ్చ చెప్పారు చంద్రశేఖర్‌కి. ఆయన వొచ్చి షాకి చెప్పారు. షాకి అతన్ని గురించి warn చేయక తప్పలేదు. "ఇతను ఉత్త న్యూసెన్సు, మీరు భరించగలరా?" అని అడిగారు.

"ఇది ఈశ్వరసేవగా తీసుకుంటాను" అన్నారు చంద్రశేఖర్.

అతన్ని తీసుకు వెళ్ళడం వలన అత నక్కడ న్యూసెన్స్ అవడమే కాక, అతని కక్కడ పెద్దజబ్బు చేసింది. ఆ జబ్బులో చంద్రశేఖర్ అతనికి అమోఘమైన సేవచేశారు. జబ్బు తగ్గాక సాంబమూర్తి అరుణాచలం వొచ్చారు.

సాంబమూర్తి భజనలకి వొస్తున్నారు, భజనలకి ఎవరు వొచ్చినా అతని సంగీతం విని ముగ్ధులయి ఎట్లా పొగిడేవారో! కానీ రానురాను అతని సంగీతం పాడయి పోవడం మొదలు పెట్టింది. చివరికి వినలేనంత అసహ్యంగా అయిపోయింది. ఎందుకు అట్లా అయిపోయిందో ఎవరికీ తెలియదు. అతను చివరికి రమణాశ్రమంలో సేవకుడిగా

చేరాడు. అతను చేసే న్యూసెన్స్‌ని భరించలేక ఆశ్రమంవారు అచిర కాలములోనే అతన్ని తరిమేశారు. ఎక్కడా నిలిచేందుకు వీల్లేక సాంబమూర్తి తిరువన్నామలై నించి నిష్క్రమించాడు.

1966 జనవరిలో పకపక వజీర్ రహ్మాన్, ఇస్మాయిల్ గారితో కలిసి రమణస్థాన్‌కి వొచ్చారు. ఇస్మాయిల్ వజీర్ పెద్దన్నగారు.

తెలుగు సాహిత్యంలో నామమాత్రంగా వున్న (pure poetry) 'శుద్ధ కవితాశాఖ'కి పూలు పూయించిన ఘనత ఇస్మాయిల్ గారిదే. అచ్చమైన తెలుగు కవిత్వపు సౌందర్యం, సౌకుమార్యం ఇస్మాయిల్ గారిలో మూర్తీభవించి నట్లుగా తోస్తుంది. ఆయన తమ అమూల్య కవితాసంపుటి 'మృత్యువృక్షం'ని చలంమహర్షికి అంకితం చేశారు.

ఇస్మాయిల్ తెలుగు మాటాడుతుంటే చాలా స్వచ్ఛం. ఆయనలో ఎంత స్వచ్ఛతో! ఎంత సౌమ్యమో.

వజీర్ ఎంత హడావిడో! ఇస్మాయిల్‌గా రంత నెమ్మది. ఇస్మాయిల్‌గారిలో Muslim grace చాలా ఎక్కువ. ఆయనకి ముందుగా చలంమహర్షిని, సౌరిస్‌ని చూపించడానికి తీసుకు వొచ్చారు పకపక, వజీర్. ఇక్కడినించి మళ్ళీ మద్రాసువెళ్ళి ఆయనకి మెడ్రాస్ అంతా చూపించాలని వాళ్ళ వుద్దేశ్యం.

ఆ ఇద్దరన్నదమ్ములు లోపలికి వొస్తున్నప్పుడు

"ఎవరీ రాజకుమారకుల్

ఎచటివారీ వీరయోధాగ్రణుల్" అని పాడారు మామ్మగారు.

పకపక గర్భవతి. ఇంతకి పూర్వమొక కడుపు పోయిందామెకి. ఈ మారైనా పుట్టబోయే పాపాయిని భద్రంగా వుంచుకోవాలని- పకపకకీ, రమణస్థానీయులందరికీ పట్టు. అందువల్లనే షా-

"నువ్విక్కడే వుండిపో పకపకా" అన్నారు.

"మా బావగారు మమ్మల్ని చూడటానికి వొచ్చారు. ఆయనకి అన్నీ చూపించ వొద్దా? ఏమను కుంటారు?" అంది పకపక.

అప్పుడు షౌ వజీర్‌తో "పకపక నిక్కడ వుంచడం మంచిది" అన్నారు. ఇంతవరకూ షౌ వజీర్‌తో ఏదీ ఇలా చేయండి అని ఎన్నడూ చెప్పలేదు. ఇప్పటిదాకా షౌ వజీర్‌కి ఏమైనా చెబితే "నేను చెయ్యను, చెయ్యలేను" అని ఆయన షౌతో అనలేదు. పకపకని ఇక్కడే వుంచేసి ఇద్దరన్నదమ్ములు వెళ్ళిపోయారు.

తమ అరుణాచల సందర్శనం గురించి ఇస్మాయిల్‌గారి మాటల్లోనే విందాం.

"స్వామీజీ! నా అరుణాచల సందర్శనం నిన్న జరిగినంత స్పష్టంగా గుర్తుంది. ఆ సంఘటనను ఎప్పుడూ మరవనీకుండా చేసినవి రెండు విషయాలు. ఒకటి చలం, సౌరిస్‌గార్లు చూపిన ప్రేమ. అది వారి నించి అనంతంగా పొంగుకొచ్చి పరిసర జనాన్నీ, ప్రపంచాన్నీ ముంచెత్తు తుందా అనిపించింది. రెండోది అక్కడ నే ననుభవించిన ఆనందం. ఈ రెండూ ఒకటేనేమో! ఒకే అలకు రెండు తట్టులేమో! అక్కడున్న రెండురోజులూ భూమికి ఎత్తుగా ఈ కెరటంపై తేలుతు న్నాను. లౌకిక విషయాలన్నీ తుచ్ఛ మనిపించింది. అనుభవసాధ్య మైన ఇంత ఆనంద ముండగా పనికిమాలిన విషయాల వెనక జనం ఎందుకు పరుగెత్తుతారు? అనిపించింది.

మీరు అదృష్టవంతులు కనక, చలం, సౌరిస్‌గార్ల సన్నిధి మీకు చిరకాలం ప్రాప్తమైంది. 'ఎవరీ రాజకుమారకుల్' అని పాడిన మామ్మగారు ఎక్కడున్నా రిప్పుడు.

అంతమంది మంచివాళ్ళని ఒక్కచోట ఎక్కడా చూళ్ళేదు నేను. చిత్ర, నర్తకి, కృష్ణారావుగారు ఇంకా ఎవరెవరో?

చలంగారి సమక్షంలో మాట లనవసరం, పైగా అపచారమేమో అనిపించింది. నిశ్శబ్దంగా ఆయన సమక్షంలో కూచుంటే అంతా అర్థమైనట్టే అనిపించింది.

(స్వామి రామానందకి ఇస్మాయిల్‌గారి లేఖ 11-11-77)

రెండవనెల నించే పకపకకి చాలా గట్టి వేవిళ్ళు పట్టుకున్నాయి- ఒకవేళ వజీర్ వాళ్ళతో మద్రాసు వెళ్ళినా వెంటనే అరుణాచలం పరిగెత్తుకుని వొచ్చేసేది.

డాక్టర్ వొచ్చి మందులు ఇచ్చేవారు. కానీ వాటి వలన పకపకకి ఏమీ తగ్గలేదు. ఒక్కొక్క డోకుకి గుండె పట్టేసి ఆమెకి వూపిరి నలిచేది కాదు. "నేను బతకను షౌ" అనేది పకపక షౌతో. షౌ ఆమె పక్కనే కూచుని గుండె రాసేవారు. "ఈ డోకులకే ఇట్లా అయిపోతే ఇంక పిల్ల నెట్లా కంటాను? అంతదాకా నా ప్రాణం వుంటుందా?" అనేది. ఒక్కొక్క డోకుకి చలంగారు తలవొంచుకు బాధ పడేవారు. డాక్టరు రాగానే పకపక "ఈ పిల్ల వొద్దు నాకేం వొద్దు" అని గోల పెట్టేది. ఆయన పకపకని సముదాయించి "నీకు చక్కగా కాన్పు అవుతుంది. మాంచి పాపాయి పుడుతుంది. నువ్వు భయపడకు" అని చెప్పేవారు. కుంగిపోయి వున్న చలంగార్ని చూసి "నీకు మనవడో, మనుమరాలో పుట్ట బోతోంది" అని వుత్సాహ మిచ్చి వెళ్ళేవారు డాక్టర్.

పకపకకి బాగా వుధృతంగా వున్నప్పుడు గుండెరాస్తూ ధైర్యం ఇస్తూ షౌ ఆమె పక్కనే కూచునేవారు. షౌని చూడడానికి వొచ్చేవారు అక్కడికే వొచ్చి ఆమెకి నమస్కరించి వెళ్ళేవారు.

ఏడవనెల దాకా వేవిళ్ళతో బాధపడింది పకపక. వజీర్ బొంబాయిలో వున్న తమ స్నేహితుడికి రాసి పకపకకి హోమియోపతి మందు తెప్పించి ఇచ్చారు. అక్కడితో పకపకకి వేవిళ్ళు తగ్గి కులాసాగా తిరిగేది.

పొట్టలో వుండగానే తల్లిదండ్రుల్ని తిప్పలు పెట్టింది గనక పుట్టక ముందే ఆ పాపాయిని "టిప్పు" అని పిలిచేవారు షా. మగపిల్లవాడయితే టిప్పూసుల్తాన్ అని, ఆడపిల్లయితే టిప్పుసుల్తానా అని పేరు పెట్టాలనేవారు.

అ రోజులలోనే కాశ్మీరా అనే అమ్మాయి తాను ప్రేమించిన ప్రియుడితో కలిసి వొచ్చింది. ఆయన వివాహితుడు. అయినాకూడా అతనికి తన హృదయ మంతటినీ ఇచ్చి ప్రేమించింది కాశ్మీరా. ఇది వాళ్ళ వాళ్ళకి ఇష్టంలేక బలవంతంగా ఆమెకి వేరే పెళ్ళి చేశారు.

కాశ్మీరా ఆ భర్తని "నే నొకర్ని ప్రేమిస్తున్నాను. మీతో కలిసి వుండలేను" అని బతిమాలింది. ఆయన కదిలిపోయి "సరే నీ ఇష్టం. నిన్ను బలవంతంగా వుంచుకోవడం నాకిష్టం లేదు" అనేసరికి తన ప్రియుడి చెంతకి వొచ్చేసింది కాశ్మీరా. వాళ్ళు ఎక్కడెక్కడో తిరిగి చివరికి రమణస్థాన్ చేరుకున్నారు.

కాశ్మీరా గొప్ప సౌందర్యవతి. చాలా పొడుగు, పొడుక్కి తగ్గ విశాలమైన శరీరం. ఒక విగ్రహంలా వుండేది. ఆమెలో గొప్ప ఠీవి వుండేది. ఆమెకన్నా గొప్ప అందగత్తె లుండవచ్చు గానీ ఆమెది ఎంత నిర్మలమైన హృదయమో! ఆమెలో ఎంత మంచితనమో! ఆ నిర్మలత్వం, ఆ మంచితనం లోపల్నించి వెలిగేవి ఆ అమ్మాయిలో. ఆమె శ్రీమంతుల బిడ్డ. గారాబంగా పెరిగింది. ఇక్కడ నర్తకి పక్కన చీకిపోయిన దిళ్ళు వేసుకుని చింకి చాపమీద పడుకునేది.

ఇంటిల్లిపాదికీ darling ఆమె. కొత్తగా ఎవరైనా వొస్తే ఇంట్లో కొంతమందికి ఇష్టం లేకపోవచ్చుగానీ కాశ్మీరా అంటే మాత్రం అందరికీ ఎంత ప్రియమో! ఆమె రోడ్డుమీద ఠీవిగా నడిచి వెడుతూంటే కుర్రవాళ్ళకి అల్లరి చేయడానికి బుద్ధిరాక అలా విస్మయంతో చూస్తూ వుండిపోయేవారు. కడుపుతోవున్న పకపకకి ఎంతో సేవచేసేది కాశ్మీరా. ఎంతో చలాకీగా, ఎంతో సంతోషంగా తిరుగుతూ వుండేది రమణస్థాన్‌లో.

ఊళ్ళోవాళ్ళు రమణస్థాన్ గురించి రకరకాలుగా మాటలాడడం మొదలు పెట్టారు. కాశ్మీరా రాకతో అది మరీ ఎక్కువై పోయింది. నర్తకి, చలంగారు మాటలాడుకుని ఆ అమ్మాయిని ప్రియుడికి ఇచ్చి వివాహం చేస్తే బాగుండు నన్నారు. షౌ అభ్యంతర పెట్టారు — ఒక భార్యతో సంసారం చేస్తున్నవాడికి ఏవిధంగా మళ్ళీ పెళ్ళి చేస్తామని. "ఇక్కడ అంతా గోల చేస్తున్నారు షౌ. మనం పడలేము" అన్నారు వాళ్ళు. చివరికి పెళ్ళి అయితేనే గాని కాశ్మీరా సంతోషంగా వుండలేదని అనిపించింది షౌకి. ఆ పెళ్ళికి ఒప్పుకోక తప్పలేదు.

కాశ్మీరా పెళ్ళి అనేసరికి రమణస్థాన్‌లో అందరికీ ఎంత సంతోషమో! బ్రాహ్మడ్ని పిలిచారు. కాశ్మీరాకి పెళ్ళికూతురి అలంకరణం చేశారు. ఇల్లంతా ఈశ్వరావతరణదినోత్సవంలా అలంకరించారు. వొచ్చిన వారిలో ఒకరు మంచి గుమ్మటాలు తయారుచేసి కట్టారు. పెళ్ళి జరుగుతూవున్న సమయానికి రేడియోలో అద్భుతమైన సన్నాయి మొదలైంది. ఆ సంగీతానికి ముగ్ధుడై పరవశించి నెమలి హీరా పురి విప్పి పెళ్ళిపందిరి ముందు నాట్యమాడటం మొదలు పెట్టాడు. షౌ ఎన్నో పెళ్ళిళ్ళు చూశారు కానీ అంత అందమైన పెళ్ళి తమ జీవితంలో చూడలేదు.

కాశ్మీరా శ్రీరమణస్థానీయులలో ఒకరై పోయింది. ఆమె ప్రియుడు అప్పుడప్పుడు వొచ్చి చూచిపోయేవాడు. ఈసారి ఈశ్వరావతరణ మరుసటి రోజున అందరూ గిరిప్రదక్షిణం బయలుదేరారు.

ఆ గిరిప్రదక్షిణానికి కృష్ణయ్యగారు, సాంబమూర్తి, చిన్నారావు, కురంగేశ్వర్, కాశ్మీరా, పకపక, వజీవర్‌రహ్మాన్, సౌరిస్ బృందం ఇంకా చాలామంది వెడుతున్నారు.

అస లింటిదగ్గర బయల్దేరే సరికే కొండమీద మబ్బుంది. అయినాగానీ లెక్క చేయకుండా బయల్దేరారు. గౌతమాశ్రమం దాటేసరికి చినుకులు పట్టుకున్నాయి. షౌ వాళ్ళందరు చెట్లకింద నిలుచున్నారు. షౌ వాళ్ళ కన్నా ముందుగా నడిచిన సాంబమూర్తి తక్కినవాళ్ళు వాన తగ్గగానే బయలుదేరి ఒక ఆలయంలో చేరారు. షౌ వాళ్ళంతా కూడా తరువాత అక్కడికి చేరుకున్నారు. వాళ్ళు వెళ్ళేసరికి సాంబమూర్తి ఆ గుడిలో విగ్రహం వెనకాల నించుని, అక్కడ తనముందు నుంచున్న వారికి చెయ్యెత్తి అభయం ఇస్తూ- 'వత్సా' అంటో పెద్ద వుపన్యాసం ఇస్తున్నాడు. షౌని చూడగానే సిగ్గేసి తటాలున విగ్రహం వెనక కూచు న్నాడు. అక్కడినించి గోల చేసుకుంటూ అడియన్నామలై చేరా రందరూ. మామూలుగా తిరిగి వూళ్ళోకి వస్తున్నా రనగా పంచముఖి అన్నామలైయార్ చేరుకోగానే భజన చేసేవారు. ఈమారు అలాగే అరంభించారు. సాంబమూర్తి మీరా పాటలు షౌతో కలిసి పాడడం ఆరంభించాడు. ఇక వూర్లోకి వొచ్చినా పాడుతూనే వున్నారు. 16,17,18,తేదీలలో అరుణాచలేశ్వర ఆలయంలో అరుణగిరినాధన్ ఆరాధనోత్సవాలు జరుగుతాయి. ఆ మూడు రోజులూ ఎక్క డెక్కడినించో భజన పార్టీలు వొస్తాయి. ఆ పార్టీల వాళ్ళందరూ గుళ్ళో ఆమూడు రోజులూ భజనలు చేస్తారు. ప్రదక్షిణ పూర్తయి వూళ్ళోకి వొచ్చినా సాంబమూర్తి

షా చేత మీరా పాటలు పాడించి తాను పాడుతూనే వున్నాడు. "ఊళ్ళోకి వొచ్చినా ఈపాట లేమిటని పకపక ఒకటే గోల. ఒక ఇంటిముందు కొందరు షావాళ్ళ బృందంలో ఒకరిని ఆపి "ఇది ఎంద వూరు భజన పార్టీ?" (ఇది ఏవూరి భజన పార్టీ?) అని అడిగారు. సౌరిస్ బృందం తడుముకో కండా "రమణనగర్ భజనపార్టీ" అన్నారు. అందరూ ఇంటికి తిరిగి వొచ్చేశారు.

రాజేశ్వరానంద ఎంతో చదివినవారు. ఆయన ఆర్టికల్స్ చాలా వేదాంత పత్రికల్లో పడుతూ వుండేవి. ఆయన చాలా గొప్ప స్కాలర్. పూర్వనించి భగవాన్ భక్తులు. ఆయన నడవలేరు. అందుకని సైకిల్ వీల్ చెయిర్‌లో రోడ్డుమీద తిరుగుతూ వుండేవారు. ఆయన దగ్గర తొమ్మిదేళ్ళ చిన్నకుర్రవాడు వుండేవాడు. ఆ అబ్బాయే వీల్ చెయిర్‌ని తోస్తో వుండేవాడు. ఆయనకి చలంగారికి బాగా పరిచయం. షికార్లలో ఆయనా రమణస్థానీయులూ పరస్పరం పలకరించు కుంటూ వుండేవారు. ఆయన షికార్లనించి తిరిగి వెడుతూ రమణస్థాన్‌లో భజన జరుగుతోంటే చింతచెట్టు కింద వీల్ చెయిర్ ఆపి భజన అయ్యేవరకూ వినేవారు. రమణస్థాన్ వీధివాకిలి చిన్నది కావడాన ఆయన వీల్‌చెయిర్ లోపలికి రాలేదు. ఆయన రమణస్థాన్ భజన్లని **tape** చేసుకోవాలని అనుకున్నారు. "నేను మీభజన్లని **record** చేసుకుంటాను. మీకేం అభ్యంతరం లేదుకదా!" అని అడిగా రాయన.

"మాకేం అభ్యంతరం లేదు" అని రమణస్థానీయులు అనేసరికి ఆయన హార్మోనియాన్ని ఎక్కించుకుని తమ **room**కి తీసుకురావడానికి తన వీల్ చెయిర్‌ని పంపించారు. తరువాత రమణస్థానీయులందరూ, కురంగేశ్వరరావు, శ్రీనివాసరావు, నరసింహారావు, సత్యనారాయణసింగ్‌లతో కలిసి ఆయన గదికి వెళ్ళారు. ఆయన మెట్టమొ

దట tape recorderలో ఆయన record చేసిన పాటలు వినిపించారు. అందులో ఒకమ్మాయి వల్లభాచార్యుల కీర్తన 'అధరం, మధురం' అన్నపాటని ఎంతో ఘోరంగా పాడింది. చివరికి 'గుంజా మధురం' అని పాడుతోంటే చలం "గుంజ మధురంగా వుండట మేమిటి? షా" అన్నారు. దాంతో శ్రీనివాసమూర్తి, కురంగేశ్వర్, నరసింహారావు, సత్యనారాయణసింగ్ నోటికడ్డంగా చేతులు పెట్టుకుని నవ్వాపుకోలేక బైటికి పరుగెత్తారు. ఇంక ఆయన అన్ని నామావళులు రికార్డు చేసుకున్నారు. రమణస్థానీయులకి వేడివేడి కారపుబూంది, రోజ్ షరబత్ ఇచ్చారాయన. బూంది పళ్ళెం ముందు పెట్టగానే చలంగారు కారపు బూందిని జేబులో కుక్కుకున్నారు. ఆ షరబత్ అంతా అందరూ గ్లాసులు, గ్లాసులు తాగారు.

రెఫ్రెష్మెంట్ ప్రోగ్రాం అయ్యాక ఆయన చంద్రశేఖర నామావళి రికార్డు చేసుకో లేదన్నారు. "మాకు time అయిపోయింది. ఇంకోసారి చేసుకుందురు గాని" అని చెప్పి అందరూ ఇంటికి వొచ్చేశారు. ఆయన చింతచెట్టు దగ్గర భజన వినడానికి ఆగినప్పుడు చలంగారు వెళ్ళి ఆయనతో కొంతసేపు మాట్లాడి వొచ్చేవారు. "మీరు గేటు పెట్టుకోరాదా, అప్పుడు లోపలికి రావడం నాకు సులభం" అన్నారాయన.

"మాకు గేటు పెట్టుకునేంత డబ్బెక్కడుంది?" అన్నారు చలం.

'నే నిస్తానండి' అన్నారాయన. అలా అన్న పదిరోజులకే ఒక అర్ధరాత్రి వుప్మా చేసుకుని తిని, రమణాశ్రమానికి ఆ నెల ఖర్చు cheque రాసేసి కూచున్న పళంగా ప్రాణం విడిచేశారాయన.

ఆమని అనే అమ్మాయి చలంగారికి వుత్తరాలు రాస్తూ వుండేది. ఆ అమ్మాయికి చలంపేరు, చలంగారి రచనలద్వారా తెలియదు.

ఎవరో చలాన్ని తిట్టుకుంటూ వుంటే ఆ పేరు విందిం. అప్పటినించీ గొప్ప పారవశ్యంతో చలంగారికి తన కలలు, అనుభవాలు రాసుకునేది. ఆ అమ్మాయి సుబ్రహ్మణ్యంని పెళ్ళి చేసుకుంటే బావుండు ననుకు న్నారు చలంగారు.

చలంగారికి జె. సుబ్రహ్మణ్యం అనే అతనిమీద చాలా ప్రేమ. అతనికి పెళ్ళి కాలేదు. ఏ బ్రాహ్మణకన్య ఉత్తరం రాసినా, చూడటా నికి వొచ్చినా సుబ్రహ్మణ్యం ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటే బావుణ్ణు అనుకునేవారు చలంగారు. ఆమని వాళ్ళ వాళ్ళు ఈ సంబంధం గురించి విన్నారు. ఆ సంబంధం ఎలాగో ఒకలాగు వాళ్ళ అమ్మా యికి కుదర్చాలని ఆమని తండ్రి ఆ అమ్మాయిని అరుణాచలం తీసుకు వొచ్చారు.

ఆమని ఆగమనానికి తమ ప్రయాణాలని వాయిదావేసి ఎదురు చూస్తున్నారు కృష్ణారావు తదితర మిత్రులు. షా ఆ రోజు గదిలోకి ఇంకా వెళ్ళలేదు. అక్కడే కూచుని వున్నారు. ఆమని లోపలికి రాం గానే ఎదురుచూచే వారంతా ఏమనుకున్నారోగాని ఎక్కడి వాళ్ళక్కడ పారిపోయారు. ఆ అమ్మాయి ఇదంతా చూసి బెదిరిపోయింది. చలం గారి చెయ్యిపట్టుకుని ఒకటే ఏడ్చింది. చలంగారికికూడా ఇబ్బందిగానే వుంది. ఈ ఇబ్బంది అంతాచూసి షా ఆమనిని ఎంతో దయగా 'రా అమ్మా' అని పిలిచి, తన చాపమీద కూచోబెట్టు కున్నారు.

ఆమని సామాన్య స్త్రీలలాగ లేదు. చూసేవారికి వెర్రి దనిపి స్తుంది. కాని ఆ అమ్మాయి ఎంతో తెలివైంది. అన్నిటిలోకి ముఖ్యం ఆమె కళ్ళు. ఎంత కళో, ఎంత అందమో ఆ కళ్ళల్లో! ఆ చిరునవ్వు ఎంతో ప్రత్యేక మైంది. ఆ అమ్మాయికి షా తనని దగ్గరగా తీసుకునే సరికి ప్రాణం లేచి వొచ్చింది.

షా గదిలో కూచుని గొప్ప ధ్యానంలోకి వెళ్ళిపోయింది ఆమని. ఇంకీ లోకంలో లేదు. ఆమెచూపు భూమ్మీద లేదు. ఆ అమ్మాయికి సర్వం షాయే అయిపోయింది. షా ఎక్కడికి వెడితే అక్కడికి వెళ్ళేది. షాని అన్నిటా మూగగా అనుగమించేది. బృందావనంలో కృష్ణుని వెంటబడే అమాయిక గోపికలా. మరుసటి రోజు ఆమని—"నేను మన వూరు రాను. నా కిక్కడే వుండాలని వుంది" అన్నది తండ్రితో. షా సమక్షంలో ఆ అమ్మాయిలో వొచ్చిన మార్పు అందరికీ ఆశ్చర్యం కలిగించింది.

ఆమని శరీరం సరిగ్గా ఎదిగినట్లు కనబడ లేదు. ఆ తండ్రికి సుబ్రహ్మణ్యం సంబంధం ఎట్లాగైనా కుదర్చాలని తాపత్రయం. సుబ్రహ్మణ్యంది ఆరడుగుల భారీ విగ్రహం. అతనిముందు ఆ అమ్మాయి పిచ్చికలాగ వుంటుంది. "ఏమిటి నాన్న: ప్రతి వాళ్ళని సుబ్రహ్మణ్యానికి మాటలాడుతావు?" అని చలంగార్ని కోప్పడ్డారు షా.

షా, నర్తకి ఆమె తండ్రితో చెప్పారు. "ఈ పిల్ల పెళ్ళి చేసుకునే రకంకాదు, ఆ అమ్మాయి ఇష్టపడుతోంది గనక ఇక్కడే ఆశ్రమ జీవితాన్ని గడపనివ్వ" మని. కానీ ఆ తండ్రి ఒప్పుకోలేదు. ఆ అమ్మాయి "నేను రాను మొర్రో" అంటున్నా వినక ఏదోవిధంగా నచ్చజెప్పి, తీసుకుపోయా రాయన.

అప్పటి నించీ చలంగారికి వుత్తరాలు రాస్తూనే వుంది ఆమని. కొ రోజులకి "నాకు పెళ్ళి చేస్తున్నారు. నాకు సాంసారిక జీవితంమీద ఇ ం లేదు" అని మొత్తుకుంటూ వుత్తరాలు రాసేది. సృష్టయినా ఆ చ్ఛగానీ బ్రాహ్మణపు మూర్ఖత్వపు పనులకు అడ్డూ ఆపూ వుండదు. ఆమనికి పెళ్ళయి పోయింది. అప్పుడుకూడా పాపం దిగులుగానే వుత్తరాలు రాసేది ఆమని.

ఆమని పంసారం అధ్వాన్నస్థితిలో వుండేది. డబ్బు లేదు. పిల్లలు పుట్టుకొస్తున్నారు. భర్త వ్యసనపరుడు. సింహం పంజాకింద కుందేలు పిల్లలా సంసారపు దుర్భలత్వంలో అసహాయంగా అణగారి పోయింది ఆమని.

ఆమని హిందీ పండితురాలు. ఆమె దుఃఖంలో నించి మీరా పాటలు అప్రయత్నంగా హిందీనించి తెలుగులో రూపందిద్దుకున్నాయి. అవి చలంగారికి పంపించిం దామె. అవెంత గొప్పగా వున్నాయో ! ఆ పాటంలో ఆ అమ్మాయిలోని లోతు, అనుభవం షౌకి తెలిశాయి. ఎంత రసజ్ఞత వున్న హృదయమో ఆమెది. అవి షౌ చదివి వినిపిస్తూవుంటే చలంగారి కళ్ళంబడి కన్నీళ్ళు కారిపోయాయి. ఒక్కొక్కచోట మీరాను మించిపోయి రాసింది ఆమని.

అమర ప్రణయిని మీరా అంటుంది :

"జోతుమ్ తోడోపియా
మై నహీ తోడుంగే
తోడ్ ప్రీత్ తోడ్ ప్రియా
కౌన్ సంగ్ జోడోరే" అని.

"నన్ను నీవు వొదిలి పెట్టవచ్చు. కాని నేను నిన్ను వొదిలి పెట్టను. ఓ ప్రియా ! నీవు ప్రేమని ప్రేయసిని వొదిలిపెట్టు కానీ కల యిక నెవరు కూరుస్తారురా" అంటుంది మీరా.

"నన్ను వీడి నీవు మనినా
నిన్ను విడువలేను స్వామి
నీవులేని లోకము కృష్ణా
శూన్య మోయి నాకు"

అని తర్జుమా చేసింది ఆమని. మీరాపాటని అధిగమించింది భావనలో, విరహాధిక్యంలో ఆమని అనువాదం.

తన మీరాపాటల అనువాదాలని ఏపత్రికలకన్నా ఇచ్చి కొంచెం డబ్బువొస్తే తనకి పంపమని రాసేది ఆమని. ఆమె ఎలాంటి దారిద్ర్యం అనుభవించిందో గానీ "నాకు నూరు రూపాయలు పంపించు, రెండొందలు పంపించు" అని చలంగారికి రాసేది.

చలంగారి సిద్ధాంతం ఏమంటే ఎవరికైనా డబ్బు విషయం కాకండా ఇంకే విధంగానైనా సాయం చేయాలని. ఆమనిమీద అంతు లేని జాలివున్నా తమసిద్ధాంతాల నెలా అతిక్రమిస్తారు వారు? ఐనా చలందగ్గిర రెండువందలు ఎక్కడవున్నాయి ఆరోజుల్లో?

ఆమె పంపిన పాటలలో నాలుగైదింటిని ఎన్నికచేసి- రాగాలు కట్టి పాడటం మొదలు పెట్టారు షౌ. మీరాపాటలు అర్ధం చేసుకోలేని వారు కూడా ఆపాటలు విని ఎంతో పరవశించి పోతారు.

ఆమని నించి మళ్ళీ వుత్తరాలు లేవు. ఏడాది క్రితం ఆమె తమ్ముడు రాశాడు- "ఆమని చచ్చిపోయింది. కారణం మీకు తెలియంది కాదని" దాంతో ఎంతైనా వూహించు కోవచ్చు.

మీరా వెళ్ళిపోయింది లోకం నించి- కానీ ఆమె పాటలు మిగిలి పోయాయి. అలాగే ఆమని స్మృతులు లోకంలో ఎక్కడన్నా మిగిలి వున్నాయో లేదోగానీ ఆమని పాటలు ఈశ్వర విలాసిని సౌరిస్ దయా వీక్షణం వలన శ్రీరమణస్థాన్‌లో చిరంజీవులుగా నిలిచిపోయాయి.

తిరువన్నామలై కి సమీపంలోవున్న పలమనేరుకి చెందినవారు శ్రీధర్. చాలామందికి రమణస్థాన్‌కి వొచ్చి ఈశ్వర దర్శనం చేసుకోగానే రియలైజేషన్ వొచ్చేస్తుందని ఒకనమ్మకం. అటువంటి విశ్వాసం వున్నవారిలో శ్రీధర్ ఒకరు. ఆయనకి అది జరగక పోవడంతో

తీరని ఆశాభంగ మైపోయింది. రియలైజేషన్ జరిగేవరకూ రమణ స్థాన్‌లో భోజనం చేయననే వ్రతాన్ని పూనా రాయన. షా వాళ్ళతో బాటు గిరిప్రదక్షిణాలకి కూడా వుపవాసంతోనే వొచ్చేవారు. ఎవరెంత చెప్పినాగాని ఆపట్టు మాత్రం వొదల లేదాయన. కొన్నిరోజుల తరువాత నర్తకి "ఎందుకీ మొండిపట్టు. వేలకొద్దీ సంవత్సరాలు ఘోర తపస్సు చేసిన వాళ్ళకే అది దొరకదు. అది అంత సులభంగా వొస్తుందేమిటి? ఓ గురువుని నమ్మి ఆయన చెప్పినట్లు సాధన చెయ్యాలి" అంటూ ఆయనకి నచ్చజెప్పి మెల్లిగా మజ్జిగా అన్నం తినిపించింది. అప్పటినించీ ఆయన ఇక్కడ భోజనం చేయడం మొదలు పెట్టారు.

రమణస్థాన్‌కి వొచ్చినప్పుడల్లా వుత్తి మజ్జిగా అన్నమే తింటూ వుండేవా రాయన.

## 27

పకపక చలాకీగా తిరుగుతోంది. ఆమెకి కనే రోజులు వొచ్చాయి. ఆశ్రమంలో ఒక డాక్టరుగా రున్నారు. పకపక అంటే ఆయనకి చాలా ముద్దు. ఆయన "ప్రసవానికి ఎక్కడికీ వెళ్ళొద్దు, ఒక **Mid wife** ని **engage** చేయండి, ఏవయినా **Complications** వొస్తే నేను వాటిని చూసుకుంటాను" అన్నారు.

ఒకరాత్రి పకపకకి నొప్పులు వొచ్చాయి. అవే కనేనొప్పులని ఆస్పత్రిలో పనిచేసిన అనుభవంవల్ల షాకి తెలుసు. మంత్రసానిని పిలిచారు. డాక్టరుగారిని కూడా పిలిచారు. బైట భోరుమని వాన పడుతోంది. పకపక నొప్పులు పడుతోంది. చలంగా రెక్కడ బాధ పడతారోనని పకకప ఆ నొప్పులబాధని తనలో తాను ఆపుకుని భరించింది. ప్రసూతి సమయానికి కాశ్మీరా, కాకా, కిట్టూ, చిత్ర, నర్తకి, మిశ్రీ ఆమెదగ్గరే వున్నారు. పకపకకి కొద్దిసేపటికి నొప్పులు ఎక్కువైనాయి. "షా నాకు

నొప్పులు ఎక్కువైనాయి. తగ్గడానికి ఏమన్నా చెయ్యి" అంది. అంత అమాయకురాలు పకపక. "నొప్పులు ఎక్కువవడం మంచిదే కదా?" అన్నారు షా.

తెలవారుజాము మూడుగంటలకి పాప పుట్టింది. ఆడపిల్ల. పకపక ఆ పిల్లని చూసి "ఇంత పిల్లని నా పొట్టలో మోశానా!" అంది ఆశ్చర్యంగా. ఆ పాప పేరే టిప్పుల్.

తెల్లవారేక టిప్పుల్‌ని తీసుకు వొచ్చి చలంగారికి చూపింది చిత్ర. 'అందంలో మిశ్రీ పోటీ పడుతోంది" అన్నారు చలంగారు.

వజీర్ పాపని చూడటానికి మూడవ రోజున వొచ్చారు. పేరేం పెట్టాలని ప్రశ్న వొచ్చింది. ఆయన కవి కదా ఆయనే పేరు పెడతారనుకున్నారు షా. కానీ ఆయన ఆ బాధ్యత షాకే వొదిలారు. కాశ్మీరా అనే పేరు బావుంటుంది అన్నారు షా. పేరులో మొదట 'క' అని వుంటే ఏవో గోరీలు (కబర్) అవి గుర్తుకు వొస్తాయి అన్నారు వజీర్. షా స్నేహితురాలి పేరు షిరీన్. ఆ పేరు పెడదాం అన్నారు షా. ఆయనకీ ఆ పేరు నచ్చింది. అదే ఆ పాపకి పేరుగా నిలిచింది.

నెలవగానే షిరీన్‌ని షికార్లకి తీసుకు వెళ్ళేవారు షా. షికార్లకి వీలుగా పాపకి డ్రెస్ కుట్టారు. షికార్లకి పకపక వచ్చేది కాదు. పాపని షాయే ఎత్తుకుని తీసుకు వొచ్చేవారు. షా నించి పాపాయిని కాశ్మీరా లాక్కునేది. సెప్టెంబర్, అక్టోబర్ నెలల్లో కొండమీద మంచి water fall వొస్తుంది. ఈమారు అరుణాచల పాదంలో చాలా పెద్ద సెలయేరు ఏర్పడింది. నీళ్ళు మాంచి వుధృతం మీద పారుతున్నాయి. కాశ్మీరా పాపని చేతుల్లో పట్టుకుని ఆ మైదానంలో పరుగులు తీసేది నీళ్ళదగ్గిరకు. పొంగులెత్తే ఆ నీళ్ళ దగ్గర ఆ పాపని పెట్టుకుని రమణస్థానీయులందరూ కూచునే వారు. కాశ్మీరా షిరీన్‌ని ఎంత ముద్దు చేసేదో!

సాయంత్రం షికారు టైము కాగానే టిప్పల్ చేతులు, కాళ్ళు కొట్టుకునేది షికారు 'పోదాం, పోదాం' అన్నట్లు.

అవి దీపం రోజులు. రమణస్థాన్ వెనకాలంతా పాకలువేసి కొట్లు పెట్టారు. అప్పట్లో మామ్మగారు ఇక్కడే వున్నారు. సారంగపాణి ఇంటినించి చలంగారికి మంచి చేపలకూర వొచ్చేది. అక్కడి దుకాణాలలో వడలూ, బజ్జీలు కొనుక్కునేవారు. ఇంక చలంగారి భోజనం జలపాతం దగ్గిరే. జలపాతంచెంత ఆకొండ రాళ్ళమీద కూచుని ఆచేపని, వడల్ని, బజ్జీల్ని చలంగారు- కాశ్మీరా, కాకా, కిట్టూ అందరూ కలిసి తినేవారు. షౌ మాంసాదికాలు తినరు కనక ఆ సరదాని చూస్తూ enjoy చేసేవారు.

ఒక్కొక్క రోజున అక్కడి కొట్లలో ఏదో మాంసంకూర కొనుక్కుని, మర్రిచెట్ల కింద కూచుని Picnic చేసుకునేవారు చలంగారు, కాశ్మీరా. మాంసం అంటే కాశ్మీరాకి ఇష్టం గనక ప్రత్యేకంగా ఆమె కోసమే కూర కొనేవారు వాళ్ళు. వడలు, బజ్జీలుకూడా కొనుక్కుని ఆ కూరతో బాటు తినేవారు- కాశ్మీరా. చలంగారూ. పిల్లలు కాశ్మీరా మత్స్యమాంసాలను enjoy చేస్తుండగా చూడడం చలంగారి కెంతో సంతోషం. B.P. వలన చలంగారు షికార్లలో కొంచెం నెమ్మదిగా ఇబ్బందిగా నడిచేవారు. కాశ్మీరా "నీకెందుకు నాన్నా! పసిపిల్లాడిలా నిన్ను పట్టుకుని ఇంటికి ఎత్తుకుని వొచ్చేస్తాను" అనేది.

అప్పట్లో వజీర్, చలం, కృష్ణారావుగారు షౌకి మంచి పోర్టింగ్ హార్మోనియం ఒకటివుంటే చాలా బాగా వుంటుందనుకునే వారు. షౌకి ఒక వైపు కాశ్మీరా ఒకవైపు కృష్ణారావుగారు నడుస్తూ ఆ హార్మోనియం తీరూ, తెన్నూ అంతా వర్ణించుకుంటూ వొచ్చేవారు షికార్లలో. "కాదండి, ఒక పని చేద్దాం. మనం షౌ పాటని tape చేసి చే గారికి

బొంబే పంపిద్దాం. అక్కడ మంచి హార్మోనియం షౌగారి toneకి సరి పడ్డది ఎన్నికచేసి పంపించమని రాద్దాం" అనేది కాశ్మీరా.

కాశ్మీరా ఆమె ప్రియుడు రమణస్థాన్ నించి వెళ్ళిపోయి బోస్ కాంపౌండ్‌లో వున్న Gate house తీసుకున్నారు. కాశ్మీరాకి రమణ స్థాన్ అన్ని విషయాల్లోనూ ఎంతో నచ్చిందికానీ కోడి, చేప లేకండా వుండడం ఆమెకి చాలా కష్టం. ఆమెకి వంటరాదు. చేపని, కోడిని ఎట్లాచేయాలో తెలియదు. ఆపద్ధతులూ పదున్లూ షౌకి తప్ప రమణ స్థాన్‌లో ఎవరికీ తెలియవు.

ఒకరోజు షికార్లో కాశ్మీరా కోడికూర ఎట్లా చెయాలో చెప్పమని షౌని అడిగింది. షౌ అంతా వివరంగా చెప్పారు. షౌ చిన్నతనంలో తండ్రికి తామే మత్స్యమాంసాలు వొండి పెట్టేవారట.

మరుసటిరోజు గేటుహౌస్‌లో కోలాహలం బయలు దేరింది. వజీర్, వుప్వీ, చిన్నారావు, కృష్ణారావుగారు, కాశ్మీరా ప్రియుడు, తత్తి మావాళ్ళంతా అక్కడ చేరారు- ఒక షౌ మాత్రం రమణస్థాన్‌లో వుండి పోయారు. వాళ్ళు చలంగార్నికూడా అక్కడికి తీసుకు పోయారు. అది కోడివంట కోలాహలం. షౌ చెప్పిన ప్రకారం కాశ్మీరా కోళ్ళని వొం డితే, తమ వంటలప్రకారం కృష్ణారావుగారు కోడివేపుడు చేశారు. ఇంక ఒకటే గోల, కేకలు, హడావిడి. వాళ్ళందరికి ఎంత సరదాయో! అదంతా తిని సాయంత్రం వరకూ అవేకబుర్లు చెప్పుకున్నా రందరూ. ఆకబుర్లలో శ్రోత్రియ పక్షంగా వుండిపోయిన షౌకూడా చేరారు.

ఇంకొక రోజు కాశ్మీరా పెద్దచేపని తెప్పించింది. ఆ మత్స్యా వతారానికి పాకపూజ కృష్ణారావుగారి ఆధ్వర్యంలో జరిగింది. అప్పుడు కూడా వాళ్ళంతా గొప్ప సంతోషంగా గడిపారు. ఈవిధంగా కాశ్మీరా

వేరింటి కాపురంతో - రమణస్థాన్ భోజనప్రియులకి కోడి, చేపవంటి రమ్యమైన విందులు అడపా తడపా లభించడం ఆరంభ మైంది.

1966లో ఒక సాయంత్రం పెద్ద గాలివాన పట్టుకుంది. అప్పుడి క్కడ రమణస్థాసీయులేగాక నాగయ్యగారు, ఒకబ్బాయి, కురంగేశ్వర రావు, చక్రపాణి నరసింహారావు, పేరయ్య (సుబ్బారావు) ఇక్కడే వున్నారు. సాయంత్రం అయ్యేసరికల్లా జోరుగా గాలివాన పట్టుకుంది. షౌ ఆసాయంత్రం భోజనం చేయలేదు. ఆరోజున కిచిడీ. అందరూ భోజనాలకి వొచ్చేసరికి వంటిల్లు నీళ్ళల్లో సగం మునిగి వుంది. ఇల్లంతా నీళ్ళమయం. అందరూ చేతుల్లో కంచాలు పట్టుకుని అక్కడే నిలబడి, భోజనాలు ముగించారు.

భోజనాలు ముగిశాక అందరూ భజనగదిలోకి వొచ్చేశారు. షౌ చాపమీద కిటికీ దగ్గర కూచున్నారు. కాకా ఆమె పక్కన నిద్ర పోతోంది ఆరోజు భజన చెయ్యాలనిపించక షౌ వూరికే కూచున్నారు. గాలి వుధృతంగా వీయడం మొదలు పెట్టేసింది. కొంచెం సేపటికి కరెంటు పోయింది. అంతా నిబిడాంధకారం. షౌ తొడకిందికి నీళ్ళు వొచ్చేశాయి. "కాకా వుచ్చ పోసిందర్రా" అన్నారు షౌ. కొంతసేపటికి చూస్తే కిటికీల్లోంచి ధారగా నీళ్ళు కారుతున్నాయి. దాంతో **guest house** వాళ్ళందర్నీ చలంగారు తొందరగా వెళ్ళి పొమ్మన్నారు. తలుపులు వేసి వుండడంవల్ల వాళ్ళకి బైటి వుధృతం తెలియలేదు. కటిక చీకటి. రివ్వున గాలి. వాళ్ళు వెళ్ళిన కొంచెం సేపటికి నాగయ్యగారు బయలుదేరారు. బైటికి వెళ్ళివొచ్చి "నేను వెళ్ళ లేనండి" అన్నారు వొణుకుతో చలంగారితో. "పో నాగయ్యా, ఇక్కడే పడుకో" అన్నారు చలం. నాగయ్యగారి బ లు అంతక్రితమే తడిసి పోయాయి. చలంగారాయనకి తమవే ఒక ంగీ, చొక్కా ఇచ్చారు. ఆయన విశ్రాంతిగా రమణస్థాన్‌లోనే వుండిపోయారు.

చలంగారు వాళ్ళందరికీ అదుర్దా — ఆవులన్నీ ఆ నీళ్ళల్లో మునిగి చచ్చిపోతా యని. ఏదో పెద్ద ఎండుచెట్టు ఆ పశువుల కొట్టం మీద పడింది. ఆవులపాక కూలిపోయిం దనుకున్నారు. టిప్పు చంటి పిల్ల. భజనగదిలో ఒకమూల మాత్రం పొడిగా వుంది. నర్తకి, కాశ్మీరా కావలించుకుని ఆమూల పడుకున్నారు. చలంగారు మంచం మీద పడుకున్నారు. షౌ తమ గదిలో బల్ల మీద పడుకున్నారు. అన్ని గదుల్లోనూ మోకాలులోతు నీళ్ళు వొచ్చాయి.

ఏ తుఫాను వొచ్చినా ఒకవైపే గాలి వీస్తుంది. ఈ తుఫానులో నాలుగు వైపులనించి పెద్దరొదతో, గొప్ప వేగంతో- ఇళ్ళు పునాదుల్నించి లేచిపోయే లాంటి ఝంఝూమారుతం వీచింది. తిరువన్నామలై అన్నది పూర్తిగా అంతమై పోతుందన్నంత తీవ్రంగా వీచింది గాలి.

అప్పుడు షౌ తమ గదిలోనించి బైటికి వొచ్చి- "ఏమీ ఫరవా లేదు. నేను (ఈ తుఫాన్ని) ఆపేశాను. ఏం భయ పడకండి. నిశ్చింతగా పడుకోండి" అని చెప్పారు. అక్కడితో ఆ గాలి, వాన ఆగి పోయాయి.

మామూలుగానే తెల్లవారింది. "మేడమీద పాక కూలిపోయింది. "హీరా చచ్చిపో యుంటాడు" అంది దిగాలుగా పకపక. ఒళ్ళారని తనూ, పిల్ల నీళ్ళల్లో వుండడం గురించి ఏ గొడవా లేదు పకపకకి. చంటిపిల్ల కేమవుతుందన్న చింత అంతకన్నా లేదు. హీరా ఏమయిపో యాడో అని దిగులుపడింది. ఇంతట్లో హీరా 'కేవ్' మని అరుచు కుంటూ వొచ్చాడు. వాడు బతికే వున్నాడని పకపకకి ఎంత సంతోషమో! ఆవులన్నీ మోకాళ్ళలోతు నీళ్ళలో వున్నాయిగానీ ఒక్కదానికీ గూడా ఏ ప్రమాదం జరగలేదు.

"ఇక్కడ తుఫాను వొచ్చి వాకిట్లో చెట్టు కూలింది. లైట్లు పోయినాయి. తిరిగి రాలేదు. ఆనాటినించి ముసురు. భోజనానికి 10 మంది అతిథులు, కుక్కలు, పిట్టలు, ఉడుతలు, పిల్లలు - ఎట్లా వీళ్ళకి తిండి పెట్టిస్తున్నారో ఈశ్వరుడు. తుఫాను రాత్రి ఇంటిముందు వరదలో కటిక చీకట్లో నీళ్ళలో పడి చచ్చిపోవడానికి సిద్ధమైనారు కృష్ణారావుగారు, నాగయ్య. తక్కినవాళ్ళు కష్టంతో తప్పించుకొన్నారు."

(రాయిడి నాగేశ్వరరావుగారికి చలంగారి లేఖ 9-11-66)

"ఆ తుఫాను రాత్రి ఇళ్ళంతా నీళ్ళు. లైట్లు లేవు. కటిక చీకటి. చుట్టూ చెట్లు విరిగి పడుతున్న శబ్దం. వంట లెక్కడ? భోజనా లెక్కడ? ఏదో పులగం వంటచేశారు తడుస్తూనే. ఎలాగో వొచ్చి చేరారు, భోజనాలకి మిత్రులు, అంతా తడిసి, తడిగుడ్డలతో ఓ గుడ్డి లాంతరు ముందు ఒక్కొక్కరమే నుంచుని భోజనం చేశాము. మళ్ళీ ఆ ఇంటికి వెళ్ళడం దురూహ్యం. పైగా తడిగుడ్డలు. అన్ని గదులు నీళ్ళు, అందుకని తెగించి బైలుదేరారు. ఒకరి చేతులు ఒకరు పట్టుకుని, ఇంతలో అకస్మాత్తుగా కొండమీద నించి రోడ్డుమీదకి పెద్ద వరద దొర్లింది. వీళ్ళు ఒక్కొక్క అడుగే వేసుకుంటూ వెడుతున్నారు. చీకట్లో నీళ్ళలో తడుముకుంటో. ఆ guest house ఎక్కడో తెలీదు. చెట్లు విరుచుకు పడ్డాయి. అడ్డంగా ఎలక్ట్రికల్ తీగలు తెగి కాళ్ళకి అడ్డంగా చుట్టుకుంటున్నాయి. 4 మెట్లు కొట్టుకు పోయాయి. ఎక్కడ కాలు పెడుతున్నారో తెలీదు, అకస్మాత్తుగా కంఠం వరకు నీళ్ళు. ప్రవాహం అతి వడిగా అంతా వూడ్చుకుంటో, పాపం క్రిష్ణారావు కాళ్లు లేచి పోయినాయి. కురంగేశ్వరరావు అంత గట్టిగా పట్టుకోకపోతే, పక్కనున్న గుంటల్లోకి వూడ్చుకు పోయేవాడే.

చివరికి పడుకున్నాము. రేడియోవారు ఇంకా 24 గంటలు తుఫాను అని చెప్పారు పొద్దున్న. ఎట్లా రేపు పొద్దున్న ఎక్కడ టీ కాచడం ? వాళ్ళెట్లా వొస్తారు ఇక్కడికి ? అని మాట్లాడు కొంటు న్నాము. ఈశ్వరుడు వొచ్చి "ఆదుర్దా పడకండి. ఆగు తుంది" అని వెళ్ళిపోయినారు. పది నిమిషాల్లో గాలి లేదు, వాన తగ్గింది."

(రాయిడి నాగేశ్వరరావుగారికి చలంగారి లేఖ 12-12-66)

ఆ తుఫానులో చిక్కుపడి ఎడ్వంచరెస్‌గా ఆ రాత్రిని గడిపిన కృష్ణారావుగార్నే వారి అనుభవాలను చెప్పమందాం.

"ఆ పగలంతా చినుకులూ .... గాలి. అది సాయంత్రానికి వుధృత మైంది. గెస్టుహౌసులో ఏడుగురం వున్నాం. యాభై గజాల దూరంలో వున్న రమణస్థాన్‌కి వెళ్ళాం భోజనానికి. అప్పుడు సాయం త్రం ఆరుగంట లయ్యింది.

రమణస్థాన్ అంతా తడిసి పోయింది. ఎట్లానో అందరం పళ్ళాలు చేతుల్లో పెట్టుకుని భోజనాలు చేశాం. బైట గాలి, వాన, పిడు గులు, వురుములు, మెరుపులు. అది క్రమంగా తుఫానుగా మారింది. మహామృత్యువు లోకంమీద స్వైరవిహారం చేస్తూ వుంటే, మేము తప్పించుకుని ఈశ్వరుడి చెంత చేరాం. తుఫాను మరీ విజృంభిస్తుంటే - నాన్న "తొందరగా వెళ్ళిపోండి, మరీ ఎక్కువయ్యేలా వుంది గాలి వాన" అనంగానే మేము guest house కి బయల్దేరాం.

పగలే అడుగు తీసి అడుగు వెయ్యడానికి అరగంట పట్టే నాగయ్యగారు మా వెనకే బయల్దేరారు. మేం వరండాలోకి వొచ్చాం. కటిక చీకటి బ్రహ్మాండమైన తుఫానురాత్రి అది. తుఫాను ఆగకపోతే అదే చరమరాత్రి. వరండా మెట్లు దిగాం. మోకాళ్ళలోతు నీళ్లు. ఏక ధారగా వర్షం. హోరున గాలి. నేను నిలవలేక పోతుంటే కురంగేశ్వర

రావు నన్ను చెయ్యి పట్టుకు నడిపించాడు. మేమంతా కట్టకట్టుకు మృత్యుముఖంలోకి పోతున్నట్లనిపించింది

గేటు దాటాం. మహాప్రవాహంగా నిలువెత్తు నీళ్ళు. కాలసర్పం లాగ అరుణాచలం పైనించి దూకుతూ పెద్ద వెల్లువగా వొచ్చే జలరాశి మమ్మల్ని చుట్టేసింది. మా కాళ్ళకింద చెట్లు, ముళ్ళకంపలు, కరెంటు తీగలు, రాళ్ళు; అది నిశ్చయంగా జలప్రళయం. నేనా తుఫాను తాకిడికి తట్టుకోలేక తలమునకలైపోయి "నేను మునిగి పోతున్నానోయ్" అని బిగ్గరగా అరిచాను. కురంగేశ్వరరావు నన్ను, చంటిపిల్లను చంకను వేసుకున్నట్లు ఎత్తుకున్నాడు.

చివరికి గెస్టుహౌస్ దగ్గరికి వొచ్చాం. ఎన్ని యుగాలో, కల్పాలో గడిచినట్లు అనిపించింది- ఆ యాభై గజాల నడక. మిత్రులకోసం దారి పొడుగునా అరిచాను. ఆ అరుపులు నా కంఠం దాటిపోయినట్లు అనిపించదు. నా కళ్ళు కప్పి తప్పించుకు పోతున్నారా, కుర్రకుంకల్లారా! అన్నట్లు మృత్యుదేవత మా కళ్ళు కప్పి ఓ పెద్ద లోతైన గోతిలోకి నెట్టబోయింది. ఏదో దివ్యహస్తం ఆ ప్రమాదంనించి మమ్మల్ని రక్షించింది. చివరికి ఆరుగురం గది చేరుకున్నాం. రాత్రంతా గత జన్మ స్మృతుల్లా ప్రళయంగురించి, ఎంతసేపటికి గదికిరాని నాగయ్య గారిని గురించి, మాట్లాడుతూ కూచున్నాం. నాగయ్యగా రేమయ్యారని నాన్నడిగితే ఏం చెప్పాలి! వాళ్ళవాళ్ళకి ఏమని కబురు పెట్టాలి. ఆయనకోసం అంతా గాలించాం తెల్లవారుజామున బయటికి వెళ్ళి. ఎక్కడా ఆయన జాడలేదు. ఓ తూములో ముళ్ళకంచెకు తెల్లని పంచ చిక్కుకుని వుంది. ఆయ నాతూములో ఇరుక్కున్నారని తొంగి చూశాం. ఏమీ కనిపించ లేదు. ఇంకా ముందుకి కొట్టుకుపోయారేమో నని చాలాదూరం వెళ్ళి వెతికాం. నిరాశతో guest house కి తిరిగి

వొచ్చాం. అందరం దిగాలుపడి కూచున్నాం. కనీసం ఆయన శవం దొరికినా బాగుండు ననుకున్నాం.

గదితలుపు కదిలింది. నెమ్మదిగా తలెత్తి చూశాం, నాన్న గళ్ళ లుంగీ కనపడింది. మానోట మాటలేదు. ఇంకేముంది అనుకున్నంతా అయింది. నాగయ్యగా రేరని అడగడానికి నాన్న వొచ్చారని అనుకున్నాం. కానీ లోపలికి వొచ్చింది నాన్న లుంగీ కట్టుకున్న నాగయ్య గారు. మా గుండెలు కుదుటపడ్డాయి. "కృష్ణా! వొచ్చింది నాగయ్యే నంటావా లేక నాగయ్య స్పిరిటా?" అన్నాడు కురంగేశ్వర్. "నేను నాగయ్యనే నయ్యా! బీడి ఆరిపోయింది. అగ్గిపెట్టె వుంటే ఇటివ్వండి" అన్నారు నాగయ్యగారు. ఆయనకూడా వొచ్చి మాతో కలిసినందుకు మా అందరికీ ఎంతో సంతోష మైంది. రమణస్థాన్‌లో అందరూ క్షేమమన్న చల్లని వార్త చెప్పా రాయన.

ఏమీ ఎరగనట్టు సూర్యుడు వుదయించాడు. లేత ఎండ వరద లుగా లోకాన్ని ముంచేస్తోంది. ఎటుచూసినా విరిగిన చెట్లు కూలిన కొంపలు. నేలంతా జలమయం. ఈ సంగతులన్నీ షాగారికి చెప్పడానికి మిగిలివున్నా మనే సంతోషం మాలో."

ఇంటికి దక్షిణాన వున్న నిలువెత్తు తురాయిచెట్టు కూలిపోయింది. ఊరంతా బీభత్సంగా భీతావహంగా తయారైంది. కొండమూలంలో కాలేజీ కట్టా లనుకున్నారు. అడ్డు వచ్చిన పర్వత శిలల్ని బుల్‌డోజర్లతో కొట్టించేయాలని సంకల్పించారు- కాలేజీ నిమిత్తంగా కృషిచేసే ఘరానా పెద్దలు. "ఆయన (అరుణాచలం) దైవంలా నిలిచి అనుక్షణం అందర్నీ కాపాడుతుంటే, వాళ్ళ కృతఘ్నత చూడండి" అన్నారు షా రమణస్థానీయులతో, ఆగతులైన భక్తబృందంతో.

ఆ గాలి వుధృతానికి కొండశిఖరం నించి ఒకరాయి దొర్లిపోయి పెద్దగాడి ఏర్పడి ఆ రాళ్ళన్నీ కిందికి వొచ్చాయి. కొండ పాదం దగ్గర కాలేజీ కట్టా లనుకున్న ప్రదేశం రాతిగుట్టయి పోయింది. ఆ రాయి అటు దొర్లింది—ఇటు దొర్లితే ఈ వూరు జనం అంతా ఏమయ్యే వారో! అలా వొచ్చే ప్రమాదా లన్నింటినీ అరుణాచలేశ్వరుడు తన మీదికి తెచ్చుకుంటారు. ఈవూరి ప్రజల పాతకాలన్నీ ఆయన తీసుకున్నా రన్నమాట. ఎలా రక్షిస్తున్నారో ఈ క్షేత్రప్రజల్ని. ఈ సమస్త భూవలయాన్ని ఒడిలో బిడ్డలకి మల్లే చల్లగా అరుణాచలేశ్వరుడు.

కాశ్మీరా వాళ్ళదేశం వెళ్ళాలని నిశ్చయించుకొంది. ఆ సంగతి షాకి తెలిసేసరికి షా ఆమెని గట్టిగా warn చేశారు. "కాశ్మీరా! నువ్వు కత్తుల్లోకి దూక బోతున్నావ్! అవి నిన్ను పొడి చేస్తాయి. ఇక్కడ నీకు బాగానే వుందికదా! ఎందు కక్కడికి పోతావు?" అని. కాశ్మీరా గొప్ప చిరునవ్వుతో "అవి కత్తులు కావండీ, ప్రేమగా నన్ను ఆహ్వానించే చేతులు" అన్నది. ఆ అమ్మాయి తనలోని అమాయకత్వం వలన ప్రపంచ మంతా తనకి మల్లే అమాయకమైన దని వూహించింది.

"కాశ్మీరా! నువ్వెందుకు వెడతావ్?" అన్నారు నర్తకి, చలం గారు. కాని ఎన్నాళ్ళకో రాకరాక ఆ ప్రియుడు ఒకసారి వస్తాడు. అంతవరకూ ఈ నిరీక్షణే జీవిత మైపోతుందని ఆమె బాధ. ఆ అమ్మాయి ప్రియుని రాకకోసం—రోడ్డువైపు నిరీక్షణా దృక్కులతో చూస్తూ వుండడం ఎంత గొప్ప చిత్రమో!

ఆ జయంతికి ఎంతోమంది జనం వొచ్చారు. ఆవేళ గంగాధరం ఎన్నో కలవపూలు తెచ్చారు. ముందు పందిరిలో కలువపూలు గొలుసుగా తయారుచేసి పందిట్లో కట్టిస్తున్నారు షా. షా కలువపూలు

కట్టిస్తూ వుండగా సుధ, ఆయన భార్య, కుమార్తె, ముమ్మడమ్మ వొచ్చారు.

సుధ ఇప్పుడు చాలా కష్టాలు పడుతున్నాడు. ఈశ్వరుడిమీద ఆయనకి ఎనలేని విశ్వాసం. ఒక హిమాలయసిద్ధుడి సహాయంతో గొప్ప మందులు తయారు చేశారు. అవి ప్రచారంలోకి వొచ్చి ఇల్లు గడిచి ఎప్పటికో అప్పటికి తిరువన్నామలై వొచ్చి స్థిరపడాలని ఆయన ఆశయం. వారిలో ఆ పట్టుదల ద్విగుణీకృతమైందే కానీ ఈనాటికీ ఆ పట్టుదల పోలేదు. ఆయన మందులు ఎంతో అమోఘంగా పనిచేస్తాయి గాని ఆయనలో డాబుసరి, అట్టహాసం లేకపోవడాన అంత గొప్ప మందులూ రాణించకుండా పోతున్నాయి.

జయంతికి అందరూ గిరిప్రదక్షిణం వెళ్ళి వొచ్చారు. ఒక అత్తగారు ఆవిడ కొత్త కోడలు అరుణాచలంలోనే కొత్తగా తొలిసారిగా రమణస్థాన్‌లోనే కలుసుకున్నారు. ఆ అమ్మాయి తనకోడలు కావడం ఆ అత్తకి అవమానం. కోడలు ఆ situation ని చాలా గొప్పగా enjoy చేస్తోంది. వీలున్నప్పుడల్లా తన చిలిపిదనంతో అత్తగార్ని రెచ్చగొడుతోంది. అత్త చేతులు తిప్పుకొంటూ పడాపడా కోడల్ని తిట్టి పోస్తోంది. ఇదంతా కూడా క్లయిమాక్స్‌ని (తారస్థాయిని) అందుకుంది. ఉద్రేకాన్ని అణుచుకోలేని అత్తా, కోడలు జుట్టూ, జుట్టూ పట్టుకుని తల పడ్డారు. ఇద్దరూ కొట్టుకున్నారు. అత్తా, కోడళ్ళిద్దరూ కరి మకరి సంగ్రామం చేసి, చివరికి షా దగ్గరకి వొచ్చి గోలపెట్టారు. ఈమె ఇట్లా అంది, ఆమె అట్లా అంది అనీ.

ఆవేళనే పకపక భర్త దగ్గరకి వెడుతోంది. చిత్ర వెంట వెడుతోంది. వాళ్ళలా వెళ్ళారో లేదో షాకి పెద్ద జ్వరం వొచ్చింది. రాత్రి జ్వరంలోనే గడిచింది. అర్ధరాత్రి విపరీతమైన దగ్గూ, ఆయాసం మొద

లయ్యాయి. షా ఆయాసపడటం, దగ్గుతూ వుండటం విని చలంగారు షా గది దగ్గరకి వొచ్చారు. "ఏమిటి షా : జ్వరం, దగ్గు, వూపిరి సల పని ఆయాసం పట్టుకున్నట్టున్నాయి" అని అన్నారు. మేడమీద పడు కున్న డాక్టర్ సుధని వెంటనే వెళ్ళి నిద్రలేపి పిలుచుకుని వొచ్చారు ఇంట్లోవాళ్ళు. సుధ వొచ్చి షాకి injection ఇచ్చి వీపంతా రాస్తూ కూచున్నారు. కొంచెంసేపటికి కొంత నయమై షాకి నిద్రపట్టింది.

మరుసటిరోజు వుదయమే సుధ వాళ్ళకుటుంబం తక్కిన అతి థులు వెళ్ళిపోయారు. షాకి మామూలుగా మందు లిచ్చే డాక్టర్ వూళ్ళో లేరు. నర్తకి చలంగారితో కలిసి వెళ్ళి డాక్టర్ అ—గారికి షాకి జ్వరమని చెప్పింది. అంతకి ముందు డాక్టర్ చిట్టూరి సత్యనారాయణ గారు చలం, షా లకి రక్త పరీక్షచేయించమని చెప్పి, అ—గారి ద్వారానే ఆ పరీక్షని చేయించారు. రక్త పరీక్షలో చలంగారికి ఎసనఫిలి ఎక్కు వగా వుందని, షాకి తక్కువగా వుందనీ result వొచ్చింది. ఈశ్వరా వతరణ దినోత్సవానికి ముందునించి షాకి దగ్గు వొస్తూనే వుంది. అది జయంతికి ఎక్కువైంది. అ—గారు షాకి చలి ఎక్కువగాఉందా అని అడిగారు చలంగారిని. చలంగారు షాకి చలి ఎక్కువగానే ఉందని చెప్పేసరికి, అ—గారు షాకే ఎసనఫిలి ఎక్కువగా వుందని, అందు కోసం మందునీ, చలి అధికంగా వుంది గనక అది మలేరియల్ ఫీవర్ అని క్వైనా మాత్రల్ని ఇచ్చి పంపారు నర్తకీ వాళ్ళని. షా ఆమాత్రలు వేసుకున్నారు. ఆమెకి ఆ మందులు పడక యాసిడిటీ అధికమై డోకులు మొదలైనాయి. తిండి లోపలికి పోయేది కాదు. క్వినైన్ వల్ల తల తిరగడం మొదలైంది. రాత్రి పడుకుంటే నిద్రపట్టక కళ్ళ ముందు జూలూ డ్యాన్స్, పెద్ద పెద్ద డప్పులు మోగిపోయే చప్పుళ్ళు చెవులలో, షాకి యాసిడిటీ, జ్వరం మరుసటి రోజుకి కూడా తగ్గలేదు.

డాక్టరు అ— గారు షాని నిమ్మకాయ ముక్క కోసుకు చప్పరించి ఆ రసం మింగ మన్నారు. అలా చేసేసరికి షాకి యాసిడిటీ మరీ వుధృతమై పోయింది. అలా మూడు రోజులపాటు యాసిడిటీ, జ్వరం తగ్గనే లేదు.

కాశ్మీరా వాళ్ళు ప్రయాణం పెట్టుకున్నారు. షా కిట్లా వుందని కాశ్మీరా ప్రయాణం మానుకొంది. కాశ్మీరా షాకి నర్సులాగ సేవ చేయడం మొదలు పెట్టింది. అంతే కాకండా వంటలో నర్తకికి సాయం చేసేది. చలంగారు, నర్తకి ఇన్ఫ్లూయన్జాతో పడక వేశారు. వంట కూడా కాశ్మీరాయే చేసేది. అప్పుడు కాకా, కిట్టూ ఎంత బాగా సహాయ పడ్డారో! కాశ్మీరా ఇంటిల్లిపాదీ పడకలు వేశారని తన ప్రయాణాన్ని వాయిదా వేసుకుంది.

నాలుగో రోజు కృష్ణారావుగారు వెళ్ళి డా. శివప్రకాశాన్ని తీసుకుని వొచ్చారు. ఈవూళ్ళో డాక్టర్లలో ఆయన కొకరికే షా శరీరతత్వం తెలుసు. ఇంకే డాక్టరు మందుల వలన షా ఆరోగ్యం బాగుపడదు. చలంగారు వాళ్ళకి ఇన్ఫ్లూయంజాకి మందిచ్చి షా దగ్గరకి వొచ్చారాయన. షాని చూడగానే "ఏమిటిలా అయిపోయా" రని ఎంతో దిగులు పడ్డా రాయన. ఆయన examine చేసి షాకి బ్రోంకయిటీస్, ఇన్ఫ్లూయంజా కలిసి వొచ్చాయని తేల్చారు. "ఎందుకిట్లా అయిపోయావ్" అని షాని అడిగా రాయన.

"డాక్టరిచ్చిన మందువల్ల" అన్నారు షా.

"వాళ్ళదగ్గర ఎందుకు మందు తీసుకున్నారు?" అన్నా రాయన.

"మీరు వూళ్ళో లేరు" అన్నారు షా.

"ఏనుగు కివ్వాల్సిన dosage నీకిచ్చారా?" అని ఆయనెంతో దిగులుపడి షాకి injection ఇచ్చి వెళ్ళారు. మర్నాటికి, షాకి పూర్తిగా

అనారోగ్యం తగ్గిపోయింది. చలంగారు వాళ్ళకి కూడా జ్వరం తగ్గిపోయింది.

కాశ్మీరా ఆఖరి శలవు తీసుకోవడానికి షౌ దగ్గరకి వొచ్చింది.

"షౌ నేను మళ్ళీ మీదగ్గరకి ఎప్పుడు వొస్తానో! బహుశ నేను మనిషిగా రానేమో! పిట్టగా వొస్తానేమో" అంది కాశ్మీరా.

"లేదు * మనిషిగానే వొస్తావు కాశ్మీరా" అన్నారు షౌ. కాశ్మీరా వెళ్ళినప్పటినించి వుత్తరాలు రాస్తూనే వుండేది.

చలిగాలివల్ల ఒకరోజు లోపలే భజన చేస్తున్నారు. భజన పూర్తయిపోతూ వుండగా * వువ్వి, శ్యామల, బుచ్చి, తార అందరూ లోపలికి పరసగా ప్రవేశించారు. శ్యామల షౌని పలకరించి వెనకాల చిత్రా వాళ్ళతో మాటాడేందుకు వెళ్ళిపోయింది. ఆమె ముఖంకూడా షౌ సరిగా చూడలేదు. అప్పట్లో మిశ్రీ పసిపిల్ల. తార ఒకవైపు బుచ్చి ఒకవైపు షౌ దగ్గర కూచున్నారు. బుచ్చికి షౌని చూసి ఎంత సంతోషమో! బుచ్చి వాళ్ళని ఇక్కడ వుండ మన్నారు. "ఇక్కడ వుండకూడదా?" అని షౌ వాళ్ళని అడిగారు.

"మా కుక్కని పక్కింట్లో వొదిలిపెట్టి వొచ్చేశాం. అది బెంగ పడుతుంది వెళ్ళాలి" అంది తార.

ఎట్లాగయినా చలంగార్ని తమతో తీసుకు పోవాలని వాళ్ళపట్టు. "షౌ నడగండి" అన్నారు చలం.

"షౌ నువ్వు కూడా రారాదా! పెద్దనాన్నని మాతో తీసుకు వెడుతున్నాం" అన్నాడు వువ్వి. "నేను రాను. పెద్దనాన్న కూడా రాడు"

* మరో జన్మలోనని షౌమాటల్లో ధ్వనిని గమనించవొచ్చు.

*పాపులర్ డిటెక్టివ్ నవలారచయిత, చలంగారి తమ్ముడి కొడుకు- కొమ్మూరి సాంబశివరావు.

అన్నారు షౌ. పువ్వి చాలా సేపు ఇవి అవి ఎత్తులు చేశాడు. "చాలా పె కారు కొన్నాను. నువ్వు చూడాలి షౌ" అన్నాడు పువ్వి. షౌ అలా గే ని బైటికి కారు చూచేందుకు వొచ్చారు. అది చాలా పెద్దకారు. పువ్వి షౌకి చాలా దగ్గరగా వొచ్చాడు ఎలాగో ఒకలాగు కార్లో వేసుకుని షౌని తీసుకు పోవాలని అతని వుద్దేశ్యం గావును. పువ్వి మరీ పీల మనిషి. షౌని ఎత్తితే ఇద్దరం కలిసి కిందపడతా మని భయమేసిందిలా వుంది.

తార "పెద్దనాన్నా! మాతో రావా? షౌ నువ్వూ రారాదా? ఓ మూడు రోజులుండి తిరిగి వొచ్చేద్దువు గాని" అని బతిమాలింది, కానీ షౌ ఒప్పుకో లేదు. వాళ్ళు వెళ్ళిపోయారు. ఆ తరువాత పువ్వి వచ్చి పోతూనే వున్నారుకానీ షౌ బుచ్చిని, తారని మళ్ళీచూడ లేదు. చలం గారు వాళ్ళు తిరువన్నామలై వచ్చిన కొత్తల్లో బుచ్చి కుటుంబ మంతా వారిని చూడటానికి వొచ్చారు. ఆ తరువాత ఇదే రావడం. అప్పట్లోనే ఒకసారి పువ్వి వొచ్చి "ఎల్లుండి వొచ్చి పెదనాన్నని తీసుకు వెడతా" నని షౌతో ఛాలెంజి చేసి, సరిగ్గా దశాబ్దం తరువాత ఈ విధంగా వొచ్చారు.

ఒకరోజు షౌ తమగదిలో కూచుని వుండగా ఆమెకి భగవాన్ దర్శన మిచ్చారు.

"నేను మీ నాన్నకి సన్యాసదీక్ష నివ్వ బోతున్నాను. మరి నాకు గురుదక్షిణగా ఏమిస్తారు ?" అని అడిగారు.

అస లావిధంగా భగవాన్ చలంగారికి సన్యాసదీక్ష ననుగ్రహిస్తా ననడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. తపోదీక్షలో పాపాల్ని పోగొట్టుకొన్న, పరిపక్వమైన చిత్తం కలవాడైన యోగికి (సన్యాస) చతుర్థాశ్రమం తనంత తనే సకాలంలో కలుగుతుంది అంటారు భగవాన్.

---

"తపసాదగ్ధ పాపస్య పక్వ చిత్తస్య యోగినః
చతుర్ధ ఆశ్రమః కాలే స్వయమేవ భవిష్యతి"
(కావ్యకంఠ గణపతి మునీంద్రులు రమణగీతలో
అష్టమాధ్యాయంలో పదియవ శ్లోకం)

"అసలు నాదగ్గరే మున్నాయి, అర్పించడానికి" అను కున్నారు షౌ. నిజమే గురువు ఋణం ఏమిచ్చి తీర్చగల మనిపించింది షౌకి. అప్పటిదాకా ఈశ్వరుడు చెప్పినట్లుగా జయంతి, ఈశ్వరావతరణలు భగవాన్ స్మరణలోనే జరుపు తున్నారు. చలంగారికి కదా సన్యాసదీక్ష నిచ్చేది? "ఇంట్లో రెండు రవ్వల వుంగరా లున్నాయి. ఒకటి నాకు ఇవ్వండి" అని choose చేశారు భగవాన్. డాలీ అప్పుడక్కడే వుంది. భగవాన్‌కి అర్పించడానికి ఒకవెండి పళ్ళెం కొనిచ్చింది. సత్యనారాయణసింగ్, చక్రపాణి నరసింహారావు కొద్దిరూపాయలు శక్త్యనుసారం ఇచ్చారు.

ఆ రోజే- ఆరవ్వల వుంగరం, ఆడబ్బు, పూలు, పళ్ళు- డాలీ వెండి పళ్ళెంలో పెట్టుకుని అందరూ కలిసి ఆశ్రమానికి బయల్దేరారు. ఆకాశంలో చెదురు మదురుగా మబ్బులువున్నా అది మబ్బుపట్టిన రోజు కాదు. ఎంతో అందమైన రోజది.

రమణస్థానీయు లంతా ఆశ్రమంలో అడుగు పెట్టారో లేదో పువ్వుల జల్లులాగ,పన్నీరు చిలకరించినట్లుగా వర్షం పడింది. అప్పట్లో భగవాన్ సమాధి కడుతున్నారు, చలంగారు వాళ్ళ సమాధి దగ్గర అడుగు పెడుతున్నప్పుడు-

"నకర్మణా నప్రజయా ధనేన
త్యాగేనైకే నమృతత్వ మా నమః
తస్యాం తే సుషిరగ్ం సూక్ష్మం

తస్మి న్సర్వం ప్రతిష్ఠితం
పరేణ నాకం నిహితం గుహాయాం
విభ్రాజతే తద్యతయో విశంతి."

అనే వేదశిఖా విభాగం చదువు తున్నారు విప్రులు. అందర్నీ ఆ సమాధి చుట్టు ప్రదక్షిణం చేయమన్నారు ఆశ్రమపూజార్లు. ప్రదక్షిణం చేసి చలంగారు సమాధిముందు మోకరిల్లు తుండగా వేదపారాయణంలో-

"వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థా
స్సన్యాస యోగాద్యతయ శ్శుద్ధసత్వాః"

అన్న పదం చదువు తున్నారు వటువులు. ఆ తరువాత భగవాన్ కివ్వదలచిన గురుదక్షిణని సమర్పించారు చలంగారు.

అంతకి మునుపే ఈశ్వరుడు "ఇత డన్నిటినీ త్యజించినా వేషం మారదు" అన్నారు చలంగురించి చెబుతూ.

ఈశ్వరుడు వొచ్చిన కొత్తలో చలంగారు తాము గెడ్డం చేసుకుంటూ వుంటే చర్మానికి కత్తి తగిలినప్పుడు షాక్‌లాగ అనిపిస్తూవున్నదని ఈశ్వరుడికి చెప్పారు. అప్పుడు చలంగారిని గెడ్డం పెంచుకో మన్నారు ఈశ్వరుడు.

"నాకు గెడ్డం అంటే అసహ్యం" అన్నా రాయన.

"వీలున్నంతవరకూ చర్మానికి తగలకుండా జుత్తుని కత్తిరించుకో" అన్నారు ఈశ్వరుడు.

"నీవు సర్వసంగ పరిత్యాగం చేసినా వేషం మార్చవు. మాంసం, చేప, కోడి అన్నీ తింటావు. ఎవరేం పెడితే అవి తింటావు" అని ఈశ్వరుడు చలంగారికి ఆ రోజుల్లోనే చెప్పారు.

అసలైన సన్యాసం కాషాయవస్త్రాలు ధరించడం కాదు. ముండనమూ కాదు. పరిశుద్ధజ్ఞానమే సన్యాసము. కొన్ని ప్రతిబంధకాలని నివారించే నిమిత్తంగానే సన్యాసాశ్రమ స్వీకారం ఏర్పడింది అంటారు భగవాన్ స్వయంగా కార్ష్ణియొక్క ప్రశ్నకి సమాధానం చెబుతూ రమణ గీతలో—

"సన్యాసో నిర్మలం జ్ఞానం
న కాషాయో న ముండనం
ప్రతిబంధక బాహుళ్య
వారణా యాశ్రమో మతః"
(రమణగీత—కావ్యకంఠ గణపతిముని కృతమ్)

ఆ విధంగానే భగవాన్ "అతను వేషం మార్చుకో నక్కర లేదు. ఇప్పుడు సన్యసించ వలసిన సమయం వొచ్చింది కనక నేను చెప్పాను" అని షాకి చెప్పారు. అంతకి ముందు నించే ఆయనకి లోకం పట్టేదికాదు. అప్పటి నించీ చలంగారికి లోకము ఇంకా దూరమవు తోంది.

మేడమీద గది కట్టించాక మామ్మగారు ఇక్కడే వున్నారు. ఆ రోజుల్లో షా, మామ్మగారు కలిసి షికార్లకి వెళ్ళేవారు. చలంగారు ఎండ వేడికి తట్టుకోలేక ఆరుగంట లయ్యాక బయల్దేరి వెళ్ళి వాళ్ళని కలుసుకునే వారు. ఆప్పటిదాకా మామ్మగారు షా ఇంటివెనక మైదానంలో కూచుని వుండేవారు. సూర్యుడు పడమట కుంకుతో వుండేవాడు. ఆమె షాని ఏదో ఒక ఆధ్యాత్మిక ప్రశ్న వేసేవారు. దాన్ని షా వివరించి చెబుతూంటే శ్రద్ధగా తదేక ధ్యాసతో వింటూ వుండేవారు. మామ్మగారు చలంగారికి గడియారం అని పేరుపెట్టారు. షా సరిగ్గా ఇంటికి వెళ్ళవలసిన సమయానికి చలంగారు వొచ్చి వారిని కలుసుకునే వారు—

ఆ పెద్ద పచ్చని మైదానంలో, ఆసంధ్యా కాంతులలో వారిరువుర్నీ చూడటం చలంగారికి ఎంత ఇష్టమో! ఎంత పిక్చరస్‌గా కనవడుతుందో ఆదృశ్యం అనేవా రాయన.

ఒకసారి రమణస్థానీయు లంతా రోడ్డుకి అటువైపు కొండ దగ్గర గడ్డిలో కూచున్నారు. వారికి ఎదురుగా రమణ భక్తు లొకరు వొస్తున్నారు. ఆయన చాలాపొడుగ్గా సన్నంగా వున్నారు. దానికి తోడు చేతులలో ఒకకఱ్ఱ వుంది.ఆయన నడక గడ్డిలో గొల్లభామలా ఎగురు తున్నట్లుంది. ఆయన అల్లంత దూరాన వుండగానే, ఆయన నడకని చూస్తూ చీరకొంగు నోట్లో కుక్కుకుని నవ్వడం మొదలు పెట్టారు; మామ్మగారు. షౌ మామ్మగారు అలా నవ్వడం ఎన్నడూ చూడలేదు. ఆయనకి గొల్లభామ అనిపేరు పెట్టామని షౌ మామ్మగారికి చెప్పారు. "అవునమ్మా ఆయన సరిగ్గా అట్లానే వున్నారు" అన్నారు మామ్మగారు.

చిన్నారావుగారు సౌరిస్ చిన్నతనంలో స్మృతులన్నీ కలబోస్తూ "మీరు కాలవకి వెళ్ళి చేపలు పట్టేవారు కదూ" అని షౌని అడిగారు. అప్పుడు షౌ "ఔను" అన్నారు.

"చేపల్ని ఏం చేసేవారు" అని ప్రశ్నించారు ఆయన. మామ్మగారు ఈసంభాషణని కళ్ళప్పగించి వింటున్నారు.

"పట్టిన చేపల్ని తెచ్చి మానీళ్ళ కుండులో వేసేవాళ్ళం. ఆచేపల్ని తినేవాళ్ళంకాదు. కానీ వేరేచేపలు, మాంసం బజార్లనించి తెప్పించుకుని తినేవాళ్ళం" అన్నారు షౌ.

మామ్మగారు కొంచెంసేపు నిశ్చలంగా చూశారు. కొద్ది క్షణాలాగి "ఆ! అవన్నీ పోయిన జన్మలో వాసనలు అయ్యుంటాయి. అవి ఈజన్మలోకూడా వొచ్చి వుంటాయి" అన్నారు ఒక్కమాటతో తేల్చేస్తూ.

ఇంక 'మణి' వొచ్చింది. ఆమె షౌచేత ఎంకిపాటలు పాడించు కుంది. మామ్మగారు గదిబైట కూచుని ఆపాటల్ని వింటున్నారు. అవన్నీ విన్నాక "ఎంకి పాటలంటే ఏమిటమ్మా" అని షౌని అడిగారు మామ్మగారు.

"ఒక గొప్ప ఆధ్యాత్మిక సత్యాన్ని ఇద్దరు నాయికా నాయకుల్ని సృష్టించి, వాళ్ళద్వారా తెలిపిన పాటలే ఎంకి పాటలు" అన్నారు షౌ. అలా అనేసరికీ చాలా అర్థం అయినట్లు తలూపారు మామ్మగారు.

మామ్మగారు వొచ్చింది తెలుగుదేశంలోని గోదావరీ తీరంలో మారుమూల వున్న పల్లెటూరి నించి. ఆమె ఘోషాలో పెరిగినవారు. కానీ ఎంత సంస్కారమో! ఎంత ఔన్నత్యమో! ఆమెలో. ఎన్ని **modern idias** యో ఆమెకి. ఏ పరిస్థితి వొచ్చినా దాన్ని సానుభూతితో అర్థం చేసుకుని తీసుకోగల రామె. కానీ ఎవరన్నా అసభ్యంగా ప్రవర్తించారా ఒక్క చూపుతో, నాలుక వాడితో ఒక చురక అంటించేవారు. ఆ చురక తిన్నవాళ్ళు కోపం తెచ్చుకునేవారు కారు. ఆమె ముందు నమ్రతతో తలవొంచే వారు.

ఇంతట్లో ఒకరోజు మధ్యాహ్నం పెద్ద కంఠంతో ఒకరు- "ఈ గదిని కట్టించిన వారెవరు? ఎక్కడున్నారు?" అని అరిచారు. నర్తకీ వాళ్ళు బైటికి వొచ్చారు. వొచ్చినవారు ఆజానుబాహువు. ఎంత పెద్ద ఆకారమో. చేతిలో పొన్నుకర్ర- అందరూ ఆయనని ఆహ్వానించి లోపలికి తీసుకుని వొచ్చారు. మామ్మగారు చెంబునీళ్ళతో బైటికి వొచ్చారు. వొచ్చినవారే మామ్మగారి పతిదేవులు.

ఆయనని పైకి తీసుకుని వెళ్ళి తాము కట్టించిన గదిని చూపించారు మామ్మగారు. "ఈ గదేమిటి? ఈ కిటికీ లేమిటి? ఆడంగులు ఈ కిటికీల్లోంచి బైటికి కనబడరా?" అని విమర్శించా రాయన.

ఆయనని చలంగారి దగ్గరకి తీసుకుని వెళ్ళారు మామ్మగారు. చలంగార్ని చూసి "ఇక్కడ మీకెంత పెద్దపేరో నాకు అక్కడ అంత పెద్దపేరు" అన్నారు గర్వంగా.

"అక్కడ మీకు పేరుందేమో గాని నా కిక్కడ ఏ పేరు లేదండి" అన్నారు చలంగారు నిర్లిప్తంగా. మామ్మగారు ఆయనని ఆశ్రమానికి, గుడికి తీసుకుని వెళ్ళారు. వారు మామ్మగార్ని తమతో ఇంటికి పదమన్నారు. భర్త అనుజ్ఞ తీసుకుని రమ్మన్న శాస్త్రధర్మానికి షౌ కట్టుబడ్డారని ఆయనకి సంతోషం.

ఇక్కడినించి వెళ్ళేరోజున మామ్మగారు కొత్తగా అత్తవారింటికి వెళ్ళే ఆడపిల్లలా దుఃఖపడ్డారు. "ఇదే నా పుట్టిల్లు. ఇక్కడికితప్ప నా పుట్టింటికికూడా ఎంత పిలిచినా నేను వెళ్ళను" అని చెప్పి మరీ వెళ్ళారు మామ్మగారు.

శ్రీరమణస్థానానికి ఈశ్వరుడు సంతరించిన అందాలలో మామ్మగారి నిండైన వ్యక్తిత్వం ఒక టనిపిస్తుంది నాకు.

## 28

రమణస్థాన్‌లో ఒక కుక్కపిల్ల వుండేది. దాన్నెప్పుడో పిచ్చి కుక్కలు కరిచాయి కాబోలు ! మెల్లిగా దానికి పిచ్చెక్కింది. మొట్ట మొదట్లో అది పిచ్చి ఎత్తినట్లు కనబడేది కాదు. నిశ్శబ్దంగా ఓ మూల పడుకునేది. షౌకి అది పిచ్చిదని అనుమానం తోచి ఆ కుక్కని కట్టెయ్యండి అని చెప్పారు.

ఎవరికీ అది పిచ్చిదని ఈషణ్మాత్రమైనా అనుమానం లేదు. "ఆ కుక్కపిల్లని ఎవరూ ముట్టుకోవద్దు" అన్నారు షౌ. అంతదాకా నర్తకి వెళ్ళి ముట్టుకుంటోంది. తరువాత నర్తకిని కూడా జాగ్రత్తగా ముట్టుకోమని చెప్పారు షౌ. ఆ రాత్రి పెద్దవాన వచ్చింది. నర్తకి

దాన్ని తీసుకునివెళ్ళి వెనకాల కట్టేసింది. "నర్తకీ ఇంక దాన్ని ముట్టుకోవద్దు" అని గట్టిగా చెప్పారు షా. ఇంకా పెద్దవాన కురిసింది. తెల్లవారగట్ల ఆ కుక్కపిల్ల అదేపనిగా అరుస్తోంటే చలంగారు వెళ్ళి దాని గొలుసు విప్పేసి ఇంటిముందు కట్టెయ్యడానికి తీసుకు పోతున్నారు. చలంగారికి జంతువుల్తో ఎన్నడూ సంబంధం లేదు. అవి ఆయనకి అర్థం కావు. ఇక్కడ ఎన్నో కుక్కలకి పిచ్చిపట్టినా అవెంత పొగరుమోతులైనా, పళ్ళుకూడా చూపించేవి కావు. ఆ కుక్కని తీసుకు వెడుతుండగా ఆ గొలుసు చలంగారి కాళ్ళకి చుట్టుకుంది. ఇంక అది ఎటూ పోలేక చలంగార్ని కరవాల్సి వొచ్చింది.

చలంగారి పాదంమీద గాట్లు పడ్డాయి. వెటర్నరీ డాక్టర్ని పిలిచి ఆ గాట్లని చూపించితే— ఆయన గాట్లు పడ్డాయి కనక తప్పకండా **injections** చేయించుకోవాలి అన్నారు.

"షా నేనా **injections** ని తీసుకో లేను. అవి చాలా బాధపెడతా యిట. నా ఒళ్ళు తట్టుకోలేదు" అన్నారు చలంగారు.

"నీకేమీ కాదన్న విశ్వాసం నీలో వుంటే ఇంజక్షన్లు తీసుకోనక్కరలేదు" అన్నారు షా. ఆయన అట్లాగే ఇంజక్షన్సు తీసుకోలేదు. వజీర్ వాళ్ళంతా చాలా గాభరా పడిపోయారు. నర్తకికి మాత్రం చిన్నచిన్న విషయాల్లో ఈశ్వరవాక్కుపట్ల విశ్వాసం లేదు కాని పెద్దపెద్ద విషయాల్లో ఎంత బలంగా విశ్వాసంతో నిలుచునేదో! ఈశ్వరుడు చలంగారికి ఇంజక్షన్లు తీసుకోకపోయినా ఏమీకాదంటే బలంగా విశ్వసించింది. మిగిలిన వారంతా హడలి పోతున్నారు. అప్పుడు ఇక్కడే వుంటున్న చిన్నారావుగారు చలంగారి దగ్గరకి వొచ్చి ఒకటే ఏడ్చారు.

"మాష్టారూ నిజంగా ఇంజక్షన్లు తీసుకోరా! తీసుకోండి" అని; వువ్వి మద్రాసునించి వొచ్చారు.

"ఏమిటి పెదనాన్న నువ్వు ఇంజక్షన్లు తీసుకోవాల్సిందే నీ కెందుకు భయం" అన్నాడు వువ్వి.

"ఈశ్వరుడు అవసరం లేదన్నారు, నేను తీసుకోను" అన్నారు చలంగారు.

వువ్వికి కూడా ఏడుపు వొచ్చింది,

చివరికి చిన్నారావుగారు ఏడ్చి బతిమాలి చలంగార్ని హోమియోపతిలో హైడ్రోఫోబిన్ అనే మందు వుంది. అది వేసుకో మన్నారు. అట్లానే చలంగారు ఆ మందు వేసుకుంటున్నారు. ఆ మందు వాడడంతో చలంగారికి B. P. పెరిగిపోయి చాలా గట్టి reactionsవొచ్చేవి. ఒక్కోసారి గుండె తట్టుకోలేనంత తీవ్రంగా reactions వొచ్చేవి. లోపల్నించి అణుచుకోలేనంత వుధృతమైన ఆవేదన పుట్టుకొచ్చేది.

"ఈ మందు ధాటికి నువ్వు తట్టుకో లేవు. వెళ్ళి ఇంజక్షన్లు తీసుకో" అని చెప్పారు షా.

కుక్క కరిచి నెలరోజులు గడిచే పోయింది, కానీ ఈశ్వరుడు చెప్పారు గనక చలంగారు రోజు నర్తకితో కలిసి ఆసుపత్రికి వెళ్ళి ఇంజక్షన్లు చేయించుకునేవారు.

ఆస్పత్రిలో నర్సులకి చలంగారు ఆస్పత్రికి వొస్తే భలే సంతోషం. అంతా చేరి చలంగార్ని చూసి గంతులు వేసేవారు.

"బొడ్డు చుట్టూ ఇంజక్షన్లు. నాకు నొప్పే వెయ్యలేదు. ఆ ఇన్జక్షన్లు ఇచ్చే అమ్మాయికి నన్ను చూస్తే చాలా ముద్దు. నన్ను 'నాబేబీ' అని పిలిచేది. ఎక్కడ నెప్పి పెడుతుందో నని ఎంతో నాజూకుగా తానూ బాధపడుతూ ఇచ్చేది. ఈశ్వరుడు ఏమాత్రం నెప్పి లేకండా చేశారు.

"నేను చూస్తానుగా" అన్నారు. అట్లాగే నెప్పి లేకండా చూశారు. (నాగేశ్వరరావుగారికి చలంగారి లేఖ 4-10-66)

ఇంజక్షన్లు చేయించు కోవడం పూర్తయినాక చలం చాలా డీలా పడిపోయారు. ఆయన ఎంత డీలాపడిపోయారంటే ఇక్కడితో ఆఖరై పోతారా అన్నంతగా డీలా పడిపోయారు.

"నేనిక బతకను షౌ. అంతా అయిపోయింది" అనేవారు చలంగారు దిగులుగా.

దాంతో చిన్నారావుగారు అందరూ తలలు వొంచుకుని దిగులు పడేవారు. చలంగారికిక కాయగూరల భోజనం సయించేది కాదు. "ఇంక నేనీ కాయగూరలు తినలేను షౌ! చూస్తూంటేనే అసహ్యం పుడుతోంది. మాంసాహారం తినాలని వుంది." అన్నారు చలంగారు.

"మరి నువ్వు సాధన చేస్తున్నావు కదా?" అన్నారు షౌ.

"షౌ నాకు సాధన వొద్దు ఏదీ వొద్దు అదిలేని తిండి అంటేనే డోకు పుడుతోంది" అన్నారు చలం.

ఇంకేముంది చేపని తెప్పించి వొండించారు షౌ. షౌ తనకి అసహ్యం కావడాన ఆవంటల్ని ఇంట్లోకి రానిచ్చేవారు కారు.

చలంగారు ఆరుబైట షెడ్డులోనే మడిగా తమభోజనాలు సాగించేవారు. నర్తకి పిల్లలూ అంతా అక్కడే చేరేవారు. అప్పటినించి ఇప్పటివరకూ చలంగారు మత్స్యావతారాన్ని ఆరాధిస్తూనే వున్నారు.

నర్తకి రోజూవెళ్ళి మెర్స్టన్‌కి ఇంజక్షన్ ఇచ్చి వొచ్చేది. మెర్స్టన్‌కి వ్యాధి ఎక్కువై పోయింది. ఓపిక వున్నన్నాళ్ళూ భజనలకి వొచ్చేది. ఓపిక తగ్గినప్పుడు తన ఇంటోంచే వినేది. ఏరోజన్నా భజన వినపడకపోతే — "నిన్న సౌరిస్ భజన చేయలేదు. ఒంట్లో బాగాలేదా?" అని అడిగేది. ఆవిడకి ఆఖరిరోజుదాకా భజన్లమీద గొప్ప పట్టు వుం

దేది. ఒకరోజు మెర్‌స్టన్‌ని "నువ్వొక నర్సుని పెట్టుకోరాదా?" అని అడిగింది నర్తకి.

"నాకెవరూ అక్కర్లేదు, రాంనాథ్ వున్నాడు. నువ్వున్నావు. ఎవరో ఇంకెందుకు?" అన్నది మెర్‌స్టన్.

ఒక్కొక్కప్పుడు నర్తకి వెడితే మెర్‌స్టన్ రక్తం మడుగులో పడుకుని వుండేది. నర్తకి అదంతా శుభ్రంచేసి వేరే బట్టలు కట్టి, సొంత బిడ్డలుకూడా చెయ్యని సేవ ఆమెకి చేసింది. ఒక్కొసారి మెర్‌స్టన్‌కి క్యాన్సరు పుండునించి కండలు కండలుగా రక్తం పడేది. అది ఎంత బాధో! "excuse me" అని నర్తకికి చెప్పి ఆ బాధ భరించలేక గట్టిగా అరిచేసేది. తాను జీవితంలో చేసిన పనులన్నీ నర్తకికి చెప్పుకునేది. చివరికి నర్తకి ఆమెకొక companion అయిపోయింది. ఒకరోజు మెర్‌స్టన్ నర్తకిని "నువ్వు ముసలిదానివైతే నీ సంగతి ఎవరు చూస్తారు? నువ్వేమయి పోతావు?" అని అడిగింది.

"సౌరిస్ వుందిగా" అంది నర్తకి.

"నువ్వు ఎవరిని నీవాళ్ళని అనుకున్నా లాభం లేదు. ముసలితనం వొస్తే చాలా కష్టం. అది నీకు తెలియదు. అందుకని నీకొంత డబ్బు రాసివ్వబోతున్నాను" అంది మెర్‌స్టన్.

"ఆ డబ్బు తీసుకోమంటావా, షా?" అని నర్తకి షాని అడిగింది.

"తప్పకుండా తీసుకో" అన్నారు షా.

నర్తకికి చలంగారిమీద గట్టిపట్టు. ఏవయినా తగవులు వొస్తే "షా నేను నాన్నకోసం వుంటున్నాను. ఏ వ్యాధినైనా నేను భరించగలను గానీ నీ కోపాన్ని మాత్రం నేను భరించలేను" అనేది నర్తకి షాతో.

చలంగారి తదనంతర కాలంలో నర్తకి తమతో వుండగలుగుతుందో లేదో నని షౌకి అప్పట్లో సందేహం.' నర్తకి తనంత తాను స్వతంత్రంగా బతక గలదు. అది నిస్సందేహమే. కానీ షౌకి ఆమెని రిక్తహస్తాలతో నిరాధారంగా లోకంలోకి పంపించడం ఎంతమాత్రం ఇష్టం లేదు. ఇక్కడ వుండడం ఇష్టంలేక నర్తకి లోకంలో జీవించడానికి వెళ్ళడమే సంభవిస్తే తమ దగ్గరున్న దాన్లోంచే ఆమెకి కొంత ఏర్పాటు చేయా లనుకునేవారు షౌ. అందువల్లనే నర్తకికి మెర్‌స్టన్ చేస్తానన్న సహాయాన్ని అనుమతించారు షౌ.

కానీ ఇప్పు డాసమస్య 'చే' పుణ్యమా అని తీరిపోయింది. చలంగారి తరువాతే కాదు- షౌ తదనంతరానకూడా ఇంట్లోవాళ్ళకి ఏవిధమైన డబ్బు చిక్కులూ లేకండా చేసింది- చే.

మెర్‌స్టన్ సహాయాన్ని అంగీకరించిన ఆ రోజు నించి షౌ నర్తకిని చెక్కడం మొదలు పెట్టారు. షౌ నర్తకిని అననిమాట లేదు. నిష్కారణంగా పడాపడా తిట్టేవారు. ఎందు కావిధంగా జరుగుతోందో షౌకే తెలియదు. నర్తకి కూడా ఆశ్చర్యపోయింది— "నన్ను డబ్బు తీసుకోమంది షౌ— కాని ఇలా నన్ను పట్టుకుని వుత్త పుణ్యాన మాటలంటోంది" అని. ఆ తరువాత అప్పుడు షౌ నర్తకిని కావలించుకుని దగ్గరగా తీసుకుని "నర్తకి నువ్వు దేంట్లో (ఐశ్వర్య దౌర్భాగ్యం) పడబోతున్నావో నీకు తెలియదు. దాన్నించి నిన్ను రక్షించడానికే ఇదంతా చేస్తున్నాను" అని మళ్ళీ ఆమెని వరసగా నాలుగు రోజులు చిత్రికి పట్టారు. అందరూ నర్తకికి డబ్బు వచ్చిందని సంతోషిస్తున్నారు. కానీ షౌ మాత్రం నర్తకిని అదేపనిగా కేకలు వేస్తున్నారు. అది ఎవరికీ అర్థంకాని సంగతి.

ఐశ్వర్యలాలసలో అంతఃకరణాన్ని ధూళిలో పారేసుకునే నీచ స్థితికి పతనం కాకండా షౌయే నర్తకిని కాపాడారు. ఈనాటిదాకా కాపాడు తున్నారు.

ఒకరోజున చలంగారు తమ తలంతా దిమ్మెత్తి పోయిందని షౌతో అన్నారు. అప టికే ఆయన కాళ్ళూ చేతులకి శక్తి తగ్గిపోయింది. మూతి కొద్దిగా వంక పోయింది. కన్ను ఓవైపుకి వెళ్ళిపోయింది. మాట ముద్దగా అయి యింది. షౌ ఆయనకి విభూతివేసి తలమీద చెయ్యి వేశారు. ఆ వుదయమే చలంగారు నర్తకితో కలిసి డాక్టరు దగ్గరకి వెళ్ళారు. డాక్టర్ చలంగారికి పెరాలటిక్‌స్ట్రోక్ అనీ, B. P. ఎక్కువ కావడం వలన ఈ స్ట్రోక్ వొచ్చిందని అన్నారు. ఈ సంగతిని చలంగారు ఇంటికి వొచ్చాక షౌతో చెప్పారు. "నీకెందుకు గొడవ, అదే తగ్గిపోతుంది" అన్నారు షౌ. చలంగారికి B. P. తగ్గేందుకు కాళ్ళుచేతులు స్వాధీనం అయ్యేందుకు డాక్టర్ మందులు ఇచ్చారు.

చలంగారి వొంటికి పావురాల రక్తం పూయడం, మాంసం పెట్టడం మంచిదని సారంగపాణి చెప్పారు. అంచాత నర్తకి పావురాల నెత్తురు చలంగారి వొంటికి పూసి, ఆ మాంసాన్ని వొండి పెట్టేది. చలంగారు- పసిమివన్నె శరీరంమీద ఎర్రటి నెత్తుటి పూతతో ఎంతో భయంకరంగా కనిపించేవారు. దానికి తోడు అప్పుడప్పుడు తీవ్రంగా వొచ్చే మందుల రియాక్షన్‌ను తట్టుకోలేక "ఓ" అని గట్టిగా అరిచేవారు. వినేవారికి ఆ అరుపు గుబులు పుట్టించేది. ఆ భీకరాకృతితోనే డాక్టరు దగ్గరకి వెళ్ళేవారు చలంగారు. అందరూ ఆయన్ని ఆశ్చర్యంగా చూసేవారు 'ఏమిటీ విడ్డూర మని'. పకపకా వాళ్ళు ఆదుర్దా పడతారని వాళ్ళకి చలంగారి అనారోగ్యం సంగతి తెలియనివ్వలేదు షౌ. చలంగారికి బాగా తగ్గాక వాళ్ళకి తెలిపారు. వాళ్ళు వొచ్చి చలంగారిని చూసి కొద్దిరోజు లుండి వెళ్ళిపోయారు.

ఒకరోజు రాత్రి భజన అయ్యాక చలంగార్ని చూడటానికి డాక్టరు వొచ్చారు. చలంగార్ని పరీక్షించి "ఇది చాలా ప్రమాదకరమైన వ్యాధి. చాలా జాగ్రత్తగా వుండాలి. ఇంకోసారి గనక stroke వొస్తే control చెయ్యడం కష్టం. అందుచాత ముందుజాగ్రత్త కోసం వీర్ని ఏ మద్రాసో, వేలూరో తీసుకుని వెళ్ళి వైద్యం చేయించడం మంచిది" అన్నారు డాక్టర్.

చలంగారు అరుణాచలాన్ని, సౌరిస్‌ని వొదిలి ఎక్కడికి పోరు కనక ఇంక వేలూరు, మద్రాసు వెళ్ళి వైద్యం చేయించుకోవడం జరగని సంగతి.

"అయితే మళ్ళీ stroke రాకండా వుండాలంటే ఏ విధమైన precautions తీసుకోవాలి" అని అడిగారు షౌ.

"ఎంత జాగ్రత్తగా precautions తీసుకుని మందులు వాడుతున్నా ఏదో చిన్న కారణానికికూడా హఠాత్తుగా rise కావడం B. P. లక్షణం. అలా rise అయి ఇంకో stroke వొస్తే నేనేం చేయలేను. అందుకే మద్రాసో, వేలూరో తీసుకు పొమ్మంటున్నాను" అన్నారు డాక్టరు.

వైద్యంకోసం ఆయనని మేము ఎక్కడికి తీసుకు పోబోవడం లేదు. మాకు మీ వైద్యంమీద నమ్మకంవుంది. మీరే మందు ఇవ్వండి" అన్నారు షౌ,

"నేను పూర్తిబాధ్యత తీసుకో లేను" అన్నారు డాక్టరు.

"మీరు ఏ బాధ్యతా తీసుకో నవసరం లేదు, మీరు మందిస్తే చాలు. తక్కిన సంగతంతా నేను చూసుకుంటాను" అన్నారు షౌ.

"అట్లాగయితే నాకేమీ అభ్యంతరం లేదు, తప్పకండా మందు లిస్తాను" అన్నారు డాక్టరు.

ఆ విధంగానే డాక్టరు మందు లిస్తున్నారు. సౌరిస్ చలంగార్ని కంటికి రెప్పలా కాపాడుకుంటూ వొచ్చారు. షౌ చలంగారికి ఈశ్వరుడు వొచ్చినప్పటినించి రోజు కొకసారి మాత్రమే విభూతి వేసేవారు. ఈ పెరాలటిక్ స్ట్రోక్ వొచ్చాక రోజుకి నాలుగైదుసార్లు విభూతివేసి చలంగారు అనారోగ్యాన్నీ, బలహీనతనీ తట్టుకుని నిలబడేశక్తిని ఇవ్వడం మొదలు పెట్టారు సౌరిస్. రాత్రులకి రాత్రులు మందులవల్ల వొచ్చే రియాక్షన్లబాధతో చలంగారు నిద్రపట్టక జాగరణ చేస్తూ వుండిపోయేవారు. అప్పుడు షౌ వారికి గ్లూకోజ్ ఇస్తోనో, తలమీద చెయ్యివేస్తోనో ఆయనపక్కనే రాత్రంతా మెలకువగా కూచునే వారు. నర్తకిని rest తీసుకోమని చెప్పి, చలంగారికి రాత్రిళ్ళు ఇవ్వాల్సిన మందులన్నీ షౌయే ఇచ్చేవారు. “వెళ్ళి పడుకో, షౌ” అని చలంగారు చెబుతున్నాగానీ షౌ అలాగే చలంగారి పక్కనే కూచుని, ఆయనకి ఓదార్పుని, శక్తిని ఇచ్చేవారు. ఆయనకి నిద్ర పట్టాక తమగదికి తిరిగి వెళ్ళేవారు. నర్తకికి మాత్రం షౌ కటాక్షం వలన ఏ అనారోగ్యాలూ, చలంగార్ని ఏమీ చేయలేవని బలమైన విశ్వాసం.

ఇంతట్లో జలంధర్ నించి కామేశ్వరి హఠాత్తుగా వొచ్చింది. అప్పుడే కాదు. కామేశ్వరి ఎప్పుడు వొచ్చినా ఒకమెరుపు తీగ మల్లే వొస్తుంది– వున్న కాసేపు చుట్టూవున్న వాతావరణాన్ని గొప్ప సందడితో నింపి వొచ్చినంత డ్రమెటిక్‌గానూ వెళ్ళిపోతుంది. కామేశ్వరి కూడా చలంగార్ని **examine** చేసి “ఇది నయమయ్యే వ్యాధికాదు. ఈ **stroke** నించి ఆయన **recover** కావడం కష్టం. వున్నట్టుండి ఆ **B.P.** అమాంతంగా ఎక్కిపోతే బ్రెయిన్‌లో ఏ నెర్వో (**nerve**) పగిలిపోతుంది. ఇంక చెప్పాల్సిన దేముంది షౌ! ఇలా నువ్వు ప్రతిక్షణం కనిపెట్టి చూసుకుంటున్నావు, లేకపోతే” ........ అని కామేశ్వరి డాక్టరుగా ప్రొగ్నొసిస్ చేసింది,

ఇక కామేశ్వరి చలంగారిని ఎంతో ముద్దు చేసేది. అప్పట్లో చలంగారి పుస్తకాలలో గొప్పతనాన్ని గురించి షికార్లలో ఒకటే కబుర్లు చెప్పేదామె. ఆమె మాట్లాడు తుంటే ఎవరూ బోర్‌గా ఫీల్ అయ్యేవారు కారు. కారణ మేమంటే ఆమె వాగ్ధోరణి గంగాప్రవంతిలా అందరికి హాయిని గొలిపేది. అంత ఎక్కువగా మాట్లాడేది కనుక ఆమెని 'వాగుడుకాయ' అని పిలిచేవారు షా.

రానురాను డాక్టరిచ్చే మందులు చలంగారి వొంటికి పడక చాలా ఎక్కువగా **reactions** వొచ్చేవి. దాంతో చలంగారు తాము మందుల్ని వేసుకో లేమని డాక్టర్‌కి చెప్పేశారు. డాక్టర్ రోజూ వొచ్చి చలంగారి **B.P.** కౌంట్‌ని చూచి వెళ్ళేవారు.

"మందులు వేసుకోకపోతే మీఆరోగ్యం ఎట్లా బాగుపడుతుంది?" అన్నా రొకరోజు డాక్టర్ చలంగారితో.

"బాగుపడక పోతే పడకపోయింది నే నీమందులు మాత్రం వేసుకో లేను" అన్నారు చలంగారు.

"అయితే నేనేం చెయ్యను?" అన్నారు డాక్టరు.

"ఏమీ చెయ్యొద్దు. నా బాధ నేనే పడతాను" అన్నారు చలంగారు.

"పోనీ ఈమందులు మీకు పడకపోతే మీకు సరిపడే వేరేమందు ఇస్తాను. వేసు కుంటారా?" అని అడిగారు డాక్టర్. షా అప్పుడు తమ గదిలోనే వున్నారు. చలంగారు డాక్టరుగారు చెప్పినట్లుగానే మందు వేసు కుంటా మన్నారు. డాక్టరుగారు, కామేశ్వరి బైటికి వొచ్చారు. ఆడాక్టర్ కామేశ్వరితో రహస్యంగా "ఏముందండీ, ఈమందే లేబిల్ మార్చి ఇస్తాను. ఆయన దంతా సైకలాజికల్" అన్నారు.

"డాక్టర్! మీరు పొరబడు తున్నారు ఆయనది ఎంతో గొప్ప ఇంటలెక్ట్. ఆయన గొప్ప జీనియస్. మీరు చేసినపనిని ఆయన తెలు

సుకో లేరను కోకండి. అట్టాంటి పనులు చెయ్యకండి" అని ఆడాక్టర్ని మందలించింది కామేశ్వరి. ఆతరువాత కామేశ్వరి పదిరోజు లుండి వెళ్ళిపోయింది.

ఈలోపుగా చలంగారికి పెరాలటిక్‌స్ట్రోక్‌వల్ల వొచ్చిన వంకర లన్నీ తగ్గిపోయాయి. ఒక్క రాతమాత్రమే కొంచెం కష్టంమీద రాసే వారు, కాని దస్తూరి బాగానే వుండేది.

**B.P.** ఎక్కువైనప్పుడు మాత్రం చలంగారి తలకి **congestion** వొచ్చేది. అలా వొచ్చినప్పుడు డాక్టర్ ఒకమందు నిచ్చేవారు. ఆ మందువల్ల మాత్రం చలంగారికి **reactions** వొచ్చేవి కావు. ఆ మందొకటే ఇంట్లో వుంచమన్నారు షౌ. సాధారణంగా చలంగారికి నర్తకో సౌరిస్సో దగ్గరుండి మరీ మందులు ఇచ్చేవారు ఒకరోజు ఆయన బుద్ధికి ఏంతోచిందో ఏమోగానీ మందుల సొరుగుతీసి ఆమందు అవసరం లేకపోయినా వేసేసు కున్నారు. నీరసమనిపించిందో ఏమో మంచంమీద పడుకున్నారు. నర్తకి ఈ సంగతిని పరిగెత్తుకుని వొచ్చి షౌకి చెప్పింది. షౌ వొచ్చేసరికి చలంగారు బాగా వీక్‌గా వున్నారు. **pulse** కూడా వీక్ అయిపోయింది. వెంటనే డాక్టర్‌కి కబురంపించారు షౌ. డాక్టర్ వొచ్చి "**B.P.** చాలా **low** అయిపోయింది. ఆయనకి వుప్పు బాగా పెట్టేసెయ్యండి" అన్నారు.

అప్పుడప్పుడు మందులవల్ల చలంగారికి **B.P. down** అయిపోయేవి. కొంచెం విశ్రాంతి తీసుకుంటే అదంతటదే సర్దుకుని పోయేది. ఇదంతా మందులవల్ల జరిగినట్లు షౌ చూపించారు కానీ అదంతా **heal** చేసి చలంగార్ని బతికించినది సౌరిస్సే.

1974వ సంవత్సరం జూలై నెలలో ఒక సాయంత్రం చలంగారికి మళ్ళీ పెరాలటిక్‌స్ట్రోక్ వొచ్చి తల పక్కకి వాలిపోయింది. మూతి

వంకర పోయింది. మాట పూర్తిగా రాకండా అయిపోయింది. ఆ సమయానికి సౌరిస్ షికారు వెళ్ళారు. నర్తకి షాకి కబురుపెట్టి వుంటే పరిస్థితి మరీ అంతగా దిగజారేది కాదు. షికారునించి తిరిగివొచ్చిన తరువాత షా— తమకి కబురు పెట్టనందుకు నర్తకిని కేకలువేసి చలంగారి తలమీద చెయ్యివేసి, అట్లాగే పదిహేనునిమిషాలు వుంచి "విశ్వాసం మాత్రం వొదులుకోకు. అంతా భగవానే చూసుకుంటారు నాయనా" అన్నారు. చూస్తుండగానే చలంగారు ఏమందు వేసుకోకుండానే పదినిమిషాల్లో మామూలు అయిపోయి వీల్‌చెయిర్ అవసరం లేకుండా, ఎవరి సహాయాన్ని తీసుకోకుండానే తమంత తాముగా భోజనాల చావిట్లోకి నడిచి వొచ్చారు. భోజనం మామూలుగానే చేసి భజనలో 'మరుగేలరా' అన్న త్యాగరాజకృతిని అద్భుతంగా పాడారు. ఆ రోజుల్లో సౌరిస్ తొలిభాగం రాస్తూ రమణస్థాన్‌లోనే వున్న రామానంద తన కళ్ళతో చూశాడీ సంగతి. ఉండబట్టలేక "ఈ వ్యాధినంతా తీసుకుని, మీరే **heal** చేశారు కదూ" అని ప్రశ్నించాడు సౌరిస్‌ని. ఆమె "నాన్న విశ్వాసబలమే నాన్నని కాపాడింది" అన్నారు. కానీ చలంగార్ని కాపాడుతున్నది నిస్సందేహంగా ఈశ్వరి సౌరిస్సే నని వేరుగా చెప్పాల్సిన పని లేదు.

మర్నాడు డాక్టరు దగ్గరకి వెళ్ళి ఈ సంగతి చెప్పి పరీక్ష చేయించుకున్నారు చలంగారు. అప్పుడు డాక్టర్ ఆ భాగాన్ని పరిశీలించి ఎక్కడా **stroke** వొచ్చిన జాడయినా లేవని ఆశ్చర్యపోయా రట.

మెర్‌స్టన్ చనిపోక మునుపే, ముందుగా ఓపికగా కూచుని ఎవరెవరికి ఏమేమి ఇవ్వాలో కాళ్ళపీచులు చీపురుకట్టలనించి అన్నీ లెక్క రాసిపెట్టి నర్తకికి అప్పగించి "నేను చచ్చిపోయాక ఈ సరుకుల్ని నేను రాసిచ్చినట్లుగా అందరికీ ఇవ్వాలి" అని చెప్పింది. అప్పుడు

నర్తకి "నా కదంతా తెలియదు, నా కెంతవరకు సాధ్యమో అంతవరకూ చేస్తాను" అని చెప్పిం దామెకి. మెర్‌స్టన్ తాను చచ్చిపోగానే ఏమేం చేయాలో నర్తకికి ముందుగానే చెప్పింది. ఆఖరికి టెలిగ్రామ్‌ల నించీ తానే రాసి సిద్ధంచేసి పెట్టింది.

బోస్‌కాంపౌండ్ వారినించీ, మున్సిపాలిటీ వారినించీ తనని బోస్‌కాంపౌండ్‌లోనే దహనం చేసేందుకు **permission** ని తీసుకుంది. ఇక్కడికి వొచ్చిన డాక్టర్ల నందర్నీ తీసుకువెళ్ళి మెర్‌స్టన్‌ని చూపించేది— నర్తకి. వాళ్ళు ఆమెకి చావుకు ముందు ఏమేం జరుగుతాయో చెప్పి చచ్చిపోయే వేళకి ఓ డాక్టరు దగ్గరుంటే మంచిదని ప్రోగ్నసిస్ వర్ణించి చెప్పేవారు. "ఈ ప్రోగ్నసిస్ ఏమంటుంది? చివరికి చస్తా నంటుంది, అంతేకదా— డాక్టరు దగ్గరుండి చస్తేనేం? ఒంటరిగా చస్తేనేం?" అని అనేదిట మెర్‌స్టన్.

కామేశ్వరి వొచ్చినప్పుడు ఆమెనికూడా మెర్‌స్టన్‌ని **examine** చేయడానికి తీసుకువెళ్ళింది నర్తకి. కామేశ్వరి తిరిగివొచ్చి "ఏమిటి, షా, ఆవిడ ధైర్యం. ఇవన్నీ జరిగితేనేం చివరికి చావేకదా, అంది నిబ్బరంగా" అని చెప్పి షాకి, "ఆమెది ఏం ధైర్యం! ఏం సాహసం!" అంటూ ఆశ్చర్యపోయింది.

నర్తకి ఒకరోజు వెళ్ళేసరికి మెర్‌స్టన్‌కి చాలా జబ్బుగా వుంది. ఆ రోజే తను వెళ్ళిపోతున్నానని ఆమెకి తెలిసింది. "గుడ్ బై మై ఫ్రెండ్. ఇంక నేను వుండను, వెళ్ళిపోతున్నాను. నువ్వు నాకు చాలా సేవచేశావు. ఎవరూ చేయలేని సేవ నువ్వు చేశావు. నీలాగ ఎవరూ ఇంత ప్రేమగా సేవచెయ్యరు. నేను చెప్పినవన్నీ గుర్తుంచుకో" అని నర్తకికి చెప్పింది.

మర్నాడు నర్తకి మామూలుగానే మెర్‌స్టన్‌ని చూడటానికి వెళ్ళింది. మెర్‌స్టన్ ఆవేళ జబ్బుగానే వుంది. షా ఆవేళ acidity తో బాధ పడుతున్నారు. మధ్యాహ్నం ఒంటిగంటకి రామ్‌నాధ్ వొచ్చి కేక వేస్తే నర్తకి మెర్‌స్టన్ దగ్గరకి వెళ్ళింది. ఐదు గంటలకి ఆవిడ ప్రాణం పోయింది. "నా ప్రాణం పోగానే తలుపులు తాళం వేసుకు వెళ్ళిపో" అని మెర్‌స్టన్ నర్తకికి ముందుగానే చెప్పింది. నర్తకి అక్షరాలా ఆ విధంగానే చేసి— ఇంటికి తిరిగి వొచ్చేసింది.

మరుసటిరోజు షాకి యాసిడిటీ తగ్గింది. బెంగుళూరు నించి చంద్రశేఖర్ పంపితే శ్రీ కంఠయ్య అనే ఆయన షాని చూడటానికి వొచ్చారు. షా, రమణస్థానీయులు అందరూ కలిసి మెర్‌స్టన్ అంత్యక్రియలకి హాజరయ్యారు. షా వాళ్ళు వెళ్ళేసరికి నర్తకి, ముత్తమ్మ అనే నవుకరు మెర్‌స్టన్ శవాన్ని శుభ్రం చేస్తున్నారు. ఆమె దేహం నించి చాలా దుర్గంధం వొస్తోంది. ఆమెని చూడటానికి వొచ్చిన వారందరూ ఆ దుర్గంధాన్ని భరించలేక ముక్కులు మూసుకుని బైటికి వెడుతున్నారు.

రోడా "నీకు వాసన వేయడం లేదా?" అని షాని అడిగారు. "ఆస్పత్రిలో పనిచేశాను కదా! ఇంతకన్నా ఘోరమైన వాసనలే నా కలవాటు" అన్నారు షా. వాసనాక్షయమైన సౌరిన్‌ని ఏ వాసనలు మాత్రం ఏం చేయగలవు?

మెర్‌స్టన్‌కి చీరకట్టి, బైట పడుకోబెట్టి ముఖానికి పసుపురాసి, బొట్టు పెట్టింది నర్తకి. ఇంతలో దహనానికి కట్టెలు తెప్పించారు. మెర్‌స్టన్‌ది చాలా భారీశరీరం. ఆ కట్టెలు చాలవని మళ్ళీ కట్టెలు తెప్పించారు షా. కాంపౌండ్‌లోనే చితి పేర్చారు. శ్రీకంఠయ్య ఆమెని ఎత్తుకుని వెళ్ళి చితిమీద పడుకో బెట్టారు. రామ్‌నాధ్ చితిని అంటించాడు.

నర్తకికి మెర్స్టన్ సామానంతా dispose చేసే కార్యక్రమం మీద పడింది. లిష్టు చదివి వస్తువులన్నీ సరిచూచింది నర్తకి. వెండి, బంగారు వొస్తువులన్నీ ఇక్కడే pack చేసి మద్రాసులో వున్న మెర్స్టన్ మిత్రుడికి పంపించేసింది నర్తకి. అక్కడినించి ఆయన దేశ, విదేశీయు లందరికీ మెర్స్టన్ కోరినట్లుగా పంపించేశారు. చీపురు దగ్గర నించీ చిల్లుపడ్డ బక్కెట్ దాకా ఎవరికి రాసిందో వాళ్ళకి పంపించాలి. నర్తకికి విసుగెత్తి చిన్నా చితుకూ పంచిపెట్టేసింది.

కొన్నిరోజులవరకూ నర్తకికి ఎన్నెన్నో వుత్తరాలు వొచ్చేవి. "మెర్స్టన్ మాకివి ప్రామిస్ చేసింది, మాకవి ప్రామిస్ చేసింది" అంటూ. "నాకేమీ తెలియదు" అని అందరికీ జవాబు రాసింది నర్తకి. ఆమె ఎవరెవరి పేర్లకి ఏఏవస్తువులు రాసిందో ఆవన్నీ ఆయా వ్యక్తులకి అందజేసింది నర్తకి. అయినా కొందరు వొచ్చి నాకు మంచి వొస్తువు లిస్తానందని, కొత్తవిమ్మని తగవాడేవారు నర్తకితో. ఆవిడ వాళ్ళకి ఇస్తానన్న నాటికి అవికొత్తవే కాని ఆవిడ చనిపోయే నాటికి అవి పాతబడి పోయాయి. నర్తకి నిశ్శబ్దంగా ఆవిడ రాసిన instructions list చూపించేది వారికి. పీనుగుమీది పిండాకూడు నాశించిన పెద్దలు కొందరు, మెర్స్టన్ శవం ఇంట్లో వుండగానే చేతికందిన విలువైన సామాన్లు పట్టుకు పోయారు. ఈవిధంగా మనుషుల్లో ఎంతెంత యావ (greed) బయల్దేరిందో చూచిన నర్తకి విస్తుపోయింది. చిన్న చిన్న విషయాలకి మనుష లెట్లా పోట్లాడతారో నని ఆశ్చర్యమూ కలిగింది. ప్రపంచంలో ఆశ మనుషుల ప్రవృత్తుల్ని ఎంత కాలుష్యం చేస్తుందో అప్పుడే నర్తకికి అర్థమైంది. ఆ సంగతి కను విప్పు కాగానే షా తన నెందుకు ఇన్నిరోజులూ కడిగిపెట్టారో ఆమెకి స్పష్టం అయింది.

క్రమక్రమంగా చలంగారు కోలుకున్నారు. ఒక్కొక్కప్పుడు చేతులూ కాళ్ళూ మాత్రం స్వాధీనం అవక పట్టినట్లుగా అనిపించేవి. మళ్ళీ ఆయనకి నడక, రాత అన్నీ యథాప్రకారంగా వొచ్చేశాయి. సాధారణంగా **two sides** పెరాలటిక్ స్ట్రోక్ వొచ్చిన వారికి అలాంటి **relief** రావడం జరగదు. కానీ చలంగారికి పూర్తిగా **relief** వొచ్చేసింది. కానీ మాట కొంచెం ముద్దగా వొచ్చేది. ఆయన ఒంట్లో మునుపటి శక్తి మాత్రం లేదు.

ఒకరోజు కాశ్మీరా ఆత్మహత్య చేసుకుందని వుత్తరం వొచ్చింది. అంతకి ముందు రోజు నర్తకికి వంట చేస్తూ వుండగా ఒకరు కనబడ్డారు. ఆ తరువాత ఆ కనపడ్డది కాశ్మీరా అని తెలిసింది. ఇంక ఆమె **spirit** రోజూ కనపడడం మొదలు పెట్టింది. ఆ **spirit** నర్తకికే కాక చిత్రకికూడా కనిపించేది. తానేవిధంగా చనిపోయిందో అదంతా వాళ్ళకి వివరించి చెప్పింది కాశ్మీరా. రమణస్థానీయులామె విషయంలో ఏం జరుగుతుం దనుకున్నారో అదేవిధంగా జరిగింది. నర్తకికి అది పెద్ద **shock.** దాన్నించి తేరుకోలేక పోయింది. కాశ్మీరా కోసం నర్తకి ఎన్నాళ్ళో బాధపడింది.

ప్రతిరోజు కాశ్మీరా షౌ దగ్గరకి వొచ్చేది. ఎంత ప్రేమచూపేదో! చిన్నపిల్లలా గోము చేసేది ఆ **spirit.** తరువాత "తానొక పావురాన్నై పుడుతున్నాను" అని చెప్పినట్లు కల వొచ్చింది షౌకి. అప్పుడు చలంగారికి పెంపుడు పావురా లుండేవి. వాటికో పిల్ల పుట్టింది. అది మగపిల్ల. అదే కాశ్మీరా. ఆ పావురం పిల్లని షౌ దగ్గరకి తీసుకువెడితే రెక్క లల్లార్చుకుంటూ ఏ బెరుకూ లేకండా షౌ దగ్గరకి వెళ్ళికూచుంది.

తరువాత ఆ పావురాలు ఎగిరి పోయాయి. వాటితోబాటు ఆ పావురమూ వెళ్ళిపోయింది.

అప్పటికి చాలా కాలం ముందునించే డాక్టర్ చిట్టూరి సత్యనారాయణగారు, వారిభార్య లక్ష్మి రమణస్థాన్‌కి వొచ్చివెడుతూ వుండేవారు. చలంగార్ని చూడటానికి మొదటిసారిగా చిట్టూరి సత్యనారాయణగారు వొచ్చారు. ఆయన మద్రాసులో జనరల్ హాస్పిటల్‌లో E.N.T. స్పెషలిష్టు. సాహిత్యాభిమాని. ఆయనకి చలంగారంటే గొప్ప admiration. చలంగారికి B.P. ఎక్కువై పోయి పెరాలటిక్ స్ట్రోక్‌వొచ్చి నప్పుడు ఆయన చలంగారితో "మిమ్మల్ని మేం ఎంతోబాగా చూసుకుని వైద్యం చేయిస్తాం. మాతో రండి" అని ఎంతో ప్రోత్సహించి, ఎన్నో మందులుఇచ్చి వెళ్ళారు. చలంగారికి ఏమందులూ ఒంటికి పడవు. షౌ ఆయనని ఎక్కడికి వెళ్ళవద్దన్నారు. అందుకనే చలంగారు వెళ్ళలేదు. చలంగారికి చెవిలో ఒకశబ్దం వినబడేది. పళ్ళమీద కురుపులు వొచ్చి ఒక infection చేరింది. మందులు వేసుకోకపోతే ఫిట్స్ వొస్తాయని అనేవారు డాక్టర్లు. అసలు సంగతేదో తెలియక. దాంతో చలంగారొకసారి సత్యనారాయణగారికి తమ పళ్ళని చూపించారు. ఆయన చలంగారికి X Ray తీయించాలని తిరువన్నామలై Govt. hospitalకి తీసుకుని వెళ్ళారు. అది ఆదివారం కావడంవలన current లేదు. ఆయన తన పేరు చెప్పి electric Dept. కి కబురుపెట్టి కరెంటు తెప్పించి X Ray తీయించారు చలంగారికి. ఇక్కడ డా॥ చెట్టియార్ తదితరులు ఆయన శిష్యులు. వాళ్ళు చాలా busy Doctors. చెట్టియార్‌తో చలంగారెప్పుడు అవసరమై పిలిస్తే అప్పుడు నువ్వెంతBusy గా వున్నా రావల్సిందే" అనిచెప్పి వెళ్ళారాయన. ఇక్కడికి వొచ్చినప్పుడల్లా చలంగారు వాడడానికి మందులిచ్చి వెడుతుంటారు.

లక్ష్మిగారు సత్యనారాయణగారి భార్య. ఆవిడలో చూసినవాళ్ళకి ఏమీ కనబడకపోయినా షౌ వాళ్ళకి పరిచయం అయినకొద్దీ ఆమెలో

ఎంత వివేకమో, ఎంత అనుభవమో! కనిపించాయి. అప్పుడప్పుడు తమంతట తామె రమణస్థాన్‌కి వొస్తూ వుంటారు. "సౌరిస్ నాకెప్పుడూ చిన్నపిల్లే. నాకంటికి పెద్దదానిలా కనబడదు" అనేవారామె.

చాలా ఏళ్ళకిందట ఒకసారి చిల్లరదుకాణం నించి ఏదో పొట్లాంగా కట్టివొచ్చిన షా కథలో పేజీ ఆవిడ కంటబడింది. అది చదివారామె. అప్పటినించీ ఆమెకి షౌకథ లంటే చాలా ఇష్టం. ఆమెకి షౌ పాటంటే ప్రాణం. ముఖ్యం త్యాగరాజ కృతులు పాడితే ఎంతో ఇష్టం. "సంగీతం వాళ్ళు ఏదో ఆడంబరం అదీచేసి ఈతాళం ఆతాళం వేసి పాడతారు గానీ దాంట్లో రసం వుండదు. ఏదో వింటాం. నువ్వు త్యాగరాజ కృతులు పాడితే ఎంత బావుంటాయో!" అనేవారు షౌతో.

ఒకరోజు మధ్యాహ్నం సావకాశంగా వొచ్చి మాట్లాడుతున్నారామె. మాటల సందర్భంలో "చలం స్త్రీల కెంత కనువిప్పు చేశాడో స్త్రీలే గుర్తించలేరు. స్త్రీయే చలం రచల్ని సరిగ్గా చదివితే ఆస్త్రీ జీవితంలో ఎన్నడన్నా మోసపోతుందా? పురుష డంటే ఏమిటో పూర్తిగా విశదం అయ్యేలా రాశారు చలం. ఆసంగతి స్త్రీయే తెలుసుకో గలిగితే ఇంక స్త్రీ జీవితం ఎంత రక్షింపబడు తుందో" అంటూ తమ స్వానుభవంలోని విషయంగా మాట్లాడా రామె.

ఒకరోజు చిట్టూరి లక్ష్మిగారు రమణస్థాన్‌కి వొచ్చారు. ఆవిడ ఆజానుబాహువు. అలాంటి ఆమె కాస్త డీలా పడిపోయి, నీరసంగా కనబడ్డారు.

"ఏమిటి మీ రిట్లాగయి పోయారు" అని షౌ ఆమెని అడిగారు.

కాశ్మీరా నాదగ్గరకి వొచ్చింది- ఏం చెయ్యను? ఆమె బరువంతా నేను మోస్తూ వున్నాను. రోజంతా నాతోనే వుంటోంది. ఒక్క భోజనం దగ్గరకి మాత్రం రాదు. రోజంతా, రాత్రింబవళ్ళు నాలోనే వుండి అన్నీ

నాలోంచే అనుభవిస్తోంది. నేను భరించలేక రోజు రోజుకి నీరసించి పోవడం మొదలు పెట్టాను. ఇంక తట్టుకో లేక "నిన్ను అరుణాచలం తీసుకు వెడతాను. అక్కడే వుందువుగాని" అన్నాను. నాతోబాటు కారులో వొచ్చింది. సరిగ్గా మీ గుమ్మం దగ్గరకి వొచ్చేసరికి, ఎటుపోయిందో తెలియదు" అన్నారు. చిత్ర, నర్తకి తమ తమ అనుభవాలు ఆమెకి చెప్పారు. అప్పుడు లక్ష్మగారు-

"అమ్మా! ఆడదే హృదయ మంతటితోనూ ప్రేమిస్తే ఏమగవాడు భరించగలడు? ఎక్కడ తీసుకోగలడు ఆ ప్రేమని? అందులో కాశ్మీరా లాంటి అమాయకురాలు హృదయ మంతా ఇస్తే ఆ మగవాడు సహించగలడా?" అని వూరుకున్నారు. ఆ తరువాత ఒకటిరెండు రోజులుండి వెళ్ళిపోయారు.

నర్తకివాళ్ళు లక్ష్మగారు మళ్ళీ వొచ్చినప్పుడు-

"కాశ్మీరా మీతోనే వుందా?" అని అడిగా రామెని.

"ఆ నిమిషమే అరుణాచలంలో వొదిలేశానుగా" అన్నారామె.

ఆవిడ ఆరోగ్యం బాగుపడి హాయిగా కనిపించా రీమాటు.

## 29

ఆ రోజుల్లో ఒక అవ్వ రమణస్థాన్‌లో పనిచేసేది. ఒకరోజు ఆమె "ఈ మండపంలో ఎవరినో పడవేసి వెళ్ళారమ్మా" అని షౌతో చెప్పింది. అప్పుడు షౌ "పాపం! ఎవరినో మండపంలో పడవేశారట వెళ్ళిచూడు" అని నర్తకిని పంపించారు .నర్తకి వెళ్ళి సంగతి సందర్భం కనుక్కుని వొచ్చింది. అతనికి ఆస్తి వుంది. భార్యా, కొడుకూ వున్నారట. అతనికి పక్షవాతం వొచ్చింది. దాంతో వాళ్ళ కతను భారమైపోయి ఓరాత్రికి రాత్రి మండపంలో అతన్ని వొదిలిపెట్టి వెళ్ళిపోయారు అతని వాళ్ళు నిరాధారంగా. షౌ అవ్వచేత రోజూ అతనికి

భోజనం పంపించేవారు. నాలుగురోజులకి ఒకసారి అవ్వ నీళ్ళు తీసుకుని వెళ్ళి అతనిచేత స్నానం చేయించేది. నర్తకివెళ్ళి యోగక్షేమాలు కనుక్కునేది. అప్పుడప్పుడు షౌకూడా వెళ్ళి చూచి వొచ్చేవారు. "ఏం కర్మో నాకు చావు త్వరగా వొస్తే బావుండునని గోల పెట్టేవాడు అతను. ఇంక కొన్నాళ్ళ తరువాత నర్తకి అతన్ని చూసివొచ్చి "అతనిప్పుడు అరుణాచలం వంక చూస్తూ కూచున్నాడు. ఇప్పు డతనిలో ఆ బెంగలన్నీ మాయ మవుతున్నాయి" అని చెప్పింది షౌకి. అతనికి ఒక బొంత కుట్టింది నర్తకి. చలంగారి పాతపంచలు, చొక్కాలు అతనికి కట్టుకోడానికి ఇచ్చేవారు. నర్తకి ప్రభృతులు చలికాలంలో, వానాకాలంలో వేడినీళ్ళు తీసుకుని వెళ్ళి అతనిచేత స్నానం చేయించేవారు. సత్యం, కృష్ణారావు తదితరులు అతనికి అన్నం తీసుకుని వెళ్ళి ఇచ్చేవారు. అలా అయిదేళ్ళు గడిపా డతను. ముందర రమణస్థానీయులు అతని విషయమై చాలా దిగులుపడ్డారు గానీ తరువాత వారికి అరుణాచలేశ్వరుడే అతన్ని పిలిచి తెచ్చుకున్నా రనిపించింది. రమణస్థాన్‌కి వొచ్చే టూరిష్టు లంతా చలంగారికి నమస్కరించడమే కాక, వెళ్ళి అతనికి నమస్కరించే వారు. అందుకనే అతని పేరు మండపం సామియార్ అయిపోయింది.

కాశ్మీరా వాళ్ళదేశం వెళ్ళినప్పుడే వసుంధర ఒకమ్మాయిని వెంటబెట్టుకుని అరుణాచలం వొచ్చింది. ఆ అమ్మాయి చాలా అందమైనదని అందరూ అంటారు. కాశ్మీరాలాగే ఆమెది అందరూ మెచ్చుకునే అందమే. "ఈ అమ్మాయిని మీ దగ్గరుంచుతున్నాను" అని చెప్పింది వసుంధర. ఆ అమ్మాయి పేరే శోభ. శోభ బర్మాకాంది శిష్యురాలు. తెలుగమ్మాయే కానీ ఎక్కువగా హిందీలో మాట్లాడేది.

వసుంధర నర్తకితో ఆ అమ్మాయి వలన తా నెదుర్కొన్న సాధక బాధకాలు చెప్పుకుంది. శోభ బర్మాలో కొద్దో గొప్పో తెలుగే చదువుకొంది. మొత్తానికి వసుంధర దగ్గర వార్డుగా చేరింది. శోభ చాలా బీదమ్మాయి. ఆమెని ఎవరింట్లో నన్నా పనికి పెడదామంటే "అయ్యో ఈ అమ్మాయినా పనికి పెట్టుకోవడం" అని వాళ్ళు ఒప్పుకునేవారు కాదు. పోనీ ఏ ఆఫీసులో నన్నా పెడదామంటే, శోభని చూశాక వాళ్ళు "ఈ అమ్మాయినా పనికి పెట్టుకోవడం?" అనేవారు. ఇంక ఆ అమ్మాయి నేంచేయాలో తోచక ఇక్కడ దించి వెళ్ళిపోయింది వసుంధర.

చలం ఇంటికి అనగానే ఆ అమ్మాయి సినిమా చలం ఇంటికని అనుకొంది. "చలం ఏడి" అని అడిగింది. కొంచెం కొంచెంగా తెలుగు తమాషా యాసతో మాట్లాడేది. ఈ సినిమా వాళ్ళంతా మేకప్ లేకండా, షోకులు లేకండా ఇలా వుంటా రేమిటని తెల్లబోయి చూచేది. కానీ నాలుగైదు రోజులలోనే ఇది సినిమా చలం ఇల్లుకాదని ఆమెకి తెలిసిపోయింది, తరువాత ఇంటిపట్టున వుండక ఎక్కడెక్కడికో చెప్పకుండా వెళ్ళిపోయేది. తరువాత నర్తకి "అట్లా బైటికి వెళ్ళకూడ దమ్మా నువ్వ"ని గట్టిగా చెప్పింది.

వొచ్చిన రోజునే భజనలో పాడింది శోభ. ఆమెకి హిందీసినిమా పాటలు తప్ప మామూలు పాటలు రావు. ఎంత శ్రావ్యమైన కంఠమో! ఈ పిల్లని నర్తకి చివరికి అదుపాజ్ఞలలో పెట్టలేక పోయింది. ఏం చెప్పినా ఆమెకి అర్థం అయ్యేది కాదు.

ఒకబ్బాయి షా వాళ్ళకి చిన్నప్పటినించీ తెలిసినవాడు. "ఎవరైనా అందమైన అమ్మాయి వొస్తే నాకు వుత్తరం రాయి. జాతి, కులం, డబ్బు చూసుకోకండా పెళ్ళి చేసుకుంటాను" అని నర్తకికి చెప్పి వెళ్ళాడు.

ఆ అబ్బాయిని పిలిపించింది నర్తకి. శోభకూడా అతన్ని పెళ్ళి చేసుకోడానికి వొప్పుకుంది. ఓ మిట్టమధ్యాహ్నం మిడసరిలగ్నంలో బ్రాహ్మడ్ని పిలిచి పెళ్ళి చేయించుకున్నారు. అతను శోభని తనతో తీసుకుని వెళ్ళాడు. ఆ అబ్బాయి, ఆ అమ్మాయిని నానాతిప్పలూ పెట్టి చివరికి ఆ అమ్మాయిని తిరుపతి దాకా దిగబెట్టి వెళ్ళిపోయాడు. మళ్ళీ శోభ మూడు నెలలు తిరక్కుండా రమణస్థాన్ పాలబడింది.

ఈసారి శోభ రమణస్థాన్‌లో ఒకరై అయిపోయింది. ఎన్ని రకాల బర్మావంటలు చేసేదో! ఆవిడ నిలువునా ఆర్టిస్టు. కత్తులు పట్టుకుని డ్యాన్సు చేసేది. అప్పటికప్పుడు invent చేసి చేసేది డ్యాన్సులు. ఆ కత్తులు పట్టుకుని ఎవర్ని పొడుస్తుందోనని అందరికీ భయం. శోభ బర్మా పాటలు పాడేది. ఆ పాటల్లో ఎంత మాధుర్యమో! ఎంత మార్దవమో! మాట్లాడితే రంగూన్ అందాన్ని వర్ణించి ఆ దేశంముందు ఇండియా ఏమిటని నిరసించేది. ఒకసారి వొండినకూర ఇంకోసారి వొండేది కాదు. ఒకసారి చేసిన డ్యాన్సు ఇంకోసారి చేసేది కాదు. శోభకి వంటింటి పనంటే చాలా బద్ధకం. చిత్ర ఆమెని వంటపనిలో గట్టిగా పెట్టింది. దాంతో శోభ చిత్రని "అత్తగారూ!" అని పిలిచేది.

శోభని కృష్ణారావుగారిదగ్గర చదువుకి పెట్టారు. ఒక్కొక్క మాటని ఆ అమ్మాయి **pronounce** చేస్తూ వుంటే అందరికీ ఎంతో నవ్వు పుట్టుకొచ్చేది.

'మనోమయ కోశానికి' బదులుగా 'మన్నుమయకోశం' అనీ 'అన్నమయ కోశాని'కి బదులుగా 'అన్నమయ్య కోశం' అనేది.

శోభ ఎంతో **romantic** గా వుండేది. ఆమె ఒక్కొక్క విషయాన్ని వర్ణించి చెబుతూ వుంటే ఎంత బాగా వుండేదో! కృష్ణారావు గారు ఆ అమ్మాయిని రంగూన్‌నించి ఇండియాకి రావడం గురించి

కాంపోజిషన్ రాయమన్నారు. ఎంత గొప్పగా రాసిందో! అక్కడితో ఆమె గాయకురాలే గాక మంచి రచయిత్రి కూడా అని అందరికీ తెలిసింది.

ఒకరోజు భజనలో వుండగా చాలా ఎత్తరి, భారీమనిషి ఆయనతో ఒక పీలమనిషి కలిసి వొచ్చారు. భజనంతా అయిన తరువాత ఆ ఎత్తరిమనిషి "నేను ధవళ నారాయణమూర్తిగారి అబ్బాయిని, నా పేరు జగన్నాథరావు" అని తమని తాము పరిచయం చేసుకున్నారు చలంగారికి.

ఆయన అనకాపల్లి కాలేజీలో జూఆలజీ లెక్చరర్.

ధవళ నారాయణమూర్తిగారు భగవాన్ వున్నప్పుడే చలంగారిని చూడడానికి వొచ్చారు. ఆయన చలంగారికి గొప్ప admirer.

ఆయనకి చలంగారి కుటుంబాన్ని ఇంకా మరికొంతమంది selected people ని కలిపి ఒకకోలనీ పెట్టాలని ఆశయం. భగవాన్‌కి చాలా జబ్బుగా వున్నరోజు లవి. చలంగారు వాళ్ళంతా భగవాన్ ఎదురుగుండా కళ్ళుమూసుకుని ధ్యానంలో వున్నసమయంలో ఆయన వొచ్చి వారందరిని చూశారట. ధ్యానం తరువాత చలంగారు వాళ్ళతో "ఏమిటండీ, ఇంత మూర్ఖత్వం. అక్కడ ఆ ముసలాయన చుట్టూకూచున్న వాళ్ళందరి ముఖాలు చూస్తే చాలా cultured people, చాలా మేధావులు అనిపిస్తున్నారు. వారందరికీ పిచ్చా? నా కొక్కడికే పిచ్చా? అన్న సందేహం కలుగు తోంది నాకు. ఆయనముందు కళ్ళు మూసుకు కూచుని ఏమి సాధిస్తా రనిపించింది. దీనికంతా కారణం ఆ ముసలాయన. అందర్నీ ఆయనేదో మోసం చేస్తున్నాడు. వెళ్ళి ఆయన్నొక్క లెంపకాయ కొట్టాలి అనిపించింది" అని చెప్పారు.

తరువాత వాళ్ళవూరు వెళ్ళాక చలంగారికి వుత్తరాలు రాస్తూనే వుండేవారు. టావులకి టావులు రాసేవారు. ఆధ్యాత్మికమంతా సైంటిఫిక్‌గా explain చేయమనేవారు. చలంగారు ఆయనకి వోపికగా జవాబులు రాసేవారు. ఈశ్వరుడు వొచ్చాక కూడా ఆయన వుత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూనే వున్నారు. తరువాత ఈశ్వరుడిలో విశ్వాసంలేక వుత్తరాలు రాయడం మానుకున్నారు ఇప్పు డాయన కొడుకు వొచ్చారు. తమ తండ్రి చలంగారు వాళ్ళందర్నీ వర్ణించడం అదీ చెప్పారు. చలంగార్ని చూసి "అయ్యో మీరు చాలా ముసలివారై పోయారు" అన్నారు. షౌని చూసి "మానాన్న మిమ్మల్నెంతో చిన్నపిల్లగా వర్ణించారు. మీరెంతో పెద్దవా రై పోయారు" అన్నారు.

ఆయనకి మిశ్రీతో చాలా స్నేహ మయింది. మిశ్రీ ఆయనచేత పాటలు పాడించేది. ఆయనది ఎంత మంచి కంఠమో! ఎస్.వి. రంగారావుని imitate చేసేవారు, సినిమాలకి సినిమాలే, ఆయన రమణస్థానీయుల కళ్ళముందు అభినయించి చూపేవారు. ఆయన వొస్తే రమణ స్థానీయులకి గొప్ప entertainment ఆయనకి mental weakness. ఆసంగతి ఆయనకి తెలుసు. "నేను control లేకండా మాట్లాడేస్తానని నాకు తెలుసు. నాకు ఆప్తులు అయినవారు నన్ను control లో పెట్టుకోమంటారు. కానీ నేను control చేసుకోలేకండా వున్నాను. నన్నేం చేయమంటారు?" అని షౌని అడిగారు. అప్పుడు షౌ "వీలైనంతసేపు భగవాన్ పటం ముందు కూచో" మని చెప్పారు. ఆ తరువాత ఆయన తాను అట్లాగే కూచుంటూ వున్నానని తనకి చాలా ప్రయోజనం కనపడుతోందని వుత్తరం రాశారు.

ఒకసారి కుటుంబంతో సహా కలిసి వొచ్చారు. ఆయన భార్యకి జగన్నాధరావుగా రిట్లా అభినయాలు అవీచేయడం అలవాటే. కానీ

ఆయనని మెచ్చుకునేవాళ్ళు, enjoy చేసేవాళ్ళు వుంటారని ఆమె వూహించలేక పోయారు. ఆతరువాత జగన్నాథరావు కొన్నేళ్ళు మళ్ళీ మాట్లాడలేదు. ఇటువైపు రాలేదు.

ఇటీవలనే ఆయన మళ్ళీ వొచ్చారు. "నన్నేం చేయమంటారో చెప్పండి. అది నేను serious గా చేస్తాను" అని షౌ చెప్పిన వన్నీ list రాసుకున్నారు. "ఎందుక"ని అందరూ అడిగితే "నేను మరీ control తప్పిపోతున్నాను" అన్నారాయన.

"ముందర మీరు మాటలు పూర్తిగా తగ్గించెయ్యాలి" అన్నారు షౌ. ఆయన మౌనం పెడితే మాకు entertainment పోతుందని రమణస్థానీయులు గోలపెట్టారు. అప్పుడు ఆయనకి ఒకగంట మాట్లాడటానికి అనుమతి ఇచ్చారు షౌ. రమణప్రసాద్‌కి (తంబి) ఆయనకి మంచి స్నేహం కుదిరింది. ఇద్దరూ సైకిళ్ళమీద ఎంతోదూరం షికార్లు పోయేవారు. తరువాత ఆయన తనతో ఎన్నోరకాల ట్రాంక్విలైజర్స్ తెచ్చుకున్నారు. ముందు అవన్నీ వేసుకోవడం మానెయ్యమన్నారు షౌ. ఆయన తమవూరు వెళ్ళి మళ్ళీ తిరిగి వొచ్చారు. ఆయనలో ఎంత మార్పో! మునుపటి గోలలు, మాటలు, అల్లర్లు తగ్గిపోయినాయి. దాంతో రమణస్థానీయులకి ఆయనపట్ల ఆసక్తి తగ్గిపోయింది.

1967 దసరాలలో నానుడువానలు పట్టుకున్నాయి. ఆవానలు ఆగిన తరువాత పెద్ద ఈదురుగాలి బయలుదేరింది. ఆగాలికి అనాసక్తిలో వున్న పెద్దచెట్టు కూకటివేళ్ళతో సహా కూలి పోయింది. అదిపడి కాంపౌండ్ గోడకూడా పడిపోయింది. ఆవులకి ఏప్రమాదం జరగలేదు. చెట్టు కొట్టెయ్యడానికి కూలీలని పిలిచింది నర్తకి— "ఇన్నాళ్ళు ఈచెట్టు ఆవులకి నీడగా వుండే, ఇప్పుడు అది లేకపోతే ఆవులు ఎండాకాలంలో విలవిల్లాడి పోతా" యని అనుకున్నారు షౌ.

కూలీలు వొచ్చి చెట్టుని కొడుతూవుండగా అది అమాంతం పైకి లేచి నిలుచుంది. అప్పటికే వాళ్ళు కొమ్మలన్నీ కొట్టేశారు. పైన ఒక చిన్న కొమ్మమాత్రం మిగిలింది. ఆకూలీలు నర్తకితో "ఇన్నేళ్ళనించీ మేము చెట్లు కొడుతున్నాముగానీ ఈవిధంగా జరగడం మేము ఎన్నడూ ఎరగం. ఈ చెట్టుని కొట్టడానికి మాకు చేతులు రావడంలేదు" అన్నారు. నర్తకి— "ఎబ్బెబ్బే ఈచెట్టు ఎప్పుడో అప్పుడు కూలిపోయి షెడ్డు మీద పడొచ్చు, కొట్టేశెయ్యండి" అంది. మేం "ఇదేదో పని ఎగగొట్టడానికి చెప్పటల్లేదు. అంతాగా కూలిపోతే మేంవొచ్చి వుచితంగా కొట్టిపెడ తాము" అన్నారు.

అప్పుడు నర్తకి ఆసంగతిని షౌకి చెప్పారు. "అట్టాలేచిన చెట్టుని కొట్టెయ్య కూడదు. అది షెడ్డుమీదికి వొంగటంలేదు కదా! కొట్టెయ్యొద్దు" అన్నారు షౌ. ఆ కూలీలు నిలబడ్డ చెట్టుకి చుట్టూరా మట్టి గట్టిగా మెత్తి కొట్టివేసిన దుంగల్నే ఊతంగా పెట్టేసి వెళ్ళి పోయారు.

ఆ తరువాత రమణస్థాన్‌లో ఆవులు వున్నంతకాలం ఆ చెట్టు తొణక లేదు. చిన్న కొమ్మకూడా విరగలేదు. మళ్ళీ కొమ్మలు వేసు కొచ్చి మహావృక్ష మైపోయింది. ఆ తరువాత ఆవులన్నీ వెళ్ళిపోయి నాయి. ఇవాళ రమణస్థాన్‌లో వనజ అనే గోమాత మాత్రం మిగిలింది. ఆ చెట్టు ఇటీవలే (ఈ రచనా కాలంలో అక్టోబర్ 77) నానుడు వాన లకి కూలిపోయి కాంపౌండ్ గోడమీద పడింది. పశువులకొట్టంలో వున్న వనజకి ఏ అపాయమూ జరగలేదు. అప్పటికే guest house లో వున్న వారందరూ భోజనాలకి వొచ్చేశారు. ఎవరికీ చెట్టువలన అపా యం జరగలేదు. గుబురుగావున్న ఆ మహావృక్షాన్ని కూలిపోవడంతో నర్తకి కొట్టేయించింది.

1967 మే నెలలో కామేశ్వరికి చండీఘర్ బదిలీ అయింది. తను mess లో వుండి పిల్లల్ని ఏం చేయాలో తెలియక శ్రీని, జయని తన చెల్లెలు లక్ష్మితో, ఆడబడుచు ఉమతో సహా అరుణాచలం పంపించింది. అంతకి మునుపు కామేశ్వరి లక్ష్మి గురించి problem sister కింద మాట్లాడేది. అప్పట్లో పాపత్త "ఆ అమ్మాయిని షౌ దగ్గరకి పంపించెయ్యండి ఆ అమ్మాయి బాగు పడుతుంది. మీ problem solve అవుత్తుంది" అని చెప్పింది కామేశ్వరికి. ఆ పిల్లలు నలుగురూ కలిసి వొచ్చారు. లక్ష్మికి 20ఏళ్ళు ఉమకి 14ఏళ్ళు, జయకి 10ఏళ్ళు, శ్రీకి 7 ఏళ్ళు వుంటాయి.

అసలు పిల్లలమఱ్ఱివారు ప్రతిఒక్కరూ ఒక్కొక్క persona-lity. వారిలో ఆడవాళ్ళుగానీ, మగవాళ్ళుగానీ చాలామటుకు సంస్కారులు. చాలా స్వతంత్రులు. లక్ష్మిలో వాళ్ళ లక్షణాలన్నీ వున్నాయి. చాలా upto-dateగా fashionableగా dress చేసు కునేది. మేగజైన్లలో ఎడ్వర్టైజింగ్ అమ్మాయిలాగ వుండేది.కానీ లక్ష్మికి షౌ మాటంటే చాలా గురి.ఏదన్నా షౌ వొద్దు అంటే చేసేది కాదు. షౌ చెప్పిన పనిని ప్రశ్న లేకండా చేసేది. ఉమలో చాలా సౌమ్యత, ఎంత మాధుర్యమో ఆ అమ్మాయిలో! ఆ అమ్మాయికి ఇంట్లో సరైన పోషణలేక చాల malnutrition తో బాధపడేది. అక్కడే వుంటే నిష్కారణంగా చచ్చిపోతుందని కామేశ్వరి వెంటబెట్టుకుని తీసుకుని వొచ్చింది. ఇక్కడికి తీసుకువొచ్చి షౌకి అప్పజెప్పేసింది. ఎంత జాలిగుండెయో ఉమది. తీగలాంటి సన్నని కంఠంతో ఆమె భజన్లలో పాడేది. "సినిమాపాటలు బావుండవు కానీ ఉమపాడితే ఆపాటలకి ఎంత అందం వొచ్చేదో! అట్లానే హిందీ సినిమాపాటలు శోభ పాడితే వన్నె కెక్కేవి" - అంటారు సౌరిస్.

వీళ్ళేకాకండా పద్మనాభస్వామిగారి పిల్లలు ఆంజనేయులు, జగదీష్, రమణ దిగారు.

రమణ చంటిపిల్లవాడిగా వున్నప్పుడే పద్మనాభస్వామిగారు తిరువన్నామలై వొచ్చారు. కొన్నేళ్ళ తరువాత పద్మనాభస్వామిగారు ఇక్కడికి వొచ్చినప్పుడు "మా రమణకి పసితనంలో అమ్మవారు వొచ్చి మూగి, చెవిటివాడు అయ్యాడు. ఆ అబ్బాయిని ఏంచెయ్యమంటారు?" అని షౌని అడిగారు. మద్రాసులో వున్న deaf dumb school కి పంపించమన్నారు షౌ. వాళ్ళెందుకో పంపించ లేదు. 1964లో వేసవి శలవలకి ఆంజనేయులు, శ్యామలరావు అతనిని వెంటబెట్టుకొని తీసుకు వొచ్చారు. అతను మూగి, కాని చెవిటికాదు. Retarded child brain ఎదగలేదు.

అతను కొన్నివస్తువుల్ని ఒక డబ్బాలో పెట్టుకొని దాన్నిచేతిలో పట్టుకొని తిరిగేవాడు, అది వొదిలేవాడు కాదు, ఎవరైనా తప్పిజారి ఆడబ్బాని ముట్టుకుంటే మీదపడి రక్కేసేవాడు చాలా voilent గా వుండేవాడు మొట్టమొదట మెల్లమెల్లగా ఆ డబ్బాని అతని చేతుల నించి దూరం చేశారు నర్తకి వాళ్ళు నెమ్మదిగా అతనిలో ఆ insecurity పోవడం మొదలు పెట్టింది.

అతనితో సంజ్ఞలు చెయ్యవొద్దని షౌ అందరికి చెప్పారు. అతనికి చెవుడులేదు— మూగతనం తప్ప. అది షౌయే trace outచేశారు. ఆ నాలిక develop కాలేదు. అందుకనే మాటలు రావటల్లేదు. అతని తలకి ఒంద్రుమన్ను నర్తకి వాళ్ళు కట్టేవారు.

అతను ఎవరన్నా ఒంటరిగా వుంటే కొట్టడం గిల్లడం చేసేవాడు. రమణస్థానీయులు నిదానంగా వొద్దని చెప్పేవారు. వినకపోతే వాళ్ళు తిరిగి కొట్టడం ప్రారంభించారు. షౌ ఒంటరిగా హార్మోనియం

వాయించుకుంటూ వుంటే వొచ్చి గట్టిగా జుట్టుపట్టుకుని పీకేసేవాడు. అతని తీరు ఈవిధంగా వుండేది. మొదట్లో ఎవరూ అతన్ని భరించ లేక పోయేవారు. కానీ షౌ మెల్లమెల్లగా "అది చెయ్య కూడదు. విను రమణ" అని నచ్చచెప్పేవారు. తనకి తెలిసినా విననట్లుగా దొంగగా తలవొంచేవా డతను. అప్పుడు చలంగారు "రమణా నువ్వు వింటు న్నావని నాకు తెలుసు. దొంగ వేషం వేస్తున్నావు విననట్లు" అని గట్టిగా గద్దించేవారు. రమణ మెల్లగా మనుషుల్లోకి రావడం మొదలు పెట్టాడు. అతను ముందు ఒచ్చినప్పుడు పాలిపోయి బలహీనంగావుండే వాడు. ఒంట్రుమన్నుతో అతని వొంటికి నెత్తురు పట్టింది.

అతనంటే రమణస్థానీయులకు చాలా సరదా. భోజనంవేళ కాగానే అందర్నీ సంజ్ఞలుచేసి పిలిచేవాడు. రమణస్థాన్‌లో వాళ్ళు అత నితో ఆడుకోవడం మొదట పెట్టారు. అతను మొదట వొచ్చినప్పుడు మిశ్రీ పసిపిల్ల. అతనికి ఆపసిపిల్ల అంటే ఎంతముద్దో! ఎంతఇష్టమో! పాపని ఏమీ చేసేవాడు కాడు. దగ్గర కూచుని ఆడించే వాడు. అతను తిరిగి వెళ్ళాక అతనిలో మార్పు గమనించారు వాళ్ళ నాన్నగారు. వాళ్ళతో వెళ్ళేటప్పుడు అతని కుటుంబంవారికి అతనితో మాట్లాడమనీ, సంజ్ఞలు చెయ్యవద్దని గట్టిగా చెప్పారు షౌ. వాళ్ళింటికి రమణస్థాన్ నించి ఎవరైన వెళ్ళినప్పుడు రమణ తనవాళ్ళకి చేతితో నుదిటిమీద విభూతిరేఖలు చూపించి, హార్మోనియం వాయిస్తున్నట్లు చేతులు ఆడించి అక్కడినించి వొచ్చారని చెప్పేవాడు. ఇంక ప్రతి యాడాది రమణ స్థాన్‌కి వొస్తున్నకొద్దీ అందరికీ ఎంతముద్దు అయిపోయాడో రమణ! అతనురాని సంవత్సరం రమణస్థానీయులకి dullగా వుండేది. అతనికి చలంగారి మీద ఎంతప్రేమో! ఆయన బుగ్గలు పట్టుకుని సవరించేవాడు. చలంగారికి కూడా రమణమీద ప్రేమ రావడం మొదలుపెట్టింది. రాను

రాను అతనికో personality ఏర్పడింది. కావాల్సి మనుష్యుల్ని నవ్వించేవాడు. అతని నవ్వు ఎంత అమాయికంగా ఎంత బావుండేదో! భగవాన్‌కి హారతి ఇచ్చాక "విభూతి వేస్తున్నారు రండి" అని అందర్నీ సంజ్ఞచేసి పిలిచేవాడు. చలంగారికన్నా ముందు ఎవరూ విభూతి వేసికోవడానికి రాకూడదు. కాని విభూతికై చలంగారు లేవగానే తను సొఫాస్ ముందు పడుకుని విభూతి వేయించు కునేవాడు. ఇంక చలంగారు 'రమణా లే' అనంగానే పకపకా నవ్వుతూ లేచేవాడు. అతనికి అదొక పెద్ద జోక్. రమణస్థాన్‌లో అందరూ అతను ఏర్పరచిన వరసలో విభూతి వేసుకోవాల్సిందే. ముందుగా ఎవరన్నా విభూతి వేసుకోవడానికి వొస్తే వాళ్ళని తోసేసేవాడు.

రమణస్థాన్ పక్కింట్లో టి.పి.ఆర్. అనే రమణభక్తులు వుండేవారు. ఆయన భజనవేళకి తమ ఇంట్లో కూచుని వుండేవారు. రమణ-భజన జరుగుతోండగా ఆయనని "ఎందుకు అలా వూరికే కూచుంటావు. రా భజనకి" అన్నట్లుగా చప్పట్లు చరిచి పిలిచేవాడు. సెలవలు అయిపోయి ఇంటికి వెళ్ళాల్సి వొస్తే ఇంట్లో మూల మూలలా దాంకొని వెళ్ళనని ఏడ్చేవాడు- రమణ.

షా రమణ దగ్గరకి పోయి చెంపలు నిమిరి "మళ్ళీ వొద్దువుగాని వెళ్ళమ్మా!" అని నచ్చజెప్పే వారు. అయినా ఎంతో కష్టంమీద ఇంటికి తిరిగి వెళ్ళేవాడు. అతనిలో వయస్సుకి తగ్గట్టు ఎదుగుదల లేదు. పాతికేళ్ళ వయసున పదకొండేళ్ళ పిల్లవాడిలాగ వుండేవాడు. ఆ నవ్వూ తీరు అంతా చిన్నపిల్లవాడి లాగే వుండేవి. అతనివన్నీ చిన్నపిల్లవాడి చేష్టలు. కొన్నేళ్ళ తరువాత అతన్ని రమణస్థాన్‌కి తీసుకురావడం మానేశారు వాళ్ళవాళ్ళు. కానీ పద్మనాభస్వామిగారింటికి రమణస్థాన్ నించి ఎవరు వొచ్చినా దూరంనించే గుర్తుపట్టి పలకరించేది అతనే. అత

నికి ఆర్సెనిక్ల్రక్రితం జలోదరం వొచ్చింది. అది ఎవరూ కనిపెట్ట లేదు. మొన్న మొన్ననే అతను చనిపోయాడని పద్మనాభస్వామిగారు వుత్తరం రాశారు. వారికి ఓదార్పుగా షౌ జవాబుగా ఏమీ రాయించలేక పోయారు. కానీ ఆమె తాము రమణని ఎన్నటికీ మర్చిపో లేమంటారు.

పద్మనాభస్వామిగారి పిల్లలతోబాటు లక్ష్మిగారి కొడుకు సాంబు వొచ్చాడు. పిల్లలందరితో షౌ ఆడుకునేవారు. మధ్యాహ్నం చలంగారు తమంతట తాము చదువుకునే వారుగనుక ఆమెకి బోలెడు తీరుబడి వుండేది. పిల్లలంతా షౌతో కలిసి దాగుడు మూతలు ఇంకేవేవో ఆటలు ఆడుకునే వారు. కామేశ్వరి కొడుకు జయకి షౌ అంటే చాలా భక్తి. షౌ దాంకొన్నప్పుడు, షౌ కనబడగానే వెంటనే నమస్కారం పెట్టేసే వాడు. అందరూ కలిసి షికార్లు వెళ్ళేవారు. రమణ అంటే ఉమకి ఎంతో ముద్దు. రమణని రమణస్థానీయు లందరూ దయగా చూచేవాళ్ళు కానీ ఉమకి ఎవరూ సాటిరారు. వాడిని ఒళ్ళో పడుకో బెట్టుకుని ముద్దుచేసేది. "అమ్మా అను, మామా అను" అనివాడి కి మాటలు నేర్పింప జూచేది. రమణ ఆమెదగ్గర ఎన్ని ముద్దులు కుడిచే వాడో! తనని ఆ అమ్మాయి ముద్దుచేస్తో వుంటే, అతనికి ఎంత సంతోషమో! "నువ్వెప్పుడూ ఇట్లాగే వుండి పోరా! పెద్దవాడివి కాకురా" అనేది ఉమ రమణతో. వాడు పళ్ళు బైటపెట్టి ఒక్క వెఱ్ఱినవ్వు నవ్వేవాడు. పిల్లలంతా కలిసి ఆంజనేయులు నాయకత్వంలో పెద్దపెద్ద ఆట లాడుకునే వారు.

ఇట్లా ఉండగా చంద్రశేఖర్ దిగారు. ఇప్పు డాయన వుద్యోగం మీద బెంగుళూరులో వుంటున్నారు. ఆయన అక్కడ వున్న ఆధ్యాత్మికకేంద్రా లన్నింటికీ వెళ్ళి అక్కడి కబుర్లన్నీ రమణస్థానీయులకి తీసుకువొచ్చి అందించే వారు. ముఖ్యంగా ఆయనకి చలంగారితోనూ, నర్తకితోనూ ఎక్కువ పరిచయం. షౌతో ఆయన నాలుగైదు నిమిషాలు

మాత్రమే మాట్లాడానికి time వుండేది. చలంగారినే గురువుగా భావించే వారాయన.

"సుధే నాకు అన్ని బోధలకన్నా గొప్పబోధ" అనేవారు. భజన్లలో పాడేవారు.

ఉషకి ఆరోగ్యం చేకూరేందుకుగా ఈశ్వరుడు ఆసనాలు వేయించేవారు. అప్పుడు* శేషయ్యగారుకూడా ఇక్కడే వున్నారు. పిల్లలందరితో కలిపి శేషయ్యగారు, చంద్రశేఖర్ కూడా ఆసనాలు వేసేవారు. పిల్లలందరూ చంద్రశేఖర్‌ని అన్నయ్య అని పిలిచేవారు. అలా పిలవడం ఉమే ఆరంభించింది. ఆయన బాలలకి మిత్రు డైపోయారు. వాళ్ళకి కబుర్లూ కధలు చెప్పేవారు. శోభకి తనుకట్టిన పాటలు నేర్పించేవారు. అప్పట్లో రమణస్థాన్ ఎంత సందడిగా వుండేదో! చంద్రశేఖర్ వలన బెంగుళూరు నించి చాలామంది భక్తులు దిగేవారు—— ఆయనతో కలిసి కొందరూ విడిగా కొందరూ వొచ్చేవారు. వారిలో కొందరుసాధనకని అరుణాచలంలోనే వుండిపోయే వారు. వేసవికాలం సెలవులుకాగానే రమణస్థాన్‌కి వొచ్చిన పిల్లలు అతిధులూ ఎవరిళ్ళకి వాళ్ళు వెళ్ళిపోయారు.

పకపక, వజీర్ టిప్పుల్ మొదటి పుట్టినరోజు ఇక్కడే చెయ్యాలనుకున్నారు. ఆ celebrations ఎలా వుండాలో షా plan చేశారు. ఆ పుట్టినరోజుకి తామేం చేయబోతున్నారో రమణస్థానీయులకి పికారులో చెప్పి పకపకకి తెలియకుండా రహస్యంగా వుంచమన్నారు షా. రమణస్థానీయు లారోజున ఏం చేయదలచుకున్నారో పకపకకి కొంత వరకూ చెప్పేసింది శోభ. తోరణాలతో, లైట్లతో అలంకరించబోతున్నారని. కానీ ఇంకా కొన్ని విషయాలు అనుకున్నారు- అవి శోభకి అర్థం కాలేదు. అవి రహస్యంగానే వుండి పోయాయి. పురుషోత్తం

నించి come september record తెప్పించి గ్రాంఫోన్ మీద play చేయడం వాటిల్లో ఒకటి.

టిప్పల్ చిన్నప్పటి నించీ వువ్వీ వాళ్ళింట్లో పెరిగింది. టిప్పల్‌ని ఎ'క్కొని ఆ రికార్డుకి డ్యాన్సు చేసేవాడట వువ్వీ. అందువల్లనే టిప్పల్ పు నరోజుకి ఆ రికార్డు తెప్పించాలను కున్నారు షౌ. వువ్వీకి, బుచ్చికి టి ప్పల్‌మీద ఎంతో ప్రేమ.టిప్పల్‌కి కూడా వాళ్ళమీద పట్టలేని ప్రేమ. టిప్పల్ పుట్టినరోజుకి వువ్వీకూడా తిరువన్నామలై వొచ్చాడు.

ఆరోజు సాయంత్రం అయిదు గంటలకి టీపార్టీ ఏర్పాటుచేసి రమణనగర్ వాళ్ళందర్నీ పిలిచారు. వరండా అంతా అలంకరణ చేయించి దీపాలు పెట్టించారు షౌ. టిప్పల్‌ని షౌ ఒళ్ళో కూచోపెట్టి హారతి ఇచ్చారు. అనుకున్నట్లుగా గ్రామఫోన్ తెచ్చి come september record పెట్టారు.

వువ్వీ టిప్పుని తీసుకుని డ్యాన్సు చేయ నారంభించారు. ఆయన గూడకట్టు అదీచూస్తే అందరికి మొదట నవ్వుగానే వుంది. చూస్తూ వుండగానే వువ్వీ మొహమే మారిపోయింది. టిప్పు మొహం 18 ఏళ్ళపిల్ల మొహంలాగ మారిపోయింది. ఏదో ball room danceలా చేస్తున్నారు వాళ్ళిద్దరూ, ఆ రోజెంతో గొప్పగా గడిచింది. ఇప్పటికీ come september music విన్నప్పుడు ఆడ్యాన్సే తమ కళ్ళముందు నిలుస్తుందంటారు షౌ.

చిన్న హార్మోనియం వొచ్చాక రమణస్థానీయు లందరూ షౌ మంచి ఫోల్డింగ్ హార్మోనియం వుంటే బావుంటుందని అనుకున్నారు. అందుకోసం రమణస్థానీయులు కాశ్మీరా బతికివున్న రోజులనించీ కలలు కంటున్నారు. అలాంటి హార్మోనియం ఒకటి ఈవూళ్ళోనే బసవ రాజుగారి దృష్టిలో పడింది— అది పాత తొక్కుడు హార్మోనియం.

దాని రీడ్లు— ప్యారిస్‌వి. ఆ హార్మోనియం శబ్దం ఎంత బావుందోకానీ హార్మోనియం మాత్రం బాగా చీకి పోయింది. వజీర్, సంగీతరావుగారు దాన్ని మద్రాసు తీసుకుని వెళ్ళి రిపేర్ చేయించి పంపారు. బాగయినాక తీసుకువొచ్చి వాయిస్తే అన్నీ అపస్వరాలు కానీ ఆహార్మోనియం శబ్ద మాధుర్యంలో షాకి అపస్వరాలు వినబడేవికావు. తక్కిన రమణ స్థానీయులు మాత్రం "ఏమిటీ హార్మోనియం ఇట్లా వుంది?" అనిగోల పెట్టేవారు. దాన్ని మళ్ళీ మద్రాసుగానీ ఎక్కడికిగానీ ఎలా పంపిస్తారు? ఇంతలో సారంగపాణి "మాబంధువు ఒకరు దొరస్వామి అనే ఆయన హార్మోనియం రిపేరర్. ఆయన వేలూరులో వుంటారు. వారినిరమ్మన మంటే తీసుకుని వొస్తాను" అన్నారు. సారంగపాణి తరచు పనిమీద వేలూరు వెళ్ళేవారు. ఒకసారి దొరస్వామిని తీసుకుని వొచ్చారు.

దొరస్వామి తెలుగు నాయుడు బిడ్డ. మంచి హుషారైన మనిషి. ఆయనవొచ్చి ఆ హార్మోనియాన్ని చూశారు. షా ఆయనతో హార్మోనియంలో అపస్వరాలన్నీ పోగొట్టమని చెప్పారు. షాని మొదటిసారి చూడగానే ఆమెపట్ల ఆయనకి భక్తి కుదిరింది.

ఆయన ఆ హార్మోనియం పెట్టెనంతా విప్పి అంతా దులిపి, బాగుచేసి రీడ్స్ అరిగిపోయినాగానీ వీలున్నంత వరకూ సరిజేశారు.

ఏ హార్మోనియాన్నైనా చూడగానే దాని వయస్సెంతో అది ఎక్కడెక్కడ తిరిగిందో, దాని ఖరీదెంతో అది ఏ కంపెనీదో— చిటికెలో చెప్పెయ్యగల రాయన.

గొప్ప చాతుర్యంతో నైపుణ్యంతో హార్మోనియాన్ని వాయించగల వారిని ఎందరినో చూశారుగానీ రిపేరర్లలో దొరస్వామి వంటి ఆర్టిస్టుని చూడడం షాకి ఇదే మొదటిసారి. అసలాపని అంటేనే ఆయ

నకి అమితమైన ప్రేమ. ఒక్కొక్క నట్‌ని బిగిస్తోంటే— ఆయన ఆపనిముట్లని (నట్స్‌ని,స్క్రూలనీ) పట్టుకోవడం అదీచూస్తే సుకుమారమైన స్త్రీలు పువ్వుల్ని ఎంతో నాజూకుగా, సుతారంగా పట్టుకుని మాలగా కూరుస్తున్నట్లు వుంటుంది. రమణస్థాన్‌లోని వాయిద్యాలని ఆయన ముందు వుంచితే చాలు అవి తమ స్వంతమైన వాటిలా ఎంతో ప్రేమతో భద్రంగా బాగుచేసి వెళ్ళే వారాయన.

దొరస్వామికి షౌకి ఒకమంచి హార్మోనియం తయారుచేసి ఇవ్వాలని కోరిక. "ఎందుకండీ మీకీ పాత హార్మోనియాలు. మీకో మంచి హార్మోనియం చేసి ఇస్తాను" అంటారు ఆయన.

రాయిడి నాగేశ్వరరావుగారు తమ హార్మోనియాన్ని ఈశ్వరుడికి సమర్పిస్తామని వుత్తరం రాశారు. ఆయన బీదవారు. ఆయనకి వున్న ఆస్తల్లా— ఆ హార్మోనియం ఒకటే. అందువలన ఆ సమర్పణని తీసుకోవడానికి సౌరిస్ అంగీకరించలేదు.

నాగేశ్వరరావుగారు "నా హార్మోనియం రమణస్థాన్‌కి ఇచ్చివేస్తాను." అని పదేపదే వుత్తరాలు రాయడం మొదలుపెట్టారు.

అప్పుడు చలంగారు ఆయనకి—

"మీ హార్మోనియం సంగతి— మీరు మీ ప్రాణప్రదమైన హార్మోనియాన్ని ఈశ్వరుడికి సమర్పిస్తామంటే, ఆయన తప్పక స్వీకరిస్తారు. నైవేద్యంలో సగం తిరిగి ఇవ్వాలి కదా ఆరాధకుడికి. సగం హార్మోనియం ఎల్లా ఇస్తారు? కనక—

"నువ్వు నాకీ హార్మోనియా న్నిచ్చావు. ఇది నాది. దీన్ని నేను నీకిస్తున్నాను. తీసుకో. ఈ హార్మోనియం లేనిది నువ్వు సరిగా పాడలేవు. నువ్వు సరిగా పాడకపోతే నే నాపాటని వినగలనా? నీ హార్మోనియం ఎక్కువా? పాట ఎక్కువా? ఏది నీనించి నాకు కావలసినది?

కనక భక్తితో ఆర్ద్రమైన నీపాటకి ఈ హార్మోనియమే ఆధారం"
అంటారు ఈశ్వరుడు.

కనుక హార్మోనియం పంపే ప్రయత్నం చేయకండి.

(రాయిడి నాగేశ్వరరావుగారికి చలంగారిలేఖ 29-9-66)

నాగేశ్వరరావుగారు మాట్లాడకుండా వూరుకున్నారు. ఒకసారి తిరువన్నామలై వొచ్చినప్పుడాయన రమణస్థాన్‌లో వున్న చిన్న తొక్కుడు హార్మోనియాన్ని తమతో తీసుకునివెళ్ళారు. రమణస్థానీయుల్ని తమదగ్గరున్న పెద్దహార్మోనియాన్ని తెచ్చుకోమన్నారు.

"మీకెంతో ప్రియమైన కళానిలయానికి భూషణమైన మీ హార్మోనియాన్ని తీసుకోడానికి చాలా సంకోచించారు సౌరిస్. చివరికి మీరంతగా ప్రార్థిస్తున్నారని మిమ్మల్ని నొప్పించడం ఇష్టంలేక దాన్ని తీసుకోడానికి అంగీకరించారు"

(నాగేశ్వరరావుగారికి చలంగారిలేఖ 23-4-68)

చివరికి ఎటువైపూ చెప్పలేక చలంమహర్షి ఆ సమర్పణని ఈశ్వర పక్షాన అంగీకరించి ఆ హార్మోనియాన్ని తీసుకురావడానికి కృష్ణారావుగార్ని పంపించారు.

"మాముడూరు నించి కృష్ణారావు బైలుదేరుతున్నట్టు రాశాడు. వీలైతే అతన్ని గుడివాడికి వొచ్చి హార్మోనియం తీసుకు రమ్మన్నాను.

పాత హార్మోనియంకి ఏమన్నా బేరాలు వొచ్చేట్టు వున్నాయా?

(నాగేశ్వరరావుగారికి చలంగారిలేఖ 10-5-68)

కృష్ణారావుగారు ఆ హార్మోనియాన్ని ఆంధ్రదేశం నించి భద్రంగా తీసుకుని వొచ్చారు. ఆవివరాలు చలం మహర్షి ముఖతానే విందాం.

"కృష్ణా, హార్మోనియం ఇద్దరూ సుఖంగా ఏం నలిగి పోకండా చేరారు. హార్మోనియం గొప్పగా వుంది. దాని శబ్దం ఎంతో గంభీరం, శ్రావ్యం. మీవంటి పాటకులు పాటే ప్రాణంగా చూసుకునేవారు. ఆహార్మోనియాన్ని ఈశ్వరుడికి నైవేద్యంగా అర్పించారు, ధన్యులు.

దీనికి బదులు (సిగ్గేస్తోంది రాయటానికి) అమ్మకానికి మీ వొద్దకు తెచ్చిన హార్మోనియాన్ని మీరు తీసుకోండి. అనుభవించటానికి, కోపమొస్తే పగలకొట్టడానికీ, అమ్మడానికీ, అన్నిహక్కులతో మీకిచ్చేస్తున్నాము.

ఈ హార్మోనియానికి చిన్నచిన్న రిపేర్లు వున్నాయి, చెయ్యవలసినవి. ఆ ప్రయత్నంలో వున్నాము.

"ఈశ్వరాదరణలో అందరం సుఖంగా వున్నాం"

(నాగేశ్వరరావుగారికి చలంగారిలేఖ 3-6-68)

నాగేశ్వరరావుగారు పంపిన హార్మోనియం సరైన condition లో లేకపోవడాన దొరస్వామిని రిపేర్ నిమిత్తంగా పిలిపించారు షౌ. దొరస్వామి ఆ హార్మోనియాన్ని చూడగానే "ఇది ఆంధ్రాలో చాలా చోట్ల తిరిగి వొచ్చిందండీ" అన్నారు. ఆయన మాటలు విని షౌకి ఆశ్చర్యం కలిగింది. ఆ హార్మోనియాన్ని ఆయన ఎంతో బాగా తయారు చేశారు.

తరువాత్తరువాత రమణస్థాన్‌లో తంబురాలు చేరాయి. ఏడాదికోసారి దొరస్వామిని పిలిస్తే ఆయన డాక్టరు మనిషిని checkup చేసినట్లుగా రమస్థాన్‌లో వాయిద్యాలన్నింటినీ checkup చేస్తారు. ఒకసారి దొరస్వామి చెయ్యిపడితే ఆ వాయిద్యాలెన్నటికీ పాడుకావు. రమణ భగవాన్ భవరోగ వైద్యుడయినట్లుగా దొరస్వామి రమణస్థాన్ వాయిద్యవైద్యులు.

# 30

చలంమహర్షి వాళ్ళు 'భక్తి'లో వుండేరోజుల్లో బోస్ "ఈఇల్లు (అనాసక్తి) ఎందుకూ పనికిరాకండా పడివుంది. ఈ ఇంటి **owners** ఎక్కడో వుంటారు. మీరు వాడుకోండి. ఇప్పటికే చెదలు పట్టింది. ఇలా ఖాళీగా వొదిలేస్తే పూర్తిగా నాశనం అయిపోతుంది" అని 'అనాసక్తి'ని చలంగారికి అప్పగించారు.

చలంగారు వాళ్ళకి ఆ ఇంటిని వూరికే వాడుకోవడం ఏమాత్రమూ ఇష్టంలేక ఆఇంటి అద్దెనిమిత్తంగా కొంత ద్రవ్యాన్ని కేటాయించి, ఆమొత్తాన్ని రిపేర్లకి, ఇంటిపన్ను కట్టడానికి వినియోగించేవారు. అనాసక్తిని ఎవరెవరో కొనాలని అనుకునేవారు. కానీ ఆఇంటి **owners** ఎక్కడుంటారో ఎవరికీ తెలిసేది కాదు. చివరికి బోస్‌కాంపౌండ్‌లో వుంటున్న వారొకరు వాళ్ళ అజ తెలుసుకుని ఆఇంటిని వారినించి కొన్నారు.

అనాసక్తి తమ అధీనంలో లేకపోతే ఏం చేయాలనే ఆలోచన చేసి రమణస్థానీయులు వేరేచోట భూమిని కొనుక్కుని ఇల్లు కట్టించుకునేందుకు నిశ్చయించుకుని రోజూ షికారులో తగిన జాగాకోసం వెతికేవారు. ఈసంగతి సందర్భాలన్నీ తమ **patron** అయిన చేకి వివరంగా వుత్తరం రాయించారు చలం. చే అరుణాచలం వొచ్చారు.

ఇప్పటిదాకా అనాసక్తి తమ అధీనంలోనే ఇన్నేళ్ళూ వుండడం, రిపేర్లు వగైరా తామే చేయించడం తామే పన్నుకూడ కడుతూ వుండడం, ఇప్పుడు దాన్ని ఎవరో కొనుక్కోవడం చేకి చెప్పారు చలం.

"ఇన్నేళ్ళూ వరసగా మనమే **tax** కడితే ఇల్లు **automatic** గా మనదే అవుతుంది. ఇందులో గొడవ పడేందుకు ఏముంది? లాయర్ నోటీస్ ఇవ్వచ్చు" అన్నారు చే.

చే, కృష్ణారావుగార్ని వెంటబెట్టుకుని లాయరు దగ్గరకి వెళ్ళారు. ఆ లాయరుకూడా సంగతంతా విని, "అవును, దీంట్లో ఏమాత్రం సందే హం లేదు. ఖచ్చితంగా ఇల్లు మీదే అవుతుంది.

అయినా ఈ ఇంటిని ఇంకోరు కొనుక్కున్నారు కదా? ఆయ నకి నష్టం అవుతుంది కదా? మీకూ ఆయనకీ రాజీ చేయిస్తాను" అన్నారు.

"ఔను, మేం ఆయనకి దీనిమీద ఆయన ఎంత ఖర్చు పెట్టారో అంతా pay చేస్తాం" అన్నారు చే.

చే, కృష్ణారావు 'అనాసక్తి' కొనుక్కున్నవారి దగ్గరకి వెళ్ళారు. ఈ proposal కి ఆయన ఒప్పుకోలేదు. అప్పుడు వాళ్ళు ఆయనని లాయరు దగ్గరికి తీసుకుపోయారు. లాయరు లా (law) చెప్పారు. "నువ్వు ఈ ఇంటిని వాళ్ళకి అమ్మకపోతే వాళ్ళు వ్యాజ్యం వేస్తేకనుక వుచితంగా వాళ్ళది అయిపోతుంది, అది నీకే నష్టం. నీకు వాళ్ళు pay చేస్తామంటున్నారు గనుక ఆ డబ్బు తీసుకో" అని చెప్పారాయన. తాము కొన్నదాని కంటే వెయ్యి రూపాయలు అధికంగా ఇస్తామంటే ఆయన ఇంటిని అమ్మడానికి అంగీకరించారు.

ఆవిధంగా ఇవాళ చలంగెస్టుహౌస్ అనబడే 'అనాసక్తి' చలం గారి అధీనంలోకి వొచ్చింది. అందరూ చేని మెచ్చుకుంటూ వుంటే "నాదేముంది? అంతా భగవాన్ చేయించారు" అని నవ్వేశారు చే.

అనాసక్తి గృహప్రవేశోత్సవం చేశారు. రమణనగర్‌లో అం దర్నీ పిలిచారు రమణస్థానీయులు. ఏన్ అనే అమెరికన్ అమ్మాయి ఆ వుత్సవానికి వొచ్చింది. ఆశ్రమం ప్రెసిడెంటుగారి భార్య నాగ లక్ష్మికి చలంగారి కుటుంబమంటే చాలా అభిమానం. ఆమెకూడా వొచ్చారు. అనాసక్తిలో వున్న ఇనపపెట్టెమీద భగవాన్ ఫోటో పెట్టి

పువ్వు లలంకరించారు. నాగలక్ష్మి భగవాన్‌కి పూజ చేశారు. షౌ భజన చేశారు. ఏన్ ఇంగ్లీషు పాటలు పాడింది. రమణస్థానీయుల 'అనాసక్తి' ప్రవేశోత్సవం గొప్పగా జరిగింది భగవాన్ దయవల్ల. రమణుల పటం అక్కడి గది గుమ్మానికి తగిలించి అందరూ రమణస్థాన్‌కి వొచ్చేశారు. ఎప్పటినించో చలం మహర్షి ఆశ్రమానికి వొచ్చే అతిథి అభ్యాగతులకి నివాససౌకర్యం కల్పించిన 'అనాసక్తి' శాశ్వతంగా చలం మహర్షి అధీనంలో నిలిచి పోయింది.

పకపక, వజీర్, టిప్పు కాకినాడ వెళ్ళినప్పుడు అమ్మని చూడడానికి వెళ్ళారు. అంతక్రితం పకపక, వజీర్ కాకినాడ వెళ్ళినప్పుడు అమ్మని తమతో వొచ్చెయ్యమని అడిగారట. అక్కడవున్న కొన్ని కుటుంబాలకి అమ్మే పెద్దదిక్కు. వాళ్ళని చూపించి "నేను వొచ్చేస్తే వీళ్ళనందర్నీ ఎవరు చూసుకుంటారు? అన్నదట అమ్మ. ఇప్పుడు మాత్రం పండులాంటి మనవరాల్ని చూడగానే కరిగిపోయింది ఆమె హృదయం. వజీర్ వాళ్ళతో కలిసి మద్రాస్ వొచ్చేసింది. తరువాత పకపక, టిప్పు, అమ్మ కలిసి తిరుపన్నామలై వొచ్చారు.

ఈమాటు వొచ్చినప్పుడు అమ్మలో ఎంతమార్పో! కొంచెం మతిస్థిరం లేనట్లు మొహంవున్నా కానీ మనిషిలో ఎంతో మార్పు. ఇన్నేళ్ళకి మళ్ళీ ఆమె ముఖంలో మనవరాల్ని చూసుకుని— మునుపటి సంతోషం వెల్లివిరిసింది. ఇప్పుడు ఆమెకి మనవరాలే లోకమై పోయింది. గిరిప్రదక్షిణాలకి కూడా వొచ్చేది. ఇక్కడ వున్నన్నాళ్ళూ వుండి మళ్ళీ పకపకా వాళ్ళతో కలిసి మెద్రాస్ వెళ్ళిపోయింది అమ్మ.

మా తాల్యార్ ఖాన్ పాతాళలింగానికి కుంభాభిషేకం చేయిస్తున్నారు. ఆవిడ షౌని కుంభాభిషేకానికి రావాలని అడిగారు. "అంత జనంలోకి నేను రాలేను" అన్నారు షౌ. ఆవిడ షౌని ముందరిరోజునే

రమ్మని ఆహ్వానించారు. చలంగారు, నర్తకి కార్లో వొచ్చారు. షౌ తక్కిన రమణస్థానీయులు నడిచి గుడికి వెళ్ళారు. అక్కడికి వెళ్ళాక షౌని పాడమన్నా రామె. షౌ వాళ్ళు తమవెంట హార్మోనియంగాని, శ్రుతి పెట్టెగాని తీసుకుని వెళ్ళలేదు. ఏదో వూరికే ఒకటి రెండు పాటలు శ్రుతి వేసుకోకండా పాడవొచ్చును గానీ వరసగా పాటలు శ్రుతి వూతలేకండా పాడటం షౌకి చాలా కష్టం. కృష్ణారావుగారు ఆలయవిద్వాంసుల శ్రుతిపెట్టి అడిగి తెచ్చారు. తాల్యార్‌ఖాన్ షౌ వాళ్ళని పాతాళలింగం గుడి లోపలికి తీసుకుని పోయారు. ఇంకెవరూ రాకండా లోపలివైపు తాళం పెట్టించేశారు. షౌ పాడడం మొదలు పెట్టారు. సారంగపాణి తమ **health officer** తో కలిసి అక్కడికి వొచ్చారు. ఆ **health officer** ఆ పాటని విని ఎవరా పాడేది అని లోపలికి రాబోయినారు. "ఎవడ్రా ఆ తాళం పెట్టింద"ని తలుపుని కోపంతో ఒకనెట్టు నెట్టా రాయన. కానీ తాళం రాలేదు. వాళ్ళు వెళ్ళి పోయారు.

శివరాత్రికి కామేశ్వరి కోటేశ్వరరావు, ప్రసూన అనే దంపతులతో కలిసి వొచ్చింది. రంగకూడ అప్పుడే వొచ్చాడు. రంగ, కామేశ్వరి 1958 సం॥లో రమణస్థాన్‌లో తొలిసారిగా కలుసుకున్నారు. మళ్ళీ ఇన్నేళ్ళకి వాళ్ళు రమణస్థాన్‌లో కలుసుకున్నది ఈసారి పర్యటన లోనే.

సాధారణంగా శివరాత్రికి గిరిప్రదక్షిణానికి వెళ్ళడం రమణస్థానీయులకి పరిపాటి. అట్లానే ఈమాటుకూడా యమలింగేశ్వరుడికి పూజచేసి రమణస్థానీయు లంతా గిరిప్రదక్షిణానికి వెళ్ళారు. కామేశ్వరి పిల్లలకి కథలు చెబుతూ గిరి చుట్టింది. సరదాగా గిరిప్రదక్షిణాన్ని ముగించి ఈశాన్యమఠం చేరుకుని అక్కడే తాము తెచ్చుకున్న భోజనాలు తిని భజనలు చేశారు రమణస్థానీయులు.

ఈశాన్యమఠం వారెంతో మంచివాళ్ళు. ఎవరు వెళ్ళినాగానీ ఎంత బాగా ఆదరిస్తారో ! మఠం తోటలో ఎదురుగుండా అరుణాచలం కనబడుతూ వుండేచోట కూచుని కామేశ్వరి, రంగ, శోభ, షా, చలం గారు, రమణస్థానీయు లందరూ కలిసి భజన చేశారు. అది ఎంతో అందమైన సాయంత్రం. రంగ సంగీతంతో ఆనాటి సాయంత్రమే పరవశించి పోయింది. భజన పూర్తయినాక అందరూ ఇంటికి వొచ్చే శారు.

కామేశ్వరి జీవితం చండీఘర్‌లో గొప్ప turmoil లో గడిచిం దట. అమెకి పంచదశీ జపం, లలితా సహస్రపారాయణం, ధ్యానమూ ఓదార్పుగా అయిపోయాయి. ధ్యానంలో తప్పదేనిలో నించి ఆమెకి ఆనందం రావడం మానేసింది. భర్త ఇంగ్లాండులో వుండడం వలన ఆమె army లో తన వుద్యోగానికి రాజీనామాచేసి వైజాగ్ Medical college లో చేరారు. కానీ ఆమెకి అక్కడ వుండాలనిపించక ఇం గ్లాడు వెడితే బాగుండు ననిపించి pass port తయారు చేయించు కున్నారు. తమ గురువైన సౌరిస్ ఆశీర్వాదాన్నీ, అనుమతినీ అర్థించేం దుకుగాను కామేశ్వరి ఈమాటు వొచ్చారు. అప్పుడు షా "కామేశ్వరి! నువ్వు army నించి ఎందుకు వొచ్చేశావు? నీకు ఇంగ్లాడు వెళ్ళడం ఎంతమాత్రమూ మంచిదికాదు. ఇంక నేను ఆశీర్వాదం ఎలాగిస్తాను. నీశక్తి చూసుకుని వెళ్ళు" అన్నారు షా. అప్పుడు కామేశ్వరి గురువు మాటని అతిక్రమించి గురువు ఆశీర్వాదం లేకండా ఇంద్రపదవయినా తమకి అక్కరలేదని మళ్ళీ వుద్యోగంలో చేరిపోవడానికి నిశ్చయించు కుని ఇక్కడే వుండిపోయారు.

కామేశ్వరి కలకత్తాలో వుండగా టెన్సింగ్‌నార్కే హిమాల యాల అధిరోహణకి వెడుతూ వుంటే మౌంటెనీరింగ్ కోర్సులలో

పాల్గొని హిమాలయాలలో 20000 అడుగుల ఎత్తు వరకూ వెళ్ళి వొచ్చింది.

కామేశ్వరికి అరుణాచల శిఖరం ఎక్కాలని వుబలాటం. రంగని బసవరాజుగార్ని తనతో రమ్మని అడిగింది. షాని అనుమతి అడిగింది కామేశ్వరి. షా "మీరు వెళ్ళేటట్లయితే తెల్లవారగట్ల నాలుగుగంటలకే లేచి వెళ్ళండి. లేకపోతే ఎండ మాడ్చేస్తుంది" అన్నారు. "ఈకొండని ఎక్కడం ఎంత సేపు, నేను టెన్సింగ్ నార్కేతో హిమాలయాలే ఎక్కాను" అంది కామేశ్వరి.

మరుసటి రోజువుదయం కామేశ్వరీ బృందం అందరూ వెళ్ళడానికి సిద్ధమయ్యారు. ప్రసూనగారు సరదా పడ్డారే గానీ ఆమెకి కొండంటే ఏమిటో తెలియదు. రంగకి వెళ్ళడానికి ససేమిరా ఇష్టం లేకపోయినా కామేశ్వరి మొగమాటం వల్ల రావడానికి ఒప్పుకున్నాడు.

వాళ్ళంతా ఇంటిదగ్గర తెమిలి బయలుదేరే సరికే ఎనిమిది న్నరయింది. వాళ్ళు హోటలుకి వెళ్ళి ఇడ్లీలు కొనుక్కుని మరీ వెళ్ళాలి. అయినా వాళ్ళు ధీమాగా వెళ్ళారు. ఆ రోజు పగలు ఆకాశంలో ఎక్కడా మబ్బుతునకకూడా లేదు.

ఆవేళ రమణస్థానీయు లంతా కోటేశ్వరరావుగారు కృష్ణయ్యగారు వెంటరాగా పెద్దగుడికి వెళ్ళారు. రమణస్థానీయులకి గుడికివెళ్ళి అక్కడ కోవెల బైటవున్న మెట్లమీద కూచోవడం అలవాటు. ఈమారు అలాగే కూచున్నారు.

దూరంగా వున్న ఒక మండపం నించి ఒకముసలమ్మ ఒంగి నడుస్తో వొస్తోంది. ఆమె దగ్గరగా వొచ్చినా కూడా ఆమె పడుచామో, ముసలావిడో రమణస్థానీయులకికూడా తెలియలేదు. ఆమె జుట్టంతా దుమ్ముకొట్టుకుపోయి రేగి వుంది. ఆమెవెంట ఒక పొడుగా టతను

చేతిలో పెద్దకర్ర పట్టుకుని దిగాలుగా తలవొంచుని కాళ్ళీడ్చుకొంటూ వొస్తున్నాడు. ఆమె దగ్గరగా వొచ్చి షా వొళ్ళోకి ఒక్కదూకు దూకింది. ఆమే కామేశ్వరి. ఆమె మొహమంతా నల్లగా మాడిపోయి వుంది. ఆపెద్ద కర్ర పట్టుకున్న పెద్దమనిషే రంగ. ఆయన ఒళ్ళంతా దుమ్ముకొట్టుకుని వుంది.

తమ **adventure** అంతా కామేశ్వరి షాకి చెప్పింది. అప్పుడు షా "హిమాలయం మంచుకొండ గనక సరిపోయింది. అరుణాచలం అగ్నిపర్వతం, మాడిపోరా?" అన్నారు. ఇంతకీ వాళ్ళు సగందూరం వెళ్ళేసరికి ప్రసూనగారు నడవలే మన్నారట. ఆమె ఒకచోట కూచుండి పోయారు. ఆమె వెంట ఒకరు వుండి మిగితవాళ్ళు శిఖరం మీదికి వెళ్ళి దిగి వొచ్చేశారు. తరువాత ప్రసూన దగ్గర కూచున్నవారు వెళ్ళి వొచ్చే శారు. నడినెత్తిన సూర్యుడు మాడ్చేశాడు. వాళ్ళంతా ఎట్లాగో నానా అవస్థలూ పడి ప్రసూనని కిందికి దింపుతున్నారు. సగం దోవలో ఒక తను ఎదురుపడ్డాడు. అతను వాళ్ళ అవస్థనిచూసి అక్కడి కొండగడ్డిని ప్రసూనగారి కాళ్ళకి జోళ్ళలాగ తాళ్ళతో కట్టేశారు.

అక్కడొక చీలిక దోవ కనబడింది. ఎటువెళ్ళాలో వాళ్ళకి అర్థం కావడంలేదు. ప్రసూనగారు ఏడుస్తున్నారు. ఎటువెళ్ళాలో వాళ్ళకి తోచటంలేదు. ఎండ మాడ్చేస్తోంది. ముందు రాత్రి జాగరణచేసిన కామేశ్వరిప్రాణం నీరసించిపోయి— "భగవాన్ మమ్మల్ని ఒకదోవకి చేర్చండి" అని ప్రార్థించింది. రంగ ముందుగా వెళ్ళిపోయాడు. అతను వెళ్ళి ఏంచేశాడో కానీ అప్పుడే విరుపాక్షి గుహలోవున్న ఒకసాధువు గొడుగు వేసుకుని ఒక చిన్న ప్లాస్టిక్ బకెట్టులో చల్లని నిమ్మరసం తీసుకువొచ్చి కామేశ్వరి బృందానికి ఇచ్చారు. ఆయన తమ జోళ్ళని ఇస్తే అవి ప్రసూనగారు తొడుక్కున్నారు. ఆయన తను కప్పుకున్న

అంగవస్త్రాన్ని ఇస్తే కామేశ్వరి అది చించి కాళ్ళకి చుట్ట బెట్టుకుంది. వాళ్ళంతా ఎట్లాగో చూతగుహకి చేరుకున్నా రట. అక్కడినించి వాళ్ళు విరూపాక్షి గుహదగ్గరకి వొచ్చేసరికి అక్కడవున్న ఒకామె వాళ్ళకి మజ్జిగా అన్నం పెట్టింది. అలిసిపోయి ఆకలితో వున్నవాళ్ళ పొట్టలో ఇంత అన్నం చల్లంగా పడేసరికి వాళ్ళకి ప్రాణంలేచి వొచ్చి అక్కడే కొద్దిసేపు విశ్రమించి చివరికి నడిచి రాగలిగా రట.

ఇంటికి వొచ్చి భోజనాలు కాగానే భజన మొదలు పెట్టారు. షౌ 'అరుణాచల శివ' అని భజన ఎత్తుకోంగానే రంగ, కామేశ్వరి ఒకళ్ళ మొహాలొకళ్ళు చూసుకుంటూ అదేపనిగా నవ్వారు. షౌ కూడా అంత కంటే ఎక్కువగా నవ్వారు- వాళ్ళతో కలిసి.

నాలుగు రోజులు గడిచాక రంగ, కోటేశ్వరరావు, ప్రసూన వాళ్ళ వూళ్లు వెడుతున్నారు. కామేశ్వరి తానుకూడా వూరు వెడుతున్నా నని చెప్పడానికి వొచ్చింది.

పోయినసారి కామేశ్వరి వొచ్చినప్పుడు "ఈ వుద్యోగాన్నీ అన్ని టినీ వొదిలేసి ఎప్పుడైనా సరే సాధనలో వుండి పోగలను. నాకేదీ పట్టదు" అంది చలంగారితో. చలంగా రామాటని ఆమెకి గుర్తుచేశారు. "ఓ ఈ నిముషాన వుండిపోగలను" అన్నది కామేశ్వరి. "సరే వుండి పో చూద్దాం" అని ఛాలెంజి చేశారు చలం. అప్పుడు కామేశ్వరి బండిలో ఎక్కించిన తన సూట్‌కేస్‌ని దింపుకుని తాను రావటల్లేదని కోటేశ్వరరావుగారు వాళ్లతో చెప్పింది.

కామేశ్వరి ఇక్కడే వుండి సాధన చెయ్యాలని నిశ్చయించు కొంది. ఆమెకి షౌ అంటే ఎనలేని భక్తి. ఆ రోజులలోనే చలంగారి చూపు మందగిస్తోంది. అందువల్లనే షౌ వారికి కథలూ, కవిత్వాలూ చదివిపెట్టేవారు. కామేశ్వరికూడా వాళ్ళతో చేరింది.

కామేశ్వరికి అమ్మవారంటే అమితమైన భక్తి. రాజరాజేశ్వరి పటమొకటి కొనుక్కుని, ఆ పటాన్ని షా గదిలో పెట్టింది. ఇంక రోజూ పువ్వులు కోసి షా తల్లి పాదాలకి, రాజరాజేశ్వరీదేవికి పెట్టి లలితా సహస్రనామం చదువుతూ కూచునేది.

షా హార్మోనియాన్ని చూస్తే కామేశ్వరికి తగని ఈర్ష్య. "హాయిగా ఈ హార్మోనియాన్ని అయినా అయ్యేను గాను. షాకి దీని మీదున్న ప్రేమ మనుషులమీద లేదు"—అనేది.

ప్రతిసంవత్సరమూ హార్మోనియం క్లీనింగ్‌కి రిపేర్లకి దొరస్వామి వేలూరునించి వచ్చేవారు. కామేశ్వరి వుండేరోజులలోనే ఆయన వొచ్చి వెళ్ళారు. ఆయన వెళ్ళిపోయాక కామేశ్వరి- "దొరస్వామినన్నా కాకపోయాను. ఎవర్నీ ఏవిషయమూ అడగని షాకి అతనంటే ఎంత శ్రద్ధో! భోజనం చేశారా? కాఫీ తాగారా? అని ఎంతో ప్రేమగా అడుగుతారు" అనేది.

అప్పట్లో నర్తకి బీదవాళ్ళకి వైద్యాలు చేసేది. తేలుకుడితే బాధ లేకండా చేసే ఒకయంత్రాన్ని మెర్‌స్టన్ నర్తకికి నేర్పింది. తేలు కుట్టినవాళ్ళకి నర్తకి నీలంనీళ్ళు పోస్తే క్షణంలో నయమయ్యేది. నర్తకిచేసే వైద్యం చూసి కామేశ్వరి ఆశ్చర్యపడేది. "రమణస్థాన్‌కి వొస్తే నేను డాక్టర్నన్న స్పృహే వుండదు నాకు" అనేది కామేశ్వరి.

కామేశ్వరికి తన పిల్లల చదువొక పెద్దసమస్యగా గోచరించింది. అప్పటికే ఆమె భర్త ఇంగ్లాండు వెళ్ళిపోయారు. అప్పుడు కామేశ్వరి షా అనుమతి తీసుకుని పాండిచ్చేరి అరవిందాశ్రమానికి వెళ్ళింది. అక్కడ ఆమెకి శ్రీమాతని సందర్శించే భాగ్యం కలిగింది. కామేశ్వరిని ఆమె ఎంతో ప్రేమగా పలుకరించి మాట్లాడారట. కామేశ్వరికి లోపల ఆనాటికీ ఇంగ్లాండు ప్రయాణం కావాలా? తనగురువు ఆశ్ర

మంలో సాధన చేస్తూనే వుండిపోవాలా? మళ్ళీ వుద్యోగంలో చేరాలా? అన్న సంఘర్షణ వుండేది. సౌరిన్ 'ఇంగ్లాడు వెళ్ళడం కామేశ్వరికి శ్రేయస్కరంకాద'ని చెప్పారు.

అరవిందమాత ఆరోజుల్లో మాట్లాడే వారు కారు. కామేశ్వరి problemని ఎంతో సానుభూతితో విని "Are you very keen to go abroad my child?" అని ప్రశ్నించారు కామేశ్వరిని.

"నాభర్త అక్కడుండడం వలన నేను వెళ్ళాలనుకుంటున్నాను" అంది కామేశ్వరి.

*"The things are not very good in England. Don't go my child." అని సలహా ఇచ్చారు కామేశ్వరికి శ్రీమాత.

అప్పుడు కామేశ్వరి తమగురువైన సౌరిన్‌తల్లి తమకి, అట్లాగే చెప్పారని- తనకి, వుద్యోగం వొదిలేసి, పిల్లల్ని అరవింద విద్యాలయంలో చేర్చి, తన గురువు చరణాలదగ్గరే వుండిపోయి సాధన చేసుకోవాలని వుందని చెప్పింది. అప్పుడు శ్రీమాత అది సంవత్సరమధ్యమైనా కామేశ్వరి పిల్లల్ని ఆశ్రమ విశ్వవిద్యాలయంలో చేర్చుకుని ఎంతో అపురూపంగా చూసుకున్నారు. అది పాండిచ్చేరి వారందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది. శ్రీమాత కామేశ్వరిని కన్నబిడ్డకన్నా అధికంగా ఆదరించి ఆశీర్వదించి సౌరిన్ సన్నిధిని సాధన చేసుకోవడానికి పంపించారట.

కామేశ్వరి అరవిందాశ్రమానికి వెళ్ళడం వలన షా గురించి చెప్పడంవలన అక్కడివారిలో కొందరికి షా కనబడ్డారట. చాలామంది

* అదే మాటని షా ముందుగా చెప్పారు. ఇక్కడ మూర్తి భిన్నమైనా అరవింద మాతలోనూ, సౌరిన్‌లోనూ నిలిచిన దొకటే తత్త్వమని తెలుస్తోంది.

పాండిచ్చేరి నించి షౌని చూడడానికి రావడం మొదలు పెట్టారు. ఆవిధంగా పాండిచ్చేరిలో చాలామంది గుజరాతీయులకి తిరువన్నామలై విహారయాత్రగా వొచ్చి షౌని చూసి వెళ్ళడం అలవాటై పోయింది.

అక్కడినించి వొచ్చేవారందరిలోకి గొప్పభక్తురాలు కామూబేన్. కామేశ్వరిలాగే కామూబేన్ డాక్టర్. "నేను డాక్టర్ని కాదు, నన్నేమి అడగవొద్దు" అంటారామె. ఆమె బ్రహ్మచారిణి. కామేశ్వరి సంసారి. వారిద్దరికీ అదొక్కటే తేడా. కామూబేన్‌కి షౌ మీరాపాటలు పాడితే ఎంతో సంతోషం. అందుకని తాము వొచ్చినప్పుడల్లా మీరాపాటలు షౌని అడిగి మరీ పాడించు కుంటారు. ఆమెవల్ల షౌ పాటని గురించి చాలా మందికి తెలిసి వినడానికి వొచ్చేవారు. కామూబేన్ చాలా సరదా అయిన మనిషి. ఉత్సాహంలేని మనుషుల్లో ఉత్సాహాన్ని పుట్టిస్తుంది ఆమె వ్యక్తిత్వం. వొచ్చినప్పుడల్లా నర్తకి ఏదోటిఫిన్ పెడితే తిని గంతులువేసి గోలలు చేసి వెళ్ళేవారు కామూబేన్ బృందం.

వీరేకాక పూర్వం నించి పాండిచ్చేరి నించి వొచ్చేవారిలో కామేశ్వరరావుగారు అని ఒక తెలుగువా రున్నారు. ఆయన అప్పుడప్పుడు ఒక ఫ్రెంచి ఆమెతో కలిసి వొచ్చేవారు. షౌ ముందు మౌనంగా ధ్యానంలో కూచుని వెళ్ళిపోయేవారు. తరువాత చాలా రోజులకి ఆయన తెలుగువారని, పేరు కామేశ్వరరావు అని రమణస్థానీయులకి తెలిసింది.

కామేశ్వరి తండ్రి కామేశ్వరిని చూడటానికి వొస్తామని రాశారు. అప్పుడు కామేశ్వరి ఏం జవాబు రాయమంటారని షౌని అడిగారు. అప్పుడు షౌ "తప్పకుండా పిలు. ఆయన సన్యాసాశ్రమంలో వున్నారు. ఆయన ఆచారవ్యవహారాలకి తగినట్లుగా అంతా నువ్వే చూసుకో. సన్యాసాశ్రమంలో వున్నవారికి శాస్త్రసమ్మతంగా చేయవలసిన పద్ధతిలో

సేవచెయ్యి" * అని ఆదేశించారు. కామేశ్వరి తమగురువు శాస్త్రవిధి పట్ల చూపే గౌరవానికి పొంగి పోయారు.

కామేశ్వరి తండ్రే రామానంద భారతీస్వాములవారు. పూర్వాశ్రమంలో పిల్లలమర్రి సుందరరామయ్యగారు. ఆయనే చలంగారి కుటుంబానికి **family photographer.** షౌ చిన్నతనంలో ఆయనే చలంగారింటో **family photos, group photos** తీసేవారు. అందువల్లనే ఆయన చలంగారు వాళ్ళని బాగా ఎరుగుదురు.

ఒకరోజు రమణస్థాన్‌లో భజన ముగిసే సమయానికి వొచ్చారాయన. తిరువన్నామలైకి దోవ సరిగ్గా తెలియకపోవడంతో ఆయన చాలా ప్రయాసతో వొచ్చారు. బస్‌స్టాండ్ నించి రమణస్థాన్‌కి పాంకోళ్ళతో నడిచి బాగా అలిసిపోయారు.

ఆ రోజు భజనలో తామే ఘనుల మనుకునే ఒకరు సన్యాసులను, సన్యాసాశ్రమాలను ఆయన ముందు వెక్కిరించడం మొదలు పెట్టారు. చాలాసేపు అట్టా అవక తవకగా మాట్లాడినతరువాత "ఈయనకి సన్యాసం ఎవరిచ్చారు ? ఎవరూ ఇవ్వకుండానే ప్రతీవాళ్ళు కాషాయాలు కట్టేస్తున్నారు" అన్న వెక్కిరింపు ధోరణిలో మాట్టాడారు ఆ ఒకరు. వీరే లోగడ చలంగారి భగవద్గీత రచనాప్రయత్నాన్ని ఆక్షేపించిన వారు.

* ఇదేమీ ఆశ్చర్యజనకమైన అంశంకాదు. శాస్త్రాలలో చెప్పబడ్డ ఏ ధర్మాన్ని ఆచరించి జగత్తులోని జీవజాలమంతా మాయాచ్ఛేదం చేసుకుని పరాత్పరునిలో లీనంకావాలో ఆధర్మాన్ని మాయకు లోబడక పోయినా తనువుదాల్చివచ్చినవారు భిన్నించరు. ఆధర్మాన్ని అసిధారావ్రతంగా ఎలా కొనసాగించడమో చూపుతారు.

కామేశ్వరి తండ్రి కళ్యాణానందభారతీ మహంత్ స్వాముల వారి శిష్యులని ఎవరో ఆయనకి చెప్పారు. అక్కడితో ఆయన ఆక్షేప ణంతా ఒక్కదెబ్బతో అణిగిపోయింది. అప్పుడాయన సిగ్గుతో కామే శ్వరి తండ్రిదగ్గరకి వెళ్ళి "అయ్యా తప్పయి పోయింది. నేను తెలి యక ఆక్షేపణ చేశాను" అన్నారు క్షమని అర్థించే ధోరణిలో.

"దానికేం లేండి" అని నవ్వేశారు కామేశ్వరి తండ్రి.

"ఎందుకు సన్యసించారు తమరు?" అని అడిగా రాయన.

"పెళ్ళాంతో దెబ్బలాడి" అన్నారు కామేశ్వరి తండ్రి.

అవతలివా రింక తమమాటలు చాలించి నిష్క్రమించారని వేరే చెప్పాలా?

కామేశ్వరి తండ్రి మేడమీద గదిలో మకాం చేశారు. ఆయనకి కామేశ్వరి సేవ చేస్తోంది. మన హైందవ మత ధర్మానుసారం ఇంట పరివ్రాజకులు, సాధువులు, సన్యాసులు ఎవరైన వొచ్చివుంటే వారికి భోజన భాజనాదులు ముందుగా ఏర్పాటు చెయ్యాలి. కామేశ్వరి తండ్రి స్వాములవారు కనుక వారికి అందరికన్నా ముందుగా భోజనం పెట్టాలి. తదుపరి మిగిలినవారు భుజించాలి. రమణస్థాన్‌లో శాస్త్రమర్యాదని పాటించాలని సౌరిస్ చెప్పారు కనుక ఎవరూ ఏమీ మాట్లాడేవారు కాదు గానీ చిన్నపిల్లయిన మిశ్రీ "నా కాకలి వేస్తోందో" అని గోలపెట్టేది.

"చిన్నపిల్ల అంతదాకా వుండలేక ఆకలని ఏడుస్తోంది ఏం చేయ మంటావు కామేశ్వరి?" అని అడిగారు చలం.

అప్పుడు చలంగారు ఆయనకి అందరికన్నా బాగా పెందరాళే భోజనం పెట్టెయ్య మన్నారు కామేశ్వరిని. ఆవిధంగానే ఆయన భోజనం చేసేవారు.

ఆయన కామేశ్వరికి షోడశీ మహామంత్రదీక్షని ఇస్తా మన్నారు. కామేశ్వరి సౌరిస్ అనుమతిని పొంది ఆదీక్షని స్వీకరించారు. అట్లాగే ఒక నియమిత ముహూర్తంలో సౌరిస్ సాన్నిధ్యంలో, అరుణాచలేశ్వరుని సమక్షంలో జన్మకి తండ్రి, కర్మకి గురువైన రామానందభారతీ స్వాముల వారినించి షోడశీ మహామంత్రోపదేశాన్ని పొంది కామేశ్వరి ఆయనకి పాదపూజ చేశారు.

ఇంతట్లో మే నెల వొచ్చింది. అనుకోకండా ఒకనాటి రాత్రి పెద్దవాన పట్టుకుంది. కామేశ్వరి బైట వరండాలో పడుకుంది. షౌ గది కిటికీ తలుపు తెరిచే వుంది. ఆమెకి ఆ వానంతా కనబడుతూనే వుంది.

వానతో బాటు ఆగకుండా ఒకటే మెరువులు. ఒక మెరుపు లోంచే ఇంకో మెరుపు పుట్టుకొస్తోంది. ఆ మెరుపులు మేలిమి బంగారు రంగులో వున్నాయి. అగ్నివర్షం కురుస్తున్నట్లుగా కనిపించింది షౌకి. ఆ మెరుపులమధ్య వానచినుకులు బంగారుకణికల్లా మెరుస్తున్నాయి.

ఇంతట్లో పెద్ద చప్పుడుతో ఎక్కడో పిడుగు పడింది. చిత్ర కామేశ్వరిని "లోపలికి వొచ్చెయ్యి" అని పిలిచింది.

"ఆఁ ఫరవాలేదు, నేను సోల్జర్‌ని" అన్నది కామేశ్వరి. వెంట వెంటనే భయంకరమైన శబ్దంతో నాలుగు పిడుగులు పడ్డాయి. అక్కడితో కామేశ్వరికి భయంవేసి లోపలికి వెళ్ళిపోయింది. షౌ తమ కిటికీ

[illegible]త్వాన్ని అలా చూస్తూనే వున్నారు.

డక పోయినా తనువుదాల్చివచ్చినశారంగపాణి వొచ్చి ఆ పిడుగు

అసిధారావ్రతంగా ఎలా కొనసాగించడమో ఒ పుగ్గిలిపోయి గతు

కులుగా అయి పోయిందనీ, తాము చూసి వొచ్చామనీ షాతో చెప్పారు. ఆ పిడుగులే వూళ్ళో పడితే సగం వూరు— వూరూ పేరు లేకండా నశించిపోయేదే. కానీ యుగాలుగా ఈ వూరికి సాక్షిగా నిలిచి కాపాడు తున్న అరుణాచలేశ్వరుడు దయతో ఆ పిడుగుల్ని తన మీదికి తీసుకుని ఈ వూరిని ఆ ఆపదనించి తప్పించి రక్షించారు.

ఇంతట్లో భగవాన్ జయంతి వొచ్చింది. రాయిడి నాగేశ్వరరావు గారు, ఆయన పిల్లలు కళాధర్, రవి, భార్య సామ్రాజ్యం, మేరికపూడి కనకమ్మగారు వొచ్చారు. జయంతికి చిన్నారావుగారు, సత్యవతికూడా వచ్చారు. ఇంకా చాలామంది వొచ్చారు.

షా తమ గదిలో పాడుకుంటూ వుంటే నాగేశ్వరరావుగారు వొచ్చి హార్మోనియం తీసుకుని తాము పాడటం మొదలు పెట్టారు. ఇంక షా ఎక్కడికి పోయినా ఆమె వెంట తల వొంచుకు నడవడం మొదలు పెట్టారు. షా తమ గదిలోకి వెళ్ళిపోతే ఆయన వెంట వెళ్ళే వారు. ఆమె పడుకుంటే వొచ్చి సాష్టాంగ నమస్కారంచేసి అట్లానే వుండిపోయే వారు. భోజనం మానేశారు. ఆయన భార్యా వాళ్ళకి ఏం జరుగుతుందో నని ఆదుర్దా కలిగింది. షా బైటవరండాలో కూచున్నారు ఒకరోజు. ఆయన వొచ్చి ఆమె పాదాలను పట్టుకుని తల వొంచుకుని కూచున్నారు. వొచ్చిన ఆడవాళ్ళంతా షా చుట్టూ కూచున్నారు.

"ఏమిటమ్మా ఇట్లా అయిపోయినాడు ?" అన్నారు కనకమ్మ గారు.

"ఫరవాలేదు, తగ్గిపోతుంది. ఆదుర్దా పడకండి" అన్నారు షా.

"నాగేష్ మీరు అన్నం తినండి. అన్నం తినకండా ఇట్లా వుండకండి" అని చెప్పారు షా. వాళ్ళు ప్రయాణం అవుతోంటే గుడిపూడి సత్యంగార్ని నాగేశ్వరథావుగార్ని కనిపెట్టివుండి జాగ్రత్తగా

తీసుకు వెళ్ళమన్నారు షా. అందరూ ప్రయాణమై వెళ్ళిపోయారు. గుడిపూడి వెళ్ళాక ఆయన మామూలుగానే వుత్తరం రాశారు. సామ్రాజ్యం కూడా ఆయన బాగయిపోయారని వుత్తరం రాశారు.

మొట్టమొదట గుడిపూడిబృందంతో కలిసి జానకిరాం వొచ్చారు. ఆయన అసలెందుకు వొస్తున్నారో ఎవరికీ తెలిసేది కాదు. ఆయనతో వొచ్చినవారు షాకి నమస్కరిస్తారు కనక వారికి భక్తి అని అనుకో వచ్చు కానీ జానకిరాంలో అవేమీ కనిపించేవి కావు. కానీ మెల్లమెల్లగా ఆయనలో ఎంత సాహిత్యాభిరుచి వుందో చలంగారు వాళ్ళకి తెలుస్తూ వొచ్చింది. ఎక్కడెక్కడి నించో చాలా మంచి పుస్తకాలు తెచ్చి షా వాళ్ళకి చదవడానికి ఇచ్చేవారు. అట్లానే ఆయన సంగీతాభిరుచి గురించి కూడా వాళ్ళకి తెలుస్తూ వొచ్చింది. పైకి మాత్రం ఆయన అన్ని అభిరుచులున్న మనిషిలాగ కనపడేవారు కారు. రసహీనమైన ఆంధ్ర దేశంలో మారుమూల పల్లెటూళ్ళలో ఎంత సంస్కారం దాగివుందో— ఆర్. నాగేశ్వరరావుగారు, జానకిరాం లాంటివారిని చూచినప్పుడు రమణస్థానీయులకి తెలిసింది.

పోసాని సత్యంగారు ఆయన కుటుంబానికి రమణస్థాన్ మీదఎంతో భక్తి. ఆయనది ఎంత గొప్ప కంఠమో! ఆ కుటుంబం వారంతా రమణస్థాన్ కి ఎంతదగ్గ రయిపొయ్యారో.

ఆదెమ్మ, శీతారావమ్మ, బ్రహ్మయ్య, సుబ్బారావు మొదలైన భక్తులు చాలా బీదవారు. కూలీనాలీ చేసుకుని బతికేవారు. ఏదోవిధంగా డబ్బు సంపాదించి ఈశ్వర దర్శనార్థం వొస్తూ వుంటారు. శీతారావమ్మది మంచి కంఠం. తెలివైన అమ్మాయి.

ఆదెమ్మకి ఎవరూ లేరు. వుబ్బసం వ్యాధితో బాధపడుతూ వుంటారు. ఈశ్వర విభూతితో ఆమెకి చాలావరకూ తగ్గింది. ఇట్లాగే

గుడిపూడిలో ఎందరు అనామకులు నిర్ధనులు వున్నారో! వారంతా రమణస్థాన్ భక్తులు.

పద్మ, రత్న, విజయ, కోటేశ్వరరావు దామరపల్లి భక్తులు. వారంతా ఇప్పటికీ షౌకి వుత్తరాలు రాస్తూ వుంటారు.

1968 ఆగష్టు పదిహేనుకి గుడిపూడివారు చాలామంది వొచ్చారు. వారిలో వెంకటప్పయ్యగారు ఒకరు. ఆయన తన భార్య లక్ష్మయమ్మతో తమ్ముడి కొడుకు అరుణాచలేశ్వరరావుతో కలిసి వొచ్చారు. "వెంకటప్పయ్యగారికి మతి సరిగ్గా లేదని, వాళ్ళింట్లో ఎమ్. ఆర్. నాగేశ్వరరావు, రాయిడి నాగేశ్వరరావు భగవాన్ జయంతిని జరిపినప్పుడు ఆయన మనస్సు కుదుటపడింద"ని లక్ష్మయమ్మగారు షౌకి చెప్పారు. ఆయన వొచ్చినప్పుడల్లా కాకా, కిట్టూలతో దాగుడుమూతలు, దొంగాటలు ఆడుకునే వారు.

ఆ దంపతు లిద్దరికీ ఈశ్వరుడిమీద గట్టి విశ్వాసం కుదిరింది. వాళ్ళు తమ ఇంటికి ఈశ్వరనిలయ మన్న పేరు పెట్టుకుని భజనలు, సప్తాహాలు చేయడం మొదలు పెట్టారు. వాటిని వర్ణిస్తూ చలంమహర్షికి వుత్తరాలు రాసేవారు. ఆ వుత్తరాలు చదువుతూ వుంటే జీసస్‌నామాన్ని ఒక్కొక్కచోట అపోస్తలు లేవిధంగా ప్రచారం చేశారో ఆవిధంగా ఆ రోజుల్లో చేయించిన వుత్సవాల గురించి వాళ్ళు రాసిన వుత్తరాలలో అంత దీక్ష కనబడేది చలంగారికి.

అంతకు ముందు రమణస్థాన్‌లో జరిగే వుత్సవాలకు అలంకరించే నిమిత్తంగా రకరకాల డిజైన్లు కత్తిరించిన రంగు కాగితాలు ఎవరిచేతనో తయారు చేయించి తెచ్చేవారు వెంకటప్పయ్యగారు. ఒక సంవత్సరం దీపోత్సవానికి వొచ్చిన వెంకటప్పయ్యగారు ఇక్కడేవుండిపోయారు. రంగుకాగితాలు లేకపోతేనేం అనుకున్నారు అందరూ. కానీ

కృష్ణారావుగారు "నేను కాగితాలు కత్తిరించేందుకు ప్రయత్నం చేస్తాను" అని ముందుకి వొచ్చారు వుత్సాహంగా. షౌ అంగీకృతితో కృష్ణారావుగారు ఆ పని ప్రారంభించారు. వెంకటప్పయ్యగారు కూడా సరదాగా తానూ కత్తిరించడం ఆరంభించారు. ఆయన కత్తిరించిన కాగితాలు ఎంతందంగా వున్నాయో ! వాటిలో ఎంత నిపుణత, పని తనం కనబడుతుందో ! ఆయన కాగితాల కత్తిరింపు పనితనానికి సత్తెనపల్లిలో బహుమానంవొస్తే అది ఈశ్వరుడికి అర్పించు కున్నారు. ప్రతీవారు ఆయనని కత్తిరింపు నేర్పమని అడిగేవారు. కానీ ఆయన రమణస్థాన్‌కి వెడితేనేగానీ కత్తిరింపులు రావంటారు. పాడడం అంటే తెలియని ఆయన భజన్లలో హార్మోనియంతో ఎంత చక్కగా పాడటం మొదలు పెట్టారో ! ఇవేకాకండా కెమెరా తీసుకుని ఫోటోలు తీయడం మొదలు పెట్టారు. ఎంత బావున్నాయో ఆయన తీసిన ఫోటోలు. ఈ విధంగా ఆయనలో దాంకొన్న కళలన్నీ రమణస్థానానికి రాంగానే ఆయనలోంచి వెలికొచ్చాయి ఈశ్వరానుగ్రహం వలన.

కామేశ్వరి ఆశ్రమవాసం అనుభవం పూర్వపు ఔద్యోగిక జీవితంలోనికి పునఃప్రవేశాల గూర్చి ఆమె మాటల్లోనే విందాం.

"పిల్లల్ని మదర్ ఎంతో ప్రేమతో పాండిచ్చేరిలో చేర్చుకునే సరికి ఒక బరువు తీరి మళ్ళీ రమణస్థాన్ చేరుకుని 7, 8 నెలలు ఆశ్రమజీవితం గడిపాను. ఆ రోజుల్లో నిజంగా గొప్ప **detachment**, గొప్ప ఆనందం ధ్యానంలో వొచ్చేది. ఎన్నో గొప్ప కలలూ, **instructions** వొస్తూ వుండేవి కానీ పిల్లలిద్దరికీ పాండిచ్చేరి ఆశ్రమంలో డబ్బివ్వకుండా చదువుకోవడం ఎందువల్లో కష్టంగా వుండేది. ఆ విద్యాలయాధికారులు డబ్బిచ్చేవారికి, లేనివారికి తేడా చూపిస్తున్నట్లు ఫీలయి నన్ను వుద్యోగంలో చేరమని, డబ్బు సంపాదించమని

request చేసేవారు. అప్పుడు ఈ మార్గం ఒకనాటితో పూర్తి అయ్యేది కాదని, ఆ పని హృదయాల్ని బాధ పెట్టకూడదని నాకు అనిపించింది. మళ్ళీ షా, శ్రీమాతల అనుమతితో, ఆశీర్వాదంతో మిలిటరీ సర్వీసులో జాయినయ్యాను. పిల్లల్ని చదువుకి పాండిచ్చేరిలోనే వుంచేశాను.

ఈ లోకంలో ఏదన్నా విలువైనది నాకు వుంటే అది బాల మహాదేవి కరుణ, సౌరిస్ ప్రేమల తరువాతే. ఎప్పుడూ అనుకుంటాను ఎన్నో జన్మల సుకృతఫలంగా ఈ జన్మ లభించిందని, ఇటువంటి సద్గురువులు దొరికారని. ఈ జన్మని వృథా చేసుకుంటానేమో నన్న పరితాపం ఒక్కోసారి కలుగుతుంది. కానీ అమ్మ వుంది. షా వున్నారన్నదే ఆశ, వుపశమనం, బలం. నాకు తెలుసు ఇంకా ఎంతో దీర్ఘమైన ప్రయాణం సాగాల్సి వుందని. అమ్మని అదే ప్రార్థిస్తూ వుంటాను. ఈ జీవితోత్సవంలో నిన్ను కలుసుకోనిమ్మని, ఆ భాగ్యం అలభ్యమైతే నీ దర్శనం పొందలేకపోయినా ననేవాంఛ నించి నన్ను తప్పించవొద్దని, ఆ విషాద బాధాఛాయల్ని నాలోనే మోసుకొనేలా ఆశీర్వదించమని— ఈ బాధని, వాంఛని మరపు శ్మశానాల పాలు చెయ్యవొద్దని.

ఆవేళ రమణస్థాన్ నించి వెడుతూవుంటే మనస్సు ఎంతో బరువుగా వుంది. "నేను దూరం చేసుకుంటున్న నీ మధుర సాన్నిధ్యాన్ని ఈ ప్రపంచ పరిపూర్ణత్వంలో అనుభవించ నీయి" మని షాని మూగగా ప్రార్థించాను.

"నీ కాలి దారం నా చేతుల్లోనే వుంది కామేశ్వరి. నువ్వు అన్ని జన్మల్లోనూ నన్నారాధించావు. దిగులు పడకు. వెళ్ళిరా" అన్నారు షా. ఆమె అనునయ వాక్యాలే నాకు గొప్ప ఓదార్పు. గొప్ప ప్రామిస్.

లోకంలో నన్ను తెలిసిన స్నేహితులు అడుగుతారు, ఏమిచ్చారు నీ గురువు నీ కని. నా హృదయాన్ని విశ్వకవి పాడిన పాటలో చూశాను. అదే నా సమాధానం ఎవరికైనా.

"నాకు తెలీని మిత్రులకు నన్ను పరిచయం చేశావు
నావికాని ఇళ్ళల్లో నాకు స్థానా న్నిచ్చావు
దూరాన్ని దగ్గర చేశావు
పరదేశిని నా సోదరుణ్ణిగా మార్చావు"

నా గురువు సాన్నిహిత్యంవొచ్చాక నాకు కష్టం అనేది లేకండా పోయింది. ప్రకృతి సహజంగా ఏ కష్టసుఖాలు వొచ్చినా అవి analyse చేసి చూసుకుంటే ఛాయామాత్రంగా కూడా నాలో దుఃఖం వుండదు.

కాశ్మీరం నించి కన్యాకుమారి దాకా ఎంతో మంది మహాత్ముల్ని దర్శించాను. ఎందరో నామీద అమృతమయమైన ప్రేమని వర్షించారు. ఎందరో నన్ను కన్నబిడ్డ కన్నా ఆప్యాయంగా దగ్గరకి తీసుకున్నారు. అయినా కర్మ నన్ను వెన్నాడుతూనే వుందని ఎంతో దుఃఖ పడేదాన్ని షౌ ఒడిలో వాలి.

"నువ్వలా అనుకోవడంవల్ల నా కింకా సన్నిహితురాలివి. బాధాదగ్ధమైన హృదయమే నా నివాసం" అనేవారు షౌ. ఒక్కోసారి హైందవ వేదాంతంలో గురువు స్థానం గురించి చెప్పేవారు. "కామేశ్వరి, ఈ లోకంలో అన్ని ప్రేమలకన్నా తల్లిప్రేమ గొప్పదే కానీ తల్లి ఒక జన్మకే తల్లి. గురువంటే జన్మజన్మల తల్లి. తన శిష్యుడి కోసం తాను ముక్తుడైనా, జ్ఞానియైనా గురువు జన్మ తీసుకుని వెలుగులోకి నడిపించేందుకు చెయ్యం దిస్తారు" అన్నారోసారి షౌ. అలాగే అమ్మలేని నాకు బాలామహాదేవి, షౌ సర్వస్వం అయినారు. ఇద్దరు తల్లుల ముద్దుబిడ్డ నని ఎప్పుడూ సంతోషపడుతూ వుంటాను.

కళ్ళముందు నా విశ్వకవి మాటలు వెలుగునీడలు కలబోసినట్లు ఎప్పుడూ కదిలిపోతూ వుంటాయి-

"In the endless sea shore of life Children meet play and depart" ఈ ఆటల్లో నేను వున్నాను, పడుతూ లేస్తూ, కానీ ప్రతిక్షణం తండ్రి ఆగ్రహించిన రోజున, తల్లి కన్నీటి చూపు వంటి షా అనుగ్రహ మేఘం నన్ను నాజీవితాన్ని నిరంతరజాగృతిలో నిలుపుతుం దన్నదే నావిశ్వాసం. అదే నా ఊపిరి. నాలో జీవచైతన్యం ఉన్నదల్లా ఒకటే కోరిక, ముసలితనం ముంగిట్లో అడుగుపెట్టకముందే ఆడుతూ పాడుతూ వున్నప్పుడే నాలోని జీవన చైతన్యం విశ్వాంత రాళంలో విలీనమై పోవాలని. అది షా దయవల్లనే సాధ్యం."

అమ్మ పకపకతో కలిసి మళ్ళీ అరుణాచలం వొచ్చేసింది. అమ్మకి అంతకితం mild heart attack వొచ్చిది. డాక్టర్ ప్రయా ణం చేస్తే ఫరవా లేదన్నారు గనుక ఆమె పకపకా వాళ్ళతో వెడతా నంటే పంపించారు.

ఇప్పుడు అమ్మ ఇక్కడే వుంటానంది. అందరూ ఎంతో సంతోషించారు. అమ్మ తనకి తోచడానికి కాకా, కిట్టూలకి చదువు చెప్పేది. అమ్మ వాళ్ళఅల్లరి భరించలేక వాళ్ళని కొడుతోంటే కొట్ట కండా చదువు చెప్పమన్నారు షా. "అయితే నేను వీళ్ళకి చదువు చెప్ప లేను" అన్నది అమ్మ. రమణ స్థానీయులతో అమ్మ షికారకి వొచ్చేది. కానీ ఆమెలో restlessness బయల్దేరింది. పూర్వంలాగ మతిభ్రమణం మళ్ళీ మొదలయింది.

అప్పట్లోనే కాకా, జగదీష్ కలిసి వంటలు వొండేవారు. వాళ్ళ వంటలు * కమాల్‌గా చేసేవారు. వంటమధ్యలో కాకాకి తిక్కవొచ్చేది.

* కమాల్ - తమాషా

ఉన్నపళాన సరుకులన్నీ పారబోసేది. జగదీష్‌ని గోలగోల చేసిపెట్టేది. "కాకమ్మా! ఎన్నమ్మా ఇది?" అని ఆయన గోలపెడుతున్నా లక్ష్యె పెట్టకుండా వంటింటిని గందరగోళంగా చేసిపెట్టేది కాకా. పాపం ఆదంతా ఆయన మళ్ళీ సర్దుకుని వొచ్చేవారు.

మిశ్రీకి జగదీష్ అంటే ఎంతో ప్రేమ. ఆరోజుల్లో జగదీష్ ఇక్కడే వుండేవారు. ఇంక వాళ్ళిద్దరి ఆట చూడాల్సిందే. ఎంతందంగా వుండేదో! ఇంక ఆయనని ఇంటికి వెళ్ళనిచ్చేది కాదు. ఒక్కొక్కసారి ఇక్కడే వుండిపోయేవా రాయన. అందరూ షికారుకి వెళ్ళినప్పుడు షికారుమధ్యలో అందరిచేత పాటలు పాడించేది మిశ్రీ. అందరూ పాడేవారు. జగదీష్‌కూడా పాడేవారు.

## 31

ఒకరోజు షా తమ గదిలోనించి బైటికి వొచ్చి వాకిట్లో కూచున్నారు. చలంగా రామె దగ్గరకి వొచ్చి "షా నా దగ్గరకి ఇద్దరు కుఱ్ఱ వాళ్ళు వొచ్చి వెళ్ళారు. ఒక మొగపిల్లవాడ్ని మీరు పెంచుకుంటారా ? అని అడిగారు. వాళ్ళు తిరిగి వొస్తారుట. వాళ్ళకి ఏమని సమాధానం చెప్పను ?" అని అడిగారు.

షా "అందరికీ ఇష్టమైతే తప్పకండా తీసుకుందాం" అని—అందర్నీ పిలిచి అడిగారు. నర్తకి "ఓ నాకు తప్పకుండా తీసుకోవాలని వుంది" అన్నది. చిత్ర "ఆ పిల్లవాడు అందంగా వుంటే నాకిష్టమే. అందంగా లేకపోతే మాత్రం నే నిష్టపడను" అన్నది.

అప్పుడు షా హార్మోనియం మీద పాడుకుంటున్నారు. ఆ పిల్లవాడిని ఎత్తుకుని నర్తకి లోపలికి తీసుకుని వొచ్చింది. ఆ పిల్లవాడ్ని నర్తకి దగ్గరనించి తీసుకుని షా ఎత్తుకున్నారు. వాడు వొచ్చేలోగా అమ్మ వాడికోసం ఒక అందమైన టోపీ కుట్టేసింది. ఆ కుఱ్ఱవాళ్ళే

పాలసీసాకూడా తీసుకుని వొచ్చారు. షా ఆ పాపడికి పాలు పట్టిస్తు న్నారు. చిత్రని సీతమ్మ షా చేతులకి అప్పగించి వెళ్ళినప్పుడూ అమ్మ చిత్రని షా చేతుల్లోంచి తీసుకుంది. సరిగ్గా ఈ అబ్బాయిని ఆవిధం గానే షా చేతుల్లోంచి అమ్మ తీసుకుంది. ఆరోజు రాత్రి ఆ పిల్లవాడ్ని నర్తకి తన పక్కలో పడుకో బెట్టుకుంది.

మరుసటిరోజు ఆ ఇద్దరు కుఱ్ఱవాళ్ళూ వొచ్చారు. వాళ్ళల్లో హనుమంతు అంతక్రితం రమణస్థాన్‌కి వొచ్చారు. వాళ్ళిద్దరూ ఆ బేబీని ముద్దుపెట్టుకుని వాళ్ళ వూరు వెళ్ళిపోయారు.

మూడు రోజుల తర్వాత మిశ్రీ తన చీరమీద వుమ్మి వేసిందని కోపం తెచ్చుకుంది అమ్మ. ఆవేళ షాకి యాసిడిటీ. తమ గదిలో పడు కున్నారు. "చిన్నపిల్ల చేసిందానికి ఎందుకు కోపం తెచ్చుకుంటావు ?" అన్నారు షా తమ గదిలోకి వూరు వెడతానని చెప్పి వెళ్ళేందుకు అమ్మ వొచ్చినప్పుడు. .

రమణస్థానీయు లంతా అమ్మని ఇల్లు విడిచి పోవద్దని ఎంతో బతిమాలేరు. "నీ ఆరోగ్యం సరిగాలేదు. అందులో heart attack వొచ్చింది. వొద్దు, పోవొద్దు అని ఎవరెంత చెప్పినా, ఎంత బతిమా లినా అమ్మ ఒప్పుకో లేదు. "ఎప్పుడూ ఇట్లా చెయ్యనని అమ్మమ్మకి చెప్పమ్మా !" అని చిత్ర, నర్తకి మిశ్రీకి ఎంత చెప్పినా— మిశ్రీ చెప్పనుగాక చెప్పనని మొండికెత్తింది. అమ్మ ఎవరెంత చెప్పినా విన లేదు. ఒకసారి అమ్మ మనస్సు తిరిగిందో మళ్ళీ మారదు. సరాసరి మద్రాసు వెళ్ళిపోయింది. మద్రాసులో పకపకా వాళ్ళు అమ్మని తమతో వుండిపొమ్మని బతిమాలారు. కానీ అమ్మ వినకండా కాకి నాడ వెళ్ళిపోయింది. అమ్మ కాకినాడలో మేడమీద వుండేది. చీటికి మాటికి మేడ ఎక్కి దిగాల్సి వొస్తుంది. Strain అయిపోయి మళ్ళీ

అమ్మకి heart complaint తిరగబెడుతుం దని చలంగారు గొడవ పడ్డారు. కానీ ఎవరుమాత్రం ఏం చేయగలరు?

తంబీ పంగతంతా నర్తకే చూసుకుంటోంది. వాడు వచ్చినప్పటి నించీ నర్తకి చేతుల్లోనే పెరిగాడు. రాత్రిళ్ళు వాడు ఆకలివేసి ఏడిస్తే చలంగారికి ఎక్కడ నిద్రాభంగమై లేస్తారో నని నర్తకి వాడిని తీసుకు వొచ్చి షౌ చేతికిచ్చి- పాలు కలిపి మళ్ళీ తాను తీసుకునేది. గర్భం లేకండా, కష్టపడి కనకండా, నవమాసాల మోత, నడుంకట్లు లేకండా, నర్తకిని- అమ్మ అని పిలవడానికే ఈ లోకాలకి దిగివొచ్చా డనిపి స్తుంది ఈ పిల్లవాడిని చూస్తే.

షౌ ఆ పిల్లవాడికి రమణప్రసాద్ అని పేరు పెట్టారు. వాడి జాతకం చూసిన కృష్ణయ్యగారు వాడిపేరు 'క'- మొదటి అక్షరంగా వుండా లన్నారు. దాంతో కళ్యాణ్ అని ముందు చేర్చారు. వాడి ముద్దు పేరు తంబీ. అప్పట్లో రమణస్థానీయు లంతా వారం వారం గుడికి వెళ్ళేవారు. ఆవిధంగానే తంబీని వెంటబెట్టుకుని అందరూ గుడికి వెళ్ళారు.

తంబీని ఆంధ్రదేశంనించి, 300 మైళ్ళ దూరంనించి ప్రయా ణం చేయించి తీసుకువచ్చారా యువకులు. (ఆ బిడ్డ వయస్సు తొమ్మిది రోజులు). ఆంధ్రదేశ మంతా గొప్ప వానలు పడుతున్న రోజుల్లో అక్కడినించి వాళ్ళు ఆ పిల్లవాడ్ని అరుణాచలం ఎలా తీసుకుని వొ చ్చారో ఆశ్చర్యమే?

గుడికి వెళ్ళి తిరిగి వొచ్చేసరికి తంబీకి విరోచనాలు పట్టుకు న్నాయి. అవి తగ్గిన తరువాత గిరిప్రదక్షిణం పెట్టుకున్నారు రమణ స్థానీయులు.

గిరిప్రదక్షిణం మధ్యదోవలోనే తంబీకి మళ్ళీ విరోచనాలు పట్టుకున్నాయి. ఇంటికి వొచ్చిన తరువాత నర్తకి మందులు వేసింది. అయినా గానీ తంబీకి నయం కాలేదు. కార్తికదీపానికి వొచ్చిన నాగేశ్వరరావుగారిక్కడే వున్నారు. అప్పుడు సత్యం అనే అబ్బాయి రమణస్థాన్‌లో వున్నారు.

ఒక సాయంత్రం సత్యం షౌగారిని, చలంగార్ని చూడటానికి వొచ్చి, చూచాక "నేను వెళ్తాను" అన్నారు. వెళ్ళి పోయారు. ఇంతట్లోకి కృష్ణారావుగారు వొచ్చారు. అప్పుడు షౌ— "చూడండి, ఆ అబ్బాయి వాలకం చూస్తే చాలా బాధలో వున్నట్టున్నాడు. మీరు వెళ్ళి అతన్ని పిలుచుకు రండి" అని పంపించారు. కృష్ణారావుగారు అతన్ని ఇంట్లోకి తీసుకు వొచ్చారు. నిజమే, అతని మొహంచూస్తే బాగాలేదు. "ఏమండి, ఏమైనా కష్టాల్లో వున్నారా?" అని అడిగారు షౌ. "అఁ ఏం లేదండి" అన్నారు సత్యం. అప్పుడు షౌ "మీరు కొన్నాళ్ళిక్కడ వుండరాదా? ఇక్కడ వుండడం మీ కిష్టమేనా?" అన్నారు. 'వుంటా' నన్నారు సత్యం.

తంబీ, సత్యం ఆప్తమిత్రులైపోయారు. సత్యానికి చలంగారంటే తిరుగులేని ప్రేమ. సత్యం చలంగారికి నమ్మినబంటు. నర్తకికి కుడిభుజం. ఆయన పెద్ద ఆస్తిగల కుటుంబంనించి వొచ్చారు. ఒక్కడే కొడుకు. ఇంట్లో తగవుపడి వొచ్చారట. గారాబంగా పెరిగిన బిడ్డ. అందుకనే నర్తకి ఏదయినా కొంచెం extra గా అట్టేపెట్టి అతనికి భోజనంలో వేసేది- అతనికి భోజనం సయించదని. అతని ఆచూకి వాళ్ళ వాళ్ళకి తెలిసి అతని తాలూకు మనుషులు వొచ్చారు. ఎందరో ఇక్కడ రక్షణార్థులుగా వొచ్చినవారి తాలూకు మనుషులు వొచ్చేవారు. వాళ్ళు ప్రవర్తించే తీరు చాలా భరించలేని తీరులో వుండేది. కానీ

వీళ్ళెంత సౌమ్యంగా మాటలాడారో! పైగా వారికి చలంగారిమీద ఎంతో భక్తి. ఆతరువాత ఆయన తల్లికూడా వొచ్చింది. ఆయన వారందరితో రాను పొమ్మని చెప్పారు. ఆ విధంగా కొన్నేళ్ళు రమణస్థాన్‌లోనే వుండిపోయారు. ఏ విషయమైనాసరే ఇది కాదు, అది కాదు అనకుండా ఎంతో శ్రద్ధగా పనిచేసేవారు.

ఒకసారి భగవాన్‌కి పువ్వులు లేవు. తోటలో ఒక్క పువ్వు కూడా పూయలేదు. అమాంతం గోడదూకి పక్కింట్లో వున్న ఒక చెట్టెక్కి పూలు కోసుకుని వొచ్చారు సత్యం. "పక్కింట్లో కెందుకండీ దూకేరు? ఆవిధంగా దూక వొచ్చా?" అన్నారు షౌ. "భగవాన్‌కి పువ్వులు లేవండి" అన్నారు సత్యం. "పువ్వులు లేకపోతే పక్క దొడ్లోకి దూకమన్నారా?" అని అడిగారు షౌ. "భగవాన్‌కి పువ్వులు లేకపోతే ఎట్లాగండి?" అన్నారు సత్యం.

"అట్లా వెళ్ళకూడదు" అని అయనకి నచ్చజెప్పారు షౌ.

ఒకసారి ఎవరో వొచ్చి షౌమీద కీడుతలచి మాట్లాడారు. సత్యం అమాంతం ఆ మాటలాడినవారు ఒంటరిగా వున్నప్పుడు వెళ్ళి వారి పీక నొక్కారు. ఆ సంగతి షౌకి తెలిసి "ఏం సత్యం ఎప్పుడూ అట్లా **control** తప్పకండి" అని హెచ్చరించారు. ఈశ్వరానుగ్రహంవలన అవతలవారు ఆ సంఘటనని చాలా శాంతంగా తీసుకోవడంవలన అది అణిగిపోయింది.

ఇంట్లో ఎవరికన్నా చీమకుట్టినంత బాధ ఇతరులవల్ల కలిగితే చాలు సత్యం భరించలేరు. చాలా సంవత్సరాలు రమణస్థానీయులుగా వుండిపోయారు. ఏ ప్రలోభాల్లో పడకండా నిలిచినవారు బసవరాజుగారి తరువాత సత్యం ఒకరే. ఆయన దృష్టి సూటి అయినది. చెడ్డయినా మంచైనా దానికి అడ్డంలేదు. ఇంకొకవైపుకి తిరగదా దృష్టి. అందు

వల్లనే సత్యం ఎందులోకి దిగుతారో ననే భయం రమణస్థానీయులకి. ముఖ్యం నర్తకికి వుండేది. కొంత అనారోగ్యంతో బాధపడేవా రాయన. కొన్నాళ్ళకి ఆయనకి "ఈవిధంగా ఇక్కడ వుండడం వలన ఏమొస్తుంది?" అనే ప్రశ్న వొచ్చింది. 1971 నించి ఆయనలో చల నం కలిగింది. అది ఇటువంటి ఆశ్రమవాతావరణంలో తప్పదు. ఇంక చక్కగా ఇంటికి వెడతానని చెప్పి హాయిగా ఇంటికి వెళ్ళి పోయారు. ఎన్ని జన్మల పుణ్యమోగానీ చలాని కీయనే కొన్నేళ్ళు కళ్ళూ, కాళ్ళూ, కలం అయిపోయారు.

రమణప్రసాద్ (తంబీ) కి గిరిప్రదక్షిణం చేసిన మర్నాటి రాత్రికి విరోచనాలు, వాంతులు ఎక్కువై పోయాయి. పరిస్థితి విషమిం చింది. రమణస్థాన్‌కి డాక్టర్ని పిలవాలంటే చాలా దూరం. ఏ డాక్టర్ని పిలిచినా రాత్రిళ్ళు ఎవరు వొస్తారు? చలంగారు తంబీని ఆసుపత్రికి పంపితేనే మంచి దన్నారు. సత్యంచేత రాజ్యలక్ష్మి అనే చిల్డ్రెన్ స్పెష లిష్టుకి కబురుపంపారు. ఆమె పిల్లవాడ్ని తమ ఇంటికి తీసుకుని రమ్మ న్నారు. అప్పుడు వర్షం పడుతోంది గాలి వుధృతంగా వీస్తోంది.

నర్తకి చలంగారికి ఏమయినా అవసరం అయితే చూడడానికి వారిదగ్గరే వుండాలి. అందువలన కృష్ణారావు, సత్యం పిల్లవాడిని తీసుకు వెళ్ళడానికి బండి ఎక్కారు. జయంతికి వొచ్చిన రాయిడి నాగే శ్వరరావుగారుకూడా వాళ్ళవెంట వెళ్ళారు. నర్తకి తంబీ తొట్టి, అతని బట్టలూ అన్నీ బయట పడేస్తోంది. అప్పుడు "ఎందుకు నర్తకీ అవన్నీ బైటపెడుతున్నావు. తంబీ మళ్ళీ వొస్తాడుగా?" అన్నారు షా.

"ఇంకేం వొస్తాడు?" అంది నర్తకి గద్గదకంఠంతో.

"కాదు, నర్తకీ అవన్నీ అలా వుంచెయ్యి" అని చెప్పి ఆ సామానంతా లోపల పెట్టించారు షా.

షౌ ఆ రాత్రంతా తంబీ మీదనే దృష్టిపెట్టి వుంచారు. నిద్ర పోలేదు. పొద్దున్నే కృష్ణారావుగారు వొచ్చారు. 'ఏమైంది?' అని అడిగారు షౌ. రాజ్యలక్ష్మి తంబీని గవర్నమెంట్ ఆస్పత్రికి తీసుకు వెళ్ళమన్నదట. వాళ్ళు అట్లాగే తీసుకుని వెళ్ళారు. ఆ ఆస్పత్రి నర్సులు ఎంత యమర్జెన్సీ కేసైనా డాక్టరు సర్టిఫికెట్ లేకండా చేర్చుకోం" అన్నారుట. ఆ గాలి వానలో చావు బతుకుల నడుమ కొట్టుమిట్టాడే పసి గుడ్డుని వెంటబెట్టుకుని సారంగపాణిని పిలుచుకుని ఆయనతో డాక్టరు గారింటికి వెళ్ళారట వాళ్ళు. ఆ డాక్టరు సారంగపాణికి తెలిసినవారు కావడాన పిల్లవాడిని పరీక్షించి admit చేసుకోమని చీటీరాసి ఇచ్చారు. వాళ్ళు పిల్లవాడిని ఆస్పత్రికి తీసుకుని వెళ్ళారు. ఆస్పత్రిలో తంబీని admit చేసుకుని వార్డులో కాకండా వరండాలో పెట్టారు. ఎడతెరపిలేని వాన, చలి. తంబీకి అదేపనిగా డోకులు, విరోచనాలు అవుతూనే వున్నాయి. తెల్లవార్లు నాగేశ్వరరావుగారు 'అరుణాచలశివ' పాడుతూ వుంటే వాళ్ళు ముగ్గురూ రాత్రంతా జాగరణం చేశారుట. వాడిని కలరా వార్డుకి తీసుకు పొమ్మన్నారని ఆస్పత్రివాళ్ళు చెప్పారని చెప్పడానికి వొచ్చారు కృష్ణారావుగారు. అప్పుడు నర్తకి తంబిని డాక్టర్ రాజ్యలక్ష్మి దగ్గరకి తీసుకు వెళ్ళింది. ఆమె తంబిని తమ ఆస్పత్రిలో join చేసుకున్నారు. నర్తకి అప్పుడప్పుడు వెళ్ళి చూసివొస్తూ వుండేది. కృష్ణారావుగారు, సత్యం తంబీదగ్గర వంతులు ప్రకారంగా వుండేవారు. నాగేశ్వరరావుగారికి అప్పట్లో ఒక కొడుకు పుట్టాడు. ఆ పిల్లవాడు జబ్బుగా వున్నాగాని వొదిలేసి ఆయన అరుణాచలం వొచ్చేశారు. నాగేశ్వరరావుగా రావిధంగా సొంతకొడుకుని వొదిలిపెట్టి ఈ వూరు వొచ్చి ఈ పిల్లవాడి కోసం రాత్రంతా జాగరణం చేస్తూ సేవచేయడం ఆశ్చర్యం అనిపించింది అందరికి. తంబి బతుకుతాడని డాక్టర్‌కి

ఏమాత్రమూ ఆశలేదు. నాలుగో రోజు తంబికి ఈశ్వరకటాక్షిన నయమైంది. నర్తకిని, తంబిని స్వయంగా కారులో ఇంటి దగ్గర దింపి వెళ్ళింది డాక్టర్.

మాధవి కొడుకు తరువాత ఈ పిల్లవాడిలోనే ప్రత్యేకత చూశారు షా. అంత చిన్నవాడు నర్తకిని అప్పుడే అమ్మగా ఏరుకున్నాడు. వాడికి అందరూ నర్తకి తరువాతే. ఆ రోజుల పిల్లవాడికి ఎవరి దగ్గరికైనా రావాలనిపిస్తే కాళ్ళూ చేతులూ ఆడించి, వాళ్ళ ఒడిలోకి వెళ్ళి తృప్తి తీరేదాకా కాసేపు వుండేవాడు,

పాలసీసా రబ్బరుపీక వాసనకి పాలు తాగేవాడు కాదు. అందుకని నిద్రసమయంలో పాలు పట్టేది నర్తకి. సత్యం ప్రతిరోజూ ఒకామె నించి పాలు పిండించి తీసుకునివొచ్చేవారు. కొన్నాళ్ళకి తంబి ఆ పాలు తాగడానికి నిరాకరించాడు. దాంతో అమూల్ పిండిపాలు పోయడం ఆరంభించింది నర్తకి. నర్తకి ఎప్పుడైనా సినిమాకి వెడితే తంబిని కృష్ణారావుగారికి, సత్యానికి అప్పజెప్పి బయలుదేరేది. నర్తకి గుమ్మందాటిందో లేదో నిద్రపోతున్న వాడు కాస్తా కెవ్వుమని కేక వేస్తూ లేచేవాడు. సత్యం, కృష్ణారావుగార్ల పనయ్యేది. వాళ్ళు పాలు పడుతోంటే ఆ పాలన్నిటినీ వుమ్మేసే వాడు. అప్పుడు షా తమ గదిలోనించి వొచ్చి వాడికి పాలుపట్టి నిద్ర పుచ్చేవారు. అంతసేపూ ఎత్తుకూ్కచుంటే వూరుకునే వాడు. తొట్టిలో పడుకోబెడితే లేచేవాడు. కృష్ణారావుగారు షా ఆవిధంగా పిల్లవాడ్ని ఎత్తుకు కూచోవడం చూడలేక ఆమె ఎక్కడ strain అయి జబ్బుపడతారో నని సత్యంని నర్తకికోసం సినిమాహాలుకి పంపించే వారు. అప్పుడు నర్తకి సగం సినిమాలోనే తిరిగి వొచ్చేసేది. తంబిని గిరిప్రదక్షిణాలు తీసుకువెడితే విరోచనాలు పట్టుకునేవి. దాంతో షా గిరిప్రదక్షిణాలకి వెళ్ళడం మానుకున్నారు.

మొదట్లో ఇంట్లో అందరూ ఒకకట్టుగా వుండి షా మీదికి విరుచుకు పడేవారు కానీ రానురాను షా అందరికీ మంచివారై పోయారు. తక్కిన వాళ్ళల్లో మునుపటి ఐక్యతమాత్రం చెదిరి పోయింది.

ఒకరోజు భజన మొదలు పెడుతూ వుండగా రాజయ్యర్ వెంట ఒక అమ్మాయి వొచ్చింది. ఆ అమ్మాయికి పదిహేను పదహారేళ్ళు వుంటాయి. నామావళి జరుగుతున్నంతసేపు ఆ అమ్మాయి మాట్లాడ లేదు. నామావళి పూర్తయినాక, భజనకి వొచ్చినవారిని పాడమనేవారు చలం. ఆవిధంగానే ఆ అమ్మాయిని పాడమని అడిగారు. ఆ అమ్మాయి కంఠం ఎత్తి పాడింది. ఎంత బలమైన కంఠస్వరమో! పాట ఎంత బావుందో!

అప్పుడు ఆ అమ్మాయి తనకి ఏదో జబ్బుచేసి మాటపోయిందని, కొద్దిరోజుల తరువాత తనని రమణాశ్రమం తీసుకువెడితే మాట వొస్తుందని తన తండ్రికి కల వొచ్చిందని చెప్పింది. అందుకని ఆ తండ్రి ఆ అమ్మాయిని వెంటబెట్టుకుని అరుణాచలం తీసుకుని వొచ్చారు. రమణస్థాన్ భజనలో పాడమనంగానే ఆమెకి కంఠం మళ్ళీ వొచ్చింది. కంఠం ఎత్తి మరీ పాడింది. దాంతో మాట్లాడడం మొదలు పెట్టింది. ఆ తరువాత వాళ్ళవూరు వెళ్ళిపోయింది. అప్పటినించీ ఆ అమ్మాయి అరుణాచలం తరచు వొచ్చి వెళ్ళేది. తంబీకి ఆ అమ్మాయంటే చాలా ఇష్టం. ఆ అమ్మాయిని రమ్మని వుత్తరాలు రాయించేవాడు. రమ్మనగానే ఆ అమ్మాయి వెంటనే వొచ్చేసేది. ఆ అమ్మాయి పేరు రజని. రజని పాటలు పాడేది. పాటలు కట్టి మరీ పాడేది.

1971 దీపోత్సవానికి రజని రమణస్థానీయులతో పల్లాకుత్తులో వున్న వినాయక గుడికి వొచ్చింది. అక్కడికి శ్రీ రమణస్థానీయులు వెళ్ళి పూజలు చేసేవారు.

ఆ దీపానికి వినాయక గుడిలోనే పూజా భజన పెట్టుకున్నారు. గుడిపూడి భక్తకోటితో గుడి ఆవరణ నిండిపోయింది. గుడిలో అందరూ కిక్కిరిసి కూచున్నారు. కొండమీద దీపం వెలిగించగానే రమణస్థానీయులు గుడిముందు ఆవునేతితో దీపం వెలిగించారు. దీపం వెలిగించిన వెంటనే రజని అప్పటి కప్పుడు పాట కట్టేసి పాడింది. ఆ పాట పాడాక ఆ అమ్మాయి ఒళ్ళు తెలీని స్థితిలో వొచ్చి షౌ పాదాలమీద పడింది. ఆ అమ్మాయి వొళ్ళంతా చల్లబడిపోయి వొణికి పోతోంది. కొద్దిసేపటికి తేరుకుంది. అప్పటినుంచి ఈశ్వరసన్నిధికి వొచ్చి వెదుతూనే వుంది.

## 32

జయంతి ఆ సంవత్సరం చాలా బాగా జరిపించారు. జయంతి నాడు భోజనాలు చేస్తూవుండగా కృష్ణ పూరునించి వొచ్చింది. అందరూ సంతోషంతో "కృష్ణవొచ్చింది" అని అరిచారు.

రెండురోజుల తరువాత బెజవాడనించి రాజ్యం టెలిగ్రామ్ ఇచ్చింది— "పిన్నిని ఆస్పత్రిలో జాయిన్ చేశాం" అని. చిన్నప్పుడు వొయ్యి దగ్గర నర్సుగా పనిచేసిన దూరపు బంధువు రాజ్యం. ఇప్పుడు బెజవాడ గవర్నమెంటు హాస్పిటల్లో నర్సు.

రమణస్థానీయులకి అమ్మ కాకినాడనించి బెజవాడ వెళ్ళినట్లుగా కూడా తెలియదు. ఇంకా ఆమెని చూసుకోవడానికి ఎవరు వెళ్లేటట్లని ప్రశ్న వొచ్చింది. షౌ ఏమీ మాటాడలేదు. "నేను వెళ్ళి అమ్మని చూసి వొస్తాను. ఏం విశేషమో కనుక్కొని ఏదన్నా సహాయం చేయాల్సి వొస్తే చేస్తాను" అంది నర్తకి. కానీ తంబీని ఎవరు చూసుకుంటారు? అందుకని నర్తకి కృష్ణని ఒకవారం రోజులు తంబీని చూసుకునేందుకు

వుండమంది. తంబి అంతకి మునుపు పాలు కొంచెం చల్లారినా నర్తకితో పేచీ పెట్టేవాడు. కాని కృష్ణదగ్గర ఏపేచీ లేకుండా పాలు తాగేవాడు.

నర్తకి తిరిగి వొచ్చేసింది. నర్తకి వెళ్ళినప్పుడు రాజ్యం "నాకు duty వుంది కద, అందుకని పిన్నిని నువ్వే దగ్గరుండి చూసుకో. నే నామెని చూసుకోలేను" అని చెప్పిందట నర్తకితో.

ఆ రోజుల్లో నర్తకి తననించి వెళ్ళిపోతే సహించేవారు కాదు చలంగారు. చలంగారు నర్తకి లేకుండా వుండలేరు. నర్తకి చలంగారికి దూరంగా వుండ లేదనిపిస్తుంది. ఆ విచిత్ర బాంధవ్యాన్ని ఎవరూ అర్థం చేసుకోలేరు. వా రావిధంగా మూడు దశాబ్దాల నించి కలిసి జీవిస్తున్నారు. ఇద్దరి అభిప్రాయాలూ ఒకటే. ఇద్దరి ఆశయాలూ ఒకటే. వారిలో ఐక్యత ఎటువంటి దంటే నిస్సందేహంగా నర్తకి చలంలో ఒకభాగం. అందువల్లనే చలంగార్ని బాధపెట్టడం నర్తకికి ఇష్టంలేదు. ఆ విధంగానే చలంగారికి నర్తకిని బాధపెట్టడం ఇష్టం లేదు. కానీ ఆయనకి నర్తకిమీద ప్రేమ ఎంత బలమైనదంటే గడియేని ఆమె వియోగాన్ని సహించలేరు. "నాన్నకి చూపు మందగించాకే నర్తకి మీద పట్టు అధికమయ్యింది. ఇంకో డైవర్షన్ లేక" అంటారు షా.

అందువల్లనే అమ్మని ఎవరికన్నా అప్పజెప్పా లనుకుంది నర్తకి. వొయ్యిదగ్గర పనిచేసిన మంత్రసానులను పిలిచి చూసింది "మీరేమయినా చూసుకుంటారా" అని అడిగింది. వాళ్ళెవరూ ముందుకు రాలేదు. అప్పుడు నర్తకి, దగ్గరుండి చూసుకోవడానికి వాళ్ళన్నయ్య గారి కూతురు మల్లికని పెట్టి, రాజ్యానికే కొంతడబ్బు ఇచ్చి అమ్మకి attack వున్నన్ని రోజులు నువ్వే ఎలాగో ఓలాగు చూసుకో, ఆ తరువాత మేము వొచ్చి తీసుకుపోతాం అని రాజ్యానికి చెప్పి వొచ్చేసింది.

చలంగారికి పెరాలిటిక్ స్ట్రోక్ వొచ్చినప్పటినించీ సూర్య స్తోత్రాన్ని చదివేవారు. ఆ స్తోత్రాన్ని పద్మనాభస్వామిగారు పంపించారు.

"త్వం మాతా త్వం శరణం
త్వం దాతా త్వం ధనం
త్వమాచార్యః త్వం త్రాతా
త్వం హర్తా విపదాం అర్క ప్రసీద మమ"

ఇత్యాదిగా ఆర్యగీతాల్లో వున్న స్తుతిదశకం అది. ఆ స్తోత్రంతో ఎలాంటి జబ్బులున్నా కుదుర్తాయని పద్మనాభస్వామిగారి విశ్వాసం. అది ఎంతో శక్తి వంతమైనది. ఉదయాలు చలం దక్షిణామూర్తి స్తోత్రం చదివేవారు.

చలంగారు సూర్యస్తవం చదువుతుండడం వల్ల రథసప్తమి పండుగ చేసేవారు. రథసప్తమినాడు పరమాన్నం చెయ్యాలి. ఆ పరమాన్నం మామూలు పిడకలమీద వొండకూడదు. అవి గొబ్బిపిడకల మీదనే వొండాలి. అందువల్ల షౌ పిల్లల్ని ధనుర్మాసంలో గొబ్బిళ్ళు పెట్టమన్నారు. వాళ్ళు గొబ్బిళ్ళు పెట్టి గొబ్బిపిడకలు తట్టేవారు.

చలం రథసప్తమినాడు జిల్లేడాకులు నెత్తిమీద పెట్టుకుని స్నానం చేసేవారు. చిక్కుడాకులతో చిక్కుడు కాయలతో రథాలు చేసి, సూర్యస్తవం చదివేవారు. నర్తకి గొబ్బిపిడకలమీద పరమాన్నం వొండేది.

ఆ తరువాత అందరూ సౌరిస్‌తో సహా ఆరుబైట కూచుని చిక్కుడాకుల్లో ఆ ప్రసాదాన్ని తినేవారు.

ఆ రోజున కృష్ణారావుగారు 'మనం గిరిప్రదక్షిణం వెళ్ళాలి' అన్నారు. అందరూ గిరిప్రదక్షిణం వెళ్ళి వొచ్చారు. రాజ్యంనించి "అమ్మని తీసుకుని వొస్తున్నాను" అని telegram వొచ్చింది.

మర్నాడు ఇంటిముందు టాక్సీ ఆగింది— రాజ్యం- అమ్మని నడిపించుకుంటూ లోపలికి తీసుకు వొచ్చింది. నర్తకి అప్పటికే పక్క వేసి వుంచింది.

అమ్మని తీసుకువొచ్చి లోపల పడుకోబెట్టారు. అప్పుడు రాజ్యం మల్లిక భయపడి వెళ్ళిపోయిందనీ, ఎవరూ చూసేవారు లేక అమ్మని తానే తీసుకు వొచ్చేశానని చెప్పింది. రాజ్యంతో బాటు అమ్మవెంట అన్నయ్య వొచ్చారు.

అమ్మరాక గురించి మహర్షిమాటల్లోనే విందాం.

"రంగనాయకమ్మగార్ని భద్రంగా బెజవాడనించి ఇక్కడికి తీసుకు వొచ్చారు. చాలాకాలం వరకు పక్క దిగకూడ దన్నారు డాక్టరు. రంగనాయకమ్మగారితో డాలీ రాలేదు. నర్తకి అన్నయ్య వొచ్చారు."

(నాగేష్‌కి చలంగారిలేఖ 18-1-69)

"అమ్మ హాయిగా మంచంమీద పడుకుని ఆంక్షలు పెడుతుంది. చాలావరకూ మంచం దిగకూడ దన్నాడు డాక్టర్"

(నాగేష్‌కి చలంగారిలేఖ 4-2-69)

అమ్మ కాకినాడలో వుండగానే **heart attack** వొచ్చిందట. అక్కడినించి బస్సులో బెజవాడవొచ్చి రాజ్యం ఇంటికి వొచ్చిందట. రాజ్యం అమ్మని హాస్పిటల్లో చేర్చింది. **heart attack** లోనే ఇంతింత ప్రయాణాలుచేసి అమ్మ ఎలా బతికిందో అందరికీ ఆశ్చర్యమే. భగవాన్ ఆమెని రక్షించారు.

డాక్టర్ వొచ్చి అమ్మని చూశారు. ఈమాటు డాక్టరు చెట్టియార్ గారిని పిలిపించారు. ఆయన చాలా నిదానమైన వారు. ఎంతో శాంత స్వభావులు. అమ్మకి ఆయన చాలా నచ్చారు. "మిమ్మల్ని చూస్తే మా

అక్కయ్య గుర్తుకి వొస్తోంది. అంత శాంతం మీలో" అనేది. తరువాత కూచుని "మా అక్కయ్య ఇప్పుడు లేదుకదా!" అని చిన్నపిల్లలా ఏడ్చేది అమ్మ. మాటిమాటికి "నాగుండె పట్టుకు పోయింది" అనేది అమ్మ. అదిభ్రాంతో, వూహో, నిజమో- ఎవరికీ తెలిసేది కాదు. అమ్మకి మతిస్థిమితం లేకపోవడంవల్ల ఆమెచెప్పే ప్రతీవిషయం **confusing** గా వుండేది.

ఒకరోజు రాత్రి షౌ చలంగార్ని "అమ్మకి గుండె పట్టుకుపోవడం నిజమేనా? ఆ విధంగా **imagine** చేసుకుంటోందా? అని అడిగారు. అప్పుడు చలంగారు "నిజమే షౌ! డాక్టరిక వారంరోజులుకూడా బతకదని చెప్పేశారు" అని అన్నారు.

అమ్మకి **heart attack** రాగానే షౌని పిలిచేసేది. షౌ వెళ్ళి పక్కన కూచోవాలి. చిన్న తంబురా మీటుతూ ఆమె దగ్గర మీరాపాటలు పాడుతూ మరీ కూచోవాలి. నర్సుకి, చిత్ర ఆమెకి ప్రత్యేకంగా వేరేవంటచేసి పెట్టి పగలంతా చూసుకునేవారు. రాత్రంతా అమ్మని షౌయే చూసుకుని, ఏదన్నా ఇంజక్షన్ ఇవ్వాల్సి వొస్తే నర్సుకిని లేపేవారు. ఎంతటి మహాత్ములైనా కన్నతల్లి ముందు వినమ్రులే కదా! చరమకాలంలో వున్న తమ తల్లికి భగవాన్ రమణమహర్షి చేసినసేవ అనన్యం. ఆ సేవలోనే బంధనాల్ని కోసివేసి తల్లికి సద్యోమోక్షాన్నిచ్చారు. షౌ అమ్మ విషయాన చేసినపని అదే ననిపిస్తుంది.

షౌ చిన్న తంబురా మీటుతూ మీరా పాటలు పాడుతూ తన దగ్గర కూచోవా లనేది అమ్మ. అమ్మ మీరాలాగే అందర్నీ వొదిల్ని పెట్టి ఏకాకిగా తన జీవనయాత్రని సాగించింది. లోకంనించి నిందల్నీ, అవమానాల్నీ భరించింది. అందుకనే తనలాగే ఏకాంతాన్వేషిణియైన మీరాని ప్రేమించేదేమో!

రాత్రిపూట అమ్మని natural calls నిమిత్తం ఎత్తి కూచో బెట్టేవారు షా. అమ్మది భారీ శరీరం. దీనివలన అమ్మ పోయిన తరువాత కొంత ప్రభావం షా కంఠంమీద కలిగినట్లు సోదరి సామ్రాజ్యం నోటీస్ చేసి "షాగారి కంఠం ఇదివర కంత గంభీరంగా లేదని, తక్కువ volume లో పాడుతున్నార"ని అన్నదట. సరిగ్గా చంద్రశేఖర్ కూడా అదే విషయాన్ని నోటీస్ చేశారు. వాళ్ళు చెప్పేదాకా షా ఆ విషయాన్ని నోటీస్ చెయ్యనే లేదు. చివరికి షా వూపిరి లోపలికి పీల్చినప్పుడు గుండెదగ్గర పట్టుకుంటున్నట్లుగా తెలిసిం దామెకి. తరువాత అది మెల్లిగా తగ్గిపోయింది. అప్పట్లో షా జుత్తు బాగా తెల్లబడిపోయిందనేది నర్తకి. "మామూలుగా అమ్మకి ఎటాక్ వొచ్చినప్పుడు అలివిమాలిన బాధ పడేది. రాత్రయినా, పగలైనా అమ్మకి ఎటాక్ వొచ్చినప్పుడు షా అహర్నిశలూ మెలకువగానే వుండి అమ్మ గుండెమీద చెయ్యివేసి ఆ బాధని తాము తీసుకుంటూ పక్కనే కూచునే వా" రంటుంది నర్తకి.

నర్తకి, చిత్ర అమ్మకి కడుపున పుట్టిన బిడ్డలకన్నా అధికంగా సేవచేశారు. వారందరిమీద అమ్మ ఆ ఏడాదంతా ఎంతప్రేమ చూపించిందో! చివరి మజిలీకి దగ్గ రవుతున్న కొద్దీ, రోజురోజుకీ అమ్మలో ప్రేమ అవధులు ముట్టింది. చలం మహర్షిని దగ్గరికి పిలిచి కూచో బెట్టుకుని, తనకోసం తెచ్చిన పళ్ళని తినిపించేది. అమ్మని చలంగారిని వారి జీవితంలో అంత దగ్గరగా, అంత ప్రేమగా చూడడం అదే ప్రథమం షాకి. అంతవరకూ వారిమధ్య గొప్ప incompatability వుండేదని అనుకునేవారు షా. ఆమెకి వారికి ఒకరి కొకరికి సరిపడదనిపించేది. కాని వాళ్ళు జీవితమంతా దూరంగా వుంటూనే పరస్పరం ప్రేమించుకుంటూనే వున్నారని రియలైజ్ చేశారు షా. షా ఎరిగినంత

వరకూ వాళ్ళు ఒకరినొకరు ఆదరంగా ఎన్నడూ పలకరించుకోలేదు. కాని ఆవిడ జీవితమంతా ఆయన రుచికే వంటచేసేది. ఆవిడ ఎంత తిట్టినా, ఎంత అసహ్యించుకున్నా— చలంగారు ఆమెని ఎన్నడూ అగౌరవ పరచలేదు- తలవొంచుకు సోక్రటీస్‌లా ఆమె ఎంతతిట్టినా వినడం తప్ప. ఈవిధంగా కూడా ఎవరైనా ఒకరి నొకరు ప్రేమించుకుంటారేమో ! ఇలాంటి ప్రేమ షా ఎక్కడా చూడలేదు. ఇది అసాధారణ ప్రేమ. అమ్మ, చలంగారు నిరంతర యాత్రికులు— తమతమ గమ్యాలు వేరయినా కలిసి జీవించి, సంఘర్షించి ఏకాంతంగా సంఘాన్నెదుర్కొని తమ జీవనయాత్రని సాగించారు. అందుకనే వారిమధ్య అవిదితంగానే అంతులేని ప్రేమ చోటు చేసుకున్న దనిపిస్తుంది.

ఇక పక్కమీద వుండి ఒంటరితనాన్ని భరించలేక అమ్మ షౌని రమణస్థానీయుల్ని గిరిప్రదక్షిణాలకి వెళ్ళనిచ్చేది కాదట. అందువల్ల ఆ ఏడాదిపాటు రమణస్థానీయు లంతా అట్లతద్దె, వుండ్రాళ్ళతద్దె మొదలైన పండుగలన్నీ చేసుకున్నారు సరదాగా.

ఆ ఏడు వుండ్రాళ్ళతద్దె జరిగిన తీరు చలంగారి మాటల్లోనే విందాం.

"ఇవాళ వుండ్రాళ్ళ తద్దికదూ ! నిన్న సాయింత్రమే పిల్ల లందరూ కాకా, కిట్టూ, మిశ్రీ గోరింటాకు పెట్టుకున్నారు.

అందరూ సౌరిస్‌తోకూడా తె వారగట్ట నాలిగింటికే నిద్ర లేచారు. పిల్లలు చద్దులు తిన్నారు. పె ట్టుకి పెద్ద వుయ్యాల వేసి ఉయ్యాల లూగారు. చిత్రకూడా. తం సౌరిస్ వొళ్ళో కూచుని చందమామని చూస్తో వుయ్యాల లూగాడు. క్రిష్ణ, చంద్రశేఖర్, బసవరాజుగారు, హనుమంతు, జగదీష్‌భాయ్ అందరూ ఆటలాడారు. సత్యం

మాత్రం ఎంత నిద్రలేపినా లేవలేదు. నువ్వు వుండ్రాళ్ళ తద్దికి ఆడు కున్నావా? మీవూళ్ళో అందరూ వుయ్యాల లూగారా?

(చిరంజీవి రవికి చలంగారి లేఖ 20-9-69)

అసలు రమణస్థాన్‌లో పండుగ లన్నింటికి వుత్సాహం చిత్రది. వినాయక చవితికి వినాయకుడ్ని తీసుకు రావడం, పిల్లలచేత పూజలు చేయించడం అంతా దగ్గరుండి మరీ జరిపిస్తారు చలంమహర్షి, నర్తకి. మొదటి రోజుల్లో వినాయక చవితికి పురోహితుడుగా చలంమహర్షి వ్యవహరించేవారు. రానురాను బసవరాజుగారు, తరువాత కృష్ణారావు గారు ఆ భారాన్ని వహిస్తున్నారు. అరుణాచలంలో పాలవెల్లులు దొరకవు కనుక బసవరాజుగారు తయారుచేస్తారు. సాయింత్రం కథని ఆ రోజుల నించి ఇప్పటిదాకా చలంగారే చెబుతున్నారు. ఈ సంవత్సరం (1977 రచనా కాలం) మాత్రం వారికి ఓపిక లేకపోవడాన షౌ చెప్పారు.

కృష్ణాష్టమిని మొట్టమొదట ఆంజనేయులు ప్రారంభించాడు. అతను ఆ పూజని ఎంత చక్కగా చేసేవాడో. తరువాత శోభ చేసేది. కృష్ణారావుగారు దగ్గరుండి వుట్టి కట్టేవారు. అందరిచేత వుట్టి కొట్టించేవారు. అది ఆయన కెంతో సరదా అయిన పండుగ. అప్పటినించి ఇప్పటిదాకా కృష్ణాష్టమి సరదా కృష్ణారావు గారిదే.

"ఇవాళ కృష్ణజయంతి. అమ్మ హాలులోకి మెల్లిగా వొచ్చి పూజ చేసుకుంటుం దిట. కృష్ణారావ్ పిల్లలు వుట్టి కట్టారు. సాయంత్రం వుట్టి కొడతారు."

(వెంకటప్పయ్యగారికి చలంగారి లేఖ 4-9-69)

శ్రీరమణస్థాన్‌లో చిత్రలేని దీపావళి వుప్పులేని కూరలా చప్పగా వుంటుంది. చిత్ర చిన్నపిల్లలకి మల్లే బొట్లు పేలుస్తుంది. విష్ణుచక్రాలు

కూడా కాలుస్తుంది. దీపావళి వొస్తోం దనగానే చలంగారు, చిత్ర ఈశ్వరుడితో బేరాలు సాగించేవారు. "మేం టపాకాయలు కొనుక్కోవడానికి ఎంతిస్తారు?" అని. ఆయన చెప్పినంత డబ్బు తీసుకుని వెళ్ళి బజార్నించి స్వయంగా టపాకాయలు తెచ్చేది చిత్ర.

అరుణాచలంలో దీపావళి రోజుల్లో విపరీతమైన గాలులు వీస్తాయి. ప్రమిదల్లో దీపాలు వెలిగించితే నిలువవు. అందుకని పురుషోత్తం నించి electric దీపాలు తెప్పించి ఇంటిని అలంకరింపజేస్తారు షౌ.

మహాలయ అమావాస్యనాడు తెల్లవారకట్ట కలకత్తా రేడియో కేంద్రం నించి శ్రీ పంకజ్‌మల్లిక్ నిర్దేశకత్వంలో వొచ్చే నవరాత్రి కార్యక్రమం 1942వ సంవత్సరం నించి చలంగారు వాళ్ళు వింటున్నారు. ఆ కార్యక్రమాన్ని వినడం ఎంత సంతోషంగా వుంటుందో! అరుణాచలం వొచ్చాకకూడా చిత్ర శ్రద్ధ తీసుకుని ప్రతిఏడూ ఆ ప్రోగ్రామ్‌ని పెట్టడంతో అందరూ అప్పటినించి ఇప్పటిదాకా వింటూనే వున్నారు. తెల్లవారుజామున వూరంతా నిద్రలో మునిగివున్నవేళ నిరామయంగా, నిశ్శబ్దంగా వున్న సమయంలో భాద్రా చదివే దుర్గ సప్తశతి శ్లోకాలతో పంకజ్‌మల్లిక్ సమకూర్చిన సంగీతంతో పాటలతో వినబడే ఆ కార్యక్రమాన్ని ఆ చలిలో కూచుని తెల్లవారుజాము చీకట్లో వేడి 'టీ' సిప్ చేస్తూ వినడం ఎంత గొప్ప అనుభవమో రమణస్థాన్‌లో.

ఇక్కడికి వొచ్చిన మొదటిరోజుల్లో ఆశ్రమంలో పూజలకి ఇంటిల్లిపాదీ షౌని లోపల ఉంచి తాళంవేసి వెళ్ళేవారు. భజనా భోజనం కొంచెం ఆలశ్యంగా జరిగేవి.

భారతవర్షంలో అరుణాచలంలో జరిగే ప్రత్యేక పర్వదినం కార్తీక దీపోత్సవం. అరుణాచల శిఖరంమీద అఖండజ్యోతిని వెలిగిస్తారు. కృష్ణారావుగారు, కృష్ణ వొచ్చినప్పటి నించీ వాళ్ళు- శిఖరాన సరిగ్గా దీపాన్ని వెలిగించే సమయానికి శ్రీ రమణస్థాన్ ప్రాంగణంలో ఆవునేతితో దీపాన్ని వెలిగించడం అనే సంప్రదాయాన్ని ఆరంభించి ఇప్పటిదాకా సవ్యంగా నిర్వహిస్తూ వొస్తున్నారు. ఒక సంవత్సరం వెంకటప్పయ్యగారు క్యాండిల్స్‌ని లింగాకృతిలో వెలిగించారు. అది ఎంతో గొప్పదృశ్యం.

తెలుగు సంవత్సరాదికి అరుణాచలంలో వేపపూత పూయదు. అందువలన ఏప్రియల్ 13న సంవత్సరాది పర్వాన్ని జరుపుకుంటున్నారు శ్రీరమణస్థానీయులు. అదే షౌ పుట్టిన రోజు. షౌ స్వయంగా వేప పువ్వు పచ్చడిని- అన్నిరకాల పళ్ళు, తేనె, బెల్లం, మామిడి, కొబ్బరి, చింతపండు, వేపపూత వేసి తయారుచేసి- అందరిచేత తినిపిస్తారు.

జగదీష్ గుజరాత్‌లో శరత్‌పౌర్ణిమ చేస్తారని చెప్పారు. రమణస్థానీయులు ఆపండుగ చేసుకోవడం ఆరంభించారు.

తీపిగోధుమ దోశలుచేసి దానిలోకి పెరుగు అరటిపండులతో ఒక పలహారం చేసి- ఆ దోశెలు పాలవెన్నెల్లో ఆరగిస్తారు- గుజరాతీయులు. అదే శరదోత్సవం. దాన్ని రమణస్థానీయులు జరుపుకునేవారు జగదీష్ వుండేరోజుల్లో.

ఆ పండుగలన్నీ అమ్మజబ్బుతో వున్నపుడుకూడా సందడిగా చేసుకున్నారు రమణస్థానీయులు- అమ్మ తమ గిరిప్రదక్షిణాలని నిషేధించడం వలన.

ఆ సంవత్సరం తంబీ పుట్టినరోజు ఘనంగా చేశారు. అతని పుట్టినరోజు వొస్తోందనగానే నర్సు కి తంబికి కొత్త బట్టలు కుట్టిస్తోంది. షౌ ఒక రహస్య ప్రణాళిక వేశారు. అది కృష్ణారావుగా రొక్కరికే తెలుసు. ఆ రోజు సర్‌ప్రైజింగ్‌గా ఒక ఫోటో తీయించడమే షౌ రహస్య ప్రణాళిక. రహస్యంగా ఫోటోగ్రాఫర్‌ని పిలుచుకు వొచ్చారు కృష్ణారావుగారు. ఆవేళ అందరూ పనుల హడావిడిలో వున్నారు. కృష్ణారావుగారు వెళ్ళి అందర్నీ 'రండి, రండి' అని పిలిచారు.

అందరూ "ఏమిటి, ఎందుకు పిలుస్తున్నారు?" అని అడిగారు ఆశ్చర్యంగా.

"ఫోటో దిగడానికి" అన్నారు కృష్ణారావుగారు.

"ఫోటోఏమిటి?" అన్నారు అందరూ.

"తీయిస్తున్నారు రండి" అన్నారు కృష్ణారావుగారు.

అమ్మని తీసుకు వొచ్చారు. వరండాలోంచి కుర్చీతోసహా కిందికి దింపారు. అంతా కలిసి పెద్ద **group photo** తీయించు కున్నారు. తంబీకి వేరే **photo** తీయించారు. జీవితంలో అదే చివరి ఫోటో అమ్మకి.

తంబీ అంటే అమ్మకి చాలా ప్రాణం. వాడూ అట్లానే ఆమె పక్కలో పడుకుని గోము చేసేవాడు.

ఒక రోజు రాత్రి షౌ తమగదిలో పడుకుని వుండగా వరండా వైపు కిటికీ దగ్గర ఎవరో నుంచున్నట్లుగా షౌకి అనిపించింది. ఆమె అటుతిరిగి చూసేసరికి అదిఒక దేవత. ఆదేవత తెల్లనిబట్టలువేసుకు, జుట్టు విరబోసుకు **Italian paintings** లో లాగవుంది. మొగో, ఆడో తెలియట ల్లేదు. "ప్రభూ మీ అమ్మని తీసుకు వెళ్ళడానికి వొచ్చాను" అన్నారు ఆదేవత.

"కొంతకాలం వుండనియ్యి" అన్నారు షా.

ఆ దేవత వెళ్ళి పోయారు. అంతకి మునుపు అమ్మదగ్గరచూట్టూ నల్లని చీకట్లు షాకి కనిపించేవి. ఆ చీకట్లన్నీ పోయి ఆ గదిలోకి వెలుతురు వొచ్చినట్లుగా తెలిసింది షాకి ఈసంఘటన జరిగాక.

అప్పట్లో కామేశ్వరి ఇక్కడే వుండేది. ఇంతట్లో సత్యవతి వొచ్చింది. రాత్రిపూట సత్యవతి, కామేశ్వరి షాకి ఎక్కడ నిద్రాభంగం అవుతుందో నని అమ్మ కేంకావాల్సినా తామే చూసుకునే వారు. ఒకరోజు వుదయం షా కూరలు తరుగుతూ వుండగా పనిమనిషి బీబీ పరిగెత్తుకుంటూ వొచ్చి "అమ్మ వరండాలో స్పృహలేకండా పడిపోయారు" అని చెప్పింది. ఎండాకాలం కావడాన చల్లగాలికోసం అమ్మని రాత్రిళ్ళు వరండాలో పడుకోబెట్టేవారు. అంతకి ముందే బీబీ ఆమెని మంచం మీదనించి లేవనెత్తి కుర్చీలో కూచో బెట్టింది. ఈలోగానే స్పృహ పోయింది. అమ్మ కళ్ళురెండూ తేలవేసి వున్నాయి. ముందుగా పరుగుతీసిన కామేశ్వరి అమ్మ పల్సుచూసి "పల్సు ఆగిపోయింది, షా" అని ఒకకేక పెట్టి "ఆక్సిజెన్ టెంట్ కావాలి, సెలయిన్ కావాలి." అంటూ ఇటూ అటూ తిరుగుతోంది హడావిడిగా. అసలు మనిషి చచ్చిపోతే స్పింటర్స్ అన్నీ open అయిపోతాయట. అమ్మకి అట్లాగే జరిగింది. ఆఖరికి మలమూత్రాలు కూడా అయిపోయా యని- డాక్టరుగా తాను అమ్మ చచ్చిపోయినట్లు నిర్ధారించానని ఈ రచనాకాలంలో వొచ్చిన కామేశ్వరి రామానందతో చెప్పింది.

షా వొచ్చారు వాకిట్లోకి. నిర్వికారంగా నిశ్చలంగా అమ్మ దగ్గరకి వెళ్ళి గుండెలమీద చెయ్యి వేశారు. అమ్మ గుండె ఆగిపోయింది. షా అట్లాగే తమ చేతిని అమ్మ గుండెలమీదనే వుంచారు. అయిదు నిమిషాలకి గాజువారిన అమ్మకళ్ళు మామూలుగా చూడడం మొదలు

పెట్టాయి, గుండె మళ్ళీ కొట్టుకోవడం మొదలు పెట్టింది. అమ్మని మంచంమీద బట్టలుమార్చి పడుకో బెట్టారు. కామేశ్వరి ఇది శాస్త్రం అంగీకరించదనీ, కానీ సృష్టిలో శాస్త్రాలు అందుకోలేని ఏదో అతీత మైన సత్యం వుందని అది షౌలో నిలవడంవల్లనే అమ్మ జీవించిందని తాము భావిస్తున్నట్లుగా రామానందకి చెప్పారు.

ఎండ అమ్మ ముఖాన పడుతోంది గనక వరండాలో ఒక బట్టని అడ్డంగా తెరలాగ కట్టారు బసవరాజుగారు.

"నన్ను బతికించావా అమ్మలూ" అంది అమ్మ.

"ఔను" అన్నారు షౌ నిర్లిప్తంగా.

"ఎందుకు నన్ను బతికించావ్?" అని అడిగింది అమ్మ.

ఎందువలన తాము అమ్మని బతికించారో షౌ కేం తెలుసు? కర్మంతా work out కాకముందు ఆమెని చచ్చిపోనియ్య దల్చుకోలేదు షౌ. కాని అది ఆమె సంకల్పంవలన జరగలేదు. ఏ జ్ఞానయినాగాని ఏదీ సంకల్పించడు. ఏది జరిగినా జ్ఞాని సమక్షంలో అవంతటవే జరుగుతాయి. ఈశ్వరమహిమ వలన జరుప బడుతాయి. అదే అమ్మ విషయంలోనూ జరిగిందేమో!

"అమ్మలూ నేను నీ కమ్మని గనుకే బతికించావు కదూ?" అని అడిగింది షౌని పిచ్చి అమ్మ.

ఒకసారి మృత్యువు కోరల్లోకి వెళ్ళివొచ్చినా అమ్మబంధం విడి వడలేదు. అనుక్షణం మాయని కమ్మటమే మమకార బంధపు లక్షణం కాబోలు!

"నువ్వేకాదు. అందరూ నాకు తల్లులే కదమ్మా!" అన్నారు షౌ నిర్లిప్తంగా. సరిగ్గా జీసస్ అలాగే అన్నారట ఒకసారి మేరి ఆయనని చూడడానికి వెడితే "కన్నందువల్ల తల్లికాదు. నన్ను చిత్తశుద్ధిగా ఎవ

రనుసరిస్తారో వారంతా నాతల్లి దండ్రులే" అని అన్నారట, తనని పరివేష్టించిన జనసమూహాన్ని చూపిస్తూ, భగవాన్ రమణులుకూడా తమతల్లి అలగమ్మ పట్ల ఏప్రత్యేకతా చూపించలేదు. ఆమెని పట్టుకుని రాపుకుని తిన్నారు. జ్ఞానిని కనడమంటే కత్తిని కనడమే. జ్ఞానుల్ని కన్నవాళ్ళ గుండెల్లో చిచ్చుతప్ప ఇంకేమీ వుండదు. జ్ఞాని అమ్మా, అయ్యా అనిపిలుస్తూ కన్నవారి మీద ప్రేమలు ఒలక బొయ్యడు, చిచ్చు రగిల్చి బంధమోక్షాన్నిచ్చి చిదానందంలో నిలుపుతాడు- కన్నవారిని- తనని నమ్ముకున్నవారిని. సౌరిస్ అమ్మ విషయంలో చేసినది, చలం మహర్షి విషయంలో, విశ్వాసుల విషయంలో ఇప్పుడు చేస్తున్నది అదే ననిపిస్తుంది.

ఇంతలో కృష్ణయ్యగారు వొచ్చారు. వరండాలో ఎండకి అడ్డుగా కట్టిన తెరని చూపుతూ "అట్లా వాకిట్లో అడ్డుగా తెరకట్టడం అశుభం" అన్నారు.

"ఏముందండి. అమ్మ చచ్చి పోయింది. మళ్ళీ బతికింది. తెర కడితేనేం?" అన్నారు షౌ విషయాన్ని తేల్చివేస్తూ.

తన దగ్గరేదయినా తినుబండారం వుంటే, "అమ్మలూ ,కూచో, తిను." అని షౌకి పెట్టేది అమ్మ. షౌ ఏవస్తువయినా అందరికీ పెట్టందీ తాము తినరు. అందరూ ఏమి తింటారో అదే ఆమెకూడా తింటారు. తమకి ఏప్రత్యేకత చూపించినా ఒప్పుకోరు. ఇది ఆమెకి గురువునించి సంక్రమించిన లక్షణం "నాకు వొద్దమ్మా" అని అమ్మ ఇవ్వజూచే పదార్థాన్ని తీసుకోవడానికి నిరాకరించే వారు. "అమ్మలూ కూచోరా, తిను" అని బలవంతం చేసేది అమ్మ.

"చూడు నీకయితే నేనొక్కదాన్నే కూతుర్ని. కాని నాకెంత మంది పిల్లలో చూడు. వాళ్ళందరికీ పెట్టకండా నేనెట్లా తినగలను?"

అని అడిగేవారు షా. అమ్మదృష్టికి షా తన కన్నబిడ్డ. కాకపోతే ఇంకో ఇద్దరు పిల్లలు తనవారు. మరి షా కైతే పెక్కు మంది-బిడ్డలు. తా మొక్కరే అమ్మ. చివరికి నవమాసాలు మోసి తనని కన్నతల్లి రంగనాయకమ్మగారు కూడా షా దృష్టిలో తన బిడ్డే. జగతః పితరులైన పార్వతీపరమేశ్వరుల లీలావిలాసాలు ఒక్కొక్కసారి ఒక్కొక్కలాగ ఈశ్వరవిలాసిని షాలో కనిపించేవి. అది ఆక్షణాన పూర్ణమాతృత్వతా దీప్తిగా నిలిచినట్లుగా తోస్తుంది.

సర్వాన్నీ త్యజించి భగవాన్ కోసం చలం కుటుంబీకు లందరి కన్నా ముందుగా అరుణాచలం వొచ్చేసిన- అమ్మ భగవాన్ చేత తన ప్రేమ జులుంతో చాకలెట్లు బిస్కట్లుసైతం తినిపించిన- అమ్మ భక్తురాండ్రందరిలోను భగవాన్ వాత్సల్యాన్ని అధికంగా చూరగొన్న అమ్మ- చరమసంధ్యలలో- భగవాన్‌ని పేరుకికూడా తలుచుకునేదికాదు. భగవాన్‌మీద తనపట్టుని మళ్ళీ నిలుపుకోగలిగితే అమ్మకి అన్నిబాధల నించి ఉపశమనం దొరుకుతుందేమో ననుకునే వారుషా. కానీ injection ఇచ్చినా, ఏబాధ వొచ్చినా అమ్మ 'సదా శివా' అనేది. ఈశ్వరుడు మానవరూపంలో దిగివొస్తారని ఆమె నమ్మకం. ఆవిడ ఈభ్రమలో పడిపోయి తమమీద, భగవాన్ మీద విశ్వాసం వుంచుకోవటల్లేదని అమ్మని కోప్పడేవారు షా. భగవాన్‌ని తలుచుకోమని షా ఎంతచెప్పినా అమ్మ ససేమిరా వినేదికాదు. భగవాన్‌ని తలిచేది కాదు. నిత్యమూ సదాశివ స్మరణం చేసేది. 'సదాశివుడు రావాలి' అనేది. చివరికి ఒక రోజు "ఎవరమ్మా ఆ సదాశివుడు? నేనే ఈశ్వరుడు నాలో ఐక్యమై పోయారు. నిన్నెవరమ్మా బతికించింది?" అని అడిగారు షా. అలాగైనా అమ్మ తమమీద దృష్టిపెట్టుకుంటుందని చెప్పి చూశారు షా. "నువ్వుకాదే, సదాశివుడు పేరేపున్నాడు. ఇక్కడికి రావాలి" అనేది

అమ్మ. ఆమెలోని భ్రాంతులని షౌ ఎంతగా తీసేయాలని ప్రయత్నించినా ఆమె వొప్పుకునేది కాదు. షౌ అమ్మ దగ్గర కూచుని "రమణ అను" అని చెప్పేవారు. కానీ అమ్మ అనేదికాదు. ఎందుకు మతిని ఇట్లా భ్రమలలోకి తిప్పుకుంటుందా! అనుకునేవారు షౌ.

అంత జబ్బులోనూ ప్రతిరోజూ భజనలకి వొచ్చి తాను కట్టిన పాటలు పాడేది అమ్మ. అమ్మకి తెలుగు పుస్తకాలు చదివి వినిపించేవారు షౌ. ఇంగ్లీషులో వున్న 'బిండిల్' కథలంటే అమ్మకి ఎంతో ఇష్టం. అందుకని వాటిని కూడా ఆమెకి చదివి వినిపించేవారు షౌ.

షౌ షికార్లు వెడుతోంటే "పెందరాళెతా అమ్మలూ!" అనేది అమ్మ. షౌ షికారునించి వొచ్చేశాక "ఇంత చీకటి పడేదాకా ఎందుకు కూచుంటా వమ్మలూ, పెందరాళే వొచ్చెయ్యమ్మా!" అని గోముచేసేది.

రమణస్థానీయులు షికార్లకి వెళ్ళినప్పుడు, రోజులో తమకి వీలయినప్పుడల్లా జగదీష్ భాయి వొచ్చి అమ్మదగ్గర కూచుని భజనలుపాడి ఆమెకి కాలక్షేపం చేసేవారు.

గుడిపూడి భక్తబృందం వొచ్చినప్పుడు అమ్మ వాళ్ళచేత భజనలు చేయించేది. వాళ్ళని "సాంబ సదాశివ" నామం చేయమనేది. ఒకసారి హార్టు ఎటాక్‌లో వాళ్ళని "సాంబ సదాశివ" అని పాడమన్నది అమ్మ. వాళ్ళది పాడేసరికి ఆమె హార్టు ఎటాక్ తగ్గిపోయిందట.

కామేశ్వరికి ఆ దరిమిలానే మద్రాసు ట్రాన్స్ఫరయింది. చీటికి మాటికి వీలున్నప్పుడల్లా తిరువన్నామలై వొచ్చి అందర్నీ చూసి వెళ్ళేది. అమ్మ కామేశ్వరిమీద తన పాతకోపాన్ని మరిచిపోయి ఎంత ప్రేమని కురిపించిందో!

అమ్మకి ఒక **injection** ఇచ్చిన జాగాలో నెత్తురు గడ్డకట్టి పెద్దకురుపుగా తేలింది. గుండెబాధతో బాటు, అదికూడా పెద్ద బాధయి

పోయింది అమ్మకి. ఎన్నిమందులు వేసినా తగ్గలేదు. ఆ కురుపు రోజు రోజుకి పెరిగి కొబ్బరికాయంత ఎదిగింది. కాని operate చేయడానికి పక్వానికి రాలేదు.

ఒకరోజు మా తల్యార్ఖాన్ ఇంగ్లాండు నించి వొచ్చిన ఒక spiritual healer ని రమణస్థాన్‌కి తీసుకు వొచ్చింది. ఆయనకి అమ్మని చూపించారు. ఆయన ఒక గ్లాసునీళ్ళు అడిగి తీసుకుని, వాటి మీద చెయ్యిపెట్టి కాసేపు అట్లాగే వుంచి "ఈ నీళ్ళలో బట్టని తడిపి ఆ కురుపుమీద వేయండి, రేపటికల్లా తగ్గిపోతుంది" అన్నారు. నర్సులు వాళ్ళు ఆ healer చెప్పినట్లే చేశారు. మర్నాటి వుదయానికల్లా ఆ కురుపు దానంతటది పగిలిపోయి చీము, నెత్తురుతో కూడిన పెద్ద కండ బయటికి వొచ్చింది. దాన్ని బట్టలోవేసి నర్సు కి అవతల పారెయ్యడానికి వెడుతూంటే- అమ్మ "ఏం పిల్లే నర్సు కి?" అని అడిగింది. అందరూ ఎంత నవ్వుకున్నారో! ఆవేళ అమ్మ sense of humour కి రమణస్థాన్‌లో అందరూ.

జబ్బుపడ్డాక అమ్మని చూడటానికి ఎంతోమంది వొచ్చేవారు. వారిలో సత్యానంద ఒకరు.

సత్యానంద రమణాశ్రమవాసి. భగవాన్ చివరిరోజుల్లో భగవాన్‌కి సేవ చేసినవారు. ఆశ్రమంలో నెమళ్ళకి మేతవేయడం, భగవాన్ నిర్యాణంగది చూసుకోవడం ఆయన పని. నెమళ్ళకి వేసే మరమరాలే చిన్న పిల్లలకి పెట్టేవారు. అందువల్లనే పిల్లలకి ఆయనని చూస్తే ప్రియం.

ఆ తరువాత కొన్నేళ్ళకి ఆయన ఆశ్రమం నించి కొన్నాళ్ళు బైటికి వొచ్చేశారు. తమ స్నేహితుల దగ్గర కొన్నాళ్ళు వున్నారు. ఆయన ఆరోగ్యం దెబ్బతిని పోయింది. కొన్నాళ్ళకి మతిస్థిమితం

లేకండా పోయింది. ఆయనని చూసుకునే వారెవరూ లేకపోయారు. చివరికి శ్రీరమణస్థాన్ చేరుకున్నారు. ఇటీవలే ఆరోగ్యం బాగా మెరుగయి తిరిగి ఆశ్రమంలో చేరారు.

కామేశ్వరి తనకి వీలయినప్పుడల్లా మద్రాసు నించి వొచ్చి అమ్మని ఓదార్చేది. "షౌ నువ్వు చూపే మాతృ, పితృభక్తి లాంటిది పురాణాల్లో చదువుతాం. నువ్వు వారిపట్ల ఎంత ధర్మాన్ని చూపిస్తున్నావో" అనేది కామేశ్వరి తరుచుగా షౌతో.

అమ్మ మూలుగుతుంటే చలంగారికి నిద్రరాదని ఆ గదికి, చలంగారి గదికి మధ్య తలుపులు వేసేసే వారు. ఏ అర్ధరాత్రో, అపరాత్రో అమ్మకి ఎటాక్ వొస్తే చివరికి డాక్టర్ కూడా షౌ గదిలోంచి వెళ్ళి నిశ్శబ్దంగా అమ్మకి injection ఇచ్చి వెళ్ళిపోయేవారు. చలంగారికి నిద్రాభంగం కలగకుండా అన్నిపనులనీ సంజ్ఞలతోనే నడిపించేవారు షౌ. ఆవిధంగా తమ తల్లిదండ్రులకి ఒకరివల్ల ఒకరికి బాధ కలగకుండా, వాళ్ళిద్దర్నీ కంటికిరెప్పలా కాపాడుకుంటూ వొచ్చారు షౌ.

అప్పట్లో ఆశ్రమంవారు రమణస్థాన్‌కి భక్తుల రాకపోకలమీద పెట్టిన ఆంక్షని కొంత సడలించి నట్లున్నారు. ఎందరో విదేశీయులు, దేశీయులు రమణస్థాన్ భజనలకి నిత్యమూ రావడం మొదలు పెట్టారు. కొందరు భజనలను రికార్డు చేసుకుని వెళ్ళేవారు. వారిలో ఒకామె బార్బరారోజ్. తరువాత నీల్ అనే అబ్బాయి వొచ్చేవాడు. వాళ్ళిద్దరూ భజన పూర్తయినాక అమ్మదగ్గర కాసేపు కూచునిమరీ ఇళ్ళకి వెళ్ళేవారు.

రమణస్థాన్‌కి డిశంబర్‌లో రంగులు, సున్నాలు వేయించారు. ఆ ఘాటు పడక అమ్మకి, షౌకి దగ్గు పట్టుకుంది. అప్పటికే అమ్మకి లంగ్స్ దెబ్బతినడం మొదలు పెట్టాయి. జీవనయాత్ర ముగించి,

అనంత పథయాత్రలో అమ్మ సాగిపోయే రోజు త్వరలోనే రానుం దని షౌకి తెలిసింది. అప్పటికే వజీర్ వొచ్చి అమ్మని చూసి వెళ్ళారు.

అమ్మని చూడడానికి పకపక టిప్పల్‌తో తరలి వొచ్చింది. పిల్ల లంతా ఈ వాతావరణం వలన బెంగలో పడిపోతారని షౌ— పిల్ల లం దర్నీ బైట కూచోబెట్టి ఆటలు ఆడించేవారు. బ్రహ్మాండ భాండాలతో మాయతో దాగుడుమూత లాడుకునే ఈశ్వరు డీనాడు రమణస్థాన్‌లో పసిపిల్లలతో కలిసి దాగుడుమూత లాడు తున్నారు- షౌగా నిలిచి.

అమ్మకి వొళ్ళంతా నీరు పట్టింది. ఎవరూ ఆమెని ఎత్త లేకపో తున్నారు. చిత్రకికూడ అమ్మని లేవనెత్తి కూచోబెట్టడం సాధ్యం కావ డం లేదు. అమ్మ చేని పిలిపించమని అడిగింది. చేకి వుత్తరం రాయిం చారు. చేకి రావడం ఇష్టం లేదు. తాను రానని స్పష్టంగా రాసింది. చే తాను రానని రాసిందనేసరికి నిదానంగా కొంతసేపు చూసింది. ఆమెలో ఏం జరుగుతోందో.

అమ్మ అంతరాంతరాల్లోని మమకార బంధనాల్ని ఒక్కటొ క్కటే బాధ తెలియకండా తెంపేస్తున్నారు షౌ- తన గురువు భగ వాన్ తల్లి అలగమ్మ విషయంలో చేసినట్లుగానే. అంతలోనే తమా యించు కుంది అమ్మ. "నా కెవరూ అక్కరలేదు. కామేశ్వరి నా దగ్గ రుంటే చాలు" అంది అమ్మ. కామేశ్వరికికూడ అమ్మ చివరిరోజుల్లో రావడానికి వీలు లేకపోయింది. ఇదంతా విచిత్ర మేమీకాదు. వీటన్ని టికి వెనకాల ఈశ్వరుడు షౌ రూపంలో నిలిచి కథ నడుపుతున్నారు- అమ్మ మరణానంతరజీవితం ఆనందప్రదం జేసేందుకు.

అమ్మ పకపకని, చలంగార్ని, షౌని దగ్గరకి పిలవడంకూడా మానేసింది. ఏ అవసరం అయినా నర్తకిని, చిత్రనే పిలవడం మొదలు పెట్టింది.

చలంగారు డా॥ పాలంకి సూర్యనారాయణగారికి రాసె గుండెకి మందు తెప్పించారు. ఆ మందు వాడటం వలన అమ్మగుండె చనిపోయేదాకా even గా కొట్టుకునేది. సాధారణంగా హార్టుఎటాక్ వొస్తే పెథిడ్రిన్ ఇవ్వాలి డాక్టరు. "పెథిడ్రిన్ దొరకడం లేదు. జాగ్రత్తగా వాడండి" అని సలహా ఇచ్చారు. అందువలన తమదగ్గరున్న పెథిడ్రిన్ అమ్మకి అత్యవసర సమయంకోసం దాచిపెట్టింది నర్తకి.

ఇంతలో రామారావు అనే డాక్టరు రమణస్థాన్‌కి వొచ్చారు. ఆయనకి ఈ ప్రపంచంలో అర్ధం కనబడక విరక్తితో ఇక్కడికి వొచ్చేశారు. ఇక్కడ వుండడంతో ఆయన **spirits revive** అయ్యాయి. ఆయన తాను జర్మనీదేశానికి రాసి పెథిడ్రిన్ తెప్పించి పెడతా మన్నారు.

జయంతి మామూలుగానే జరిగిపోయింది. జయంతికి కృష్ణ రమణస్థాన్‌లో ఈశ్వరాంకితంగా వుండిపోవడానికి వొచ్చేసింది.

చలంగారికి వజీర్‌రహ్మాన్ వుత్తరం రాశారు. "సంగీతరావుగారు చిన్న చిన్న తంబురాలు కొన్నారు. ఎంత బాగా వున్నాయో !" అని. అంతకి మునుపు మెర్‌స్టన్, ఆథాం ఎంతోమంది షౌ కంఠానికి హార్మోనియం బాగావుండదనీ, షౌ కంఠానికి తంబురా ఎంతో **suitable** గా వుంటుందనీ అనేవారు. చలంగారు సంగీతరావుగారికి వుత్తరం రాశారు— "మాకుకూడా ఓ చిన్న తంబురా ఇప్పించండి" అని.

సంగీతరావుగారు ఆయన భార్యాసమేతంగా జయంతికి వొస్తూ ఒక చిన్న తాంబురా తెచ్చి శ్రీరమణస్థాన్‌కి **present** చేశారు. ఆయనే దాన్ని మీటడం, శ్రుతి పెట్టడం షౌకి చూపించారు.

ఆ జయంతికి ఆంధ్రదేశం నించి చిన్నారావుగారు, ఆయన మిత్రులు, కృష్ణారావు, నరసింహారావు, సుబ్బారావు, రఘువీరరావుగార్లు వొచ్చారు. వాళ్ళు జయంతికి రమణస్థాన్‌లో భిక్ష చేయించారు. తామం దరు దారిలో తినడానికి చేగోణీలు తెచ్చుకున్నారు. అవి చలంగారి వాళ్ళకి ఇవ్వాలని వాళ్ళ వుద్దేశ్యం. ఇస్తే ఏమనుకుంటారో అని వాళ్ళ జంకు. ఆసంగతి చిన్నారావుగారు చలంగారితో చెబితే "ఓ తప్పకుండా తింటాం. ఇవ్వ మనండి" అన్నారు చలంగారు.

అప్పుడు లక్ష్మిగారుకూడా ఇక్కడే వున్నారు. ఆ చేగోణీలు ఎంత రుచిగా వున్నాయో! "ఎవరు చేశారు" అని అడిగేసరికి "నేనే చేశాను" అన్నాడు వాళ్ళతో వొచ్చిన ఒకాయన. "సరే అయితే సరుకు లన్నీ తెప్పిస్తాను, చెయ్యండి" అన్నారు చలంగారు. బియ్యం మరకి పంపించి పిండి చేయించి తీసుకు రమ్మన్నారు. మరలో ఆ పిండిలో రాగిపిండి కలిసింది. ఇంక ఆ పిండి తీసుకుని పాపం ఆయన తం టాలు పడుతున్నారు. ఆ పిండి బంకలాగ సాగుతోంది. ఆయన ఆ పిండితో పడే అవస్థ చూడలేక లక్ష్మిగారు "ఇట్లా ఇవ్వండి నేను కలుపుతాను" అని ఆయన దగ్గర్నించి తీసుకుని ఆవిడే ఆ పిండికలిపి చేగోణీలు చేశారు. ఆ చేగోణీలు రాళ్ళలాగ ఇనపగొలుసుల్లాగ వున్నాయి. ఆయన భోజనాలదగ్గర సిగ్గుతో తల వొంచేసు కున్నారు. లక్ష్మిగారు చలంగారితో "చేగోణీలు తినాలనిపిస్తే నన్నడగరాదా? నేను చేసి పెట్టనా?" అన్నారు. ఆ తరువాత వాళ్ళంతా వాళ్ళ వూరు వెళ్ళిపోయారు. ఆయన బ్యాచ్‌తోనే వొచ్చిన సుబ్బారావుగారు రెండు మూడేళ్ళ తరువాత ఒక టూరిష్టు బస్సులో టూరిష్టులతో కలిసి వొచ్చారు. అప్పుడు వాళ్ళతో చలంగారికి బంధువురాలైన ఒకమ్మాయి వొచ్చింది. ఆ అమ్మాయి చిన్నతనంలో చలంగారి భుజం పట్టుకుని

"బావ, బావ" అంటూ తిరిగేది. ఆమెకి సుబ్బారావుగారి భార్యకి చాలా స్నేహం. వాళ్ళిద్దరిదీ ఒకటే వూరు. అప్పుడావిడ- తాను, సుబ్బారావుగారి భార్య కలిసి ఆ చేగోణీలు చేసి పంపించా" మని చెప్పింది. అందరూ అప్పుడెంతగా నవ్వుకున్నారో!

చిన్న తంబురా వొచ్చాక అందరూ "షౌ చిన్న తంబురాతో పాడట మేమిటి, పెద్దదానితో పాడాలి" అన్నారు. బెంగుళూరు లక్ష్మి నారాయణగారు భార్యకోసం ఒక తంబురా చేయించారు. ఆమె అది వుపయోగించటల్లేదు. అందుకని చంద్రశేఖర్, ఆయనా కలిసి దాన్ని రమణస్థాన్‌కి తీసుకు వొచ్చారు. లక్ష్మినారాయణగారి తంబురా వొచ్చిన తరువాత తంజావూరు తంబురా గురించి కలలు కనడం మొదలు పెట్టారు రమణస్థానీయులు. కామేశ్వరి షౌకి తంజావూరు తంబురా తెప్పించి పెడతా నన్నది. ఇంక వజీర్, సంగీతరావుగారు మద్రాసులో తంబురాకి ఆర్డరిచ్చి, దాన్ని జాగ్రత్తగా చేయించి, శ్రద్ధగా పరిశీలించి రమణస్థాన్‌కి పంపారు.

జయంతి తరువాత కొద్దిరోజులకి పూనానించి లక్ష్మి అనే అమ్మాయి వొచ్చింది. అమ్మ రాత్రిళ్ళు వాళ్ళిద్దర్ని తనని పట్టుకోమనేది. తనని లేవదీసి, కూచోబెట్ట మనేది. కృష్ణకి B. P. రాత్రి అమ్మని కూచోబెడితే, ఆ శ్రమకి B. P. పెరిగి తెల్లవారగట్ట డోకేసేది ఆమె.

ఒకరోజు అమ్మ పెథిడిన్ కోసం రాత్రంతా గోల పెట్టింది. ఇంక అమ్మ ఎక్కువరోజులు బతకదని తమ దగ్గరున్న పెథిడిన్ ఇచ్చేసింది నర్సు కి షౌని అడిగి. ఆవిడకి స్పృహపోయి గురక వొచ్చేసింది. చలంగారు షౌ దగ్గరకి వొచ్చి "అమ్మకి గుడివాడ rice mill గుర్తు చేయండి" అన్నారు.

"ఏం హ్యూమరో?" అనిపించింది షౌకి. అలా రెండు రోజులు గడిచిపోయాయి అమ్మకి.

మూడో రోజున షౌ తమగదిలో కూచొని వుండగా తమ బొడ్డు లోనించి అమ్మలోపలికి **Umbilical cord** లాంటిది కనబడింది. అది హఠాత్తుగా కత్తితో కోసేసినట్లు తెగిపోయింది. అసలటువంటి బంధం ఏదీ షౌలో లేదు. కాని అమ్మకిమాత్రం షౌ తన కూతురనే గట్టిబంధం వుంది.

ఆ ఉదయం షౌ తమగదిలో కూచుని అమ్మకి ఇష్టమైన మీరా పాటలు పాడారు. అమ్మప్రాణం పోవడానికి కొన్ని ఘడియలుమాత్రమే వ్యవధానం వున్నట్లు ఆమెకి స్పష్టంగా తెలిసింది.

షౌ వెళ్ళి అమ్మకి దగ్గరగా కుర్చీలో కూచున్నారు. అమ్మకి స్పృహ లేదు. కళ్ళుమూతలు పడివున్నాయి. అంతకి ముందే షౌతో వాగ్దానం చేయించుకుంది అమ్మ చివరిసారి షౌ కళ్ళలోకి తాను చూస్తూండగానే తనప్రాణం పోవాలని.

హఠాత్తుగా లేచి షౌ ఆమె దగ్గర కూచున్నారు. అది అసంకల్పితంగా అత్యంత సహజంగా జరిగింది. అమ్మవైపు వొంగి కూచున్నారు షౌ. అప్పటిదాకా మూతలు పడివున్న అమ్మకళ్ళు అప్రయత్నంగా విప్పారుకున్నాయి పువ్వుల్లా. అమ్మ షౌ కన్నులలోకే చూస్తోంది. అలా చూస్తూ వుండగానే అమ్మ లోనించి ప్రాణజ్యోతి అదృశ్యమైపోయింది. సారంగపాణికోసం అంతకి ముందే కబురు పెట్టింది నర్సుకి. ఆయనకి జాండిస్. ఇల్లు కదలటల్లేదట. అయినా వోపిక చేసుకు వొచ్చారు. ఆయన సరిగా గుమ్మంలో అడుగుపెట్టారో లేదో అదే సమయానికి అమ్మప్రాణం అనంత యాత్రలో వెళ్ళిపో

యింది. అదేం బంధమో! అమ్మకి ఇష్టమైన గ్రామఫోన్ రికార్డులు ప్రాణం పోయే ముందు అరగంట నించి పెట్టించారు షౌ.

ఇల్లంతా ఒక్కక్షణం నిశ్శబ్దం అలుముకుంది. మరుక్షణానికి ఏంజరిగిందో అందరికీ తెలిసింది. సౌరిస్ వినా రమణస్థాసీయు లంతా అమ్మలేనిబిడ్డలైనామని రోదిస్తున్నారు. చలంమహర్షి వరండాలో ఒంటరిగా అరుణాచలం వంక చూస్తూ కూచున్నారు. ఆయన దగ్గరకి వరండాలోకి వొచ్చారు సౌరిస్ "అమ్మ చచ్చిపోయింది నాన్నా!" అన్నారు నిశ్చలంగా సౌరిస్. ఆమాట వినగానే వెక్కివెక్కి ఏడ్చారు చలం. అలా ఎన్నడూ తమజీవితంలో చలం అట్లా విలపించడం చూడలేదు వాళ్ళు. "మీ ఇద్దర్నీ యాడాది నించి కాపాడు కొంటూ వొచ్చాను నాన్నా!" అంటున్న సౌరిస్ తల్లి కన్నుల్లో నీళ్ళు నిండాయి.

అమ్మ చనిపోగానే ఆశ్రమానికి కబురు పెట్టారు షౌ. ఆ రోజునే మా తల్యార్‌ఖాన్ ప్రభృతు లంతా అమ్మని చూడడానికి వొచ్చారు.

ఎప్పటిలాగే ఆ సాయంత్రమూ భోజన భాజనాలు ముగించి రమణస్థానం భజనకి ఆయత్తమైంది. కరెంటు పోయింది. హరికేన్ లాంతర్లు వెలిగించింది నర్తకి. అందరూ భజన చేస్తున్నారు. మామూలుగానే భక్తులంతా వొచ్చి కూచున్నారు. హారతి ఇచ్చాకనే తెలిసింది వాళ్ళకి అమ్మ జీవనయాత్ర చాలించిందని. భజన ముగిసింది. భక్తులంతా ఇళ్ళకు మళ్ళారు. మసక చీకటి లోంచి చలం మహర్షి ఆర్ద్రమైన గళం "షౌ! అమ్మ కనబడలేదా నీకు?" అని ప్రశ్నించింది సౌరిస్‌ని. "ఇంకా కనబడలేదునాన్నా!" అన్నారు నిర్లిప్తంగా షౌ. మామూలుగానే తెల్లవారింది.

ఆశ్రమం ప్రెసిడెంట్ గారి భార్య నాగలక్ష్మి అమ్మని చూడడాని కొచ్చారు.

"మీ అమ్మ ఎంతో పుణ్యాత్మురాలమ్మా.
పుట్టెడు పసుపూ కుంకుమలతో
ప్రత్యేకమైన శుక్రవారం నాడు
స్వర్గానికి వెళ్ళిపోయింది" అన్నారామె షాతో.

అమ్మ మొదటిసారి అరుణాచలం వొచ్చినప్పుడు నాగలక్ష్మిగారు వారింట్లోనే వుంచుకున్నారట. వాళ్ళ పిల్లలంతా అమ్మని మామీ,మామీ అంటూ చుట్టూ చేరేవారట.

అమ్మ ఆ పిల్లలందరికి జడలువేస్తూ కథలు చెప్పేదట. ఆసంగతులన్నీ చెబుతూ అమ్మతమతో గడిపిన రోజుల్ని తలుచుకున్నారు నాగలక్ష్మి. అమ్మని చరమయాత్రకి అంతాసిద్ధం చేస్తున్నారు. చలంమహాలక్ష్మి అనే అమ్మాయి చెయ్యిపట్టుకుని- ఒకపుస్తకం తీసుకుని guest houseకి వెళ్ళిపోయారు. చూసేవాళ్ళ కది విడ్డూరంగానే వుంటుంది.

"అబ్బా ఏం షోకిల్లారా, హాయిగా ఒకమ్మాయిని వెంటపెట్టుకు వెళ్ళిపోయాడు. అవతల భార్యని పాడెమీద పడుకో బెడుతూంటే" అనుకుంటారు.

అది సహజమే! లోకం తీరే అలాంటిది. వస్తుతత్వాన్ని పరిశీలించి మాట్లాడే దెవరు? చలంగారు మొదటినించి చావన్నది భరించలేరు, అది ఎవరి చావైనా గాని. అందుచేతనే అదంతా చూసి తట్టుకోలేరు గనుక వెళ్ళిపోయారు చలం. చైతన్యరహితమైనదాన్ని దేన్నీ భరించలేదు ఆయనలోని కళాత్మకదృష్టి. అందుకని చైతన్యానికి దూరమైన అమ్మదేహాన్ని చూడలేక వెళ్ళిపోయారు.

అంత్యక్రియలకి బ్రాహ్మల్ని పిలిచారు. అమ్మకి ఏవేవో కోరికలున్నాయి. కానీ షా తమకి తోచినట్లు చేయించారు. ఆమె అంత్య

క్రియల్ని. అమ్మకి స్నానంచేయించారు నర్తకి,చిత్ర. అమ్మ కోరుకున్నట్లుగా కామేశ్వరి పెట్టిన కొత్తచీర కట్టబెట్టారు. చిత్ర, నర్తకి అమ్మ దేహానికి చరమాలంకారం చేస్తూవుండగా జగదీష్‌భాయ్, షా లోపల గదిలో కూచుని అమ్మ కిష్టమైన మీరాపాటలు, భజనలు పాడారు. అమ్మపాదాలకి పచ్చని పసుపు రాసింది చిత్ర. అమ్మముఖాన ఎఱ్ఱని కుంకుమబొట్టు పెట్టింది నర్తకి. అమ్మ జుట్టు ముడివేసి గులాబి పువ్వులు పెట్టారు. అమ్మ దేహాన్ని పాడెమీద పడుకో బెట్టారు. అమ్మమెడలో పెద్ద సన్నజాజిపువ్వుల దండ వేసింది నర్తకి.

జూడీ అనే అమ్మాయి ఎఱ్ఱని మందారాలు తెచ్చింది. నర్తకి వేసిన జాజిపూలమాల నడుమని ఆ మందార పువ్వుల్ని గుచ్చి వేసింది.

ఈ అలంకారాలతో అమ్మ ఎంతో ఠీవిగా వుంది. ముక్కూమొగం తెలియని బ్రాహ్మడి నెవరినో కొడుకుగా పెట్టడం ఇష్టంలేదు షాకి. కష్టసుఖాల్లో అన్నిటిలోనూ రమణస్థాన్‌కి తోడు నీడగా నిలిచి అమ్మ పుత్రవాత్సల్యాన్ని చూరగొన్న కృష్ణారావుగారినే కొడుకుగా వుండమన్నారు షా. గొప్ప emotion లో ఒణికిపోతూ సౌరిస్ తల్లి పాదాలకు సాష్టాంగనమస్కారం చేశారు కృష్ణారావుగారు. ఆయనని ఆశీర్వదించారు షా.

నిప్పుకుండని చేతబట్టి ముందుకి నడిచారు కృష్ణారావుగారు. పాడెని తీసుకు వెడుతూంటే అమ్మదేహం చెక్కు చెదరలేదు. అమ్మ ముఖంలో ప్రేతకళ రాలేదు. అంతిమయాత్రలో— చిత్ర, నర్తకి చేసిన అలంకారాలతో ఎంతో ఠీవిగా పుట్టెడు పసుపుకుంకుమలతో పుణ్యమూర్తిగా వెళ్ళిపోయింది అమ్మ.

ఆ పాడె వెడుతూంటే అదేదో పెళ్ళి వూరేగింపులో అమ్మ వెడుతున్నట్లనిపించింది చూచేవారికి. ఎదురుగుండా నిరామయంగా

అరుణాచలం. ఏదో మహా నిద్రలో వున్న మహారాణిలా అనిపించింది అమ్మ. అమ్మని తీసుకు వెళ్ళిపోతోంటే దుఃఖం పట్టలేక వెక్కివెక్కి ఏడ్చారు నర్తకి, చిత్ర. సౌరిస్ వాళ్ళని దగ్గరగా తీసుకుని ఓదార్చారు. అసలు వాళ్ళెవరికి తెలియదు తామెంతగా ప్రేమించారో అమ్మని. పాడె వెంబడి గంగాధరం, సారంగపాణి, రమణస్థానీయులు మరి కొంతమంది నడిచారు.

కృష్ణారావుగారు తలకొరివి పెట్టగానే మంట లవంతటవే భగ్గున పువ్వెత్తుగా పైకి లేచాయి. అమ్మ ఒక చైతన్య జ్వాల. జ్వాలా జిహ్వ డామెని జ్వాలా మాలికలతో అలంకరించాడు. శ్మశానంలో జరిగిన సంగతిని ఆశ్చర్యంగా సౌరిస్‌కి చెప్పారు సారంగపాణి ప్రభృతులు. అమ్మకి బ్రాహ్మణపుపట్టు అధికం. ఆఖరి నిముషానికి ఆ పట్టింపు తెగిపోయి కృష్ణారావుగారిని మనస్ఫూర్తిగా బిడ్డగా అంగీకరించి నట్లుంది సారంగపాణి చెప్పిన సంగతులు వింటోంటే.

ఇంతట్లో బార్బరారోజ్ వొచ్చింది. "చావంటే ఇంత అందమైనదని నువ్వే తెలిపావు నాకు" అన్నదామె షా తో.

రాత్రి electric lamps కావాల్సి షా వాళ్ళే ఆర్పేశారనుకుంది ఆమె. కానీ అది నిజంకాదు. దీపా లవంతటవే ఆరిపోయాయి. రాత్రికి రాత్రి విద్యుచ్ఛక్తి శాఖోద్యోగులు వొచ్చి దీపాలు వెలిగించడానికి ప్రయత్నించి విఫలులయ్యారు. మరుసటిరోజు మధ్యాహ్నం అమ్మ అంత్యక్రియలు పూర్తయి అందరూ తిరిగి వొచ్చిం తరువాతే దీపాలు వెలిగించగలిగారు వాళ్ళు.

ఆ రోజు మధ్యాహ్నం షా తమగదిలో కూచున్నప్పుడు అమ్మ ఆత్మ వొచ్చి ఆమెని కావిలించుకుంది. అమ్మలో ఎంత ప్రేమో ఎంతానందమో ! ఆ నిమిషంలో.

ఆ రోజులలో సాయంత్రం షికార్లలో అరుణాచలం కొండ వైపు నడిచేవారు రమణస్థానీయులు. షికారులో షౌకి తమ చెయ్యి పట్టుకుని అమ్మ-రూపం కనపడింది. అమ్మ షౌతోబాటు నడిచి చలం మహర్షి వాళ్ళు కూచున్న కొండరాళ్ళ దగ్గరకి వొచ్చింది.

అందరిలోంచి షౌని విడిగా తీసుకుపోయి ఒక కొండరాయి మీద కూచోబెట్టుకునేది అమ్మ. అప్పు డమ్మ తాను ఇక్కడింకా పది రోజులుంటానని, పదకొండోరోజు తన లోకానికి వెళ్ళిపోతా నని షౌకి చెప్పింది. ఆ పదిరోజులు అమ్మరూపం అట్లానే షౌతో షికారు వొచ్చేది. భజన్లలో వొచ్చి కూచునేది. షికార్లలో కూచుని వుండగా అమ్మ షౌ తనని చూస్తూ వుండగానే ఒక్కనిమిషంలో అరుణాచల శిఖరంమీదికి వెళ్ళి దిగి వొచ్చేసేది. ఈ దేహం లేకపోతే ఎంతహాయో కనిపించేదట షౌకి ఆమెని చూస్తూ వుంటే.

మరుసటిరోజు వుదయం అమ్మకి పాలు పొయ్యడానికి వెళ్ళారు కృష్ణారావుగారు, మిత్రులు. అక్కడ పాలుపోసి, అమ్మ అస్తికలు ఇంటికి తెచ్చారు. అమ్మ పుట్టిన వూరు బెజవాడ. అమ్మ అస్తికల్ని కృ నదిలో కలిపేయాలని తీసుకుని వొచ్చారు. చలంగారు ఆ రోజు ప కుత్తుకి వెళ్ళి ఇంటికి తిరిగివొస్తూ ఇంటిముందున్న స్థలంవైపు చూ స్తూ "అదిగో అమ్మ సమాధి. అక్కడ కనిపిస్తోంది" అన్నారు. అంతకి ముందే ఇంటి ముందున్న ఆ స్థలాన్ని Highways వాళ్ళు తోటవేసుకోవడానికి రమణస్థాన్‌కి యిచ్చారు.

చలంగారు సమాధిప్రస్తావన చేసేసరికి వారు చెప్పిన జాగాలో-అమ్మ అస్తులలో మూడు భాగాలను సమాధిచేయించి, ఒక భాగం అస్తుల్ని కృష్ణానదీజలాల్లో నిమజ్జనానికి భద్రం చేయించారు షౌ. చలంగారికి మామూలుగా వుండే సమాధుల ఆకృతి ఇష్టం వుండదు గనుక మేస్త్రీని పెట్టించి వృత్తాకారంలో సమాధి కట్టించారు షౌ.

మేస్త్రీ ఆ సమాధిని కడుతూ వుండగా ఆ సమీపంలోనే — చలంగారు విరామసమయంలో కూచోవడానికని బసవరాజుగారు ఒక అరుగుని కడుతున్నారు.

"ఆ అరుగుని కొంచెం దూరంగా కట్టండి. లేకపోతే మేమిద్దరం పోట్లాడుకుంటాం" అన్నారట జోక్‌గా అక్కడేవున్న చలంగారు.

అమ్మసమాధి మీదికి ఒక URN (అర్న్) తీసుకుని రమ్మని షా చంద్రశేఖర్‌కి బెంగుళూరు వుత్తరం రాయించారు. ఆయన అట్లాగేనని రెండు urns ని తెచ్చారు. అప్పుడు చలంగారు "ఒకటి అమ్మ సమాధికి. ఒకటి నాకు" అన్నారట నవ్వుతూ. "అయ్యో నాన్నా నువ్వు అట్లాగంటావని తెలిస్తే రెండు తెచ్చేవాడినే కాదు" అన్నారట చంద్రశేఖర్ దిగులుగా.

దశాహానికి చుట్టుపక్కల వున్న అమ్మ స్నేహితుల నందర్నీ భోజనానికి పిలిచారు. సోదరి కృష్ణ అమ్మఫోటోకి పూజ చేసింది. ఆ రోజు షా తల్యార్‌ఖాన్, ముఖర్జీ, రోడా, సత్యానందం, తదితరులు వొచ్చారు. ఆవేళ భోజనం నర్తకి, చిత్ర మడికట్టుకుని మరీ వొండారు. భోజనం ఎంతో గొప్పరుచిగా కుదిరింది.

ముఖర్జీ సాధారణంగా ఆగష్టు పదిహేను ఈశ్వరావతరణ దినోత్సవానికి వొచ్చినప్పుడల్లా భోజనం చేసి వెళ్ళేముందు— "ఎంత బాగా వుందో భోజనం, నెలకోసారి ఆగష్టు పదిహేనువొస్తే బావుండును" అనేవారు. ఈవేళ ఆయన ఏమంటారో విందాం అని ఎదురు చూస్తున్నారు షా. ముఖర్జీ భోజనం ముగించి usual sermonious way లో నిలబడి "భోజనం చాలా గొప్పగా వుంది" అని ఆగారు. ఆ తరువా తేమంటారా అని చూస్తున్నారు షా. అలాగని నవ్వుతూ ముఖర్జీ తలవొంచేసు కున్నారు. భోజనా లయినాక షా పాటలు పాడారు.

"ఇదంతా ఎంత అందంగా జరిగిందో షా. ఇదేదో చావుకి చేసి నట్లు లేదు" అన్నారు చలం.

పదకొండో రోజు భోజనాలు వెంటబెట్టుకుని రమణస్థానీయులం దరూ గిరిప్రదక్షిణానికి వెళ్ళారు. అమ్మరూపం షా చెయ్యి పట్టుకునే గిరిప్రదక్షిణం చేసింది. ఎప్పుడూ గిరిప్రదక్షిణాలలో భోజనాలుచేసే శ్రీ చక్రమండపం దగ్గరే భోజనాలు చేశారు. అందరూ నడుస్తూవుండగా- "నేను గుళ్ళోకి వెడుతున్నానమ్మా" అనిచెప్పి షా చెయ్యి వొదిలించు కుని అమ్మ వెళ్ళిపోయింది. అందరూ గుడికి వెళ్ళారు. అక్కడ షాకి అమ్మ కనబడలేదు. ఇంటికి వొచ్చి భోజనాల దగ్గర కూచునేటప్పటికి గొప్పవెలుగులో తాను చచ్చిపోయినచోట అమ్మ కూచుని కనబడింది షాకి. మరుసటిరోజు షా తనగదిలో కూచుని వుండగా, చుట్టూరా దేవ తలు పాడుకుంటో అమ్మ ఆత్మని భద్రంగా ఆకాశంమీదికి తీసుకుపో వడం కనిపించింది ఆమెకి.

## 33

కృష్ణ వొచ్చినప్పటినించి షా సంరక్షణంతా తానే చూసుకుం టోంది. ఆమె దృష్టంతా పూర్తిగా షామీదే వుండేది. ఆమెకి **B.P.**అని వేరే ఏపని చెప్పేవారు కాదు నర్తకీ వాళ్ళు.

ఏప్రియల్ 14 ఎంతో విశేషమైన రోజు. ఆరోజే తమిళ సంవ త్సరాది. ఆవేళ తెల్లవారుగట్లనే గిరిప్రదక్షిణం పెట్టుకున్నారు రమణ స్థానీయులు. కృష్ణారావుగారు 13వ తేదీనే వూరునించి వొచ్చారు.

ఆరోజు తెల్లవారుగట్ల కృష్ణ మేరికపూడి కనకమ్మగారు పెట్టిన తెల్లని జరీచీర షాచేత కట్టించింది. అందరూ గిరిప్రదక్షిణానికి బయలు దేరేందుకు సిద్ధంగా నిలుచున్నారు. హఠాత్తుగా కృష్ణవొచ్చి షాపాదాలకి పసుపుపూయడం ఆరంభించింది. "ఇదేమిటి కృష్ణా" అన్నారు షా. "వుం

డం డుం డండి" అంటూ కృష్ణ సౌరిస్‌తల్లి రెండుపాదాలకి పసుపు రాసేసింది. "అయ్యని కాస్తా అమ్మని చేశావా? కృష్ణా!" అన్నారు షా. ఆవేళ విశేషమైన దినం కనక గిరిప్రదక్షిణం నించి తిరిగి వొచ్చేటప్పుడు పెద్దగుళ్ళోకి వెళ్ళి అరుణాచలేశ్వరుడికి కొబ్బరికాయ కొట్టాలనుకున్నారు రమణస్థానీయులు. ఆది అన్నామలైలో గుడిదగ్గర జనం చాలామంది వుండడంవల్ల రమణస్థానీయులకి గుడిలోకి వెళ్ళడానికి వీలులేక పోయింది. అక్కడి సత్రం యజమాని షా తల్లిని గర్భగుడిలోకి తీసుకునివెళ్ళి దైవదర్శనం చేయించారు. మామూలుగా భజనచేసే చోట భజన ముగించి ప్రదక్షిణం పూర్తి చేసి అరుణాచలేశ్వర ఆలయానికి వొచ్చారు.

అరుణాచలేశ్వర ఆలయంలో గర్భగుడిలోకి వెళ్ళేసరికి పెద్ద క్యూలో జనం కిక్కిరిసి వున్నారు. ఎవరో గొప్పవారు ఈశ్వరుడికి అభిషేకం చేయిస్తున్నారట. ఒక పూజారివొచ్చి పదినిమిషాలు ఆగితే దర్శనం ఔతుందని రమణస్థానీయులకి చెప్పారు. అప్పటికే చలంగారు ఇంటికి వెళ్ళిపోయారు. అందువల్ల రమణస్థానీయులు ఆలస్యమవుతుందని అక్కడ ఆగకుండా అపీతకుచాంబ ఆలయానికివెళ్ళి కొబ్బరికాయలు పూజాద్రవ్యాలు ఇచ్చి అక్కడే పూజ చేయించారు. అప్పుడు షా "కృష్ణా చూశావా ఇది. నీ కేమయినా తెలిసిందా నువ్వేంచేశావో?" అని అన్నారు. అప్పుడు షాఅన్నమాటలని కృష్ణ, షా తలుచుకుని నవ్వుకున్నారు.

ఆరోజునించి సౌరిస్‌లో మార్పు విస్పష్టంగా కనబడ సాగింది. ఈశ్వరుడు వొచ్చిన కొత్తలో ఆమెలో కొంత స్త్రీత్వం మేలుకుంది. అప్పట్లో ఆమెలో మేల్కొన్న స్త్రీత్వమిప్పుడు పరిపూర్ణత్వాన్ని పొందింది. అప్పటినించే ఆమెకి స్త్రీహృదయం ఎట్లాస్పందిస్తుందో. ఏవి

ధంగా వుంటుందో పూర్తిగా అనుభవంలోకి వొచ్చింది. షౌ ఎంత త్వరగా నడిచినా ఆమెలో మునుపటిలాగ నడకలో కదిలికలో పురుషత్వం మాయమైంది. చివరికి ఆమె ఎవరిమీదన్నా కోపపడంకూడా అరుదై పోయింది. నర్తకి మాటల్లో చెప్పాలంటే- "అప్పట్లో సౌరిస్ ఏదో లోకకళ్యాణార్థం ఏకాకిగా భూమికి దిగివొచ్చిన పార్వతీదేవిలా గనిపించేది."

లక్ష్మి, పిల్లలు స్కంధాశ్రమం చూడాలని అనుకుంటున్నారు. వాళ్ళవెంట తోడు వెళ్ళడానికి ఎవరూలేరు. అందరూ వయసులోవున్న ఆడపిల్లలు. చిత్రకీ, నర్తకికీ వాళ్ళతో వెళ్ళడానికి వీలులేక పోయింది. సరే, నేను తీసుకువెళ్తాను అన్నారు షౌ. కృష్ణకి B.P. కనుక వెళ్ళొద్దన్నారు చలంగారు. అయినాగానీ సరదాకొద్దీ కృష్ణ బయలు దేరింది.

ఒకరోజు తెల్లవారుగట్ల చీకటిగా వున్నప్పుడే రమణస్థానీయులు, జగదీష్‌భాయి వెంట బయలుదేరారు. వాళ్ళు బయటికి రాగానే ఎదురుగుండా ఆకాశంలో తోకచుక్క కనిపించింది. వొయ్యి చచ్చిపోయిన తరువాతకూడా అలాగే తోకచుక్క కనిపించిం దట. మళ్ళీ అమ్మ చచ్చిపోయిన తరువాతకూడా తోకచుక్క కనిపించడం షౌకి వింతగా అనిపించింది.

అందరూ ఆశ్రమానికి వెళ్ళి భగవాన్‌కి నమస్కరించి ఆశ్రమం వెనకనుండి మెట్లు ఎక్కుతున్నారు. అప్పటికి దారి సరిగ్గా కనపడటల్లేదు. షౌకి తడుము కుంటున్నట్లుగా వుంది. ఆమె కొండెక్కి ఎన్నిరోజు లయిందో! కొండలెక్కే అలవాటు పూర్తిగా పోయింది. చీకట్లో దారి కనపడక కృష్ణచెయ్యి పట్టుకుని నడిచారు. అందరూ స్కంధాశ్రమం చేరు కున్నారు. స్కంధాశ్రమ ధారలో నీరుతాగి, విశ్రాంతిగా అక్కడి బండలమీద కూచున్నారు.

వాళ్ళకి కొండ కిందనించి పెద్దగుడి ప్రాకారం మసకగా కనబడు తోంది. రమణస్థానీయులు షాతో కలిసి సూర్యోదయాన్ని చూస్తూ కూచున్నారు.

జగదీష్‌భాయ్ "రేపు అయ్యంకులానికి పోదామా" అన్నారు.

మేలిమిబంగారు వన్నెలో ఎదురుగుండా సూర్యకాంతిలో మెరుస్తోంది అయ్యంకులం (అయ్యకొలను). అక్కడే రమణభగవాన్ సర్వసంగ పరిత్యాగం చేశారట. 'సరే' నన్నారు షా. వాళ్ళు తిరిగి ఇంటికి వెళ్ళేటప్పుడు ఆశ్రమంవైపునించి గాక వూరివేపునించి దిగుతున్నారు. అందరూ దారిలోంచి నడుస్తోంటే అక్కడ వున్న పెద్ద బండరాయి మీదినించి సరదాకి జారారు షా. కృష్ణగూడా ఆమెతోబాటు జారింది. కృష్ణ వెళ్ళి ఈ సంగతిని లక్ష్మికి చెప్పింది. షా కృష్ణతో బండరాతి మీదినించి కిందికి జారారని తనతో జారలేదని లక్ష్మి అలిగింది. తరువాత వాళ్ళంతా కొండదిగి రోడ్డువైపు నించి ఇంటికి వొచ్చేశారు.

బార్బరారోజ్ తనదేశం వెడుతూ జూలీని తమఇంట్లో వుంచి వెళ్ళింది. భజనకి బానీ, జూలీ వొచ్చినప్పుడు, "మేం రేపు వుదయం అయ్యంకులం షికారుగా వెడుతున్నాం. మీరూ వొస్తారా" అని అడిగారు షా.

"మేం తప్పకుండా వొస్తాం" అన్నారు వాళ్ళు.

రమణస్థానీయులు, జగదీష్, జూలీ, బానీ, అయ్యంకులానికి తెల్లవారే లేచి బయల్దేరారు. అది వూళ్ళో పెద్దగుడి దగ్గర వుంది. అది ఎంతదూరమో! ఆ అయ్యంకులం గట్టుమీద ఒక మండపం వుంది. అందరూ ఆ మండపంమీద కూచున్నారు. కొంతసేపటికి సూర్యోదయం అవడం మొదలు పెట్టింది. సూర్యకాంతి కొలను నీళ్ళమీద బంగారంలా ధగధగా మెరిసి పోతోంది. సూర్యుడి లోంచే పుట్టుకొస్తు

న్నట్లు ఎన్నో కాకులు వాళ్ళు కూచున్న దిక్కుకి ఎగిరి వొస్తున్నాయి. ఆ దృశ్యం ఎంత అందంగా వుందో! అక్కడి నించి గుడిలోకి వెళ్ళారు వాళ్ళు. గుళ్ళో తేవారాలు పాడుతున్నారు ఒక భక్తుడు. అరుణాచల శిఖరంమీద ఉదయపు ఎండ మెరుస్తోంది. అక్కడినించి కదల బుద్ధిగాక అందరూ అక్కడే కూచున్నారు.

చివరికి అందరూ గుడినించి బయలుదేరి వొస్తోంటే ఎదురుగుండా అరుణాచలం మీద సూర్యోదయ కాంతి పడి ఒక గులాబి తామరపువ్వులా మెరసిపోతోంది కొండ. ఆ అందాలని, అనుభూతులని నెమరు వేసుకుంటూ ఇంటికి తిరిగి వొచ్చేశారు.

లక్ష్మి అలక స్కంధాశ్రమం వెళ్ళినప్పుడు షా తనతో బండ మీద నించి జారలేదని, ఆమె అలకని తీర్చడం కోసం మళ్ళీ ఓ తెల్లవారుగట్ట బయల్దేరి స్కంధాశ్రమానికి వెళ్ళి అందరూ ఒకేసారి ఆ బండమీదనించి జారారు. ముందురోజు వొచ్చిన చంద్రశేఖర్ కూడా ఈ ప్రయాణంలో కలిశారు. అక్కడినించి చూతగుహకి వెళ్ళారు. ఆ గుహలో భగవాన్ కొన్నిరోజులు తపస్సు చేశారు. అక్కడ పెద్ద మామిడిచెట్టు వుంది. భగవాన్ ఎండాకాలం ఆ గుహలో వుండేవారు. కావ్యకంఠ గణపతిశాస్త్రిగారు కూడా అక్కడే తపస్సు చేశారు. అక్కడినించి జటాపాలి ఆశ్రమానికి, సాధులక్ష్మమ్మ ఆశ్రమానికి వెళ్ళారు. ఆమె జబ్బుగా వున్నారు. ఆమెని చూసి ఇంటికి వొచ్చేశారు.

ఒకసారి రమణస్థానీయులంతా చిత్రని తమతో తీసుకుని బయలుదేరారు. ఈమాటు స్కంధాశ్రమం నించి కాక, వూళ్ళో మెట్ల వైపునించి కొండపైకి ఎక్కారు. అక్కడ జటాపాలి ఆశ్రమం దగ్గర ఓ చిన్న తెల్లనిగుడి వుంది. చుట్టూ చెట్లు. ఎంతో అందమైన చోటది. అందరూ అక్కడ కూచున్నారు. అక్కడినించి సూర్యోదయాన్ని

చూస్తోవుంటే ఎంతో గొప్పగా అనిపించింది. ఎదురుగుండా కొండ పాదంలో అరుణాచలేశ్వర ఆలయం. ఆలయం వెనకనించి సూర్యోదయం అవుతోంది. గుడి మైక్ లోంచి పట్టమ్మాళ్ పాటలు వినబడుతున్నాయి. ఎంత గొప్పగా వుందో ఆ దృశ్యం.

అక్కడి నించి చూతగుహ మీదుగా నమశ్శివాయ గుహవైపు వెడుతుండగా బండరాళ్ళలోంచి గొప్ప vibration షా కాళ్ళలోకి పాకింది. షా తూలి పడబోతూవుండగా కృష్ణ ఆమెను పట్టుకుంది.

అక్కడి నించి ఇన్నిచోట్లు చూశాంకదా. పవళక్కుండ్రుకి (పగడపు గుండుకి) వెళ్ళాలని అనుకున్నారు రమణస్థానీయులు. అంతకి ముందురోజే వొచ్చిన వెంకటప్పయ్య, లక్ష్మియమ్మ ఈ విహారంలో కలిశారు. భగవాన్ అరుణాచలేశ్వర ఆలయం గుడినించి బైటికి వొచ్చేశాక పవళక్కుండ్రులో వుండేవారట. రమణస్థానీయులు పవళక్కుండ్రు పైకి ఎక్కి సూర్యోదయాన్ని watch చేసి తిరిగి వొచ్చేశారు.

పవళక్కుండ్రు చూశాక భగవాన్ గురుమూర్తంలో కూడా తపస్సుచేశారు కదా అక్కడికి కూడా పోదామని అనుకున్నారు రమణస్థానీయులు. అప్పట్లోనే వొచ్చిన ముమ్మిడమ్మ ఈ ప్రయాణాల్లో కలిసింది. అది చాలా దూరం గనక బాగా పెందరాళే లేచి బయలుదేరారు. జూలీ, జగదీష్ వారితో బాటుగా ఈ విహారంలో పాల్గొన్నారు. ఊరు నిద్రపోతూ వుండగా ఆ రోడ్లమీదనించి నడవడం ఎంత గొప్పగా వుందో వారికి.

తీరా వాళ్ళు గురుమూర్తం గుడిలోకి వెళ్ళేసరికి అక్కడంతా D. D. T. కంపు. అంతేకాక గుడినిండా నాగటూ ఏవో పనిముట్లు

పెట్టివున్నాయి. అది అందరికీ చాలా disappointing గా అనిపించింది. అలుపు తీర్చుకోవడానికి అందరూ బయటే కూచున్నారు. ఇంటికి తిరిగి వెడదామని షా అంటూ వుంటే జగదీష్ "భగవాన్ కూచున్న చెట్టు ఇక్కడే వుంది. అక్కడికి పోదాం" అన్నారు. పొలాల గట్టంబడి వెళ్ళి— తిప్పలుపడి అందరూ వెళ్ళి ఆ చెట్టుని చూశారు. అదేమీ బోధివృక్షంలాగ లేదు. అదొక చిన్నచెట్టు. అందరూ దాన్నిచూసి ఇంటిదోవ పట్టారు.

ఆ తరువాత రమణస్థానీయులు మరకత శ్యామలాంబ (పచ్చయమ్మన్) కోవెలకి విహారంగా వెళ్ళారు. ముందురోజే వూరునించి వొచ్చిన కృష్ణారావుగారు, సత్యంకూడా ఈ విహారంలో కలిశారు. షా ఒకచోట ఎంత అందంగా వుందని చెబుతూ ఒకనిమిషం ఆగి ఆ అందాన్ని చూస్తూ enjoy చేస్తూ ముందుకి వెళ్ళేవారు. "షాగారు అందంగా వుందనగానే వాళ్ళకి అప్పటి దాకా కనపడని అందం కనపడుతుంది కామాసు. ఆహా అందం, ఏం అందం అంటూ కూచుంటారు వీళ్ళు" అని నవ్వేవారు సత్యం.

పచ్చయమ్మన్ కోవెలలో భగవాన్, గణపతిశాస్త్రిగారు కొన్ని దినాలు వున్నారట. తమ 'మేగ్నమ్ఓపస్' ఉమాసహస్రం అక్కడే ఆశువుగా చెప్పారుట నాయన. రమణస్థానీయులు అరుణాచలేశ్వరాలయం వెనకనించి వెడుతూ వుండగా కొండమీద పెద్దవెలుగు పడుతోంది. వీధిలైట్లు వెలిగి లేవు. షా అందరికీ కొండమీద emanate అయ్యే కాంతిని చూపించారు. వాళ్ళంతా ఎక్కడిదీ కాంతి అని ఆశ్చర్యంతో చుట్టూరా చూశారు. కొందరు "వెలుగు ఎక్కడినించో పడుతోంది" అన్నారు. కాని అది ఎక్కడి నించి పడుతోందో ఎవరికీ తెలియలేదు.

అమ్మసమాధికి ఫోటో తీయడానికి వొచ్చిన జింకా రామారావు గారుకూడా రమణస్థానీయులతో కలిసి మరకత శ్యామలాంబ కోవెలకి వెళ్ళారు.

ఆ కోవెల చేరుకోగానే రామారావుగారు అందరికీ ఫోటోలు తీశారు. గుడిలోపల ఒకకొలను వుంది. అందరూ ఆ కొలనులో మంచి నీళ్ళు తాగడానికి వెళ్ళారు. ఆకొలనులోకి పొడుచుకు ముందుకి వొచ్చిన ఒకపెద్ద బండరాయి వుంది అక్కడ. ఆ రాతిమీద ఎక్కి అందరూ కూచున్నారు. షౌ అక్కడ కూచున్నప్పుడు ఈ ప్రదేశాల్లో తాము మును పెన్నడో తిరిగినట్లు, ఈ ప్రదేశమంతా తమకు చిరపరిచిత మైనట్లు గోచరించింది.

అక్కడినించి అందరూ వెళ్ళి కోవెల ముందున్న అరుగుమీద కూచున్నారు. ఎదురుగుండా నిరామయమైన పెద్దబయలు. అక్కడి నించి సూర్యోదయ మైంది. షౌ తమ చిన్నప్పటినించీ ఎన్నిచోట్లనించో సూర్యోదయాల్ని చూశారు. ఆమె చూసిన వానిలో గోదావరి, కృష్ణ ఇత్యాది నదులనించి, చాలా సముద్రాలనించి, భీమ్లీ సముద్రం నించి, కన్యాకుమారి సముద్రంనించి—సూర్యోదయ అస్తమయాలు గొప్ప దృశ్యాలేకాని అరుణాచలంలోని సూర్యోదయంలో వున్న గాంభీర్యాన్ని ఆమె ఎక్కడా చూడలేదు. ఆమెకి అరుణాచలంలో సూర్యోదయ మవు తూవుంటే ఈసృష్టికి ముందు సూర్యుడు వుదయిస్తున్నాడా అనిపిస్తుంది. సూర్యాస్తమయం అవుతూంటే ఆమెకి సృష్ట్యానంతరం సూర్యుడు శలవు తీసుకుంటున్నాడా అనిపిస్తుంది. అటువంటి అనుభవం ఏప్ర దేశంలోనూ కలగలేదు. పాల్ బ్రంటన్ తమ search in secret India లో అరుణాచలంలో సూర్యోదయ సూర్యాస్తమానాలు ప్రత్యేకా లన్నా రేగానీ అంతకంటే అధికంగా చెప్పలే దాయన.

ఇంటికి వొచ్చినప్పటినించీ చలంగార్ని మరకత శ్యామలాంబ కోవెలకి తీసుకు పోవడం ఎలాగని ఆలోచన అందరికీ వొచ్చింది. అక్కడికి దోవ సరిగాలేదు. కానీ చలంగారు వొచ్చినట్టయితే అక్కడికి picnic వెడితే ఎంత బాగా వుంటుందో అనుకున్నా రందరు. షౌ వీల్ చెయిర్ ఒకటి చేయించి చలంగార్ని ఆ వీల్ చెయిర్‌లో తీసుకుపోవా లన్నారు గానీ చలంగారు వీల్‌చెయిర్ ఎక్కనని హఠం చేశారు.

అప్పటినించి రమణస్థానీయు లందరూ రోజు విడిచి రోజు నమ శ్శివాయ గుహదగ్గరకి వెళ్ళి అక్కడినించి సూర్యోదయం watch చేసి తిరిగి ఇంటికి వొచ్చేసేవాళ్ళు.

అప్పట్లోనే సత్యవతి వొచ్చింది. షౌ రమణస్థానీయు లందరితో కలిసి తరచు స్కంధాశ్రమానికి వెళ్ళి వొస్తున్నారని తెలిసి మళ్ళీ అక్కడికి ఓ తెల్లవారుజాము షికారుగా వెళ్దామని అడిగారు సత్యవతి. అప్పటికే మేనెల వొచ్చేసింది. స్కంధాశ్రమానికి ఆమె వెళ్దామంటే వెళ్ళారు కానీ వారంతా అక్కడ వుండగానే పెద్ద గాలిదుమ్ము ఆరంభమైనాయి. అప్పటినించి షౌ విహారాలకి వెళ్ళడం మానుకున్నారు. "మీరు ఇక్కడికి వెళ్ళార్ట, అక్కడికి వెళ్ళారట, నాతో చూతగుహకి రావాలి." అని సత్యవతి పట్టుబట్టింది. "ఈదుమ్ము గాలుల్లో బయల్దేరడం చాలా కష్టం. నువ్వు ఏప్రియల్ నెలలో వొస్తే నీతో అన్నిచోట్లకీ తప్పకుండా వొస్తాను" అని ఆమెకి ప్రామిస్ చేశారు షౌ. ఆప్రామిస్ అట్లాగే వుండిపోయింది.

షౌ తాము తరచు విహారాలకు (expeditions) వెడుతున్నారు గనక చలం మహర్షినికూడా ఓరోజు వెంట తీసుకు వెడదా మనుకున్నారు. పైగా సత్యవతి తనతో షౌవిహారాలకి రావటల్లేదని గోలపెడు

తోంది గనక చలంగారు కొండ ఎక్కలేరు గనక వారిని తీసుకుని కాట్లస్వామి ఆశ్రమం దగ్గరకి వెళ్ళా లనుకున్నారు.

ఒక తెల్లవారుజామున బ్యాటరీలైట్లు పట్టుకుని చలంమహర్షి, తంబీ, నర్తకి బండిలో వొస్తుంటే, సౌరిస్ ప్రభృతు లంతా ఆ మసక చీకటిలోనే అడ్డదారి నించి కాట్లస్వామి ఆశ్రమానికి బయలుదేరారు. అప్పుడే అడవిలో పిట్టలన్నీ లేచి మెల్లగా గుసగుసలు మొదలు పెడు తున్నాయి. అడివిజాజి పరిమళాల్ని వెదజల్లు తోంది. తెల్లవారుజాము చల్లని గాలులు వీస్తున్నాయి.

రమణస్థానీయులు కాట్లస్వామి ఆశ్రమాన్ని చేరుకుని అక్కడి కొలను దగ్గర కూచున్నారు. ఆ చల్లదనంలో అడివి నిశ్శబ్దంలో నీటి ఆకు పచ్చదనాన్ని చూస్తూ కూచున్నా రందరూ. ఆ విహారంలో పాల్గొన్న సత్యవతికి కనకమ్మగారికి పూర్వం తాము కాట్లస్వామి దగ్గరకి వెళ్ళ డం గురించి తరువాత కొన్నేళ్ళకి ఆయన హఠాత్తుగా మాయమయి పోవడం మొదలైన విశేషాలను చెప్పారు షౌ. వాళ్ళు కొలను చెంత చాలాసేపు కూచుని అక్కడున్న అడివిపూల గుత్తుల్ని కోసుకుని తిరిగి నడిచి ఇంటికి చేరుకున్నారు. రమణస్థాన్ తోటలో చెంగల్వపూలు విచ్చుకున్నాయి. తిరిగి వొచ్చేసరికి ఆ పరిమళం వారందర్నీ లోపలికి ఆహ్వానించింది.

అప్పట్లోనే బానీ, జూలీ, షౌ దగ్గర పాటలు, హార్మోనియం మీద నేర్చుకునేవారు. బానీది చాలా మంచికంఠం. ఇండియన్ కంఠంలాగ వుండేది. ఆ అమ్మాయి అచ్చూ మచ్చూ ఇండియన్‌లాగే వుండేది. తరువాత ఆ అమ్మాయి తనదేశం వెళ్ళిపోయింది.

ఆ అమ్మాయి వెళ్ళిపోయాక ఫిలిప్ అనే అతను వొచ్చి గిటారు మీద పాడేవాడు. అతనిది మంచిసంగీతం. అతనూ, జూలీ కలిసి భజ

న్నలో పాడే కృష్ణశాస్త్రి పాటలు, కొన్ని బ్రహ్మసమాజం పాటలు షౌదగ్గర నేర్చుకునే వారు. వాటిని సౌరిస్ చలంమహర్షి అనువదించి వాళ్ళకి చెప్పేవారు. వాటిలో వున్న గొప్ప అర్థాలూ, భావమూ చూసి ఫిలిప్ అద్భుతపడి పోయేవాడు. ముఖ్యంగా కృష్ణశాస్త్రిగారి పాటల్ని ఎంతగా మెచ్చుకునే వారో!

ఇంతలో జీవన్ అనే ఒక అబ్బాయి రమణస్థాన్‌లో చేరారు. ఆయనకి అరుణాచలంలోనే వుండి ఆధ్యాత్మికసాధన చేసుకోవాలని సంకల్పం. వారు ముందుగా ఆశ్రమంలో వుండేవారు. ఆ తరువాత అక్కడ ఆయనకి అనుకూలపడక రమణస్థాన్‌కి వొచ్చేశారు. ఆయనది పూర్తిగా ఆధ్యాత్మిక జిజ్ఞాస.. ఆయినకి షౌ అంటే తిరుగులేని భక్తి.

మిశ్రీకికూడా మొట్టమొదట చదువు రమణస్థాన్‌లోనే ఆరంభించారు. మొదట బసవరాజుగారు, తరువాత కృష్ణ మిశ్రీకి చదువు చెప్పేవారు. వాళ్ళదగ్గర సరిగ్గా చదువుకోటల్లేదని ఈశాన్యమఠం స్కూలుకి పంపించేవారు. ఆ అమ్మాయిని జీవన్ రోజూ సైకిల్‌మీద స్కూలుకి తీసుకెళ్ళి మళ్ళీ ఇంటికి తీసుకుని వొచ్చేవారు. అక్కడికికూడా వెళ్ళనని మొండికెత్తి, చివరికి డాలీదగ్గరకి వెళ్ళిపోతానని ఆంధ్రదేశం వెళ్ళిపోయి కొన్నాళ్ళు అక్కడే వుంది మిశ్రీ.

చిత్ర ఆంధ్రదేశ పర్యటనానికి వెళ్ళినప్పుడు చిత్రతో కలిసి తిరిగి రమణస్థాన్‌కి వొచ్చేసింది. అక్కడ తెలుగు చదివింది గనక తమిళంలో చదువెలా సాగుతుంది? అందుకని నర్తకి మిశ్రీని తీసుకుని వెళ్ళి శర్మగారి స్కూలులో జాయిన్ చేసి వొచ్చేసింది. కొన్నాళ్ళు అక్కడే చదివి 'నాకు అక్కడ బాగాలేద'ని ఇటీవలనే తిరిగి వొచ్చేసి — రమణస్థాన్‌లో గంతులువేస్తో తిరుగుతోంది మిశ్రీ.

వెంకటప్పయ్యగారు 'అరుణాచల్‌కో జానా' అన్న ఉద్యమ మొకటి లేవదీశారు. గుడిపూడినించి "అరుణాచలం వెడుతున్నాం. రండి, రండి" అని ఎందరినో యాత్రకి పైలుదేర దీశారు.

"మీ యాత్రా స్పెషల్ టూరిష్టు బస్సు వివరాలు వీలుకాగానే రాయండి. భోజనాలు, స్నానాలు, నిద్రలు మొదలైనవి.

ఇట్లాంటి ప్రయత్నాలు రెండు మూడు ఇదివరకు విఫలమైనాయి. పట్టుదలతో సాధించండి.

వేల్పూరు కనకమ్మగారుకూడా వొస్తారట. ఈ బస్సులో నేనా?

టూరిష్టు బస్సుకి జయ్. సరే వొస్తున్నారుగా.

(వెంకటప్పయ్యగారికి, లక్ష్మాయమ్మకి చలంగారి లేఖ 20-7-70)

"ఈ బస్సు ఏర్పాటయిందనీ ఎంతమందో భక్తులు వొస్తున్నారని తెలిసి ఎంతో సంతోషంగా వుంది.

మీరు తలపెట్టి సాధించిన పని గొప్పగా వుంది. ఈశ్వరుడు మీ వెంట నిలిచి చేయించారు. తప్పకండా భగవాన్ గోష్టి జరిపిద్దాం. మీ ప్రయాణసన్నాహాలు వింటూ వుంటే, మీతో కలిసి నాకూ మీతో బస్సులో ప్రయాణం చెయ్యాలనిపిస్తోంది రండి, రండి, రండి."

(వెంకటప్పయ్యగారికి చలంగారి లేఖ 4-8-70)

రవి, శంకర్ గుడిపూడిలో ఇంటింటికీ తిరిగి బియ్యం, పప్పులు, కూరగాయలు మొదలైన పాకసామగ్రినంతా పోగుచేశారు. "మేం ఈశ్వరావతరణ దినోత్సవానికి బస్సులో రమణస్థాన్ వొస్తున్నాం" అని చలంగారికి రాశారు వెంకటప్పయ్యగారు. సరిగ్గా పదిహేనవ తేదీ పది గంటలకి వారంతా రమణస్థాన్ చేరుకున్నారు. కురంగేశ్వర్, అరుణాచలం, బాబ్జీ, పాపాయమ్మ, ఇందిర, సత్యం కుటుంబం,

నాగేశ్వరరావుగారి కుటుంబం- అన్నీ కుటుంబాలే. రమారమి నూరు మంది వొచ్చారు.

రమణస్థానీయులు పదునాల్గవతేదీ సాయంత్రం బస్సు రాక కోసం ఎదురు చూశారు. కానీ బస్సు ఆవేళ రాలేదు.

'ప్రేమర్షి గుడిపాటి వెంకటచలం యాత్ర స్పెషల్ బస్'— అందులో యాత్రికులు జై జై అని జయధ్వానాలు చేస్తూ వున్నట్లు— పదిహేనవ తేదీ వుదయం సౌరిస్‌కి ఒక vision లో కనిపించింది.

ఆ రోజు వుదయం పది గంటలకి సరిగ్గా షౌదృశ్యంలో కన బడినట్లే జయనాదాలు చేసుకుంటూ బస్సులోంచి దిగారు గుడిపూడి భక్తకోటి. ఆగష్టు పదిహేనవ తేదీకి సరిగ్గా ఇలాంటి ప్రకటనలతోనే భక్తమండలులు అరుణాచలేశ్వర కళ్యాణోత్సవానికి దిగుతారు. ఆ రోజు భజనలు, గిరిప్రదక్షిణాలు చేయడం అరుణాచలంలో పరిపాటి.

ఆ రోజు బాగా మబ్బుగా వుంది, చినుకులు పడుతున్నాయి. ప్రేమర్షి యాత్రాస్పెషల్ బస్ ప్రయాణీకులు తమ adventures గురించి షౌకి చెప్పారు. దోవలో వర్షాలకి ఏర్లుపొంగి దోవ కనరాక పోయినా, డ్రైవర్లు రామని హఠంచేసినా- డ్రైవర్లని వొప్పించి రమణనామం చేసుకుంటూ క్షేమంగా వొచ్చేశారట గుడిపూడి భక్తకోటి.

పదిహేనవ తేదీ సాయంత్రం నాలుగుగంటలకి ఎమ్. ఆర్. నాగేశ్వరరావు బృందం రమణస్థాన్‌లో భగవాన్‌గురించి ఒక మీటింగు పెట్టుకుంటా మన్నారు.

భగవాన్ పదిరోజులకి దేహం చాలిస్తా రనగా చలంగారి admirer ఒకరు వొచ్చారు. ఆయనపేరు పెరుమాళ్ళు. అంతవరకూ ఆయనకి భక్తిగానీ, ఈశ్వరుడిలో నమ్మకంగానీ లేదు. ఆయనకి భగవాన్‌లో

భక్తి కుదిరిపోయింది. చలంగారు తిరువన్నామలై వొచ్చిన కొత్తలో వారిని చూడడానికి ఆయన ఒకటి రెండు సార్లు వొచ్చారు.

పెరుమాళ్ళుగారి మేనల్లుడే ఎమ్.ఆర్. నాగేశ్వరరావుగారు. తమ మేనమామద్వారా చలంగారి గురించి, భగవాన్ గురించి విని చలంగారిని చూడడానికి వొచ్చారు. ఇంక భగవాన్ ఆయనని ఎట్టా పట్టేశారో! భగవాన్ నామాన్ని ఆంధ్రదేశంలో ప్రచారం చేయాలనే ప్రబలమైన కోరిక కలిగింది ఆయనకి.

నాగేశ్వరరావుగారు రమణవాణి అనేపత్రిక పెట్టి రమణ సందేశాలను ప్రచారంచేస్తున్నారు. కొందరు ఒకఆశ్రమం ఆశ్రమాన్నే ఆయనకి ఇచ్చేశారు.

జయంతి వుత్సవాలు, భగవాన్ తల్లి మోక్షోత్సవాలు ఇలాంటి వుత్సవాలు ఆంధ్రదేశంలో మూలమూలల జరిపిస్తున్నా రాయన. ఆయన పేరు బాగా వ్యాపించింది. భగవాన్‌మీద వుపన్యాసాలిస్తూ నిత్యమూ పర్యటిస్తూ వుంటారు.

గుడిపూడి భక్తులంతా అరుణాచలం back ground గా భగవాన్ ఫోటోలు, చలంమహర్షి ఫోటోలు, సౌరిస్ ఫోటోలు ఒక stage మీద అందంగా అలంకరించారు. ఆర్. నాగేశ్వరరావుగారు చలంమహర్షి జీవనకావ్యం 'సుధ' నించి గీతాలు పాడారు. ఎమ్. ఆర్. నాగేశ్వరరావుగారు భగవాన్‌మీద పెద్ద లెక్చర్ ఇచ్చారు. లక్ష్మయమ్మ హారతి ఇచ్చారు. ఎంతో కోలాహలంగా సాగింది ఆ సభ.

పదహారవ తేదీన కూడా ఆకాశం మబ్బు మబ్బుగానే వుంది. షౌ యాసిడిటీతో బాధపడు తున్నారు. రమణస్థానీయులకి, యాత్రికులకి బస్సుతోబాటుగా గిరిప్రదక్షిణం చెయ్యాలని కోరిక. షౌ తాము రాలే మన్నారు. కానీ "వాళ్ళందరూ నిరుత్సాహపడిపోతారు. నువ్వు

రావాల్సిం" దని చలంగారు పట్టు పట్టడంవలన ఒంట్లో ఓపికలేక పోయినా బయలుదేరారు. రమారమి 150 మంది కలిసి గిరిప్రదక్షిణం వెళ్ళారు. చలంమహర్షి మరికొంతమంది బస్సులో వొచ్చారు. సౌరిస్ — భక్తకోటితో కలిసి నడిచారు. అందరూ సందడిగా భజనలు చేసు కుంటూ గిరిచుట్టి తిరిగి వొచ్చారు.

ఆ బస్సులో పి. సత్యంగారు, ఆయనభార్య, కుమార్తె ఇందిరా కూడా వొచ్చారు. వాళ్ళు ఇందిరని ఇక్కడే వుంచి వెళ్ళిపోయారు. ఇందిర చాలా తెలివైనది. ఎంత వికాసమో ఆమె ముఖంలో. కాకా, కిట్టూల్తో చేరి సరదాగా గడిపేది.

"మీరందరూ అంత సంతోషంగా చేరినందుకు మాకు సంతో షంగా వుంది.

అందర్నీ, తీసుకొచ్చారని, వారందర్నీ తీసుకొచ్చి గొప్ప ఏర్పాటు చేసినందుకు మేమెంత ఆశ్చర్యపడ్డామో! గొప్పగా వుంది మీరందరూ రావడం. వొచ్చిన వారికి కలిగిన అసౌకర్యాలకి మేము విచారిస్తున్నాం.

ఇంకా ఇంకా బస్సుల్ని తీసుకు రండి. అన్నిటికీ కలిపి ఒక సారే మార్కులు తీసుకుందాం.

ఇంకా రెండు వరసలూ గాక మిత్రులు రెండోపంక్తికికూడా మిగులు తున్నారు. ఎంత కన్నుల పండువుగా వుంటున్నాయో భోజ నాలు. (వెంకటప్పయ్యగారికి చలంగారి లేఖ 20-8-70)

ఆ రోజుల్లో జూలీ అనే అమెరికన్ యువతి రమణస్థాన్‌లో భజన్లకి రెగ్యులర్‌గా వొస్తూ వుండేది. ఒకసారి ఆమెకి దగ్గు, జ్వరం విపరీతంగా వొచ్చేసి భజనలకి రాలేదు. జూలీ వొంట్లో ఎట్లా వుందో కనుక్కుని రమ్మని జీవన్‌ని పంపించారు షా. జూలీకి చాలా జ్వరంగా

వుందనీ, ఆశ్రమానికి భోజనానికికూడా పోవటల్లేదని, ఏం తింటోందో, తాగుతోందో కూడా తెలియటల్లేదని— తిరిగి వొచ్చి షాకి చెప్పారు జీవన్.

ఆజ్వరం తగ్గుతుందని చూశారు షా. ఎంతకి ఆజ్వరం తగ్గ లేదు. జూలీకి ఎట్లావుందో చూచి రావడానికి రోజూ జీవన్‌ని పంపించే వారు షా. చివరికి జూలీకి "ఎందుకు అక్కడ వుండడం. జ్వరం తగ్గే వరకూ రమణస్థాన్‌కి వొచ్చేయి" అని కబురుపెట్టారు షా. జూలీ అట్లానే వొచ్చేసింది. జర్వం తగ్గి మళ్ళీ ఆశ్రమానికి తిరిగి వెళ్ళింది. "ఆశ్రమంవారు రమణస్థాన్ భజనలకి వెళ్ళవొద్దని వొత్తిడి చేస్తున్నారు. నే నిదంతా భరించతేక పోతున్నాను" అని షాకి చెప్పింది జూలీ.

ఒకసారి భజనకి వొచ్చినప్పుడు జూలీ "నేను రమణస్థాన్ భజన లకి వెళ్ళకండా వుండలేనని వాళ్ళకి చెప్పాను. వాళ్ళొప్పుకోవడం లేదు" అని చెప్పింది షాకి. "అట్లాగయితే నువ్విక్కడే వుండు" అన్నారు షా.

చలంమహర్షికి, నర్తకికి జూలీ అంటే ఎంతో ప్రేమ. వాళ్ళు "తప్పకుండా ఇక్కడే వుండిపో" అని జూలీని ప్రోత్సహించారు. "నువ్వేమంటావ్?" అని షాని అడిగింది జూలీ.

"నాకు నువ్విక్కడున్నా ఒకటే లేకపోయినా ఒకటే. కానీ నువ్విక్కడే వుంటే నాన్న, నర్తకి చాలా సంతోషిస్తారు" అన్నారు షా.

ఒక అమెరికన్ ఈదేశంలో వుండాలంటే ఆర్థికభద్రత (ఫైనా న్షియల్ సెక్యూరిటీ) ని ఎవరైనా బాధ్యతకల వ్యక్తులు ఇవ్వాలి. ఆశ్ర మంవారు జూలీకి ఆ సెక్యూరిటీని ఇస్తున్నారు. అది వొదులుకుని నిర్వి చారంగా రమణస్థాన్‌కి వొచ్చేసింది జూలి. రమణస్థానీయు లందరూ ఆ సాహసానికి ఆమెని ఎంతగా మెచ్చుకున్నారో!

అప్పటికే జూలీ తెల్లచీరలు కడుతోంది. తన దగ్గరున్న సామా నంతా నర్తకి చేతుల్లో పెట్టేసింది. షౌ పాతచీరల్ని కట్టుకోవడం మొదలు పెట్టింది. ప్రస్తుతం చలంగారు బాత్‌రూంగా వాడుకునే గది లోనే జూలీ వుండేది అప్పట్లో. ఒక చింకిచాప, దిండు మాత్రమే ఆమెకి వున్నసామాన్లు. అంతకి మించి ఏమీలేవు. స్వదేశంలో ఎటు వంటి సుఖాలలో పెరిగిన శరీరమో అది. అలాంటిది అన్నిటినీ ఒక్క రోజులో వొదిలేసింది జూలీ. ఆ రోజుల్లో సౌరిస్‌కి పక్కల నిలబడి చెరోవైపు వుండేవారు జూలీ, కృష్ణ. వారికి 'అంగరక్షకుల'ని పేరు పెట్టారు చలంమహర్షి.

చాలా రోజులనించి జగదీష్‌భాయ్ నందితీర్థానికి పోదామని అం టున్నారు. కానీ ఆయన రమస్థానీయులతో విహారాలు, గిరిప్రదక్షిణాలు మానుకుని ఎప్పుడో ఆశ్రమంలో చేరిపోయారు.

వానలు పడితేనేగానీ నందితీర్థంలో నీళ్ళు రావు. నందితీర్థం మరకత శ్యామలాంబ కోవెలకి దగ్గరలో వుంది. కృష్ణారావు, ఇందిరా, జీవన్, లక్ష్మి, కృష్ణ, జూలీ, శివరాం, హనుమంతు- అందరూ షౌ వెంట విహారంగా నందితీర్థానికి బయలుదేరారు. షౌ అందరికన్నా ముందు నడిచారు. లక్ష్మికి, కృష్ణకి పనివుండి ఇంట్లో వుండిపోయారు. ఆదరా బాదరాగా ఆపని కాస్తా తెముల్చుకుని కాసేపటికి వాళ్ళు రొజుకుంటూ వొచ్చి సౌరిస్‌ని కలుసుకున్నారు. ఎండ తీవ్రంగా వుండడంవలన అం దరూ అరుణాచలేశ్వరాలయంలో కొంతసేపు కూచుని బయలు దేరారు. కొండంతా నీడలోవుంది గనక ఎండ వాళ్ళమీద పడడంలేదు. షౌ కొద్ది దూరం కొండమీదికి ఎక్కి నంది తీర్థాన్ని చూస్తూ అక్కడే కూచు న్నారు. కాకా, కిట్టూ.. తదితర రమణస్థానీయులు ఆ నంది ముఖం

చూడటానికి కొండపైకి ఎక్కారు. అక్కడ ఏ అందమూ లేదు. వాళ్ళు డిజప్పాయింట్ అయినారు.

సౌరిస్ ఆగినచోటే ఎంతో అందమైనది. అంత ఎత్తునవున్న ఆ నందిముఖం లోంచి నీళ్లొక ఆర్చిలా పైనించి కిందికి పడుతున్నాయి. సూర్యరశ్మి ఆ నీళ్ళమీద పడి ధగధగ లాడిపోతూవుండగా .... ఇంద్రధనుస్సులాగ వొంపు తిరిగి వెలిగిపోతు కనిపించాయి —నీళ్ళు. ఎంత అందమైన దృశ్యమో అది. ఆ కొండ గడ్డితివాసీ మీదకూచుని ఆ దృశ్యాన్ని అలా చాలాసేపు enjoy చేస్తూ వుండిపోయారు సౌరిస్. అందరూ కలిసి మళ్ళీ రమణస్థాన్ చేరారు.

జూలీ రాకతో రమణస్థానానికి 'ఘరానా ఆశ్రమం వాసన' మొదలైంది. రోజురోజుకి జనం ఎక్కువవుతున్నారు. ఎక్కడెక్కడినించో, ఏ తీరాల నించో రమణస్థాన్ గురించి వినో, వినకో జనం రావడం ఆరంభించారు. ఎంతోమంది జనం ప్రత్యేకంగా రమణస్థాన్ని చూడడానికే టూరిష్టు బస్సులలో రాసాగారు. ఈశ్వరావతరణ, జయంతి పుత్సవాల నిమిత్తం రమణస్థాన్వారు వేరే ఇళ్ళను అద్దెకి తీసుకోవాల్సి వొస్తుం దనిపించేది.

ఒకసారి వజీర్రహ్మాన్ వొచ్చినప్పుడు ఇదంతా చూసి "రమణస్థాన్కి మర్యాద పడుతోందండి" అన్నారు సౌరిస్తో. అక్కడే వున్న చిక్కాల కృష్ణారావుగారు అదే అన్నారు. "మీరేదో ఒకవూపు వూగించాలి లేకపోతే ఇదిలా పెరిగిపోతోంది"— అని.

"అదే నేనూ యోచిస్తున్నాను" అన్నారు సౌరిస్.

ఈ విధమైన ప్రచారాన్ని సౌరిస్ ఏనాడూ ఇష్టపడలేదు. ఆమె జీవితమంతా చెట్టుమీద పువ్వు పూసినంత సహజంగా, స్వచ్ఛంగా గడిపారు. అట్లాగే ఆమె జీవితం గడుస్తోంది, గడుపబోతోంది కూడా.

అందరి ముందు ఒక సిగరెట్టు కాలిస్తే చాలు, ఈ మర్యాదంతా ఒదిలి పోతుం దనిపించింది షౌకి. ఎక్కడి వాళ్ళక్కడ పిట్టలకి మల్లే చెల్లాచెదురై పోతారు. మళ్ళీ ఇక్కడికి ఎన్నడూ రమ్మన్నా రారు. కానీ ఆమెని చిత్తశుద్ధిగా విశ్వసించి నడిచేవారిని లోకం కాల్చుకు తిం టుంది. కానీ ఆ విధమైన కృతక మర్యాదలలో పడడంకన్న అట్టాంటి పని ఏదయినా చెయ్యాలనిపించిం దామెకి. సౌరిస్ స్వచ్ఛత్వాన్నీ, సహజత్వాన్నీ ప్రేమించారు. అదే ఆమె నిలిచినచోట ఈశ్వరుడు నిలి పారు- నిలుపుతూ వొచ్చారు.

చలంమహర్షి టాగూరు రచించిన **gardener fugitive, lovers gift** లని తెలుగుచేయడం మొదలు పెట్టారు. ఆ అనువాదాలను ఆయన కృష్ణారావుగారికి చెప్పి రాయించారు. చలంమహర్షి, కృష్ణారావుగారు ఆ అనువాదాలని తయారుచేసి, ప్రతి వుదయం భగవాన్ గదిలో, సౌరిస్ రంగురంగుల పువ్వుల్ని రకరకాల వాజుల్లో అలంకరిస్తూ వుండే సమ యంలో చదివి వినిపించేవారు. ఆమె వాటిని విని అవసరమైనచోట్ల సవరించేవారు.

చలంమహర్షి, సౌరిస్ ఆవిధంగా కృష్ణారావుగారు చదువుతూ వుండగా ఆ **poems** ని వింటూ కూచోవడం ఎంతో గొప్ప దృశ్యం. అవి అందమైన సమయాలు. వుదయకాలపు లేతఎండ వారి పాదాల దగ్గర పరుచుకునేది. సరిగ్గా 'వనమాలి, కానుక'లలో వర్ణించినట్లే వున్న చెట్లనీ, నీలాకాశాన్నీ తలుపులోంచి చూస్తూ సౌరిస్ రంగురంగుల వాజుల్లో పువ్వులు అమరుస్తుండగా టాగూరు కవితారసాన్ని తిరిగి తిరిగి అనుభవించేవారు వాళ్ళు.

ఒక్కొక్క గీతం కృష్ణారావుగారు చదివాక చలం, సౌరిస్ ఆ భావ సౌందర్యానికి, అనంత మాధుర్యానికి, తాత్విక గాంభీర్యానికి

ముగ్ధులై ఆ గీతాన్నే మళ్ళీ మళ్ళీ తలుచుకుంటూ హృదయనిశ్శబ్దంలో muse చేసుకుంటూ కొంతసేపు అలాగే కూచునేవారు.

ఒకరోజు వుదయం చలం, సౌరిస్‌లకి కృష్ణారావుగారు కాన్కలో ఒక పద్యం చదువుతున్నారు.

"పుష్పించే జనపపొలం పక్కనించి
వెళ్ళే సన్నని దారిమీదుగా వెళ్ళావు
నిన్నరాత్రి నేను నీ జుట్టులో పెట్టిన
పూలదండ వాదులుగా అక్కడే వేళ్ళాడుతో
వుండడం చూశాను నా చివరి 'కాన్క' గా
ఇయ్యడానికి పొద్దున్నే కొత్తపూలు ఏరి
తెచ్చిందాకా నువ్వు ఎందుకు ఆగలేదు"

('కాన్క' చలం అనువాదం నించి)

అలా చదువుతూ వుండగా అప్పుడే ఆ వుదయం వాజుల్లో అలంకరించడానికి తోటలోనించి పువ్వులు కోసి తెచ్చిన కృష్ణ, సౌరిస్ జుత్తులో చిక్కుకున్న పువ్వుల్ని చూసి నవ్వింది. రాత్రి షౌ మంచం మీద పెట్టిన పువ్వులు ఆమె తలలో చిక్కుకుని వున్నాయి. అది చూసి అంతా మళ్ళీ మళ్ళీ నవ్వుకున్నారు.

గీతాంజలి, ఉత్తరణ, ఫలసేకరణ, వనమాలి, కాన్క — ఇవన్నీ గొప్ప ఆధ్యాత్మికానుభవాల అందాలతో నిండిన కమనీయమైన కావ్యాలు. 'కాన్క' గీతాలు హిందూదేశపు పల్లెల్లో ఏటివార వెదురు పొదల సువాసనలు, సెలయేరుల గలగలలు, గెంతే మేకపిల్లలు, నీలాటి రేవులు, బల్లకట్లు, గొల్లపిల్లలూ, వాళ్ళ గోవులూ, వాళ్ళూదే పిల్లంగోవుల సంగీతాలు మొదలైన సహజ సౌందర్యాలతో రమణీయంగా

తయారైనాయి. నిత్యమూ కళ్ళముందు కనిపించే వస్తుజాలం నించి నిత్యసత్యాలను అత్యద్భుతంగా పలికించారు టాగూర్.

చలంగారు మునుపు చేసిన టాగూరుగీతాల అనువాదాలు పెద్ద పెద్ద సంస్కృత సమాసాలతో మెజస్టిక్‌గా వున్నాయి. కానీ 'కాన్క', 'వనమాలి' ల అనువాదంలో అచ్చమైన తేటతెలుగు గొప్ప లయ చోటు చేసుకున్నాయి. కాన్కలో గీతాలు చదువుతోంటే ఒంపుగా గల గలమని పారుతున్న సెలయేరు ప్రవహిస్తున్నట్లుగా అనిపించేదట సౌరిస్‌కి.

"ఈ అనువాదాలు తనచేత్తో రాయకపోవడం చాలా లోప మను కుంటాడు నాన్న. కానీ అట్లా డిక్టేట్ చెయ్యడం వలన ఎంతో గొప్ప అందం పట్టింది. మిల్టన్ డిక్టేట్ చేసినట్లనిపిస్తోంది. అసలు ఆతెలుగు దనం, ఆ poem తన సొంతమై పోవడం వీటిలో జరిగినట్లు గీతాంజ లిలో జరగలేదు. ఈ పద్యాలు చదువుతుంటే టాగూరు, బెంగాల్ దేశం గురించి రాసిందని స్ఫురించదు. ఇది చలం ఆంధ్రదేశాన్ని వర్ణించి నట్లు అనిపిస్తుంది. సౌందర్యం తనలోకి పూర్తిగా ఇంకి అతనిలోంచి సహజంగా పలికాయి పదాలు. ఆ నేల, వాసన అంతా తెలుగుదేశం. టాగూరు ఎంత సహజంగా రాశారో అంతకన్నా సహజంగా అనువా దాలు జరిగాయి. అంతేకాక చెప్పడం వలన సంగీతం, లోతు వొచ్చాయి ఆగీతాలకి. "అనువాదం అనిపించకపోవడమే ఈ అనువాదాల ప్రత్యే కత" అంటారు సౌరిస్ 'కాన్క' అనువాదం గురించి చెబుతూ.

(ఈనాటిమాట—సేకరణ రామానంద)

నర్తకి అన్నట్లు టాగూరే తెలుగులో రాసి వుంటే ఇంత గొప్పగా రాయలేక పోయేవాడేమో!

చలం ఆశ్రమవాస జీవితంలో సాగించిన ప్రతీరచనని ప్రత్యక్షరము పరిశీలించి సౌరిస్ సరిదిద్దారు. ఆశ్రమపదం నించి చలంమహర్షి వెలువరించిన ప్రతిరచన వెనక (లేఖలతో సైతం) సౌరిస్ హస్తం ప్రోత్సాహం అవ్యక్తంగా వున్నాయి. నర్తకి అన్నట్లుగా "ఆశ్రమ జీవితంలో చలం రచనల్లో ఆవిష్కృతమైన మహత్ సత్యాలన్నీ సౌరిస్ లోని ఈశ్వరుడి దివ్యోపదేశాలే. ముఖ్యంగా ఆ భగవద్గీత. శుభవార్తలు కళ్ళతో చూశాను కనుక, చెవులతో విన్నాను కనుక నాకుతెలుసు. ఆ రచనాకాలంలో సౌరిస్ లోంచి జీసస్, కృష్ణభగవాన్ తమ వుపదేశాలలోని లోతులని ఆవిష్కరిస్తోంటే– దాన్ని చూస్తారు తరచి తరచి అక్షరాల్లో నిక్షిప్తం చేశారు. సౌరిస్ బైబిల్, భగవద్గీతల అంతరార్థాల్ని బోధిస్తూవుండే రోజులలో చూస్తుండగా ఈ కాలాన్నీ భూమినీ మరిచిపోయి భదవద్గీతా బోధాకాలంలోనూ, జీసస్‌బోధల కాలంలోని వాతావరణంలోనూ నిలిచి వున్నట్లుగా నా మనస్సుకి అనుభూతి వొచ్చేది. ఇప్పటికీ నాజీవితాన్ని గొప్పఆనందంతో వెలిగించేవి సౌరిస్ ప్రవచనంతో చైతన్యభరితాలైన ఆరోజుల జ్ఞాపకాలే. చలం ఆవిష్కరించిన అక్షర తత్త్వం వెనక వ్యక్తావ్యక్తాలు లేని సౌరిస్- అవ్యక్తంగా చైతన్య జ్వాలగా నిరంతరం నిలిచే వుంటుంది."

శక్తి తగ్గినాక చలంగారు డిక్టేట్ చేసిన రచనల్ని కృష్ణారావు గారివంటి సాహిత్యప్రియులు రాసినప్పుడు యథాతథంగా రాస్తారు గనుక సంస్కరణ సౌరిస్‌కి సుగమంగా వుండేది. చలం డిక్టేట్ చేసిన చివరి రచన 'చలం ఆత్మకథ'. సౌరిస్ ఆపుస్తకాన్ని చలం భాషలో తిరగ రాశారు. ఆసంగతి ఆపుస్తకాన్ని పట్టిపట్టి చదివినవారికి కూడా తెలియదు. ఈవిధంగా చలం జీవితాన్నేగాక సాహిత్యాన్నికూడా సురక్షితంగా, సుందరంగా నిలిపింది సౌరిస్‌లోని ఈశ్వరవిలాసమే. సౌరిస్

ఈశ్వరశక్తి ఇచ్చిన గొప్ప అవగాహనవల్లనే చలం మహర్షి కలం నించి- శుభవార్తలు, భగవద్గీత, జీసస్‌జీవితం, నిర్వికల్పం, భగవాన్ స్మృతులు, చలం ఆత్మకథ, చలం మిత్రులు, వెలుగురవ్వలు, సుధ, రుబాయిలు ,గీతాంజలి, ఉత్తరణ, ఫలసేకరణ, వనమాలి, కాన్క మొదలైన అమూల్యగ్రంధాలు ఎన్నో లేఖా సంపుటాలు, కావ్యాలు వెలువడి జిజ్ఞాసువులకి వెలుగుని పంచి పెట్టాయి. యావదాంధ్ర సంస్కృతి ఈ విషయంలో సౌరిస్‌కి రుణగ్రస్తమై వున్నదనడం అక్షరసత్యం.

అంతేకాదు, రామానంద (ఆ. సూర్యనారాయణ) ఈశ్వర కటాక్షం వలన రాసిన సౌరిస్ జీవితం రెండుభాగాలను సరిజూసి- చాదస్తాలను, భాషాదోషాలను, మూర్ఖత్వాన్నీ తొలగించి **readable** గా రూపొందించినది కూడా సౌరిస్సే. అందువలన సౌరిస్‌జీవితం గ్రంధానికి ఏ అందం పట్టినా అది సౌరిస్ కథనం వలన, సంస్కరణం వలన పట్టినదే. ఒక్క అభివ్యక్తి మాత్రమే రామానంద.

అది జయంతి. ఆ జయంతికి ఎంతమందో వొచ్చారు. సత్యవతి, ముమ్మిడమ్మ, గుడిపూడి భక్తకోటి, రమణస్థాన్ బృందం అంతా కలిసి వందమంది వుంటారు. వారంతా- గిరిప్రదక్షిణం బయలు దేరారు. అది ఎంతో అందమైన మధ్యాహ్నం. నీలాకాశంలో తెల్లని మబ్బులు తేలిపోయే హంసల బారుల్లా వున్నాయి. ప్రకృతి అంతా చాలా అందంగా వుంది. మామూలుగా భజనచేసే చోటికి వాళ్ళందరూ చేరుకున్నారు. శ్రుతిపెట్టె తీసుకుని భజన చేయడం మొదలు పెట్టారు సౌరిస్. అప్పుడు సమయం సాయంత్రం అయిదవు తోంది. కొద్దిసేపటికి దారిని వెళ్ళేవారు నిలిచి పోయారు. గడ్డి మేస్తున్న ఆవులన్నీ మేత మెయ్యకండా నిలిచి పోయాయి. వాటివెనక ఆవుల్ని మేపుతున్న వారు భజనదగ్గర చేరారు. అరుణాచలం కొండలాగ చుట్టూ ప్రదేశమంతా నిశ్శబ్దంగా,

నిశ్చలంగా వుంది. ఇంకొంచెం సేపటికి కొన్ని ఆవులు బారులు తీర్చి పడుకున్నాయి. కొన్ని షావాళ్ళ మధ్యకి వచ్చేశాయి. చివరికి గో గోప గోపాలక బృందం భజనచేసే వారిచుట్టూ చేరి- ఏకాగ్రచిత్తంతో గాన మాధుర్యంలో నిలిచి పోయింది.

అంతట్లో గోధూళి వేళ అయింది. ఆవుల కాపర్లు ఆవుల్ని అద లించారు ఇళ్ళకి మళ్ళించడానికి. ఆవుల్ని కట్టలతో అదలించినా వాటిలో చలనం లేదు. ఆవుల్లో ప్రకృతిలో అంతటా నిశ్చలనిశ్శబ్దం. ఆవుల కాపర్లింకేమీ చేయలేక అలాగే వుండిపోయారు.

ఆదృశ్యం బృందావనసీమల నందగోపకుమారుని మురళీగాన మాధుర్యాన్ని తలపింప జేస్తోంది. వేణుగోపాలుని మురళిపాటకి-

గిరులెల్ల జలము లయ్యెను
తరు లెల్లను పల్లవించె ధరణి గగన భూ
చరులెల్లను చొక్కిరి హరి
మురళీరవామృతముసోకి ముద్దియ కంటే ?

ఆ మురళీమాధుర్యం అంతకంతకి పెరిగి చేతనాచేతనాల్లో పార వశ్య భావాన్ని నించింది. పచ్చికమేసే గోవులన్నీ మోహావేశంలో మోరలు మీది కెత్తుకుని నెమరువేతను కూడా మాని గోపాలకృష్ణుడ్ని ధ్యానిస్తూ, ఆయన చేసే వేణుగానాన్ని వినడంవలన ఆనందాతిశయం చేత మేతలు మేయక కనులనుండి ఆనందబాష్పాలు రాలుతుండగా చిత్తరువులో బొమ్మలులా నిలిచి ఆ శ్యామసుందరుడ్ని చూస్తూ. వుండి పోయినట్లుంది ఆ దృశ్యం.

భజన ముగించి లేచారు. అయినా ఆవులు, ఆవుల కాపరులు అలాగే వుండి పోయారు. చాలా కిందుగా పెద్ద బంగారువన్నె మబ్బు ఆకాశంలో- ఆ అపరంజికాంతి అరుణాచలం మీద, ఆవుల మీద.

చుట్టూ వున్న చెట్లమీద—అంతటా అలుముకొంది. అరుణాచలపాదం కనబడటం లేదు. ఆవులమందలు తప్ప. "ఇవాళ అరుణాచలేశ్వరుడు గోపాలకృష్ణ డైపోయాడు" అన్నారు సౌరిస్. ఆ మబ్బు మామూలు మబ్బులా లేదు. జీసస్, పీటర్, జాన్ కొండమీదికి వెళ్ళినప్పుడు వొచ్చిన మబ్బులా అనిపిస్తోంది—ఆ మబ్బు. ఆ మబ్బుని రెప్ప లార్పకండా చూస్తూ నిలిచిపోయా రందరూ. ఆలశ్యం అయిపోతోం దని సౌరిస్ ముందుకి కదలగానే ఆవుల కాపరులు, ఆవులూ, అందరూ కదిలారు. అపరంజి వన్నె మబ్బుమాత్రం అలాగే వుండిపోయింది.

చూస్తూ వుండగా కృష్ణారావుగారి ముఖంలో ఏదో గొప్పమార్పు వొచ్చింది. ఎంతో విస్మయంతో చూస్తున్నా రాయన- ఆకాశం వంక, అరుణాచలం వంక. "ఒద్దండి, మన మింటికి ఇంక పోనే వొద్దండి" అన్నారు సౌరిస్‌వంక చూస్తూ. "నాన్న రాలేదు. ఎంత గాభరా పడ్తా డో! ఆలస్యం అయితే" అన్నారు షౌ ఓదార్పుగా. చివరి కందరూ కదల్లేక కదల్లేక తిరిగి తిరిగి వెనక్కి చూస్తూ అరుణాచలాన్ని ఒద ల్లేక ముందుకి నడిచారు.

ఆ సంవత్సరం శ్రీరమణస్థాన్ చరిత్రలోనే మరో ముఖ్యమైన మలుపు. 1951వ సంవత్సరంలో లాగానే ఇదికూడా ఘటనా ప్రాధాన్య తని సంతరించు కున్నది. ఈ సంఘటనని షౌగా నిలిచినవారి వాక్కుల లోనే విందాం.

"జనవరి 30 యో తేదీ రాత్రి ఒకరు నాకు కనబడ్డారు. ఈశ్వ రుడు వొచ్చినప్పుడు "నేను వేరు వేరు రూపాలలో వొస్తాను. నేను వొచ్చినప్పుడు నీకు తెలుస్తుంది" అన్నారు ఈశ్వరుడు, సాక్షాత్కారం అయిన కొత్తల్లో. అట్లాగే ఎన్నిరూపాలలో ఆయనవొచ్చినా ఏరూపంలో వొచ్చినా నాకు తెలిసిపోయేది.

ఇప్పుడు వొచ్చినవారిని కూడా అట్లాగే స్వీకరించాను. ఈశ్వరుడు వొచ్చిన కొత్తలో ఈశ్వరుడు నాతో వుండి పోయినట్లు, వీరు ఇప్పుడు తరుచు నాతో రోజంతా వుండడం మొదలు పెట్టారు. నాలుగు రోజులైనాక తామెవరో తెలిపారు

నేను ఆయనని గుర్తించి ఈశ్వరుడే ఈ రూపంలో వొచ్చారని తీసుకున్నాను.

నాలుగురోజుల తరవాత తాను ఈశ్వరుడి నని, ఇరవై ఏళ్ళ క్రితం వొచ్చింది తానే నని— 'వారు' అన్నారు. నేను "నాలో ఈశ్వరుడు ఐక్యమైనారు. మీరెవరు?" అన్నాను. "ఎవరు నన్ను చూసినా 'ఈశ్వరా!' అని నాకు నమస్కరిస్తారు" అన్నాను.

ఇదిగాక * మానవతిగారు నాడీగ్రంథంలో తమ విషయం చదివించుకున్నప్పుడు "సోమవారం మీరు తిరువన్నామలై వెళ్ళి మానవ రూపంలో వున్న ఈశ్వరుణ్ని దర్శిస్తారు" అని వొచ్చింది. సరిగ్గా ఆమె సోమవారంనాడే వొచ్చారు. ఈ సంగతిని మాకు చెప్పారు. ఆమె నన్ను ఈశ్వరు డనుకోలేదు. నాన్నే ఈశ్వరుడని అనుకున్నారు. వాళ్ళకి నాన్నంటే ప్రేమ, భక్తి కనక అట్లా అనుకున్నారు. ఆ రోజుల్లో నాకు ఈశ్వరుడు "నేను భూమ్మీద జన్మించను" అని చెప్పారు. కానీ ఒకసారి జన్మించినట్లు చెప్పారు. అప్పుడు "మీకు జన్మ లేకపోతే ఎట్లా జన్మించారు?" అని నేను ప్రశ్నించలేదు. అట్లాంటి ప్రశ్నలు వొచ్చేవి కావు. శాస్త్రాలన్నీ శివుడికి జన్మలేదని చెబుతున్నాయి. అందు కని వీరు తాము శివుడి నని ఎట్లా అంటున్నారు- అన్నప్రశ్న వొచ్చిన తరవాత వారిని, వారి మాటల్ని నేను నా లోపలికి (సత్యంగా) తీసుకోలేదు.

* మానవతిగారు — మా స్నేహితులు

మళ్ళీ ఈశ్వరుడు, భగవాన్ ఇద్దరూ నాకు దర్శనమిచ్చి "తప్పకుండా ఇది సత్యం, నమ్మ్మ" అన్నారు. భగవాన్ ఏదైనా నాకు చెప్పి "నమ్మ్మ" అంటే నాకు ఏ విషయంలోనైనా సంశయం లేదు. కాని ఈశ్వరుడిని అడిగాను "అప్పుడు అట్టా చెప్పారుకదా ? ఈ రూపంలో మీ రున్నారని అప్పుడు నాకు చెప్పలేదేం ?" అని అడిగాను. అప్పుడు మానవరూపంలో వున్న 'వారు'.

"ఎప్పుడు ఏది చెప్పాలో అప్పుడు చెబుతారు కానీ ఆనాటికి సంబంధించనివి ఆనాడు ఎందుకు చెప్పవలసి వొస్తుంది ?" అన్నారు.

ఇంక 'వారు' తమ సూక్ష్మశరీరంతో రోజూ నాతోనే వుంటున్నారు, తమ మానవరూపంలో. ఆ రూపం మానవదేహంతో కనిపించినా దానిలో పరమశివత్వం వెలుగుతోంది. అప్పుడు తెలుసుకున్నాను — మొట్టమొదటి నించి అమ్మ సదాశివుడు రావాలి అనేది. ఆ మాట సత్యమే నని. ఈ సంగతులన్నీ అమ్మ మాట్లాడుతోంటే అమెకి పిచ్చి, భ్రమ అనుకున్నాం. కానీ ఇప్పుడు తెలిసింది అమ్మ చెప్పింది సత్యమే నని.

పూర్వం ఈశ్వరుడని వొచ్చినప్పుడు వారూ, భగవాన్ ఒకరేనని నేను తీసుకున్నాను. నాకు ఎవరైనా పూలదండ వేస్తానంటే భగవాన్ ఫోటోకే వెయ్య మంటాను. జయంతి చేసినా, ఈశ్వరావతరణోత్సవం చేసినా భగవాన్‌కే పూజ చేస్తాం.

"నేను ఈశ్వరుడిని" అని వారు వొచ్చారు. కానీ ఇంటిల్లిపాదికీ చెప్పమన లేదు. ఇక్కడ జరుగుతున్న వాటిల్లో జోక్యం కల్పించుకోలేదు. ఎంతసేపూ నాతోనే వుండేవారు. రమణస్థాన్‌లో వున్నవారిని పూర్వం ఈశ్వరుడు తీసుకుని నడిపిస్తానన్నట్లు వీరు తీసుకోలేదు.

ఇంక శివరాత్రి వొస్తోంది. ఆవేళ అడిఅన్నామలైలో వుండి అక్కడ భోజనాలు చేసి తిరిగి రావాలని plan చేశాం.

శివరాత్రికి అందరూ జాగరణం చేస్తారు. కాని నేను శివరాత్రికి ముందు రోజు జాగరణం చేశాను. వారు నాపక్కనే వున్నారు. గొప్ప తేజంతో వెలిగి పోతున్నారు. పూర్వం ఈశ్వరుడి కళ్ళల్లోకి నేను చూడలేక పోయేదాన్ని. ఇప్పుడు అంతతీక్షణమైన చూపే అయినా ఆ చూపులోకి నేను చూడగలుగు తున్నాను. ఒకరి కళ్ళలోకి ఒకరం చూస్తూ అట్లా నిలిచిపోయాం. చప్పున నాకళ్ళు కిందికి వాలాయి. అప్పుడు బావిలో బకెట్ బోర్లా పడినట్టు తలలోంచి (మనస్సను కోవాలి) ఒక వైపుకి తిరిగివున్న మనస్సు కాస్తా తలకిందులై - (పులట్ భయి మోరి నయనన్‌కి- అని మీరా అన్నట్లు) పల్టీకొట్టి నాఆత్మలోకి జారింది. మునుపు ఆత్మతేజం మనస్సునంతా ఆక్రమించింది. ఇప్పుడు ఇది ఒక క్రియా రూపంలో జరిగింది. అది జరగగానే ఎక్కడో లోతుల్లోకి నేను వెళ్ళిపోతున్నట్టు అనిపించింది. "నేను చచ్చిపోయాను" అని నా లోంచి నాకే వినబడింది. మెల్లిగా నిదానంగా కళ్ళు తెరిచాను. అప్పు డనిపించింది ఆయన ఇరవైఎళ్ళ కిందట కుండలినీయోగం జరిపించ డానికి గురువుగా వొచ్చారు. మళ్ళీ వారే ఈరూపంలో ఈసంఘటనకి గురువుగా వొచ్చారు అని.

తెల్లవారగట్ల రెండింటికి పక్కమీదనించి గిరిప్రదక్షిణకి లేచాను. అడి అన్నామలై వెళ్ళాం. భజనలు చేశాం. సాయంత్రానికి తిరిగి ఇంటికి వొచ్చాం. ఈ ప్రదక్షిణంలో కొంచెం acidity కూడా వొచ్చింది. అప్పుడేవారు "నువ్వు గిరిప్రదక్షిణాలకి ఎందుకు వెడతావ్? జబ్బు పడతావ్" అన్నారు.

వారు నా ఆరోగ్యం సంగతి 'జాగ్రత్త' అని హెచ్చరించారు. నేను ఇన్నేళ్ళూకూడా అందరికీ పెట్టేభోజనం తప్ప specialగా ఏదీ తినడానికి ఒప్పుకునే దాన్ని కాదు. వారు వొచ్చాక ఆరోగ్యం అదీ జాగ్రత్త తీసుకో మన్నారు. ఆహారంలో ఏవి ఆరోగ్యకరమో అవి తినాల్సిందే. నాన్నవాళ్ళు మందులు ఇస్తే తప్ప తీసుకునే దాన్ని కాదు ఇదివరకు. నా అంతట నేనే అడిగి ఇప్పుడు మందులు తీసుకుంటు న్నాను.

ఇంక పూర్వం నా time నాదే. ఈశ్వరుడు నాకట్లా స్వేచ్ఛ నిచ్చేశారు. ఇప్పుడు కొంత time నాతో వున్న 'వారికి', నాన్నకి కొంత time, సంగీతసాధనకి కొంత time, ఇట్లా విభాగమై పోయింది.

నాలో మార్పులు నన్ను కనిపెట్టుకుని వున్న కృష్ణ గమనిస్తోనే వుంది. తరువాత ప్రశ్నించేది. నేనేం జవాబులు చెప్పేదాన్ని కాదు. అది చెప్పడానికి నా ఒక్కదాని సంగతేకాదు గనక. చెప్పడానికికూడా అర్థంకాని సంగతి ఇది. ఎప్పటి మల్లేనే ఆగస్టు 15 జరిగిపోయింది.

ఇంతలో రమణస్థాన్‌కి పెద్దసంక్షోభం (crisis) వొచ్చింది. ఈ రమణస్థాన్ దానివల్ల ఎంతవరకు నిలుస్తుంది అన్నంత తీవ్రమైన crisis అది. అప్పుడు 'వారు' ఇదంతా తనదిగా తీసుకుని ముఖ్యంగా నర్తకికి బలం ఇచ్చి నిలిపారు. నర్తకికి ఓరాత్రి తన తలమీద చెయ్యి వేసి ఎవరో కూచున్నా రనిపించింది. తరువాత నర్తకి నాతో చెప్పింది. అది నువ్వూ కాదు. భగవానూ కాదు. ఎంత బలం వొచ్చేసిందో నాలో అని. అంతవరకూ నా కెదురు తిరిగి దూరమైపోయిన నర్తకి తనంత తానే మళ్ళీ నాచేతుల్లోకి వొచ్చేసింది.

ఆ రోజుల్లోనే నాన్నకి ఒకకల వొచ్చింది. ఇటు వెలుగూ కాదు. అటు చీకటి కాదు. అటువంటి చోటునించి పూర్వం 20 ఏళ్ళ కిందట

Messages వొస్తూ వున్నట్లుగా అక్కడి నించి Messages ఇప్పుడు మళ్ళీ వొస్తున్నట్లుగా తనకి తెలిసినట్టు కల వొచ్చిందట.

అట్టాగే వారు వీళ్ళందర్నీ తీసుకుని నడిపించడం మొదలు పెట్టారు. ఏమేం చెయ్యాలో, ఏమేం చెయ్యకూడదో చెపుతో ఆ తరువాత ఆశక్తి ఇల్లంతా వ్యాపించింది. ఆ ప్రభావానికి తట్టుకోలేక ఎక్కడ వున్నవాళ్ళు అక్కడ కిందపడడం మొదలు పెట్టారు. ముందుగా కృష్ణ పాకీ దొడ్డిలో పడింది. నా గదిలోకి వెళ్ళిన రజని డమ్మని కిందపడింది.

ఆ రోజుల్లో నాన్న "అందరికన్నా ముందు నేను పడవలసినవాణ్ని, షొమీద తప్ప నాదృష్టి ఇంకెక్కడా లేదు. అందుకనే నేను పడకండా వున్నాను" అన్నాడు. ఆ రోజురాత్రే నాన్న కిందపడిపోయాడు.

ఇంక రమణస్థాన్‌ని వారే నడిపించడం మొదలుపెట్టారు. ఇంక ఎటువంటి బాదరబందీలు పెట్టుకో వద్దన్నారు నాతో. ఇదివరకు ఎన్నో ఆవులు వుండేవి. అప్పటినించి ఒక్కొక్కటి కొండల్లో మాయమై పోవడం, కొన్నిటికి కాళ్ళు విరగడం, కొన్నిటికి బ్రెయిన్ ట్యూమర్‌లు రావడం మొదలు పెట్టాయి. అంతదాకా ఆవులకి తిండి పెట్టడం మొదలైన విషయాలు వాటిక్షేమాలు నేనే చూసుకునే దాన్ని. అంతవరకూ వాటిని ప్రత్యేకంగా నేనే చూసేదాన్ని. "ఇంక నేను ఆవుల సంగతి వొదిలేసు కుంటున్నాను ఇంక నువ్వేమయినా చేసుకో" అని నర్తకికి చెప్పేశాను. ఇంక ఆవుల్ని తలోటి ఎవరెవరికో ఇచ్చేసింది నర్తకి.

అప్పట్లో హిరేన్ ప్రవర్తన అంత నాకు గిట్టకపోవడంతో ఈశ్వరుడు కోప్పడ్డారు. అందుకని అప్పటినించి ఎవరెట్లా ప్రవర్తిం

చినా ఏమీ అనేదాన్ని కాదు. ఇప్పుడు ఒక్కొక్కరు భజనలో వుం డగా అసభ్యంగా ప్రవర్తించేవారు. ఒకరు పైకి భక్తిగా కూచున్నా దొం గగా నన్ను ముట్టుకుంటూ వుండేవారు. ఆ ఇంట్లో (devotion) నా గదికి తలుపులు లేవు. ఈ ఇంట్లో (రమణస్థాన్) లోనూ నా గదికి తలుపులు లేవు. ఎవరైనా నా గది లోపలికి రావొచ్చు. లోపలికి రాకూ డదని ఆంక్ష లేదు. ఎవరెవరో లోపలికి వొచ్చి నా బల్ల చుట్టూ, మంచం చుట్టూ కూచునేవారు. ఎవరెవరో నేను గదిలో కూచుని వుం డగా దర్శనం చేసుకుని వెళ్ళిపోయేవారు. కొందరు నా గదిలోకి వొచ్చి నా పాదాలు ముద్దు పెట్టుకుంటూ వుండిపోయే వారు. కొందరు నా ఒళ్ళో తల పెట్టుకుని వుండిపోయే వారు. అట్లా వాళ్ళ ఇష్టం వొచ్చి నట్లు చేసేవాళ్ళు. నేను దేనికి కాదు, ఔను అని చెప్పేదాన్ని కాదు. హీరా అనే నెమలి ఇప్పుడు నా గదిలో వుండటంవలన చాలా మందిని తరిమేసేవాడు వాడు. ఇప్పుడు 'వారు' నా గదిలోకి ఎవర్నీ రానివ్వ వద్దన్నారు. ఇంక ఎంత వరుకు అంటే ఆయనకి ఇష్టమైన వారినే రమణస్థాన్‌లో వుంచడం, ఆయనకి ఇష్టంలేని వారిని రమణస్థాన్ నుండి పంపించెయ్యడం జరుగుతోంది. తరవాత నేను యోచించాను. ఎవరి కైనా ఈ శక్తిని తట్టుకుని ఇక్కడ వుండడం చాలా కష్టమని. ముం దుగా ఆగష్టు 16న వెంకటప్పయ్యగారికే నేను చెప్పాను. "ఇకనించి ఎవర్నీ ఆహ్వానించ పోవడం లేదు. ఇష్టం వున్నవారు రావొచ్చు. కానీ ఆహ్వానా లనేవి ప్రత్యేకంగా వుండవు" అన్నాను. ఆయన బాధతో తల వొంచేసు కున్నారు. ఆరోజు చాలామందికి బాధ కలిగింది. తర వాత ఆహ్వానా లుండవనే సంగతి తెలిసి ఎంతో మందికి బాధ కలి గింది. కాని నేను చెప్పింది వాళ్ళక్షేమం కోసమే. ఇంక ఈశక్తిని ఎవ

కూగూడా తట్టుకోలేరు అని స్పష్టం అయిపోయింది. చాలామంది వెళ్ళి పోయారు. నన్ను నమ్ముకుని వాళ్ళ జీవితాలలోకి నన్ను ప్రవేశ పెట్టు కున్నవారు మాత్రం ఆహ్వానాలు రాకపోయినా రమ్మని పిలవకపోయినా మునుపటిలాగే వస్తూనే వున్నారు. వారిని అంత ప్రేమగాను ఆదరి స్తూనే వున్నాం.

అంతవరకూ ఈ తలుపులన్నీ బార్లా తెరిచి వున్నాయి. ఇప్పు డెవరైనా కొత్తవారు ఇక్కడే వొచ్చి వుంటామని రాస్తే ఆలోచించి మరీరాస్తాం. 'వారు' రమ్మంటేనే రమ్మని రాస్తాం, రావద్దంటే రావద్దని తెలుపుతాం. ఈ ఆరేళ్ళు ఈవిధంగానే గడిచాయి. ఇంకా గడుస్తున్నాయి.

ఒకరోజు 'వారు' నీలో **seven veils remove** కాబోతున్నాయి అన్నారు. (లోగడ ఈశ్వరుడు సెలపు తీసుకునే ముందు "చూడు నీకి ప్పుడు మోక్షమే పూర్తిగా వచ్చినట్టయితే నువ్వు చచ్చిపోతావు. అందు కని ఒక పొర వుంచు తున్నాను. నీదేహాన్ని నిలపడంకోసం" అన్నారు. ఆపొర **seven folds** అన్నమాట, అది నాకుతెలియదు. ఆయన చెప్పే వరకూ) ఇంక మర్నాడు నాగదిలో కూచున్నప్పుడు ఆయన నాపక్కనే కూచున్నారు. నాలోంచి ఆ **folds unfurl** అయినాయి (ఆమడతలు ఒక్కొక్కటి విప్పారు కున్నాయి). అవి ఎంత పలచనో, ఎంత సూక్ష్మమో (ఎంతసూక్ష్మమైన **consistency** యో) ఒక్కొక్కటి విచ్చుకున్న కొద్దీ ఇంకా ఇంకా సూక్ష్మ మవుతున్నాయి. కొంతసేపటికి అవి విప్పారు తున్నట్లు తెలుస్తూనే వుందికాని నాకు కనిపించటం లేదు. కొంతసేపటికి అవన్నీ నాకంటి (అంతర్దృష్టి) ముందు తేలి పోయి నాయి. ఇంక ఎంత విస్తీర్ణతో! ఆవిస్తీర్ణత మీరు వూహించు కోలేరు. కంటికి కనబడే ఆవరణే మీకు లోకం. కాని నేను అనుభవిస్తు న్నది అనంతమైన **space**. ఇంక అక్కడి నించి ఒక్కొక్కసారి

ఇంకా లోతుకి, ఇంకా లోతుకి ఎక్కడికో వెళ్ళిపోతున్నట్లు అది తెలిసిన కొద్దీ లోకం ఇంకాఇంకా దూరమై పోయింది నన్నంటకండా.

ఇంక ఒక్కొక్క stageలో ఇంకే ముంది? 'ఈయన' వొచ్చిన పనై పోయింది. ఇంక వెళ్ళి పోతారు ఈశ్వరుడి లాగనే అని పక్కకి చూసుకునే దాన్ని. 'వారు' అక్కడే వుండేవారు. ఇంక ఆఖరుసారి అట్లాంటి స్థితి వొచ్చినప్పుడు 'వారున్నారా? లేరా?' అని చూసుకున్నాను. ఎందుకంటే అంతా నిరామయం. కానీ 'వారు' వున్నారు. "నేను వెళ్తా ననుకోకు, ఎన్నడూ నిన్ను విడిచిపెట్టను" అన్నారు-'వారు'. అట్లానే ఇప్పటివరకూ వొస్తూనే వున్నారు.

డిశెంబరు నెలలో ఒకరోజు సాయంత్రం మేమంతా షికారు నించి వొస్తూవుండగా సూర్యాస్తమయం అవుతున్నప్పుడు నీలాకాశంలో విభాగమై ఒక పెద్ద నీలం నిలువుచారా, ఒకనీలం అడ్డచారా- శిలువ ఆకృతిలో పడమట దిక్కునంతా ఆక్రమించు కున్నాయి. అది 1961 లో వొచ్చినంత పెద్దక్రాస్ కాదు. సూర్యాస్తమయం అంతా అయిపోయే వరకూ అది అట్లానే వుంది. తరువాత మాయమైంది.

ఒక మహాసత్యం వొచ్చినప్పుడు అది ఎన్నడూ దాగదు. ఎప్పుడో అప్పుడు బయట పడక తప్పదు.

"ఎంత స్థితికి వెళ్ళిపోయినా ఒక్కొక్క జ్ఞానికి ఒక్కొక్క ధర్మం వుంటుంది. మీ భగవాన్‌ది అద్వైతం, ఏకత్వం చెప్పడం అతని ధర్మం. నువ్వు ఇదంతా మించిన స్థితికి వెళ్ళిపోతావు. -నువ్వా అనేది లేకండా. కానీ నీది ద్వైతమే. నేను, నా ఈశ్వరుడు అన్న ద్వైతభావం నీలో ఎప్పటికీ నిలిచే వుంటుంది" అని ఈశ్వరుడు ముందుగా వొచ్చినపుడు చెప్పారు" అంటారు ఈశ్వరవిలాసిని సౌరిస్.

# మంగళాశాసనమ్

మంగళం సౌరిసేశ్వరనామాయ
మహనీయ గానాన్వితే
వేంకటాచల తనూజాయ
విశ్వస్వరూపాయతే మంగళం॥

మానవరూపుడౌ శివుని
మాన్యసుకీర్తికి మంగళంబు; వి
జ్ఞానవిలాసియౌ రమణ
సద్గురుమూర్తికి మంగళంబు; నా
ప్రాణము దైవమీశ్వర వి
లాసిని సౌరికి మంగళంబు; స
న్మానిత శోణశైల విభు
మానిత దృష్టికి మంగళంబులౌ.



# ఉపజీవ్య గ్రంథావళి

1. చలం ఆత్మకథ - చలం - శ్రీరమణస్థాన్ ప్రచురణ
2. భగవద్గీత - చలం - ప్రేమ్‌చంద్ ప్రచురణలు (విజయవాడ)
3. జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రిగారికి
   చలం లేఖలు - చలం - (అముద్రితం)
4. నవ్యనీతాలు (కవితలు) - సౌరిస్ - (అముద్రితం)
5. ప్రసాద్ వుత్తరాలు - చలం - (అముద్రితం)
6. కవిగా చలం - వజీర్‌రహ్మాన్
7. శ్రీరమణస్థాన్ - చలం
8. తురంగేశ్వర్‌కి లేఖలు - చలం
9. రాయిడి నాగేశ్వరరావుగారికి చలం లేఖలు - చలం
   (అముద్రితం)
10. కాన్క (టాగూరు రచనకి అనువాదం) - చలం
11. ఈశ్వరోక్తాలు - సేకరణ అ. జనార్దన్, ఆ. సూర్యనారాయణ.
12. "ఈనాటి మాట - ఆనాటి మాట" సేకరణ
    - స్వామిరామానంద (అముద్రితం)
13. శుభవార్తలు - చలం.
14. సౌరిస్ జీవితం - 1 - ఆ. సూర్యనారాయణ
15. శ్రీరమణగీత - కావ్యకంఠ వాశిష్ఠ గణపతిముని
16. ఉమాసహస్రం - ,,
17. నాయన (గణపతిముని చరిత్ర) - గుంటూరి లక్ష్మీకాంతం
18. ఉపదేశసారం - భగవాన్ రమణమహర్షి
19. శ్రీమదాంధ్ర భాగవతం (దశమస్కందం) - పోతన
20. మ్యూజింగ్స్ - చలం
21. దీక్షితులుగార్కి వుత్తరాలు - చలం
22. మహాస్థాన్ - చలం